# ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యానుశీలనము

## విషయసూచిక



## కారకపరిచ్ఛేదము

# సమాసపరిచ్ఛేదము

## తద్ధితపరిచ్ఛేదము

# క్రియాపరిచ్ఛేదము

## కృదంతపరిచ్ఛేదము



## వాక్యపరిచ్ఛేదము

అనుబంధములు

# అకారాదిసూత్రానుక్రమణిక

00000

# ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యానుశీలనము

## కారకపరిచ్ఛేదము

చింతామణియందుఁ గారకములను నిరూపించుట కొకప్రత్యేపరిచ్ఛేదము లేదు. కారకశబ్దార్థమును జింతామణి గాని వికృతివివేకము గాని స్పష్టము చేయలేదు. సంస్కృతానుసారముగాఁ దెలియఁదగు నని యెంచియుండనవు. కారకమున కొకపరిచ్ఛేదమును బ్రారంభించినసూరియును గారకసంజ్ఞను వివరింపకుండుట యందువలననే యనవచ్చును. కాఁగాఁ గారకసంజ్ఞావివరణముతోఁ బ్రౌఢవ్యాకర్త యీపరిచ్ఛేదము నారంభించుచున్నాఁడు.

### కారకములు

**1. కారకము లనం గర్మాదులు.**

కారకము లనఁగాఁ గర్మకారకము మొద లగునవి యని యర్థము. 1.కర్మకారకము, 2. కర్తృకారకము, 3. కరణకారకము, 4. సంప్రదానకారకము, 5. అపాదానకారకము, 6. అధికరణకారకము ననునాఱును, గర్మాదు లని స్పష్టము చేసెను. కారకము–కర్మాదిషట్కము. అని శ.ర.

'కారకంబులు' అనుబహువచనముచే నీతఁడు కారకశబ్దముయొక్క యర్థమును గాక కారకము లేవో సూత్రమునఁ జెప్పఁదలఁచినట్లు స్పష్టము. కర్మాదు లివి కారకములే యగును గాని కారక మనుశబ్దమునకుఁ గర్మకారక మిత్యాదిగా నర్థ మగునా?

ఇట వఝులవారు 'కర్మకరణకర్తృసంప్రదానాపాదానాధికరణానా మేకతమత్వం కారకత్వ మితి యావత్. క్రియానిమిత్తం కారక మితి లోకసింహః. చైత్ర స్యేత్యాదౌ ధనాదిక మే వాకాంక్షితం స్యా న్న తు గచ్ఛత్యాదికమ్. తేన సంబంధస్య క్రియా నిమిత్తత్వాభావా న్న కారకత్వమ్. ఏవం లిఙ్గార్థసంబోధనయో ర పీతి.'

(దుర్గా. వ్యా. ముగ్ధబోధ. కార. 316 సూ. వ్యాఖ్య.) అనుచొప్పునను గ్రియానిమిత్తము లగుకర్తకరణకర్తృప్రభృతు లాఱిటిలో నన్యతమము కారక మనిపించుకొనును. (వ్యా. సం. స. 950) (ఘం. 326) అని నిరూపించిరి. కారకశబ్ద మీయాఱింటిని మాత్రమే బోధించు నని తత్త్వ. (200) స్పష్టము చేసెను. కాఁగాఁ బైసూత్రము కారకములస్వరూపమును వర్ణించునది కాఁగాఁ, గారక మనుశబ్దముయొక్క యర్థము నిట్లు సూత్రకర్త వివరించెను. 'క్రియాన్వయము గలది యనఁగా క్రియాన్వయము కలిగించునది యని కారకశబ్దార్థము'.

'అనఁగా' ననుశబ్దముతోఁ గ్రియాన్వయమును గలిగించునది, క్రియాన్వయము కలది యనురెండింటిని గారకశబ్దమునర్థముగా సూత్రకర్త వివరింపఁగా సర్వ. 'వాక్యమునందలియొకశబ్దమునకు క్రియాశబ్దముతో నన్వయము గలిగించునది యని కాని క్రియతో నన్వయమును గలది యని కాని కారక మనుశబ్దమునకు నర్థ' (25) మని వ్రాయుట విశేషము. ఆరెండింటిలో నేదో యొకటి యర్థ మని భావించుట కీవ్యాఖ్యవలన నవకాశ మేర్పడుచున్నది. విజమున కివి రెండును గారకశబ్దము నర్థములే యని సూత్రకర్తవివరణమునభిప్రాయము.

రాముఁడు రావణుని జంపెను. అనుచో రావణుఁడు కర్మ. కర్మ యైనరావణ శబ్దార్థమును గర్మగా 'చంపెను' అనుక్రియలోనికి నన్వయమును గలిగించునది యిటఁ గర్మకారక మైన ద్వితీయావిభక్తి. కావునఁ 'గ్రియలోనికి అన్వయమును గలిగించునది' యని కారకశబ్దమున కొకయర్థము. ఆయయియర్థములకు ద్యోతకము లైనయీవిభక్తులును స్వయముగాఁ గ్రియలోని కన్వయము గలిగియుండును గావునఁ 'గ్రియాన్వయము గలది' యనియుఁ జెప్పఁబడినది.

ఇట నాయైువిషయములను తత్త్వబోధిని విపులముగా వివరించినది. (200–203)

## గుఱిచియనుప్రయోగము

**2. ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱిచియు ననుప్రయుక్తం బగు.**

ఉద్దేశార్థమునందు ద్వితీయావిభక్తిపైని గుఱిచి కూడ ననుప్రయుక్త మగు నని సూత్రమునర్థము.

మము గుఱిచి. మమున్ అనుద్వితీయాంతముపై గుఱిచి యనుప్రయుక్త మైనది. 'మ మ్ముద్దేశించి' యని యర్థము. సూత్రమందలిసముచ్చయముచేఁ గూర్చి యవు నని సూత్రకర్తయే వివరించుచున్నాఁడు. 'మమ్ముఁ గూర్చి' యనియు నుండఁదగు.

ఈసూత్రారంభమును గూర్చి కు.పం.వ్యాఖ్య 'చింతామణిలో 'కూర్చిలనునయో భవే ద్వితీయా తు, కర్మప్రవచనీయకే కూర్చిః' అని కూర్చివిభక్తి విధింపఁబడియున్నది. కాని దానికిఁ బూర్వము నగాగమము విధింపఁబడియుండలేదు. నేలఁ గూలె మ్రాను గుఱిచి ఇత్యాదిభారతప్రయోగములలో గుఱిచి యనునది కూడఁ బ్రత్యయముగా నగపడుచున్నది. ఈరెండంశములను బూరించుటకై యీసూత్ర మారంభింపఁబడినది' (87) యన్నది. కాని యిం దేదియు సముచితముగా లేదు.

'అందు పట్టి కూర్చి విభక్తిషు' అని వి.వి. కూర్చి పరకత్వమున నుమాగమమును స్పష్టము చేసినది. ఇది 'ను మ్చ్యోతః' అనుచింతామణిసూత్రమునకు వివరణ ప్రాయముగా నహోబలునివివరణమున కనుగుణముగా గ్రహింపఁదగును. కావున 'ను మ్చ్యోతః' అనుదానిచే నుమాగమమును జేయఁదగును. ఈవ్యాఖ్య నగాగమ మనుట సరి గాదు. నగాగ మనుటలో నత్వ మచ్చుపొరపాటు గావచ్చునా? నకారము మాత్రమే యాగమము గావలయుచో 'ను' ఆగమముగాఁ జెప్పుటయె చింతామణ్యాదులసంప్రదాయముగాఁ గానవచ్చును. నక్ అనురీతియాగమము చింతామణివికృతివివేకములలో లేదు. బాలవ్యాకరణములో నగాగ మనుచో 'న' యని యత్సహితముగా నగును.

అయినఁ జింతామణి స్పష్టముగాఁ జెప్పలే దని తలంచుచో నుమాగమమునో లేక నగాగమమునో విధింపవలెను గాని ప్రౌఢవ్యాకర్త ద్వితీయకు గుఱిచి చెప్పు టెట్లు? ఈప్రౌఢవ్యాకర్తవిధానము ననుసరించి నగాగమము చెప్పనిలోపము వారించుట కిది ప్రసక్త మైన దనుటకు వీలు లేదు.

గుఱిచి గూడఁ బ్రత్యయముగాఁ గన్పించుటచేత దానిని సైతము సాధించుట కిది యారంభింపఁబడిన దన్నది కు.పం. ఇటఁ బ్రౌఢవ్యాకర్త గుఱిచి యనుప్రయుక్తముగాఁ జెప్పెను గాని ప్రత్యయ మనలేదు.

ఇట సర్వ. 'గుఱిచి యనునది ప్రౌఢవ్యాకర్త శబ్దమో ప్రత్యయమో స్పష్టము చేయుట లేదు. ప్రత్యయమే యగుచో పూర్వ మున్న ప్రత్యయము తొలగిపోయి

తత్స్థానమున నిది రావలయును. అట్లు గాక పూర్వప్రత్యయమున కనుప్రయుక్త మగు నని యనుటచేత దీని ప్రత్యయేతరముగనె ప్రౌఢవ్యాకర్త భావించె ననవలయు' (29) నన్నది.

అనుప్రయుక్త మగు నని చెప్పుటను గుర్తించియుఁ బ్రత్యయమో కాదో చెప్పలే దనుట యేమి? ద్వితీయకు ననుప్రయుక్త మవు ననుటచేతనే యిది ప్రత్యయము గా దని స్పష్ట మగుచున్నది. ప్రత్యయము ననుప్రయుక్త మని చెప్పుట యెట నేఁ గలదా? ప్రత్యయ మైనచో నాదేశముగా రావలె ననుటయు సరి కాదు. 'ప్రత్యయః – పర శ్చ' యని ప్రత్యయ మైనది పరముగానే వచ్చును. ఇది ప్రత్యయమే యగుచో ద్వితీయావిభక్తి యనవలెను. ద్వితీయకు ద్వితీయను జెప్పనేల? 'ఉద్దేశార్థమున ద్వితీయకుం గుఱిచియు నగు' నన్నఁ జాలదా?

శ.ర.లో నీవ్యాకర్త గుఱిచి–యపదము' అని పేర్కొనెను. అనుప్రయుక్త మన్నంత మాత్రమున నపదమే కావలసినయవసరము లేదు. వలన కనుప్రయుక్తముగాఁ జెప్పిన 'ఉండి'ని సూరి పదముగాఁ బేర్కొనెను. ప్రౌఢవ్యాకర్త చెప్పిన 'చేసి' ఇట్టిదే. అయినను నీ 'గుఱిచి' యపద మనుట యుక్తమే.

కాఁగా కు.పం. 'గుఱిచి' ప్రత్యయ మనుట సరిగాదు. సూత్రమునందలిసముచ్చ యార్థముచే జ్ఞాపిత మవునది గావునఁ గూర్చి యనునది సయితము ద్వితీయకు ననుప్రయుక్త మగునదే కాని ద్వితీయాప్రత్యయము గా దని స్పష్టము. చింతామణి ద్వితీయావిభక్తిగానే చెప్పినను జిన్నయమతము ననుసరించి ప్రౌఢవ్యాకర్త కూర్చిని ద్వితీయావిభక్తిగాఁ జెప్పకుండుట యుక్తముగా నున్నది.(కు.పం.88) ఈకూర్చి ఉండి, చేసి మొద లగువానివలెఁ బద మనుట యుక్తము.

కు.పం. గుఱిచియే కాక, భారతాదులలో గుఱించి యనుప్రత్యయాంతరమును గల దని చెప్పినది. 'గుఱిచి యనునది గుఱించి యనుదాని కుపలక్షణ మననగును.' ఘం.120, సర్వ.30)

కాని, గుఱించి యనుప్రయుక్త మగు నని యీవ్యాకర్త తలంచెనా? శ.ర.లో 'గుఱించు దే.స.క్రి. ఉద్దేశించు. మిమ్ము గుఱించి' అని చూపెను. గుఱించు ధాతువుయొక్క క్త్వార్థకప్రత్యయాంత మగుప్రత్యేకపద మనియు నది ప్రత్యేకపదము గానే యుండఁగా దానితో మిమ్మున్ అనురీతి ద్వితీయాంతము లన్వయించు ననియు

సూత్రకర్త యభిప్రాయము గావచ్చును. కాని మఱి కూర్చియు నిటువంటిదే. కావున కు.పం. గుఱిచి ప్రత్యయ మనుటయు ఘం. సూత్రమునందలిగుఱిచి గుఱించి కుపలక్షణ మనుటయు సూత్రకర్తకు సమ్మతము గా దని తోఁచెడి.

ఇటఁ గూర్చిజ్ఞాపకార్థ మని కూర్చిని మాత్రమే పేర్కొనుటయు (కూర్చి ప్రభృతు లనక) నయ్యది ప్రత్యేకపద మనియే సూత్రకర్త తలఁచినట్లు చెప్పుట కాధార మగుచున్నది. వ్యాకర్త కూర్చిప్రభృతు లనమిచేతనే ఘం. ఉపలక్షణమార్గము నాశ్రయించినది. కూర్చియు గుఱిచిచే లక్షిత మై వచ్చును గదా యన్న సూత్రమందలి 'ను'శబ్దమును, దానింగూర్తి సూత్రకర్త వివరణమును వ్యర్థము లగు.

ఇట ఘం. కూర్చి జ్ఞాపనార్థ మనువ్యాకర్తవివరణమునకుఁ జింతామణిలోని కూర్చివిభక్తిని బోధించుటకొఱ కని యర్థము (120) చేసినది. అయినను నాపిదప నీవ్యాకర్తమతమున నీయది ద్వితీయకే యనుప్రయుక్త మని చెప్పుట యుచితముగా నున్నది. చింతామణి కూర్చియే ద్వితీయావిభక్తి యని చెప్పఁగాఁ బ్రౌఢ.ద్వితీయకు ననుప్రయుక్తము చేసినగుఱిచితో పాటు కూర్చిని గ్రహింపవలె నన్నది. అపు డీయది ద్వితీయపైని జేరవలయును గదా. ద్వితీయపైఁ జేర్చెడుకూర్చిని విభక్తి యనుట యెట్లు? కావున నీకూర్చి యనుదానికిఁ జింతామణి చెప్పినద్వితీయ యగుకూర్చితో సంబంధము లేదు. వఝలవా రట్లు తలఁచుట యుక్తము గాదు. (వ్యా.సం.స.965) ఘం. విమర్శలోఁ గొంత విరోధము గలదు. అందుఁ జింతామణి విభక్తి యనెఁ గావున సూత్రకర్త యనుప్రయుక్త మని చెప్పిన ట్లర్థ మగుచున్నది. అ ట్లయిన నది సరి గాదు.

కూరిచి– దే.అవ్య. ఉద్దేశార్థమునందు ద్వితీయావిభక్తితోఁ జేరివచ్చునది. రామునిగూరిచి, సోమునిగూరిచి. (రూ. కూర్చి.) అని శ.ర.లో స్పష్టముగా ననుప్రయుక్త మవుటను జెప్పియున్నాఁడు. కావున నీశ.ర.పంక్తుల ననుసరించియు కూర్చి ద్వితీయావిభక్తి గా దనియే సూత్రకర్తయభిప్రాయము గుర్తింపఁదగు. కూరిచి యవ్యయముగాఁ జెప్పుటచే నియ్యది క్త్వార్థక మగు'ఇ'ప్రత్యయాంత మనియే యాతఁ డెంచినట్లు చెప్పవచ్చును. అట్టియెడల గుఱించివలె నియ్యదియు నన్వయించు ప్రత్యేక పద మని భావింపక యనుప్రయుక్త మను టేల? చింతామణిప్రభావముచేతఁ గూడఁ గావచ్చును.

కు.పం. ఇవి కూర్చు, గుఱించు ధాతువులక్త్వాంతరూపము లనుట స్పష్టమే. కాని వీనిం బృథక్పదములుగ భావించి కాఁబోలును, సూరి ప్రత్యయములలో స్మరింపలేదు. (88) అన్నది.

శ.ర.పంక్తుల ననుసరించి ప్రౌఢ.కును నదియే యభిప్రాయము గల దని తేలుచున్నది. గుఱిచి యనునది మాత్రమే య ట్లూహించుటకు నవకాశము లేమిని సూత్రకర్త యిట సూత్రమునందు గ్రహించి చెప్పె ననఁదగు.

ఈగుఱిచిశబ్దమునుత్పత్తిప్రకారమును గూర్చియు వ్యాఖ్యలు పరామర్శించియున్నవి.

తత్త్వబోధిని గుఱిచి కూర్చి యనుదానిరూపాంతరము గావున దీనికి విధాన మవసరము లే దనియుఁ జెప్పె.(204) కూరిచినుండి యేర్పడుటచే కకారాది యనియు సరళాదేశమున గకారాది యయ్యె ననియుఁ దలంపవలసియుండఁ గాఁ బ్రౌఢవ్యాకర్త సహజసరళాది యని తలంచి వెనుక నున్నద్వితీయానువర్ణకమునకు లోపము చేయుట సరి కాదు. కనుకనే(?) యిందలికూరుచులోనియికారము లోపించి కూర్చి యనురూపము చెందెను. కూర్చి యనుదానిని మాత్రము పరుషముతోడనే యుదాహరించెను. కూర్చి యనునది పరుషాది యని భావించి గుఱించి యనునది మాత్రము సరళాది యనుట యనుచితము. అలఘురేఫము లుప్తాచ్క మగుటచే (ముక్త.2) లఘురేఫముగా మాఱుటయు దీని యైక్యమును సూచించుచున్నది. ఇయ్యది శబ్దరత్నాకరమునను గుఱించి అనియె యున్నది. (205). గుఱించి యని యీవ్యాఖ్య యెల్లెడల బిందువు నిచ్చుట విశేషము. (అచ్చుపొరపా టేమో) కూడు ధాతువు కూరుచు – కూరిచి యని యై, తొలిదీర్ఘమునకు హ్రస్వము రాఁగా గుఱిచి యని యైన దందము గాక. గుఱించి యనురూప మెట్లు? కూరిచి యనుదానినుండి యవునా? కూరించు అనున దస లున్నదా? పైఁగా గుఱించు శ.ర.లోఁ గల దనిరి. శ.ర.లో గుఱించు, గుఱిచి గలవు గాని, గుఱించి ప్రత్యేకముగాఁ జూపఁ బడలేదు. గుఱించు అనుదానికి లక్ష్యస్థలములందే దానిక్త్వార్థకరూపముగ నిది చూపఁబడినది. సూత్రకర్త ప్రస్తుతమున గుఱిచినే బిందురహితముగాఁ జూపెను. ఇ ట్లెట్లో గుఱిచి కాఁగల దేమో కాని గుఱించి యని కాదు కదా.

గుఱిచి యనున దైనను కూరిచికి రూపాంతర మనఁదగు నేమో కాని, కూర్చి రూపాంతర మనుట కుదురదు. (తత్త్వ.204)

కూర్చినుండి కుఱిచి యేర్పడు ననుట కీవ్యాఖ్య యొకయాధారము చూపినది. అలఘురేఫము లుప్తాచ్కము గాఁగాఁ లఘురేఫ మగుట వీనియైక్యమును నిరూపించు చున్న దఁట. (తత్త్వ.205) అదియు నసంగతమే. ఇట మూలరూపము కూర్చి యనిరి. అట లఘురేఫముపైనె స్వరము లోపించినది. గుఱిచి-లో నలఘురేఫ మున్నది. అందు స్వరలోప మయిన సాధురేఫ మగును. కాని కుర్చి-యగునే కాని కూర్చి యగు టెట్లు? అస లింతకును కూర్చి యనుదానినుండి గుఱిచి యేర్పడినదా? లేక గుఱిచి యనుదానినుండి కూర్చి యేర్పడినదా? కుఱిచినుండి కూర్చి యగుట యెల్లవిధముల నసంభవము. కావున నలఘురేఫము లుప్తాచ్క మగుట యను ప్రసంగమే యిట నసంగతము.

ఈవ్యాఖ్య చెప్పవలసినతీ రది కాదు. కూరిచి యని యుండఁగా దీర్ఘమునకు హ్రస్వ మై కురిచి యని కాఁగా 'దీర్ఘపూర్వక మగులఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘురేఫం బగు' (ముక్త.1) ననుసూత్రముచే నలఘువు కాఁగా కుఱిచి యని యైన దనఁదగును. అనఁగా కూరిచి యనుదానినుండి కుఱిచి యేర్పడిన దనవలయు నన్నమాట.

కానీ యసలు కూరిచినుండి యైనను కుఱిచి యేర్పడిన దని యూహించుటయు సమంజసము గాదు. చేకూరు-చేకుఱు అని యైనట్లుగా కూరిచి-కుఱిచి యని యైన దనుట కుదురకున్నది. చేకుఱుచున్నది, చేకుఱదు ఇత్యాదిగా నట రూపము లగుచున్నట్లుగా నిట కూరుచు-కుఱుచు అని యగుటయు, కుఱుచున్నది, కుఱువదు ఇత్యాదిగా లడాద్యంతరూపము లున్నవా? కూడు ధాతువునకుఁ బ్రేరణమునందు మాత్రమే, యచటఁ గూడ క్త్వార్థమునందు మాత్రమే యిట్టిరూప మేర్పడుననవలె. అక్కడఁ గూడ కూరిచికిఁ గలయట్లు కుఱిచి అనునొక్కదానికైనను విడిగాఁ బ్రయోగము లేదు గదా. అందువలననే కూరిచి యనుదానికిఁ గూడునట్లు చేసి యనురీతిగా నర్థము గుదురుచుండఁగా కుఱుచు (కుఱిచి) అనుదాని కారీతియర్థము గుదురునట్లు చెప్పుట కాధారము దొరుకదు. కావును దీనింబట్టియుఁ గూరిచినుండి కుఱిచి యేర్పడిన ట్లూహించుట యుక్తము గా దని నిర్ణయింపఁదగును.

సర్వస్వవ్యాఖ్య తత్వబోధినీమతమును నిరాకరించుచు నయ్యది ప్రయోగవిరుద్ధ మన్నది. కానీ కుఱిచి యెప్పుడును ద్వితీయాంతముపైనే నిలుచుటచే గకారము వచ్చుచునే యున్నది. కాఁగా ద్రుతమునకు బిందు వుండవలెను. విరించింగుఱిచి

యనుచోఁ బూర్ణబిందు వుండుటనుబట్టి యది స్పష్టమే. కాని విరించిఁగుఱిచి యనురీతిగాఁ బూర్ణబిందువు లేనిసందర్భములందు ఖండబిందువు నియతముగా నుండవలను. మముగుఱిచి యనుచో ఖండమును వ్యాకర్త చూపలేదు. గుఱిచి యని యీశబ్దమును సిద్ధసరళాదిగాఁ జూపెను గదా. ఇఁక ఖండబిందువున కవకాశమును లేదు. తత్త్వ.సమన్వయము ననుసరించి కుఱిచి యని యిది పరుషాది కాఁగా నిటఁ గవిప్రయోగములందు ఖండబిందువు లేకుండుట లక్షణవిరుద్ధ మగును. తత్త్వబోధిని సరళాది యగుటను సమర్థించినది గాని యట ఖండబిందువును గూర్చి ప్రస్తావింపలేదు. కూరిచి యనుదీనికి మూల మైనరూపము ప్రయోగింపఁబడునపుడు మాత్రము పూర్వమున ఖండబిందువు తప్పకయుండుటనుబట్టి యీశబ్దము కుఱిచి యని పరుషాదిగాఁ జెప్పుట సరి గా దనియు నందుచేత నిది కూరిచి నుండి యేర్పడిన దనుటయు నొప్ప దనియుఁ దెలియుచున్నది.

ఇట తత్త్వ. 'సిద్ధసరళాదిగా గుఱిచి చెప్పినవ్యాకర్త ద్వితీయాద్రుతము లోపించె నని చెప్పె' (202) ననుటయు సరి గాదు. 'మముగుఱిచి' యనులక్ష్యమునందు ద్రుతము లోపించినమాట నిజమే యైనను 'మముంగుఱిచి' యని యొకపక్షమున ద్రుతము లోపింపక పూర్ణబిందు వుండుట లక్షణానుగుణమే కదా.

వఝలవారు 'గుఱించిప్రభృతులు గుఱించు ధాతుక్త్వార్థకరూపంబు లనియు నవి పర మగునపుడు ద్వితీయావిభక్తి నిల్చు ననియు నెఱుంగునది.' (వ్యా.సం.స.963) యనిరి. విష్ణుగుఱిచి యని యింతకు ముందే వీ రుదాహరించియుండుటచే గుఱిచి కూడ గుఱించు ధాతుక్త్వార్థకరూపమే యని భావించినట్లు స్పష్టము. శ.ర. గుఱించు ధాతువును జూపెఁ గాని, గుఱిచి యపద మని ప్రత్యేకముగాఁ జూపుటను గుర్తించితిమి. వఝలవారు గుఱించు నుండి గుఱిచు అని యె ట్లేర్పడునో వివరింపలేదు. ఇంక వఝలవా రివి (గుఱించి, గుఱిచి మొ.) పర మగుచుండఁ గా ద్వితీయావిభక్తి నిలుచు ననుట యుక్తము గాదు. ఇది గుఱించుధాతువు క్త్వార్థకరూపములే యని భావించునపుడు కర్మ యై యన్వయించుశబ్దమునకు ద్వితీయ ముందుగానే యగును. అట్లు గా దన్నను ప్రౌఢవ్యాకర్తవలె ద్వితీయాంతములపైఁ జేరు ననుట యుక్తము. కాని ముందుగా వీనిని బరముగా నుంచి ద్వితీయ చేయుట యుక్తము గాదు గదా.

సర్వస్వవ్యాఖ్య గుఱించి యనునది గుఱించి యనుదానికి రూపాంతరముగా (30) బేర్కొన్నది. ఆధారము స్పష్టము చేయలేదు.

'గుఱి+ఉంచి అనుదానినుండి గుఱించి యని యేర్పడిన దనుపేటికాభిప్రాయ మును సర్వస్వవ్యాఖ్య తిరస్కరించినది. గుఱి+ఉంచు= గుఱుంచు కావలెనే కాని గుఱించు గానేర దనియు నయ్యది యేకపదమే యనియు సర్వస్వవ్యాఖ్య పేర్కొనుట (30) యుచితముగా నున్నది.

'పరమేశ్వరుఁ గానీ గుఱియించి' యనుశ్రీనాథప్రయోగమునుబట్టి 'గుఱి' శబ్దముపై 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' ననుసూత్రముచే నించుక్కు రాఁగా నియుడాగమ మయి, గుఱియించు అని యగు ననియు నియుడాగమము లేనిచో గుఱించు అని యగు ననియు (31-30) సర్వస్వాభిప్రాయము.

ఈసమన్వయమునం దొకయిబ్బంది. అంగలాదులలోఁ జేర్చుటకు గుఱి ధాతువు గాదు. నామములకు ధాతుత్వవివక్ష చేసినపు డీసూత్రముచే నించు క్కవునా? 'నిర్జినామంబు ల' కనుసూత్రజ్ఞాపనముచే గుఱి యనునామమున కాసూత్రముచేతనే యించుగాగమ మగు. కాని గుఱించు, గుఱియించు అనురీతిధాతురూపములు గలవా? గుఱియించుచున్నాఁడు, గుఱియింపఁగలవాఁ డనురీతిరూపములు గానరావు. శ.ర. గుఱించు సకర్మకక్రియ యని పేర్కొన్నదే కాని క్త్వార్థకరూపములే యూదాహరించినది. సూ.ని. అభిప్రాయంబు గుఱించియు (ఇట గురించియు ననుపాఠము ముద్రితప్రతులఁ గానవచ్చును.) గుఱించినతనువుల (వరాహ. 3.130) నని చూపె. ఇట గుఱుంచిన = గుఱి+ఉంచిన అని యచ్చుపాఠము.

అట్టియెడల గుఱించు అనుధాతువే యంగీకరింపఁదగునా యని సందేహము. చారిత్రకవ్యాకర్తలు దీనిని బ్రస్తావింపవచ్చు నేమో. శబ్దశాస్త్రసంప్రదాయమున కిది సరిపడదు.

గుఱియించి యను శ్రీనాథప్రయోగము విశేషముగా గుర్తించి గుఱించి యనున దనుప్రయుక్త మైన దని చెప్పుటయే యుచిత మని తోఁచెడి.

ఇంక గుఱించి, గుఱియించి యన్నవి గుఱించు ధాతువుక్త్వార్థకరూపము లనియే సమర్థించికొన్నను 'గుఱిచి' నట్లు సమన్వయించుటకు వీలు లేదు. ఇట

బిందులోపమునకుఁ బ్రమాణ మేమి? అందుకే సూ.ని. గుఱిచి (కూరిచి–గుఱించు?) అని యనుమానించినది.

'విరించిగుఱించి తపంబు సేసె నిత్యాదౌ తు విభక్త్యర్థాభిధాయకో వైకృతశబ్ద ఇతి జ్ఞేయమ్. అత ఏ వాథర్వణే నోక్తమ్. కేచి త్తు వైకృతా శ్శబ్దా విభక్త్యర్థాభిధాయకాః ఇతి'. (కవిశి.367) అని యహోబలుఁ డిది విభక్త్యర్థాభిధాయకవైకృతశబ్ద మనెను. కోసము(373) అనురీతిగా విభక్త్యర్థాభిధాయకశబ్దములు పృథక్ప్రసిద్ధములు గాకుంట గమనింపఁదగును. కావున (మెయి, మై మున్నగువానివలె) నియ్యది (గుఱించి) సైతము గుఱించుధాతుక్త్వార్థకరూపముగాఁ జెప్పుటకంటె గుఱిచివలెనే యనుప్రయుక్త మగు ననుట యుక్తము.

కూర్చి ప్రత్యేకపదముగాఁ బ్రసిద్ధమే. కాని దీని నీతఁ డనుప్రయుక్తముగాఁ జెప్పెను. అట్టియెడల గుఱించి యేల పేర్కొనలేదో స్పష్టము గాదు. కాని కూర్చి యనుప్రయుక్త మగు ననుట యుక్తమే. 'హరిం గూర్చి జపము' అనుచో 'కూర్చి' అనునది కూడుధాతువుయొక్క ప్రేరణార్థమును క్త్వార్థముతో బోధించుచున్నదా? కేవలము హరి నుద్దేశించి యని మాత్రమే చెప్పుచున్నది. కావున నిద్దాని నుద్దేశార్థము నందు ననుప్రయుక్త మవు నని చెప్పుటయే యుక్తము. కాఁగాఁ బ్రసిద్ధి ననుసరించి కూర్చిప్రభృతు లనుప్రయుక్తము లవుటను సూత్రించి, గుఱియించి యనుశ్రీనాథ ప్రయోగమును గూడ నిట సంగ్రహింపఁదగును.

ఉద్దేశార్థమునందు గుఱించిప్రభృతు లనుప్రయుక్తములు గాకుంటయుఁ గలదు. సుతున్ హతుఁ డయ్యె (ద్రోణ.5.305) వేటఁ బోయినాఁడు (అం.6.163) (వ్యా.సం.స.965) సుతుంగూర్చి యనురీతియర్థము స్పష్టము. కావునఁ బ్రౌఢవ్యాకర్త 'యనుప్రయుక్తం బగు' నని నిత్యముగాఁ జెప్పుట యుక్తముగా లేదు. కూర్చిప్రభృతులు లేనిప్రయోగములకును నవకాశము గల్పించుట యవసరము. ఈప్రయోగములను బట్టియుఁ గూర్చిప్రభృతులు ద్వితీయపైనే యనుప్రయుక్త మగు ననుట యుచిత మని నిర్ణయింపఁదగును. చింతామణివలెఁ గూర్చియే ద్వితీయాప్రత్యయ మన్నఁ గూర్చిప్రత్యయము లోపించి తన్నిమిత్తక మగు నుగాగమము మాత్రము మిగిలిన దని చెప్పవలసియుండును గదా. అందుకే వఝలవారు గుఱించిప్రభృతు లని యుందురు. రాకుండుటయుఁ గల దనుటయే యుక్తము. వఝలవారు

'లోపించుటయు' ననుట యనవసరము. చేసి లోపింపఁజేయ నేల? రాలే దన్న సరిపోవును గదా.

ద్వితీయపైనే యనుప్రయుక్త మవు ననుట యుచిత మని నిరూపించుటకు సూత్రకర్త మముగుఱిచి యని యుదాహరించుట యెంతయు నుచితముగా నున్నది. కూర్చి విభక్తి యనియు నది పర మైనపుడు ప్రాతిపదికకు నుమాగమ మగు ననియుఁ జెప్పిన రాముం గూర్చి– వర్షముం గూర్చి యిత్యాదు లవును. మమ్ముఁ గూర్చి యనునది గాదు. నన్నును అనుచో 'ను' ఆగమ మైనద్రుత మనుప్రౌఢవ్యాకర్త యభిప్రాయము గమనింపఁదగినది. (అనఁగా న్నుమ్ము లిట నమ్మున్నులకే యాదేశ మయిన వని భావము) కావున ద్వితీయపై ననుప్రయుక్తము లన్నయితనిప్రణాళిక యెంతయు సముచితము. (కూర్చిని జింతామణి ద్వితీయావిభక్తి యన్నది గావున దానినే యనుప్రయుక్తముగా సూత్రముననే చెప్పుటకుఁ బ్రౌఢవ్యాకర్త మొగమోటపడి యుండవచ్చు.)

ఘం. 'ఉద్దేశార్థమున ద్వితీయ వేఱుగా విధింపఁబడుట లేదు. కాని గుఱిచి ననుప్రయుక్త మనుటచేతనే (ద్వితీయ కనుప్రయుక్త మనుటచేత నని తాత్పర్యము.) అందుకే సూత్రవివరణమున నీవ్యాఖ్య 'ఉద్దేశార్థమునందు ద్వితీయ యగు ననియు నాద్వితీయకు గుఱిచియు ననుప్రయుక్త మగు ననియు సూత్రార్థ'(119) మని పేర్కొన్నది. కాని యిట ద్వితీయను బ్రత్యేకముగాఁ జెప్పవలయునా?

ఉద్దేశించుట యనువ్యాపారమునకు ఫల మవుటంజేసి మేము అనునది కర్మ కాఁగా దానికి ద్వితీయ యగు నాపయి నుద్దేశార్థమునందుఁ గూర్చి ప్రభృతు లనుప్రయుక్తము లగు నని తలంపనగును.

ఇంక నీసూత్రమే యనవసర మని తత్త్వ. ప్రతిపాదించినది. సంస్కృతమున గమనార్థకధాతువులు ప్రాప్త్యర్థకములు నయియుండుటచే 'గ్రామం జగామ' యనుచో గ్రామము కర్మ యై ద్వితీయ నందుచున్నది. తెలుఁగున 'వెడలె' ననురీతి గమనార్థకములు ప్రాప్త్యర్థకములు గాకుండుటంజేసి గ్రామము కర్మము గాదు. కావున గ్రామమును వెడలెను అని యుండ దనుట సముచితము. ఆపిదప–

సంస్కృతమునఁ గూడ గమనార్థకము లయినచో నుద్దిశ్య యనునది ప్రయోగించినను వాక్యము సరిపడదు. (సరిపడును అనుట వ్యాఖ్యయభిప్రాయముగాఁ దోఁచుచున్నది. సరిపడదు అనుట పొరపాటు గావచ్చును.) 'గ్రామ ముద్దిశ్య

జగామ' అని యుండును. (ఇట 'ఉద్దిశ్య' అనునది ప్రయుక్త మైనను వాక్యము సరిపడుచునే యున్నది గదా. కావున పైని సరిపడును అని వ్యాఖ్య యభిప్రాయ మనఁదగు) కాని కేవలప్రాప్త్యర్థకధాతువును బ్రయోగించినచో 'గ్రామమును బొందెను' అన్నట్లే 'గ్రామం ప్రాప' యనియే యుండును. కాని గ్రామ ముద్దిశ్య ప్రాప యని యుండదు గదా. ఇట్టియర్థమును గమనించినచో గుఱించి యనుపదప్రయోగమునకుఁ బ్రత్యేకవిధాన మక్కఱ లే దనియే తెలియును.'(205)

తెలుఁగునందలిధాతువు కేవలము గమనార్థమే యైయున్నపుడు గ్రామాదుల కర్మములు గావు. కావున నట ద్వితీయ రాదు. (గ్రామం జగామ) 'గ్రామ ముద్దిశ్య జగామ' యనుచో 'నుద్దిశ్య' పదప్రయోగమున సంస్కృతమున నెట్లు ద్వితీయ యగుచున్నదో యట్లే తెలుఁగునను 'గ్రామముగుఱించి వెడలె' నని యుండుట విశేషము గాదు. కావున సూత్రింప నక్కఱ లే దని యీవ్యాఖ్యాభిప్రాయసారము. కాని యీవ్యాఖ్య చెప్పిన 'గుఱించి' యనుప్రయుక్త మనియే వ్యాకర్త చెప్పలేదు. గుఱించు ధాతువునకు నుద్దేశార్థమును శ.ర.లోఁ జూపియున్నాఁడు. కావున సంస్కృతమునం దిట వ్యాఖ్య చూపిన 'ఉద్దిశ్య' యనుదానివలెనే గుఱించిపదప్రయోగముసందర్భమున ద్వితీయ యుండుట విశేషము గా దని తలంచియే సూత్రకర్త గుఱించి నిట గ్రహింపకపోయి యుండవచ్చును.

అసలు వ్యాఖ్య 'గుఱించి' పేర్కొనుట యెట్లు? శ.ర. పేర్కొన్నట్లు గుఱించు ధాతువును గాని, గుఱించి యనునది గుఱించుధాతువుక్త్వార్థక మని కాని సూచించియు నుండలేదు.

కూర్చి యనుదానినుండియే గుఱిచి, గుఱించి యనునవి యేర్పడిన వనియే యీవ్యాఖ్య సిద్ధాంత మయిన నయ్యది పొరపా టని యింతకుముందే స్పష్టము.

ఇంక సూత్రకర్త యనుప్రయుక్తము లని చెప్పినది గుఱిచి, కూర్చి యనునవి. ఈవ్యాఖ్య తలఁచినట్లుగా 'గుఱిచి' యన్నది కూర్చిశబ్దమువలన నేర్పడినదే యని యంగికరింతము. సంస్కృతమునం దున్న 'గ్రామ ముద్దిశ్య' యనుదానివంటిదే 'గ్రామముం గూర్చి' యనుతెలుఁగుప్రయోగ మనవలయు నని కదా యభిప్రాయము. అనఁగా నీయవి స్వతంత్రము లైనపదములే యనియు దీనితోడియన్వయమువలన గ్రామము కర్మ యై ద్వితీయ నంది, గ్రామముం గూర్చి యని యగుచుండఁగా నీవిధాన మనవసర మనియుఁ దాత్పర్యము.

కాని దీనికి మూల మైన 'కూడు' ధాతువున కుద్దేశార్థ మున్నదా? కూడు అనుదానికి సకర్మకమునకు పొందు అని యర్థము.(శ.ర.) సూ.ని. కూడ దీని కుద్దేశార్థమును జెప్పలేదు. ఇతరము లగునర్థములు సూ.ని. చూపినను నయ్యవి కుదురునవి కా విట. అపుడు 'గ్రామముం గూర్చి వెడలె' ననుదానికి నర్థ మేమి చెప్పవలెను? 'గ్రామముం బొందించి వెడలెను' అనియా? అట్టియపుడు గ్రామ ముద్దిశ్య యనుదానివంటిదిగా గ్రామముం గూర్చి యనుదానిని బేర్కొనుట యెట్లు గుదురును? దీని కుద్దేశార్థము లేకుండుటంజేసియే కదా యుద్దేశార్థమునం దనుప్రయుక్తము చేసినది. ఉద్దేశార్థము గల దని తా నూహించిన గుఱించి యనుదానిని సూత్రకర్త యిట స్పృశింపకుండుటయు గమనింపవలసినయంశము.

కాఁగాఁ గూర్చి యనుదానికే యుద్దేశార్థము లేకపోఁగా దానినుండియే వ్యాఖ్య గుఱిచిని సాధించినది కావున గుఱిచికిని నుద్దేశార్థ ముండనేరదు. కావున నీరెంటి నుద్దేశార్థమునం దనుప్రయుక్తము చేయుట యవసర మని యీతత్త్వ.పూర్వపక్షము ననుసరించియే సిద్ధాంత మూహింపఁదగియున్నది.

కాఁగా వీనిని స్వతంత్రపదములుగనే భావించినను నుద్దేశార్థము సిద్ధింపమింజేసి యందుకై ద్వితీయ కనుప్రయుక్తము లగు నని చెప్పవలసియే యున్న దనుట స్పష్టము. కావున నీవిధానము వ్యర్థము గానేరదు.

ఇవి స్వతంత్రము లైనపదములే యనుటకు తత్త్వ. 'నిన్న కూర్చి' యనుచో నవధారణార్థకముతో వ్యవధాన ముండుట యనఁగాఁ గూర్చి–ద్వితీయతో వ్యవహిత మైయుండుటను బేర్కొనుటలో నీయవి యనుప్రయుక్తములు గా వని చెప్పుట కన్పించును.

ఇందుఁ గూర్చి యన్నది స్వతంత్రపదముగాఁ గూడఁ గల దనుట ప్రసిద్ధమే. కాని, యిచట నిన్నకూర్చి యనుచోఁ బ్రయుక్త మైనది మాత్ర మట్టిస్వతంత్రపదము గా దని యుద్దేశార్థమే స్పష్టము చేయుచున్నది.

కాని వ్యవహితత్వమునుబట్టి యనుప్రయుక్తము గారా దని సిద్ధాంతీకరింపలేము. దాననచేసి దోషముల్ వాయు (సభా. 1.98)(వ్యా.సం.స. 968) ననుచోఁ జేసియును నిట్లు వ్యవహిత మయి కానవచ్చుచున్నది. అంతమాత్రమున నచ్చోటిది పృథక్పదమే (చేయుధాతువుక్త్వార్థకము) కాని యనుప్రయుక్తము గానేర దని నిర్ణయింపఁదగునా?

కావున నీవ్యవహితత్వము విశేషమె యైనను ననుప్రయుక్తత్వమునకు బాధకము గాదు. పైఁగా ననుప్రయుక్త మని చెప్పినసూత్రకర్తయే పైని వ్యవహిత మగుటను గూడఁ జెప్పుచున్న ట్లీవ్యాఖ్యయు గుర్తించియున్నది.

కావున గుఱిచిప్రభృతులను ద్వితీయ కనుప్రయుక్తములు చేయుట యుక్తమే యనవలెను. ఇంక గుఱించి యనునది యుద్దేశార్థకముగా స్వతంత్రపదమే గల దని వ్యాకర్త దానిం బ్రస్తావింపలేదు. కాని యట నుదాహరించిన మిముగుఱిచి యనునది ద్వితీయ కనుప్రయుక్త మయిన దనియుఁ జెప్పఁదగియున్నది. గుఱించు ధాతు వప్రసిద్ధ మగుట మొద లగున వింతకు ముందు ప్రస్తావింపఁబడినవి. కావున దానిని గూడ నిటఁ జేర్చి యనుప్రయుక్త మగు నని చెప్పుటయే యుచితముగా నుండు నని నిర్ణయింపఁదగును. నిన్నుగూర్చిన పలుకు, నిన్నుగుఱించిన పలుకులువంటి క్తవదర్థకరూపములును వినఁబడుచున్నవి. వీనివిషయ మింకను బరిశీలింపవలసియున్నది.

## గుఱిచి - వ్యవధానము

### 3. అయ్యది వ్యవహితంబు నగు.

పూర్వసూత్రము ద్వితీయావిభక్తికి గుఱిచి ననుప్రయోగము చేసినది. గుఱిచి యనునది నడుమ వేఱుపదములప్రయోగముచే ద్వితీయావిభక్తితో వ్యవధానము గలిగియుండుటయుఁ గల దని ప్రస్తుతసూత్రమునర్థము.

తన్ను నర్థితో గుఱిచి- ఇటఁ దన్ను అనుద్వితీయాంతమునకు ననుప్రయుక్త మైన గుఱిచి దానికిఁ బూర్వమునందలిద్వితీయతో 'అర్థితో' ననుశబ్దముచే వ్యవధానము గలిగియున్నది. కావున నిట లక్ష్యము.

ఇట సర్వ. 'ననుఁ గానీ శంభుఁ గానీ రమేశ్వరుఁ గానీ గుఱియించి' యనుచో నను గుఱియించి, శంభు గుఱియించి, రమేశ్వరు గుఱియించి యని మూఁడుచోట్ల నుండవలసియుండఁగా నన్నింటికిఁ జివర నొక్కమాఱు మాత్రమే గుఱియించి యని వాడఁబడినది. కావునఁ బ్రౌఢవ్యాకర్త చేసి విషయమునఁ జెప్పిన 'ట్లయ్యది యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియ చాలెడి' నని చెప్పుట యవసరము. (33) అన్నది అది విశేషమే. ఇటఁ బెక్కుచోట్ల కొక్కటి యుండుట కాక 'కానీ'తో వ్యవధాన

ముండుటయు గమనింపఁదగియున్నది. ఇంతకును సర్వ. భావించినట్లు పెక్కుచోట్ల కనురీతిగా సూత్రకర్త సూత్రించుటకు నిందలి 'గుఱియించి' యనుదాని ననుప్రయుక్తముగా నాతఁడు చెప్పనేలేదు. ఈయది యాతనిదృష్టి కెక్కలేదో లేక 'గుఱియుంచి' యనుపాఠమునుగాఁ జూచెనో.

'అయ్యది' యనుటచే గుఱిచి యనున దొక్కటే గ్రహింపవలె నని సూత్రకర్త యభిప్రాయ మేమో. ఇంక నిట గుఱిచి యనునదే గ్రహింపఁబడవలయు నను నభిప్రాయముతోఁ గూడఁ బూర్వసూత్రమునందు గుఱిచిశబ్దమునే యుచ్చరించి యున్నాఁడా? కానీ యిట్టియభిప్రాయమే సూత్రకర్త కున్న నది యుచితము గా దనఁదగును.

సుబో. 'నిన్న కూర్చి యేతెంతు నీ వున్నకడకు' (శాంతి. 3. 332) నను ప్రయోగమును జూపినది. అందు కూర్చి యనునది సైత మవధారణార్థకము వలన ద్వితీయతో వ్యవధానము గలిగియున్నది. కావున సూత్రమున 'నయ్యవి' యనుతీరుగా బహుత్వబోధకముగాఁ బ్రయోగించిన బాగుండెడి దనవచ్చును.

'వ్యవహితంబు నగు' ననుచోట సముచ్చయమువలన వ్యవహితము గాకుండుటయే ప్రాయిక మనియు ననెను. వ్యవహిత మగుట సైతము గల దనియు నర్థము సముచితముగా సిద్ధించుచున్నది. మమ్ముగుఱిచి యనురీతి పూర్వలక్ష్య మునకు విరోధము లేదు.

## చేసి యనుప్రయోగము

**4. కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణకంబులకును వలనవర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు.**

చేతవిభక్తి యర్థము గలిగినయితరవిభక్తులకును, వలనవిభక్తికిని, గొన్నియెడలఁ దఱచుగాఁ జేసి యనునది యనుప్రయుక్త మగు నని యర్థము. సంబోధనచేత ననుచోటితృతీయకు (బాల.కార. 22) ద్వితీయ రాఁగా, సంబోధనన్. ఈద్వితీయ చేత కయినది గావునఁ జేతవిభక్త్యర్థకము. కావున దానిపైఁ జేసి యనుప్రయుక్త మై, సంబోధనఁజేసి యని యవును.

కు.పం. చేతవిభక్త్యర్థకం బనఁగా బాల.కార. 22.సూ.చేఁ దృతీయార్థమున

వచ్చు ద్వితీయ (80) మాత్రమే పేర్కొన్నది. సర్వ. ద్వితీయయును, న వర్ణమును బేర్కొని వీనినిసైతము కలియఁగలుపుకొనునిమిత్తము చేతవిభక్త్యర్థకవర్ణకంబు లని సూత్రమున వాడఁబడినది.(37) యని పేర్కొన్నది. వీనిని సైత మనఁగాఁ జేతకుఁ గూడఁ జేసి యనుప్రయుక్త మవు నని యీవ్యాఖ్య తలంచిన ట్లూహింపరాదు. ఏల యన నాతరువాత 'చేత అనువిభక్తి వచ్చినపుడు చేసి అనుప్రయుక్తము కాదు. ఆఅర్థమున నితరవిభక్తి యున్నపుడు మాత్రమే యనుప్రయుక్త మగు నని గుర్తుంచుకొనవలయు' (40) నన్నది. ఇట వఝులవారు చేతవిభక్త్యర్థముల కనుటంజేసి చేతకు చేసి రానేర దని స్పష్టము చేసి, మహిమచేఁజేసి (రంగ.రా.బాల.21) యుద్ధ. 386 పుట ప్రయోగములలోఁ గాననగుచున్నను ప్రామాణికప్రయోగములు లేమిని బేర్కొనుచు మహిమనుజేసి యని సవరించుట కవకాశము గల దనిరి. వానిం బ్రామాణికములుగా స్వీకరింపకున్నను గవిప్రయోగములు సవరింపఁ బూనుట యుక్తము గాదు. అవి విశేషప్రయోగములుగ గుర్తింపనవును.

ఇంతకును కు.పం. ద్వితీయ మాత్రమే చెప్ప సర్వ. 'న' వర్ణమును గూడఁ జేర్చినది. సూత్రకర్తయు సంప్రయోగమునఁ జేసి యని సప్తమికిఁ జేసి యనుప్రయుక్త మైనందుల కుదాహరించెను. 'ఉదంతజడంబుతృతీయకు' (బాల.కార.23.)చేఁ దృతీయకు సప్తమీనవర్ణక మైనది. కావున నీసప్తమియుఁ జేతవిభక్త్యర్థమే యగుటంజేసి దానికిఁ జేసి యనుప్రయుక్త మైనది. సుగమ.(126) సంప్రయోగమునన్, దీనన్ అనునవి ద్వితీయాంతము లనుట యసంగతము.

దీననుజేసి యనుచోఁ జేతవిభక్త్యర్థక మేదియో స్పష్టము గాదు. శబ్ద.62 దీనిచేతన్ అనుదానికి దీనన్ అనురూప మగు నన్నది. ఇందుఁ జేతవిభక్త్యంత మగురూపము మొత్తమునకు నీరూప మాదేశముగా నియమించుటవలన నీరూపములోఁ జేత విభక్త్యర్థకచిహ్నా మేదిగాఁ దలఁపవలయునో స్పష్టము గాకున్నది. ఘం. ఇట 'న' యనునది చేతవిభక్త్యర్థకము కనుక దీనను+చేసి అయినది.(121) అన్నది. దీని కాధారము గానరాదు. చేతవిభక్త్యర్థక మనుటచే నిట 'న' యనునది ప్రత్యయము గావలయును. అది ప్రత్యయ మనుట యెట్లు? ఇంక దీనిచేత నని యుండఁగా దీన ననురూపనియమనముచేత చేతప్రత్యయమున కత్వ మైన దనఁదగును. అత్వమే యిటఁ జేతవిభక్త్యర్థకవర్ణకము. ఊరన్+ఊరన్ అనుచో నామ్రేడితంబు పరం బగునపు డనుసూత్రముచే 'అ' విభక్తి లోపించుట స్మరింపఁదగును. చేతవిభక్తికి నైనది గావున

నీయత్వము విభక్తి యగును. అందుచే 'అ'వర్ణమే చేతవిభక్త్యర్థక మనియు దానికే చేసి యనుప్రయుక్త మైన దనియు నూహించుట యుచితము. శబ్ద. 62. సూత్రము నందే తృతీయ కత్వము (స్పష్టముగా) విధించిన బాగుండెడిది.

'తనూభవువలనఁ జేసి' యనుచో 'వలన'కుఁ జేసి యనుప్రయుక్త మైనది.

సూత్రమునందలితఱచుపదమునకు సూత్రకర్తయే ప్రయోజనము నిట్లు పేర్కొనెను. 'తఱచుగ ననుటచే నొకానొకచో నేకవచనంబున నుకారంబుమీఁది ద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థక మయ్యెడు నని తెలియవలయు'. ఈయర్థమును వ్యాఖ్య లన్నియు నామోదించినట్లు తోఁచుచున్నది.

కాని సూత్రకర్త సమన్వయము సమంజసముగాఁ గానరాదు. చేతవిభక్త్యర్థక వర్ణకములకుఁ దఱచుగాఁ జేసి యనుప్రయుక్త మగు ననుచో ద్వితీయ తృతీయార్థక మయ్యెడు నననర్థము నెట్లు సంపాదింపవలెనో యర్థము గాదు. తఱ చనుటచేతఁ జేతవిభక్త్యర్థకములపైఁ జేసి రాకుండుటయో, చేతేతరవిభక్త్యర్థకము(వలన)పైఁ జేసి యనుప్రయుక్త మవుటయో సాధించుకొనుటలో నౌచిత్యము గలుగును. కాని విధానముతో నెంతమాత్రమును సంబంధము లేనియంశమును సాధించుట యెట్లు? కావున నీపద్ధతి యుచితముగా లే దనకతప్పదు.

ఏకవచనమున నుకారంబుమీఁదిద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థక మగుట యననర్థము సాధింపవలసియుండవచ్చును. కాని దానిని బ్రత్యేకముగా విధించు కొనుటయే యుచిత మగుమార్గము.

అట్టిప్రయోగములను సూత్రకర్త యిట్లు చూపెను. తప్పుఁజేసి, పనుపుఁజేసి మొ.

ఘం. తప్పుఁజేసి యనుప్రయోగమునందలిద్వితీయ తృతీయార్థమున నైనది కాదు. తప్పుఁజేసి, తప్పుగా నెంచి యన్నది ప్రకరణోచిత మైనయర్థ (22) మన్నది.

తప్పుగాఁ జేయు అనునదే యర్థము, గాని తప్పుఁజేయు అనురూప మె ట్లయినది? అనఁగాఁ దప్పుఁజేసి శబ్దపల్లవము గాన. దీనిని తప్పుతేలి అని దిద్దవలె ననునాశయ మొకటి గలదు. అది సరి కాదు. 'ప్రథమాయాః ద్వితీయాయాః సంబంధ స్తత్ర సమ్మతః' అని యథర్వణాచార్యులు. 'అతనిఁ బెండ్లికొడుకుఁ జేసి ఇత్యాదీని'. (కవిశి. 675) ద్వితీయాయాః అని యుండఁగా ద్వితీయాంతపాఠముల

నెల్ల దిద్దివేయఁ బూనుట సరిగాదు. చూ. ము.ల.కౌ.క్రియ. 87–61 సూ. (327) అని చెప్పినది ఘం.

కారికలో ద్వితీయ యనఁగా ద్వితీయార్థకప్రథమ యని వఝలవా రర్థము చేయుట (వ్యా.సం.స. 1055) సరి గా దన్నవీరు ము.ల.కౌ. 61సూత్రమును జూడు మనిరి. అది 'శబ్దపల్లవపూర్వావయవంబు లగుకొన్నిశబ్దవిశేషములకు నుగాగమం బగు' ననునది. అనఁగా దానిచే నిట నుగాగమ మైనదా? అట్లు నుగాగమ మైనపుడు తప్పు అనునది ద్వితీయాంత మని యెట్లు సమర్థింపనగును. ము.ల.కౌ.60 సూత్రము శబ్దపల్లవపూర్వావయవము ద్వితీయాంత మగుటను బేర్కొన్నది. అటఁ గూడఁ దప్పుఁజేయు శబ్దపల్లవ మనుట కీప్రయోగమే చూపఁ బడినది. శబ్దపల్లవములలోఁ బూర్వావయవము ద్వితీయాంత మగుటంగూర్చి యిట నప్రస్తుతము. తప్పుఁజేయు శబ్దపల్లవ మనుటకు వీ రాధారమును జూపలేదు. (పెండ్లికొడుకుఁ జేయు అనునదే శబ్దపల్లవ మని యహో. అనుటయే తగినది గాదు.) శ.ర. దీనిని జూపలేదు. సూ.ని. తప్పుఁజేయు, తప్పుసేయు అని పూర్వావయవము ప్రథమాంతముగానే చూపినది. తప్పుచేసి (వి.పు.6.40) పైఁ గా సూ.ని.ఈప్రయోగమును తప్పుసేసి యనురీతిగాఁ జూపినది. ముద్రితప్రతులలోఁ దప్పుఁజేసి యనియుఁ గానవచ్చు.

ఇట సర్వ. 'తప్పుఁజేసి అని యన్నపుడు తప్పుగన్ అని యన్నపుడు 'గ' కు వైకల్పికముగా లోపము గలిగినది. తప్పుగా భావించి అని యర్థము. కావున నిచ్చటిది ద్వితీయాంతరూపమే' (38) యన్నది. 'గ' లోపించి యనఁగా నెట్లు? ప్రౌఢ. క్రియ.22 చే లోపింపఁజేయవలె. (కాను లోపించు) అట నుజ్యంత మగునగుధాతువు మొత్తము లోపింపవలసియుండఁగా నుజిమాత్రము మిగులుట యెట్లు? పైఁగా నిది ద్వితీయాంత మనుట యింకను సరి గాదు. 'గను' అనుదానిలో 'గ'వర్ణమే లోపించిన దనుకొందము. అప్పుడు లోపింపక మిగిలినది నుజ్యంత మగునగుధాతువునకు సంబంధించిననుజియే యగును గాని ద్వితీయావిభక్తి యగుట యెట్లు? ఈసమన్వయము సరి గాదు. అట్లు గాక తప్పునుగా ననురీతిగా ద్వితీయాంతవిశేషణముపైనే కాను అనుప్రయుక్త మైన దన్న 'కాను' లోపించి 'తప్పును' అనునది ద్వితీయాంత మగును. 'చేసె కృతాంతనికేతనాతిథిన్' అనున దిట్లె కదా. నికేతనాతిథిన్ అనుచో విశేష్య మగు 'పరీక్షితున్' అనునది ద్వితీయాంత మైయున్నది

గావునఁ దదనుగుణముగా విశేషణము ద్వితీయాంత మవుట సంభవించినది. ఇట దాసకన్యాకేళి తప్పుఁజేసి యనుచో దాసకన్యాకేళి యనునది విశేష్యము. అది ప్రథమాంతము గదా. విశేష్యము ప్రథమాంత మైయుండఁగా విశేషణము ద్వితీయాంత మగుట యెట్లు? ఇది ద్వితీయాంత మనవలయుచో దాసకన్యాకేళిఁ దప్పుఁజేసి యని విశేష్యమును ద్వితీయాంతముగాఁ జూపవలసియుండును. కాని యిట విశేష్యము ప్రథమాంత మగుట యథార్థము. జడంబుద్వితీయకుఁ బ్రథమ యైన దన్నను, విశేష్యము ప్రథమాంత మగుటచే విశేషణమును బ్రథమాంతమే యగును గదా.

కాఁగా తప్పుచేసి యనుపాఠమె యంగీకరించుపక్షమున నీయది లక్ష్యము గాదు. తప్పుఁజేసి యనుపాఠ మంగీకరించుచో లక్ష్యము గాకపోదు. సంబోధనఁ జేసి యనుచోటవలె తప్పుఁజేసి–తప్పుచేత నని తృతీయార్థ మిట సుసంగత మగును.

ఘం. పనుపుఁజేసి యనునది సరి యైన యుదాహరణ మని భావించినది.

ఇట వఝలవారు తండ్రిపనుపున్ – తండ్రియాజ్ఞను నెఱవేర్చి, దాశకన్యాకేళి తప్పుఁజేసి – దాశకన్యాకేళి యనుతప్పిదమును గావించి, భీష్మపనుపుఁజేసి – భీష్మునియాజ్ఞను జరిపి యని యి ట్లిచటిద్వితీయలు చేసి శబ్దముతో నన్వయించుచున్న వనుటలో క్షతి కానరా (1055) దనిరి. పైన ట్లర్థము చెప్పవచ్చు ననుట యుక్తము గాదు. ఇట్టియాశయమే యున్నచోఁ బనుపుఁజేసి ముదిమి గొని జవ్వనం బిచ్చె ననుచోఁ దండ్రియాజ్ఞను నెఱవేర్చి యని యర్థము చేయఁగా మిగిలినపైపాదము నిర్థకము గదా. తండ్రియాజ్ఞ 'ముదిమి గొని జవ్వనం బిచ్చుటయే'. పనుపుఁజేసి= ఆజ్ఞ నెఱవేర్చి యనుటతోడనే ముదిమి గొని జవ్వనం బిచ్చుట యనుక్రియ పూర్వకాలిక మైపోయినది. మఱల ముదిమి గొని జవ్వనం బిచ్చె ననుట నిరర్థకము. పనుపుచేత నిచ్చె ననుసూత్రకర్తయభిప్రాయమే సుసంగతము.

సర్వ. పనుపును – ద్వితీయాంతము, చేసి – క్త్వార్థకము. హేత్వర్థమునందు వచ్చినది. పనుపును జేయుటచేత నని యర్థము. ఇట్లు గ్రహించినపుడు ద్వితీయకుఁ దృతీయార్థము సరిపడ' (38) దన్నది. కాని యిట్లు గ్రహించుటకే వీలుపడదు. తండ్రియాజ్ఞను చేయుటచేత ముదిమి గొని జవ్వనం బిచ్చె ననువాక్య మన్వయించుట యెట్లు? తండ్రియాజ్ఞ చేయుటకొఱకు ననుచతుర్థి యైన (షష్ఠి యైన) కొంత వఱ కేని సమన్వయించును. తండ్రి పనుపును జేయుటచేత ననుటలోనే వఝలవారి

వివరణమునందువలె నిచ్చుటc గూడ ముదిమి గొని జవ్వనం బిచ్చుటచేత నని యర్థ మై ముదిమిగొని జవ్వనం బిచ్చె ననుతరువాతిభాగము నిరర్థక మగును.

ఇట్లె దాశకన్యాకేళి దప్పుcజేసి యనుచోc గూడc దప్పిదము గావించి యను వఝలవారియన్వయము సంగతము గాదు. దాశకన్యాకేళి యనుతప్పిదము గావించి బాడబులు పరాశరుపట్టి వెలిcబెట్టిరే యనువాక్యమున నన్వయ మెట్లు? దాశకన్యాకేళి చేసిన దెవరు? బాడబులు గారు గదా. కావున నీసమన్వయమును సరి గాదు.

వఝలవారు తృతీయార్థకద్వితీయపైనే చేసి యిట ననుప్రయుక్త మైన దని చెప్పుట న్యాయ మని తోcచును గాని 'ఉదంతములపై మ ఱెచ్చుటను దృతీయార్థమున నిట్లు ద్వితీయ నిల్చు ననుటను నిర్వహింపcజాలుప్రామాణికప్రయోగములు లేమిం జేసి' (1054) యిది యంగీకార్యము గా దనిరి. నన్నయాదులప్రయోగము లివి ప్రామాణికములే కాని వారు సమన్వయించినమార్గాంతరము సరి గామి నిట ద్వితీయ తృతీయార్థకమే యని చెప్పవలయు ననిపించును. ఇతరప్రయోగములు లే వనుట గమనింపcదగును.

కాని, యిచట ద్వితీయ తృతీయార్థక మనుటయు సరిగాదు. అనుప్రయుక్త మగుచేసికి నర్థవిశేషము చెప్పcబడమింజేసి యది ప్రత్యేకముగా నేయర్థమును బోధింపదు. కావున ద్వితీయయే తృతీయార్థము నీయవలయును. కాని యిట దాశకన్యాకేళితప్పున్-తంద్రితపనుపున్ అని చేసిని జేర్పకున్నచోc దృతీయార్థము సంభవించుట లే దని గమనింపవలసియున్నది. సూత్రకర్త మిగిలినలక్ష్యము లిట్టివి కావు. ఏకవిప్రసంబోధనన్ అనcగా నేకవిప్రసంబోధనచేత నని ద్వితీయ తృతీయార్థకమే. 'దీనను' అన్నను 'దీననుజేసి' యన్నను నర్థము సమానమే. అనc గాc బైస్థలములందుc జేసి యనుప్రయుక్తము గాకున్నను (తృతీయాస్థానిక మగుటచేత) ద్వితీయ తృతీయార్థక మైయున్నది. కాని పనుపుcజేసి, తప్పుcజేసి యనునీస్థలములలో మాత్రము చేసి యనుప్రయుక్తము చేయనిదే ద్వితీయ తృతీయార్థక మగుట లేదు. బహుశః ఆకారణముచేతనే సూత్రకర్త యుదంతజడమున కేకవచనమునc దృతీయకు ద్వితీయ విధింపలే దనవచ్చును. అట్లు విధించినచోc బనుపున్ అనcగాc బనుపుచేత నని యర్థము చేయవలె. కాని యట్టితృతీయార్థము ద్వితీయకు లేదు. కావున న ట్లుదంతజడంబునకు నేకవచనమునc దృతీయకు ద్వితీయ యగు నని ప్రత్యేకముగా సూత్రింపకుండుట సమంజసముగా నున్నది.

కాని చేసి యనుప్రయుక్త మయినపుడే యుదంతజడములద్వితీయ (ఏక వచనమున) తృతీయార్థక మగు ననునభిప్రాయము సూత్రకర్తకుఁ గల దని చెప్పుట కాధారము గానరాదు. సూత్రకర్త ద్వితీయ తృతీయార్థక మగు నని సామాన్యముగాఁ జెప్పెను. ఇంక నీయర్థమునకు 'ఇతరత్ర చ ద్వితీయా' యనుస్థాననియమశూన్య విధియు నవకాశ మిచ్చుచున్న' దనియుఁ జెప్పెను. స్థాననియమశూన్య మనఁగా సర్వ. స్థానము గాని నియమము గాని యక్కర లే దని ప్రౌఢవ్యాకర్తయభిప్రాయ మై నట్లనిపించు (38) ననుట సరిగాదు. ద్వితీయ దేనిస్థానమం దగునో నియమింపఁ బడమి నుదంతైకవచనస్థానమునను నగు ననియే వ్యాకర్తమతము. ఈవ్యాకర్త యభిప్రాయమును వాఖ్యాత లామోదించుట గానవచ్చును. కాని స్థాననియమశూన్య మైనమాత్రమున నెల్లెడల ద్వితీయ యగు నని చెప్పుట యుక్తము గాదు. అహోబలాదు లెల్లఁ దృతీయాసప్తములకే యని వ్యాఖ్యానించియున్నారు. (వ్యా.సం.స. 1054)

ఇది యి ట్లుండఁగా సర్వ. 'సూరి గూడ 'ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' నని తెలిపెను. దీనినిబట్టి కూడ అట్లు చెప్పుట కవకాశము గలదు. అయినను బ్రయోగములనుబట్టి నిర్ణయము సాగించుట సముచిత విధాన' (38) మన్నది. ప్రయోగానుసారముగా నిర్ణయింపవలె ననుట యుచితమే. సూరి ప్రయోగానుసారముగా న ట్లొకనిర్ణయము చేసియుండుటవలననే యీవివరణము ప్రసక్త మైనది. సూరి. బాల.కార. 22 సూత్రమునొద్ద 'బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమునందే యగు' నని యవధారణార్థకము సైతము చేర్చి చెప్పుటలో నేకవచనమునందు నిషేధించుటయే తాత్పర్యము గదా. ఇ ట్లితఁడు నిషేధించియుండఁగా 'నొకానొకచో' ననుసూత్రముచే సాధించి సూరిసమ్మతము చేయఁబూనుట యుక్తము కాదు. సూరికి సమ్మత మైనతృతీయకు ద్వితీయను బ్రత్యేకముగాఁ జెప్పియు నొకానొకచో ననుసూత్రము నేల యాశ్రయించును? బహుత్వమునందే యనుటచే నేకవచనమున సూరిసమ్మతము గా దనియే చెప్పవలె. అట్టిప్రయోగము లున్నఁ బ్రత్యేకముగా సాధించుకొనవలసినదే.

'ఇతరత్ర చ ద్వితీయా' యనుదానిచే సాధించుటయు సమంజసమా? అవకాశము లేకపోలేదు. కాని యిట ద్వితీయ తృతీయార్థక మై (చేసి యనుప్రయుక్తము గాకుండ) యుండుట లేదు. కావున నట్లు సాధించుట యుక్తము గాదు.

ఇ ట్లనుటచేతనే అనఁగా 'ఇతరత్ర చ ద్వితీయా' యనుదానిచే 'ఇవ్విధము

నాననముల్' అనుచోఁ గూడ ద్వితీయ యైన దని సూత్రకర్త చెప్పెను. దీనినిబట్టియుఁ జేసి యనుప్రయుక్త మగునపుడే ద్వితీయ తృతీయార్థక మగు నని సూత్రకర్త తలఁ పలే దనవచ్చును.

అస లిట నేవిభక్తికి ద్వితీయ యైన దనునదియు ననుమానాస్పద మైయున్నది. తత్త్వ. తృతీయకే ద్వితీయ యైన దని చెప్పినది.(303) సర్వ. 'ప్రౌఢవ్యాకర్త ఇవ్విధమునన్ అన్నతృతీయావిభక్త్యర్థమున ద్వితీయ యయ్యె నని...కాని యిటులు తృతీయార్థము ఏమాత్రమును సంగతము గా' (39) దన్నది. ఈవిధమునన్ అనునది తృతీయ కావలె నన్న జడంబుతృతీయకు నవర్ణకము చేయవలె నన్నమాట. తృతీయకు నవర్ణకము చేసి, నవర్ణకమునకు ద్వితీయ చేయ నేల? తృతీయకే సరాసరిగా ద్వితీయ చేయనగును గదా.

వఝలవారు 'ఇవ్విధముయొక్క ఆననముల్ = ఇవ్విధమున్ ఆననముల్ = ఇవ్విధము నాననముల్ =ఈవిధము గలముఖములు' అని శేషషష్ఠీసమాసముచే నిర్బాధ మగుచున్న (వ్యా.సం.స. 1055) దనిరి. సర్వ.(39) ఘం.(123) వ్యాఖ్య లిట్లె పేర్కొన్నవి.

దీనికంటెను సుబో. ప్రథమార్థమున నేకవచనమున నుకారాంతమునకు ద్వితీయ వచ్చుట పొసఁగిన దనుట (150) యుక్త మనిపించుచున్నది. సుబో. ఐనఁ బ్రథమకు ద్వితీయ యన్నఁ జాలును. ఇది సరి గా దని ఘం. 'ఇవ్విధమునాననముల్ అనుచోఁ బ్రథమకు ద్వితీయ యయ్యె ననుట సరిగాదు. ద్వితీయార్థము ప్రకరణోచితము గా' (122) దని ఖండించినది. ఈవిమర్శనము త్యాజ్య మని 'చేర్పులు–కూర్పులు'లో నీఘం. చివరఁ బేర్కొనుట యెంతయు సముచితము. ఏ లన ద్వితీయార్థము ప్రకరణోచితము గా దనుమాట యథార్థమే. కాని యిట ద్వితీయార్థ మె ట్లుండును? ద్వితీయ ప్రథమ కయినది కావునఁ బ్రథమార్థమే యుండును.

జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ యైనచో నాద్వితీయ ద్వితీయార్థమునే యిచ్చునా? సంబోధనచేత=సంబోధనన్ అని కాఁగా నచ్చుట ద్వితీయ తృతీయా స్థానికము గావున ద్వితీయార్థకము గదా. అందుకే కదా సూత్రకర్త యిటఁ 'జేత విభక్త్యర్థకవర్ణకంబు' లని చెప్పుట సరిపడుచున్నది. లంకం గలకలంబు పుట్టె ననుచో 'లంకను' అనుద్వితీయ ద్వితీయార్థమునే యిచ్చిన వాక్యార్థము సరిపడునా?

అట్లే యిటఁ గూడ ద్వితీయ ప్రథమకుఁ జెప్పఁబడిన దగుటంజేసి ప్రథమార్థమే గదా యీయవలసినది.

ప్రథమార్థమే ప్రకరణోచితము నైయున్నది. ఇవ్విధ మైనయాననములు గలవారు. ఇవ్విధము–ఆననములు గలవారు. ఇది కర్మధారయసమాస మనుకొనరాదు. 'ఇవ్విధములు' అనునది 'ఆననములు' అనుదానికి విశేషణము. ఇయ్యది ముగంతము. కావున బహువచనమున కేకవచనము రాఁగా, నివ్విధము–ఆననము లనురీతిగా నుండును. ఇయ్యది ప్రథమ. దానికి ద్వితీయ రాఁగా, 'నివ్విధము నాననముల్' అని యగును.

ఇవ్విధము గలయాననములు గలవా రనురీతి యర్థముకంటె నివ్విధములు (ఐన)ఆననములు గలవారు (దానిది కలరూపు) అని యుండుట యుక్తము. సూత్రకర్త యభిప్రాయము నిదియే యైయుండవచ్చును.

స్థాననియమశూన్య మగుటచేతనే ప్రథమకును ద్వితీయ యైన దని సూత్రకర్త యభిప్రాయపడియుండనోపును.

కాని ప్రథమకు ద్వితీయ యవుట మఱి యెచ్చటను గానరాకున్నది. కావు దాని ననుసరించి చూచిన 'ఇవ్విధముయొక్క ఆననములు = ఇవ్విధమునాననములు అనురీతిగా వఝలవారు మున్నగువారు చూపినసమన్వయమునే యనుసరించి యీవిశేషప్రయోగమును సమన్వయింపఁదగును.

'చేతవిభక్త్యర్థకవర్ణకంబుల' కనుటచేత నితర మగు 'తోడ' తృతీయార్థకమునకుఁ జేసి యనుప్రయుక్తము గా దనుట స్పష్టము. కాని చేతవిభక్తి నందుట కర్మము గానిస్థలములం దున్నతోడకు ద్వితీయ వచ్చుట గల దేమో ప్రయోగములఁ బరిశీలించి నిర్ణయింపవలసియున్నది.

(హేత్వర్థమునందుఁ జేతయే చెప్పఁబడినది కదా.)

ఈచేసియనుప్రయోగమునకు సర్వ. సూరిప్రయోగములు చూపుట యెంతయు విశేషము. (40)

## చేసి ప్రయోగవైచిత్రి

### 5. అయ్యది యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియ చాలెడి.

పూర్వసూత్రము ననుసరించి చేసి యనుప్రయుక్త మవుట కర్త్ర మైనస్థలములు వాక్యమునందుఁ బెక్కు లుండుచో నం దొక్క(చివరి)దానికే యనుప్రయుక్తము చేసినఁ జాలు నని సూత్రమునర్థము.

'కర్కశస్తనములఁ, గరమువాఁడిచూడ్కుల, నతిరాగసురుచిరాధరముల, మదవిలాసాలసమందగతుల, వక్రాలకంబుల, వలుఁదపిఱుందుల, దర్పగద్గదభాషిత ములఁ జేసి'– ఇటఁ జేసి చివరిదాని కొక్కదానికే యనుప్రయుక్త మైనది. సూత్రకర్త 'చేతవిభక్త్యర్థకవర్ణకము పై నెల్లెడల నుండవలసిన 'చేసి' యొక్కచోటనే యున్నది' యని వివరించెను. వ్యాకర్త 'చేతవిభక్త్యర్థకలవర్ణక మనుట పొరపా' టన్నది సర్వ. ద్వితీయాదులలో నిది (ల) యాగమము గాన వర్ణక మనరాదు. ఇటఁ జేతవిభక్త్యర్థ కము 'ను'వర్ణ మగుటచే లవర్ణము చేతవిభక్త్యర్థక మనరా (41–45) దన్నది.

బాల.మార్గమున నది కొంత యసంగతమే. కాని చింతామణి 'కూర్చిలనునయో భవే ద్వితీయా తు' అని 'ల'ను ద్వితీయావిభక్తిగాఁ బేర్కొని, 'లు జసో ల శసో ఽలాన్తాత్' అనుసూత్రముచే శస్సుస్థానమున విధించినది. చింతామణిలో 'ఇతరత్ర చ ద్వితీయా' యనుసూత్రముచే భిస్సుస్థానమున శస్సు రాఁగా, శస్సునకు లవర్ణక మవును. కావున 'ల' యనునది వర్ణక మనుటయుఁ జేతవిభక్త్యర్థక మనుటయును జింతామణిపక్షము ననుసరించి సూత్రకర్త వివరించినతీరున దోషము లేదు. ఇతఁ డు చింతామణిప్రసంగమునే చేయుటయు బాలవ్యాకరణము పేరే యుచ్చరింప కుంటయునుబట్టి యి ట్లూహించుట కవకాశము లేకపోలేదు. కాని సూరి ప్రణాళికను సవరించుట మాత్రము ప్రయోజనవంతము గా దని చెప్పుట యొప్పును.

'ఎల్లెడల నుండవలసిన' యనుటయుఁ బొరపాటె యని తత్త్వ. 'చేసి యనుప్రయోగము నిత్యము గాదు గావునను జేసి లేకున్నను దృతీయార్థము గుదురు వడుచునే యుండును గావునను నెల్లెడల నుండవలసినయవసరము లే' (200) దన్నది. (ఘం. 123)

ఇది సమంజసమే. కాని చివరిదానికిఁ జేసి యనుప్రయుక్తము చేసినస్థలము లందుమాత్ర మెల్లవానికిఁ జేసిని జేర్చి యర్థము చెప్పుటయే యుచిత మని తోఁచు

చున్నది. (కు.పం. 89) (అర్థమునకు భంగ ముండదు గావుననే యెట్టియర్థవిశేషమును దెల్పకయె సూత్రకర్త చేసి ననుప్రయుక్తము చేసెను) కాని యిట్టిచోట్ల నన్వయము చెప్పునప్పు డెల్లచోట్లఁ జేసిని జేర్చుట ననుసరించియే సూత్రకర్త యట్లు వివరించి యుండును.

'ఒక్కటియు' నని సామాన్యముగాఁ జెప్పుట సరిగా దనుసర్వ. అభిప్రాయ ముచితమే. (41) ఒక్కటి యనఁగాఁ బెక్కుస్థలములం దాదిమధ్యావసానములలో నెక్కడనో యొక్కదానికి మాత్రమే యనుప్రయుక్తము చేసినఁ జాలు ననునర్థ మవుచున్నది. కావునఁ దన్నివారణార్థము చివరిదాని కొక్కదానికే యనుప్రయుక్త మయినఁ జాలు నని స్పష్టముచేయుట యవసరమే.

పెక్కుచోట్లకు బదులుగాఁ జివరిదాని కొక్కదానికే చేసి ప్రయోగింపఁబడినవి భాషలోఁ బెక్కు లున్నవి. పోలె ప్రభృతులు, అన్‌ప్రత్యయాంత మగునగుధాతువు అనురీతివానిని సూత్రకర్త యట నట స్పష్టము చేసియున్నాఁడు. స్పష్టత కయ్యును నిట్లు వేర్వేఱు సూత్రములలో నొకేయంశమును విధించుటకంటె నట్టివాని నన్నింటి నొకగణముగా నేర్పఱిచి యొకేసూత్రములో విధించుటలో లాఘవము గల దని తోఁచుచున్నది. గణమందలియాయయిశబ్దము లెల్లను వివరణము స్పష్టముచేయును. (పడు మొద లగుననుక్తములకును సంగ్రహణావకాశము గల్గును. (బా.స.)

'గుఱించి'వలెనే యీచేసియు వ్యవహిత మగుట కలదు. దానన చేసి (సూత్ర. 2).

## తోడకు - మెయి, మై

### 18. జడపదంబుమీఁదితోడకు మెయి మైలు విభాష నగు.

జడవాచకము లైనశబ్దపల్లవములకుఁ బైనున్న తోడ అనుతృతీయావిభక్తికి మెయి, మై అనునవి వికల్పముగా నగు నని యర్థము. ఇవి యనేకాల్లు లగుటచేఁ దోడకు మొత్తమునకు నాదేశముగా వచ్చును.

'అధికధీయుక్తిమెయిన్-ధీయుక్తితో మొ. తోడ అనుతృతీయాప్రత్యయమునకు మాత్రమే యిట నీయాదేశములు వచ్చుటచేఁ 'దృతీయాదులకు నుగాగమం బగు' ననుసూత్రముచే నంతమున ద్రుతము చేరె నని తలంపవలయు' (తత్త్వ. 81) ననుట

యుక్తమే. కాని సూత్రకర్త 'అన్యే ద్రుతప్రకృతయః' అనుచింతామణిలక్షణముచే నవు నని తలంచె నేమో. (శబ్ద.60)

తోడకు మాత్రమే యీయాదేశములు చెప్పుటంజేసి యివి చేతవిభక్తికి రావు. రాముచేతఁ జచ్చె ననుచో రామునిమెయి(మై)ఁ జచ్చె ననురీతి గాదు. (చూ.బా.స.) తోడకుఁ గూడ నెల్లయర్థములయం దీయాదేశము లుండవు. పైరెండుప్రయోగము లందును దోడప్రత్యయము సహార్థమున వచ్చినది. కోలతోడఁ గూలనేసె, సైన్యముతోడ వచ్చె– ఇట్టిచోట్ల నీయాదేశము గలుగదు. కావున సూత్రమునందుఁ 'గొన్నియెడల' నని కాని, 'కానంబడియెడి' నని కాని చెప్పుట యుచితము.(44) చూ.బా.స.

కు.పం. 'చేతార్థమునం జేసియు, కొఱక్వర్థమునం బొంటెకోసములును, తోడార్థమున మెయిమైలును ప్రయోగంబులం గాననగుచున్నవి. వీనం జేసిపొంటెల ప్రౌఢకారుఁడు కారకపరిచ్ఛేదమునం జెప్పుచున్నాఁడు. చెప్పక విడిచినది కోసమును. అది మహదమహద్వాచకములందు సహితము (సహితశబ్దముచే నిం కేది గ్రహింప వలెనో) గన్పట్టెడి' నని పేర్కొన్నది.

ఇందు కొఱక్వర్థమున పొంటె అనురీతిగాఁ జేతవిభక్త్యర్థమునఁ జేసి వచ్చుట లేదు. చేతవిభక్త్యర్థకవర్ణకములకే చేసి యనుప్రయుక్త మగుచున్నది. కాని తద్విభక్తి స్థానమునఁ గాదు గదా. ధర్మతనూభవువలనఁజేసి యనుచో వలనవర్ణకముపైని గూడఁ జేరుచున్నది.

కోస మనున దొక్కటె ప్రౌఢవ్యాకర్త చెప్పక విడిచె నని తలంచుటకును వీలు లేదు. చతుర్థియందు కోసరము, పంచమ్యర్థమున వల్ల, కన్నలును, సప్తమ్యర్థమున లోన మున్నగునవి చెప్పవలసియేయున్నవి.

మయి యనున దీయర్థమునఁ గల దని వఝులవారు తలఁచుట పొరపాటు. (వ్యా.సం.స.449) (చూ.బా.స.) ఈయంశము బాల.కుఁ బూరక మనఁదగియున్నది.

తత్త్వ. 'బాలవ్యాకర్త వీని నెచ్చటను జెప్పలేదు. మెయిమైలు ప్రత్యేకపదములే యనియు నర్థిమెయిన్ మున్నగునవి తృతీయార్థకద్వితీయాంతము లయిన సమస్తపదము లనియు నాతనియాశయ మని యూహింపనగు' (81) నన్నది. ఈయూహకుఁ గారణ మీయంశము నాతఁడు చెప్పకుంటయే యనుట వ్యాఖ్యలో స్పష్టము. కాని సూరి చెప్పనిలక్షణము లింకను బెక్కు లున్నవి. అది య ట్లుండ

సమాసమునం దున్న మెయి, మై యనుశబ్దములయర్థ మేమి? మెయి మై పదములయేయర్థ మిట సమాసమున సరిపడుచున్నదో వివరించియుండవలసినది. కాని తత్త్వ. దీనియర్థము విషయమై ప్రస్తావింపనే లేదు. సూరిమత మిది యని నిశ్చయించుటకంటె పొంటె ననుమున్నగువానివలె నీయంశమును బాలవ్యాకరణశేష విషయ మని యెంచుటయె యుక్తము గదా.

## తోడ ప్రత్యేకప్రయోగము

**6. ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేకప్రయోగంబునుం జూపట్టెడి.**

తోడ ననునది తృతీయావిభక్తి. ఇది యపదము. అపద మవుటచే స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడుటకు వీలులేదు. ఈవిభక్తి యిట్లే ప్రకృతి నాశ్రయించియే ప్రయోగింపఁబడుట గల దని సూత్రకర్త యభిప్రాయము. 'తోడ మాటాడక' యని లక్ష్యము.

సుగమ. 'సాధారణముగఁ బ్రత్యయము లన్నియుఁ బ్రకృతితోఁ గూడియె ప్రయోగింపఁబడును. కాని ప్రత్యేకముగా ప్రయోగించుట లేదు' (128) అన్నది. సాధారణముగా ననుట యనవసరము. ఇవి యపదము లగుటచే స్వతంత్రముగాఁ బ్రయోగింపరాదు గనుక ప్రయోగింపఁబడుట లే దని గుర్తింపఁదగును. (వాక్య. 2)

తత్త్వ. 'అందు అనునది ప్రత్యయముగాను వేఱుగాను కూడ ప్రయోగింపబడును. అట్లే యిదియు వేఱుగా కూడ ప్రయోగింపబడుచున్న (310) దని పేర్కొన్నది. (సుగమ. 128) అందువలెనే తోడ అనుటలో స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడు నందుశబ్దమును సప్తమీవిభక్తిగానే వ్యాఖ్య యభిప్రాయపడిన ట్లర్థ మగుచున్నది. అది సరి కాదు. స్వతంత్రముగాఁ బ్రయుక్త మగు అందు శబ్దము సప్తమీప్రత్యయము గాదు. అందువలననే అందుకు, అందులకు, అందువలన నిత్యాదిగా నయ్యది విభక్త్యంతము నవుచున్నది. (తత్త్వ. 210) ఇందు, ఎందు అనువానివలె అందు అనునది ప్రత్యేక మైనపదముగాఁ గల దని యంగీకరింపవలసియున్నది.

అందు అనునది ద్రుతాంత మైనయవ్యయ మని (అవ్యయ మనుట విలక్షణము)– అచ్చోట నని యర్థము చెప్పి ప్రత్యయము గూడ నగు నని శ.ర. వేఱుగాఁ బేర్కొన్నది. ఇట్లే ఇందు, ఎందు శ.ర. ద్రుతాంతావ్యయములుగాఁ జెప్పుట గమనింపఁదగును.

కాఁగా స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడు అందు అనునది ద్రుతాంత మైన (అవ్యయము గాకున్నను) ప్రత్యేకపదమే కాని సప్తమీప్రత్యయము గాదు. సుగమ. పొందు అనునర్థమునందు నిదియే (సప్తమియే) యని చెప్పుట యింకను బ్రమాదము. అది ధాతువు. అందెను ఇత్యాదిరూపము లుండును గదా.

కాని తత్త్వ. 'అందు అనునది వే ఱొకప్రాతిపదిక మగుటయు 'తోడ' అనునది ధాతురూప మగుటయు భేదమునకుఁ గారణము గానోపును. తోడియల్లుఁడు, తోడికోడలు మున్నగుచోట్ల నియ్యది యౌపవిభక్తికముగాఁ గానవచ్చుచున్నది. తెనుఁ గునఁ జాలప్రత్యయములు ఇట్లు ప్రత్యేకప్రయోగములందు కానవచ్చుచుండు' (210) నన్నది. అట్టియెడలఁ దోడప్రత్యయస్వతంత్రప్రయోగసందర్భమునఁ బైవివరణము నకుఁ బ్రసక్తి యేల?

ఇంక తోడ ధాతురూప మనుట యెట్లో యర్థము గాకున్నది. తోడు అనుధాతు వీయర్థమునఁ గానరాదు. తోడకోడ లనుచో నౌపవిభక్తిక మవుట గల దని గుర్తించియు నీయది ధాతురూప మనుట యుచితము గాదు. తెనుఁగునఁ జాలప్రత్యయము లిట్లు స్వతంత్రప్రయోగార్హములే యనుటలో స్వతంత్ర మగు అందు కూడ సప్తమీప్రత్యయమే యని తలఁచినట్లు తోఁచును. అంతే కాక తోడియల్లుఁ డు, అనుచోటిది కూడఁ దృతీయాప్రత్యయమే స్వతంత్రముగాఁ బ్రయుక్త మయిన దని యెంచె నేమో.

తోడు– విణ. సహాయము. అని సహాయార్థమున విశేషణ మైనపద మొకటి ప్రత్యేకముగాఁ గల దని శ.ర. స్పష్టము చేసినది. తోడియల్లుఁడు, తోడికోడ లిత్యాదులలోనిది యీతోడుశబ్దమే కాని, తోడన్ అను ప్రత్యయము గాదు. తోడు శబ్ద మౌపవిభక్తికము. అదియే సప్తమ్యేకవచనమున 'తోడన్' అని యగును. కాని యీతోడుశబ్దమున కన్నివిభక్తులలో రూపములు గానరావు.

తోడప్రత్యయము స్వతంత్రప్రయోగమునుగూర్చి సుబో. 'కూర్చి, తోడ, వలన మున్నగుప్రత్యయములు కూర్చు, తోడు, వలను మున్నగువానినుండి యేర్పడినరూపము లనియు భాషాతత్త్వశాస్త్రజ్ఞులయభిప్రాయము ననుసరించి తోడ మున్నగువానికి ప్రత్యేకప్రయోగార్హత కల దన్నది. (151) కాని భాషాతత్త్వశాస్త్రజ్ఞుల సంప్రదాయము వేఱు. వైయాకరణులసంప్రదాయములు వేఱు. శబ్దశాస్త్రము వీనిని బ్రత్యయమునుగా నిర్ణయించియుండుటవలన వైయాకరణసంప్రదాయమున వీనికి

స్వతంత్రప్రయోగార్హత యుండనేరదు. అట్టిప్రయోగము లున్నయెడల నవ్వానిని మార్గాంతరమున సాధించుకొనవలయునే కాని సంప్రదాయవిరుద్ధముగాఁ బ్రత్యయమునకు (అపదమునకు) స్వతంత్రప్రయోగార్హత నిర్ణయించుట వ్యాకరణ శాస్త్రమున యుక్తము గాదు.

ఘం. 'ప్రత్యేకప్రయోగము గలదానిని ప్రత్యయ మనుట సరి కాదు. అందు, లోపల, లోన్ (లోను) అనువానిలోవలెనే తోడ విభక్త్యర్థాభిధాయకశబ్ద మనుట యుక్త' (124) మని పేర్కొన్నది. 'కేచి త్తు వైకృతా శ్శబ్దాః' అని వి.వి. విభక్త్యర్థాభిధాయక శబ్దములను బ్రస్తావించినది. కోసము, వల్ల, కన్న, ఇత్యాదు లగునీవిభక్త్యర్థాభిధాయక శబ్దము లేవియును స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడుట లేదు. అట్టియెడల తోడ, విభక్త్యర్థాభిధాయక మనుటవలన స్వతంత్రప్రయోగార్హత యెట్లు సిద్ధించును?

అసలు విభక్త్యర్థాభిధాయకశబ్ద మనుదాని నీవ్యాఖ్య సరిగా గుర్తింపలే దేమో యనిపించెడు. వే యేల? తోడఁ బలుకుదు శివ. 112 సూ. ని. కానఁ దోడశబ్దము విభక్త్యర్థాభిధాయకము. కేచి త్తు వైకృతా శ్శబ్దాః విభక్త్యర్థాభిధాయకాః. వి.వి. కాఁ గా తోడన్ అనుదానికి అందున్ లోనగువానివలెఁ బ్రత్యేకప్రయోగము గ్రాహ్యము. (317) అనుటలో విభక్తులయాకృతితో నుండి విభక్త్యర్థముతో స్వతంత్రముగాఁ బ్రయుక్త మగు నవి విభక్త్యర్థాభిధాయకశబ్దము లని యీవ్యాఖ్య తలంచినట్లు తోఁ చుచున్నది. కాని యది సరి కాదు.

విరించి గుఱించి తపంబు సేసెన్ ఇత్యాదౌ విభక్త్యర్థాభిధాయకో వైకృతశబ్ద ఇతి జ్ఞేయమ్. (కవిశి. 367) కోసము ఇతి చతుర్థ్యర్థాభిధాయకో దేశ్యశబ్దః (కవిశి. 373) దీనింబట్టి చూడఁగా విభక్తిప్రత్యయములుగాఁ బరిగణింపఁబడకయే యాయయి విభక్త్యర్థములందుఁ బ్రయోగింపఁబడు విభక్తిభిన్నము లగుశబ్దములు విభక్త్యర్థాభిధాయకము లని స్పష్ట మగుచున్నది. అయ్యవి విభక్తిప్రత్యయములు గామి నటఁ బ్రయోగించుటకు వీలు లేదు. కావునఁ బ్రయోగములందు విభక్తులకు మాఱుగా విభక్త్యర్థమునఁ గన్పించుశబ్దములను విభక్త్యర్థాభిధాయకము లని నిర్ణయింపఁదగును.

అట్లు గాక విభక్త్యర్థముతో స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడుశబ్దమే విభక్త్యర్థాభిధాయక మన్నచో నహో. చూపిన కోసము, గుఱించి యనువానిని

విభక్త్యర్థాభిధాయకము లగుట యెట్లు? ఇవి స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడుట యెచ్చట నున్నది?

అట్లు గాక విభక్త్యర్థాభిధాయకశబ్దము లాయావిభక్తులకు మాఱుగా నాయా విభక్త్యర్థమునఁ బ్రయోగింపఁబడుట గల దనియే చెప్పి 'కోసము ఇత్యాదు లిట్టి' వన్న వీనికి స్వతంత్ర మైనప్రయోగమే లేదు గదా.

తనతోడ ననుచోఁ దోడవిభక్తియు, తోడ మాటాడ కునికి యనుచోఁ దోడ విభక్త్యర్థాభిధాయక మనియు ఘం. తలఁచినదా? లేక పైనట్లుగా విభక్త్యర్థాభిధాయక శబ్దములు విభక్తికి మాఱుగాఁ బ్రయోగింపఁబడు నని తలఁచుచో నీతోడ విషయము ప్రస్తావింపనే యక్కఱ లేదు. ఏల యనఁ దోడ తృతీయావిభక్తిగా నంగీకృతమే కదా. ఇంక నట్లు గాక తోడ అనువిభక్తి యొకటియు విభక్త్యర్థాభిధాయకశబ్ద మిం కొకటియుఁ గలవా? అయిన విభక్తులు పరిగణింపఁబడినవో యవి యాయర్థము నందు స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడినపుడు విభక్త్యర్థాభిధాయకశబ్దము లగు నని చెప్పవలసియుండును. అట్టియెడల నింతకు ముందు భావించినట్లుగా నహో. పేర్కొన్న గుఱించి ప్రభృతులు విభక్త్యర్థాభిధాయకములు గాకుండఁ బోవును.

ఇంక ఘం. అందు ననునది సైతము విభక్త్యర్థాభిధాయకశబ్ద మన్నది. రామునందు నన్నపు డయ్యది సప్తమీవిభక్తియే. విభక్తిగాఁ బరిగణింపఁబడియున్నది గావున నద్దానిని విభక్త్యర్థాభిధాయకశబ్ద మన నక్కఱ లేదు. ఇంక నందున్నవారు అనురీతిస్థలములయందలి 'యందు' విభక్త్యర్థాభిధాయక మనవలెను. కేచి త్తు వైకృతా శ్శబ్దాః' అనువి.వి. ననుసరించి తోడ (మాటాడ కునికి) ననునది విభక్త్యర్థాభిధాయశబ్ద మై, విభక్తికి భిన్న మై, స్వతంత్రప్రయోగార్హము నగు చున్న దన్నమాట. అట్టియెడల వి.వి.కర్త 'సాశ్ర యానాశ్ర యాపి స్యాత్ త త్రార్థగతసప్తమీ' యని ప్రత్యేకముగా నిరాశ్రయ మగుటను గూర్చి యేల పేర్కొనెను? తోడ ప్రభృతు లట్టి వుండఁగా 'అందు'నే నిరాశ్రయ మగుటను జెప్పు టేల?

కాఁగా అందు అనునది విభక్త్యర్థాభిధాయకశబ్ద మనుట యుచితము గానేరదు.

ఘం. లోను లోపల అనువానిం గూడ విభక్త్యర్థాభిధాయకశబ్దము లన్నది. లోపల విశేష్యము. లోపల వెలుపల వెలుపల లోపల అని శ.ర. లోను దేశ్య విశేష్యము. 'ఆలోను'లో విశేష్యము. అని యీయవి పృథక్పదములుగా సూత్రకర్తయే

శ.ర.లో నిరూపించెను. తోడ ననునది యిట్టిదే యైనపుడు సూత్రకర్త తోడ నను నొక్కదానినే యేల సూత్రించెను? లోపల అనువానిం గూడఁ జూపవలెను గదా.

లోపల, లో(ను) అనుదానిని విభక్త్యర్థాభిధాయకము లనవలయు నన్న నయ్యవి యేవిభక్తియర్థము దెలుపును? లోపల షష్ఠీవిభక్తిగాఁ బరిగణింపఁబడియున్నది. అది నిర్ధారణార్థమునం దగుచున్నది. స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడు లోపల కిట్టియర్థము గలదా? లోపల ననునది యధికరణార్థమునందుఁ గలమాట నిజమే యైనను నిర్ధారణార్థమందలి లోపల, విభక్త్యర్థక మైన లోపలయు, విభక్త్యర్థాభిధాయక శబ్ద మధికరణార్థమునం దగు ననుట యెట్లు?

అందు విభక్త్యర్థక మైనది లోపల శబ్ద మనవలయునా? షష్ఠీప్రత్యయ మగు లోపల యనునది యధికరణార్థమునం దయ్యె నని గుర్తించుట యుక్త మని తోఁచుచున్నది. దీనినుండి 'లో' ఎట్లును సిద్ధించును? ఈయంశమును బ్రౌఢవ్యాఖ్యయును బేర్కొనలేదు.

కావున విభక్త్యర్థాభిధాయకశబ్ద మనురీతిసమన్వయము సరికాదు. విభక్త్యర్థాభిధాయకశబ్దము లనువానిని బ్రౌఢవ్యాకర్తయును బేర్కొనలేదు. ఇంక సూత్రకర్తయును ఘం.వలెనే భావించియున్నచో తోడను మాత్రమే చెప్పుట గుదురనేర దని గుర్తించితిమి గదా. అందుప్రభృతులను గూడఁ జెప్పవలసియే యుండును.

ఇంక నిది యెట్లు సమన్వయింపఁగు ననఁగా కు.పం. 'ఇచ్చట తోడ తృతీయాప్రత్యయము కా దనియు వెంటనే యనునర్థము గలపద మనియు నేల తలంపరాదు? (89) అన్నది. ఇది ప్రకరణోచితము గా దనియు సహార్థమె యుక్త మనియు ఘం.(317) తిరస్కరించుట యుచితముగా నున్నది.

సర్వ. ఇచ్చట దీనిని బ్రత్యయముగా భావించుటకంటె 'శబ్దముగా నెంచుట యోగ్యతరముగా నుండును. తోడు అనుశబ్దముయొక్క సప్తమ్యంతరూపముగాఁ గాని, తృతీయాంతరూపముగాఁ గాని తోడన్ అనునది యేర్పడినది. ప్రత్యయ మైన తోడన్ అనునది కూడ అట్లేర్పడినదే(47) యన్నది. తోడు అనుదానికిఁ దృతీయాసప్తము లం దత్వము చేసిన సహాయమునందు ననియో సహాయముతో ననియో యర్థము గావలెను. అట్టితృతీయాసప్తమ్యర్థము లిట సముచితముగా సమన్వయింపఁబడవు.

ఇట్టిసమన్వయములే యనవసర మని నిర్ణయింపఁదగును. శ.ర.లో నీసూత్రకర్త

తోడ కూడ ద్రుతాంత మైనయవ్యయ మని చెప్పెను. ఎట వోయెం దోడ దానేసి (372). తో కూడ ద్రుతాంత మైనయవ్యయము. వాక్యములఁ దోఁ దనుఁ జుట్టి (చర. 371) అని తోడ, తో అనువానిని ద్రుతాంతము లైనయవ్యయములుగాఁ బేర్కొనెను. దానికి సహార్థము గల్గుటకు భారతమునుండియే ప్రమాణమును జూపెను. తృతీయ సప్తమ్యర్థక మైనయత్వముతో నైనచో నవ్యయ మగు టొప్పదు. (శ.ర.) కూడ సహితము (189) కాఁగా తోడ మాటాడ కునికి యనుచోఁ గూడ నాయవ్యయ మనుప్రయుక్త మైన దనియే గ్రహింపనగును. వ్యాకర్త తోడుత ననుదానిని సయిత మిట్లే యవ్యయముగాఁ జెప్పియు మఱలఁ దోడకు రూపాంతర మనెను.

కాఁగాఁ దృతీయార్థకముగాఁ బ్రత్యయమే స్వతంత్రముగాఁ బ్రయోగింపఁ బడిన దని చెప్ప నక్కఱ లేదు. ప్రకరణానుగుణముగాఁ దనతోడ ననున్వయ మెట్లును గుదురును.

## తోడ వ్యవహితత్వము

**7. కొన్నియెడల నుశబ్దప్రయోగమునం దోడకు లోపంబును వ్యవహితత్వంబును బహుత్వంబునం గానంబడియెడి.**

బహువచనమునం దున్న తోడ స్థలమున సముచ్చయాద్యర్థక మయిననుశబ్దము ప్రయోగించునపుడు 'తోడ' ప్రత్యయము లోపించుటయు ఆ'ను'శబ్దముతో వ్యవధానము గల్గుటయుఁ గల దని సూత్రమునర్థము.

అఖిలబాంధవులయు బ్రాహ్మణులయుఁ దోడ. అనుచో మొదటిదానియందుఁ దోడ లోపించుటయు రెండవదానియందు నుశబ్దముతో వ్యవధానముతోఁ బ్రయోగింపఁబడుటయు సంభవించినది.

ఇటఁ దత్త్వ. కొన్నియెడల నని చెప్పుటచే నాకార్యములు వైకల్పికములు అనునర్థము లభించుచున్నది. ఇందు వికల్ప మని చెప్పకపోయినచో సూత్రపూర్వ వాక్యము విధించుచున్న'తోడ'లోపము నిత్యము గావలసివచ్చును. అట్లే యయినచో బ్రాహ్మణులయుఁ దోడ ననునది యసాధు వనవలసివచ్చును. అట్లే వ్యవధానము గూడ వైకల్పికమే. కా దేని శస్త్రవరూధమ్ములతోడను అనునది సిద్ధింప (211) దన్నది. (సుగమ. 29)

'కొన్నియెడలఁ గానంబడియెడి' ననుటచే నిట్టివి ప్రయోగదృష్టములు గ్రాహ్యము లనియుఁ బ్రయోగములం దిట్టిది కొన్నియెడలనే కానవచ్చుట ననుసరించి యీవిధి క్వాచిత్కతచే నిక్కార్యములు లేకుండుటయే తఱు చని స్పష్ట మవుచున్నది. కావునఁ గొన్నియెడల ననుదానిచే వైకల్పిక మని యర్థము చేయుట సరి కాదు.

సర్వ. కూడఁ గొన్నియెడల ననునది వైకల్పికముగా విధించునది యని చెప్పుట (50) యుక్తముగా లేదు.

ఇంక సర్వ. పరశబ్దముమీఁదితోడకు లోపము రా దనువిషయము గుర్తించుట (50) యుక్తముగా నున్నది. అని దీనిని సమన్వయించుచుఁ దత్త్వ. బాంధవులతోడన్ +ను. తోడకు లోపము వచ్చి, నుశబ్దము యువర్ణపూర్వకము గాఁగా బాంధవుల+ ను+తోడ. 'బాంధవులయును' అని యగును. కాఁగా బాంధవుల+ను+తోడ నని యుండఁగా నీతోడకు లోపము వచ్చె నన్నను బాంధవులయును నని యగును. కాని యిట్లు ముశబ్దమును తోడకుఁ బూర్వమునఁ జేర్చి తరువాత తోడకు లోపమును జెప్పుటయే యుచిత మగుప్రక్రియగాఁ దెలిసికొనఁదగినది' యని చెప్పఁదగినది.

కాని యీసమన్వయముచేత 'బాంధవులయుఁ దోడ' ననురూప మె ట్లయినదో యీవ్యాఖ్య వివరింపలేదు. తోడపయి నుశబ్దమును జేర్చినఁ దోడ లోపించినఁ గాని యది లడాగమమందలియత్తునకుఁ బరముగా నుండదు. కావున నుశబ్దము యువర్ణపూర్వకము గానేరదు. అట్లు లోపింపఁజేయఁగా 'బాంధవులయును' అని యగును. దానిపై మఱల తోడప్రత్యయ మగు టెట్లు? కాఁగాఁ దత్త్వ. చూపిన సమన్వయము తోడ లోపించినస్థలములందుఁ గుదురునే కాని తోడ లోపింపని చివరితృతీయాంతముసందర్భమునఁ గుదురనేరదు.

సర్వ. 'తృతీయాంతములందలిపూర్వశబ్దము మీఁదఁ గాని యన్నింటిమీఁదఁ గాని సముచ్చయార్థక మైన ఉ వర్ణము రావచ్చును. అట్లు ఉవర్ణము వచ్చినపిమ్మటఁ బూర్వశబ్దములయందలితోడకు లోపము వికల్పముగా రావచ్చును. చిట్టచివరితోడకు మాత్ర మెన్నడు లోపము రా' (49) దన్నది. అన్నిటఁ బూర్వశబ్దముమీఁదఁ గాని యన్నింటికిఁ గాని మీఁద సముచ్చయాద్యర్థ మగు నని యిటఁ జెప్పరాదు. నుశబ్దము ప్రయుక్త మగునపుడే యీకార్య మగు నని సూత్రము చెప్పుట గమనింపవలసి యున్నది.

సముచ్చయార్థకము ఉ వర్ణ మనుటయు సరి కాదు. సూత్రకర్త నుశబ్ద మనుట

యుచితమే. అది సరి కా దని సర్వ. ప్రౌఢవ్యాకరణకారుఁడు నువర్ణమును మాత్రమే సముచ్చయార్థకముగా గ్రహించెను. అది యట్లే యైనచో రాఁబోవు బాంధవులయు మున్నగుప్రయోగముల కవకాశము లే (49) దనుట సమంజసము గాదు. సూత్రకర్త శబ్ద. 116 సూత్రమున నుశబ్దమే యని చెప్పెను. నుశబ్దమే యనుదంతములపయి యువర్ణపూర్వకముగా నగును. కావున 'బాంధవులయు' నని యగుట నిర్బాధము. ఉవర్ణ మన్నపుడే 'లేకను' ననురీతిస్థలములలో ఉవర్ణముపై నుగాగమ మవుటయు, ఉవర్ణము లోపించుటయు నన్నవి ప్రమాణరహితము లగుచున్నవి. కావున నిట నుశబ్ద మనుట యెంతయు సమంజసము.

ఇంతకును బాంధవులయుఁ దోడ ననుచో సమన్వయ మెట్లు? అనఁగా సర్వ. 'అది చెప్పమి సూత్రకర్తలోపమే యని సూచించుచుఁ బూర్వశబ్దముమీఁదితోడవర్ణకము నకు మాత్రమే లోపమును పరిమిత మొనర్చుటలోఁ గాక యన్నిచోట్లను లోపింపఁ జేసి చివరిశబ్దముపైఁ దిరిగి విధించుట అవశ్యకర్తవ్య' (50) మన్నది. పూర్వశబ్దము మీఁదితోడ మాత్రమే లోపించు నని చెప్పినను బాంధవులయుఁ దోడ ననుచివరి లక్ష్యము నెట్లు సాధింపవలయు నన్నది ప్రశ్నమే. అన్నిచోట్లను లోపింపఁజేసి చివరిదానిపై మఱల విధించుట గౌరవమే కాని ప్రయోజనము లేదు.

ఇట సూత్రకర్తయభిప్రాయ మేది? 'బాంధవులతోడను బ్రహ్మణులతోడను' ననుచో నుశబ్దప్రయోగమునన్ - నుశబ్దమును జేయునపుడు అనఁగా నుశబ్దమును జేర్పకముందే తోడలోపము చేయుదము. మొదటిదానియందుఁ దోడ లోపింపఁ గా 'బాంధవుల' అని యుండఁగా నిపు డనుదంతము గావున నుశబ్దము యువర్ణ పూర్వక మై రాఁగా, 'బాంధవులయును' అని యగు. 'బ్రాహ్మణులతోడను'- నుశబ్దమును బ్రయోగించునపుడు దానితో ననఁగా నుశబ్దముతోఁ దోడకు వ్యవధానము గల్గు ననెను. కావున లడాగమముపై 'యును' జేరఁగా 'బ్రాహ్మణులయుఁ దోడను' అని యగును. అని సూత్రకర్త భావించియుండవచ్చును.

అ ట్లయినను జివరిదానియందుఁ దోడ లోపింప దనువిషయము స్పష్టముగా లేదు. వ్యవహితత్వవిధానముచేత తోడ లోపింప దని గ్రహింపనగును. కాని యది తృతీయాంతములలోఁ జివరిదానియందే యని స్పష్ట మగుట యెట్లు? కావున నీవిధానము సముచితముగాఁ జెప్పఁబడలే దనఁదగియున్నది.

అస లీసూత్ర మవసరమా యని సందేహము.

ఇట 'తోడన్' అనునది తృతీయావిభక్తియే యని భావింపవలసినయవసరము గానరాదు. బాంధవులయొక్క, బ్రాహ్మణులయొక్క తోడన్ అని యుండఁగా యొక్క లోపించి (కార. 16) (శేషషష్ఠియందు యొక్క లోపింపఁగా మిగిలినలాగమాంతబహు వచనముమీఁద నుశబ్దము చేరఁగా బాంధవులయు, బ్రాహ్మణులయు తోడన్ అని యవును. అపుడు బాంధవులయొక్కయు, బ్రాహ్మణులయొక్కయు తోడన్ – కూడ సహితముగా నని యర్థము కుదురుపడుచునే యున్నది గదా.

నుశబ్దప్రయోగము నియతము గాదు. కావున 'శస్త్రవరూథమ్ములతోడను' ననుచో నుశబ్దప్రయోగము లేకుండుటయు సాధ్యమే యగుచున్నది.

ఇట్లు లోపించు నన్న స్థలములోఁ జివరిదానియందు తోడ నిలిచియుండుటయు నీసమన్వయము కనుకూల మయియుండుటను నిరూపింపఁజాలుచున్నది. సమ్మెట కోలల(యొక్క), అంకుశముల(యొక్క), చేరుకోలల(యొక్క) వ్రేటు లనుచో వ్రేటు లనునది యెల్లవానితో నన్వయించుచున్నట్లే యిచట సయితము బాంధవులయు, బ్రాహ్మణులయుఁ దోడ ననుచో బాంధవులతోడ, బ్రాహ్మణులతోడ ననురీతిగా సమన్వయము సరిపడును.

సమ్మెటకోలల అనులక్ష్యమున వివరణమునందుఁ బేర్కొన్నదాని ననుసరించి (కార. 16) నుశబ్దము ప్రయుక్తము గానిస్థలమును సమర్థింపఁబడుచున్నది. దీనివలననే కు.పం. చూపిన 'అధికుల హీనులతోడ' ననుచోటు సయితము అధికుల(యొక్క) హీనుల(యొక్క) తోడ–తోడన్ అనురీతిగా యొక్కలోపముతో సమన్వయింపఁబడుటయే కాక నుశబ్దప్రయోగము లేకుండుటయు సిద్ధ మగుచున్నది. ప్రస్తుతసూత్రము ననుసరించినచో నుశబ్దప్రయోగము లేమిం జేసి యీప్రయోగము సిద్ధింపదు. (తత్త్వ. 211, సర్వ. 51, ఘం. 125)

పైరీతిని యొక్క లోప సమన్వయవిధానము ననుసరించి తోడన్ అనుప్రత్యేక పదముతో నిట్టిలక్ష్యము లెల్ల సమర్థింపఁబడుచుండుటంజేసి యీవిధానము లేకుండుట యుచితమే యనఁదగియున్నది. (చూ. బా. స.)

## తోడుత

**8. ఒకానొకచోఁ దోడకుఁ దోడుత నని రూపాంతరంబును గలదు.**

**అయినను దానికివలె దీని కితరకార్యంబు గలుగదు.**

తోడకు తోడుత ననురూపాంతరము గల దనియు నయినఁ దోడకువలె స్వతంత్రప్రయోగము, లోపము, వ్యవహితత్వము, ననుపూర్వోక్తకార్యము లీరూపాంతర మైన తోడుతకుఁ గల్గ వనియును సూత్రమునర్థము.

ప్రాణముతోడుత ననఁగాఁ బ్రాణముతోడ నని యర్థము.

సర్వ. శబ్దము వ్యస్తప్రయోగార్హతయు, ఉవర్ణవ్యవహితత్వమును గలిగియుండును. ప్రత్యయమున కట్టియవకాశము లేదు. కావున తోడుత అనుదానిని విభక్తిప్రత్యయ మునకు రూపాంతర మని యనుట సమంజసమే(52) యన్నది.

స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడు 'తోడ' విభక్తి కా దని యీవ్యాఖ్య నిరూపించినది. ప్రస్తుతవివరణమునుబట్టి పూర్వసూత్రమునఁ జెప్పినవ్యవహితత్వము గలతోడశబ్దము సయితము ప్రత్యేకపదమే కాని విభక్తి కా దని యిటఁ జెప్పిన ట్లవుచున్నది. కాని ఈవ్యాఖ్య యింతకు ముం దాసూత్రమునొద్ద (కార. 7) వర్ణకముగా నే వ్యవహరించుట గానవచ్చును.

ఏది యే మైనను తోడుత ననుదానికి భిన్నప్రయోగాదులు లేమి విభక్తిరూపాంతర మనుట యుక్తమే యనియు నంగీకరింతము. కాఁగా నాపిదప నయినను 'దానికివలె దీని కితరకార్యంబు గలుగ' దను సూత్రోత్తరార్ధ మనవసర మని సూచించుట(52) యుక్తముగా నున్నది.

అయినను దీనిని బ్రత్యయమునకు రూపాంతరముగా నంగీకరింపవలసిన యవసర మున్నదా? ఈసూత్రకర్తయే శ.ర.లో తోడు దే. ద్ర. ద్రుతాంతావ్యయము తోడ. అని పేర్కొనె. అనఁగా – తోడ, తో ననువానివలెనే యిదియు నొకయవ్యయ పదము. అపద మని చెప్పియుండలేదు గదా. శ.ర. 'అడఁకువతోడ నునికి' అని యవ్యయ మనుటకు శ.ర. చూపినయుదాహృతినే చూపి, సూ.ని. తృతీయావిభక్తి ప్రత్యయ (43) మన్నది. ఇది తృతీయాప్రత్యయ మనుటకు సూ. నిఘంటువునకుఁ బ్రౌఢ. ఆధార మని గ్రహింపవచ్చును. తోడ ననునవ్యయమునకే రూపాంతరముగాఁ

దోడుత ననుదానిని బేర్కొన్నచో స్వతంత్రప్రయోగ ముండవలసియుండును. అట్టి దింకను బ్రయోగములందు వెదుకవలసియున్నది. 'తోడుతన్' అనునది ప్రత్యేక మగునవ్యయపదముగా నంగీకరించినది శ.ర. అడఁకువతోడుత ననుదానివంటిదే కదా ప్రాణముతోడుత ననునది సైతము. అట్టియెడల నిట తోడ రూపాంతర మని, యవ్యయ మనుతనయభిప్రాయమును సూత్రకర్త సవరించుకొనెనా? లేక తోడుతన్ అనునది యవ్యయపదముగా నంగీకరించియుఁ దోడ ప్రత్యయమే స్వతంత్రముగాఁ బ్రయుక్త మైన దని తలఁచినట్లు పొరపడిచెప్పెనా? యనుమానము.

అత్తోడుతన్, పరాగపూగములదోడ్తన్ అనుచో స్వతంత్రముగాఁ బ్రయుక్త మగు తోడుతశబ్దమునకు వెంబడి యని యర్థము (సూ.ని.). అవ్యయమే తోడార్థక మైన దన్న – ప్రాణముయొక్క తోడుతన్ అనురీతిగా యొక్కతో సమన్వయము సరిపడును. అపు డీసూత్రము చెప్ప నక్కఱ లేదు.

కాని స్వతంత్రముగాఁ దోడుత ననుదానికిఁ బ్రయోగము గన్పించునపుడే యీసమన్వయము కుదురును. దీని కితరకార్యము లే దన్నసూత్రకర్త లక్షణము ననుసరించి యది స్వతంత్రముగాఁ బ్రయుక్త మవుట లే దని గుర్తింపవచ్చు నన్నచోఁ దోడకు రూపాంతర మనుట యుక్తమే యనఁదగు. 'తోడుత నితి విభక్త్యర్థాభిధాయక శ్శబ్దః' అని యహో. విభక్త్యర్థాభిధాయకశబ్ద మనెను. ఈయది స్వతంత్రప్రయుక్తము గాని, తోడవిభక్త్యర్థకశబ్ద మని స్పష్టము చేయుచున్నది. వైకృత మను వి.వి. లక్షణ మాచ్ఛికపర్యాయ మని గ్రహించి యాదేశ్యశబ్దము నట సంగ్రహింపఁదగును. కాఁగా సర్వ. ఊహించినట్లుగా నయినను దానికివలె ననుమొద లగుసూత్రార్థము మాత్రము చెప్పవలసినయవసరము లేదు. తోడన్ అనునర్థమునఁ దోడుత ననునది యవ్యయముగాఁ గల దని చెప్పవలసిన (శ.ర.) యవసర ముండ దని గ్రహింపఁ దగును.

## పొంటె

**9. చతుర్థికిం బొంటెవర్ణకంబు నగు.**

చతుర్థిలో 'పొంటె' ననునదియు నగు నని యీసూత్రము చెప్పుచున్నది.

ఈసూత్రము బాల.ను సవరించుచున్న దని సుబోధిని(153) పేర్కొన్నది. కాని

యది యుచితము గాదు. పొంటె రా దని చెప్పలేదు గదా సూరి. కాని వచ్చు ననియుఁ జెప్పలేదు. కావున నీయది బాల.కుఁ బూరక మనుట (సర్వ. 54) యుక్తము. చింతామణికిఁ బూరకముగా సూత్రకర్త తలఁచియుండనగు.

కయి పట్టి యొక్కలకు భిన్నము గావునఁ దృతీయాదులకు విధింపఁబడిన నుగాగమము దీనికి నై, యిది ద్రుతాంత మవు నని బాల. అనుగుణముగా నూహింపవచ్చును. చింతామణి ననుసరించిన 'అన్యే ద్రుతప్రకృతయః' అనునదే సాధక మగును. నన్నును, అనుచో ద్వితీయయందలినువర్ణ మాగమ మని సూత్రకర్త పేర్కొనుట స్మరింపఁదగును.

'కార్యసంప్రయోగముపొంటెన్' – సంప్రయోగము'కొఱ' కని యర్థము. 'వర్ణకంబును' అనుచోటి'ను'శబ్దముచేఁ గొఱకు, కయి యనునవి సంగ్రహించుట యుద్దేశముగా గ్రహింపఁదగును.

కాని, యీలక్షణము సమగ్రమా యని యనుమానము. పొంటె ననునది చతుర్థీ విభక్తి యని చెప్పుటయే యిందుఁ బరమార్థముగా గోచరించుచున్నది. కాని యది యేయర్థమునందు వచ్చునో చెప్పఁబడలేదు.

'సంప్రదానంబునకుం జతుర్థి యగు' ననుటచేఁ ద్యాగోద్దేశ్యమునకుఁ జతుర్థీ ప్రత్యయము లెల్లను గావలసియున్నది. అనఁగా కొఱకు కయి యనునవి రెండును వచ్చును. ఉద్దేశ్యమాత్రమున కగుచోట సయిత మీప్రత్యయములును వచ్చును. పొంటెను గూడఁ జతుర్థి యని సామాన్యముగాఁ జెప్పుటచేఁ గొఱకు, కయి ప్రత్యయములు వచ్చుపైస్థలములం దెల్ల నీపొంటె గూడఁ బ్రాప్తించుచున్నది. వచ్చు ననియే సర్వ.(54) పేర్కొన్నది. శ.ర. ఇట్లె చెప్పుచున్నది.

కాని యిది త్యాగోద్దేశ్యమునకు నవుట గాన్పింపకున్నది. అనఁగా రాముని కొఱకుఁ గన్య నిచ్చె ననురీతిప్రయోగములు గానరావు. లోకహితంబుపొంటె మున్నగు రీతిగా నుద్దేశ్యమాత్రమునకు మాత్రమే యగుట ప్రయోగదృష్ట మగుచున్నది.

కావున 'నుద్దేశ్యమాత్రమునం జతుర్థికిం బొంటెవర్ణకంబు నగు' ననురీతిగాఁ జెప్పినలక్షణము సమగ్రముగా నుండెడి దని తోఁచుచున్నది. మహద్వాచకములపయి పొంటె ప్రయోగము వెదుకవలసియున్నది.

శ.ర.లో దీనిని సూత్రకర్త ద్రుతాంత మైనయవ్యయ మని చెప్పెను. కొఱకు

అపద మన్నట్లుగా దీనిని సయిత మపదముగాఁ జెప్పుట యుక్తముగా నుండును. 'తోడుత' ననునది యవ్యయముగాఁ జెప్పి, 'తోడ'కు రూపాంతర మనుటయు, 'తోడ' అవ్యయ మని చెప్పి 'తోడ' విభక్తి స్వతంత్రప్రయోగార్హ మనుటయు నీలక్షణకర్త వాక్యములందుఁ గానవచ్చును.

తత్త్వ. 'చతుర్థీప్రత్యయ మగు కొఱకు అనుదానిస్థానమున పొంటె అనునది వికల్పముగా వచ్చు నని' (213) సూత్రముభావముగాఁ బేర్కొన్నది. సుగమ. దీని ననుసరించినది (130). కొఱకున కాదేశము చేయుట ప్రక్రియాగౌరవమే. కాని ప్రయోజనవంతము గాదు. (దీనివలను రామునికొఱకు కన్య నిచ్చెను అనుచోటఁ గూడఁ బొంటె యై రామునిపొంటెఁ గన్య నిచ్చె ననియు నుండఁదగు నని సూచించిన ట్లయినది.)

చతుర్థికి నని షష్ఠ్యంతముగాఁ జెప్పినమాత్రమున ముందుగా నొకచతుర్థీ ప్రత్యయము చేసి, దానికి దీని నాదేశమును జేయ నక్కఱ లేదు. పంచమికి కంటె షష్ఠికి లోపల, షష్ఠికి యొక్క, అనురీతిగా నుద్దేశమాత్రమునఁ జతుర్థి ప్రవర్తింపఁ గా నటఁ బొంటె నగు నని గ్రహింపఁదగును.

సూత్రకర్త యిట్లే తలఁచియున్న తోడకు మెయి మైలు విధించినట్లుగా 'కొఱకునకు పొంటె యగు' నని చెప్పెడివాఁ డని యూహించుట దోషము గాదు.

## వలనకు – న

**10. ఉండిపదంబు పరం బగుచో వలన కందువర్ణక మట్లు నవర్ణకంబు నగు.**

పంచమి యగువలనకు ఉండి పద మనుప్రయుక్త మగు ననియు (బాల.కార.10) నుండి పర మగునపుడు వలనకు ద్వితీయాసప్తము లగు ననియు (ప్రాయికముగా) బాల. స్పష్టము చేసినది. అయినను నట సూరి సప్తమియందు 'అందు' వర్ణక మగుటనే యుదాహరించియుండుటచేత నవర్ణకము వచ్చుట సాధువు గా దని భ్రమింతు రేమో యని యావిధానము చేయఁబడినట్లు కు.పం.(91), సుబో.(154), సర్వ.(61) మున్నగువ్యాఖ్యలు స్పష్టము చేసియున్నవి.

'బ్రహ్మలోకంబుననుండి' యనుచో నవర్ణక మైనది. కాని బాల.చే నట్టిభ్రాంతి గలుగునవకాశము గానరాదు. సప్తమిని విధించుటచేత సప్తమీవిభక్తు లగు

ప్రత్యయము లెన్ని యున్నవో యన్నియును గ్రహింపఁబడునే కదా. 'అధికరణంబునకు సప్తమి యగు' ననుచో నధికరణార్థమున సప్తమి యగు ననఁగా నందు మాత్రమే వచ్చు ననవలెనా? అక్కడ నన్నియు నందు ప్రత్యయ మైనందులకే లక్ష్యములు చూపెను. అయిన 'ఉకారాంతజడంబుసప్తమికి నవర్ణకంబు నగు' ననుతరువాతి సూత్రమున నవర్ణకము ప్రత్యేకముగా విధించుటచేత నుదాహరింప లే దనవచ్చును. అయినను నట సప్తమికి నవర్ణకము వచ్చుటకు ముందు సప్తమి యగుట 'అధికరణంబునకు' ననుసూత్రముచేతనే కదా. కావున నవర్ణకము నుదాహరింపని మాత్రమున నట్టివర్ణక మయినరూపము లసాధువు లనుకొను నవకాశము లేదు.

'సంప్రదానంబునకుం జతుర్థి యగు' ననువిధానము సైత మిట స్మరింపఁ దగియున్నది.

ఇంక 'నందు' నన్నిశబ్దముల కగుట ననుసరించి సూరి యందునే యుదాహరించి యుండవచ్చును. ('డుమువున లేకవచనంబులు' అనుసూత్రమునొద్దఁ గూడ నవర్ణకము నుదాహరింపలేదు.) నవర్ణక ముకారాంతములకు మాత్రమే కదా యవునది. ప్రస్తుతసూత్రస్థలమున నైనను 'అందువర్ణకమట్లు నవర్ణక మగు' ననఁగా నుకారాంతములపైని వలనకే నవర్ణక మగును. కాని అందు వర్ణకము వచ్చునన్ని చోట్లను నవర్ణకము రాదు కదా. ఘటంబున జలం బున్నది యనుచో 'అధికరణంబునకు సప్తమి యగు' ననుసూత్రముచే సప్తమి రాఁగా 'ఉకారాంతజడం' బనుసూత్రముచే నవర్ణక మయి, ఘటంబున నని యగు. అదే తీరుగా నిచ్చటఁ గూడ 'ఉండిశబ్దము పరం బగునపు' డనుసూత్రముచే వలనకు సప్తమి రాఁగా నాసప్తమికి 'ఉకారాంతజడంబుసప్తమికి' ననుసూత్రముచే నవర్ణక మయి 'బ్రహ్మలోకంబున నుండి' యని యవునే కదా. మఱి యీలక్షణ మేల?

కావున నీనవర్ణకవిధాన మనవసరము. ఇంక స్పష్టత ప్రయోజన మనవలె.

'నవర్ణకంబును' అనుసముచ్చయముచే నందువర్ణక మెట్లును నగును. బ్రహ్మలోకంబునం దుండి' (ఘం. 126, సర్వ. 62). 'అందువర్ణకమట్లు' అనుదళము సైత మందువర్ణక మగుటను స్పష్టము చేయుచున్నది. 'అందువర్ణకమట్లు' అనుట యనవసరము. (ఇది కేవలము బాలవ్యాకరణమునందుఁ బొరపాట్లు గల వనుటను సూచించుటకే చేర్పఁబడినట్లు తోఁచుచున్నది.) 'సప్తమికి నవర్ణకంబు నగు' నన్నఁ

జాలును గదా. ఇంక 'నుకారాంతములకే యగు' ననునంశమునకుఁ దిరిగి బాల. నాశ్రయింపవలసినదే.

## ఉండిలోపము

**11. వలన కాదేశము లగుద్వితీయాసప్తములమీఁదియుండికి లోపంబు బహుళంబుగా నగు.**

ఉండి పదము పర మగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికముగా నగును. అ ట్లయినద్వితీయాసప్తములమీఁదియుండికి లోపము బహుళముగా వచ్చు నని యర్థము. 'గర్భమును వెలువడు' మనుచో ద్వితీయపైని, 'ఒడలన్ వెలువడి' యనుచో సప్తమిపైని ఉండి లోపించినది.

కు.పం. పంచమీప్రత్యయ మగు 'వలన' కాదేశముగ ద్వితీయాసప్తములు వచ్చు ననియు నట్లు వచ్చునపుడు దానికంటెఁ బరం బయినయుండికి లోపము వచ్చు ననియు సూత్రించుచున్నాఁ (91) డన్నది. దీనివలన వలనకు ద్వితీయా సప్తము లీసూత్రముచేతనే యగు నన్నయర్థము వచ్చుచున్నది. పూర్వసూత్ర వివరణమున బాల. కార.11సూ.చే ద్వితీయాసప్తము లవుచున్నట్లు చెప్పుటచే కు.పం. అభిప్రాయ మీసూత్రముచే నగు ననుట సరి కా దని గ్రహింపఁదగు. కాఁగా గర్భమువలననుండి – గర్భమునుండి యని కాఁగా, నీసూత్రముచే గర్భమును (వెలువడుము) అనురీతి నవు నని ప్రక్రియ గ్రహింపవలె.

అట సూత్రకర్త చూపినలక్ష్యములలో 'నూతిలో వెలువడ' ననునది వివాదాస్పద మైనది. సుబో. 'ఇయ్యెడ నూతిలో అనునది సప్తమ్యంత మనునభిప్రాయమున నీయుదాహరణ మీయఁబడినట్లు తోఁచుచున్నది. కాని లో లోపల సప్తమ్యర్థమున వచ్చు నని చెప్పియుండలేదు. సప్తమిలోనియుండి లోపించుటకుఁ గాక షష్ఠికి ఉండిని విధించి యది లోపించుట కల దని యీయుదాహరణము నిచ్చిన మే లైయుండెడిది'. (156) అని పేర్కొన్నది. షష్ఠికి ఉండి విధింపవలె ననుట యసంగతము. షష్ఠీప్రత్యయములయందుఁ గాదు. 'లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ' 'నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకం బగు' మున్నగువిధానము లీయంశమును స్పష్టము చేయుచున్నవి. కాని యీనూతిలో ననుచోట నానిర్ధారణము లేదు గదా. కావున నిచటి'లో' షష్ఠీప్రత్యయ మనుటకు వీలు లేదు.

అసలు షష్ఠిపై ఉండి విధించి లోపింపఁజేయుట యేల? ఉండియే విధింపకున్న లోపప్రసక్తియే యుండదు గదా. అనఁగా లోపము బహుళము కావున నూతిలో- నూతిలోపలనుండి యనురీతిప్రయోగము లుండునా?

ఇంతకంటెను వలనకు ద్వితీయాసప్తములు మాత్రమే సూరి విధించియున్నాఁడు. కావున వానితోపాటు లోపల షష్ఠి సైతము వలన కగు నని చెప్పుట యుచిత మగుమార్గము. అదియే యిట నపాయార్థమునకు ననుగుణముగా నుండును.

కావున నీసుబో. సమన్వయము సరి గాదు. 'లోన్ - అనునది షష్ఠీప్రత్యయము. అందుచే దీనిమీఁద నుండికిఁ బ్రాప్తియుఁ గానరా' దని తత్త్వ. చెప్పుటను దిరస్కరించుచు ఘం. 'లో లోనుశబ్దముయొక్క సప్తమీవిభక్తియందు నాక్షరము లోపింపఁగా మిగిలినరూపము. ఇది చోటుశబ్దమువంటిది. (శ.ర.) కాఁగా లోనన్ అనులోనుశబ్దముయొక్క 'న' యనునక్షరము లోపింపఁగా లోన్ అనునది సిద్ధించు నని వ్యాకర్తయాంతర్యము. అచ్చోటన్-అచ్చోన్, ఒకచోటన్-ఒక చోన్ ఇత్యాదులలో టాక్షరము లోపించునట్లు నూతిలోనన్-నూతిలోన్ అనుచో నాక్షరము లోపించె నని 'ఇది చోటుశబ్దమువంటిది' అనుదానికిఁ దాత్పర్య' (304) మన్నది.

తత్త్వ. లోపల ననుదానిని సప్తమి యని భ్రాంతిపడె (216) ననుట (ఘం. 305) యుక్తము గాదు.

ఘం. శ.ర. ననుసరించి ప్రక్రియ నడపినది. శ.ర. లో లోపల అనురెండింటిని నిర్ధారణషష్ఠీప్రత్యయములుగానే పేర్కొన్నది. కాని వీనిని సప్తమీప్రత్యయము లనలేదు.

కాని శ.ర.లో సప్తమ్యంతరూపమందలినాక్షరము లోపించు నని చెప్పిన ట్లీవ్యాకరణమునందుఁ జెప్పలే దేమి? చోటు శబ్దమువంటిదే యైనను సూరి చోటు శబ్దమున టాక్షరము లోపించుటను మాత్రమే పేర్కొనియుండుటచే (సమా. 16) లోనన్ అనుదానియందు నవర్ణము లోపించుట యెట్లు గుదురును? అనఁగా నీవ్యాకరణము ననుసరించి 'నూతిలోన్' అనుచోటిసప్తమ్యర్థము సాధింపఁబడుట లే దనియే చెప్పవలసియుండును.

ఘం. దీనిప్రక్రియ నిట నిట్లు చెప్పినది. నూతియొక్క లోను- నూతిలోను- నూతిలోను+వలన - నూతిలోను+వలన+ఉండి. నూతిలోను+అందు+ఉండి (అచ్చి. 30) నూతిలోని+అందు+ఉండి. సప్తమి కత్వ మై, నూతిలోనను+ఉండి.

లోనను ఆనుదానిలో 'న' యనునక్షరము లోపింపఁగా, లోన్ అని యుండును. 'ఏకదేశవికృత మనన్యవత్' అనుపరిభాషచే నాక్షరము లోపింపఁగా మిగిలిన లోను శబ్దము లోనను వంటిదే. కనుక నూతిలోను+ఉండి అనుచో లోను అనునది వలన కాదేశ మగుసప్తమి యగును. ఉండి లోపించి ద్రుతలోపముతో 'నూతిలో వెలువడ' నని యగు నని ఘం. అభిప్రాయము.

ఇందు నవర్ణము లోపించె ననుటకుఁ బ్రస్తుతవ్యాకరణమునం దెట్టి యాధారమును లేదు. శ.ర.లోవలెనే యిటఁ గూడ నవర్ణలోపమును నుద్దేశించియున్నచో నచ్చోటవలెనే యిచ్చట సైతము నలోపవిషయము ప్రస్తావింపక పోవఁ దని తోఁచుచున్నది.

ఘం. లోను అనునది లోననువంటి దని నిశ్చయించి దానివలన నూతిలోను ఉండి అనుచో లోను అనునది వలన కాదేశ మగుసప్తమి యనుట యావ్యాఖ్య యనుసరించినప్రక్రియకు విరుద్ధము. నూతియొక్క లోను-నూతిలోను అనురీతిగా నిద్దాని నీవ్యాఖ్య సమాసముగానే మొదట సమన్వయించినది. అట్టియెడల అక్కడన్ మున్నగువానిలోవలె 'అను' అనునది ప్రత్యయ మగును. కాని సప్తమి చేరుటకు మూల మైన లో(ను) అనుప్రాతిపదిక సైతము ప్రత్యయ మగుట యెట్లు గుదురును? ఇంతకు ముందు నూతిలోను+వలన+ఉండి అనుచో వలన కందును, అందున కత్వమును జేసియుండుటచే నత్వము వలన కాదేశ మైనసప్తమి గా నగును. కాని వలన ప్రత్యయమునకు మూల మైన లోను అనునదియు వలన కాదేశ మయినదిగా సమన్వయించుట యసంగతము గాదు గదా. ఈవ్యాఖ్య 'న'వర్ణమును లోపింపఁ జేసినది. కావున వలన కయినసప్తమి కయినయత్వము పోవుటచే నింక దాని కాగమముగా వచ్చిన 'ను'వర్ణమే సప్తమి యనుకొని దానిపై నుండి లోపించెన వని సమన్వయించుట యేని కొంత నయము గాని లోను వలన కాదేశ మయిన దని చెప్పుట సరి గా దనుట నిశ్చయము.

సర్వ. ప్రౌఢవ్యాకర్త లోపల అనుశబ్దమును గూడ సప్తమ్యర్థకవర్ణకముగానే గ్రహించె (64) నన్నది.

కాని లోపల అనునది ప్రత్యేకశబ్ద మనియు దానిని వర్ణకముగా వ్యాకర్త తలంచుట సరి కా దనియు నిర్ణయించుచు నిట్లు పేర్కొన్నది. 'ప్రౌఢవ్యాకర్త లోపల అనుశబ్దమును గ్రహించి సప్తమ్యర్థకప్రత్యయ మని పేర్కొనుచున్నాఁడు' (సర్వ. 64)

నూతిలో ననుచో లో లోపల సప్తమీప్రత్యయముగా సూత్రకర్త చూపినమాట వాస్తవమే. కాని లోపల వెలుపల ఇత్యాదులవంటిది (సర్వ. 64) యని ప్రత్యేకపదమునే యిట సప్తమీప్రత్యయముగాఁ బేర్కొనుచున్నాఁ డనుట కాధార మేది? ఇట్లు సప్తమిలో లో(పల)ను జూపుటనుబట్టియే షష్ఠీప్రత్యయమగు లోపల– అధికరణార్థమునందు నవు నని సూత్రకర్త తలంచినాఁ డందము. కా దనుట కాధారము గలదా? నిరాధారముగా నెట్లును నిర్ణయించుట యుక్తము గాదు. అది ప్రత్యయముగాఁ జూపెనే కాని ప్రత్యేకపద మని కాని, ప్రత్యయ మని కాని, షష్ఠీప్రత్యయమే సప్తమియం దయిన దని కాని సూత్రకర్త స్పష్టము చేయలేదు. ఇట్లె సూరి లోపల ననుశబ్దమును కూడ భావించియుండుటచేతనే (శ.ర. కూడ భావించినది. అదే యిటఁ బ్రత్యయ మని వ్యాకర్త భావించిన ట్లీవ్యాఖ్య యింతకు మున్ను చెప్పినది.) దానిని గారక పరిచ్ఛేదమునందుఁ బేర్కొనలేదు.... కావున సప్తమ్యర్థమునందు వచ్చుదానిని లోపల ననుశబ్దముగా (ప్రత్యేకపద మని యభిప్రాయము) గ్రహించుట సమంజస మనిపించును (సర్వ. 64). సూరి యట్లు భావించె నేమో. అతనియభిప్రాయమును స్పష్టము గాదు. కాని కారకపరిచ్ఛేదమునందుఁ జెప్పలేదు. కావున సప్తమ్యర్థమునం దయిన లోపల ప్రత్యేకశబ్ద మని భావించె నని నిర్ణయించుటకు మాత్రము వీలు లేదు. సూరి 'పొంటె' ననునదియుఁ గారకపరిచ్ఛేదమునఁ జెప్పలేదు. కాన నయ్యది స్వతంత్రపద మనియే యాతఁడు భావించె ననవలయునా? మెయి, మై మొద లగునవియు సూరిమతమున స్వతంత్రపదములే యగునా? 'దీని (లోపలపదమును) వ్యాకరణప్రక్రియయందు నిర్ధారణయం దగు సప్తమీప్రత్యయ మని పొరపడరాదు. ప్రౌఢవ్యాకర్త వర్ణక మని పేర్కొనుట యట్టిపొరపాటును సూచించుచున్న దనవలయును' (సర్వ. 65). ప్రౌఢవ్యాకర్త పదమునే యిటఁ బ్రత్యయముగాఁ జెప్పె ననుట కాధారము లే దని స్పష్టము. ఇంక నిర్ధారణమం దయినసప్తమీప్రత్యయ మనుట పొరపాటు. నిర్ధారణషష్ఠికి విధింపఁబడినలోపల షష్ఠీప్రత్యయమే కాని సప్తమి కాదు. సప్తమి యధికరణార్థమున నవును. ప్రౌఢవ్యాకర్త 'నూతిలో వెలువడ' ననుచో నిర్ధారణమం దయినసప్తమిగాఁ బొరవడె నననుభిప్రాయము సరి గాదు. నూతిలో ననుచో నున్నది యధికరణార్థము. కావున నచ్చట లోపల సప్తమి యవును గాని నిర్ధారణమం దయిన దనుటయు, నట్లు సూత్రకర్త తలంచె ననుటయు నిరాధారము. నిర్ధారణార్థమునం దగు లోపల షష్ఠి, సప్తమియం దయిన దని

చెప్పఁదలఁచిన దేమో యీవ్యాఖ్య. కాని లోపల షష్ఠియే యధికరణార్థమునం దయిన నది యధికరణార్థకమే యవును గావున నట్లు భావించుట యెంతయు సమంజస మనియుఁ బ్రౌఢవ్యాకర్త యొకవేళ నట్లు భావించినచో నయ్యది గ్రాహ్యమే యనియు భావింపనిచో నట్లు భావింపవలసియున్న దనియు నిర్ణయింపవలెను.

కావున సర్వస్వవిమర్శన మిట నుచితముగా లేదు.

వఝలవారు లోపల, లో అనునవి సప్తమీప్రత్యయములుగనే భావించినట్లు తోఁచుచున్నది.

ఉండిశబ్దము లేని సప్తమికిఁ బ్రయోగములు చూపుచు 'నూతిలో వెలువడ నీరిలోను వెడలకుండి' (వ్యా.సం.స. 1019) అనుప్రయోగములు చూపిరి. 'లోను వెలువడి' కుదురవలయు నన్న నయ్యది సప్తమీప్రత్యయ మనియే వఝలవా రభిప్రాయ పడినట్లు స్పష్టము'. వ్యా.సం.స. 451 పుటలో లో అనునది విభక్త్యర్థాభిధాయకశబ్దము గాఁ బేర్కొనిరి.

దీనిని విభక్త్యర్థాభిధాయకశబ్ద మనుటయు నుచితముగాఁ గానరాదు. విభక్తి స్థానమునందుఁ బ్రయోగింపఁబడుచున్న, విభక్తి కానిశబ్దము స్వతంత్రముగాఁ బ్రయుక్తము గానపుడే విభక్త్యర్థాభిధాయకశబ్ద మనుట యుచితముగా నుండు నని తోఁచుచున్నది. గుఱించి, కోసము అనువిభక్త్యర్థాభిధాయకములుగా నహోబలపతి చూపినశబ్దములు స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడకుండుట గమనింపఁదగును. 'సౌధంబులోపల నిత్యాదౌ తు లోపలశబ్దః అంతరవ్యయపర్యాయో దేశ్యశబ్దః (కవిశి. 387) అని యహోబలుఁడు లోపలను విభక్త్యర్థాభిధాయకశబ్దముగాఁ బేర్కొన కుండుటయు గమనింపఁదగియున్నది. లోపల, లో అనునవి విభక్త్యర్థాభిధాయక శబ్దము లనఁదగినవి కా వని యింతకు ముందు గుర్తించితిమి.

అది య ట్లుండఁగాఁ బ్రౌఢవ్యాకర్తయును విభక్త్యర్థాభిధాయకశబ్దము లనువానిం బేర్కొనలేదు. అహోబలుఁ డట్లు పేర్కొన్న తోడుతను తోడకుఁ బర్యాయ మనుట గమనింపవచ్చును.

కావునఁ బ్రౌఢవ్యాకర్తృమతమున విభక్త్యర్థాభిధాయకశబ్దములు గల వని చెప్ప వీలులేదు. అట్లు చెప్పకుండగనే సమన్వయించు టెట్లు?

ఒకవిభక్తి మఱియొకవిభక్త్యర్థమున వచ్చుట తెలుఁగునఁ బ్రసిద్ధమే. కావున

షష్ఠీప్రత్యయ మగు లోపల అనునది యధికరణార్థమునందు నగు నని చెప్పుట యుక్తముగా నుండును. అపుడు లోపల ప్రథమాక్షరశేష మగుట గలదు గావున లో(ను) అనురూపము సప్తమ్యంత మనియు సౌధంబులలోపల (సౌధంబులయొక్క లోపల) అనునది సమాస మనియుఁ జెప్పవలసినయవసరము నుండదు. లోపల అనునది ప్రత్యేకపద మనియు నంతర్భాగ మని యర్థ మనియు సర్వ. పేర్కొన్నది. అది యుక్తమే. కాని సప్తమ్యర్థమునందుఁ గన్పించు లోపల ప్రత్యేకపదమే యనియు (సూరి యట్లే భావించె ననియు) నదియే యుచిత మనుటయు సరి కాదు. కీర్తి వహింపుము ధాత్రిలోపలన్ (కృష్ణ. 1. 29) భూమిలో నిలిచియున్నవి (భాగ. 4. 214) అనునీస్థలములు ధాత్రియొక్క అంతర్భాగములో, భూమియొక్క అంతర్భాగములో ననురీతియర్థము (లోపలపదమునర్థము) సముచిత మై యన్వయించునా? పైప్రయోగములందు నధికరణార్థమే సముచితముగా సమన్వయించు నని గ్రహింపవచ్చును. ఈలక్ష్యస్థలములం దందువిభక్తిని బ్రయోగించి చూచుకొన్నచో నర్థమునం దెట్టిబాధయు లేకుండుటయు, వివక్షితార్థమున కనుగుణ మై యుండుటయు, లోపలపదమే యిటఁ బ్రయుక్త మైన దని నిర్ణయించుట యుచితము కా దనియు, స్పష్ట మగును.

బ్రాహ్మణి కడుపులోపలనుండి వెలువడినపుడ (హరి. ఉ. 5. 71) వనములోపల నుండి వచ్చె (హరి. ఉ. 50) అని యుండికిఁ బూర్వము వలనకు లోపల యవుటయుఁ గాననగుచునేయున్నది. హ్రదములోపల వెలువడి యరుగుదెంచె (కళా. 5. 184) నేలలో వెడలనితమ్ముఁగుట్టల (పాం. 3. 38) కడుపులోనుండి నిర్గమించె (మౌసల. 12) నీరిలోనుండి వెలువడి (అర. 3. 122) యయాతి నూతిలో వెడలిచి (యయా. 3. 46) నూతిలో వెడలఁదీయుచు (యయా. 4. 61) ఇంటిలోనుండి వెలుపలి కేఁగుదెంచి (హర. 2. 66) అనురీతిగాఁ బ్రయోగములు గానవచ్చుచునే యున్నవి.

కావున 'నూతివలన నుండి' యనుచో సప్తమ్యర్థమందు 'లోపల' నంగీకరింపఁ గా లోను ఆదేశ మై, 'నూతిలోను ఉండి' అని కాఁగా నిట్లు సప్తమి యగు'లోను' పైని ఉండి లోపించి, 'నూతిలో వెలువడ' నని యగు నని సూత్రకర్త తలంచె నేమో.

నూతిలోయం దుండి వెలువడ నన నే మర్థమో నూతిలో వెలువడ ననుదానికి నదియే యర్థము. నూతియొక్క లోపలిభాగమునుండి యని యర్థము చేయుటలో

నిట విశేష మేమి? (వెలికిఁ దీయుటచే నూతిలోపల నెక్కడనో యున్న దని యర్థవిశేషమును జెప్పరాదు గదా.)

ఇటఁ దత్త్వ. పేర్కొన్నవిషయము గమనింపఁదగియున్నది. 'సంస్కృతమునందు గవాం గోషు వా కృష్ణా బహుక్షీరా' మున్నగురీతిని నిర్ధారణమున షష్ఠీసప్తమీవిభక్తులు రెండును వచ్చును. తెనుఁగున నిర్ధారణావధికి సప్తమీవిభక్తి యొక్కటియ వచ్చు ననియు లోపల ననునది కూడ సప్తమీప్రత్యయమే యనియుఁ జెప్పుట యుచితము. లోపల ననుషష్ఠీవిభక్తి నిర్ధారణమునఁ దప్ప వేఱొకషష్ఠ్యర్థమున లేదు. నిర్ధారణమున సంస్కృతభాషయందు షష్ఠీసప్తములు రెండును వాడఁబడుచున్నను దెనుఁగున మాత్రము సప్తమి యొక్కటియ వాడఁబడు ననియు నొక్క'లోపల' ననుప్రత్యయము మాత్రమే కాక అందు(ను), న(ను), అనుసప్తమీప్రత్యయములు కూడ నిర్ధారణార్థమునఁ బ్రయోగింపఁబడుచున్న వనియుఁ దెలియఁదగును.(215) ఈయంశము సముచితముగానే తోఁచుచున్నది. నిర్ధారణార్థమున 'ఇట సప్తమియుఁ గలదు. మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు' (బాల.కార. 16) అని సూరి సప్తమి చెప్పెను. అందుకే 'మనుజుల విప్రుండు' అనుచోఁ బ్రౌఢవ్యాకర్త సప్తమ్యర్థక ద్వితీయగాఁ బేర్కొనెను. (తత్త్వ. 216) ఇటఁ దత్త్వ. సప్తమ్యర్థమున వచ్చినతృతీయ యనుచో నచ్చుపొరపాటు. తరువాత ద్వితీయ యనియే యున్నది. (తత్త్వ216) సప్తమ్యర్థమున వచ్చినద్వితీయ కూడ నిర్ధారణార్థక మగును. (216) అని తత్త్వ. విశేషముగాఁ జెప్ప నక్కఱ లేదు. అట సప్తమియే నిర్ధారణమునం దయినది. కావున సప్తమి కర్థ మిట నిర్ధారణమే. కాఁగా దాని కాదేశ మైనద్వితీయయు నిర్ధారణమే. కాఁగా దాని కాదేశ మైనద్వితీయయు నిర్ధారణార్థకమే యవుట తప్పదు.

ఇట వలన కాదేశము లయినద్వితీయాసప్తములు వలనప్రత్యయార్థమునే గదా యిచ్చుచున్నది.

ఇంక లోపల నిర్ధారణార్థమందు మాత్రమే యవుచున్నది. కావున దీనిని షష్ఠిగాఁ జెప్పక సప్తమిగానే చెప్పుట యుచిత మనుటకు వీలు లేదు. పంచమి యగు పట్టి హేత్వర్థమునందు మాత్రమే యవుచున్నది కదా యని ప్రత్యాఖ్యానించు టెట్లు?

తత్త్వ. ప్రతిపాదనలోఁ గొంతప్రయోజన మున్నమాట వాస్తవము. లోపల షష్ఠిగాఁ గాక సప్తమిగా నంగీకరించినచో సప్తమి యధికరణ, నిర్ధారణార్థములం

దగు నని చెప్పవచ్చు. అపుడు నిర్ధారణార్థమున లోపలయే కాక 'అందు, న' కూడ (విశేషముగఁ జెప్ప నక్కఱ లేకయే సిద్ధించును. ఇంక లోపల ననునది నిర్ధారణార్థము నందు మాత్రమే కాక యధికరణార్థమునందును వచ్చుచున్నది. కావున నదియు సాధింపఁబడును. లోపల, అందు, న. అనుమూఁడు ప్రత్యయములును అధికరణ, నిర్ధారణార్థములందు సమానముగనే వచ్చుచున్నవి. కావున నీమూఁడింటిని సప్తమీ ప్రత్యయములుగా నంగీకరించుటలో లాఘవ మున్నది. కావున నీప్రతిపాదన మెంతయు నుచితముగా నున్న దని తోఁచుచున్నది.

(లోపలను షష్ఠిగానే పేర్కొన్న ఆంధ్రకౌముది 'లోపలను షష్ఠికి లోపల ననంగఁ దనరు (6పుట) నని యుదాహరించుట దీనియధికరణార్థమును, బ్రత్యయత్వమును సూచించుచున్నది.)

లోపలను షష్ఠిగాఁ జెప్పుటలో సంస్కృతానుసారముగా నిర్ధారణార్థమున షష్ఠి (సప్తమియు) సాధించుటయే యాంధ్రలాక్షణికులయుద్దేశ్య మనవచ్చును. చింతామణి ప్రభావమును గొంత కారణము కావచ్చును. అ ట్లయినను సప్తమియందు లోపల నంగీకరించుట యవసర మైయున్నది. ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' ననులక్షణము ననుసరించి దీనిని (లోపల సప్తమియం దగుటను) సాధించుకొనవచ్చును.

వనములోనన్, వనమునందున్ అనురీతివానిని విశేషములుగా గుర్తింపఁ దగును. లోన ననునది యధికరణ, నిర్ధారణార్థములు రెండింటఁ గానవచ్చుచున్నది. అమ్మునిసంఘంబులోన రామానుచరుండు (అర. 3.127) ఉర్వీశులలోనం బ్రసిద్ధు లిద్దఱు (హరి.పూర్వ. 2.79) వింధ్యములోన మము డించి (దశ. 5.3) (ఇట నధికరణార్థము మాత్రమే కుదురు ననఁగా సమాసము చేయుట వలనుపడదు.) ఇట్లే కలలోన నొండొరుం గలిసి (హరి.ఉ. 7.77) నీరిలోననుండి నెగయుదెంచె (ఆది. 5.173) మొ. అయ్యది విభక్త్యర్థాభిధాయకశబ్ద మంద మన్న స్వతంత్ర ప్రయోగము గలదు. కావున 'లోపల'కు 'లోన' అనురూపాంతరము నంగీకరించుట యొక్కటే మార్గము.

లోపల, అందు, న సప్తమి యనుట యుక్త మనఁదగు ననిపించుచున్నది.

కాఁగా నిట సప్తమిశబ్దముచే అందు, న, లోపల, లో, అ, అనురీతి వెల్ల

సప్తమ్యర్థకములుగా గ్రహింపవలసియున్నది. వానిమీఁదియుండికి లోప మగు నని గ్రహింపవలెను.

బహుళగ్రహణముచే నందుమీఁదియుండికి లోపము రా దనియుఁ గావున నట్లు చెప్పుటకు (బహుళ మని చెప్పుటకు) అంద్వితరసప్తమ్యర్థకవర్ణకంబులమీఁది యుండికి లోపము వచ్చుట ప్రయోజన మనియు సూత్రకర్త వివరించెను. అంద్వితరేత్యాదియర్థము చేయుటకుఁ గారణము బహుళపద మని గ్రహింపవలెను. (సర్వ. 156)

తత్త్వ. (217) సుగమ. (132) వ్యాఖ్యలు అందు పై నుండి లోపింప దనుసూత్రకర్త యభిప్రాయము నామోదించినవి. సర్వ. 'ప్రౌఢవ్యాకర్త సూత్రము క్రింద నిచ్చినవృత్తిని బట్టి అందు అనుసప్తమీవిభక్తిమీఁద నున్న 'ఉండి' శబ్దమునకు లోప మెన్నఁడును రా దనియునుఁ దక్కినయెడల లోపము నిత్యముగా వచ్చు ననియు భావించినట్లు తోఁచుచున్నది. అందుమీఁదియుండికి లోపము రా దనుట సమంజసమే. అట్టి ప్రయోగములు కనుపట్టనందున లోపము రా దని యంగీకరింపకతప్పదు గదా(63) యన్నది. అందుపై లోపము రా దనఁగా నితరములపై లోపము నిత్య మని యర్థము చేయు టెట్లు పొసఁగును? ఇంక బహుళపద మేల సూత్రమున? ఉండికి లోపము చెప్పనిసూరి ఉండితో రూపములను జూపియుండఁగా నవి యెల్ల నసాధువులే యని నిర్ణయింపవలెనా? పైఁగాఁ బ్రౌఢవ్యాకర్తయె యట్లు భావించె ననుట యింకను నయుక్తము. ఇంతకుఁ బూర్వసూత్రమునొద్ద సూత్రకర్త 'బ్రహ్మలోకంబున నుండి' యనుప్రయోగమును జూపుటయే కాక యందుకయి సూత్రమును గూడఁ జెప్పెనే. నిజమునకు నాపూర్వసూత్రమును జెప్పకయే 'వదనగహ్వరమున వఱదవాఱ' నని యిట నవర్ణకముపై నుండిలోపమును జూపుటచేతనే నవర్ణకముపై 'నుండి' యగు నని సూత్రకర్త స్పష్టము చేసిన ట్లయ్యెడిది.

కావున నితరములపైని 'ఉండి' నిత్యముగా లోపించు నను సర్వ. అభిప్రాయము సరి కాదు. బహుళపదముచే లోపాభావమును గుర్తింపఁదగును.

అందుపై ఉండిలోపము లే దనుటయు సమంజసము గాదు. అట్టిప్రయోగము లను వఝులవారు చూపిరి. 'ద్వారములందు వెల్వడియె, నాయం దధికధనము గొనిపొమ్ము' అనుప్రయోగములం దందుపై నుండి లోపించుటను జూపి ప్రౌఢవ్యాకర్త ప్రమాదమును (వ్యా.సం.స. 1019) స్పష్టము చేసిరి. (ఘం. 123)

కావున నిట తత్త్వ. ప్రభృతులు వ్యాకర్తవివరణము నామోదించుట సరి గాదు.

అంద్వితరసప్తమ్యర్థకములపై లోప మగు నని సూత్రకర్త వివరించుటను గూర్చి సర్వ. 'అందు అనునది కాక మిగిలిన (సప్తమీ) ప్రత్యయము 'న' యనునది యొక్కటియే. కావున 'నవర్ణకముమీఁదియుండికి' నని చెప్పిన చాలు ననిపించు' (64) నన్నది. లోపలను ప్రౌఢవ్యాకర్త ప్రత్యయ మని తలంచె నని గుర్తించియు నది యీవ్యాఖ్య తిరస్కరించినది. కావున 'నవర్ణకంబుమీఁది' యని చెప్పినఁ జాలు ననియే యీవ్యాఖ్య సిద్ధాంత మనవలెను. కాని యది సరి కాదు. ఒడలన్ వెలువడె నిత్యాదుల సప్తమ్యర్థక మైనయత్వముపై లోపము గలదు గదా. నవర్ణకముమీదనే యని చెప్పినచో నవి సిద్ధించు టెట్లు?

ఇంక నీవిధానమును గూర్చి తత్త్వ. 'ఈసూత్రము బాలవ్యాకరణమున ననుక్త మగువిషయమును జెప్పి న్యూనతను బోఁగొట్టె' (217) నన్నది. (సుగమ. 132) ఇది యుక్తము గాదు. బాలవ్యాకర్త యిట్టివిషయమును భంగ్యంతరముగా సాధించియే యున్నాఁడు. 'ఒకానొకచో నొకవిభక్తికి... ననుసూత్రమునొద్ద 'గృహమును వెడలెను'. గృహమునుండి యని యర్థము. వాహనమునుండి దిగెను. వాహమునుండి యని యర్థము' అని యిట్టివానిని నిరూపించియున్నాఁడు.

దానింబట్టి యట నపాయార్థమున వలన రావలసియుండఁగా వలనకు బదులు ద్వితీయ వచ్చిన దన్నమాట. ఇది మిక్కిలి సులు వగుమార్గము కదా.

వలనను జేసి, వలన కుండి ననుప్రయుక్తమును జేసి, యది పరముగా నుండఁ గా వలనకు ద్వితీయ చేసి, పిదప ఉండి లోపించు నని చెప్పుట ప్రక్రియాగౌరవము. దీనికంటె వలనకు ద్వితీయ యైన దనుట మిగుల లాఘువము. కాఁగా నీరూపములను బాలవ్యాకర్త లాఘవముగా సాధించె నని స్పష్టము.

ఇంక సూరి యట ద్వితీయను మాత్రమే చూపఁగాఁ బ్రౌఢవ్యాకర్త సప్తమిని గూడఁ జూపుట విశేషము. 'ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' నను బాల.సూత్రము లక్ష్యస్థలములందలి 'ఇత్యాదులు' అనుదానిచే నిట సప్తమియు గ్రహింపఁబడు నన్నచో సప్తమిని సాధించుట స్పష్టత కగును.

ఇంక నట్లు గాక సప్తమిని సూరి స్పష్టము చేయలేదు గనుక దానిని స్పష్టము చేయుటకై విధాన మారంభింపఁబడఁగా ద్వితీయయును గలదు గావునఁ (సూరి

దానిని సాధించినను) బ్రకరణము ననుసరించి ద్వితీయయును బ్రౌఢవ్యాకర్త చెప్పఁ దలఁచియుండవచ్చును. అట్టియెడల ఉండిలోపమును జెప్పుటకంటె నుండి యనుప్రయుక్తము గాకయే వలనకు ద్వితీయాసప్తము లగుటను సూత్రించుటలో లాఘవము గలదు. కావున సూత్రము నట్లు చెప్పుట యేని యుక్తముగా నుండును.

ఈవిధాన మనవసర మనుటకు కు.పం. ఇ ట్లన్నది. 'ప్రదేశవాచక మగు వలనశబ్ద మొండు గలదు. దానికి ద్వితీయార్థకము లాదేశము లైనను స్థానివద్భావముచే దిగర్థమునే చెప్పఁగలవు. అపుడు ఉండి యనునది బుద్ధిస్థమే యైయుండును, గాన నద్దానికి లోపము విధింప నవసరము లేదు. ఎల్లి+ఉండి వచ్చెదను. ఎల్లి. రేపు లగ్నం బెల్లి (భాగ. 10.) వలనుశబ్దమునకు దిక్కు అనునర్థమును శ.ర. చూపినది. అయ్యది వేఱు. వలనప్రత్యయము వేఱు. అది పదము గాఁగా నిది యపదము. పదమునకు ద్వితీయాసప్తములు (కు.పం. ద్వితీయార్థకము లన్నది. దానిచే ద్వితీయాప్రత్యయము మాత్రమే గ్రహింపఁబడును. సప్తమి రాదు. అయినను గ్రహించిచూతము) ఆదేశములు గావలెను. వీనిని విధించినది వలన ప్రత్యయమునకుఁ గదా. అయ్యది 'వలన' యనుపదమున కాదేశము చేయు టెట్లు? వలన పదమునకు నీయాదేశ మగు నందము. పదము మొత్తమునకుఁ బ్రత్యయ మాదేశము కాఁగా నాప్రత్యయమే ప్రయోగింపఁబడవలెను. వలనన్ అనుపదమునర్థమున 'ను' నను, అందును, అనురీతి వ్యవహార మున్నదా? వదన గహ్వరముయొక్క వలను=వదనగహ్వరమువలను. దానియందు=వదనగహ్వరము వలనన్. ఇట్లు సమాసోత్తరపద మయినపుడే వలనపదమునకు ద్వితీయాసప్తము లవు ననవలెనా? అట్లు సూత్రింపవలెను. అవుఁ గాక. వదనగహ్వరమువలనన్ అనుసప్తమి కాదేశము లయినద్వితీయాసప్తములు సప్తమ్యర్థము (లేక తృతీయార్థమునో) నీయవలెను గదా. వదనగహ్వరముయొక్క దిక్కునందు అని సప్తమ్యర్థము చెప్పవలెను. అది సమన్వయించునా? వదనగహ్వరము దిక్కున రక్తము పాఱినదా? (వదనగహ్వరముదిక్కునందుండి రక్తము పాఱినదా) లేక వదనగహ్వరమం దుండి పాఱినదా?

ఇట స్థానివద్భావము నాశ్రయించి దిక్కున (దిక్కును) అని యర్థము గలుగు నన్నను నయ్యది యెంతమాత్రమును సమన్వయింపఁబడకపోవుటచేతనే వలనను బ్రత్యయముగా లాక్షణికులు పేర్కొని రని గ్రహింపఁదగును.

ఇట వలనప్రత్యయమునర్థ మున్నఁ (అపాయాది) గాని సమన్వయింపఁబడదు.

ఉండి యనునది బుద్ధిస్థ మై యుండు నన్నది కు.పం.వ్యాఖ్య. వక్తతోపాటు శ్రోతకును నీయది బుద్ధిస్థ మైయుండు ననుకొందము. అ ట్లున్నను బ్రయోజన మేమి?అనుప్రయుక్త మగునుండికి సూరి విశేషార్థము చెప్పలేదు. కావున వలనకు స్వార్థమునందే 'ఉండి' చేరును. ఇట బుద్ధిస్థ మైనయుండి విశేషార్థము నచ్చునా? వదనగహ్వరమునందు నిలిచినదా? కావున బుద్ధిస్థ మైయున్న యుండివలనఁ గూడ నిట సమన్వయము గుదురనేరదు.

ఇట కు.పం.వ్యాఖ్య ఎల్లి+ఉండి వచ్చెదను అని చూపినది. అనఁగా రేపు ఉండి, రేపటికి మఱునాఁడు వచ్చెద నని యర్థమా? ఇట ఉండి బుద్ధిస్థ మైయుండఁ గా 'లగ్నం బెల్లి' యనుచో ఉండి ప్రయుక్తము గాలేదు. అట్లే ఎల్లి వచ్చెద నని యందము. అపుడు రేపే రావలసియుండును గదా.

కాఁగా కు.పం. వ్యాఖ్య యీసూత్రమును బ్రత్యాఖ్యానము చేసినవిధాన ముచితముగా లే దనియే గ్రహింపవలసియున్నది.

ఏది యే మైనను నీవిధానము నిట్లే యథాతథముగా స్వీకరింపవలసిన యవసరము లేదు. ప్రక్రియాగౌరవమును వారించుచు ఉండి యనుప్రయుక్తము గాకున్నను, వలనకు ద్వితీయాసప్తము లగుట యనునంశమును జెప్పుట యెంతయు లాఘవము, నుద్దిష్టప్రయోజనసాధకము నయియుండుటచే నట్లు చెప్పఁదగు నని మాత్రము నిశ్చయింపఁదగును. సూరి చూపనిసప్తమితోడిపెక్కుప్రయోగములను జూపుచు నిందలివిశేషమును సూత్రకర్త సూచించె ననవచ్చును.

## నుజ్యంతము - పట్టి

**12. కొన్నియెడల హేతువునం దన్నంతక్రియలమీఁదను బట్టివర్ణకంబు విభాష నగు.**

నుజ్యంతము లగుక్రియలపై హేత్వర్థమునందుఁ గొన్నియెడల పట్టివర్ణకము విభాషగా వచ్చు నని సూత్రమునర్థము.

ఇట కు.పం. వ్యాఖ్య ననుసరించి (62) సుబోధినియును బాల. కార.14 సూత్రమునొద్ద 'క్రియలయుదాహరణములలో నన్నియు (వచ్చుటంబట్టి యని

యొక్కటే సూరి యుదాహరించెను. జ్ఞానముంబట్టి యనునది క్రియకు నుదాహరణము కాదు గదా.) భావార్థకటవర్ణకాంతములే ఉండుటంబట్టి అన్నంత క్రియలపయి వర్ణకము రా దేమో యనుభ్రాంతి కలుగుచున్నది. తన్నివారణార్థ మీసూత్రము చెప్పబడుచున్న (157) దని పేర్కొన్నది. నుజ్యంతముపై రా దేమో యనునది భ్రాంతి యనుట సరి కాదు. నుజ్యంతములపై రా వీలు లేదు. వచ్చుటం బట్టి యనుచో నయ్యది క్రియ యగుటవలనఁ గాదు గదా, పట్టి వచ్చినది. గుణము లేదా క్రియ హేతు వయినపుడు తద్వాచకము లగుశబ్దములకు సూరిలక్షణముచే పట్టివర్ణక మగును. 'ధన్యుఁడ నగుట' యనుదానికి వచ్చుధాత్వర్థము (హేతు వయినది కావునఁ దద్వాచక మగు వచ్చుట యనుదానిపై పట్టి ప్రత్యయ మైనది. అట్లే ప్రభావము సమకూరుటకు 'ఈవు కలుగుట' యిట హేతు వయినది. కావునఁ దద్వాచక మగు 'కలుగంగన్' అనుదానికి సూరిసూత్రముచేఁ బట్టి వచ్చు నని యూహించుటకే యవకాశము లేదు.

తత్త్వ. 'పట్టివర్ణకంబు హేతువు లగుగుణక్రియల కగు' నని బాలవ్యాకరణకర్త సూత్రించెను. ఇందుఁ గ్రియ లనఁగా ధాతువు లని యర్థము గాదు. అసమాపకక్రియ లనియుఁ దలఁపరాదు. వచ్చుట, పోవుట, రాక, పోక మున్నగువిభక్తిప్రత్యయములు రాఁదగినకృదంతము లని తలంపవలయును. (ప్రత్యేకముగాఁ దలంపవలసిన యవసర మేమి? అసలు దానియర్థ మది కాదా?) అందుచే కలుగంగన్ అనునన్నంతక్రియకు పట్టి విభక్తిప్రత్యయ మాసూత్రముచేఁ జేరుట కవకాశము లేదు. కావునఁ బ్రౌఢవ్యాకర్త విధింపవలసివచ్చె' (216) ననుట యుచితము.

సూత్రాభిప్రాయము నీవ్యాఖ్య విస్తరించి చెప్పినది. పట్టి పంచమీవిభక్తి కదా. అసలు సుబ్విభక్తులు చేరునది ప్రాతిపదికములపైని. ధాతువు ప్రాతిపదికము కాదు (అర్థవ దధాతుః). కావున పట్టియే కాదు, ఏ(సుప్)విభక్తి యైనను ధాతువుపైని జేరుట సంప్రదాయవిరుద్ధము. అట్లే సమాపకక్రియయా? అసమాపకక్రియయా? అనువిషయము ననవసరము. తిజంత మెట్లును బ్రాతిపదికము కాదు. కావున దానిపైని సుబ్విభక్తులు రావు. ఇట్టియెడలఁ గృదంతములే ప్రాతిపదికము లవును (కృత్తద్ధితసమాసా శ్చ). కాఁగాఁ గృదంతములకే సుబ్విభక్తియోగయోగ్యత కలదు. అసమాపకక్రియలకు క్త్వా తద్వ్యతిరేక శతృ తుమున్ చే దానంతర్యార్థకములు (వాక్య. 1) అవ్యయము లగుటచే నయ్యవి కృదంతములే యైనను వానిపైని విభక్తులు

నిలువవు. 'రాహుకంఠము దెగి దేహము ధరణిఁ బడియె' ననుచోఁ దెగు అనుక్త్వార్థకరూపము హేత్వర్థక మగుటను ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను. అయ్యు 'తెగిపట్టి' యనువిధముగా నటఁ బట్టి నిలువకుంటకుఁ గారణ మది యవ్యయ మగుటయే కదా. కావుననే యసమాపకక్రియలపైని సుబ్విభక్తులు గానిపింపవు. కాఁగా నవ్యయేతరము లగుకృదంతములపయినే నామవిభక్తులు నిలుచుచుండుట గమనింపఁదగును. విభక్తులు చేరఁదగినకృదంతము లనుటలోఁ దత్త్వబోధిని యభిప్రాయ మిది కావచ్చును. తమున్నంత మవ్యయము. తుమర్థక మగునుజ్యంతము నవ్యయమే. కాన నుజ్యంతముపై విభక్తి నిలువదు. కావుననే యిటఁ బ్రౌఢవ్యాకర్త దీనిని బ్రత్యేకముగా విధించె నని తత్త్వ. స్పష్టము చేయుట సముచితము (213).

సర్వ. 'కొన్నిచోట్ల హేత్వర్థమునందు అన్నంతము లయినక్రియాపదములమీఁద సైతము పట్టి యనుప్రత్యయము విభాషగా నగు నని సూత్రార్థ' (69) మని పేర్కొన్నది. అన్నంతములను గ్రియాపదము లనుట విశేషము. క్రియాపద మనుదానికిఁ దిజంత మనునర్థముననే వ్యవహారము ప్రసిద్ధము. కృదంతములను గ్రియాపదము లనుట యెచ్చటను గానరాదు.

ఇట సర్వ. విభక్తిప్రత్యయములు నామములపైని మాత్రమే చేరును గాని క్రియారూపములపైఁ జేరవు. (మునుపటిసూత్రమునందు ద్వితీయాంత మని సర్వ. వ్యాఖ్యయభిప్రాయము.) ఇపుడు క్రియాపదములపైఁ జేరుటచే పట్టి విభక్తి ప్రత్యయము కా దని నిరూపించుచున్నది. కాని ప్రౌఢవ్యాకరణకారుఁడు పట్టివర్ణకము అనియే ప్రయోగించుచున్నాఁడు' (70) అన్నది. జ్ఞానముఁబట్టి, వచ్చుటంబట్టి యనుచోట్ల నున్న 'పట్టి' యెట్టిదో కలగుగంగఁబట్టి యనుచోటి 'పట్టి' సైత మట్టిదే. కావున బాలవ్యాకరణమునందువలెఁ బట్టివర్ణక మని యితఁడు చెప్పియుండవచ్చు. 'వలన కంటె ప ట్టీతి తు పఞ్చమీ' యని చింతామణి చెప్పుటయు (ప ట్టీతి తు పఞ్చమీ గుణే హేతౌ) 'కేచిన్నాన్తా చ్చ గుర్వాదే ర్ద్వ్యక్షరా త్పట్టి మూచిరే' యని వి.వి. నుజ్యంతములపైఁ బట్టి చెప్పుట యే నిట స్మరింపఁదగును.

షష్ఠీప్రత్యయముగాఁ జెప్పుటలోఁ దెలుఁగులాక్షణికు లిట్టివా రెల్లరును బొరపాటు పడి రనియే సర్వ.వ్యాఖ్యసిద్ధాంతము స్పష్ట మగుచున్నది.

జ్ఞానముఁబట్టి యనుచో ద్వితీయంతముపైఁ జేరిన దనుచో రామునందు ననుచో అందు నననది సైతము ద్వితీయాంతముపైనె చేరిన దనఁదగును. కావున

నందుసైతము ప్రత్యయముగాఁ జెప్పుట తెలుఁగువాకర్త లందఱపొరపాటే యని వ్యాఖ్య ననుసరించి నిర్ణయింపవలసివచ్చును.

ఇంకఁ బ్రస్తుత మిటఁ బట్టి ప్రత్యయము గా దన్న నే మగును? పట్టు ధాతువు యొక్క క్త్వార్థకరూప మనవలె. సర్వ. వ్యాఖ్య ఆధారము చేసికొని యని యర్థము చేసినది. ఇది యెట్లు సంభవించినదో స్పష్టము గాదు. జ్ఞానమును అనునది ద్వితీయాంత మనుసమన్వయము ననుసరించి సకర్మక మగుపట్టుధాతువు నిట గ్రహింపఁదగును. అట్టిదానికి 'నాధారముగాఁ జేసికొను' అనునర్థము శ.ర. చూపలేదు. సూ.ని. ఆశ్రయించు, (శ.ర. అవలంబించు) అనునర్థము చూపినది. కాని ని న్నెఱిఁగి పట్టిన – నిన్నాశ్రయించిన మున్నగువానియర్థముతో నివ్వానికి సంబంధము గానరా దని గుర్తింపవచ్చును.

కాఁగా నిటఁ బట్టి యనుపదము ప్రత్యేకముగా నన్వయించుచుఁ బ్రయుక్త మయిన దని చెప్పుటకు వీలు లేదు.

విల్లు పట్టి యిత్యాదులందువలె నిట జ్ఞానము పట్టి, వచ్చుట పట్టి యనురీతి రూపము లుండునా? అనఁగా ద్వితీయకుఁ బ్రథమ యైనరూపము లుండునా? జ్ఞానముపట్టి యనురీతిరూపములు నున్నపుడు 'అందుపట్టికూర్చివిభక్తిషు' అనుకారికచే వి.వి. నుమాగమము నిత్యముగాఁ జెప్పుట విరుద్ధమా? 'నుక్ పట్టివిభక్తౌ' యనురీతిగా సూరియు నియ్యది పేర్కొనియున్నాఁడు.

సూ.ని. పట్టి అవ్య. ఇది హేత్వర్థక ద్వితీయానుజ్యంతముల కనుప్రయుక్త మగు నన్నది. కాని హేత్వర్థమునందు ద్వితీయ యగుట కాని, లేదా నుజీ యవుట కాని చెప్పినశాస్త్రము గానరాదు. హేత్వర్థమునందు ద్వితీయ యైనఁ గదా దానికిఁ బట్టి చేయుట. ఈనిఘంటువు 'ను–ద్వితీయైకవచనము పట్టి అనుపద మనుప్రయుక్త మగునపుడు హేత్వర్థమును దెలుపు' నని పేర్కొన్నది. అనఁగాఁ బట్టి యనుప్రయుక్త మయినపుడే ద్వితీయ హేత్వర్థక మగు నన్నమాట. అట్టియెడ హేత్వర్థక మగుద్వితీయ కనుప్రయుక్త మగు ననుట విరుద్ధము గదా. పట్టి చేరునపుడే హేత్వర్థము గలుగును. ద్వితీయ హేత్వర్థమునందు రాదు. అట్టియెడల హేత్వర్థమునందు ద్వితీయయు నాద్వితీయకు పట్టి యనుప్రయోగమును జెప్పవలసియుండును. కాని పట్టి నిట్లు నిరర్థకముగా ననుప్రయుక్తము చేసి ద్వితీయనే హేత్వర్థమునందు విధించినను నయ్యది యుచిత మనరాకున్నది. హేత్వర్థమునందు ద్వితీయకుఁ బట్టి యనుప్రయుక్త

మగు నని చెప్పుకొన్నను నిట ద్వితీయాప్రయోగ మేరీతి గుదురును. జ్ఞానముఁ బట్టి యన్నపుడు జ్ఞాన మనునది కర్మము గాదు కదా ద్వితీయ యగుటకు. హేత్వర్థ మునందుఁ గర్మ కానిదానికిని ద్వితీయ వచ్చు ననవలెనా? పట్టి లేకుండఁ గేవలము ద్వితీయ హేత్వర్థకము గాదు. కాఁగా పట్టి నిరర్థకమును, ద్వితీయయే హేత్వర్థకము నని చెప్పుట యుచితమా?

జ్ఞానము నాధారముగాఁ జేసికొని ముక్తుఁ డయ్యె ననురీతి పైఁ జెప్పిన యన్వయముకంటె జ్ఞానముచేత (జ్ఞానము హేతువుగా) ముక్తుఁ డయ్యె నని చెప్పుటలోనే సామంజస్య మధికము. కావున సర్వ. వలె పట్టి పద మని కాని, సూ.ని.వలె ననుప్రయుక్త మని కాని చెప్పుట కవకాశము లేదు.

చేత ననునది ప్రత్యయ మైనట్లే, వలన ననునది ప్రత్యయ మైనట్లే పట్టియును (హేత్వర్థమునం దగుపంచమీ)ప్రత్యయ మనురీతివ్యాకర్తలసమన్వయము శబ్దశాస్త్ర మునకు ననుగుణ మని నిస్సంశయముగాఁ జెప్పఁదగును.

కాని ప్రస్తుతసూత్రమునందలి 'అన్నంతక్రియ' యనుదళము సముచితముగాఁ గానవచ్చుట లేదు. ఇదియు నకప్రత్యయాంత మనుటవంటిదే. ఇతరవ్యాఖ్య లీయంశమును బేర్కొనలేదు. కాని ఘం. అన్నంతక్రియ యనరా దనియు నుజ్యంత మనవలయు ననియుఁ జెప్పినది.(128) అది యుక్తము. కాఁబట్టి, రాఁబట్టి మొద లైనలక్ష్యస్థలములనుబట్టి యన్నంత మని చెప్పుట సరిపడదు.

కాఁగా నుజ్యంత మగుశబ్ద మవ్యయ మగుటచే నేవిభక్తియు నిలువ వీలు లేకుండఁగాఁ బట్టి నిలుచుట విశేషము కావునఁ బట్టిని విధింపవలసినయవసర మిట విశేషముగా నేర్పడినది. (తత్త్వ.218) గుర్వాదేః ద్వ్యక్షరా త్తని వి.వి. చెప్పుట యుచితముగా లే దని సూచించుటకై ప్రౌఢవ్యాకర్త 'కలుగంగఁబట్టి' యనుదానిని లక్ష్యముగాఁ జూపియుండును.

పంచమి యగుపట్టిని జింతామణియును బాలవ్యాకరణమును హేత్వర్థమునందే చెప్పినవి. ఇది యిం కొకయర్థమున వచ్చుట లేదు. కాఁగాఁ బ్రస్తుతప్రౌఢ.సూత్రమున 'హేతువునందు' ననుదళము స్పష్టత కుపకరించు ననవచ్చును. 'పట్టివర్ణకంబు నుజ్యంతంబుమీఁదను జూపట్టెడి' నని చెప్పినను సముచ్చయముచే హేత్వర్థమునందే యవుటయును, నితరగుణక్రియలపై నవుటను సంగ్రహించుటయు సిద్ధించును.

ఇట సర్వ. 'సూత్రాంతమునందలి విభాష యనుపదము వలన మున్నగువాని కవకాశము కల్పించుటకు సమర్థ మైయుండును. కావునఁ గొన్నియెడల ననునది నిరుపయోగ' (70) మన్నది. కొన్నియెడల నిరుపయోగ మనరాదు. ఇట్టి ప్రయోగములు క్వాచిత్కము లనువిషయమును స్పష్టము చేయుటకు వ్యాకర్త ప్రత్యేకించి దాని నిటఁ జేర్చె ననఁదగును.

అన్నంతక్రియ లనుటచే నట్టివానియన్నింటిపైని జేరుటకు నవకాశము గలదు గదా. అట్టియెడల నన్నంతములపై నెల్ల విభాషగాఁ బ్రయుక్త మవుచున్నదా? కాఁ గాఁ బ్రయోగములందు విరళముగా నుండుటను సూచించుటకుఁగాను గొన్నియెడల ననుదళము ప్రయోజనవంత మైయున్నది.

ఇంకఁ జూడ విభాష యనుపదమే యవసరమా? అని యనుమానము. సర్వ. విభాష యనుటచే వలన మున్నగువాని కవకాశము గల దనుట యుచితము గాదు. నుఙ్యంతముపై వలన ప్రత్యయ మైనందులకుఁ బ్రయోగ మున్నదా? పైఁ గా మున్నగున వన్న దీవ్యాఖ్య. అవి యేవి? సూరి పట్టివర్ణకమును జూపి 'ఇచట వలనవర్ణకంబు నగు. జ్ఞానంబువలన' (కార.14) ననుటచే వలన వచ్చు నని యీవ్యాఖ్య తలంచిన దేమో. కాని వలన ప్రత్యయ మిచ్చుట రాదు. వచ్చుచో దానిని బ్రత్యేకముగా విధింపవలసినదే కాని సూరివిరణానుసారముగా రాదు. వివరణానుసారముగా 'వలన'యు నవు నన్నచో సూత్రానుసారముగాఁ బట్టి యంతకు ముందే వచ్చును గదా. మఱి ప్రౌఢ. పట్టి నేల చెప్పె. ఇది యవ్యయ మగుటచేఁ బట్టివిభక్తి సైతము నిలువ వీలు లేకుండఁగా నిట్లు ప్రత్యేకముగాఁ జెప్పె నని గుర్తించినచో నట్లు ప్రత్యేకముగా విధింపమింజేసి వలన ప్రత్యయము రా దని స్పష్ట మగును. కావున వలన వచ్చు ననరాదు. 'కలుగంగవలన సమకూరు' లేదా 'కలుగంగఁజేత సమకూరు' ననురీతిప్రయోగము మొక్కటి గలదా?

పక్షంబునఁ గలుగుటంబట్టి

'పట్టివర్ణకంబు విభాష నగు' ననఁగా విభాషాపదముచేఁ బట్టి వచ్చుటయు రాకుండుటయుఁ గల దని చెప్పవలయును. అప్పుడు 'పట్టి' యైనచోఁ 'గలుగంగఁ బట్టి' యనియు విభాషచే పట్టి రానిపక్షములో 'కలుగంగ' ననియు నుండు నని చెప్పవలె. అనఁగాఁ బట్టివర్ణకము లేకున్నను హేత్వర్థమునకు క్షతి లే దని చెప్పవలె.

ఇట్టియెడలఁ బక్షాంతరమందలిరూపము 'కలుగుటంబట్టి' యని యె ట్లవును? విభాషచే పట్టి రాకుండవలయును గాని పట్టికి ముందు కలుగుధాతువు భావార్థక టవర్ణకాంతముగా మాఱిపోవు టేమి? దానిస్వరూపమే వేఱు గదా. ద్రుతమునకు లోపంబు విభాష నగు నన్న లోపము రానపుడు సంశ్లేషము వచ్చునా? లోపము రాకుండుటకు సంశ్లేషము వచ్చుటకు సంబంధ మేమి? అందుకే కదా లోపముతో పాటు సంశ్లేషము గూడ విధించినది. కావున 'ఇది రానపుడు కలుగుటంబట్టి అని యుండు' (సుబో. 157) ననునదే సూత్రకర్త యభిప్రాయ మైనచో నది పొరపా టనక తప్పదు.

తత్త్వ. 'ఇయ్యది వైకల్పికము గావునఁ బట్టివర్ణకము రానిపక్షమున కృదంతమునకు వచ్చును. కలుగుట యనునది కృదంతము. దీనికిఁ బట్టి యనునది చేరి కలుగుటం బట్టి ...(218) అన్నంతముపై రానిచోఁ గృదంతముపై వచ్చు టేమి? అన్నంతము గూడఁ గృదంతమే. ధాతువునకు విధింపఁబడిన 'డుఙ్ఞ్భిన్నప్రత్యయ' మయియుండఁ గా నుజి కృత్తు గాదా?

అన్నంతముపై విభాష యనుటచే రానపుడు పూర్వమునందలియన్నంత మట్లే యుండవలెను గాని ప్రకృతియే మాఱిపోవు టేమి? ఇట్టిస్థితి మఱి యెచ్చట నైన నున్నదా?

నిజమున కిట 'కలుగంగ' నను నుజ్యంతము భావార్థకమే యైయుంట గమనింపఁ దగును. కలుగంగఁబట్టి యనుదానికి కలుగుటఁబట్టి–కలుగుటచేత–కలుగుటవలన నని హేతువే యర్థము. కాఁగా నిట సూత్రకర్త చేయవలసినవిధాన మిట్లు గాదు. 'పట్టివర్ణకంబు ముందఱిభావార్థకటవర్ణకంబునకుఁ గొన్నియెడల నుజి విభాష నగు' నని సూత్రించుచో నీరీతి ప్రక్రియ గుదురును.

విభాష గావున నుజి రానిపక్షమున టవర్ణక మట్లే యుండుటయుఁ బట్టి వర్ణకము దానిపై నగుటయు సిద్ధించెడిది. అపుడు వ్యాకర్త చేసినపైవివరణము సరిపడును.

అవ్యయ మగునుజ్యంతముపైఁ బట్టి ప్రత్యయము మాత్రమే యవు నని చెప్పవలసినయవసరము నుండదు. భావార్థక మయ్యును నద్దానిపైఁ బట్టీతరవిభక్తులు నిలువ వని పట్టివర్ణకవిశేషవిధానము నియమించును. (వ్యా.సం.స. 1029)

ఇంకను ఈనుజీ టవర్ణకముస్థానమున విధించినచో నిది భావార్థక మవుటయు సిద్ధించును.

పక్షాంతరమునందు గలుగుటంబట్టి యవు ననుటలో కలుగగంగఁబట్టి యనుచోట నుజీ భావార్థక మని సూత్రకర్త సూచించుచున్నాఁ డని తలంపనగును.

నిజమునకు నన్నంతక్రియ భావార్థమ మగుట యెట్లు? చింతామణి దీని నసలు విధింపకపోఁగా బాల. తుమర్థభావలక్షణములందుఁ జెప్పినది. ఇటఁ దుమర్థము గాని, భావలక్షణార్థము గాని కుదురుపడదు కదా. హేతువునం దని చెప్పినను నుజ్యంతముయొక్క తుమర్థాదు లే మవును? వలయ్యాదిక్రియలకుఁ గర్త యగుచోట మాత్రమే నుజీని బాల. భావార్థమునందుఁ జెప్పినది. కాఁగా నిట భావార్థము స్పష్ట మగుటకు వీలుగా టవర్ణకమునకు నుజీ విధించుట యుచితముగా నుండు నని తోఁచుచున్నది. ఇయ్యది వికృతివివేకమునకు భిన్నముగాఁ జెప్పఁబడినను నట నున్నభావార్థమును స్పష్టము చేయుచుండుటచే గ్రాహ్య మనుటలో దోషము లేదు.

టవర్ణకమునకు నుజీ యైనను నుజ్యంతమే, కావున దానికివలె నుజ్యంత మగు నగుధాతు వవుటలో నిబ్బంది లేదు. (చూడవలయును, చూడఁగా వలయును) కావునఁ 'గలుగంగఁబట్టి' యని యవుటలోను బాధ లేదు. కల్గంబట్టి (ఆర. 6. 61) (వ్యా. సం. స. 1029)

తత్త్వ. సూత్రమునందలి 'మీఁదను' అనుచోటినుశబ్దము సముచ్చయమును బోధించుచున్నది. కావున నన్నంతక్రియలకే కాక కృదంతక్రియలకును బట్టివర్ణకము వచ్చు నని తాత్పర్యము'(218) ను వివరించినది. ఈవాక్యమును నన్నంతము కృదంతము గా దేమో యనునభిప్రాయము కల్గించుచున్నది. పైఁగా నుశబ్దముచేతనే కృదంతక్రియలపై నవు ననునర్థము సిద్ధించుచుండఁగా వైకల్పిక మనుటచే 'కలుగుటం బట్టి' యని యవు నని యీవ్యాఖ్యయుఁ జెప్పు టెట్లు కుదురును.

కృదంతక్రియ లన వచ్చి, రాక, (వ్యతిరేకక్త్వార్థము) వీనిపైని గూడఁ బట్టి యవు ననవలయునా? లేక యవియుఁ గృదంతములు గావా? మీఁదను అనుచోట సముచ్చయార్థము జ్ఞానముఁబట్టి, వచ్చుటంబట్టి యనుసూరి చూపినస్థలములను సంగ్రహించుచున్న దని గుర్తింపఁదగును.

## కు విభక్తి - ఇతరవిభక్త్యర్థములు

**13. షష్ఠీస్థానికం బగుకువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి.**

షష్ఠీవిభక్తి యైన కుప్రత్యయము షష్ఠియందే కాక ద్వితీయాదు లగునితరవిభక్తులకు మాఱుగా నాద్వితీయాద్యర్థములందును నగు నని సూత్రమునర్థము. కాఁగాఁ బ్రథమకు మాఱుగా మాత్రము గా దని తాత్పర్యము.

| | | |
|---|---|---|
| బ్రహ్మనుగూర్చి తపము | బ్రహ్మకుం దపము | ద్వితీయకు షష్ఠి |
| నీచేత నారాధ్యను | నీకు నారాధ్యను | తృతీయకు షష్ఠి |
| నీకంటె నొరు లగ్గలము | నీకు నొరు లగ్గలము | పంచమికి షష్ఠి |
| నీయం దనురక్త | నీకు ననురక్త | సప్తమికి షష్ఠి |

ప్రథమకుఁ బ్రవృత్తియే లేదు గాన లక్ష్యము లేదు.

చతుర్థికిఁ గూడఁ జూపలేదు. అ దే మన్నఁ 'జతుర్థికి నుదాహరణము పూర్వ వ్యాకరణములం జూచునది' యని పేర్కొనెను.

అనఁగా నేమి? ఈతఁడు చూపినయితరోదాహరణములు పూర్వవ్యాకరణము లందుఁ జెప్పఁబడలే దని వ్యాకర్త యభిప్రాయమా?

బాల. దీనికిఁ బూర్వవ్యాకరణమే కదా. అందును జతుర్థికి మాత్రమే షష్ఠి యగుట యుదాహరింపఁబడిన దని వ్యాకర్తయభిప్రాయము నెన్నవలెను. కాని యిది సరి గాదు. ఇతఁడు పంచమికిఁ జూపినషష్ఠిని బాల. చూపినది. బాలవ్యాకర్త యింతకంటె విపులముగానే యితరవిభక్తులకు షష్ఠి యగుటను జూపియున్నాఁడు.

| | | | |
|---|---|---|---|
| తోడ- | తృతీయ. | రాముని కిచ్చెను. | త్యాగోద్దేశ్యము. |
| కొఱకు, కయి | చతుర్థి. | పురుషార్థమునకు యత్నింపవలెను. | ఉద్దేశమాత్రము. |
| వలన | పంచమి. | పాపంబున కేవగించె. | (అపాదానము) |

ప్రౌఢవ్యాకర్త వలనకు షష్ఠి యగుట నుదాహరింపలేదు.

| | | | |
|---|---|---|---|
| కంటె | పంచమి. | రాముని కన్యుండు. | అన్యార్థాదియోగము. |

నిర్ధారణపంచమికి (కంటె) కువిభక్తి బాల. చెప్పలేదు. ప్రౌఢ.యు నుదాహరింపలేదు. రా దనియే యభిప్రాయము గావచ్చును.

పట్టి పంచమికి సూరి కువిభక్తి చెప్పలేదు. ప్రౌఢ.యు నుదాహరింపలేదు. రా దనియే యభిప్రాయము గావచ్చును.

యొక్కషష్ఠికి నాకుం దమ్ముఁడు. ప్రౌఢ. చూపలేదు. వచ్చు ననియే యభిప్రాయము గావచ్చును.

లోపలషష్ఠికి సూరి చెప్పలేదు. ప్రౌఢ.యుఁ జూపలేదు.

కాఁగాఁ గరణసహార్థములందలితృతీయకు, నిర్ధారణమందలి'కంటె'కును, పట్టి ప్రత్యయమునకును హేత్వర్థములందలిచేతకు కు షష్ఠి రానేరదు. ద్వితీయాదివిభక్తులకు మాఱుగా నని సామాన్యముగాఁ జెప్పుటచేఁ బైవానికిని కువిభక్తి రావలసియున్నది. 'కొన్నియెడల' ననుదానిచే నయ్యది స్పష్టము గాఁగలదు. కాఁగా నిం దస్పష్టముగా నున్నయంశములే పూర్వవ్యాకరణములవలనఁ దెలియఁదగియుండుటచే నిది విశేష మగుట యెట్లు.

ఇంక నిటఁ బ్రౌఢవ్యాకర్త విశేషముగాఁ జెప్పినది ద్వితీయాసప్తముల కగుట యన్నది బాల. వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడ,కువర్ణకంబు లగుటను బేర్కొనెను. వేటకుఁ బోయిరి. పొలమున కేఁగెను. బ్రహ్మకుం దపముసేసి యన్నవి మూఁడు ద్వితీయకు షష్ఠి యైనందుల కుదాహరింపఁబడినవి.

వేటను బోయిరి. పొలమును ఏఁగెను. అని యుండ ద్వితీయకు షష్ఠి యైన దనవలె. వేటఁ బోయిరి యనునది ద్వితీయతో నున్నందుకే వ్యాకర్త చూపెను. కాని పొలము నేఁగెను అనుచోఁ బ్రథమయే గాని ద్వితీయ కాదు. జడంబు ద్వితీయకుఁ బొల మేఁగె నని యున్న దనియుఁ గావున పొలము నరిగె ననుచో ద్వితీయకే షష్ఠి యైన దనియు వ్యాకర్త యభిప్రాయ మన్నమాట.

వేట, పొలము అనునవి కర్మము లయినవా? కాని అగు, పోవు ధాతువులను శ.ర. వీని నకర్మకక్రియలుగాఁ బేర్కొన్నది. అట్టియెడ నిట వేట, పొల మనునవి కర్మము లగుట యెట్లు? సర్వ. 'భారతమునందు వేట వోయిరి యనుపాఠమే కన్పించు చున్నది. అదియే సరి యైనరూపము. పోవుట అనుక్రియకు వేట యనునది కర్మము కా'(73) దన్నది. ఇటఁ గర్మ ముండ దనియే చెప్పఁదగు. ధాతు వకర్మకము.

కాని, సర్వ.'కావున వ్యాకర్త దీనిని ద్వితీయకు కాక ప్రథమకే యుదాహరణముగా చూపిన యోగ్యతరముగా నుండెడి' (73) దనుట యుచితముగాఁ గానరాదు. ప్రథమ మాత్ర మెట్లు వచ్చును? ప్రాతిపదిక సంబోధనోక్తార్థములం దిది యేదియుఁ గాదు. ప్రథమ వచ్చుటకుఁ దగినయవకాశములు నిట లేవు.

ఘం. కారక. 2.చే వేటను బోయిరి అని యుద్దేశార్థమున ద్వితీయ యగు (130) (తత్త్వ. 220) నని పేర్కొన్నది. ఆసూత్రము చెప్పిన గుఱించియో కూర్చియో కూడ చేసి వేటను గూర్చి పోయిరి అన్న నింకను స్పష్టముగా నుండును. సూత్రకర్త ద్వితీయకు నుదాహరించెను గావున ద్వితీయ నెట్లో సాధించుటయే యిటఁ బ్రధానోద్దేశ్యముగా గుర్తింపఁదగును.

కాని, యుద్దేశార్థమునందు 'కొఱకు, కయి, కు అనున వగుటను సూరి స్పష్టము చేసియున్నాఁడు గదా. అట్లే వేటకుఁ బోయిరి యనుచో నుద్దేశార్థమున షష్ఠి యైన దన్నచో ద్వితీయకు కుషష్ఠి యైన దని చెప్పవలసినయవసరమే యుండదు.

ఇట నొకానొకచో కొఱకు కయి వర్ణకంబులు నయ్యెడి. వేటకొఱకై, వేటకై. అని సూత్రకర్త వివరించుటయు నీయంశమును నీచోట కొఱకు, కయి యనువానివలె కువిభక్తి యుద్దేశార్థమునం దయిన దని స్పష్టము చేయుచున్నది. వేటఁ బోయిరి యనురీతి ద్వితీయయే తఱుచుగా నున్నపుడు గదా కొన్నియెడలఁ గువిభక్తి యైన దనుట? ఇట్లు చూడఁ 'బొల మేఁగె' ననుచో సయితము ద్వితీయకుఁ బ్రథమ యైన దని సమన్వయింపవలసినయవసరము లేదే కదా.

వేటఁ బోయిరి, పొల మేఁగె ననుచోఁ బ్రథమ యగుట విశేషము. ఒకానొకచో నొకవిభక్తికి మఱియొకవిభక్తియు ననులక్షణము దీనికి సాధక మైయున్నది.

ఇంక రెండవది.

బ్రహ్మకుం దపము సేసి యనుచో బ్రహ్మనుగూర్చి తపము చేసి యనునప్పటి ద్వితీయకు షష్ఠి యైన దన్నమాట. 'బ్రహ్మను దపము చేసె' నని ద్వితీయ చూపక కూర్చి ననుప్రయుక్తము చేసిచూపుట విశేషము. అనఁగా నీయది యుద్దేశార్థమునం దున్న దన్నమాట. అట్టియెడల నుద్దేశమాత్రమునకుఁ జతుర్థిని జెప్పి తఱుచుగా షష్ఠియే గల దని సూరి స్పష్టము చేసెను. కాఁగా బ్రహ్మకొఱకుఁ దపము చేసి, బ్రహ్మకయి తపము చేసి, బ్రహ్మకుఁ దపము చేసి యనునవి బాల. సిద్ధములే.

ఇంక బ్రహ్మను గూర్చి యనురీతిగా ద్వితీయయుఁ గూర్చియనుప్రయోగము నన్నవే విశేషములు. వానిని సాధించుట కిందలి కార. 2. సూత్రము ప్రసక్త మైయున్నది గదా. కాఁగా నిచ్చట షష్ఠి విశేషము గాదు.

నీచేత నారాధ్యను, నీకు నారాధ్య ననుచోటఁ దృతీయకు కువిభక్తి యైన దని వ్యాకర్త పేర్కొనెను. ఇటఁ దృతీయ యేయర్థమునం దయినది? కర్తకును, హేతుకరణములకును, గ్రహ్యాదియోగజం బగుపంచమికిని చేతతృతీయ విధింపఁ బడినది. కాని వానిలో నేయర్థ మిటఁ గలదు, తృతీయ చేయుటకు?

నీకు మార్కొనంగ నోపరు, నీతోడ మార్కొనంగ నోప రనుచోఁ దోడతృతీయకుఁ గువిభక్తి యైన దనెను. సూరి చెప్పిన 'తోడ' వచ్చుకరణసహార్థతుల్యార్థయోగము లిట సమన్వయింపఁబడవు. ఇట నర్థవిశేషము విశేష మని సూత్రకర్తయే వివరించెను. చేతతోడలకు కుప్రత్యయమును బ్రత్యేకముగా విధించుకొనుటయే యుక్త మని తోఁచుచున్నది.

ఇట సర్వ. మార్కొను, ఎదిరించు అనుక్రియలను వాడునపుడు ద్వితీయను వాడుట ప్రయోగరూఢము. ద్వితీయకు బదులుగా 'కు' వచ్చి(75)న దని భావించినది. కాని, వఝలవారు 'ఇట్లె ఎదురు, ఎదుర్కొను మార్కొను మున్నగునవియుఁ దుల్యార్థకములలోనివే' (వ్యా.సం.స. 991) యనిరి. తుల్యార్థకములలోనివె యనుట సరి గా దని 'నాతో మార్కొనలేరు (అప్ప. 3. 319), అయ్యని నాతోడఁ జతుర్దశాబ్దమున మా తై పోరు (సభా. 2. 207) (వ్యా.సం.స. 992) అనువానింబట్టి తృతీయయుఁ గలదు. కావున నిట నర్థవిశేషమునఁ దోడకువర్ణకములను స్పష్టము చేయుట యుక్తము.

ఇంక నిట సూత్రమున మిగిలినవిశేషము సప్తమికిఁ గువిభక్తి యగుట. నీయం దనురక్త. అయ్యది విశేషమే యనఁదగును.

కాఁగా సూత్రకర్త చతుర్థికిఁ బూర్వవ్యాకరణముల నెఱుంగు మనక దానికి నొకయుదాహరణ మిచ్చుట యుచితము.

ఇతరవ్యాకరణములలోఁ గువిభక్తి యవుట యిట వేఱ నిరూపింపఁబడినది. అందుకే కావచ్చును, సూరి కువిభక్తి యొకయర్థమునం దగుటను బ్రత్యేకముగా సూత్రింపక యాయయియర్థములందుఁ గన్పట్టుతావు లాయాయెడల వివరణమునఁ

బేర్కొనెను. చింతామణి సైతము కువిభక్తియర్థమును బ్రత్యేకముగా సూత్రింపలేదు.

దీనింబట్టి యొకయంశము స్పష్ట మగుచున్నది. కువిభక్తి యితరము లగు నాయయివిభక్తులయర్థమునందుఁ గొన్నియెడలఁ బ్రయుక్త మగుచున్నది. అంతే కాని యితరవిభక్తులకు భిన్న మైన, తనకు మాత్రమే పరిమిత మగుప్రత్యేక మగు నర్థములోఁ బ్రయుక్త మగుట లేదు. ఏది యే మైనను బాలవ్యాకరణమునఁ గువిభక్తి యాయాయర్థములం దగుట యట నట నిరూపింపఁబడఁగా, నిటఁ బ్రత్యేకముగాఁ జెప్పుటయే విశేషము. కొన్నియెడల ననుదళమునర్థమును బెక్కెడల బాలవ్యాకర ణానుగుణముగా గ్రహింపఁదగియున్న దని మాత్రము చెప్పవలెను.

'నీకంటె నొరు లగ్గలముగ' ననుచోటిపంచమికి షష్ఠి యై, నీకు నొరు లగ్గలముగ నని యైన దనియు నగ్గల మనునది యన్యార్థాదులలోని దనియుఁ బ్రౌఢవ్యాకర్త పేర్కొనెను. అన్యార్థాదియోగమునఁ గంటెతోపాటు కువిభక్తి యవుట సూరియే నిరూపించెను.

అగ్గల మన్యాదులలోని దనుటను విమర్శించుచు సర్వ. 'ఒరులు అనునదే యన్యాదులలోనిది కాని అగ్గలము అనునది కా' (76) దని పేర్కొన్నది. కాని యది సరి కాదు. ఒరు లనునది యన్యార్థ మయిమాత్రమున నదియే యన్యార్థాదులలోని దని నిర్ణయింపరాదు. అన్యార్థాదులతో యోగ ముండవలెను.

'నీకంటె నితరు లగ్గలముగ లేకుండ' ననున దన్వయించునట్లె 'ఇతరులు నీకంటె నగ్గలముగ లేకుండ' నని చెప్పుచో నగ్గలశబ్దార్థముతో యోగమువలనను గంటె నైన దనవచ్చును. ఈతనికంటె మేలు. (కార. 26) వంటిదే యిది యని గుర్తింపఁ దగును. కావున నన్యాదులలోని దనుట యసమంజసము గానేరదు. (తత్త్వ. 221)

## 14. వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకం బగు.

వీప్స యనఁగా నేకకాలమున ననేకవస్తువులందు వ్యాపింపఁగోరుట. క్రియా గుణద్రవ్యేషు యుగపద్ వ్యాప్తు మిచ్ఛా. దుర్గాదాసః. (ఘం. 131) మ్రానిమ్రానికి నరిగి యరిగి. కాలపరిమాణమునందు కువర్ణక మగుటకు – కొండొకసేపునకు. మొ.

ఇటఁ గు. పం. వ్యాఖ్య బాల. లోని 'ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' ననుసూత్రముచే మ్రానికిన్ + మ్రానికిన్ అని యున్నపుడు

విభక్తిలోపము రాఁగా బ్రానిబ్రానికిన్ అనురూపము సిద్ధించుచునేయున్నది. కావున నీసూత్రము పిష్టపేషణము. ఆమ్రేడితము వీప్సాదులందు సంభవించుచునేయుండును గదా (94) యన్నది. దీనిని సుబోధిని ఖండించుట యుచితమే.(161). ప్రస్తుత సూత్రము ద్విరుక్త మగుటను గాని, యామ్రేడితము పర మగునపుడు విభక్తిలోప మగుటను గాని చెప్పునది కాదు. విభక్తిలోప మగుటకు మున్ను విభక్తి కావలయును గదా. ప్రస్తుతసూత్ర మావిభక్తిని విధించుచున్నది. కావునఁ గు.పం. విమర్శనము సరి కా దనకతప్పదు.

ఐనను వీప్సయందుఁ గుప్రత్యయవిధాన మనవసరము. నిజమున కిట వీప్సయం దయినది ద్విరుక్తియే కాని కువిభక్తి కాదు. బ్రానుశబ్దమున కుద్దేశార్థమున కువిభక్తి రాఁగా బ్రానికి నరిగి యని యవును. ఒకేబ్రానునొద్దకు నైన బ్రానికి నరిగి అనియే గదా ప్రయోగింపవలసియున్నది. (సర్వ.78,తత్త్వ.223)

తత్త్వ. బ్రానిబ్రానికి ననుచోట షష్ఠీవిభక్తి కర్మార్థ మనవచ్చును. అరుగు అనుక్రియలో నియ్యది కర్మగా వివక్షించినచో బ్రానిబ్రానికి నరిగి యరిగి యడుగు అనియే యుండును గదా (223) యనుట సరిగా లేదు. బ్రానిబ్రానికి నరిగి యరిగి యని అరుగుధాతువులోని కన్వయించుటయే యుచితము. అరిగి యరిగి బ్రాని బ్రాని నడుగు ననుట యంత సహజముగాఁ గనిపింపదు.

కాఁగా వీప్సయందుఁ గువిభక్తి విధాన మనవసరమే యని నిర్ణయింపఁదగు.

ఇంకఁ గాలపరిమితిలో 'కు' చెప్పఁబడినది. దానింగూర్చి కు.పం. 'కాలపరిమితి యందలిక్వాగమమునకు బాల. యందలిబాహుళకముచే గ్రహణము గల్గు (94) నన్నది. దీనిని విమర్శించుచు సుబో. కాలాధ్వములకు నను బాల.సూత్రమున ప్రాయికముగా ననియే కలదు. క్వాగమమునకుఁ గాని, బాహుళకమునకుఁ గాని యట ప్రసక్తి లే (161) దన్నది. ఇట క్వాగమ మనుట కు.పం. మాట నుద్ధరించుట గావచ్చును. కాని క్వాగమ మనుట సరి కాదు. కువర్ణక మనవలయును. అది యాగమము కాదు గదా. కాని సూరి సూచించియున్నచోఁ దప్పుపట్టవలసిన యవసరమే యుండెడిది గా దనఁదగు.

కొంచుకసేపునకు ననుచో నర్థవిశేషము గలదు. తత్త్వ. (223), సర్వ. (73) సూరి ప్రథమను మాత్రమే సూచించె ననియుఁ, గొంతసేపు తెలివి అన్నచోఁ గొంతసేపు

మాత్రమే స్పృహ గలిగియుండి యని విరుద్ధార్థము కూడ వచ్చును గావున కువర్ణకము విధించుట యవసరమే (73) యని సర్వ. తలఁచినది. ఇట నర్థవిశేషమునుబట్టి ప్రథమయే కావలె నను నియమము లేదు.

ఏది యే మైనను గాలపరిమితిలో కువర్ణకము విధించుట మాత్ర మవసరమే యయియున్నట్లు తోఁచుచున్నది.

కాని పరిమితి యని చెప్పుటకంటె నవధి యని చెప్పిన నింకను స్పష్టముగా నుండెడిది. కేవలము పరిమాణమును బోధించునపుడే కువర్ణక మగు నని తలంప నవకాశము లేకుండ నవధి తెలియఁబడునపుడే కువర్ణకము విధించియున్న మిగుల స్పష్టతర మైయుండెడిది. అవధ్యర్థమున నితరములకును నట నటఁ గువిభక్తి గాననవుచున్నది. ఒకతడవకు ఇత్యాదులు కాలవాచకములు కావు గదా.

ఇట సూరి 'యవధినిర్దేశే సర్వస్మా న్నిత్యం షష్ఠీ' యని చెప్పుట గమనింపఁ దగియున్నది. అట్లు చెప్పుటయే యుక్తముగాఁ దోఁచెడిని.

## ప్రథమకు - యొక్క

**15. ధాతుజవిశేషణభావార్థకపూర్వవ్యవహితావ్యవహితకర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు.**

దీనియర్థము క్రమముగా నిట్లు గుర్తింపఁదగును.

ధాతుజవిశేషణములకుఁ బూర్వమునందు దానికి వ్యవధానముతోఁ బ్రయోగింపఁబడినకర్తృపదముయొక్క ప్రథమావిభక్తికి యొక్క యనుషష్ఠి యవును.

బాహుకు రథంబు గడపునేర్పునకు. కడపు అనునది యిట ధాతుజవిశేషణము. బాహుకుఁడు కర్త. ఈరెంటికి రథంబు అనుదానితో వ్యవధానము. భావార్థకాది యోగమున నీకర్తృపదమునకుఁ బ్రథమ రాఁగా (బాల.కార.32) నాప్రథమ కీ సూత్రముచే యొక్క ప్రత్యయ మై, దానికి లోపము (ప్రౌఢ.కార.16) వచ్చి, 'బాహుకు రథంబు గడపునేర్పు' అని యైనది. ఇట్లే 'తనమునుపడ్డబన్నములు' ము న్నగునవి.

ధాతుజవిశేషణములకుఁ బూర్వమందు వ్యవధానము లేకయె ప్రయుక్త మయిన కర్తృపదమునకును యొక్క షష్ఠి యవును.

మనపుట్టి బుద్ధి యెఱుఁగుట. ఎఱుఁగుట యనునది భావార్థకరూపము. మనము

అనుకర్తృపదము పూర్వమునఁ బ్రయుక్త మైనది. పుట్టి బుద్ధి యనువానితో నిట వ్యవధానము గలదు. ప్రథమకు యొక్క యై, లోపింపఁగాఁ బైరూప మయినది.

భావార్థకశబ్దమునకుఁ బూర్వమున నెడము లేకుండఁ బ్రయుక్త మైనకర్తృపదము ప్రథమకును యొక్క యగును.

పరీక్షిజ్జనపాలు చనుట. చనుట యనుభావార్థకమునకుఁ బూర్వమున నవ్యవహితముగాఁ బ్రయుక్త మయినకర్తృపద మగు పరీక్షిజ్జనపాలుఁ దనుచోటి ప్రథమకు యొక్క విభక్తి రాఁగా (పరీక్షిజ్జనపాలుయొక్క), నయ్యది లోపించి, పైరూప మైనది.

ప్రథమకు యొక్కషష్ఠి విధించుటవలనఁ బ్రథమ యంతకుముందే సిద్ధ మయియున్న దని స్పష్టము. 'భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు' నను బాల.కార.32 సూత్రముచేఁ బ్రథమ యవును. ప్రథమ యగు నని నిత్యముగా విధింపఁబడుటంజేసి ప్రయోగానుసారముగా యొక్క యవుట నీప్రౌఢ. స్పష్టము చేయుచున్నది. అట సూరి రాముఁడు వచ్చుట, రాముఁడు పట్టినప్రతిన యని భావార్థకమును ధాతుజవిశేషణము నుదాహరించుట గమనింపఁదగును.

యొక్క షష్ఠి తఱచుగ నగు ననుటచే నీసూత్రము ననుసరించి యొక్క రానియెడల బాల.కార.32 సూత్రముచే నయినప్రథమ యట్లె యుండును.

కాఁగా నీప్రౌఢ.లక్షణము 'భావార్థకాదియోగంబున' ననుసూరిలక్షణమునకు సవరణ మని గుర్తింపఁదగును. కాఁగా సర్వ. వ్యాఖ్య యీప్రౌఢ.సూత్రమును బాల.కార.32 సూత్రమునకుఁబిదపఁ జూపవలసియున్నది. దీనినిబట్టి యివ్వాని ప్రక్రియను జూపుచో (బాల.సూత్రముచే నగు)ప్రథమకు యొక్కషష్ఠి యగు ననుటచే నిట షష్ఠి ప్రథమార్థక మను ఘం.వివరణ ముచితము.

ఈప్రౌఢ.విధాన మనవసర మని సర్వ. తలఁచినది. ప్రౌఢవ్యాకర్త వీనిని వ్యస్తము లని తలఁచుటచే నిట్లు సూత్రించె ననియుఁ గాని యీయవి సమాసము లనియు బాహుకుయొక్కరథంబు గడపునేర్పు అనుచో సమాసవిభక్తి లోపము గలిగిన దనియు నిట్లు వ్యవధాన ముండఁదగు ననియుఁ బేర్కొన్నది. కర్త ప్రథమాంత మైయున్నచో వ్యస్త మనియు, షష్ఠ్యంత మైనచో సమస్త మనియు (83) సిద్ధాంతము.

ఈసమన్వయ ముచితముగా లేదు. సమాసము చేయఁబూనినచో షష్ఠి

యగుటకుఁ గారణ మేమి? వ్యస్తముగా నున్నపుడు షష్ఠి యేల రాదు? ముందు షష్ఠీవిభక్తి యైనఁ గదా పిదప సమాసమున దానికి లోపము చేయుట. అయ్యది సమాసమే యన్నను షష్ఠీవిభక్తివిధానము మాత్రము తప్పదు.

తనమునుపడ్డబన్నము లనుచో తనయొక్క బన్నము లని సమాసము చేసినను, నేకార్థీభావసామర్థ్యముచే వ్యవధానము గుదురు నని సర్వ. పేర్కొన్నది. దీనినే దృష్టియం దిడుకొని కావచ్చును, తత్త్వ. ఇట మునుపడ్డ అనుపదము లడ్డముగా నున్నందున సమాస మనుటకు వీలు కా దని తలంచరాదు. ఈకన్నులు తెఱవనిశిశువు. ఈ అనునది శిశువు అనుపదముతో నన్వయింపవలసియుండఁగా వీనిమధ్యమున 'కన్నులు, తెఱవని' అనుపదములతో వ్యవధానము గలదు గదా. సమా. 18. సూత్రమును దత్పురుషకర్మధారయములకు రెండింటికిని వర్తించునట్లు సవరించుట యుచిత (228) మన్నది. సమా. 18 సూత్రము తత్పురుషములకుఁ జెప్పలేదు కావున నిట్లు చెప్పుట సూత్రకర్తపక్షమున నవసర మనఁదగును. ఇంక నట్లు గాక తత్పురుషములందును నని సవరించినను నచ్చట ధాతుజవిశేషణములకు మాత్రమే యట్టివ్యవధానము చెప్పఁబడినది. మనపుట్టిబుద్ధి యెఱుఁగుట యనుచో భావార్థకము గదా వ్యవహిత మైయున్నది.

దీనింగూర్చి తత్త్వ. 'వ్యవహితము లయినచోటం గూడ మనపుట్టిబుద్ధి యనుచోట మాత్రమే పుట్టి అనునవ్యయ మడ్డముగా నున్నది. మిగిలినపదములు సమాస యోగ్యములే. అవ్యయములు గూడ సమాసములలోఁ జేరుట సంస్కృతమునందుఁ గలదు. ఆపద్ధతి ననుసరించినచో పుట్టి అనుపద ముండుట విరుద్ధము కా (228) దన్నది.

అనఁగా నిచటఁ గూడ 'బుద్ధియొక్క యెఱుఁగుట – బుద్ధి యెఱుఁగుట'. 'మనయొక్క (పుట్టి) బుద్ధి యెఱుఁగుట' యని మొత్తమును సమాసముగా 'బాహుకు రథంబు గడపునేర్పు' అనుచోవలె సమన్వయింపఁదగు నని వ్యాఖ్యయభిప్రాయ మన్నమాట. పుట్టి యనుదానికి సమాస మె ట్లన్న సంస్కృతమునం దట్టిది దల దన్న దీవ్యాఖ్య. సంస్కృతమునం గలదు గావునఁ దెలుఁగున నుండనగు నని యభిప్రాయమా? తెలుఁగునం దవ్యయీభావసమాసము సంస్కృతమునందువలె నున్నదా? 'నాపి వికృతా వవ్యయీభావః' (సూత్ర) తెలుఁగువ్యాకరణము చెప్పకుండఁ గనే సంస్కృతమునఁ గల దనుభావముచే నంగీకరించుట యెట్లు? ఇంక నిట

సమా. 18 సూత్రప్రసక్తి యనవసరము. బాహుకురథంబు గడపునేర్పు అనునది మొత్తము సమాసముగానే సమన్వయించునపుడు వ్యవహితత్వ మెక్కడ? ఇట వ్యవహితత్వమే లేమి సమా. 18 సూత్రమును దత్పురుషములకునుగా సవరింపవలసిన యవసర మేమి?

మనపుట్టిబుద్ధి యెఱుఁగుట యనుచోఁ బుట్టి యనునది యవ్యయ మగుటచే పైరూప మంతటిని సమాసముగా సమన్వయించుటకు వీలు లేదు. కావున పుట్టితో నైన వ్యవహితత్వము గల దని చెప్పనక్కఱ లేదు. కాని సమా. 18 సూత్రమును దత్పురుషములందును నవకాశము గల్గునట్లు మాత్రమే సవరించినను వీనియెడలఁ బ్రయోజనము లేదు. ఎఱుఁగుట యన్నది భావార్థకము. ఇయ్యది ధాతుజవిశేషణము గామి నాసూత్రమును షష్ఠీతత్పురుషములందును బ్రవర్తించునట్లుగా సవరించినను వ్యవహితత్వము సిద్ధింపదు. కావున భావార్థకోత్తరపదపరకత సయితము చేర్చి యింకను సవరింపవలసియుండును. దానికంటెఁ బ్రత్యేకముగా న ట్లని సూత్రించు కొనుటయే యుక్తము.

ఇంక సర్వ. ప్రథమ యైనచో వ్యస్తరూపమును, షష్ఠి యైనచో సమస్తరూపము నని చెప్పుట యుచితము గాదు. మఱి ధాతుజవిశేషణభావార్థకములలో నన్వయము నందుఁ బ్రథమ యగు ననియు బాహుకుఁడు గడపు. అట్లు గాక సంబంధార్థమున బాహుకునినేర్పు అనురీతిగా నన్వయించుచో షష్ఠి యైన దనియుఁ గావునఁ బ్రథమకు షష్ఠి విధింపనక్కఱ లే దనియుఁ జెప్పుట యుచిత మైయుండును.

ఇటఁ దత్త్వ. 'ఈకర్తృవాచకములకుఁ గ్రియాజన్యవిశేషణములతోఁ గాక వానివిశేష్యములతో నన్వయము వివక్షించినచో సంబంధసామాన్యబోధక 'యొక్క షష్ఠి' యెట్లును గలుగును. ఈకర్తృపదమునకు విశేష్యముతో సమాసమునందు యొక్క విభక్తి లోపించె నని తెలియవచ్చు' (227) నన్నది. సూరి భావార్థకాదులయోగ మున్నపుడే ప్రథమ చెప్పెను. ఇట ధాతుజవిశేషణములవిశేష్యముతో నన్వయముచే షష్ఠి సాధారణముగనే యవును. కావున విధాన మక్కఱ లే దందము.

కాని యెల్లయెడల నిట్టియన్వయము కుదురునా? 'నాచూడనిరాజు' లనుచో చూడనట్టిరాజులు = చూడనిరాజులు. నాయొక్క చూడనిరాజులు = నాచూడని రాజులు. అని యన్వయించుటకు రాజులు అనుదానితో నే ననుదానికి సంబంధము

గలదా? నేను చూడనట్టిరాజు లనురీతిగా నే ననునది చూడని అనుధాతుజ విశేషణములోనికే యన్వయించును గాని దానివిశేష్యముతో నన్వయింపదు. ఇది యవ్యవహితము నవుట గమనింపఁదగును.

'బాహుకు రథంబు గడపునేర్పునకు' అనుచోట బాహుకుఁడు రథంబు గడపు నేర్పునకు నని యున్నదా? ధాతుజవిశేషణముతోనే యన్వయించుచున్న దనవలెను. కాని 'బాహుకురథంబుగడపునేర్పు' అనుచో మాత్రము ధాతుజవిశేషణవిశేష్యముతో సమన్వయింపవలె ననుటలోఁ గొంత యసహజత్వము గల దనవచ్చును. 'బాహుకురథంబు గడపునేర్పు' అనునది మొత్తము సమాస మైయుండఁగా 'రథంబు గడపు' అనురీతిగా గసడదవాదేశము గానవచ్చుట విశేషము.

ఇంక నివి యెల్ల సమాసములుగా నిర్వహించుటకు నవకాశమును లేదు. 'నాయొనర్పంబూనిన' అనుచో 'ఒనర్పంబూనిన కళాపూర్ణోదయము' అనున దెల్ల సమాస మవునా? సమాస మయ్యు ద్రుతము లోపింపకుండుట యిం కొక విశేషముగా గుర్తింపవలెనా? కాన నిట్టివి సమాసము లనుట కవకాశము లేదు.

ఇంకఁ దత్త్వ. క్రియాజన్యవిశేషణవిశేష్యములతోనే కర్తృపదము సంబంధార్థముతో సమన్వయించు నన్నది. కాని భావార్థకమును గూర్చి ప్రస్తావింపలేదు. 'నీదు హృదయంబు నాదుచొచ్చుట' అనురీతిగా భావార్థకముతోడిసమాసము గాన నవుచున్నది. అ ట్లయినను 'తనపుట్టి బుద్ధి యెఱుఁగుట' యనుచోఁ 'బుట్టి బుద్ధి యెఱుఁగుట' యనునవి రెండును వ్యవధాయకముల యైయున్నవి. భావార్థకముతో సమసించుట య ట్లుంచి యిటఁ గర్తృపదము భావార్థముతోడనే యోగము కల్గి యున్న దనుట స్పష్టము కదా. ఇట్లు భావార్థకాదులతో యోగ మున్నపుడు ప్రథమ యగు నని బాల. చెప్పుచున్నది. నాయొక్క చొచ్చుట = నాదుచొచ్చుట యనురీతి నవుటకు నిట షష్ఠి యవు టెట్లు? నాయొక్క అనురీతిగా సంబంధార్థమును వివక్షించి షష్ఠి చేయవలయును. 'నేను చొచ్చుట' యని ప్రథమ యెట్లును నన్వయించును. ప్రథమను సూరి చెప్పినషష్ఠియుఁ బ్రథమార్థమున సముచితముగానే సమన్వయింపఁ బడుచుండఁగాఁ బ్రథమకు యొక్కషష్ఠివిధానము సముచితమే కదా.

కాని తత్త్వ. 'ఇక నీషష్ఠ్యంతపదములు వ్యస్తములే యనియు వీనికి విశేష్యముల తోడనే వ్యపేక్షారూప మైనసంబంధము గల దనియుఁ దలఁచినచో నెట్టివిరోధమును గానరాదు. కావున నీసూత్ర మనావశ్యక మని తెలియఁదగు' (258) నన్నది. షష్ఠి

యె ట్లయ్యె నన్నది ముఖ్యము. షష్ఠి యయినచో యొక్క యెట్లు నిచట నిత్యముగనే లోపించుచున్నది. కావున సమాసములు గా వని భావింపవలసినయవసరము లేదు. 'నాయొనర్పం బూనినకళాపూర్ణోదయ' మనుచో నయ్యది సమాస మవుటకు వీలు లేదు. కాని యిట ధాతుజవిశేషణవిశేష్యముతోడిసంబంధమువలన షష్ఠి యైన దనుటకు వీలు లేదు. 'నాచూడనిరాజు' లిత్యాదిస్థలములలోఁ గర్తృపదము ధాతుజవిశేషణములతో మాత్రమే యన్వయము గలిగియుండుట స్పష్టమే కదా.

సూరి చూపిన రాముఁడు పట్టినప్రతిన, రాముఁడు రక్షించినభృత్యుఁడు, రాముఁడు వచ్చుట, ఇత్యాదిస్థలములలోనిప్రథమ ధాతుజవిశేషణాదులతోడియోగమును స్పష్టము చేయుచున్నది. 'బాహుకు రథంబు గడపునేర్పు' అనునది సయిత మిట్టిదే యని గుర్తింపఁదగియున్నది.

'తత్ర కర్తుః ప్రథమా అస్తి. త త్తథా సమాసే షష్ఠీ' అనుచో సూరి సైత మిచటఁ బ్రథమకు షష్ఠి యవు ననియె (సమాసే యనుట విశేషము) సూత్రాంధ్రవ్యాకరణమునఁ దలఁచినట్లు తోఁచుచున్నది.

'రాముఁడు గోవు నిచ్చినవిప్రుఁడు' ఇత్యాదులయందుఁ గర్తృపదము ప్రథమకు షష్ఠి గానరాదు. ఇటఁ గూడఁ గర్తృపదము వ్యవహిత మయి ధాతుజవిశేషణముతో నార్థికాన్వయము గలిగియుండుట స్పష్టము.

కావున నీవిధానము సముచితముగానే యున్న దని నిర్ణయింపఁదగు. కాని సూత్రమునందు స్పష్టతకయి విస్తృతి కల్పింపఁబడిన దని తోఁచుచున్నది.

పక్షమునఁ దఱచుగ ననుటచే 'బాహుకుండు రథంబు గడపునేర్పునకు' ననియు నుండఁదగు నని సూత్రకర్తయే స్పష్టము చేసెను. అనఁగా 'భావార్థకాదియోగంబున' ననుసూరిలక్షణము ననుసరించి యిట వ్యవహితస్థలములయందును గర్తృపదమునకుఁ బ్రథమ యవుచునేయున్నది. సూత్రకర్త యట్టిప్రథమకే కదా షష్ఠిని విధించుచున్నాఁడు. అట్టియెడల వ్యవహితావ్యవహితవివక్ష యేల?

'ధాతుజవిశేషణభావార్థకాదియోగంబునం గర్తృపదప్రథమకు యొక్క తఱచుగ నగు' నని మాత్రము సూత్రించినఁ జాలు నని తోఁచుచున్నది.

## యొక్కలోపము

**16. యొక్కకులోపంబు బహుళంబుగా నగు.**

యొక్కకు వ్యస్తతలోను లోపము బహుళముగా వచ్చు నని యర్థము. సమాసము లందు మిగిలినవిభక్తులతోపాటు యొక్కయు నెట్లును లోపించును గావున నీవిధానము ననుసరించి వ్యస్తతలోనే యొక్కలోప మీసూత్రము చెప్పుచున్న దని స్పష్ట మగుచున్నది.

ఎవ్వనియొక్క ఏని – ఎవ్వనియేని. ఇట్టియిచ్చటిలక్ష్యము లనేకములు వ్యస్తము లైనను యొక్క లోపించిన దని సూత్రకర్తయభిప్రాయము. కాని యివి యెల్ల సమాసములే యనియు, సమాసత్వమువలననే యొక్కవిభక్తి లోపించుటచేఁ బ్రత్యేకముగా లోపము విధింప నక్కఱ లే దనియుఁ గొన్నివ్యాఖ్యలు పేర్కొనుచున్నవి.

సర్వ. 'ధర్మజుతమ్ములు అనునది సమాస మనుట కాక్షేపము లేదు గదా. ఇఁకఁ దమ్ములు అనుపదముతో యోగ్యత గల నలువురు అన్నది వ్యవధానము కలిగించుచున్నది. కావున సమాసము కా దనిపింపవచ్చును. కాని సమాసమునందు ఏకార్థీభావసామర్థ్యము ప్రధానలక్షణము దాని కనుకూలముగా నెన్ని పదములు చేరినను సమాసలక్షణమును భంగింపఁజాలవు. చిన్నయసూరి సమాసపరిచ్ఛేదము చివర రాముఁడు రక్షించినభృత్యుఁడు, రాముఁడు వాలి నేసినబాణము మున్నగువానిని సమాసములుగానే పరిగణించె' (87) నన్నది. ఏకార్థీభావసామర్థ్య మున్న దనియుఁ గావున నలువురు అనునది మధ్యలో వ్యవహితముగా నుండుట కిబ్బంది లే దనియుఁ జెప్పుట యుక్తము గానేరదు. అది యట్లె యయిన విశేషణోభయపదకర్మధారయము లలో వ్యవహితత్వమును బ్రత్యేకముగాఁ జెప్పిన ప్రౌఢ. సమా.18 సూత్రము వ్యర్థమే యని చెప్పవలెను. ధర్మజుయొక్క తమ్ములు ధర్మజుతమ్ము లని సమాసము ప్రాతిపదికము గాఁగా దానిమధ్యలోఁ బ్రత్యేక మగుశాస్త్రము లేకుండ నిం కొక పదము వచ్చిచేరుట సంప్రదాయవిరుద్ధ మనకతీఱదు.

రాముఁడు రక్షించినభృత్యుఁడు సమాస మని సూరి పేర్కొనె ననుటయు సంగతము గాదు. సమాసపరిచ్ఛేదమునఁ జూపుటచే నీయది సమాస మని చెప్పుటకు వీలు లేదు. ఈవ్యాఖ్య యాసూత్రమునొద్ద సయిత మట్లే యివి సమాసములుగాఁ జెప్పినది

(278). 'రాముఁడు రక్షించిభృత్యుఁడు' అనునది సమాస మనుటచే 'రాముఁడు' అనునది సైతము సమాసావయవమే యని సర్వ. భావించినట్లు స్పష్టము.

'కర్మాదులకుం బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణములు కర్తతోడంబలె వానితోడ సమసించు' ననుసూత్రములక్ష్యము లివి. సూత్రము ననుసరించి కర్మ యగు'భృత్య'శబ్దమునకుఁ బ్రాధాన్యమును వివక్షింపఁగా 'రక్షించిన' అనుధాతుజ విశేషణము 'భృత్యుఁ' డనుదానితో సమసించు ననియే యర్థము. కావున 'రక్షించిన భృత్యుఁ' డనునది సమాసముగా సూరిసూత్రము సాధించుచున్నది. రాముఁడు అనుకర్తకు నిట సమాసముతో సంబంధ మే మున్నది. కాఁగా పట్టినప్రతిన అనుదానివలె 'రక్షించినభృత్యుఁ' డనునది సమాసము కాఁగా, రామ అనుకర్తృవాచికి బాల.కార. 32 సూత్రముచేఁ బ్రథమ యై, 'రాముఁడు రక్షించినభృత్యుఁ' డని యైనది. 'రాముఁడు పట్టినప్రతిన' అనుచోటవలె నిటఁ గూడ రాముఁడు వ్యస్తపదమే కాని సమాసావయవము గాదు. ధాతుజవిశేషణములు కర్మాదులతో సమాసమునందు నని చెప్పినచోట్ల కర్తృవాచకమును సమాసావయవమే యని తలంచె ననుట పొరపా టని స్పష్టము.

కావున నది దృష్టాంతముగా 'ధర్మజునలువురుదమ్ము' లనునది సమాస మనుటయు సరి కాదు. పైఁగా నిట 'ధర్మజునలువురుదమ్ము' లనుచో సమాసము మధ్య 'నలువురు' అనుపదము చేరిన దని చెప్పుటయు, రాముఁడు రక్షించినభృత్యుఁ డనుదానితోఁ బోల్చుటయు సందర్భోచితము గాదు. పదము లెన్ని యైన నుండుట కైనను నిది లక్ష్యము గానేరదు. ఈసూత్రలక్ష్యములు సమాసములే యనుటకు సర్వ. ఇం కొకప్రమాణమును జూపినది.

'ప్రౌఢవ్యాకరణకారుఁడే వారివ– అనువిషయమును వివరించుచు నిది షష్ఠ్యంత మునకు విశేషణము గనుక ప్రథమ యని చెప్పెను. 'ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబుల కగువిశేషణంబులషష్ఠికిని బ్రథమ చూపట్టెడి' ననుసూత్రమును గూర్చి ప్రసంగించుటచేత 'వారివ' మున్నగుచోటిది సమాస మని తా నంగీకరించుచున్నట్లే. సమాస మైనపుడు యొక్కకు లోపమును వేఱుగా విధింపవలసినయావశ్యకమే లేదు. (87) ఈవ్యాఖ్య యి ట్లనుటకుఁ గారణము సుబోధిని ఒక్కచో (కార. 21) అనుసూత్రముచే షష్ఠ్యర్థమునఁ బ్రథమ వచ్చె ననుట (166) యనవచ్చు. వారివి యనుచోఁ బ్రథమ యెట్లు వచ్చినదో సుబోధిని వివరించినది. యొక్క లోప మెక్కడ?

సుబోధిని వివరణములో లక్ష్యలక్షణసమన్వయము స్పష్టముగా లేదు. దానినే సర్వ. గ్రహించినది. ఒక్కచో ననుసూత్రము నుద్దేశించి సూత్రకర్త యిట్లు ప్రసంగించె ననుట కాధార మేమి? ప్రథమ వచ్చిన దన్నాఁడు, కాని కార. 21 సూత్రముచే ననలేదు గదా.

అస లిచ్చట కార. 21 సూత్రము ప్రసక్తియే లేదు. సూత్రకర్త చేసినవివరణము నకే యిటఁ బ్రయోజనము లే దని సర్వ. (85) పేర్కొన్నది. తత్త్వ. 'వారివి–అ – వారివ. ఉదాహరణాంశము కాకున్నను పద్యములోనిక్లిష్టాంశమును దెలుపుటకై వారివి–వారివ యైన దని వ్యాఖ్యానము చేసె' (229) నన్నది. కాని యది సరి కాదు. అవసర ముండియే సూత్రకర్త యీవివరణము చేసెను.

పుష్పదామములయు ననుచో యొక్క లోపించిన దని సూత్రకర్త యభిప్రాయము స్పష్టము. అస లట యొక్క ప్రత్యయము లోపించిన దనుటకు ముందు 'యొక్క' కల దనుట కాధార మేమి? 'వారివి' ప్రథమాంతము. విశేషణము. అవధార ణార్థకముతోఁ గూడియున్నది. అట్టియెడల విశేష్యము (విభక్తియే విశేషణమున కగును గావున) ప్రథమాంత మై, దామములు అని యుండ, దానిపై నవధారణార్థక మగునకారము చేరి 'వారివ' యనుదానివలెనే 'దామముల' అని యవును. దీనిపై సముచ్చయాద్యర్థవిశేషద మగు'ను'శబ్దము చేరఁగా 'దామములయు' నని యుండును. కాఁగా విశేష్యవిశేషణములు రెండును బ్రథమాంతములే యని తెలియు చుండఁగా యొక్కషష్ఠియే లేదు గావున యొక్క లోపించినందుల కిది యె ట్లుదాహరణము గాఁగలదు. అని సందేహము గలుగుట కవకాశము గలదు. కావున నిట యొక్కషష్ఠి గల దనియు, నయ్యది లోపించి, యిట లక్ష్య మైన దనియుఁ దెలుపుట ప్రయోజనముగా సూత్రకర్త యీవివరణము చేసినట్లు గ్రహింప వలెను.

కాఁగా 'దామములయొక్క' షష్ఠ్యంతము. మఱి 'వారివి' యనువిశేషణము ప్రథమాంత మె ట్లయినది? ఒకానొకచో బాల. కార. 27 సూత్రముచే విశేషణషష్ఠికిఁ బ్రథమ యైనది. కావున విశేష్యషష్ఠి యైన యొక్క నిలిచియుండఁగా నయ్యది ప్రస్తుతసూత్రముచే లోపించుటచే నిట సూత్రమున కుదాహరింపఁబడిన దని గ్రహింపవలసియున్నది.

కాఁగా నీవివరణము సూత్రమునకు దోహదకారి కా దనుట సంగతము

గానేరదు. ఈవిశేషణముషష్ఠికి (షష్ఠీవిశేషణానా మ్మని) చింతామణిచేఁ బ్రథమ యైనది. కాని 'ఒక్కచో' మున్నగుప్రౌఢ.సూత్రమున కిటఁ బ్రసక్తియే లేదు.

పోనీ. 'ఒక్కచో' ననుసూత్రముచేతనే యిట 'వారివి' యనుచోఁ బ్రథమ యైన దందము. అట్టియెడల 'దామములయు' నన్నది షష్ఠీసమాస మనియు, 'దామముల యొక్క' యనుసమాసాంతర్గతషష్ఠి ననుసరించినవిశేషణముషష్ఠికిఁ బ్రథమ యైన దనియు నందము. వారివానియొక్క యనుచోటివిశేషణముయొక్క షష్ఠికిఁ బ్రథమ యైన దన్నమాట. ఇట్టియెడల 'వారివి' యనునది సమాస మగుటలో నిబ్బంది యే మున్నది? సమాస మవుటచేతనే కదా వృత్తిలో నవిశబ్దమునకారమునకు లోప మయినది. (వారి+అవి=వారివి)

'వారివి' యనునది సమాసమే యవును గావున యొక్కలోపము విశేషముగాఁ జెప్ప నేల? అన్నది సర్వ. (87) అసలు ప్రస్తుతసూత్రముచే యొక్క లోప మగునది యెక్కడ? వారివ యనుచోటనా? ఇంతకు ముందు లక్ష్యవివరణములో దామములయొక్క యనుచో యొక్క లోపించిన దని సర్వస్వవ్యాఖ్యయుఁ బేర్కొన్నది. అట్టియెడ 'దామములయొక్క' యనుచో యొక్కలోపమును సూత్రము చెప్పుచుండఁ గా వారివి యనునది సమాసమే కావున యొక్కలోపవిధానము వ్యర్థ మనుట యసందర్భము గదా. వారివ యనుచో యొక్క లోపించిన దని సూత్రకర్త చెప్పుట లేదు. ఇంతకు ముందటివివరణములో నీవ్యాఖ్యయు నట్లు చెప్పలేదు. కావున దీనింబట్టి యొక్క లోపవిధానము వ్యర్థ మనుట యొప్పదు. 'వారివ' యనునది సమాస మైన, 'దామములయు' నన్నది సైతము సమాసమే కావలె నని యున్నదా?

అసలు 'దామములయు' ననురూప మె ట్లయినది? దామములయొక్కయు ననుచోటియొక్క లోపించి, 'దామములయు' నని యగుచున్న దనుట సరి కాదు. ఈసూత్రకర్తయే యింతకుముందు 'మఱియు నది యొక్క లోపించునపుడు లాగమాంతబహువచనంబుమీఁదను సముచ్చయమునం జూపట్టెడి' (శబ్ద. 116) నని పేర్కొనెను. అనఁగా దానిని యథాతథముగా ననుసరించినచో నిట 'దామముల యొక్క' యని యుండఁ బ్రస్తుతసూత్రముచేత యొక్క లోపించి, 'దామముల' అని యుండఁగా, యొక్క లోపించినలాగమాంతబహువచన మయినది, కావున దీనిపయి శబ్ద116.చే (యువర్ణపూర్వక మై) నుశబ్దము చేరి, 'దామములయు' నని యవును.

'దామములయు' ననునది సమాస మనుటకు వీలు లేదు గదా.

వారివ' యన్నది సమాస మని సమన్వయించినసర్వస్వవ్యాఖ్య 'దామములయు' నన్నది సమాస మనలేదు. అట్టియెడ నీసూత్రమునొద్ద నున్నలక్ష్యము లెల్ల సమాసములే యనుట కిదియు నాధారము గాదు.

ఇట్లు సమాస మగు ననుటచే కాక వ్యవహితము లగు ననుటకును సర్వ. చేసినవివరణ మాధారముగా లే దని నిర్ణయింపనగును.

ఇంక నిట సర్వ. చూచితిని, వానిని మున్నగువిధముగా విభక్త్యంతములు తమతో అన్వయించువానికి పరమందు కూడ రావచ్చును. యొక్క విభక్తి యెపుడును పరమందు ప్రయుక్తము కారాదు. నాయొక్క-తమ్ముఁడు అని యుండవలయునే కాని తమ్ముఁడు-నాయొక్క అని యుండరాదు. దీనినిబట్టియు యొక్క అనునది విలక్షణ మైన దనియు దానితోడిరూపములు సమాసము లై తీఱు ననియు అందు వలననే యొక్కకు లోపము కలుగుచున్న దనియు నిర్ణయింపనగు (87) నని యివి సమాసము లనుట కిం కొకయాధారము చూపినది. తత్త్వ. కూడ నిట్లె చెప్పె.

కాఁగా యొక్కాంతము సంబంధివాచకమునకు ముందే ప్రయోగింపఁబడును గావున సమాసము కాక తప్ప దన్నమాట.

బహుశః సర్వ. అందుచేతనే 'రాముఁడు రక్షించినభృత్యుఁ' డనునది మొత్తము సమాస మని యెంచియుండవచ్చును. భావార్థకాదియోగమునఁ బ్రథమ రాఁగా 'రాముఁడు రక్షించినభృత్యుఁ' డనుచో రాముఁ డనునది ముందే యుండవలయును గాని 'రక్షించినభృత్యుఁడు రాముఁడు, పట్టినప్రతిన రాముఁడు' అనురీతిగాఁ బరముగాఁ బ్రయుక్త మగుట లేదు గదా. అందుకే యిటఁ గర్తృపదము సైతము సమాసావయవమే యని యీవ్యాఖ్య భావించిన దేమో. అనఁగా ప్రౌఢ. పూర్వ సూత్రము సమాసమునందుఁ బూర్వావయవముగా నున్నశబ్దము ప్రథమకే యొక్క చెప్పుచున్న దన్నమాట. అ ట్లది సమాసమే యవుటచేత సమాసమునందు యొక్క లోపించిన దని సమన్వయించుట బాగుగనే యున్నది. కాని యొక్క రానపుడు సమాసపూర్వావయవమునఁ బ్రథమ యట్లె యుండును గదా. 'బాహుకుఁడు రథము గడపునేర్పు' అనునదియు సమాసమే. అట్టియెడఁ బ్రథమాంత మైనకర్త యున్నపుడు వ్యస్తరూప (82.సర్వ.) మని పేర్కొను టెట్లు గుదురును? ఇయ్యది రాముఁడు రక్షించినభృత్యుఁ డనుదానివంటిదే కదా. రాముఁడు రక్షించినభృత్యుఁ డనునది మొత్తము సమాస మై, రాముఁడు అనుప్రథమాంతము సమాసావయవ మైయున్నపుడు

బాహుకుఁడు రథము గడపునేర్పు, అన్నలభూపాలకుఁడు పోయినవలను, మున్నగు నవి సైతము సమాసములే. అట్టియెడఁ గర్త ప్రథమాంత మైయున్న వ్యస్తరూప మనుటయు, రాముఁడు రక్షించినభృత్యుఁ డనునది మొత్తము సమాసమే యనుటయుఁ బరస్పరవిరుద్ధములు కదా.

ఇయ్యవి సమాసములే యని తలంచినసూరి కర్మధారయమునఁ బూర్వపదము డుమంత మగుట నేల చెప్పలేదు? సూరి చెప్పకున్న నది యట్టిదే యని యీవ్యాఖ్య యేల సూరిలక్షణమును సవరింపలేదు?

సరే. బాహుకుఁడు రథము గడపునేర్పు వ్యస్తరూప మని గ్రహింతము. ఇట రథము గడపునేర్పు బాహుకుఁడు అని ప్రయోగింపవచ్చునా? ఇట్లె రాఁగాఁ గాంచె రాముఁడు లక్ష్మణుఁ డనవచ్చునా? అట్లు ప్రయోగింపఁబడుట లేదు గావున నవి యెల్ల సమాసములే యని తీఱవలయునా?

కాఁగా యొక్కషష్ఠ్యంతము సంబంధిపదములోని కన్వయించున దగుటచేత సంబంధిపదమునకు ముందే ప్రయోగింపఁబడవలెను. అంతే కాని యట్లు ప్రయోగింపఁబడుచున్నది కావున నది సమాసమే యైతీఱవలసినయవసరము లేదు.

ఈప్రౌఢవ్యాకర్తయే యనేకకర్తృకక్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబు లగు' (వాక్య. 15) నని సూత్రమునందే యొక్కను నిల్పెను. (ఇట్లే 'ఏమిశబ్దముయొక్క మికారమునకు' నని యింకొకచోఁ బ్రయోగించెను. పూవుయొక్క) ఇక్కడఁ గూడ 'లింగవచనంబులు సమీపకర్తయొక్క యగు' నని ప్రయోగింపఁబడదు. ఇది సమాసమా? యొక్క విభక్తి లోపింపలేదు కావున నలుక్సమాస మనవలయు నేమో. కాఁగా యొక్కలోపము నిత్య మనుటయు సరికాదు. (ఘం. 135)

కావున నిచ్చట లక్ష్యములు సమాసములే యనుటకు సర్వ. చూపినయీకారణ మును సముచితము గాదు.

తత్త్వ. 'ఇవి యన్నియు సమాసములే యనియు ననవచ్చును. తెనుఁగున సమాసమధ్యమున సందర్భయోగ్యవ్యస్తపదములు చేరి వ్యవధానము గల్పించుట గలదు గదా' (230) యన్నది. కలదు గదా యన్న నెట్లు? దానికిఁ బ్రమాణ మేమి? సూత్రకర్త విశేషణోభయపదకర్మధారయమునందు మాత్రమే ధాతుజ విశేషణములు మాత్రమే వ్యవహిత మగుటను బేర్కొనెను. పోనీ. అట్లు సూత్రింప

కుండుటయే యొకలోప మందము. 'దామములయు' మున్నగునవి సైతము సమాసములే యనవలయునా? యొక్క తఱుచుగా లోపించుట గానవచ్చుచుండఁ గా నెల్లయెడల సమాసములే యనుటకంటె వ్యస్తతలో లోపము చెప్పుకొనుట సరళ మగుమార్గము గాదా?

అంతఃపురేందుముఖులయొక్క కురు లనుచో యొక్క యీసూత్రముచే లోపించిన దని ఘం.(136) పేర్కొన్నది. అది సమాసమే యవుటచే నట నీసూత్రముచే లోపము చేయనక్కఱ లేదు. ఇతరవ్యాఖ్యలు పేర్కొన్నట్లు 'మనుజవిభులయొక్క సరులు లేని' యనుచోటియొక్క యీసూత్రముచే లోపించె నని చెప్పుట యొప్పును.

నరగోమృగసింహంబుల కరుణము లగురోగవేగకలితాక్రోశస్వరములు పె క్కయ్యె ననుచో తత్త్వ. కరుణములు అనువిభక్త్యంతపదము పరముగా నుండుటచే సమాస మనుటకు వలను కా (229) దన్నది. ఇందలియభిప్రాయ మర్థము గామిఁ గాఁ బోలు సుగమ. నరసింహములయొక్క కరుణము లగు ననునర్థమున యొక్క లోపించిన (141) దన్నది. అట నది యర్థము గాదు. నరసింహములయొక్క అనుదానికి రోగ...స్వరములు అనుదానితో నన్వయము. కరుణము లగు అనుదానికి వ్యవధానము గలిగియుండుటంజేసి సమాసము గుదుర దని తత్త్వ. యభిప్రాయముగా గుర్తింపఁదగును.

ఇట నరగోమృగనివహంబులఁ గరుణంబు లగు ననుపాఠమే నేఁడు ముద్రితప్రతు లందుఁ గాననగుచునన్నది. నివహములందు స్వరములు పె క్కయ్యె నని యర్థము. ప్రౌఢ.కార.18.చే సప్తమికి ద్వితీయ కాఁగా, 'నివహంబుల' నని యవును.

కార.15.చే నయినయొక్కకు నిత్యలోప మవుట ప్రస్తుతసూత్రమునందలి బహుళ పదమున కొకప్రయోజనముగా సూత్రకర్త స్పష్టము చేసె.

## అజడతృతీయ - న

### 17. ఒక్కచో నుదంతం బగునజడంబుతృతీయకును నవర్ణకం బగు.

బాల.కార.23సూత్ర ముదంతజడంబుతృతీయకు నవర్ణకమును విధించుచున్నది. ప్రస్తుతసూత్రము జడము కానియుదంతశబ్దముతృతీయకుఁ గూడ నవర్ణక మొకచోటఁ గల దని చెప్పుచున్నది.

ఏనుఁగున నేనుఁగు వైచుచు. దీనికి 'ఏనుఁగుతో నేనుఁగును గొట్టుచు' నని యర్థము. ఏనుఁగు జడము కాదు. తిర్యక్కు. అయినను ఏనుఁగుతో ననుతృతీయ కిట నవర్ణక మైనది. ఇట్టిప్రయోగ మింక నొక్కటియుఁ గానరా దని సూత్రకర్తయే మృగ్య మని స్పష్టము చేసెను.

బాలవ్యాకర్త సప్తమికి నవర్ణకము చెప్పఁగా, నీతఁడు తృతీయకును నగు నని సవరించినట్లు సుబో. 167 పేర్కొన్నది. అది సరి కా దనియు 'ఉదంతజడంబు తృతీయకు నవర్ణక మగు' నన్న బాల.కార.23 సూత్రమునకు సవరణ మని తత్త్వ. (231) పేర్కొనుట యుచితముగా నున్నది. బాల. ఉకారాంతములసప్తమికే కాక తృతీయకును నవర్ణకము చెప్పెను గావున సప్తమియందే కాక తృతీయయం దవు నని చెప్పుట విశేషము కాదు. సూరి జడములపైఁ జెప్పెను గాన నజడములపైఁ జెప్పుట విశేష మని గ్రహింపవలెను. కావున బాల.కార.23 సూత్రమునకే యిది సవరణము.

పైఁగా సుబో. ఉకారాంత మగు అజడమునకు తృతీయావిభక్తియందుఁ గూడ నవర్ణకము కానవచ్చు ననుటచే నుదంతజడముతృతీయకు నవర్ణకము రా దేమో యని యనుమానించుటకు నవకాశ మేర్పడుచున్నది. అది ప్రసిద్ధమును, బాలవ్యాకర ణోక్తము నైయున్నది. కావున సుబోధిని ననుసరించి సుగమ. (142) యట్లె చెప్పుటయు సరి కాదు.

ఈయొక్క ప్రయోగమునకయి సూత్రమును జెప్పుట యనవసర మనుసర్వస్వాభి ప్రాయము యుక్తమే. ఆకవియు నిం కొకచోట నిట్టిది ప్రయోగింపలేదు. కావున దీనిని లేఖకాదిప్రమాద మని యుపేక్షించుటకంటె కవిప్రయుక్త మయినవిశేష ప్రయోగముగా గుర్తించుట యుచితము. కాని (తనలక్షణమునకు విరుద్ధముగా నున్న?) పాపజాతికాన యనురీతి ప్రయోగము నోమోదింపలేని ప్రౌఢవ్యాకర్త దీనికై యిట్లు సూత్రించుట బాలవ్యాకర్తృలక్షణమును విమర్శించుటయే యుద్దేశ్యముగాఁ గలిగిన దని యనుమానింపఁజేయును.

వఝులవారు ఏపున గిట్టి యేనుఁగున నేన్గుల వైచుచు ననియె గ్రంథకృత్ప్రయుక్త మన్నను క్షతి లేదు గాన నీప్రయోగము సమర్థము గా (వ్యా.సం.స.1059) దనుట సరి గాదు. కవిప్రయుక్త మనుచుఁ గ్రొత్తపాఠము నూహించి కవి కంటఁగట్టుటకంటె దొరకుచున్నపాఠమును గుర్తించుట యుచితము గదా. వాజివాజిచే ననుతరువాతిపద్య

భాగమునుబట్టి యేనుఁగున నేనుఁగు అనుపాఠమే గ్రంథకృత్ప్రయుక్త మనఁదగు (317) ననుఘం. అభిప్రాయ ముచితముగా నున్నది. అందుకే తత్త్వ. ఈసూత్ర మావశ్యక (231) మని తలఁచినది.

ప్రయోగమును గుర్తించుటయే యావశ్యకము గాని సూత్రరచన సరిగా లేదు.

దీని కిం కొకప్రయోగము దొరుకలేదు. కావున 'ఒక్కచో' ననుట యెంతయు నర్థవంతము. కాని యొక్కచో ననుచునే యజడం బనుట యుచితముగా లేదు. అజడ మనుసామాన్యవచనమువలన మహన్మహతీవాచకములయెడ సయితము తృతీయకు నవర్ణకము వచ్చుట కవకాశము గలుగుచున్నది. 'విష్ణువుతో = విష్ణువున, వధువుతో = వధువున' ననురీతిరూపములు లేవు కదా. ఇం కొకప్రయోగము దొరకలే దనుటవలన నిట్టివి లే వని గ్రహింపవచ్చును. కాన సూత్రమునం 'దజడ' మనుసామాన్యనిర్దేశము మాత్రము సముచితము కాదు. కాఁగా నీయొక్కప్రయోగము నకై లక్షణమును సాధారణీకరింపవలసినయవసరము లేదు. ఏదో యొకసూత్రము నొద్ద వివరణములో నీప్రయోగమును స్పష్టము చేయుట యుచితము.

## అజడతృతీయాసప్తములకు ద్వితీయ

**18. కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి.**

బాలవ్యాకరణమున 'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళముగా నగు' (కార. 22) నని చెప్పఁబడినది. కావున నజడముల కిక్కార్యము రావీలు లేమి నీసూత్రము ప్రారంభింపఁబడిన దని స్పష్టము. జడేతరము తృతీయాసప్తములకును బహువచనమున ద్వితీయ గానంబడుచున్న దని సూత్రార్థము.

ఘనతరచక్రవాకముల నలరు. ఇటఁ జక్రవాకములతో (నలరు) అనుతృతీయకు ద్వితీయ వచ్చి, చక్రవాకములన్ (అలరు). చక్రవాకము లనునది పక్షివాచక మగుటచేత జడము గాదు.

మనుజుల విప్రుండు. ఇట నిర్ధారణమున సప్తమి రాఁగా నాసప్తమికి ద్వితీయ యైనది. అయ్యది మహద్వాచకము. కావున నీసూత్రమునందలియజడశబ్దము సార్థకము. మనుజుల విప్రుం డనునది సమాసము గా దనుటకు, నిచ్చుట సప్తమియే

కల దనియు, దానికి ద్వితీయ యైన దనియు స్పష్ట మగుటకుఁ బూర్తిపద్యము శబ్ద. 62 సూత్రమునొద్దఁ జూడు మని సూత్రకర్త పేర్కొనుచున్నాఁడు.

అశేషశబ్దముల మంత్రమును, లోహజాతిఁ గాంచనమును ననుచో సప్తమికి ద్వితీయ యుండఁగా, 'నలుగాలివానన్ గోవు' అనుచో (నలు+కాలి'వానన్'= నాలుగు కాళ్లజంతువులయందు) సప్తమియే కలదు. కావునఁ బద్యమందలియితరభాగము ననుసరించి 'మనుజులన్ విప్రుండు' అనురీతిగా నిర్ధారణసప్తమ్యర్థకద్వితీయగానే యీప్రయోగమును గుర్తింపవలె నని సూత్రకర్తవివరణము తాత్పర్యము.

ఇట సూత్రకర్త చూపినలక్ష్యములు సరి గా వనుపేటికాభిప్రాయమును వఝల వారు తిరస్కరించిరి. (వ్యా.సం.స.217) (ఘం.317) దీనివలన 'స్తనచక్రవాకములను' అనునగి లక్ష్యము గాఁజాల దనుసర్వ. అభిప్రాయమును దిరస్కృత మగును. (సర్వ.108)

ఘం. 'చక్రవాకములన్' అనునది తృతీయకు ద్వితీయ యగుటకు లక్ష్య మనక తప్ప దని నిరూపించి దీనికిఁ బ్రయోగాంతరము – అగ్ని కాష్ఠముల, మహాంబుధి యేఱుల, నంతకుండు భూతసంతతులను, వనజముఖులు పురుషులను, దృప్తి పొందుట గలుగ దంద్రు కోవిదులు మహాత్మ. (అను.2.175) ఇటఁ బురుషులను – పురుషులచేత నని యర్థము. కాఁగా నజడము తృతీయకును ద్వితీయ యగు (313) నని పేర్కొన్నది.

కాష్ఠములయం దగ్ని, యేఱులందు మహాంబుధి, భూతసంతతులందు నంతకుండు అనువాని ననుసరించి యిటఁ గూడఁ బురుషులందు వనజముఖు లనురీతిగా సప్తమి యుండఁగా సప్తమికి ద్వితీయ యైన దని చెప్పుట యుక్తము.

ఇనుపముక్కులకాకులం గఱపించి (కాశీ.3.56) యనుచో నినుపముక్కులు గలకాకులచేతఁ గఱపించి యనురీతిగా నజడంబుతృతీయకు ద్వితీయ గాన నగుచున్నది.

'ఒంటెలన్ జెలఁగి రాఁగ' ననుచో నాలక్ష్యముం గూర్చి వఝలవారు వివరింప లేదు. (వ్యా.సం.స.1056) అనఁగా నది లక్ష్యముగా దనుపేటికాభిప్రాయమును వఝలవా రామోదించి రనఁదగు. సుబో. పెటికి రాఁగ ననుముద్రితపాఠము పొసఁగ దని (169) చెప్పఁగా పెఱుకు మోయి యను శ.ర. ననుసరించి యాపాఠ ముచితమే యని ఘం. పేర్కొనుట (137) యుచితముగా నున్నది. సూ.ని. కూడ

నీయర్థమున కీప్రయోగమొక్కటియె చూపుట విశేషము. శ.ర. చి.ని. పాఠ మనుట నట్లు గ్రహించుట యుక్త మని సూ.ని. అభిప్రాయము.

## అజడద్వితీయ – ప్రథమ

### 19. కొన్నియెడల నజడంబుద్వితీయకును బ్రథమ చూపట్టెడి.

బాలవ్యాకరణము కార.24. సూత్రమున జడంబుద్వితీయకే ప్రథమావిభక్తిని పేర్కొనినది. అజడముద్వితీయకు సైతము ప్రథమ కానవచ్చుట నీసూత్రము వర్ణించుచున్నది. మదనాగమును ఎదిర్చి = మదనాగ మెదిర్చి. మదనాగ మజడము. ద్వితీయకుఁ బ్రథమ యైనది. ఇట్లె యచ్చట నితరలక్ష్యములును.

ఈలక్షణము వఝులవా రంగీకరింపలేదు. ఇచ్చట లక్ష్యములలో అమ్మదనాగ మెదుర్పన్, తనవారణేంద్రు నక్కురుకులవీరుమీఁద నని గ్రంథకృత్ప్రయుక్తపాఠము లనఁదగు వ్యా.సం.స. (1062–1065) నని పాఠాంతరము లూహించినది. 'వారణేంద్రున్' అనునది ముద్రితప్రతులం గానవచ్చుటచే నయ్యది యంగీకరింపఁ దగు ననుటలో నౌచిత్యము గలదు. కాని యితరములకుఁ గవిప్రయుక్తము లనుచు నేవియో పాఠము లూహించుట యుచితము గాదు. ఘం. ఇట్లు వఝులవారి యభిప్రాయమును దిరస్కరించుట యుక్తమే. బాలయతివిహ్వాలితాకృతి అనుప్రయోగమును ఘం. (319) చూపినది. ఇది శ్లేషస్థాన మగుట పరమ ప్రమాణముగ నంగీకరింపవలసినయక్కఱ లే దనవచ్చు.

'బహుళంబుగా ననుటచే నజడంబులద్వితీయకుం బ్రథమ గలిగినపట్లకును గ్రహణము గల్గఁదగియున్నను స్పష్టార్థము ఈప్రౌఢసూత్రము.' (97) అని కు.పం. వ్యాఖ్య పేర్కొన్నది. అందు దోషము లేదు.

ఇటఁ దత్త్వ. ద్వితీయకును బ్రథమ 'కర్మంబున ద్వితీయ యగు' ననుసూత్రముచే విధింపఁబడిన ద్వితీయాస్థానముననే వచ్చును. ఈవిషయము మాత్రము బాలవ్యాకర్త బహుళగ్రహణఫలముగాఁ జెప్పియున్నాఁ (234) డనుట సరి కాదు. తృతీయా సప్తముల కయినద్వితీయకుఁ బ్రథమ రా దని మాత్రమే సూరి పేర్కొనె. కాని యంతమాత్రమున కర్మార్థమున నైనద్వితీయకు మాత్రమే ప్రథమ యవు నని చెప్పె ననరాదు. ఈసూత్రమునకు సూరి యుదాహరించిన 'వాఁ డిల్లు వెడలె' ననుదాని

యందు 'ఇంటివలన' అనుచోటివలనకు ద్వితీయ రాఁగా, నాద్వితీయకు నీసూత్రముచేఁ బ్రథమ యైనది. (వ్యా.సం.స.1061)

కాని యీసూత్రమునందును నజడ మని సామాన్యముగాఁ జెప్పుట యుక్త మగునా? జడేతరము లనఁగాఁ దిర్యక్కులతోపాటు మహన్మహతీవాచకములకును గ్రహణము గలుగుచున్నది. అట్టివాని కీకార్య మగుట కానరాదు. సర్వ. అమహత్తునకు అని సూరియే చెప్పిన బాగుండెడి దని యిచ్చోట్లను గూర్చి తలంచినది.(113) అమహత్తు లనుచో మహతీవాచకములు గూడ గ్రహింపఁబడును. ప్రయోగములను బరిశీలించి నిర్ణయింపఁదగు. సూత్రకర్త చూపినలక్ష్యముల ననుసరించి తిర్యక్కులకే యీకార్యము గాననగుచున్నది. 'కొన్నియెడల(నజడంబు)' ననుదానిచే తిర్యక్కుల కనురీతిగా నర్థము చేసికొనునవకాశము లేకపోదు. అయినను నవకాశ మున్నంత వఱకు లక్షణము స్పష్టముగాఁ జెప్పవలెను గదా.

## జడము సప్తమికి - ప్రథమ

**20. ఒక్కొక్కచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు.**

కొన్నియెడల జడవాచకము సప్తమీవిభక్తికిఁ బ్రథమ యవుటయును గల దని సూత్రమున కర్థము.

తీర్థమందున్+ఆడి=తీర్థము+ఆడి = తీర్థమాడి. ఇట్లే చిచ్చునందు+ఉఱికిన= చిచ్చు+ఉఱికిన=చిచ్చుఱికిన. అనురీతిగా నచ్చోట లక్ష్యములు సమన్వయింపఁ బడుచున్నవి. పక్షమున 'తీర్థమం దాడు' అని సప్తమి యట్లే యుండును. నుశబ్దమున కిది ప్రయోజనము.

ఏతత్సూత్రవివరణమునందు సూత్రకర్త 'యిట్టిప్రయోగములచేత 'అన్యస్యాః క్వచి ద్ధ్రువే చ్చాన్యా' అనుశబ్దశాసనులసూత్రము సార్థక మగుచున్న' (171) దనెను. అనఁగా నిట సప్తమికిఁ బ్రథమ యవుట 'అన్యస్యాః క్వచి ద్ధ్రువే చ్చాన్యా' యను సూత్రముచే సిద్ధించు నన్నమాట. కాఁగా నీవిషయ మందు స్పష్టముగాఁ జెప్పఁ బడియుండమింజేసి 'యన్యస్యాః' అనుచింతామణిసూత్రమునకు వివరణముగాఁ బ్రస్తుతసూత్రము చెప్పఁబడిన దని గ్రహింపవచ్చును. 'ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' నను బాల.సూత్రము 'అన్యస్యాః.. అనుచింతామణి

లక్షణానువాదమే యనఁదగియుండుటంజేసి దానికి నిది వివరణ మనుట స్పష్టము. ఇట్టిచోట్లఁ జింతామణియందలిమూలమునే చూపుటకుఁ గారణము ప్రౌఢవ్యాకర్త చింతామణిని ప్రమాణముగా నెంచుట యనఁదగును.

మొత్తముమీఁద స్పష్టత యీసూత్రముప్రయోజనముగాఁ దేలినది. లేక 'అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా' యనుదానిచేత నిట్లు సప్తమికిఁ బ్రథమ యవుట గూడ సాధించి కొని సూత్రమును సార్థకము చేసికొనవలసియుండఁగా సూరి 'యొకానొకచో.. ననుసూత్రముసందర్భమునఁ గాని యితరస్థలములందుఁ గాని సప్తమికిఁ బ్రథమ యవుట గుర్తింపలే దని సూచించుటయుఁ బ్రౌఢవ్యాకర్తయుద్దేశ్యము గావచ్చును. ఇట్టిదానిని సూరి చూపలేదు. కావున నితఁడు చెప్పె నని సర్వ. 116, తత్త్వ. 236, ఘం. 138 వ్యాఖ్యలు పేర్కొన్నవి. ఘం. ఇట సూరి యుదాహరింపలే దనుచో ద్వితీయ యని యుండుట యచ్చు పొరపాటు కావచ్చును. ప్రథమ నుదాహరింప లే దని యభిప్రాయము. కాని యట నుదాహరింపఁబడినవి మాత్రమే గ్రహింపవలె నను నియమము లేదు గదా. అటఁ బేర్కొన్న ఇత్యాదులలో గ్రహింపవచ్చును. కావున దాని కిది వివరణముగా గుర్తించుట మాత్ర మొప్పును.

వఝులవారు 'సప్తమికిని అనుచోట నుశబ్దముచేత బాలవ్యాకరణము కార. 24 సూత్రముచొప్పున ద్వితీయకే కాక సప్తమికిని బ్రథమ వచ్చు ననుగ్రంథకర్త యాశయము స్పష్టపడుచున్నది. పరిశీలింపఁగా నేతత్సూత్రవిషయము బాల. కార. 25 సూత్రమునకు సవరణముగాఁ జెప్పుట యుక్త' (వ్యా. సం. స. 1062) మనిరి. 'కాలాధ్వములకుం బ్రాయికంబుగఁ బ్రథమ యగు' నను25సూత్రమున కిది సవరణ మని చివరకు నిట వఝులవా రభిప్రాయపడిరి. కాని దానితో దీని కెట్టిసబంధమును గానరాదు. అయినను వఝులవారే వ్యా. సం. స. లోనితమయభిప్రాయమును బా. ఉ. లో మార్చుకొనిరి (233). ఇంక బాల. కార. 21. సూత్రమునకే లక్ష్యములుగా గుర్తింపవలె నని సిద్ధాంతీకరించిరి. ఇటఁ బ్రౌఢవ్యాకర్తయు 'అన్యస్యాః అనుచింతామణిసూత్రముచే 'ఒకానొకచో.. నను (కార. 21. బాల.) దానినే స్మరింపఁ జేయుచున్నాఁడు. కార. 24 సూత్రమునకు సవరణముగాఁ గూడ నుద్దేశించె నేమో. జడంబు ద్వితీయకుఁ బ్రథమ యని సూరి చెప్పఁగా జడంబు సప్తమికిని బ్రథమ యనుటలో నట్టి యభిప్రాయము గల దనువఝులవారియభిప్రాయ ముచితముగనే కానవచ్చుచున్నది.

సూరి యంతకు ముందు జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ చెప్పెను.

ఆసూత్రముచే నగుద్వితీయకుఁ బ్రథమ రా దని సూరి బహుళపదము ప్రయోజనము గాఁ బేర్కొనెను. సప్తమీస్థానమునఁ బ్రథమ యగుట యిష్ట మైనయెడలఁ దృతీయ కాదేశ మగుద్వితీయకు మాత్రమే ప్రథమ రా దనియు, సప్తమి కాదేశ మగు ద్వితీయకుఁ బ్రథమ వచ్చు ననియుఁ జెప్పెడివాఁడే కదా. తృతీయాసప్తములు రెండింటిస్థలముననను ద్వితీయకుఁ బ్రథమ నుదాహరించుటచే స ప్తమికిఁ బ్రథమ యగునుద్దేశము సూరికి గల దనుట కవకాశము గానరాదు.

కాని యిట నొకభేదము గలదు. వఝలవారు 'ఉదంతేతరశబ్దములనందు సప్తమికిఁ బ్రథమ వచ్చులక్ష్యములు ప్రౌఢ.కార.20సూత్రమునఁ జూపఁబడలే (వ్యా.సం.స.1061) దనిరి. ఉదంతములపైనె కల దని సర్వస్వవ్యాఖ్యయుఁ దలఁ చినది. (115) కాఁగా నుదంతేతరముల కిట లక్ష్యము లేదు కావున సూత్రకర్త యుదంతజడం బన్న బాగుండెడి దనవచ్చును. ఇంక సూరిలక్షణమునఁ దృతీయా సప్తములకు ద్వితీయ యవుట యుదంతజడముల కేకవచనమున లేదు. కావున నట్టిప్రథమ సప్తమికే చెప్పవలసియుండును గాని ద్వితీయకుఁ గాదు. కాఁగాఁ దృతీయాసప్తముల కయినద్వితీయకుఁ బ్రథమ రా దనుసూరివివరణమునుబట్టి 'తీర్థ మాడి' యనురీతిరూపములసమ్మతితో సూరికి విరుద్ధాభిప్రాయము గల దనుటకు వీలు లేదు. కాని స్పష్టము చేయనులేదు. కావు 24 సూత్రమునకు సవరణ మగును. 21సూత్రమునకు వివరణముగ నీప్రౌఢ.లక్షణమును గుర్తింపఁదగును.

కాఁగా 'నొక్కొకచో నుదంతజడంబు సప్తమికిం బ్రథమయు నగు' ననురీతి సూత్రించిన బా గుండెడి దనిపించెడి.

## షష్ఠికి ద్వితీయ

**23. క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామిసంబంధము గలచో సంబంధిపదంబు షష్ఠికి ద్వితీయ యగు.**

రెండు పదములకు స్వ–స్వామి సంబంధము గలిగియున్నపుడు క్రియాన్వయ మున సంబంధిపదముషష్ఠికి ద్వితీయ యగు నని సూత్రమునర్థము.

నన్ను చెట్టవట్టినన్. ఇందు, చెట్ట అవయవము. నేను అవయవి. కాఁగా చెట్టకు నేను స్వామి యగుచున్నది. కాఁగా నీసంబంధముచే నాయొక్క చెట్ట యని

షష్ఠి యుండును. ఆషష్ఠికిఁ బ్రస్తుతసూత్రముచే ద్వితీయ రాఁగా, 'నన్ను' నని యగు. 'చెట్ట నన్నుఁ బట్టిన' నని యన్వయ మని సూత్రకర్తతాత్పర్యము.

షష్ఠికి ద్వితీయ యగు నని సూత్రముచే ద్వితీయ నిత్యముగానే విధింపఁ బడినది. ఐనను 'నాదుచెట్టవట్టినన్, లేఁబట్టియొక్క నెన్నుదురు గాడన్, రాముతమ్ముని యొక్క చాపమున్, నరసూనునియొక్క యెద' ఇత్యాదిగాఁ బక్షాంతరమున రూపంబు లగు నని యెఱుంగునది (100) యని కు.పం. పేర్కొన్నది. సర్వ. (123) ఇట్లే తలఁచినది. ఆయవకాశము గల్గవలయు నన్న సూత్రమున మా ర్పవసరము.

నాచెట్టవట్టిన నిత్యాదిగా నుండవచ్చు నన్నమాట యథార్థమే. కాని సూత్రకర్త చూపినప్రయోగము యథాతథముగా గ్రహించుచో మాత్రము షష్ఠి యుండుట కవకాశము గానరాదు.

నా(యొక్క) యాతఁడు చెట్టవట్టినన్, రాముతమ్ము(యొక్క) లవుం డిరుమూఁ డమ్ములఁ జాపముం దునుమ, నరసూను(యొక్క) అపుడు కర్ణుజుం డిరుమూఁడు శిలీముఖంబుల నెద సించి, అనురీతిగా నుండుట యొప్పదు గదా.

కాఁగా స్వస్వామివాచకశబ్దము లవ్యవహితము లైయున్నపుడు షష్ఠికి ద్వితీయ గాననవు నని లక్ష్యములనుబట్టి గ్రహింపఁదగు. వ్యవహితము లైయుండుట యన్నది సూత్రమున స్పష్టముగా లేదు. కాని షష్ఠి చేసినచో నాయొక్క చెట్టవట్టిన నని యుండును. ఇందు 'చెట్ట' యనునది క్రియలోని కన్వయించుచున్నది. కాని సూత్రకర్త క్రియాన్వయమున సంబంధిపదముషష్ఠికి ద్వితీయ యగు ననుచున్నాఁడు. అనఁ గా సంబంధిపదమే క్రియలోని కన్వయింపవలసియుండును. కావున 'నాయొక్క చెట్ట పట్టిన' ననుచో సంబంధిపదము క్రియలోని కన్వయింపకుండుటం జేసి యట ద్వితీయ యగుట కవకాశ మీసూత్రముచే లేదు. యొక్క ప్రత్యయాంత మయినపుడు సంబంధిపద మెప్పుడును సంబంధవాచకముతోనే యన్వయించును. కావున నద్దానికిఁ గ్రియతో నన్వయ ముండదు. కాఁగాఁ గ్రియాన్వయ ముండనపుడు సంబంధిపదము షష్ఠ్యంతము గానేరదు. కావున ద్వితీయను నిత్యముగా విధించుట యుక్తము.

కాని యిటఁ గూడ సంబంధిపదము సరాసరిగాఁ గ్రియతో నన్వయించుట లేదు. 'నరసూనున్ ఎద సించిన' ననుచో 'నరసూనున్ చించిన' అనునన్వయము సరి కాదు. 'నరసూనుని యెదను చించిన' నని యెదయే క్రియలోని కన్వయించును.

కాఁగాఁ గ్రియాన్వయంబున సంబంధిపదముషష్ఠికి నన్వయించుటకు వీలు లేదు. (ఘం. 142) ఇంకఁ గ్రియాన్వయంబునందు రెండుపదంబులు (స్వస్వామి సంబంధము గలవి) అని యన్వయింపఁదగును. అపుడు 'స్వవాచకము. స్వామి వాచకము, రెండును గలిసియే క్రియతో నన్వయము గలిగినపు' డని యర్థ మగును.

నరసూనున్ ఎద సించిన. ఎద, నరసూనున్ అనుస్వస్వామివాచకములు రెండును గ్రియతోనన్వయించునపు డందలిసంబంధివాచక మైననరసూనుశబ్దముషష్ఠికి ద్వితీయ యగు నని యర్థ మన్నమాట. (తత్త్వ. 241) షష్ఠ్యంత మైనపుడు స్వవాచకము మాత్రమే క్రియతో నన్వయించుచుండఁగా ద్వితీయాంత మైనపుడు స్వామివాచకమును స్వవాచకముతోఁ గలిసియే క్రియతో నన్వయించును. అనఁగా నిట స్వామివాచకము కేవలము స్వవాచకముతో మాత్రమే యన్వయము గలిగియుండ దని తాత్పర్యము.

కాఁగా స్వామివాచకము స్వవాచకముతో నస లన్వయింపనేర దనుతత్త్వ. (241) అభిప్రాయము సరి కాదు. అట్లే యైనయెడల 'నరసూనునిచించిన' ననియు నన్వయము చేయవలసియుండును.

ఇటఁ దత్త్వ. స్వామివాచకశబ్దము క్రియతో నన్వయించునపుడు అయ్యది కర్మ యగును. (243) కావున ద్వితీయ విధింపనే యక్కఱ లే దన్నది. అది యుచితముగాఁ గానరాదు. చించుట యనుదానికిఁ గర్మము ఎదయే ప్రధానముగా నగుచున్నది. ఇట వాక్యవిషయము గమనింపఁదగును. సూత్రకర్త షష్ఠికి ద్వితీయను విధించెను. కావున నీద్వితీయ షష్ఠ్యర్థకమే యైయుండు నన్నమాట. అనఁగా 'నరసూనుని ఎద సించిన' ననియే యర్థము చేయవలయును. ఇ ట్లర్థము చేయుచో స్వామివాచకము స్వవాచకముతో మాత్రమే యన్వయము గలిగియుండును. అట్టియెడల నీయది కర్మము గాదు. దీనికి ద్వితీయ సాధారణముగను సిద్ధింపదు.

అయిన స్వామివాచకమునకుఁ గ్రియతో నన్వయము గుదురనపుడు క్రియాన్వయంబున నని చెప్పుట యెట్లు? వాక్యమున స్వవాచకముతోనే యన్వయించునట్లుగా నుద్దేశించిన వ్యవహితత్వ మసలు గుదురదు. కాఁగాఁ గ్రియాన్వయ మిట స్వామివాచకమునకు నార్థికముగా లే దనియే షష్ఠికి ద్వితీయా విధానము వలనఁ జెప్పవలసియున్నది. కాఁగాఁ గ్రియాన్వయమున నసుదళము దొలఁగించి వ్యవహితము లగుననపు డనురీతిగాఁ జెప్పిన బాగుండెడి దేమో. స్వామిపదము సైతము కర్మయే యవుటకు నీలక్ష్యములందలిధాతువులు

ద్వికర్మకములును గావు. విశేషముగాఁ జెప్పఁదలఁచినచోఁ దత్త్వ. తలఁచినట్లు కర్మ యగుటచేతనే ద్వితీయ యవుచుండఁగా ద్వితీయ ద్వితీయావిభక్త్యర్థకమే యవును. షష్ఠ్యర్థ ముండదు. ఉండనపుడు షష్ఠికి ద్వితీయవిధాన ముచితము గా దనవలెను.

అది య ట్లుండఁగా నీలక్షణమునకు మూల మైన పైప్రయోగములు సరి యైనలక్ష్యములే గా వని వ్యా.సం.స. తలఁచినది.

'కొన్ని వెడమాట లాడుచు నన్ను నతఁడు చెట్టవట్టిన' ననుచో నన్నుఁ గూర్చి వెడమాటలాడుచుఁ జెట్టవట్టిన నని యుద్దేశార్థకముగాఁ జెప్పఁదగు (వ్యా.సం.స. 1080) ననిరి. కాని యీయన్వయము సహజముగాఁ గానరాదు. కొన్నివెడమాట లాడుచు నాచెట్టవట్టిన ననుసూత్రకర్త యభిప్రాయమే యుచితముగా నున్నది.

రెండవలక్ష్యమునఁ 'గట్టియ వైచె నెన్నుదురు గాడ మాద్రి లేఁబట్టిని' ననుచో నెన్నుదురు గాడునట్లుగా మాద్రిలేఁబట్టి నుద్దేశించి కట్టియ వైచె ననునుద్దేశార్థ ముచితముగనే యున్నది. కావున నీయది యిట లక్ష్యము గా దనవచ్చును.

'రాముతమ్ముయొక్క చాపముం దునుమ' ననుచో యొక్క లోపింపఁగా నుశబ్దము చేరిన దనువర్థులవారిసమన్వయ మసహజముగా నున్నది. (వ్యా.సం.స. 1080) ఘం. పద్యము మొత్తము చూపినది.

భరతప్రేరిత మైనసైన్య మెదిరింపన్, రాముతమ్మున్ లవుం
డిరుమూఁడమ్ములఁ జాపముం దునుమ, భగ్నేష్వాసనుం డైనభా
స్కరవంశ్యున్ గుశుఁ డుగ్రమార్గణములఁ గారింపంగఁ, దేరిపై
నొరుగంబాఱెడువానిఁ గన్గొని మరుత్సూనుండు కట్టల్కతోన్.

అనుచో రాముతమ్మున్ అనునది పద్యములో 'కన్గొని' యనుదానితో నన్వయించుచున్నది. రాముతమ్ముం గన్గొని మరుత్సూనుండు కట్టల్కతోన్ (ఘం. 143) ఈసమన్వయము సంగతముగా లేదు. రాముతమ్మున్ అనునది కన్గొని యనుదానితో నేల యన్వయింపఁజేయవలె?

తేరిపై నొరిగెడువానిన్ అనఁగాఁ బ్రకరణము ననుసరించి రాముతమ్మున్ అనియే యర్థ మవుచున్నది గదా. రాముతమ్మున్ చాపముం దునుమ, భాస్కరవంశ్యున్ గారింపంగఁ బరఁగెడువాని గన్గొని, యని సూత్రకర్త చేసినయన్వయ మెంతయు నుచితముగానే యున్నది.

'భగ్నేష్వాసనుం డైన భాస్కరవంశ్యు' ననునది విశేషణ మగుటకు– రాముతమ్మున్ చాపముం దునుమ ననుదానికి సూత్రకర్తయన్వయము ప్రామాదిక మగుట కారణ మెట్లో స్పష్టము గాదు. రాముతమ్ము ననుదానిని మిగిలినవిశేషణములతోఁ గూడ నన్వయింపవచ్చును గాక. భాస్కరవంశ్యున్ రాముతమ్మున్ గారింపంగ, నొరిగెడువాని రాముతమ్మున్ కన్గొని యని యన్వయము. కాని యింతకు ముందు చెప్పిన 'లవుం డిరుమూఁడమ్ముల చాపముం దునుమ' ననుచో 'రాముతమ్ము' ననుదానితో నన్వయ మక్కఱయే లే దనుట యెట్లు? ఇంకను బైని విశేషణములు ద్వితీయాంతము లవుటచే 'రాముతమ్ము' ననునది విశేష్యము, ద్వితీయాంతమే యనియు వఝలవారు భావించినట్లు 'యొక్క లోపించినషష్ఠ్యంతము గా' దని తలఁచినవారివివరణము తెలుపుచున్నది.

కాఁగా – 'సైన్య మెదిరింపన్ రాముతమ్మున్ లవుం డిరుమూఁడమ్ముల చాపముం దునుమ, భాస్కరవంశ్యున్ కుశుఁడు గారింపన్, ఒరిగెడువాని మరుత్సూనుండు కన్గొని' యనురీతిగా సూత్రకర్త చేసినయన్వయ మెంతయు నుచితముగానే యున్న దనియు నిట యొక్కషష్ఠికి ద్వితీయ యైన దనియుఁ జెప్పుట యుచితమే కాన నిది లక్ష్యమే.

'నరసూనున్ ఎదసించిన' ననునది సరి యైనలక్ష్యమే యని ఘం. అంగీకరించిన దనవచ్చును. వఝలవారి యొక్కలోప, నుశబ్దప్రయోగసమన్వయము సరిగా లేదు.

వీనిసాహచర్యమున రెండవయుదాహరణము సైత మిట్టిదే యన్నను దప్పు లేదు.

కావున 'స్వస్వామిపదములు వ్యవహితంబు లగుచో సంబంధిపదంబుషష్ఠికి ద్వితీయ యగు' నని సూత్రించిన బాగుండెడిది. (సుబో. 176)

స్వస్వామిసంబంధము మున్నగువానిం గూర్చినవివరణ మాయైవ్యాఖ్యలందు విపులముగా నున్నది. (తత్త్వ. 242, సర్వ. 127, మొ.)

## విశేషణములషష్ఠికి ప్రథమ

**21. ఒక్కచో సమాసాంతర్గతవిశేష్యంబుల కగువిశేషణంబులషష్ఠికిని బ్రథమ చూపట్టెడి.**

షష్ఠ్యంత మైనవిశేష్యము సమాసాంతర్గత మైయుండఁగా దానివిశేషణముయొక్క షష్ఠికిఁ బ్రథమ యవు నని సూత్రార్థము. సమాసమునందు విశేష్యము'యొక్క' లోపించినను విశేషణముషష్ఠికిఁ బ్రథమ యవుట విశేష మని యభిప్రాయము.

పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుపన్పు. ఇట ధర్మసుతుపన్పు అనునది సమాసము. ధర్మసుతుయొక్క అనువిశేష్య మీసమాసమునందుఁ గూర్పఁబడియున్నది. దీనికి విశేషణ మగుపార్థివప్రాగ్రసరశబ్దము విశేష్యము ననుసరించి షష్ఠంత మైయుండఁ గా నాషష్ఠి కీసూత్రముచేఁ బ్రథమ యయి, పార్థివప్రాగ్రసరుండు అని ప్రయుక్త మైనట్లు గ్రహింపవచ్చును. ఇట్లే యిచ్చోటియితరలక్ష్యములును.

విస్ఫురన్మహావిక్రముఁ డైనదేవుఁడు అనులక్ష్యమున దేవుఁడు అనుచోటఁ బ్రథమ యీసూత్రముచే నైనది.

ఈసూత్రమునొద్ద సూత్రకర్త చూపినసమాసము లన్నియుఁ దెలుఁగునఁ జేసినవే. దీనివలన షష్ఠ్యంత మగువిశేష్యము సిద్ధసమాసగత మైయున్నపుడు విశేషణముషష్ఠికిఁ బ్రథమ యవునా కాదా యని యనుమానము. అట సర్వ. 'పార్థివప్రాగ్రసరుండు ధర్మజపరాక్రమశక్తికి మేర యున్నది మున్నగువిధములుగా నున్న దనుకొందము. ఇట్టియెడల ధర్మజశక్తికి అన్నది సిద్ధసమాసము. ఇపుడు పార్థివప్రాగ్రసరుండు అనువిశేషణము ధర్మజ అనువిశేష్యముతో నన్వయించుటకు వీలు గా దన్నసంగతిని గుర్తించుట యవసరము. కాని యిట్టిదానినే వారించుటకు లక్ష్యములే శరణ్యము లగుచున్నవి. సూత్రమునందు దానిని నిర్వహించుదళ మేమియు లే' (సర్వ. 123) దన్నది.

సిద్ధసమాసములో నిట్టిప్రయోగములు గలవా యన్నది నిర్ణయింప వీలు లేదు. వఝలవా 'రహోబలపండితీయత్రిలింగలక్షణశేషాదులవ్రాఁతచొప్పున భుజాటోప భయంకరుఁ డర్జునకోపానల మనురీతిప్రయోగములును సాధువు లనవలసివచ్చు. అట్టివి సాధువులు గానేరవు. సిద్ధసమాసగతషష్ఠ్యంతవిశేష్యముల యొక్క విశేషణ మునకుఁ బ్రథమ వచ్చుప్రయోగములు గానరా' (వ్యా.సం.స. 1080) వనిరి.

అట్టిప్రయోగములు గలవో లేవో యిప్పటికి లభ్యము గాలేదు. కావున వఝలవారి యీవివరణమును నామోదింపవచ్చును. (తత్త్వ. 238)

అయినను సర్వ. తలఁచిన ట్లిది గల దనియే యందము. ఇటఁ బార్థివప్రాగ్రసరుండు అనునది ధర్మజశక్తితో నన్వయింపవలె ననుట యథార్థమే. శక్తికి ననుదానితోనే యన్వయింపఁజేసితీఅవలసినపనియు లేదు. అఖండరూపవిలాససంపదన్ వంచిత పంచబాణుఁ డనుచో వంచిత అనుదానితో దానికిఁ బూర్వమున వ్యస్తముగా నున్నపద మన్వయించుచుఁ బంచబాణుఁ డనుదానితో నె ట్లన్వయము కలిగియుండుట లేదో యట్లే యాసమాస. 35సూత్రము ననుసరించి పార్థిప్రాగ్రసరుం డనునది ధర్మజ పరాక్రమశక్తి యనుసిద్ధసమాసములోనిధర్మజశబ్దముతో నన్వయించుటలో నిబ్బంది యేమియు లేదు.

అయినను నిట్టియన్వయము సిద్ధసమాసములందు మాత్రమే యగునా? పార్థివ ప్రాగ్రసరుండు ధర్మసుతుపన్ను అనుచో మాత్ర మన్వయము నట్లే కదా చెప్పవలసినది. ధర్మసుతుపన్ను అనుసమాసములోఁ బ్రత్యేకవిధానము లేకయే విశేషణము సమాసాంతర్గత మగువిశేష్యముతో నన్వయించునా? నిజమున కిది యుత్తరపదార్థప్రధాన మగుటచేతనే మిశ్రసమాసమునందు సైత ముత్తరపదార్థముతోనే యన్వయ ముండ వలయును. సమాస. 35 సూత్రమున సిద్ధసమాసము లని చెప్పకుండ సమాసము లని సామాన్యముగాఁజెప్పుట యుక్త మని నిర్ణయింపఁదగును. లేనిచోనిట్టిమిశ్రాది సమాసములయందును నుత్తరపదముతోడియన్వయము తప్పదు. తత్త్వ. ఈసూత్రమె జ్ఞాపక మని తలంచి సమాసగతపదములకు భిన్నపదము లన్వయింపవచ్చు ననియు నయ్యది యాంధ్రభాషయందు నిర్దోష మనియు నిశ్చయించుకొనవలయును. ఇట్లు సాధ్య(?)సమాసములందు భిన్నపదములయన్వయము ప్రాప్త మగుచుండ సిద్ధసమాసమధ్యపదములకుఁ గూడఁ గొన్నిచోట్ల భిన్నపదములతో సంబంధము లవ్యవహితపూర్వప్రయుక్తములకే యని గుర్తింపఁదగును. ..సమ్మత మని సమాస. 35 సూత్రముచే విధించుకొనుచున్నాఁ (237) డన్నది. సూత్రకర్త సమాస35 సూత్రమున సిద్ధేతరసమాసములం దిట్టియన్వయమును బేర్కొనకపోవుటచే నీసూత్రముచే నాయర్థమును జ్ఞాపకము చేసికొనవచ్చును. కాని యిట్టియన్వయము తెలుఁగు సమాసములందు సహజము గావున సిద్ధసమాసగతములకే సూత్రించె ననుట యొప్పదు. సిద్ధసమాసములందుఁ గలయట్టియన్వయమే యిటఁ దెలుఁగునఁ

జేసినసమాసములందును గలదు. కావున నాసూత్రమున 'సిద్ధసమాస' అనక కేవలము 'సమాస' అని చెప్పుట యుచితముగా నుండు ననఁదగు.

వఝలవారు 'పైప్రయోగములందలి శేషషష్ఠ్యంతవిశేష్యము లెల్ల వ్యస్తరూపములే యని చెప్పుటలో బాధ యగపడదు. అట్టివి పెక్కుప్రయోగము (1032) లొక విషయమునఁ జూపఁబడె' (వ్యా.సం.స. 1079) ననిరి. కాఁగా నీవిధాన మనవసర మని యభిప్రాయము. ఇట్లు పరిశీలించినచో యొక్క సాధారణముగ లోపించుచునే యుండును. కావున షష్ఠీతత్పురుషము లనఁబడునవి చాలవఱకు వ్యస్తములే యని చెప్పఁదగియుండును. పైప్రయోగములను వ్యస్తము లన్నను బాధ లేనిమాట నిజమే. కాని యొకవేళఁ బార్థివప్రాగ్రసరుండు ధర్మసుతునాజ్ఞ యని ప్రయుక్త మైనపక్షమున నెట్లు? స్వరపరకతయందు నుగాగమము సమాసమునందే యవును. వ్యస్తముగా సమన్వయింపఁబూనుచో నుగాగమము లేదు. కావున 'ధర్మసుతాన' యని యుండవలసివచ్చును గదా.

కావున నీవిధానము నంగీకరించుటయే సమంజసముగాఁ గానవచ్చుచున్నది.

భవత్యర్థ మున్నను గమ్యమాన మయినఁ గూడ విశేషణమునకుఁ బ్రథమ వచ్చు నన్న దీనియనంతరసూత్రము గూడ సంగ్రహింపఁబడు (238) నన్నది. అనఁగా భవత్యర్థవ్యవహితంబు లగువిశేషణంబులకుం బ్రథమ యగు' నను (బాల. కార. 29) సూత్రమును సవరింపవలయు నని తత్త్వ.అభిప్రాయమా? అట్లు సమన్వయించుచో నిట కార. 21,22 సూత్రము లనవసరము లగుమాట నిజమే. కాని యీపక్షమున విశేష్యము భిన్నవిభక్తిక మయియుండఁగా విశేషణము ప్రథమాంత మయియున్నస్థలములం దెల్ల భవత్యర్థము గమ్యమాన మగు నని యూహింపవచ్చును. అట్టియెడల నిటనే యేమి? బాలవ్యాకరణమునందు సైత 'మొకానొకచో విశేషణంబులషష్ఠికిం బ్రథమ విభాష నగు' (కార. 27) సూత్రము చెప్ప నక్కఱ లేదు. 'సుగుణాభిరాముఁడు రామునకు జోహా' రనుస్థలమునందుఁ గూడ సుగుణాభిరాముఁ డగురామునకు ననువిధముగా భవత్యర్థము గమ్యమాన మగు నని తలఁపఁగాఁ, బ్రథమ 28 సూత్రముచేతనే యగుచుండఁగా నింక 27 సూత్ర మేల? 'సుగుణాభిరామునకు రామునకు జోహా' రనుతీరుగా విశేషణము షష్ఠ్యంత మైయున్నపుడు భవత్యర్థము గమ్యమానము గా దనుచో షష్ఠి యుండుటలో నవరోధమును లేదు. 'విభాషయా సుసంతం స్యా దత్ర షష్ఠీవిశేషణమ్ భ్వాద్యర్థ

వ్యవధానే తు భేద్యస్య నిఖిలం భవే' త్తని యధర్వణుఁడును జెప్పెనే కద. కావు నీగమ్యమానపక్షము నాశ్రయింపకుండుటయే యుక్తము.

ధర్మసుతుపన్పు అనుమోద లగునీయవి సమాసములు గాక వ్యస్తములే యని తలంపకున్నను, నట్లే భవత్యర్థ మిట గమ్యమాన మగు నని తలంపకున్నప్పటికి నీప్రథమావిధానము స్పష్టతకే కాని ప్రత్యేకప్రయోజనము గలిగినదిగాఁ దోఁచుట లేదు. ఎట్లో చూతము.

సమాసాంతర్గతవిశేష్యముల కగువిశేషణముషష్ఠి కీసూత్రము ప్రథమ విధించు చున్నది. దీనివలన విశేషణము సమాసాంతర్గతవిశేష్యము ననుసరించి షష్ఠి నందు చున్న దన్నంతవఱకు ముందుగా నంగీకరింపవలెను గదా.

కాఁగా సమాస. 36. సూత్రమును సవరించి సాధించినను లేదా యీసూత్రముచే జ్ఞాపకము చేసినను దెలుఁగుసమాసములందలిపదములతోఁ దత్పూర్వము వ్యస్తముగా నవ్యవహితముగాఁ బ్రయుక్త మైనపద మన్వయించుచున్న దని స్పష్ట మవుచున్నది.

అట్టియెడల విశేషణము వ్యస్తముగా నున్న నేమి? సమాసాంతర్గత మైన నేమి? తదనుగుణముగా విశేషణము షష్ఠియం దుండఁగా బాల. కార. 27చేఁ బ్రథమ యవుటలో నవరోధ మేమి?

ఈప్రౌఢ. సూత్రమునకు మూల మనఁదగిన యహోబలుని 'విశేష్య స్యాభిన్నత్వే కపి ఇదం విశేషణమ్. ప్రల్లదుఁ డైనయొక్కకులపాంసనుచేసినదానఁ దత్కులం బెల్లను నిత్యాద్యార్యోక్తి రత్ర మాన' (కవిశి. 444) మ్మనువాక్యము ననుసరించియున్నది. ఈప్రయోగము భ్వాద్యర్థవ్యవధానము గలిగియున్నది. (వ్యా. సం. స. 1079). అనుపలుకులు 'షష్ఠీవిశేషణానాం ప్రథమా స్యా' త్తనుచింతామణిసూత్రమునకు వివరణము. అనఁగా నాచింతామణి లక్షణముచేతనే ప్రథమ యవుచున్నను నివ్వాని యందుఁ గొంతవైశిష్ట్యము గల దని యహోబలుఁడు తలఁచియుండును. అట్టియెడల నీప్రౌఢవ్యాకరణ మావిషయమును బ్రత్యేకించి సూత్రించుట వ్యాఖ్యానప్రాయ మై, స్పష్టతకే యనఁదగు.

సూరి సైతము విశేషణంబులషష్ఠి కని సామాన్యముగాఁ జెప్పెనే కాని దానిషష్ఠ్యంత విశేష్యము వ్యస్తముగాఁ బ్రయుక్త మైనపుడే యని చెప్పలేదు గదా. కాఁగా విశేష్యము వ్యస్త మైయున్నను సమాసగతపూర్వపద మైయున్నను దాని ననుసరించి విశేషణమునకు షష్ఠి యవుటతోడనే యావిశేషణషష్ఠికిఁ బ్రథమ ప్రాప్తించుచునే యున్నది. కావున నీప్రౌఢ. విధానమునకుఁ బ్రత్యేకప్రయోజనము మృగ్యము.

ఇంక నిట విశేష మే మన విశేష్యము సమాసాంతర్గత మైయున్నను విశేషణము దానితోనే యన్వయించుచుండుట. దానివలననే విశేషమునకు షష్ఠి యవుచున్నది. ఇంక నిట్టిచోట్ల నట్టియన్వయమును జెప్పుటయేని యవసర మనఁదగును. కాని ప్రథమ విధించుట విశేషము కా దనక తప్పదు. అదియు సమాస. 35. సూత్రమున సిద్ధశబ్దమును దొలఁగించిన సిద్ధ మగును.

ఇంక నీసూత్రమును గూర్చి యాలోచింతము. సమాసాంతర్గతవిశేష్యంబు లనుటచే నీవిశేష్యములు యొక్క షష్ఠ్యంతములే యని స్పష్ట మగుచున్నది. కు, లోపల విభక్త్యంతములకు సమాసము గానరాదు గదా. కాఁగా విశేషణమును యొక్క షష్ఠ్యంతమే యవును. అట్టివిశేషణము షష్ఠికిఁ బ్రథమ యొక్కచోఁ జూపట్టెడి నని సూత్రము చెప్పుచున్నది. అనఁగాఁ బ్రథమ వచ్చుట నియతము గా దనియే యర్థము. పార్థివప్రాగ్రసరునియొక్క ధర్మసుతుపన్పు అనురీతిగాఁ బ్రథమ రానివి పెక్కుచోట్ల నుండవలయును. కాని యట్టివి గలవా? యొక్క ప్రత్యయము వ్యస్త రూపములందును సాధారణముగాఁ గానరాదు. కావున లోపించిన దన్నను బార్థివ ప్రాగ్రసరును ధర్మసుతుపన్పు అనురీతిగా నుండవలయును. అట్టిప్రయోగము నొక్కటినే నుదాహరించిన సందేహము లేకుండెడిది. కాని యట్టిరూపము లుండ వని తోఁచుచున్నది. అట్టియెడల నిటఁ బ్రథమ నిత్య మనవలె. 'సమాసాంతర్గత విశేష్యంబుల కగువిశేషణంబులషష్ఠికిఁ బ్రథమ యగు' నని మాత్రము చెప్పినఁ జాలు.

బాలవ్యాకరణమున (కార. 27) విభాషాపదముచే సాధించుకొనవలసిన యీయర్థ మిట స్పష్టము చేయుట ప్రయోజనము గాఁగా, నపుడు సూత్రము కొంతవఱ కేని సార్థక మయ్యెడి ననఁదగును.

కావున నీసూత్రమున 'నొక్కచోఁ జూపట్టెడి' ననుట సరి కా దనఁదగు.

## విశేషణద్వితీయాదులకు – ప్రథమ

### 22. కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి.

బాలవ్యాకరణము భవత్యర్థవ్యవహితంబు లగునపుడే విశేషణంబులద్వితీయాదులకుఁ బ్రథమను జెప్పినది. వికృతివివేకమును 'భ్వాద్యర్థవ్యవధానే తు భేద్యస్య నిఖిలం భవే' త్తని భ్వాద్యర్థవ్యవధానమునందే చెప్పినది. కాఁగా భవత్యర్థవ్యవధానము లేనపుడు షష్ఠికి మాత్రమే ప్రథమ యగుట కవకాశము గలదు. కాని యట్లు వ్యవధానము లేనపుడు ద్వితీయాదులకుఁ బ్రథమ వచ్చునవకాశము లేకున్నది. దాని నీసూత్రము ప్రయోగానుసారముగ గ్రహింపఁదగుటను చెప్పుచున్నది.

కాఁగా భవత్యర్థవ్యవహితము గాకున్నను విశేషణము ద్వితీయాదులకుఁ బ్రథమ యవుట గానఁబడుచున్న దని సూత్రమునర్థము.

ఘనుల్ దైత్యపతులను. ఇక్కడ 'దైత్యపతులను' అనువిశేష్యము ననుసరించి విశేషణము (ఘన) ద్వితీయాంతము గాఁగా, 'ఘనులను' అని యుండ, నిట భవత్యర్థకముతో విశేషణవిశేష్యములు వ్యవహితములు గాకున్నను, నీసూత్రముచే ద్వితీయకుఁ బ్రథమ రాఁగా, 'ఘనుల్ దైత్యపతులను' అనుప్రయోగము సాధింపఁబడినది.

తల్లి ద్రౌపదితోడన్. ఇట తల్లితోడ ననువిశేషణముతృతీయకుఁ బ్రథమ యైనది. తల్లి యగుద్రౌపది – తల్లిద్రౌపది యనురీతిగా దీనిని సమాసముగా సమన్వయింపనగును. కావున నీయుదాహరణము సరి కా దని త్తత్వ.(239) పేర్కొన్నది. వ్యాకర్త సమన్వయమును దుష్టము గాదు. కావున నీయది ప్రబల మైనయుదాహరణము గా దని మాత్రము చెప్పినఁ జెప్పవచ్చును. 'అస్త్రకళాసముజ్జ్వలుఁడు పార్థుతోడ' (కార. 2. 42) నని వఝులవారు చూపినప్రయోగము ప్రబల మైయున్నది.

ఇతరవిభక్తులకుఁ బ్రథమ యవుటను సూత్రకర్త యిటఁ జూపలేదు.

మాతండ్రి పరాశరసుతుచేతన్ (ఆశ్ర. 1. 820) మాగురుఁడు భార్గవుచే వినుము (ఉద్యో. 4. 246), ఆద్యుఁడు హిరణ్యగర్భునందు (ఆము. 3. 80) దిశలు పదింటను దీటుకొనఁగా (మహాప్ర. 1. 48) (వ్యా.సం.స. 1079) అని వఝులవా రింకను గొన్ని యుదాహరించిరి.

చింతామణియందు 'షష్ఠీవిశేషణానా' మ్మనురీతిగా నున్నబహువచనము స్వారస్యముచే నిట్టిప్రయోగములు సాధింపఁబడుచున్న వని సూత్రకర్త వివరించెను.

ఈవివరణము సముచితముగనే యున్నది. బహువచనము ప్రయోగింపఁ బడినస్థలములం దితరములకు గ్రహణము కలుగుట యితరస్థలములందును గలదు. 'సామానాధికరణ్యే షూదంతానా' మ్మను మొద లగుస్థలము లిట్టివే కదా. ఇట్టిప్రయోజనము బాలవ్యాకరణమునందును గానవచ్చును. 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' నని సూత్రించి, 'సింగపుంగొదమ' యను స్థలాంతరమునందలియుదాహరణమునం దీయంశమును సూరియు సూచించెను.

కాఁగా ద్వితీయాదులకుఁ బ్రథమ యవుట కొన్నియెడల మాత్రమే చూపట్టెడి దగుటచే బహువచనస్వారస్యముచే నిట్టిక్వాచిత్కస్థలములను సంగ్రహించుట యుక్తమే.

'షష్ఠీవిశేషణానా' మ్మనుచోటిబహువచనముచే విశేషణములయొక్క షష్ఠీతరవిభక్తులకును బ్రథమ యగుట గల దనునర్థము సాధింపఁబడుచుండుటంజేసి యీసూత్రము చింతామణియొక్క యభిప్రాయమును స్పష్టము చేయుచున్నది. అనఁగా నాసూత్రమున కీప్రౌఢ. లక్షణము వ్యాఖ్యాప్రాయ మనఁదగు.

సూరియును 'విశేషణంబులషష్ఠికి' నని చింతామణిమార్గములో బహువచనమునే ప్రయోగించెను. కాఁగాఁ జింతామణియందలిబహువచనము సాధించునర్థమునే బాలవ్యాకరణమును సాధించు ననవచ్చును. ఈప్రౌఢ. లక్షణము బాలవ్యాకరణము నందలియిచ్చోటిబహువచనమునకు వివరణప్రాయ మనఁదగియున్నది.

మఱియు నిట్టి విశేషణవిభక్తివిశేషములు పెక్కులు గల వని సూత్రకర్త వివరించెను. కాని యవి యేవియో సూచింపలేదు. ప్రయోగములు వెదకి కనుగొన వలెను.

తత్త్వ. భవత్యర్థకము గమ్యమాన మైనపుడును బ్రథమ యవు నన్నచో నీసూత్ర మనవసర మగు నని యింతకు ముందు సూత్రముకడఁ బేర్కొన్నది. (238) అయ్యది సరి కా దని యట స్పష్టము. కావున భవత్యర్థకము ప్రయోగింపఁబడకయే షష్ఠికిఁ బ్రథమ యగుట చింతామణ్యాదులు ప్రతిపాదించుట గమనింపఁదగును.

## ద్వితీయకు – ప్రథమ

**24. ఒక్కచో ద్వితీయాంతవిధేయవిశేషణంబునకుం బ్రథమ యగు.**

వాక్యమునం దుద్దేశ్యము, విధేయము నని రెండంశము లుండును. అందు విధేయభాగమందలివిశేషణము విధేయవిశేషణము. వాక్య. 9. తత్త్వ. 224. ఆవిశేష్యము ననుసరించి విధేయవిశేషణము ద్వితీయాంత మైనపు డద్దానిద్వితీయకుఁ బ్రథమయు నగుట యొకచోఁ గల దని సూత్రమున కర్థము.

బ్రాహ్మణముఖ్యున్ పురోహితుండుగాఁ జేకొనువారము. ఇందు బ్రాహ్మణ ముఖ్యున్ అన్నది విశేష్యము. ద్వితీయాంతము. పురోహితశబ్దము విధేయవిశేషణము. అదియు విశేష్యము ననుసరించి ద్వితీయాంతము (పురోహితునిన్) కాఁగా దాని ద్వితీయ కీసూత్రముచేఁ బ్రథమ యై, 'పురోహితుఁడు' అని యైనది.

'ప్రథమయును' ననుచోటిసముచ్చయార్థకనుశబ్దముచేఁ బ్రథమ రాకపోవుటయు ననఁగా విధేయవిశేషణముద్వితీయతోఁ గూడియుండుటయుఁ జెప్పఁబడుచున్నది.

వాని బ్రాహ్మణకులుఁగా నెఱుఁగుము. ఇందు బ్రాహ్మణకులున్ అనువిధేయ విశేషణము ద్వితీయాంత మైయున్నది.

సర్వ. సముచ్చయార్థకముచేతనే ద్వితీయ యుండుట సిద్ధించుటచే 'ఒక్కచో' ననుదళ మనవసర (129) మన్నది. తత్త్వ. 'కొన్నియెడల ననుదళముచేతనే యాయర్థము సిద్ధించుటచే సముచ్చయార్థక మనవసర' (246) మన్నది. సూత్రమునం దున్న 'ఒక్కచో' ననుదానిని 'కొన్నియెడల' నని చూపుట పొరపాటు. ఒక్కచో ననునదియు, నుశబ్దమును బక్షాంతరమునే సాధించుచో నుశబ్దమునే యుంచి యొక్కచో ననునది వ్యర్థ మన్నచో సూత్రమున లాఘవము సిద్ధించును.

కాని యొక్కచో ననుదళము వికల్పార్థక మనియు, నయ్యది యనవసర మనియుఁ దలఁచుట సరి కాదు. ఇయ్యది క్వాచిత్కతాబోధక మని యిట్టిచోట్ల నెల్ల గ్రహింపఁ దగును. ఇట్లు ద్వితీయకుఁ బ్రథమ వచ్చుట క్వాచిత్క మని యొక్కచో ననుదళము పేర్కొనుచుండఁగా నట్లు ప్రథమ వచ్చినచోట్లఁ గూడ ద్వితీయ యుండుట యధిక మని నుశబ్దము చెప్పుచున్న దని గుర్తించిన రెండును సార్థకములే యగు.

సర్వ. (129), తత్త్వ. (246) ద్వితీయాంతవిధేయవిశేషణమునకుఁ బ్రథమ యగు

ననుట సరి కా దన్నవి. అది యుక్తమే. విధేయవిశేషణంబు ద్వితీయకుఁ బ్రథమయు నగు ననఁదగు ననువ్యాఖ్యలసవరణ ముచితముగానే యున్నది.

తత్త్వ. 'పురోహితుండు అనువిశేషణము చేకొనుటలోని కన్వయింపక కాన్ అను అగుధాత్వర్థకములోని కన్వయించుచున్నది. అగుధాతువు అకర్మకము. అందుచే దానికిఁ గర్మ యుండదు. పురోహితుండు అగుధాతువుతోఁ గర్తగా నన్వయించుటచేఁ బ్రథమాంత మయ్యెను. బ్రాహ్మణకులున్ అనునది ఎఱుఁగు అనుక్రియలోని కన్వయించుట వివక్షితము. అందుచే దానికి ద్వితీయ వచ్చెను. అయినను నిట్టిశబ్దాన్వయరహస్యము క్లిష్టముగా నుండుటచే స్పష్టప్రతిపత్తికై విభక్తివిధానము నిట్లు గావించె నని తెలియఁదగు (245) నన్నది. దీనింబట్టి ప్రథమ యైనచో 'కాను' అనుదానిలోని కన్వయించు ననియు, ద్వితీయ యైనచోఁ గ్రియాపదములోని కన్వయించు ననియుఁ జెప్పవలె నన్నమాట. అనఁగాఁ బురోహితుండుగాఁ జేకొనువారము అనుచో 'కాను'లోని కన్వయము. పురోహితునిగాఁ జేకొనువార మనుచో చేకొను అనుదానిలోని కన్వయము. ఇయ్యది విశేషమే. ఇందలిక్లేశమును వ్యాఖ్య గుర్తించుట యుక్తముగా నున్నది.

అది య ట్లుండఁగా నిటఁ బురోహితుండుగాఁ జేకొనువార మనుచో నేను పదము ప్రత్యేకముగా నన్వయించునది కాఁగా మంత్రులఁగా నొనరించితె యనుచోఁ గానులోని కన్వయింపకపోవు టెట్లు? 'మంత్రుల నొనరించితె కాన్' అని యుండ వచ్చునా?

విధేయవిశేషణములపైని గన్పించు కాను అనుప్రయుక్త మయినదే కాని దానికి అగుధాతువు తుమర్థాదులు లే వని ఘం. భావించినట్లు గమనింపఁదగును. (క్రియా. 22) అపుడు కాను అనుదానిలోని కన్వయంచుటచేఁ బ్రథమ యైన దనురీతిగాఁ దలంచుటకు వీలు లేదు.

అయినను బ్రస్తుతలక్షణమునకు విశేషప్రయోజనము గల దని తలంపరాకున్నది. ఈవిధానము స్పష్టతకు మాత్రమే యుపయోగించును.

సూత్రకర్తయభిప్రాయము ననుసరించి విధేయవిశేషణమునకు విభక్తి విశేష్యము ననుసరించియే యైనది. కాని క్రియాన్వయము ననుసరించి కా దని స్పష్టము.

వాని బ్రాహ్మణకులుఁగా ననుచో ద్వితీయ నిల్చుట యందువలననే. ద్వితీయకుఁ

బ్రథమావిధానము సయిత మీయంశమునే, విధేయవిశేషణము విశేష్యానుగుణవిభక్తి నందుటను స్పష్టము చేయుచున్నది.

అట్టియెడలఁ గొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకును బ్రథమ చూపట్టెడి నను(కార. 22) లక్షణముచేతనే యిట సైతము విధేయవిశేషణము ద్వితీయకుఁ బ్రథమ చేసికొనుట కవకాశము గలదు. కాఁగా కార. 22 సూత్రమునొద్దనే యిట్టివిధేయవిశేషణముద్వితీయకుఁ బ్రథమ నుదాహరించినచో నీయంశ మచ్చటనే స్పష్ట మైయుండెడిది. అపు డీసూత్రమునవసరము లేదు.

దీనిని బృథక్కరించి చెప్పుటవలన విశేషప్రయోజన మేమియు లేదు. చెప్పెను గావున స్పష్టతకొఱ కని తలంపవలయును.

## విధేయవిశేషణప్రయోగవిశేషము

**25. కొన్నియెడల విధేయవిశేషణం బొండ బహువచనాంతం బయి విశేష్యంబులు పెక్కింటి కన్వయయోగ్యం బగు.**

పెక్కువిశేష్యములకు సంబంధించినవిధేయవిశేషణము సమానముగా నొక్కటె యైయున్నచో నయ్యది బహువచనాంతముగా నొక్కచోటఁ (చివర) బ్రయోగింపఁ బడును. ఆపెక్కు విశేష్యములతోఁ బ్రత్యేకముగా నన్వయము కలిగియుండు నని సూత్రమునర్థము.

ఇది దక్షిణాపథమునకు (తెరువు),

ఇదియు విదర్భాపురమునకు (తెరువు), ఇది కోసలకు (తెరువు), ఇం

దిది యుజ్జయినికిఁ దెరువులు,

మది నిన్నిటిలోన మన కెద్ది (తెరువు) అగున్. అనునది లక్ష్యము.

ఇటఁ దెరువులు అనువిధేయవిశేషణము బహువచనాంతముగాఁ జివర నొక్క చోటనే ప్రయుక్త మైయున్నది. దక్షిణాపథమునకు ఇది తెరువు అనురీతిగా మిగిలిన విశేష్యము లన్నింటితో నన్వయించుచున్నది.

బహువచనాంతము గాక యేకవచనాంత మైనచోఁ దెరువు లై దుండవలె నని సూత్రకర్తయే వివరించెను. కాని దీని నంగీకరింపక సర్వ. ఎద్ది తెరు వగున్

అనుచో తెరు వుండనక్కఱ లేదు కావున నాలుగు చాలు నని పేర్కొన్నది. అది యుక్తమే. సర్వనామ మగు 'ఎద్ది' యనునదే తెరు వని (ఏతెరువు) తెలుపును. రాముఁడు ఘనుఁడు. అతనిభార్య సీత. అనుచోఁ దచ్ఛబ్దము రామునే కదా బోధించునది. కావున నెద్ది యనుచో నిటఁ దెరువును దే నక్కఱలేదు. ఘం. మది నిన్నిటిలోన నరుగ మన కేతెరు వగు' నని వివరించినది. ఏది తెరు వగు నని యర్థము. 'మదిం దెరువు లిన్నిటిలోన మన కెద్ది తెరు వగు' ననుతీరుగాఁ జెప్పినఁ దెరువు లాఱు గావలసివచ్చును. ఎద్ది యనుచోటనే తెరువు నన్వయింప నేల? ఇన్నిటిలోన ననుచో నేల కాదు? ఇన్నిటిలోన ననునది యీతెరువులలోన నని యర్థము చెప్పుచున్నది గావున నెద్ది యనునది సైతము తెరువును బోధింపఁ గలదు. కావున నైదవతెరు వక్కఱ లేదు.

పైఁగా నెద్ది తెరు వగు ననుచోఁ దెరువు విధేయమును గా దని తోఁచుచున్నది. దక్షిణాపథాదుల కయ్యవి తెరువు లగుట యనునంశము పూర్వవాక్యముచే స్పష్టమైనది. కావున నీతెరువులలో మనకుఁ దెరు వేది యగు ననురీతిగాఁ దెరు వనునది యుద్దేశ్యమే యై యెద్ది యనుసర్వనామమే విధేయ మగుచున్న దని చెప్పుట యుచితము.

కు.పం.(101)ఈతెరువు దక్షిణాపథంబునకు తెరువు, ఇది విదర్భాపురమునకు తెరు వనువిధముగా మొట్టమొదట నొకతెరువు చేర్చి యైదు సరిపుచ్చినది. కాని యిది సరి కాదు.(సుబో. 178) ఈతెరు వని మొట్టమొదటఁ జేర్పవలసినయవసరము లేమిఁ, జేర్చినచో నన్నింటికి నట్ల చేరి, నాలుగురెండ్లు ఎనిమిది తెరువులు గావలసి వచ్చును.

విధేయవిశేషణము బహువచనాంత మయి విశేష్యములతో నన్వయించు నని సూత్రము చెప్పుచున్నది. అనఁగా విశేషము. ఏకవచనమునం దుండవలసినది. బహువచనమునం దుండును. కావున నీబహువచన మేకత్వార్థక మని తలఁచి 'యిది తెరు' వనురీతిగా విశేష్యముతో నేకత్వార్థబోధకముగానే యన్వయించుచున్న దని గ్రహింపవలె. 'ఇది తెరువులు' అనురీతిగా బహుత్వార్థము విశేష్యానుగుణముగామి నన్వయింపనేరదు గదా.

విధేయవిశేషణము బహువచనాంత మగు ననియెనే కాని సూత్రకర్త యిది యెటఁ బ్రయోగింపఁబడునో స్పష్టము చేయలేదు. కాని విశేషణములు పెక్కులు

ప్రయోగింపఁబడినపిదపఁ జివరనే యిట్టిబహువచనాంతవిధేయవిశేషణము ప్రయోగింపఁబడు నని తెలుపవలసియున్నది.

ఇది దక్షిణాపథంబునకుఁ దెరువు, ఇది విదర్భాపురంబున కనురీతిగా విధేయవిశేషణ మితరస్థలములందుఁ బ్రయుక్త మవుట లేదు గదా. (సర్వ. 130) ఇట్టిదే –

ధనమునకు దానమును, దప
మున కాచారమును, రాజ్యమున కాజ్ఞయు, జీ
వనమునకు యశము, విద్యకు
వినయంబును, నేతలకు వివేకము ఫలముల్. (సింహా. 3.111)

కాని యీవిధాన మవసరమా యని యనుమానము గలుగుచున్నది.

మ్రుచ్చిల వ్రేఁగునతఁడు, కామాకులచిత్తుఁడు, కుందుదు రనుచో సముచ్చయము స్థలమునను గ్రియయు బహువచనాంత మగుట స్పష్టము. ఇటఁ గర్త లనేకము లవుటచేతనే క్రియాపదము బహువచనాంతము గావలె. అందుకే కదా 'చెప్పనివాఁడును, సత్యము చెప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడున్' అనుచోఁ గ్రియ యేకవచనాంత మవుటను బ్రత్యేకముగా (క్రియా. 6) విధించినవాఁ డీసూత్రకర్త. అట్లు క్రియవలెనె యిచ్చట విశేషణము నిట్టిసందర్భములందు బహువచనాంతమే యగుట సహజము. అనఁగా నాయయివిశేష్యము లన్నియును సామూహికముగా నీవిధేయవిశేషణముతో నన్వయింపవలె. కావున వానిబహుత్వము ననుసరించి విధేయవిశేషణము బహువచనాంత మగుట విశేషము గాదు. అందుచేతనే యిట్టి యెడల బహువచనాంత మైనవిధేయవిశేషణము విశేష్యముల కన్నింటికిని బిదపనే ప్రయుక్త మగుచున్న దనియు గ్రహింపవచ్చును.

పై ననేకకర్తృకక్రియలలో విడిగా నేకవచనాంత మయి ప్రయుక్త మైనకర్తృపదము లన్నియుఁ గలిసియే కుందుదు రనుబహువచనాంతక్రియలోని కన్వయించునట్లె యిచ్చోట సయిత మన్వయమును గ్రహింపఁదగును.

ఇంక విశేషణములలో నిట్టివిశేషము విధేయవిశేషణములందు మాత్రము కల దనుటను సూచించుచు నీలక్షణము స్పష్టత కుపయోగించు ననవచ్చును.

రాముఁడును గృష్ణుఁడును నల్లనివా రిత్యాదు లగునట్టివానిని సూత్రము వర్ణించుచున్నది.

## విభక్తిపరిణామము

**26. కొన్నియెడల విభక్తిపరిణామంబు గ్రాహ్యంబు.**

కొన్నియెడల నొకవిభక్తి యిం కొకవిభక్తిగా మాఱుపు పొందుట గ్రహింపఁ దగియున్న దని సూత్రమునర్థము.

ఈతనితో సాటి యనంగ మే లన. ఇట నీతనితో ననుతృతీయ సాటిశబ్దముతో నన్వయించి (బాల.కార.5), పిమ్మటఁ బంచమీవిభక్తిగా మాఱి మేలు శబ్దముతో నన్వయించుచున్నది. ఈతనితో సాటి యనంగ, నీతనికంటె మే లన నని యన్వయము. (ఘం.145)

ఇట సర్వ. 'తో అనునది సాటితో నన్వయించుచు తర్వాతి దైన మేలుతో నన్వయుంచునపుడు కంటె అనునర్థమునే యొసగుచున్న దని యర్థ' (132) మన్నది. తో ననునది పంచమ్యర్థము నిచ్చుచున్నదా? సూత్రకర్త 'యీతనికంటె మే లన. ఇక్కడఁ దృతీయకుఁ బంచమిగా మార్పు గలిగె నని తెలియవలయు' నన్నాఁడు. అనఁగా నర్థము చేయునపుడు తృతీయావిభక్తి పంచమీవిభక్తిగా మార్పు నొందిన దని యర్థము. కాని వాక్యమున మాత్రము తృతీయయే ప్రయుక్త మైన దని స్పష్టము. ఇటఁ గంటె ప్రయోగింపవలసినయక్కఱ లే దని సూత్రకర్త తలంచె ననుటకంటెఁ (సర్వ.132) బ్రయోగింపఁబడకుండుట గ్రాహ్య మని సూత్రకర్త తాత్పర్య మనుట యుక్తము.

ఇచ్చోట కంటెను గూర్చి సర్వ. మేలు అనునది గుణమును సూచించుచు జాతిగుణక్రియాసంజ్ఞలనుబట్టి నిర్ధారణము చేయవలసివచ్చినపుడు నిర్ధార్యమాణు డైన ఈతడు పైని కంటె అనుపంచమీప్రత్యయము రావలయు (131) నన్నది.

నిర్ధార్యమాణుఁ డైన యీతఁడు పైని కంటె వచ్చిన దనుట పొరపాటు. (సర్వ.66) జానపదులకంటె నాగరులు వివేకులు. ఇట నిర్ధార్యమాణ మేది? నాగరులు. నాగరశబ్దమునకుఁ గంటె యైనదా? దేనినుండి నిర్ధారింపఁబడునో దానికిఁ గంటె ప్రత్యయ మవును. ఇట నీతనికంటె మే లన ననఁగా నీతఁడు నిర్ధార్యమాణుఁడు గాఁడు. ఈతనికంటె 'నితరుఁ' డగును.

ఈతఁడు పైని కంటె వచ్చు ననుటయు సరి కాదు. ఈశబ్దముపై ననుట నిర్దుష్టము. నిర్ధార్యమాణుఁ డైన ఈతఁ డనుచో నయ్యది వ్యక్తిబోధక మైనది.

తద్వాచకశబ్దము 'ఈతఁడు' అనుదానిపై నని యర్థము గావలెను. అ ట్లయినను నిది సరి కాదు. ఈ శబ్దముపై ననవలెను. విభక్తి యగునది ప్రాతిపదికమీఁదఁ గదా. ఈతఁ డని ప్రథమాంతమును జూపి దానిపై నగు ననుట యొప్పదు.

ఇటఁ దత్త్వ. 'ఒక్కొకకన్నును జెవియును. ఇందు ఒక్కొక అనుపదము కన్నుతోడను జెవితోడను గూడ నన్వయించును గదా. ఇట్లు ఒకపదము పయిపదములతో నన్వయించునప్పుడు కొన్నిచోట్ల విభక్తులను మార్చి యన్వయింపవలసియుండు నని తాత్పర్య' (247) మన్నది. సూత్రకర్త యభిప్రాయము నియ్యది కావచ్చును.

కాని ఒక్కొకకన్నును ననుచోఁ బ్రత్యేకాన్వయము సమాస34. సూత్రముచే సిద్ధ మగుచున్నది. సమాస మగుటచే నిట్టియన్వయము విశేషము గావున నయ్యది ప్రత్యేకముగాఁ జెప్పఁబడియుండును.

వ్యస్తస్థితిలో నిట్టియన్వయము వలసినస్థలములయందే యిట్టివిభక్తిపరిణామము గల దని గ్రహింపవచ్చును. 'కొన్నియెడల' ననుదళముచే నీయర్థము నూహించుట కవకాశము గలదు.

ఇట్టివిధానమును వర్ఖులవా రంగీకరింపలేదు.

ఏకవాక్యమున రెండు విభక్తు లొక్కశబ్దముపైని నిల్వవలసివచ్చునపుడు కర్తృ కర్మాధికరణసంప్రదానాపాదానములలోఁ బరవిభక్తి బాధిత మై, పూర్వపూర్వవిభక్తులు నిల్చును. ఉదా. గంగను గూర్చి యేఁగి స్నానముం జేసెను. అనుచో గంగయం దనెడియధికరణము బాధిత మయ్యె. ఇట్లె యంతటను నెఱుంగున (బా. ఉ. 230) దనిరి (ఘం. 319). ఈయర్థమునే సూత్రకర్త తెలుఁగువ్యాకరణమున నీరూపమున స్పష్టము చేసె నని గ్రహించుచో నీవిధాన మనుచితము గా దనవచ్చు.

'ఈతనికంటె మే లన, సాటి యన' ననురీతిగాఁ బ్రయుక్త మైయున్నస్థలమున సైత మీప్రౌఢవ్యాకర్తృవిధానము సాధకము గాఁగలదు. కాని యట్టిప్రయోగము లున్నవా యన్నదే యనుమానము.

మొత్తముపై నీవిధానము దెలుఁగునఁ జేయఁదగియే యున్న దని మాత్రము చెప్పవచ్చు.

## ధాతుజవిశేషణము - అరు

### 27. తచ్ఛబ్దాంతము లగుధాతుజవిశేషణములమీఁద నరు చూపట్టదు.

చింతామణియందుఁ 'బరేషాం తు ధర్మోత్తమమధ్యమవత్, బహుషు న మధ్యమవ' త్తనుసూత్రముల ననుసరించి రువర్ణమును, 'ఉతో ఽచ్చ సర్వేషు' అనుసూత్రముచేఁ జెప్పఁబడిన ముందఱియత్వమును గలిపి యిటఁ బ్రౌఢవ్యాకర్త 'అరు' అని పేర్కొనియుండు. (బాల.లోను కార.33,34 సూత్రములచే సిద్ధించురువర్ణము ముందఱియత్వమును సైత మిట్ల గ్రహింపవచ్చును.) యుష్మద్విశేషణమునకు బహువచనాంతమున కీ 'అరు' అవుచున్నది. అది తచ్ఛబ్దాంతము లగుధాతుజ విశేషణముల మీఁదఁ గానరా దని యీసూత్రము చెప్పుచున్నది.

చూచినారు, మెట్టినారు, అనుచో చూచినారరు, మెట్టినారరు అనుతీరుగా 'అరు' రాలే దని లక్ష్య మిటఁ జూపఁబడినది. కు.పం., సుబో., తత్త్వ. సుగమ. వ్యాఖ్యలు చూచినార రనురీతి వపరూపము లని నిర్ణయించుచు నీవిధానము నంగీకరించినవి.

కు.పం. సూరిసూత్రమునందలి ప్రాయికశబ్దముచే 'అరు' చూపట్టనివి రక్షితము లయ్యె నని (101) నని పేర్కొన్నది. ప్రాయకశబ్దముచేఁ గొన్నియెడల నరు రాకుండుటను సూరి యటఁ బ్రస్తావించెను. ఇటఁ దచ్ఛబ్దాంతము లగుధాతుజవిశేషణ ములపయి 'అరు' అసలు లే దని భావించినపు డీయర్థము బాల. సాధింపఁగల దనుట యుక్తమా?

ఈప్రౌఢ.విధానమును గూర్చి సర్వ. బాలవ్యాకరకారుఁడు అట పెక్కులక్ష్యము లిచ్చినను నందు ధాతుజవిశేషణముల నసలు చూపలే దనియుఁ గావున నీప్రౌఢ. లక్షణము ధాతుజవిశేషణములపైఁ జూపట్ట దనుటచే చూచినాఁడవు ఇత్యాదులం దితరాగమములను జ్ఞాపకము చేయుటవలనఁ బ్రయోజనవంత మైయున్న దనియుఁ (145) బేర్కొన్నది. కాఁగా నీవ్యాఖ్యయు మెట్టినార రనురీతిరూపము లసాధువులే యని నిర్ణయించిన ట్లయినది.

ఇంక నిట్టిధాతుజవిశేషణముల నాగమములను సూరి యుదాహరింపలే దనుట విరుద్ధము. సూరి. కార. 33,34 సూత్రస్థలమునం దుదాహరింపలేదు. కాని క్రియా 117 సూత్రమునొద్ద ధాతుజవిశేషణములపయి నీయాగమము లేకత్వ బహుత్వములందు రెండింట నవుటను స్పష్టముగా నుదాహరించియున్నాఁడు. 'ఉన్న

కల న వర్ణకంబులమీఁది...' యనుమొద లగుసూత్రమునొద్ద వండుచున్నాఁడవు, ...వండుచున్నారరు, మున్నగురీతిగా నన్నియు నుదాహరించుటయే కాక యిట్లు వండఁగలవాఁడు, వండినాఁ డనియుఁ బేర్కొనెను. కాఁగా నీయాగమములు నవర్ణకాంతము లగుధాతుజవిశేషణముమీఁదఁ గూడ నగు ననియే సూరి స్పష్టము చేసిన ట్లయినది. బాల. క్రియ. 117 సూత్రవివరణమున సర్వ. 'వండుచున్నారరు, అను సూరియుదాహృతస్థలములందలి 'అరు' మున్నగువానిని గూర్చి యేమియుఁ బల్కలేదు. కావున నివి యసాధువు లని యట నీసూత్రము ననుసరించి యేల స్పష్టము చేయలేదో యర్థము గాదు.

కాఁగా 'అరు' ఇతరము లగునాగమములను అరుతోఁ గూడ సూరియే స్పష్టముగా ధాతుజవిశేషణములపయి నుదాహరించియుండుటంజేసి ప్రౌఢవ్యాకర్తృవిధానముచే సర్వ. జ్ఞాపకము చేసినవైయర్థ్యము వ్యర్థ మని నిర్ణయింపనగు. పైఁగా సూరి వండుచున్నవార రనురీతిగా నన్యార్థక మగునపుడు వండుచున్నారు (వారు) అని మాత్రమే చూపి యుష్మద్విశేషణమునకు 'అరు' రెండుచోట్ల చూపించుటచే నయ్యవి సాధువులు గావా యని యాలోచింపవలసియున్నది. సూరి 'అరు' చూపఁగాఁ బ్రౌఢ. చూపట్ట దని బాల. అభిప్రాయమును దిరస్కరించిన దనవలె.

వఝులవారు ధర యేలింపఁగ నున్నారరు, (ద్రోణ. 5. 111) జననము నొందినారరు (అర. 4181) (వ్యా.సం.స. 1095, ఘం. 145) అనుప్రయోగములు భారతమునుండి చూపిరి. ఇట్లు భారతమందే ప్రయోగము లుండఁగా నరు చూపట్ట దనుట విరుద్ధము గదా. అరు కన్పట్టునట్లు చేసినసూరియభిప్రాయమే యుచితము.

అంతకు ముందే కూచిమంచి తిమ్మకవి 'విన్నారరు కన్నారరు ననుచుఁ బులక నొప్పుం గృతులం జెన్నగు మధ్యమపురుషకుఁ బన్నగకులహార భవభయదూరా' (స.సా.సం.సంధి. 142) యని లక్షణము చేసి ధర యేలింపఁగ నున్నారరు (ద్రోణ. 5. 111) అనుతిక్కనప్రయోగమును ఆగమరువర్ణము ప్రాసఘటిత మైయున్న ప్రబలప్రయోగమును బ్రమాణముగాఁ జూపియున్నాఁడు. (149) అట్టియెడఁ బ్రౌఢ వ్యాకర్త అరు చూపట్ట దని సూత్రించుట సరి కాదు. అసలు తిమ్మకవి లక్షణము నీతఁడు చూడనేలే దేమో. చూచినఁ దిక్కనప్రయోగమునే యుపేక్షించి పైపెద్దన ప్రయోగమునుబట్టి సూత్రమును జెప్పునా?

మొత్తముమీఁద నీప్రౌఢవ్యాకర్తృవిధానము లక్ష్యవిరుద్ధ మనక తీఱదు. మెట్టినారు, ఇత్యాదులు సూత్రమునందలిప్రాయికశబ్దముచే రక్షితము లగును.

ఇంకను సర్వ. ఈప్రౌఢలక్షణము సమగ్రముగా లే దని యెంచుచు 'మంచివారు? ఇత్యాదులందును 'అరు' కన్పట్టుట లే(145) దన్నది. ప్రయోగములను వెదుక వలయును. అట్టిరూపమును లక్షణవిరుద్ధములు మాత్రము గా వని చెప్పవచ్చును.

విధానమే విరుద్ధము గాఁగా సూత్రరచనమును సమర్థవంతముగా లేదు. విశేషణములు ప్రథమాంతము లగునపుడే యీయాగమము లవును. ధాతుజవిశేషణ ములును బ్రథమాంతము లగునపుడే యవును. ధాతుజవిశేషణములకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్ద మనుప్రయుక్త మవును. కావునఁ దచ్ఛబ్దాంతము గాక ధాతుజవిశేషణము ప్రథమాంత మగుటయే యుండదు. కాఁగా సూత్రమునందుఁ 'దచ్ఛబ్దాంతము లగు' ననురీతిగాఁ జెప్పకున్న నిట నెట్టియవరోధమును లే దని గమనింపఁదగు.

## విశేష్యవచనవిశేషము

శబ్ద. 4. **సంఖ్యాప్రయుక్తవిశేషణ మేకాంతం బై యమహద్విశేష్యక మయ్యుఁ దదంశాంతం బయి మహదమహద్విశేష్యక మయ్యు సమస్తంబు వ్యస్తంబు నగుచో విశేష్యంబు క్రమంబుగ నుత్తరపదంబు నేకవచనాంతంబును, బూర్వపదంబు బహువచనాంతంబు నగు.**

ఒకశబ్ద మంతమందుఁ గల సంఖ్యాప్రయుక్తవిశేషణ మమహ త్తయినచో (అనఁ గా నమహత్తునకు విశేషణ మయినచో) విశేషణవిశేష్యములు సమాసము నందినపు డుత్తరపద మగువిశేష్యము బహువచనాంతమె యైయుండును. డెబ్బదియొక్క రథములు. అనఁగా డెబ్బదియొక్కటి రథము లనియే యుండవలయు నన్నమాట. లక్ష్యముల ననుసరించి (సమస్త మగునపుడు) ఉత్తరపద మైనయమహద్విశేష్యమున కేకవచనాంతత నిత్యము. అనఁగా డెబ్బదియొక్కరథ మనియే యుండవలెను గాని డెబ్బదియొక్క రథము లని బహువచన ముండరా దన్నమాట.

ఇరువదియొక్కదినములు (ఆను. 2. 329) (ము. ల. కౌ. కార. 38) ఇంతే కాక ఇరువదియొక్కదినము లన (ఆను. 2. 81), డెబ్బదియొక్కమహాయుగంబులును (మార్క. 5. 227మొ.)

సంఖ్యాప్రయుక్తవిశేషణ మేకాంశాంత మైనచో (అర, పాతిక, మొ.) విశేష్యము మహ త్తయినను నీకార్య మగు నన్నమాట. రెండున్నర మానిసులు అనుటకు వీలు లేదు. ఇట్టిప్రయోగము లొకపట్టున లభ్య మవునా? కాని యిరువదియొక్క దినము లనురీతిగా రెండున్నర మానిసు లనుటయు విరుద్ధ మని నిర్ణయింప నక్కఱ లే దని తోఁచుచున్నది.

సంఖ్యాప్రయుక్తవిశేషణము తదంశాంత మైనపుడు విశేష్య మమహ త్తయినచో సమస్తస్థితిలో నుత్తరపద మయినయమహద్విశేష్యమును నేకవచనాంత మై యుండును.

రూపాయ. అమహత్తు. (సమస్త మై) ఉత్తరపదముగా నుండఁగా, నేకవచనాంతత కాఁగా రెండున్నరరూపాయ యని యగును.

ఇటఁ గూడ నేకవచనాంతత నిత్యమే. కావున రెండున్నర రూపాయ లని యుండుటకు వీలు లేదు. అట్లు నియమించుట యుక్తముగాఁ గానరాదు.

ఏకవచనాంతత వికల్పముగాఁ జెప్పుటయే యుచితముగా నుండు ననుట యుక్తము. (తత్త్వ. 63,సర్వ. 97,ఘం. 39)

ఆపిదప వ్యస్తముగాఁ బైవిశేషణములు ప్రయుక్త మగుటలోనిస్థితిని గమనింపఁ దగును.

ఏకాంశము దదంశాంతము నైన సంఖ్యాప్రయుక్తవిశేషణ మమహత్తు విశేష్యముగాఁ గలిగి వ్యస్తముగాఁ బ్రయుక్త మైనపుడు విశేష్యము పూర్వమునందుఁ బ్రయుక్తము గాఁగా, నయ్యది బహువచనాంత మవును.

రథములు డెబ్బదియొక్కటి, రూపాయలు రెండున్నర.

ఇట్లె తదంశాంత మైనవిశేషణము మహద్విశేష్యక మైనపు డమహద్విశేష్యము పూర్వమునందుఁ బ్రయుక్త మయినచో బహువచనాంత మవును. మానుసులు రెండున్నర.

ఇట బహువచనాంతత నిత్య మగుటంజేసి రూపాయ రెండున్నర, రథము డెబ్బదియొక్కటి, మానిసి రెండున్నర యనురీతిగా నేకవచనముతోడిరూపము లుండవు.

బహువచనాంతతను బూర్వప్రయుక్త మగునపు డని చెప్పుటచే విశేష్యము పరముగాఁ బ్రయుక్త మయినపుడు బహువచనము రాదు.

డెబ్బదియొక్కటి (యైన) రథములు, రెండున్నర (యగు) రూపాయలు, రెండున్నర (యగు) మానిసు లనురీతి వ్యవహార ముండవచ్చునా? కూడదా? ఈప్రౌఢ. అభిప్రాయమును వఝలవారు తిరస్కరించిరి. (వ్యా.సం.స. 1077)

అస లీసూత్ర మేమి విధించుచున్నది?

తత్త్వ. సూత్రముచివరియంశమున నుత్తరపదంబు నేకవచనాంతంబును నన్నట్లే పూర్వపదంబును ననుచోట సముచ్చయార్థకనువర్ణము లోపింపక యుండుట సమంజస మన్నది. ఇట సమంజస మనుట విరుద్ధార్థక మవును. స్పష్టతకు బాగుండెడి దని సూత్రము చెప్పఁదగును. ఉత్తరపదంబు నేకవచనాంతంబును ననుచో స్వరము పర మైనది గావున నువర్ణము ద్రుతము లోపింపనేరదు. 'ఇటఁ బూర్వపదంబును బహువచన' అనుచో సరళము పర మైనది గావున నువర్ణము ద్రతము లోపించుటలో నసామంజస్య మేమి యున్నది? ఈవ్యాఖ్య యుద్దేశించినయర్థము గల్గుట కవకాశము స్పష్టముగా లేదు. కావున స్పష్టతకై లోపింపఁజేయకున్న బాగుండెడి దన్న నుద్దిష్టార్థము సిద్ధ మయ్యెడిది. ఇంతకును నర్థ మేమి యన 'నట్లు నువర్ణ మిచ్చుట వినఁబడుచుండె నేని రెండువాక్యములును సమానరీతి నర్థస్ఫూర్తి గల్గించుచు సరళముగా నుండును. కా దేని పూర్వపదం బనునది యుద్దేశ్యకోటిలోఁ జేరి బహువచనాంత మగుట మాత్రమే విధింపఁబడుచున్నట్లు భాసించును. అయ్యది గ్రంథకర్తయాశయము కాదు గదా' (63) యన్నది.

దీనింబట్టి సమస్తవ్యస్తస్థితులలో నేకవచనాంతబహువచనాంతతలతోపా టుత్తర పదత్వ, పూర్వపదత్వములు సైతము సూత్రమున విధేయాంశములే యని సూత్రకర్తయే యభిప్రాయపడినట్లుగా నీవ్యాఖ్య యభిప్రాయ మగుచున్నది. వ్యాఖ్య లెల్లను (ఘం. 38, సర్వ. 96, కుం.పం. 35) నిట్లే భావించినట్లు వివరణమునుబట్టి తెలియవచ్చుచున్నది.

కాని యసలు సూత్రకర్తయభిప్రాయ మిది యగునా? వ్యాఖ్యలు చెప్పినయర్థమున నొకలోపము గానవచ్చుచున్నది. సమస్త మయినపుడు విశేష్య ముత్తరపద మగుటయు వ్యస్త మయినపుడు విశేష్యము పూర్వపద మగుటయును విధింపవలసినయవసర మున్నదా?

ఇట విశేషణవిశేష్యములకుఁ గర్మధారయ మయిన దనుట స్పష్టము. అట్టియెడల

విశేషణమునకు విశేష్యముతో సమాస మగుటచే విశేష్య ముత్తరపదమే యగును. ఇది సమాస మగుటవలననే సిద్ధించుచున్నది గదా. తమ్ముఁగుఱ్ఱ లిత్యాదు లగు కొన్నింటిలో విశేష్యము పూర్వపద మగుటయుఁ గలదు. కాని యట విశేష్యపూర్వ పదకర్మధారయము లగుట విశేషముగాఁ జెప్పఁబడుటచే (సమా. 16) నయ్యది సాధ్య మగుచున్నది. ఆవిధి పుట్టినదే యందుకు. ఆవిశేషవిధి లేనపుడు సమాస మనుటతోడనే విశేష్య ముత్తరపద మగుట సిద్ధించుచున్నది కదా. విశేష్యము పూర్వపద పదములుగాఁ గలద్విగుసమాసము లే మే నున్నవా?

కావున సమస్త మగునపు డుత్తరపదత్వమును విధింపవలసినయవసరము లేదు. సమాస మైనను బూర్వపద మవుట సంభవించినపుడు గదా యుత్తరపదత్వమే యగు నని చెప్పవలయుట?

కావున నుత్తరపదత్వవిధానము వ్యర్థము.

ఇంక వ్యస్తతలోఁ బూర్వపదత్వవిధాన మవసరమా? అట్లు విధింపవలసిన యవసరమే లేదు. విశేషణములు పూర్వమునందును విశేష్యము తరువాతను బ్రయుక్తములు గావలె నని భావించిన (శబ్ద. 7,9) సుబోధిన్యాదివ్యాఖ్యలును బూర్వపదత్వవిధానము నామోదించుట వింతగ నున్నది.

వ్యస్తతలోఁ బూర్వపదత్వము విధింపవలయు నన్నచో వ్యస్తతయం దీసంఖ్యా ప్రయుక్తవిశేషణములు విశేష్యమునకుఁ దరువాత ప్రయోగించుటకు వీలు లే దని నిర్ణయించుట ప్రయోజన మనవలయును.

అందుకే తత్త్వ. 'ఏకవాక్యంబునందు అను(బాల. కార. 37)సూత్రముచే రథములు డెబ్బదియొక్కటి అనుచోట డెబ్బదియొక్కరథములు అనుపదముపౌర్వాపర్యము మాఱుచుండఁగా నట్టిదానిని నివారించుటకు నీసూత్రము రచింపఁబడె' (63) నన్నది. అనఁగా వ్యస్తతలో నీవిశేషణమును విశేష్యమునకుఁ దరువాత ప్రయోగింపరా దన్నమాట. అనఁగా డెబ్బదియొక్కటి యగురథములు, రెండున్నర యగురూపాయ లనురీతివ్యవహారము దుష్ట మని నిర్ణయింపఁబడినది.

కాని దీన దోష మేమియో తెలియరాదు. అయినను బ్రయోగములప్రామాణ్యము దొరకినపిదపఁ గాని యిందలియసామంజస్యమును సిద్ధాంతీకరింప రాదు.

కాఁగా దాని ననుసరించి యుత్తరపదముగా నున్నవిశేష్య మేకవచనాంతమును

బూర్వపదముగా నున్నవిశేష్యము బహువచనాంతము నగు ననియే సూత్రకర్త తలఁచె నేమో. అనఁగా నుత్తరపదపూర్వపదము లనునవి యుద్దేశ్యములే యగు నని యూహింపఁదగును.

ఇందును రెండిబ్బందు లున్నవి. ఈయన్వయపక్షమున నుత్తరపదంబును ననుచోటిచార్థకము నిరర్థక మనియే చెప్పవలసియుండును. లేక వ్యస్తతలో విశేషణము విశేష్యమునకుఁ బిదపఁ బ్రయుక్త మయినచో బహువచనము రా వీలులేదు గావున నేకవచనమే యగు ననియుఁ జెప్పవలెనా?

కాని యసలు వ్యస్తస్థితిని గూర్చి ప్రస్తావింపవలసినయవసర మేమి? (సమాస మైనచో) నేకవచన మగుట విశేషము గావునఁ జెప్పఁదగును. డెబ్బదియొక్కటి, రెండున్నర యనురీతిసందర్భములలో బహుత్వార్థమే యుండుటంజేసి బహువచనమే యగును. సహజముగా బహువచనమే రావలసియుండుటచేతనే కదా యేకవచనము చెప్పవలసినయవసరము గలిగినది. కావున నీసూత్రమున బహువచనాంత విధానము వ్యర్థమే.

అనఁగా 'సంఖ్యాప్రయుక్తవిశేషణం బేకాంతంబు నమహద్విశేష్యంబును దదంశాంతంబు మహదమహద్విశేష్యం బుత్తరపదం బగుచో నేకవనంబు విభాష నగు' నని మాత్రము సూత్రించినఁ జాలు నని తోఁచుచున్నది. వ్యస్తతలో బహువచనాంతత విశేషముగా విధింపవలసినయవసరమే లేదు.

ఇంక డెబ్బదియొక్కటి యగురథము లనురీతిరూపములు దుష్టము లనియే తీర్మానింపవలసివచ్చినపుడు వ్యస్తతయం దయ్యవి పూర్వప్రయుక్తంబు లగు నని చెప్పవచ్చును.

పూర్వపదం బనుసూత్రమునందలిదళముచే సమాసపూర్వావయవ మనవలసిన యక్కఱయు నీపక్షమున నుండదు. వ్యస్తతయం దనుచనే పూర్వపద మనుట కుదురదు. అంతే కాక బహువచనాంతత యనునవసరవిధానము సైతము తొలఁగును.

మొత్తముమీఁద నీసూత్రరచనము సమర్థవంతముగా లే దనియే చెప్పఁదగు.

ఇట సుగమ. బా.వ్యా.కార. 19 విశేష్యంబునకుం బోలె అనుసూత్రమునందలి వచనము అనుదానికి సవరణము 36 అనుట సంగతము గాదు. విశేష్యంబునకుం

బోలె ననుసూత్రము విశేష్యమువచనము విశేషణమునకుఁ జెప్పుచున్నది. ప్రస్తుత సూత్రము విశేష్యమువచనమును గూర్చి చెప్పుచున్నది. కాని విశేషణమువచనమును గూర్చి ప్రస్తావించుట లేదు. కావున విశేషణవచనమును గూర్చి చెప్పిన బాల.కార. 19 సూత్రమునకును విశేష్యమువచనమును గూర్చి చెప్పుచున్నప్రస్తుతస్థలమునకు సంబంధము లేదు. కావున దాని కిది సవరణ మనుట యుక్తము గాదు.

పైఁగా సుగమ. విశేష్యవిశేషణములందు వచనము మాఱుచుండుటను ఈవ్యాకర్త సూత్రీకరించె నని తెలియుచున్న (36) దనుటయు యుక్తముగా లేదు. ఈసూత్రము విశేష్యమువచనము మాఱుపును గూర్చి చెప్పెనే కాని విశేషణమువచనముం గూర్చి చెప్పలేదు గదా.

ఇట నొకయనుమానము గల్గవచ్చును. డెబ్బదియొక్కటి, రెండున్నర యనుచో విశేషణము లేకవచనాంతము లైయున్నవి. ఐనను విశేష్యము బహువచనాంతము. అందుచే విశేషణవచనమును మాఱిన దనుటకు వీలు లేదు. డెబ్బదియొక్కటి యైనను, రెండున్నర యైనను బహుత్వార్థము ననుసరించి విశేష్యము బహువచ నాంతము గాక తప్పదు. ఇంక నొక్కటి, అర, మున్నగువిశేషణములు బహువచ నాంతములే కావలయును. కాని సూత్రకర్త విశేషణముసంగతే యెత్తుకొనలేదే. అట్టియెడల విశేషణమునేకవచన మీసూత్రము సాధించుచున్న దని చెప్పుట యెట్లు? అయిన నిట నేకవచనాంతత యెట్లు? అనఁగా నొకటి మున్నగు నమహద్రూపములు చూపినసూరి 'యీశబ్దంబునకు సంఖ్యావాచకంబునకు బహువచనంబు లే' దని ఆచ్ఛి. 24 సూత్రమునొద్ద స్పష్టము చేసెను. కావున నిది యెప్పుడు నేకవచనాంతమె యైయుండవలె. ఇంక అర మున్నగు నేకాంశశబ్దములు బాల.లోఁ బ్రస్తావింపఁ బడలేదు. ఏకశబ్దమే తదంశార్థములకు నుపలక్షణముగా భావించి యేక వచనాంతతను గూర్చి చెప్పలే దనుకొనవచ్చునా?

ఈసుగమ.వివరణమునకు మూలము తత్త్వ. 'విశేషణవిశేష్యములు లింగవచన శూన్యములు. లింగవచనములందు సామ్యము గల వయ్యుండవలె' (బాల.కార. 19) నను నియమమును తప్పినస్థలముల నీసూత్రముచే సవరించె(63) నని తత్త్వ. అభిప్రాయము. మాఱినస్థలముల ననఁగా శబ్దములను నీసూత్రము సవరించె నని కాదు. మాఱినస్థలముల ననుసరించి బాల. సూత్రమును సవరించె నని గ్రహింపఁదగును. ఇం దేది సవరింపఁబడినదో స్పష్టము చేయలేదు. వచనము

కా దని యింతకు ముందు గ్రహించినారము. ఇంక లింగవిభక్తులు మిగిలినవి. విశేష్యము లింగవిభక్తులు విశేషణమునందు మాఱుట ఇక్కడ నెక్కడ నున్నది?

పైసూరిసూత్రసార మయినఁ గావచ్చును. తత్త్వబోధినియభిప్రాయము సూరిసూత్రానుగుణము గాదు. విశేష్యవిశేషణములలింగవిభక్తివచనములు సామ్యము గలిగియుండు నని యాతఁడు సూత్రింపలేదు గదా. ఒకవేళ సూరి యట్లే సూత్రించిన నీసూత్రము సగ మనవసరము. డెబ్బదియొక్క రథము, రెండున్నరరూపాయ, రెండున్నర మానిసి యనుచో సమాస మైనను నంతకుఁ బూర్వము నందలివిశేషణము ననుసరించి చూచిన విశేష్యములు సమముగనే యున్నవి గదా.

కావున విశేషణలింగవిభక్తివచనములం గూర్చి యాబాల.లక్షణమున కిది సవరణ మనుట యుచితము గాదు.

సర్వ.(97) తత్త్వ.వలెనే తలఁచినది. అదియు సరి కాదు. ఇంక విశేష మే మనఁ 'జిన్నయసూరి యగు నని ప్రయోగించుటవలన విశేషవిధుల కవకాశము కల్పించియే యున్నాఁడు. తానే మాటలు పె క్కేల మున్నగులక్ష్యములను సాధించుటకై విశేషవిధిని జెప్పియున్నాఁడు. ఆయన చెప్పనివిశేషమును జెప్పుట ప్రస్తుతసూత్ర ప్రయోజన' (97) మన్నది. ఇది సూరి చెప్పనివిశేష మనుట యుక్తమె. కాని 'మాటలు పెక్కేల' యనునది విశేషణవచనవిషయము. ప్రస్తుతసూత్రము విశేష్యవచన విషయము. 'అగు'శబ్దమును సూరియభిప్రాయమునకు విరుద్ధముగా సర్వ. విశేషార్థ మును గల్పించుకొన్నది. 'అగు' నని కాదు, 'నిత్యముగా నగు' నని చెప్పినను విశేషవిధిచే దానికి బాధ తప్పదు. కాఁగా నిది బాల.కార.19 సూత్రమునకు సవరణ మని చెప్పరాదు.

**శబ్ద.5. అయ్యది యేకాంతంబు మహద్విశేష్యకంబు సమస్తంబు గాదు. వ్యస్తం బగుచో బహువచనాంతంబ యగు.**

పూర్వసూత్రమున నేకాంశాంతం బయినసంఖ్యాప్రయుక్తవిశేషణముయొక్క మహద్విశేష్యము విషయము చెప్పఁబడినది. అమహద్విశేష్య మేక, తదంశాంతములు రెంటియెడఁ బ్రస్తావింపఁబడినవి. కాఁగా నేకాంతం బగుసంఖ్యాప్రయుక్తవిశేషణము యొక్క మహద్విశేష్యస్థితి చెప్పలేదు. కావున నది చెప్పవలె నను నుద్దేశముతో నీసూత్ర మారంభింపఁబడియుండవచ్చు.

ఏకాంత మైనయాసంఖ్యాప్రయుక్తవిశేషణము మహద్వాచకము విశేష్యముగాఁ గలది యగుచో సమస్తము గాదు. అనఁగాఁ 'బదునొక్కరుద్రు' లనురీతిగా సమాసము నందదు. కాఁగా నింక వ్యస్తముగానే యుండును. అపు డాసంఖ్యాప్రయుక్తవిశేషణము బహువచనాంతమే యవు నని యర్థము.

వ్యస్తముగాఁ 'బదునొక్కండ్రు రుద్రులు' అని యుండును.

కాని యీలక్షణము చెప్పవలసినదిగాఁ దోఁపదు. పూర్వసూత్రమున విశేష్యము వచనమును గూర్చియే ప్రస్తావింపఁబడినది. 'అయ్యది' యనుప్రథమాంతనిర్దేశముచే నిట గ్రహింపఁబడినసంఖ్యాప్రయుక్తవిశేషణమే బహువచనాంత మగు నని చెప్పిన ట్లయినది. నిజమునకు నేకాంశాంతం బగుసంఖ్యాప్రయుక్తవిశేషణముయొక్క మహద్విశేష్యవిషయమే పూర్వసూత్రమునం దనుక్త మగుటంజేసి యిట విశేష్య విషయమే యనఁగా విశేష్యవచనమును గూర్చియే చెప్పవలె. విశేషణమును గూర్చి చెప్పుట పూర్వసూత్రమునకు భిన్న మై, యచటివిశేషణము లే మగు ననుసందేహము గల్గించును. ఒకవేళ నందుకే యీసూత్రము చెప్పె నేమో యన్నచో 'నమహద్విశేష్యక మై, యేకాంతం బయినసంఖ్యాప్రయుక్తవిశేషణము వ్యస్తం బగుచో బహువచనాంత మైయుండు' ననుటచే నేతద్భిన్నము లగునట్టివి వ్యస్తతలో మహద్విశేష్యకము లై యేకాంశాంతము లయినసంఖ్యాప్రయుక్తవిశేషణములును, మహదమహద్విశేష్య కము లై యేకతదంశాంతము లయినసంఖ్యాప్రయుక్తవిశేషణములును బహువచ నాంతములు కావు. అనఁగా నేకవచనాంతములే యగు నన్నమాట. సమస్తస్థితిలో నీవిశేషణము పూర్వపద మైయుండును. కావున నట నేకవచనాంతత గాని మఱి యొకటి కాని చెప్పకుండుటవలన బాధయు లేదు. కాఁగాఁ బూర్వసూత్రస్థలమున వ్యస్తతలో సంఖ్యాప్రయుక్తవిశేషణముల కేకవచన మీసూత్రము జ్ఞాపకము చేయు చున్న దనవలెను. కాని యట్టియేకవచనము పూర్వసిద్ధమే. బాలవ్యాకరణసిద్ధము నగుటచేత మఱలఁ జెప్పవలసినయక్కఱ లేమి నీయర్థము నిరర్థక మగుచున్నది. సూత్రకర్త య ట్లని యర్థము నిట సూచింపకపోవుటచే స్పష్టత కయ్యు నిట్లు చెప్పె నని తలంపనవకాశము లేదు.

ఇంతకును నేకాంతం బగుసంఖ్యాప్రయుక్తవిశేషణముయొక్క మహద్విశేష్యము సమస్తవ్యస్తస్థితులం దె ట్లుండును? అని పూర్వసూత్రముచే సందేహము గలిగినది. సమస్తంబు గా దనుటచే వ్యస్తతలో మహద్విశేష్య మెట్లుండును?అనుప్రశ్న మిగిలినది.

సూత్రమునందలియుత్తరార్థము విశేషణమును గూర్చి ప్రస్తావించుటచే విశేష్య మె ట్లుండు ననుప్రశ్న కిట సమాధానము లేకపోయినది.

'వ్యస్తం బగుచో హువచనాంతంబ యగు' ననుటలోనియవధారణార్థకము పూర్వసూత్రమునందలివిధానమునే స్మరింపఁజేయును. అట్టియెడల వ్యస్త మైనపుడు పూర్వసూత్రస్థలమునం దెట్లు బహువచనాంత మగుచున్నదో యట్లే యిదియు వ్యస్తతలో బహువచనాంతమే యగు నని సూత్రకర్త యుద్దేశించె నేమో. అయినఁ బూర్వసూత్రము నందువలె నిటఁ గూడ 'వ్యస్తం బగుచో విశేష్యంబు బహువచనాంతంబ యగు' నని విశేష్యపదము చేర్పవలెను గదా.

పూర్వసూత్రమున వ్యస్త మగుచోఁ బూర్వపదము బహువచనాంత మగు ననెను. ఉత్తరపదత్వము, పూర్వపదత్వము గూడ విధేయాంశములే యనియు వ్యాఖ్యలు భావించినవి. అట్టియెడల నిటఁ బూర్వపదత్వము చెప్పలేదే. అనఁగా నిట సంఖ్యా ప్రయుక్తవిశేషణము విశేష్యమునకుఁ బిదపఁ గూడఁ బ్రయోగింపవచ్చునా? అనఁ గా 'రుద్రులు పదునొక్కండ్రు' అనియే కాక 'పదునొక్కండ్రు రుద్రు' లనియుఁ జెప్ప నగు నన్నమాట. 'పదునొక్కండ్రు రుద్రు' లని యుదాహరించుటలో సూత్రకర్త యభిప్రాయ మదియే యైయుండును. ఐనను నిట విశేష్యమువచనమును గూర్చి చెప్పనిసందర్భమున నీయది పూర్వసూత్రముతో సంబంధము గలిగినది కా దని చెప్పవలయు. కాఁగా నీసూత్రము ననుసరించియుఁ బూర్వసూత్రమునఁ బూర్వ పదత్వము విధేయముగా సూత్రకర్త తలఁచె నని నిర్ధారింప నవకాశము చాలదు.

విశేషణమును గూర్చియే బహువచనాంతం బగు నని చెప్పినపక్షమున నిది సార్థకము గాదు.

బాలవ్యాకరణమున నన్ని మొద లగుశబ్దము లాఱును, ద్విప్రభృతిసంఖ్యావాచక ములును మహదర్థకంబులు బహువచనాంతంబు లగు నని కలదు. (సర్వ,98, తత్త్వ.65) కాఁగా మహద్విశేషణ మీయది బహువచనాంత మగుట పూర్వసిద్ధమే.

పూర్వసూత్రస్థలముననను నమహదర్థమునం దున్నవిశేషణము లేకవచనాంతము లగుట బాలవ్యాకరణముచేతనే సిద్ధించును గదా. ఇదియు న ట్లేల సిద్ధింపదు. సిద్ధించుచున్నను మఱలఁ జెప్పఁదలఁచుచోఁ బూర్వసూత్రమున (వ్యస్తతను) విశేష్యము బహువచనాంత మగుటతోపాటు విశేషణ మేకవచనాంత మవుటను గూడ విధింపవలయును.

లేదా యింతకు మున్ను భావించినట్లు ప్రస్తుతసూత్రజ్ఞాపనమువలననే వాని యేకవచనాంతత సిద్ధించు నంద మన్న నట్టియభిప్రాయము సూత్రకర్త కున్న యాధారము లేదు. అసలు సూత్రారంభదృష్టి వేఱు. విధానము పర్యవసానము వే ఱైనట్లును సూత్రకర్త పొరపడినట్లును జెప్పుటయే యుక్త మేమో యనిపించును. ఇది (4సూ) బాలవ్యాకరణముచేతనే సిద్ధించుచున్నను బ్రసంగవశమున స్పష్టప్రతిపత్తికై సూత్రింపఁబడె నని ఘం.(40) పేర్కొన్నది. పైవివరణము ననుసరించి యిది ప్రసంగానుగుణముగా లే దనుట స్పష్టము. ప్రసంగవశమునఁ జెప్పుచో విశేష్యంబు వచనము చెప్పుట 4సూత్రప్రసంగము. కావునఁ దదనుగుణముగా నిటఁ గూడ విశేష్యవచనమే చెప్పవలయును గాని విశేషణవచనము చెప్పు టెట్లు? ఇటఁ జెప్పి, 4 సూత్రస్థలమున మాను టెట్లు?

కావున నీసూత్రమందలియుత్తరార్ధము నిరర్థక మని నిర్ణయింపఁదగును. కు.పం., సుబో., సుగమ. వ్యాఖ్య లివి వ్యర్థ మని తలఁచినట్లు గానరాదు.

వ్యాఖ్యలు గుర్తించినట్లు కానరాదు కాని యిందలిపూర్వార్ధము సైతము వ్యర్థమే. ఏల యన నీతఁడే 'ద్విగువు మహదర్థఘటితం బదృష్టం' (ముక్త.5) బనెను. పదునొక్కరుద్రు లని యైన నది మహదర్థద్విగు వగును. అట్టి దదృష్ట మనుటచేత నేకాంతములకే కాక యితరసంఖ్యలకును నిట్టిసమాసములు లే వని తెలియుచున్నది. రెండున్నరమానిసి విశేషవిధానముగా గుర్తింపవలసియుండు. లే కున్న ముక్తలక్షణ (వివేచన)ము వ్యర్థము. ఇంతకు మహదర్థఘటితము లైనద్విగువులు కవిప్రయుక్తము లై కానరావు. రెండున్నరమానిసి యనునది లోకవ్యవహారమునుండి గ్రహింపఁ బడియుండు. కవిప్రయోగమును వ్యాకర్త ప్రదర్శింపలేదు గదా.

కావున మొత్తముమీఁద నీసూత్ర మెల్ల వ్యర్థ మనియే నిర్ణయింపఁదగు.

## మహద్విశేషణము - అమహత్కార్యము

శబ్ద.104. **మహద్విశేషణసంఖ్యావాచకములకుం గొన్నియెడల నమహత్కార్యంబు చూపట్టెడి.**

మహత్తు లైనసంఖ్యావాచకము లగువిశేషణములకు నమహత్కార్యము కొన్నియెడలఁ గన్పించుచున్న దని సూత్రమునర్థము.

అసురు లఱువదివే లుందురు. అసురు లనునది మహత్తు. కావున దానికి విశేషణ మగు 'నఱువదివేలు' అనుసంఖ్యావాచకము సైతము మహ త్తయినది. ప్రస్తుతసూత్రముచే నమహత్కార్య మగుటవలన 'నఱువదివేలు' అనియే యున్నది.

కొన్నియెడల ననుటచే నమహత్కార్యము రాకుండుట పెక్కెడలఁ గల దని స్పష్టము. అట్టియెడ నసురు 'లఱువదివేగురు' అనురీతిగా మహత్కార్యము గలుగును.

అబ్జవాసులు నూఱునయిదుపదులు అనునది విశేషరూప మనఁదగును. దీనమహద్రూపము నూఱునేఁబండ్రు, నూటయేఁబండ్రు నని యుండు నని సూత్రకర్త చూపెను. నూఱునేఁబది యనునది యలుక్సమాస మనవలె. లేదా సమాసమధ్యమున నుశబ్దప్రయోగము చెప్పవలె. పదియునొక్కండ్రు అనుదానివలె. కాని నూటయేఁ బండ్రు అని యొక్కటి యిచ్చిన బాగుండెడి దేమో. నూటయేఁబది యనుశబ్దముయొక్క మహద్రూపము నూటయేఁబండ్రు అని యగును గదా. నూఱునేఁబది యనుచో నూఱు అనునది మఱల నమహద్రూపమే యవుచున్నది. అది యట్లుండ నయిదుపదులు అనుదానినుండి యేఁబండ్రు అని యె ట్లగును. తత్త్వ. 'అయిదు+ పది = ఏఁబది అని సమాసముగా నుండు' (179) నన్నది. అయి దేనపదులు అయిదుపదులు అని యిట సమాసముగనే ప్రయుక్త మైనది. అయిదు+పది=ఏఁ బది యగు ననుట సరి కాదు. ఏను+పది=ఏఁబది యని (సమా. 24) ప్రౌఢ. యే సాధించినది. బాల. పక్షమునం దయినను ఏను+పది యనుచో నేనుశబ్దము నన్యంబులలోఁ జేర్చి తొలియచ్చుమీఁదివర్ణములకు లోపము, నుగాగమము చేసి రూపమును సాధింపవలెను. కాని అయిదు+పది=ఏఁబది యని యగుట యెట్లు? నిక్కలాదుల నాశ్రయింపవలెను. అయినను నీప్రౌఢవ్యాకర్తయే ఏను+పది అని ప్రక్రియ చూపఁగా దానికి భిన్నముగా నీప్రౌఢ. వ్యాఖ్యలోఁ జూప నవసర మేమి వచ్చినది? అయిదుపదులు అనునది సమాసమే యైనను దీనినుండి యయిదు పదుండ్రు అనురీతిగా మహద్రూపము ప్రయుక్త మగుట కానరాదు. అ ట్లుండు నని లాక్షణికులు చెప్పుటయుఁ గానరాదు. ఇట మహత్కార్యసందర్భమున నయిదు శబ్దమునకు బదులుగా నేనుశబ్ద ముండుట విశేషము.

వీరభటులు మూఁ డర్బుదములు, వేఁడివెలుంగులు పదివేలసహస్రములు. అనుచోఁ దత్సమములందును నీయమహత్కార్య మైనట్లు సూత్రకర్త యుదాహరించెను. దీనిం గూర్చి తత్త్వ. 'తత్సమశబ్దము లయినసహస్ర, అర్బుదములు (ప్రాతిపదికలను

సంస్కృతములుగానే వ్యవహరించుట బాలవ్యాకరణమునఁ గానవచ్చుచున్నది. ఇటఁ బ్రాతిపదిక మవికృతము చూపి తత్సమ మనుట విశేషము.) మహద్వాచకము లయినను బుంలింగములు కానందున డుజు ప్రాప్తింపదు. వీనికిఁ జేరినమువర్ణక మమహత్కార్యము కాదు. అయ్యది యదంతనపుంసకశబ్ద మగుటచే వచ్చినది. అందుచే సూత్రమున 'నమహత్కార్యంబు చూపట్టెడి' ననుటకు బదులు మహత్కార్యంబు చూపట్ట దనుట బాగు'. సహస్రాదిశబ్దములకు డుజు రాలేదు. గనుక మహద్రూపము చూపట్టకుండుటకు నుదాహరణము నగు' (179,180) నన్నది. కాని యీసవరణమును సరి కాదు. మహత్తులే యైనను సహస్రాదిశబ్దములు పుంలింగములు గామి డుజు రానేరదు. అట్టియెడల మహత్కార్యంబు చూపట్ట దనుటకు నిది యుదాహరణ మెట్లు గాఁగలదు. మహత్కార్యంబు చూపట్ట దనకున్నను నిట డుజు రాదు. తరువాత తత్త్వ. మువర్ణకమును నమహదదంతములకు వచ్చువర్ణకము గావున నమహత్కార్య మని తలంపవలయును. అ ట్లయినచో నుదాహరణములు పరిపడు (180) నన్నది. ఇది కొంతవఱకు సమంజసము. ప్రౌఢవ్యాకర్త ప్రాయికముగాఁ జింతామణ్యనుసారి. కావున మువర్ణక మమహత్కార్య మని తలఁచియుండవచ్చును. చింతామణి 'స్యా దమహతాం విభక్తౌ నో శ్చ ము' అనుచో నమహత్తులకే మువర్ణకము విధించినది. 'క్లీబసమా అమహద్వ' త్తనుదానిచేఁ గ్లీబములకును నమహత్కార్య మగుటను జెప్పినది. కావున మువర్ణక మమహత్కార్య మగును. బాలవ్యాకరణమువలెఁ జింతామణి నపుంసకములకు మువర్ణకమును బ్రత్యేకముగాఁ జెప్పలేదు.

కాని యింతమాత్రమున నమహత్కార్య మనుట సమంజసము గా దనక తప్పదు. ప్రస్తుతతత్సమలక్ష్యము లిట్లు సరిపడును గాక, యసురు లఱువదివేలు మున్నగున వెట్లు?'ఆచ్ఛికసంఖ్యావాచకముల కమహద్రూపములు ప్రామాణికము లగుచున్న (179) వనుతత్త్వ. అభిప్రాయము సరి గాదు.

ముప్పదివే లిత్యాద్యాచ్ఛికసంఖ్యావాచకములలో నమహత్కార్య మేది? వేయి యనుచో స్త్రీసమ మగుటచే స్త్రీలింగకార్య మగుప్రథమైకవచనలోప మయినది. ఇటఁ బ్రత్యేకముగా నమహత్కార్యము లేదు. సంఖ్యావాచకములలో నాచ్ఛికములందు మువర్ణకాంతములే కానరావు. కావున నమహత్కార్యము లయినందుల కవి లక్ష్యములు కానేరవు.

కావున నమహత్కార్యమును విధించుట సమర్థముగా లేదు. కావున 'నమహ ద్రూపంబు చూపట్టెడి' ననుట యుక్త మని తోఁచుచున్నది. (అమహత్త్వ మనక యమహద్రూప మనుటవలన రూపము మాత్రమే యమహత్త్వమునం దుండఁగా నర్థమున మహత్త్వ మీసూత్రమునందువలెనె సిద్ధించును.) స్త్రీసమ మగుట యమహత్త్వముననే కదా. కాని యిట్టియెడల నర్బుద మనురీతితత్సమములం దమహద్రూప మనుట యెట్లు? అందలిమువర్ణకము చింతామణ్యనుసారముగా నమహత్కార్య మగుటచే నమహద్రూప మని సమర్థింపవలె. ఇట్లు చెప్పినపక్షమున నూటయేఁబండ్రు అనుదానియమహద్రూపము 'నూఱునేఁబది' యనియే కాక 'నూఱునయిదుపదు' లనియు నుండనగు. కావున నాప్రయోగమును విశేషముగాఁ జెప్పవలసినయవసరమును లేదు.

కాని యవి యిట లక్ష్యములే గా దనుట లెస్స. అయ్యది మహద్రూపమే యన్నను విరోధ మెంతమాత్రమును లేదు.

మూఁడర్బుదము లనుదానికి మహద్రూపమును సూత్రకర్త మూఁడర్బుద ములసంఖ్యలవా రనురీతిగాఁ జూపెను. అర్బుదశబ్దమునకు నర్బుదముసంఖ్యలవా రనురీతిసమాసము మహద్రూప మనుట సహజము గాదు. కావున నొకేశబ్దమునకు నివి మహదమహద్రూపము లనుటకంటె రెండు వేర్వేఱు మార్గములకుఁ జెందిన శబ్దములుగా గుర్తింపనగును. వీరులు సహస్రసంఖ్యలవారలు, (ఆర. 7. 144, వ్యా. సం. స. 915) దానవు లనేకసహస్రసంఖ్యు లేతేర (ఉ. 4. 220).

కావున నమహద్రూపం బనుట యుక్తము. తత్త్వబోధిని యైనను నమహత్కార్య మనుట సరి కా దని 'మహద్రూపంబు చూపట్టు' దన్నది. దానికంటె 'నమహద్రూపంబు చూపట్టెడి' ననుటయ యొప్పును.

అమహత్కార్యం బనుటచేఁ గార్య మమహత్సంబంధి యైనను నర్థమున మహత్తే యని సూత్రకర్తయభిప్రాయము స్పష్ట మగుచుండఁగా సుగమ. అమహద్విశేషణములు గలుగు నని' పేర్కొని వరుసగా 'విశేషణము లెల్ల నమహత్తులుగాఁ' జూపినది. (109) అది యసంగతము. విశేషణమలు మహత్తులే. రూపము మాత్ర మమహత్త్వమున నుండు. మిత్రము (నపుంసకమై) మువర్ణకాంత మైనను మహత్తే కదా. మువర్ణకమును బట్టి యమహ త్తనుట యొప్పునా? సుబో. సర్వ. విశేషణము లమహత్తులుగా సూత్రముచే సమన్వయింపఁబూనుట సరిగాదు.

## మహత్కార్యము

**శబ్ద.17. మహత్సమూహార్థకశబ్దం బమహత్కార్యయుక్తం బయ్యుఁ దద్విశేషణ క్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాష నగు.**

మహత్సమూహమును బోధించుశబ్ద మమహత్కార్యముతో ననఁగా ముచవర్ణ కాదులతోఁ గూడియున్నప్పటికి నామహత్సమూహార్థకశబ్దములయొక్క విశేషణములు గ్రియలును మహత్కార్యమును విభాషగాఁ బొందు నని యర్థము. అనఁగాఁ బక్షాంతరమున నమహత్కార్యము నగు నన్నమాట.

'మునినికాయము పూజించిరి' అనుచోఁ గ్రియాపదము మహత్కార్యయుక్త మైనది. 'నిషాదగణము విషమము చేయును' అనుచోఁ గ్రియ యమహత్కార్యము తోనే యున్నది.

గీర్వాణగణంబు 'అఖర్వపరాక్రములు, ఉద్ధతులు', అయి – అనుచో విశేషణము మహత్కార్యము బొందినది. నిషాదగణము 'అసంఖ్యము' – అనుచో విశేషణ మమహత్కార్యమును బొందినది.

ఏసూత్రమునందలిమహచ్ఛబ్ద మేకశేష మనియు మహన్మహతీవాచకములు రెండును గ్రహింపఁబడు ననియు తత్త్వ. సముచితముగాఁ బేర్కొన్నది. ఘం. 'సూత్రమున మహత్సమూహార్థకశబ్దము అని కలదు. కాని విద్యాధరీకోటి యాడున్ అనుచో మహతీసమూహార్థక మమహత్కార్యము నందిన ట్లుదాహరింపఁబడుటచే (మహతీసమూహార్థక మమహత్కార్యయుక్తము కాఁగా దానిక్రియ యమహత్కార్యము తోఁ బ్రయుక్త మైన దని చెప్పుట యభిప్రాయము.) మహతీసమూహార్థకశబ్దము యొక్క క్రియ మాత్రము మహత్కార్యయోగ్యముగ విభాష నగు నని గ్రహింపనగు (48) నన్నది. అనఁగా నీవ్యాఖ్య మహచ్ఛబ్దము నేకశేషముగా గ్రహింపలే దని స్పష్ట మగుచున్నది. (సమా. 28)

'మహతీసమూహార్థకములక్రియలకు మహత్కార్యము లగును గాని విశేషణ ములకు మహత్కార్యములు గావు. 'మోహనరూపము విద్యాధరీకోటి' యనురీతిని బ్రయోగింపరా దన్నమాట. (ఘం. 324) అది యట్లే యయినచో సూత్రమునందలి విభాషాపదమునకు నట్టియర్థమును వ్యవస్థ చేసికొననగును.

కాని ఘం. మహత్కార్యము రా దని 'మోహనరూపము విద్యాధరీకోటి' యని

యుండ దనుట సరిగా లేదు. మహత్కార్యము వచ్చిన 'మోహనరూపులు విద్యాధరీకోటి' యని కావలె. మోహనరూపము అనునది యమహత్కార్య మైన రూపము. అది యసాధు వని నిర్ణయించుచో నమహత్కార్యము లే దనవలయును. తత్త్వ. మోహనరూపు లగువిద్యాధరీకోటి యనునది యనిష్ట మనుట(80) యుక్తముగా నున్నది. ఘం. ఆరూపమే చూపవలసియున్నది. ఇట తత్త్వ. 'మహత్కార్యయోగ్యంబు లగు' ననుచోఁ గూడ నేకశేషముగా సమన్వయించి 'మహత్కార్యయోగ్యంబును మహతీకార్యయోగ్యంబుగా నగు' ననునర్థము చెప్పవలయు (80) ననుట సముచితము. దీనివలన మహతీసమూహార్థశబ్దముపక్షమున మహత్కార్య మనఁగా మహతీకార్య మగుట సిద్ధించి 'మోహనరూపిణు లగు విద్యాధరీకోటి' యని యుండును. కాని విభాష ననుటచే నమహత్కార్యమును రావలసియుండును. అపుడు ఘం. చూపిన 'మోహనరూపము' అనురూప ముండవలె. దాని వారించుటకు విభాషాపదము నాశ్రయింపనగును గదా. సర్వ. రెండుచోట్ల నేకశేషమునే గ్రహింపవలె నని చెప్పి విశేషణమును మహతీసమూహముతో నన్వయించునపుడు మహతీ వాచకముతోను, మహత్సమూహముతో నన్వయించునపుడు మహద్వాచకముతోను అన్వయము నొందు (101) నన్నది. ఇట మహతీవాచకముతోను, మహ ద్వాచకముతోను అనుటకు మహతీరూపముతోను మహద్రూపముతోను అని యర్థము.

కాని తత్త్వ. ఇంత వివరించియును జివరకు 'ఇట్టికల్పన మంతయు నెత్తమ్ము లేకొండ నిత్యాదికము నుదాహరించి విభాష ననుటచే సూత్రోక్తకార్య మిచ్చుట రాలే దని చెప్పుటవలనఁ దటస్థించెను. దీని నీతఁ డుదాహరింపక యిట్టిమహతీ సమూహార్థకస్థలములం దీకార్యములు రా వనియే తలంచిన నుచితముగా నుండును. కోటిశబ్ద మమహదర్థైకవచనాంతమే కావున ఆడున్ అనుక్రియాపద మనుగుణముగనే యున్న' (81) దని పేర్కొనుట సరిగా లేదు. విద్యాధరీకోటి యాడున్ అనురూప మట్లె సిద్ధించును గాక. 'విద్యాధరీకోటి యాడుదురు' అనురూపము సాధువు కాదా? సాధువుగా నీవ్యాఖ్య యింతకు ముందు పేర్కొనియే యున్నది.(తత్త్వ. 80) అట్టియెడలఁ దద్రూపసిద్ధి కీసమన్వయము తప్పదు.

కాని ఘం. సమూహార్థకము లేకవచనాంతము లయ్యు బహుత్వబోధకము లగును గావున విద్యాధరీకోటి యనుచో బాల. ఆచ్ఛి. 26చే మహత్కార్యము కావచ్చు నని చెప్పనగు (324) నని మార్గాంతరమున సాధించినది. అనఁగా

మహత్కార్యము బాలవ్యాకరణముచేతనే సిద్ధించుటచే మహత్తుల నిట గ్రహింప నక్కఱ లే దని ఘం. తలcచినదా? అయిన నాడుదు రనురూపమే సిద్ధించును గాని యాడు నని యేకవచనరూప మెట్లు? ఒకసారి బహుత్వార్థము నొకసారి యేకత్వార్థము బోధించు ననవలయునా? లేక బాల.ఆచ్ఛి.26 సర్వనామక్రియాపదముల బహువచనము మహత్తునకువలె నగు ననుట వికల్ప మనవలెనా? కావున నాడుదు (ఆడున్) రనుదాని సిద్ధికయి ప్రస్తుతసూత్రము తప్పదు.

మహత్సమూహార్థక మమహత్కార్యయుక్త మగుటచే విశేషణక్రియాపదములును నమహత్కార్యములతోనే యుండవలసివచ్చుటచే మహత్కార్యయోగ్యతను జెప్పె ననవలె. కాని మహత్కార్యయోగ్యతను జెప్పుట యుచితమా యని యనుమానము.

విశేష్యంబునకుం బోలె లింగవిభక్తివచనంబులు విశేషణములకు రావలెను. కావున విశేషణములు నట్లే క్రియలును నమహత్కార్యములతోనే యుండవలసివచ్చుట చేతనే యీవిధానము చేయcబడిన దని తత్త్వ. తలcచినది. (79) విశేష్యపదము మహదమహత్తులలో నే దైన విశేషణము నట్లే యవును గదా. స్త్రీతిర్యగ్జడభిన్నంబులు ననుసూత్రమునుబట్టి గీర్వాణగణ మనుచో నయ్యది యమహత్కార్యము నందినను శబ్దము స్త్రీతిర్యగ్జడభిన్న మయినc గదా దీనివిశేషణమును మహ త్తవుట.

మహాత్ము లైనసురలు, బుద్ధిమంతుc డగుమిత్రము మొద లగురీతిస్థలములలో విశేషణము మహ త్తయినదా, లేదా? తదనుసారముగనే యిచటమహద్విశేషణము మహత్తే యగును. విశేషణమహత్త్వామహత్త్వములను నిర్ణయించుపట్టున విశేష్యంబునకుంబోలె ననుసూత్రముప్రసక్తియే యనవసరము. 'స్త్రీతిర్యగ్జడ భిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు' ననుదానిచేతనే స్త్రీతిర్యగ్జడ భిన్నము లైనవిశేష్యములయొక్క విశేషణములు మహత్తులును స్త్రీతిర్యగ్జడవిశేషణము లమహత్తులును నవుట సిద్ధించుచున్నది.

అమహదర్థంబునందు మహదర్థంబున ననురీతి వ్యవహారము ననుసరించి క్రియాపదములయెడను నిట్లే గ్రహింపవలె ననcగా మునినికాయ మనునది మహత్తు. కావున దీనికి సంబంధించినక్రియాపదము మహదర్థమునందే యుండ వలెను. పూజించిరి యనురీతిగనే.

కాcగా మహత్సమూహార్థకశబ్ద మమహత్కార్యయుక్తమే యయ్యును నయ్యది మహత్తే యవుటచే దానివిశేషణక్రియాపదములు మహత్కార్యయోగ్యములే సహజముగా నగుచున్నవి. 'అసంఖ్యము నిషాదగణము, విద్యాధరకోటి యాడు

ననురీతిగా మహత్తు లైనవిశేషణమును, మహదర్థక మగుక్రియాపదమును నమహ త్కార్యయోగ్యతను జెప్పుటయే యుచిత మని తోఁచుచున్నది. మహాత్ము లైనసుర లనుచో విశేష్యము స్త్రీత్వమునం దుండ విశేషణ మట్లు లేకుంట గమనింపఁదగు.

ఇంక నాపిదప మహత్కార్యము లేనిచో నమహత్కార్య మగు నని సూత్రకర్త భావించినట్లు వ్యాఖ్యలును స్పష్టము చేసినవి. సూత్రము ననుసరించి యట్లు చెప్పక తప్పదు. కావున నింతకు ముం దిచ్చుటనే సూత్రార్థము నట్లే చెప్పుకొనుట జరిగినది. కాని యమహత్కార్య మగునపుడు విద్యాధరీకోటి యాడున్, నిషాదగణము చేయు ననురీతిరూపము లె ట్లవు నన్నప్రశ్నకు సమాధానము లభింపలేదు.

నిషాదగణ మమహత్కార్యయుక్త మై, యేకవచనాంత మైనను (విశేషణ) క్రియాపద మేకవచనాంత మగు టెట్లు?

గీర్వాణగణం బనుసమూహార్థక మేకవచనాంతముగ నున్నను నిది బహుత్వ బోధకమే యగుటచే విశేషణము 'లఖండపరాక్రములు, కడు నుద్ధతులు, నని బహుచనాంతము లయినవి (ఘం. 324). అట్లే 'మునినికాయము పూజించిరి. గీర్వాణగణంబు రణంబు సేసిరి' యనుచోఁ గ్రియాపదమును బహువచనాంతమే యైనది. ఇట్టియెడల నిషాదగణము గూడ నమహత్కార్యయుక్త మై, యేకవచనాంత మైనను, బహుత్వబోధకము గావున విశేషణక్రియాపదములు బహువచనాంతములే కావలయును గదా. మహత్కార్యపక్షమున 'గీర్వాణగణం బుద్ధతుఁడు, మునినికాయము పూజింపఁగలఁ' డనురీతిగ విశేషణక్రియాపదము లేకవచ నాంతము లగుచున్నవా? అమహత్కార్యపక్షమున నిషాదగణము విషమము చేయుచున్న వనురీతిగా బహువచనాంత మగుచున్నదా? మహత్కార్యపక్షమునం దయిన బహువచనాంతత యమహత్కార్యపక్షమున నేల లేదు? ఏకవచనాంత మగు టెట్లు. నిషాదగణ మనునది యమహత్కార్యయుక్త మయినను దిర్యక్కు గాని, జడము గాని కాదు గదా. అట్లే విద్యాధరీకోటియును. (లాట్టులోఁ బ్రథమపురుషలో) బహువచనమున కేకవచనము రా వీలు లేదు గదా.

కావునఁ బక్షమునఁ గేవల మమహత్కార్యము మాత్రమే యగు నని సూత్రకర్త యభిప్రాయపడిన నది సరి కా దనక తప్పదు.

నిషాదగణ మన్నది యేకవచనాంతము. కావునఁ గ్రియ యేకవచనాంత మైన దనుటకు వీలు లేదు. అట్లే మహత్కార్యపక్షమునను 'గీర్వాణగణంబు రణంబు సేసె' ననురీతిగా నటఁ గూడ మహత్సమూహార్థకశబ్ద మేకవచనాంతమే యైనది.

మహ త్కార్యము మాత్రము సూత్రకర్త విధించెఁ గాని బహువచనమును జెప్పలేదు గదా.

మహత్కార్య మగునపుడే సమానార్థకశబ్ద మేకవచనాంత మయ్యు బహుత్వబోధక మగు ననియు నమహత్కార్యపక్షమున నయ్యది యేకత్వమునే బోధించు ననియుఁ జెప్పుటకును వీలు లేదు.

కాఁగా నమహత్కార్యపక్షమున వచనమునందును భేదము గల్గుట గుర్తింపఁ దగును.

నిషాదగణ మున్నది, నిషాదగణము లున్నవి, గణము గలదు, గణములు గలవు, అని యుండును గాని (నిషాదగణ ముందురు) నిషాదగణము లుందు రనురీతిగాఁ గూడ నుండనగు. దేవతాగణంబు లెల్ల నిర్మలు లై, బాల నెఱి నశించెద రన్న విని (భాగ. 3. 6. 44) కట్టిరి దేవతాసంఘములు కాంచనతోరణపంక్తు లెల్లెడన్ (బ.క. 6. 206) సంఘము లందఱు మీరలు (వి.పు. 2. 150)

'మహత్సమూహార్థకశబ్దము లమహత్కార్యయుక్తంబు లగుచో విశేషణక్రియలు తత్తుల్యంబులు విభాష నగు' నని చెప్ప నొప్పు నని తోఁచుచున్నది. తుల్యతచే వచనము గూడ సంగ్రహింపఁబడును గదా.

అమహత్కార్యయుక్తంబు లయ్యు ననుచోట చార్థముచే సూత్రకర్త మహత్కార్య మగుటయే విశేషముగాఁ దలఁచి, విధించె ననుట స్పష్టము.

ఈచార్థకమునకు తత్త్వ. విశేషార్థమును జెప్పినది. 'ఇరుదెగలు పగలు కారె' యనుశబ్దమున నమహత్కార్య మేమియు లేదు. అయినను నమహదర్థక మగుటచే విశేషణమున కమహద్రూపము రావలసియుండఁగా మహత్సమూహార్థ మగుటచే మహద్రూపము వచ్చినది. ఆకారణముచే మహత్కార్యయుక్త మైనను, గాకపోయినను, నీకార్యము వచ్చు నని గ్రహించునది. అమహత్కార్యయుక్తం బయ్యు ననుచోట సముచ్చయమువలన నమహత్కార్యయుక్తము కాకపోయినను నీకార్యము వచ్చును (80). ఇరుదెగ లనునది మహత్సమూహార్థక మనుచునే యమహదర్థక మనుట విరుద్ధముగా నున్నది. మహత్త్వమును దెలుపునపు డయ్యది మహదర్థకమే యగును గాని యమహదర్థకము గాదు గదా. పైఁగా ని ట్లర్థము చేసిన సూత్రము వ్యర్థ మగు నేమో యనిపించెడి. ఇరుదెగ లనుచో నయ్యది యమహత్కార్యయుక్తము గాకున్నను నమహదర్థక మగుటచే విశేషణక్రియాపదములకు నమహద్రూపము రావలసియున్న దన్న దీవ్యాఖ్య. గీర్వాణగణ మిత్యాదులలో మహదర్థక మైనను

నమహత్కార్యమునుబట్టి యమహత్కార్యము విశేషణాదులకు రావలె నన్నది గదా ముందు. అ ట్లయిన నమహత్కార్యయుక్త మైనను, గీర్వాణగణము మహదర్థక మగుటచే దాని ననుసరించి విశేషణక్రియాపదములకు మహద్రూపమే యగు నని చెప్పుచో మహత్కార్యయోగ్యతావిధానము వ్యర్థ మనియే తలంపవలయును. కాన నిరుదెగ లనుచోట నీవ్యాఖ్య సమన్వయము సరి గాదు.

'ఇరుదెగలు పగలు కారె' యనునది యస లిట లక్ష్య మగునా? ఇరుదెగ లన్నది యమహద్రూప మనుట కం దయినయమహత్కార్య మేమియును లేదు. తెగ స్త్రీసమ మగుటచేఁ బ్రథమైకవచనాంతతలో సులోప మవుటయే కాని యితరము లేదు. తెగ యన్నది స్త్రీసమము కాఁగా నీయది మహద్రూపమే యన్న నిబ్బంది యేమి? అన్న, అయ్య యిత్యాదు లమహద్రూపము లనుట యొప్పునా?

మహత్కార్యయోగ్యత విభాషగా విహితము. కావున మహత్కార్యము రానపు డమహత్కార్యము రావలె. అపుడు రూప మె ట్లుండును? ఇరుదెగలు పగఱ కావె అని యుండు నని ఘం.(47) పేర్కొన్నది. అది సరి కాదు. పగఱ యనునది మహద్రూపము గదా. పగ+వారు=పగఱు అని శ.ర. ఇంక సూ.ని. పగఱ యనియుఁ జూపి, దీనిని మహద్రూపముగనే పేర్కొన్నది. అనఁగా నిట విశేషణ మగు పగశబ్దమునకును మహత్కార్యయోగ్యత యీసూత్రముచేఁ గలిగిన దనవలెను. కాఁగా సూత్రము ప్రవర్తింపనిచో విశేషణమును నమహత్కార్యముతో నుండవలె. అయిన 'నిరుదెగలు పగలు కావె' అనియుండవలె నన్నమాట. ఇట్టిప్రయోగములు గలవా? ఇట్టిరూపము లుండు ననుట యేలకో నమ్మ శక్యము గాకున్నది.

ఇరుదెగ లనునది యమహద్రూపమె యన నక్కఱ లేదు. కాన మహద్రూపమే యని గ్రహించుచోఁ బ్రస్తుతసూత్రమునకుఁ బ్రసక్తియే యుండదు. పగఱ కారె యనియే యుండును గాని, 'పగలు కావె' అని యుండవలసినయవసరము లేదు.

కావున నిద్దాని నిట నుదాహరింపవలసినయవసరము లేదు.

కాఁగా నింతకు ముందు పేర్కొన్నట్లుగా మహత్కార్యయోగ్యత సహజసిద్ధ మవుటచే విధింప నక్కఱ లే దనియు నింక నమహత్తుల్యత విధించుటయే యుచిత మనియు గ్రహింపఁదగును.

**ఇది కారకపరిచ్ఛేదము**

అంబడిపూడి నాగభూషణం

# ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యానుశీలనము

# సమాసపరిచ్ఛేదము

## సమాసము

**సమాస మనఁగా సంయోగదశయందుఁ గలిగెడువిభక్తిలోపాత్మకపదస్వరూప సంగ్రహము. (ఇది లుక్సమాసవిషయము)**

పరిచ్ఛేదారంభమున సమాసలక్షణమును జెప్పుచు నది లుక్సమాస విషయముగా వ్యాకర్త వివరించెను. ఈపరిచ్ఛేదమును గ్రంథకర్త లుక్సమాసములు, నలుక్సమాసములు, లుగలుక్సమాసములు నని మూఁడుభాగములుగ విభాగించెను.

పైఁ జెప్పినది లుక్సమాసవిషయ మవుటచే సమాససామాన్యలక్షణము గా దని స్పష్టము. సమాసలక్షణము పూర్వము బాలవ్యాకరణమునందుఁ జెప్పఁబడుటచే దానిని విడచి సూత్రకర్త యిట్లు వివరించియుండును. ఈలక్షణము సామంజస్యము విచార్యము.

ఇందు సంయోగదశలో విభక్తిలోపముతోడిపదస్వరూపసంగ్రహముగాఁ జెప్పఁ బడినది. సంయోగదశ యన నేది? అప్పటికిన్+అప్పటికి ననుచో రెండుపదముల సంయోగదశయందు నామ్రేడితము పర మగుటచే విభక్తిలోపము రాఁగా, 'నప్ప టప్పటికి' నని యగును. ఇది సంగ్రహస్వరూపమే కద. ఇది లుక్సమాసవిషయ మనఁ జెల్లునా?

అనఁగా సమాససామాన్యలక్షణమును స్వీకరించి సమర్థంబు లగుపదంబు లేకపదం బగుటలోనిసంయోగదశయందు ననురీతిగా నర్థము చేసికొనవలెను. (తత్త్వ. 249) కాఁగా నిది లుక్సమాసస్వరూపమును వర్ణించునదియే కాని సమాస లక్షణము గాదు.

'సమాస మనఁగా' ననుప్రారంభమువలన నీవివరణము సమాససామాన్య స్వరూపమును బేర్కొనునది యని యర్థ మగును. 'వారణావతంబునవారు' అనురీతి

యలుక్సమాసములలో విభక్తిలోపము లేమి నయ్యవి సమాసములు కాకుండఁ బోయెడుప్రమాద మేర్పడుచున్నది. అందుకే సూత్రకర్త యిది లుక్సమాసవిషయ మని పేర్కొనెను. ఇది ముఖ్యముగాఁ బేర్కొనవలసినదే కాని యప్రధానము కాదు.

కావున లుక్సమాసవిషయ మన్నయంశమును గుండలీకరణములోఁ జూపుట సరిగాదు. ఆయంశమును వివరణమందే చేర్చి చెప్పుట యుచితము. సంయోగదశ యందుఁ గలిగెడువిభక్తిలోపాత్మకపదస్వరూపసంగ్రహము లుక్సమాస మనురీతిగాఁ బేర్కొనఁదగును. సమాససామాన్యలక్షణము ననుసరించి దీనియర్థ మతివ్యాప్తము గాకుండుట గుర్తింపవచ్చును. సమాస మనఁగా నని ప్రారంభించి సమాసములలో నొకభాగ మనఁదగినలుక్సమాసమును మాత్రమే వివరించుట యెట్లు సమర్థింపఁ దగును.

దీనినిబట్టియే విభక్తిలోపము లేనిది యలుక్సమాస మని తేలుచున్నది. అందువలననే యలుక్సమాసమును సూత్రకర్త యటఁ బ్రత్యేకముగా వివరింపలే దని గ్రహింపఁదగును.

ఇట సర్వ. ఇ ట్లన్నది. 'పూర్వపదాంతమున నున్నవిభక్తికిఁ గాని, వర్ణమునకుఁ గాని, లోపము వచ్చుచుండును. నాతమ్ముఁడు, అని యున్నపుడు యొక్కకు లోపము వచ్చును. పూసెజ్జ లని యున్నపుడు వువర్ణమునకు లోపము వచ్చును'. (152) 'విభక్తిలోపాత్మక మని సూత్రకర్త చెప్పుచుండఁగా వర్ణలోపవిశేషము నీవ్యాఖ్య చెప్పుట కాధారము స్పష్ట మగుట లేదు. లుక్సమాసములలో విభక్తిలోపము. పూసెజ్జ, పూవుసెజ్జ అనుచో వర్ణలోపము నియతము గాదు గదా. వర్ణలోపము లేకున్నను నయ్యది సమాసమే యగును.(సమాసమందలినుగాగమమందువలె నీరీతివర్ణలోపము విశేషకార్యమే యగును గాని వర్ణలోపమే సమాసముగాఁ జెప్పుటకు వీలు లేదు.

అంతే కాక, యీవ్యాఖ్య పూర్వపదాంతమున నున్నవిభక్తి లోపించు నని చెప్పుటయు సమంజసము గాదు. సమాసమునందు పదములవిభక్తుల కెల్ల లోపము రావలయునే కాని పూర్వపదాంతిమవిభక్తికే యని నియమించుట కాధారము లేదు. పరపదమునందును విభక్తి లోపింపవలసినదే. పిదప సమాసము ప్రాతిపదిక మై, యాయాయివిభక్తులను జెందును.

## కర్మధారయము

### ముక్త.4. తఱచుగ సర్వనామంబుతోడం గర్మధారయంబు చూపట్టదు.

సూత్రములో సర్వనామంబుతోడ ననఁగాఁ ద్రికేతర మైనదానితో ననుట (167) అని కు.పం. పేర్కొన్నది. అనఁగా నీసూత్రము కర్మధారయసమాసమునఁ బూర్వపదమునుగూర్చి పేర్కొనుచున్న దని కు.పం. తలఁచె నని స్పష్టము. త్రికపూర్వ పద మగుట ప్రసిద్ధ మగుటచేఁ ద్రికేతర మని యీవ్యాఖ్య పేర్కొన్న దన్నమాట. సుబో. ఇట్లె భావించినది (297). చూపట్ట దనురీతిగా సూత్రము చెప్పుచుండఁ గాఁ ద్రికము తప్ప ననురీతిగా నర్థము చేయుట యెట్లో యర్థము గాదు. సూరి త్రికపూర్వపద మయియుండు నని చెప్పినదానికి నిది వివరణ మగు ననుట (సుబో. 297) సమంజసము గాదు. త్రికము పూర్వపద మగు ననుచుండఁగాఁ ద్రికేతరములు గా వని చెప్పుట వివరణమే యగు నేమో. సూరి త్రికపూర్వపద మగుట స్పష్టముగాఁ జెప్పఁగా నిం దది చెప్పఁబడలేదు. తఱచుశబ్దమునుబట్టి త్రిక ముండవచ్చు ననుకొన వలె. సూరిసూత్రమునకు భిన్నముగా నీయర్థము నస్పష్టము చేయుచున్న యీలక్షణము వివరణ మగుట యెట్లు?

ఇటఁ దత్త్వ. అన్ని వస్తువులు, పలుదెఱఁగులు ఇత్యాదిగాఁ ద్రికేతరములును కర్మధారయమునఁ బూర్వపదములుగా నుండవచ్చు నని స్పష్టము చేసినది. సూరి లక్షణమునందలిస్త్రీసమశబ్దము దీనిని సంగ్రహింపఁజాలుచున్నది. అన్ని వస్తువు లనుదానిని వ్యస్త మన్నను విరోధము లేదు. కాని పలుదెఱఁగులు సమస్తరూపమె. 'పలు'శబ్దమునెడ సూరి అమహత్త్వంబున దీనికి వ్యస్తప్రయోగంబు లే దని చెప్పెను. శ.ర.లో నీసూత్రకర్తయు నిట్ల పేర్కొనె. కావునఁ ద్రికేతర మగుసర్వనామమును బూర్వపదముగా నుండ దని చెప్పుట యుక్తము గాదు.

'సర్వనామంబుతోడ' ననుతృతీయావిభక్తి ననుసరించి సూత్రకర్త యుత్తరపదమును గూర్చియే పేర్కొనె ననుట యుక్తము. తత్వ. (415) ఇట్లే నిర్ణయించినది.

సర్వ. ఈయభిప్రాయమును బేర్కొనుచునే 'అ ట్లయినప్పటికిని వచ్చినవాడు, వచ్చినది మున్నగుచోట్ల ఉత్తరశబ్దముగా సర్వనామము (బా. సమాస. 9)చే విధింపబడు చున్నది. కావున నుత్తరపదముగా సర్వనామ ముండ దనుటయు సమర్థనీయము గా దని పేర్కొన్నది. 'ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు

తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' నను బాల.సమాస.9.చే నేర్పడిన వన్న పైరూపములను సమాసము లనుట యొప్పదు. విభక్తివివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగు ననుటచే వచ్చినవాఁడు అనునది వచ్చిన అనుధాతుజవిశేషణములవిభక్త్యంతరూపములే కాని సమాసములు గావు. 'ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టియనుపదంబు విభాష ననుప్రయుక్తం బగు' ననుసూత్రమునం దెల్లయెడల ననుటవలన సమస్తస్థితిలోను, వ్యస్తస్థితిలోను ధాతుజవిశేషణముల కట్టి చేరును. (ఘం.241) అందు వచ్చినవాఁ డనునది వ్యస్త మని వ్యాఖ్యలు పేర్కొన్నవి. ఈసర్వ. 'ఎల్లయెడల ననుటచే సమాసమునందును తచ్ఛబ్ద మనుప్రయుక్త మగునపుడును 'అట్టి' వచ్చు' నని పేర్కొన్నది (185). తచ్ఛబ్ద మనుప్రయుక్త మైనట్టియీస్థలములును సమస్తములే యవుచో వీనికి వేఱుగాఁ జెప్పుట వ్యర్థము గదా. సమాసంబున నని చెప్పినఁ జాలదా? ఎల్లయెడల ననుట యేల?

అంతకు ముందే యీవ్యాఖ్య 'వచ్చిన+వాఁడు. ఇచ్చట పూర్వశబ్దము ధాతుజ విశేషణము. దీనిని ప్రథమావిభక్త్యంతము గావించుటకు వాఁడు అనుతచ్ఛబ్దము అనుప్రయుక్త మైనది. వచ్చినవాఁడు' (165) అన్నది. దాని ననుసరించి వచ్చినవాఁ డనునది వచ్చిన యనుధాతుజవిశేషణముయొక్క ప్రథమావిభక్త్యంతరూప మని యీవ్యాఖ్యయే పేర్కొన్నది గదా. మఱి యిట సమాస మనుట విరుద్ధము గాదా? కావున నిచ్చోట తచ్ఛబ్దము (అ) ప్రాతిపదికావయవమే కాని యుత్తరపదము కానేరదు.

తత్త్వ. 'నల్లనివాఁడు మున్నగునవి కర్మధారయములే యన్నను అందలి వాఁడు శబ్దము అనుప్రయుక్తముగాఁ గర్త్రర్థకమాత్ర మగుటచేతసర్వనామోత్తరపదసామాన్య కర్మధారయముగాఁ దలంపలే' (416) దన్నది.

ఈయవి కర్మధారయము లనుచునే యిందలి 'వాఁడు'శబ్ద మనుప్రయుక్త మనుట విరుద్ధము. ధాతుజవిశేషణములపైవలె నల్లాదివిశేషణములపైఁ దచ్ఛబ్దాను ప్రయోగమును బాలవ్యాకరణము గాని, ప్రౌఢవ్యాకరణము గాని స్పష్టముగాఁ జెప్పలేదు.

పైఁగా నొకవేళ 'వాఁడు' అనునది యనుప్రయుక్తముగానే చెప్పిన ధాతుజవిశేషణ ములపైనివలె విభక్తివివక్షలో నైన దని చెప్పవలెను. అపు డీయవి నల్లాదివిశేషణముల విభక్త్యంతరూపములే యగును గాని సమాసము లనరాదు. సమాసములు గా

వన్న నల్లనివాఁడు అనుచో నిగాగమ మెక్కడిది? నల్లనిది యనుచో అదిశబ్దమందలి యకార మెట్లు లోపించును? కావున నివి సమాసములే యని యంగీకరింపకతప్పదు. అపుడు తచ్ఛబ్దము ననుప్రయుక్త మైన దనుట యొప్పదు. నల్లశబ్దమునకు వాఁడు అనుదానితో సమాస మైన దనవలెనే కాని యనుప్రయుక్త మైన దను టెట్లు? నిగాగమాదిసామాసికకార్యము లన్నియు నంగీకరించుచు సమాస మనుట మాత్రమే యంగీకరింపకుండుటయు యుక్తము గాదు గదా.

'నల్లనివాఁడు మున్నగుకర్మధారయాభాసములు నరుదుగ నుండవచ్చును'. (ఘం. 200) ఇందుఁ దచ్ఛబ్దార్థము ప్రధానము గామింజేసి యాభాస మనుట యొప్పు ననవచ్చు. కాని సూరిప్రభృతులు కర్మధారయాభాసములు, బహువ్రీహ్యాభాసము లనువానిని బేర్కొనలేదు. బాల. నాది, యింటిది యనురీతివానిని సైతము సమాసములుగానే సాధించినదే కాని యాభాసము (షష్ఠీతత్పురుషాభాసము) లనలేదు. ఇవి కర్మధారయాభాసములు కావచ్చును. కాని శబ్దస్వరూపము ననుసరించి కర్మధారయ మనుటలో ఘం.కును విప్రతిపత్తి లేకుండవచ్చును.

కాఁగా నిట్టి వరుదుగా నుండుటను తఱచుశబ్దముచే ఘం. సాధించుట యెంతయు సమంజసము. కావున నివ్వానిని సమాసములుగా సూత్రకర్త తలఁప లే దనుతత్త్వ.అభిప్రాయము సరి కాదు. ఇట్టివి ప్రౌఢవ్యాకర్తమతమునను సమాసములే యని గ్రహింపవచ్చు.

అట్టి ఇట్టి ఎట్టి విశేషణంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపమును జెప్పిన సూత్రకర్త యట 'తెలుఁగున సాధారణంబుగ విశేషణంబు లవిభక్తికంబు' లనెను. అట్టియెడ 'నట్టివాఁ' డనునది సమాసమే కాక తప్పదు గదా. లేనిచో దానిపైఁ దచ్ఛబ్ద ముండు టెట్లు? ధాతుజవిశేషణములపైని వలె విభక్తివివక్షలో ననుప్రయుక్త మైన దని తలంచుచో వానివలె నివియు విభక్త్యంతములే యవును. పైఁగా నీతఁ డును ధాతుజవిశేషణములపయి విభక్తివివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మవు నని చెప్పినవాఁడు గాదు.

కావున నట్టివాఁడు, నల్లనివాఁడు, నల్లనిది, యిత్యాదులు సమాసములే యని తలంచియును వానికి విరోధము కలుగకుండ సూత్రమునఁ దఱచుశబ్దమును బ్రయోగించె నని గ్రహింపఁదగును. కావునఁ దఱచుశబ్దముచే నీరీతి నగుకర్మ ధారయములలోఁ దచ్ఛబ్దము సర్వనామ ముత్తరపదముగా నుండుట సూత్రసిద్ధ

మవును. కాఁగాఁ దఱచుశబ్దముచే ని ట్లరుదుగ నుండవచ్చు నన్న ఘం.అభిప్రాయము సమంజస మని స్పష్ట మగుచున్నది.

కాని ఘం. తఱచుగ అనుటచే సర్వనామ మరుదుగా నుత్తరపదము కావచ్చును. ఉదా. ఆయాకాలము. (260) అని చెప్పుట యుచితముగాఁ గానరాదు. 'ఆ+ఆ' అనురెండు విశేషణములకుఁ గర్మధారయ మైన దనియు, నీయది విశేషణోభయపద కర్మధారయము కావున నుత్తరపద మగు 'ఆ' సర్వనామ మగుటచే నీదానికిఁ దఱచుశబ్దము సాధక మనియు నభిప్రాయము. ఆయాకాలము, ఆయానేరములు ఇత్యాదిసమాసములలో కాలము, నేరములు అనునవియే యుత్తరపదములు. సంస్కృతమునందలి 'స్నాతానులిప్తః' అనురీతివి తెలుఁగున లేవు. ఆయిది లేదా ఆయీలు ఇత్యాదివిశేషణోభయపదములు తెలుఁగున లేవు గదా. (చూ.సమా. 17)

సర్వ. వచ్చినవాడు, మొద లగునవి సమాసపదము లగుటచే సర్వనామ ముండ దనుట సరి కా దని పేర్కొన్నది. అది సరి కా దని యింతకుముందు గుర్తించితిమి. 'ఇందు త్రికము ధాతుజవిశేషణములును సర్వనామములే కావున వ్యాకర్త పూర్వ పదమును గూర్చి చెప్పుట లే దని భావింపవలసివచ్చుచున్నది (563) అన్నది. పెక్కు, పలు, మున్నగుస్త్రీసమములు సర్వనాములు గదా. (ఇంక నిట ధాతుజ విశేషణములను సర్వనామము లనుట విశేషము. సర్వనామములలో సూరి ధాతుజ విశేషణములను బేర్కొనలేదు.

ఇ ట్లని యుత్తరపదముగా నుండ దని యర్థము చేసినను సూత్ర మీవ్యాఖ్యకు సమర్థింపలేనిదిగాఁ దోఁచుటచేఁ గాఁబోలును తిరిగి వాడు, అది, నేను మున్నగు సర్వనామములు పూర్వశబ్దములుగా నున్నపుడు కర్మధారయము గలుగ దని భావము కావచ్చును. అట్టియెడలఁ దఱచుగ నన్నమాట నిరర్థక మగుచున్నది. నేను ఇత్యాదు లుండకపోవచ్చును. అంతమాత్రమునఁ దఱచుశబ్దము వ్యర్థ మగుట యెట్లు? త్రికము మున్నగునవి యుండవచ్చు నని యింతకు ముం దీవ్యాఖ్యయే పేర్కొన్నది గదా. అట్టివానిని సంగ్రహించుటకే తఱచు శబ్దము సార్థక మగుచున్నది. తఱచు శబ్దమును దొలఁగించి 'సర్వనామంబుతోడఁ గర్మధారయంబు చూపట్ట' దని చెప్పినయెడలఁ ద్రికము పూర్వపదముగా నుండవచ్చును. కావున సర్వనామ మసలే యుండ దని చెప్పుట త ప్పని చెప్పవలసివచ్చును గాదా. కావున నెట్లు చెప్పినను దఱచుశబ్దము వ్యర్థము గానేరదు.

అస లిట్టియెడ సర్వనామంబుతోడ ననుతృతీయాంతనిర్దేశ మే మైపోవును. (సర్వ. 563) పూర్వపదమును గూర్చి చెప్పఁబూనె ననుట యుక్తము గానేరదు.

వచ్చినవాడు, ఇత్యాదులు సమాసము లనుట పొరపాటు. కావున దాని ననుసరించి యుత్తరపదముగా నర్థము చేసిన సూత్రము వ్యర్థ మగు ననుట సరిగాదు. నల్లనివాడు ఇత్యాదిసమాసము లున్న నయ్యవి తఱచుశబ్దముచే రక్షింపఁబడుచున్నవి. కావున సూత్రము సమర్థింపరానిది కాదు. కాఁగా తత్త్వ. ఘం.వ్యాఖ్యలు సంప్రదాయానుగుణముగాఁ బేర్కొనినట్లుగా నుత్తరపదముగా సమన్వయించుటయే యుక్తము.

అట్టికర్మధారయములు లేకపోవుటను బ్రయోగానుగుణముగా వర్ణించుట ప్రయోజనము. దీనివలన 'నిది నల్లనిది' యనురీతిగానే వేఱుగాఁ బ్రయోగింపఁ దగు ననియు నల్లనియిది యనురీతిని దగ దనియుఁ జెప్పుట ప్రయోజనముగా గుర్తింపఁదగును. 'ఎన్నిను, అయ్యార్వురు (వ్యా.సం.స. 211) అనురీతి వరుదుగా నుండనగును.

## బిరుదాద్యుత్తరపదసమాసములు

**2. కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యె నేని ద్వ్యక్షరాదంతస్త్రీపుంసంజ్ఞా వాచకం బగుపూర్వపదంబునంత్యాక్షరంబునకు దీర్ఘంబు బహులంబుగా నగు.**

సాంస్కృతికాచ్ఛికమిశ్రము లైనకర్మధారయములు మూఁడింట నుత్తరపదము బిరుదాదివాచక మైనచో రెండక్షరములలో నదంత మైనస్త్రీపురుషసంజ్ఞావాచక మగుపూర్వశబ్దము తుదియక్షరమునకు బహుళముగా దీర్ఘము వచ్చును.

రామశాస్త్రి, సుబ్బాశాస్త్రి, సుబ్బానాయఁడు అనువిధ మైనవి యిట లక్ష్యములు. ఇట సర్వ. తిరుమలాదేవి అనురీతిగా ద్వ్యధికాక్షరములయెడను నీకార్యము గానవచ్చుటచే ద్వ్యక్షరపరిమితిని విధించుట సరి కా (160) దన్నది. 'ద్వ్యక్షరాది చతుర్వర్ణపర్యంతజననామసు' అని వి.వి. సైతము పేర్కొన్నది. ద్వ్యక్షరములయందే యీకార్యము తఱచుగా నుండుటంజేసి సూత్రకర్త యట్లు పేర్కొనె నని చెప్పఁ దగును. తిరుమలాదేవి యనురీతివి వ్యవహారమున నున్న వని సర్వ. పేర్కొన్నది. వ్యవహారము ననుసరించి లక్షణమందలిసార్థక్యమును శంకింపఁబూనుట యుక్తము కాదు. కాఁగా నెట నేని క్వాచిత్కముగా ద్వ్యధికాక్షరములపైని గూడ నిక్కార్యము

గానన‌గుచో నవ్వానిని సంగ్రహించుటకే సూత్రమునందలి‘బహుళ’పదము సమర్థ మైయున్నది. కావున ద్వ్యక్షర అని చెప్పుట యసంగత మని నిర్ణయింపరాదు. ప్రాచుర్యము ననుసరించి యట్లు చెప్పుట యుక్తమే.

సూత్రమునం ‘దంత్యాక్షరంబునకు’ ననుదళము నుచితము గాదు. ద్వ్యక్షరశబ్దము – రామ. ఇం దంత్యాక్షర మనఁగా ‘మ’. స్వరసహిత మగువ్యంజనరూప మక్షరశబ్దము చే గ్రహింపఁబడును. హ్రస్వదీర్ఘాదిభేద మచ్చునకే కాని హల్లునకు లేదు. కావున నిట దీర్ఘ మంత్యాక్షరముందలియచ్చునకే యవును. అట్టియెడల నక్షరమునకు దీర్ఘ మన నేల? స్వరమునకు దీర్ఘ మవు నన్న స్పష్టముగా నుండును గదా.

అంత్యస్వరమున కనియుఁ జెప్ప నక్కఱ లేదు. ఇందుఁ బూర్వపదము ద్వ్యక్షరాదంతము గావలయుట సూత్రసిద్ధము. ఆపూర్వపద మదంతము గాక తప్పదు. కావున నంత్యస్వర మత్తే యగును. కావున స్వరమున కని సామాన్యముగాఁ జెప్పుటకంటెఁ గూడఁ దుదియత్తునకు నని పేర్కొన్నచో నింకను స్పష్టముగా నుండును. సుబ్బిసెట్టి యిత్యాదులలోనియిత్తును దీర్ఘమువలెనే యత్తున కయినదే. ‘ఇటఁ బూర్వపదంబునత్వంబున కిత్వంబు బహుళంబుగా నగు’ ననుచో నత్వంబున కనుటయు గమనింపఁదగును. అయినను నాయత్వమునకు దీర్ఘము లేదు. సుబ్బాసెట్టి యిత్యాదు లుండవు. అకారేతరములకు దీర్ఘము వచ్చుట సూత్రకర్తయభిప్రాయమును గా దని యిచ్చటిలక్ష్యములే స్పష్టము చేయుచున్నవి. ఇంక నీ 2,3సూత్రములు రెండింటను బహుళపదమును గలదు. కాఁగా నంత్యాక్షరంబున కనుటకంటెఁ దుదియత్తున కనుట యుచితము.

అంతట ననుటచే సాంస్కృతికాదులు మూట నని సూత్రకర్తయే యర్థము చేసెను. బాలవ్యాకరణమే సాంస్కృతికాచ్ఛికమిశ్రము లని సమాసములను ముప్విధములుగాఁ బేర్కొన్నది. కావునఁ దదనుగుణముగా సాంస్కృతికాచ్ఛికమిశ్ర సమాసములు మూఁడింట నీకార్య మగు నని గ్రహింపఁదగు. రామాశాస్త్రి, అనునది సాంస్కృతికసమాసము. కాని ఈసమాసము లెట్లు?

సర్వ. ‘కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంతధాతుజవిశేషణపూర్వపదం బయి యుండు’ ననులక్షణముచే రాముఁడు మున్నగు ‘డుమువులు’ పూర్వపదము లగుటకే వీలు లేదు. ప్రౌఢ.6 సూత్రమునుబట్టి విభక్తిలోపము నందినరూపములతోనే సిద్ధ సమాసములవిధముగనే యిచ్చటిసమాసము లేర్పడు (169) నన్నది.

కాని సూత్రకర్త వీనికిఁ గర్మధారయసమాసము పూర్వసిద్ధ మయినట్లుగా సూత్రరచనము చేయుట సరి గాదు. 'బిరుదాద్యుత్తరపదం బగునపుడు' అనుటకు ముందు వీనికి సమాసమును విధించుట యవసరము. సర్వ. ప్రౌఢ. 6.చే విభక్తి లోపమందినరూపములలోనే సిద్ధసమాసములవలె సమాసము లేర్పడు ననుట సరి కాదు.

'కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్ల యగు' నను ప్రౌఢ. 6 సూత్రము మిశ్రసమాసమే సిద్ధసమాసమువలె నుండు నని చెప్పుచున్నది. అట సూత్రకర్త కృష్ణరాయఁడు, రామరావు అనురీతిగా మిశ్రసమాసములనే యుదాహరించెను. ప్రకరణము ననుసరించి సర్వ. రామశాస్త్రి యనుదానిం గూర్చియే పేర్కొన్న దనవలసియున్నది. అట్లు గాక రామానాయఁ డనురీతివానిం గూర్చియే పేర్కొనఁ దలఁచిన నట నట్టిలక్ష్యములనే చూపి వివరింపవలసియున్నది.

రామాశాస్త్రి యనుచో రెండును సంస్కృతీయములే యవుటంజేసి దీని మిశ్రసమాస మనుటకు వీలు లేదు. మఱి రామశాస్త్రి యనుసమాస మెట్లు? అనఁ గా సాంస్కృతికసమాసములందును నీకార్యము గల దనుటకు సూత్రకర్త యిది చూపెను. సాంస్కృతికసమాసము సిద్ధము, సాధ్యము నని రెండుతీరులుగా నున్నది గదా. అట్టియపు డిద్దాని రాముఁడు+శాస్త్రి యనురీతిగా సాధ్యసాంస్కృతికసమాసము గానే సమన్వయింపవలసినయవసరము లేదు. రామశాస్త్రి యనునది సిద్ధసాంస్కృతిక సమాసము. ఈసమాసము సంస్కృతవ్యాకరణముచే సంస్కృతముననే సిద్ధ మయినది. రామశాస్త్రి యనునది తెలుఁగునఁ బ్రాతిపదికముగా నిల్చిన దని గ్రహింపఁదగును. రామశాస్త్రి యను సిద్ధకర్మధారయసమాసములోఁ బూర్వపదముతుదియత్తున కీసూత్రముచేత దీర్ఘ మై, రామాశాస్త్రి యవును. కాఁగా రామశాస్త్రి యనురీతి సమాసము తెలుఁగున నె ట్లనుప్రశ్నకు నవకాశము లేదు. రామశాస్త్రి మున్నగుసిద్ధ సమాసములలో (152) ననుటలో ఘం. ఇది సిద్ధసమాసముగనే తలఁచిన దనవచ్చు. 'రామరావు, రామశాస్త్రి మున్నగునవి సిద్ధసమాసములు కాన వానిప్రక్రియ యీవ్యాకరణమున శాసింపనక్కఱ లే (256) దని తత్త్వ. పేర్కొన్నది. ఇందు రామరావు అనున దచ్చుపొరపాటు కావచ్చు. అది మిశ్ర మగుటచే (రామ సంస్కృతము, రావు ఆచ్ఛికము) సిద్ధసమాసము కాదు. రామరాజు అని యుండనోపు. సుబ్బ+డుజ్, శాస్త్రి+సు అని చూపిన యీవ్యాఖ్య రామ+సు, శాస్త్రి+సు అని చూపుటలో నిది

సిద్ధసమాస మని భావించుట స్పష్టము. కాని ఘం. దీనికిఁ జూపినప్రక్రియాపద్ధతి సమంజసముగాఁ గానరాదు.

రామ+సు, శాస్త్రి+సు అలౌకికసిద్ధసమాసవిగ్రహము. 'సుపో ధాతు ప్రాతిపదికయోః' అనుదానిచే విభక్తులు లోపింపఁగా, రామశాస్త్రి అని యవును. అపు డీప్రౌఢ. 2. సూ.చే దీర్ఘ మై, రామాశాస్త్రిన్. బాల. తత్స. 22.చే రామాశాస్త్రీ.. పిదప రామశాస్త్రి యని యగు నని ఘం. ప్రక్రియ. ఇవి సిద్ధసమాసములు గాఁ గా నవ్వానిసామాసికప్రక్రియను దెలుఁగునఁ జూపఁబూనుట యనవసరము. బాల. లో రాజాజ్ఞా మున్నగు సిద్ధసమాసములయెడ నీవ్యాఖ్య యిట్టిప్రక్రియ చెప్పలేదు. రామశాస్త్రి యన్నచో నవసర మేమి? సంస్కృతమున నిది యె ట్లేర్పడినను రామశాస్త్రి యన్నది కర్మధారయసమాసముగ నున్నది. అదే తెలుఁగునఁ బ్రాతిపదికగా నిల్చి రామశాస్త్రి యని యైనది. ఆసమాసమున నీసూత్రముచే దీర్ఘము రాఁగా, రామాశాస్త్రి యని యైన దని చూపుట యుచిత మగుప్రక్రియ. ఘం. సంస్కృతవ్యాకరణకార్యముల నడుమఁ దెలుఁగుదీర్ఘము చేసి యాపిదప దానిప్రాతిపదికను గూర్చి పేర్కొనుట సరి కాదు. రాజాజ్ఞా తటాకోదకము ఇత్యాదిసమాసములలో సమాసానంతరసంధి కార్యములును దెలుఁగున సంస్కృతలక్షణములచేఁ జూపవలసినదే కదా. కాఁగా స్పష్టతకయి రామశాస్త్రి యనురూపము సంస్కృతమున నె ట్లయినదో వివరించుట బాగుగనే యుండును. కాని ప్రస్తుతసూత్రముచే దీర్ఘము వచ్చి, యాపిదప రామాశాస్త్రీ యనునది ప్రాతిపదికగా నిల్చె ననుట సరి కాదు. రామశాస్త్రి యనుతత్సమ రూపములో సిద్ధసాంస్కృతికసమాసమున నీసూత్రముచే దీర్ఘ మయిన దనుట యుక్తము.

కావున సంస్కృతప్రక్రియలోఁ దెలుఁగుప్రక్రియకుఁ బ్రసక్తి యిట గ్రాహ్యము. ఈవిషయము 'ఎల్లచో' అనుదానివివరణమువలన స్పష్ట (ఘం. 149) మనుట సరి కాదు. 'ఎల్లచో' ననుట పొరపాటు. సూత్రమునం దున్నది 'యంతట' యనునది కదా. కాఁగా నీరీతి వన్నియును సిద్ధసమాసములుగనే సమన్వయింపఁదగును. అట్టియెడల సాధ్యసాంస్కృతికము లిట నుండనేర వని గ్రహింపవచ్చును. అనఁగా సాంస్కృతిక మనఁగా సిద్ధసాంస్కృతికమునే యిట గ్రహింపవలెను. సాధ్య సాంస్కృతికమును గ్రహించుట లేదు.

కాఁగా రామశాస్త్రి యనురీతిగా నున్నసిద్ధసమాసములలో సమాస మె ట్లని

యిటఁ బ్రశ్న లేదు. కాని సుబ్బాశాస్త్రి, రామానాయఁడు మన్నగుమిశ్రసమాసముల యెడను దెలుఁగునఁ జేయవలసినసమాసము లగుటచే సమాసవిధాన మవసర మైయున్నది. సర్వ. సమాసము కుదురకపోవుటను గూర్చి చేసినవివరణ మిట సరిపడును. ఇట్టిచోట్లకే యీవివరణమును బరిమితము చేసిన బాగుండెడిది.

ఘం. సుబ్బ+డుజ్, శాస్త్రి+డుజ్. బా.సమా. 25చే సుబ్బశాస్త్రి బా.సమా. 25చే సుబ్బశాస్త్రి యనురీతిగా రామానాయఁడు ఇత్యాదులందు 'సమాసవిభక్తికి' నను సూత్రముచే విభక్తిలోపమును వివరించినది. సమాస మయినపిదపఁ గదా విభక్తి లోప మవునది. సమాస మె ట్లయినదో చెప్పక (అందున నిట డుమంతము పూర్వ పద మగుట విరుద్ధము కావున) సమాస మైనపిదప జరుగుకార్యములను బేర్కొనుట యెట్లు గుదురును?

సర్వ. 'విభక్తిలోపము నందినరూపముతోడనే సిద్ధసమాసములవిధముగనే యిచ్చుట సమాసము లేర్పడు' నన్నది. ఇది స్పష్టము గాకున్నది. విభక్తిలోప మందిన పిదపనే సమాసము చేయవలెనా? సిద్ధసమాసమువిధముగానే యనఁగా సిద్ధ సమాసములం దిట్లె యగునా? విభక్తి లోపించినపిదప సమాస మగుట యన్నది సంస్కృతాంధ్రములు రెండింటను విరుద్ధమే. విభక్తి లోపించినఁ గాని సమాసము గా దనుచో నసలు సమాసము చేయనిదే విభక్తిలోపము లేదే. అది యెట్లు? సంస్కృతమం దైనను రాజపుత్రః అనుచో రాజన్+జస్ + పుత్ర+సు అనుస్థలమున సమాసత్వమునుబట్టి 'కృత్తద్ధితసమాసా శ్చ' యని ప్రాతిపదికత్వము సిద్ధింపఁగా 'సుపో ధాతుప్రాతిపదికయోః' అనుసూత్రముచేఁ బ్రాతిపదికావయవము లగు సుప్పులు లోపించుచున్నవి. కాఁగా సిద్ధసమాసము లైనచో విభక్తి లోపించిన పిదప సమాసముగా నేర్పడు ననుట సరి కాదు.

కాఁగా నీకర్మధారయములోఁ గొన్నియెడలఁ బూర్వపదము డుమంత మగుటను 'ప్రౌఢ. 6.సూత్ర మెంతమాత్రమును సాధింపఁజాలదు. ఆసూత్రమును గూర్చి పరామర్శింతము.

**6. కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్ల యగు.**

ఈకర్మధారయము మిశ్రము సిద్ధసమాసమువలె నగును. అనఁగా బిరుదాద్యుత్తరపదక మైనకర్మధారయసమాసములో మిశ్రసమాసము మాత్రము

సిద్ధసమాసమువలె నుండు నని తాత్పర్యము. కాఁగా నింతకు ముందరిసూత్రమువలె నీయదియు నీకర్మధారయమందలివిశేషకార్యమును విధించునదే కాని సమాసమును గూర్చి పేర్కొనునది కా దని స్పష్ట మగుచున్నది.

పోనీ. సర్వ. పేర్కొన్నట్లుగా నీసూత్రముచే విభక్తిలోప మందినపిదపనే యవి సమాసము నందునా? ఇట విభక్తిలోపము పూర్వపదమునందా, రెండింటనా? ఈవ్యాఖ్యమతము ననుసరించి పూర్వపదమందలివిభక్తియే లోపింపవలె నని గ్రహింతము. అ ట్లయినను బ్రస్తుతసూత్రము మిశ్రంబునకుఁ గదా చెప్పినది. ఆచ్ఛికసమాసములయందును నిటఁ బూర్వపదము దుజంత మగుట కలదు. కావున (నసంగత మైనను) సర్వ. సమన్వయము నాశ్రయించినను మిశ్రసమాసములు సిద్ధింపఁగలవు. కాని యాచ్ఛికసమాసములకు గతి లేదు.

తత్త్వ. 'అనాపామాదులును రాయాదులును అన్నిటికిని ఉత్తరపదములుగా నుండవచ్చును. అందుచేతనే 'కర్మధారయం బియ్యది' అనుపదములకు బిరుదాద్యుత్తర పద స్త్రీపుంసంజ్ఞావాచకపూర్వపద మని యర్థము చెప్పవలయును. సమాసవిధానము గూడ నిట్టిశబ్దములకే యని భావింపవలయు(250) నన్నది. ద్వ్యక్షరాదంతములకే యని చెప్పరా దనుటకే యీవివరణము ప్రధానముగా నుద్దేశింపఁబడినది. కాని యిటనే వీనిసమాసము జ్ఞాపిత మవు నన్నచో మిశ్రసమాసములే జ్ఞాపితము లవును గాని యాచ్ఛికసమాసము లెట్లు? బిరుదాద్యుత్తరపదస్త్రీపుంసంజ్ఞావచనపూర్వపద కర్మధారయము మిశ్రంబు సిద్ధసమాసం బట్ల యగు.

కాఁగా నీసూత్రమునుబట్టి సమాసము చేయుటకు నవకాశ మిట్లు లే దనక తప్పదు. ఈవిధానము చేయుటలో సూత్రకర్త తనయుద్దేశ్యము నిట్లు చెప్పెను. 'ఇ ట్లనుటచేఁ బూర్వపదంబు లుప్తవిభక్తికం బయి యవికృతాంతం బగు నని యెఱుంగ వలయును.' అనఁగా సమాస మనుటచేతనే యెట్లును విభక్తి లోపించును. కావునఁ బ్రాతిపదిక మవికృతాంత మవుటను నిరూపించుటకే యీవిధానము చేయఁబడె ననవలెను. రాముఁడు+నాయఁడు అనుచో విభక్తి లోపించుటతోపాటు రాము అనుచోఁ బ్రాతిపదికమునత్వమున కుత్వరూప మయినవికార ముండ దనియు, రామశాస్త్రి యిత్యాదిసిద్ధసమాసములందువలె రామనాయఁడు అనురీతిగా (మిశ్ర సమాసమునందు) నిల్చియుండు నన్నమాట. సూత్రమున 'మిశ్రంబున' ననుట యిందుకే యనవచ్చును. సుబ్బఁడు+సెట్టి యనుచో ఆచ్ఛికసమాసమున విభక్తియే

కాని తన్నిమిత్తక మగువికారము లేదు కదా. కావున నవికృతాంత మవు నని యాచ్ఛికములయెడఁ జెప్ప నవసరము లే దనునభిప్రాయముతోనే సూత్రకర్త మిశ్రములకు మాత్రమే చెప్పె నన్నమాట. విభక్తిలోప మెట్లును సమాస మగుటచేతనే సిద్ధించును. దీనివలన నీసమాసములలోఁ బూర్వపదము మగాదులలోఁ జేరినదే యైయుండు నని గ్రహింపవలెను. సాంస్కృతికసమాసములో సిద్ధసమాసమే కలదు కాని, సాధ్యము లే దని తలంచియున్నారము. రాముఁడు+శాస్త్రి – రామశాస్త్రి యని చేయ నక్కఱ లేదు. రామశాస్త్రి యని సిద్ధసమాసము లన్నవి సంస్కృతము నుండియే గ్రహింపవచ్చును. కావున నాచ్ఛికసమాసములకువలెనె సాధ్యసాంస్కృతిక సమాసములు నిట గ్రహింపఁబడలేదు. సాధ్యసాంస్కృతికసమాసములు తెలుఁ గున నుండ వని తాత్పర్యము కావలె. అ ట్లనిపించు రామశాస్త్రి, వంటివి సంస్కృతముననే యేర్పడినసిద్ధసమాసములు.

కాఁగా సూత్రము సమాస మగుటను గూర్చి పేర్కొనుట లే దని గుర్తింపవలెను.

సూత్రకర్త పేర్కొన్న పైవివరణవాక్యమును సర్వ. యిట్లు వివరించినది. 'రామ అనుసంస్కృతప్రాతిపదికపై రావు అనునాచ్ఛికబిరుదము పర మైనప్పుడు సమాస మై, రామరావు అని యగును. కృష్ణ యనుసంస్కృతప్రాతిపదికపై రాయఁడు అను నాచ్ఛికబిరుదము పర మైనపుడు కృష్ణరాయఁడు అనుసమాస మేర్పడును'. (174)

పర మైనపుడు సమాస మవు ననుట విశేషము. ఈసర్వ. ననుసరించి ప్రాతిపదికము బిరుదవాచకముతో సమసించు నని చెప్పవలెను. తత్త్వ. 'కృష్ణ+డు+ రాయ+డు. ఇట సామాసికవిభక్తిలోపమే కాక కృష్ణశబ్దమునకారమునకు ఉకారాదేశము కూడ రాక, సంస్కృతప్రాతిపదికమే యట్లే యుండి సమసించు నని భావము. కృష్ణ+రాయ. కృష్ణరాయ అని సమసించి' (256) అన్నది. ఇది యింకను నసంగతముగా నున్నది. కృష్ణ+డు అని చూపుట సరి కాదు. 'డుజ్' అని చూపుట యుక్తము. (అవికృతాంత మగు ననుటనుబట్టి యుత్వము చేయలే దేమో. కాని యిట నుత్వము చేయవలసియేయున్నది.) విభక్తిలోపమే కాక అకారమునకు ఉకారమును రా దనుటలో నచ్చుపొరపాటు గల దేమో. కాని దీనివలన అకారమున కుకారము రానట్లె విభక్తిలోపమే కాక అకారమున కుకారము గూడ రా దని యర్థ మగును. విభక్తిలోపము వచ్చును. అకారమున కుకారము రా దనియే వ్యాఖ్య యభిప్రాయము సంస్కృతప్రాతిపదికయే సమసించు ననుటలో స్పష్ట మగుచున్నది.

మొత్తముమీఁద నీరెండువ్యాఖ్యలును బ్రాతిపదికయే మీఁదిబిరుదపదముతో సమసించు నని సిద్ధాంతము చేసినవి.

ఇది సూత్రకృదభిప్రాయమునకే విరుద్ధము. సూత్రకర్త 'లుప్తవిభక్తికం బయి' యనుచున్నాఁడు. అనఁగా విభక్తి లోపింపవలెను గదా. ప్రాతిపదికయే సమసించు నపుడు విభక్తిలోపముప్రసంగ మేల? పైఁగా సూత్రమున సిద్ధసమాసములట్ల యను చున్నాఁడు. సిద్ధసమాసములలో నిట్లు ప్రాతిపదికమే సమసించుచున్నదా? సమసించినపిదపఁ బ్రతిపదికావయవ మగువిభక్తి లోపించుటవలనఁ బ్రాతిపదికమే నిలుచుచున్నది. కాని ప్రాతిపదికమే సమసించుట లేదు.

కావునఁ బ్రాతిపదికమే సమసించు ననుట సంప్రదాయమునకే కాక యీలక్షణ మునకును విరుద్ధము.

ఇందు దోషము సూత్రకర్త వివరణమునందే యున్న దని తోఁచుచున్నది. 'లుప్తవిభక్తికం బయి' యనుటచే నిట మొదటఁ బదమును విభక్త్యంతముగనే గుర్తింపవలె. ఆవిభక్తికి సమాసమున లోపము వచ్చును. రాముఁడు+రావు అని యుండఁగా డుజ్విభక్తి లోపించును. రాము+రావు. పిదపఁ బ్రాతిపదిక మవికృతాంత మవు నన్నచో నుత్వము రా దనవలెనా? అయిన నుత్త్వమునకు ముందుగనే డుజు చేసి, యది లోపించు ననవలెను. ముందుగా నుత్త్వము చేసి, పిదప డుజు చేయుట యిక్కడిప్రక్రియ. సూరి యనుసరించినక్రమ మిదే. (బాల.తత్స.21) అట్టియెడల డుజును మాత్రమే చేసి యుత్వమును జేయకుండు టెట్లు?

ఘం. 'కృష్ణ+డుజ్+రాయ+డుజ్' అనుచో బాల.సమా.25చే విభక్తి లోపింపఁ గా తత్సమ. 21చే నుత్త్వము రావలసియుండఁగా నవికృతాంత మవు ననుప్రస్తుత విధానముచే నుత్వము రాదు. కావున కృష్ణరాయఁడు అని యగు (152) నని తలఁ చినది. డుజు మాత్రమే చేసి యుత్వము చేయకుండ సామాసికవిభక్తిలోపానంతర ముత్వము నాశంకించుట సమంజసము కానేర దని పైవివరణము ననుసరించి స్పష్టము.

ఇట్టిదానికయి 'సిద్ధసమాసములట్ల' యనుటయు యుక్తముగాఁ దోఁపదు. రామశాస్త్రి మున్నగుసమాసములలోఁ బ్రాతిపదికమునం దుత్వము లేకుండుటను మాత్ర మనుసరించి యిట్లు చెప్పె ననవచ్చు. సంస్కృతమున నలౌకికవిగ్రహము

చూపుటయు, సుప్పులకు లోపము చేయుటయు, జరుగుచున్నవి. తెలుఁగున నట్టి భేదము లేదు గదా.

లేక సిద్ధసమాసమునందువలెనె రామ+సు+నాయ+సు అనురీతిగా సంస్కృత విభక్తులే లోపించు నని సూత్రకర్త యభిప్రాయపడెనా? అ ట్లయిన నుత్వమును గూర్చినయిబ్బంది లేదు.

రాజ్ఞః పురుషః అనుచో విభక్తిలోపానంతరము 'నలోపః ప్రాతిపదికాన్తస్య' యని ప్రాతిపదికాంతమున నున్ననకారము లోపించుచున్నది. ఇటఁ బ్రాతిపదిక మవికృతాంతము గానేరదు గదా. అదే విధముగా రామనాయఁడు అనుచోఁ గూడ 'రామ' అనుప్రాతిపదిక కుత్వము చేయవలసివచ్చు నని తోఁచుచున్నది.

రామానాయఁ డనుచో రామశబ్దముపై విభక్తి లోపించినను నిటఁ బ్రత్యయలక్షణ న్యాయముచేతఁ బదత్వ ముండును. చెందొవ యిత్యాదులలోనిద్రుతాంతతచే ద్రుతాంతము లయినపదము ద్రుతప్రకృతిక మై ద్రుతకార్యము లవుట యిట్టిదే కదా. అయిన నిట రామశబ్దమునందుఁ బ్రాతిపదికత్వమును లేకపోలేదు. 'ఆకడాదే రా సంజ్ఞా' (1-4-1) యని పాణినీయము పరమును ననవకాశము నైనసంజ్ఞ యొక్కటి వచ్చు నని చెప్పుచున్నది. 'సుప్తిఙంతం పద' మనుపదసంజ్ఞావిధాయక సూత్ర (1-4-14) మాయధికారములో నున్నను, అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్ (1-2-45), కృత్తద్ధితసమాసా శ్చ (1-2-46) యనుప్రాతిపదికసంజ్ఞను జెప్పులక్షణము లీయధికారమునకుఁ (1-4-1) బూర్వమునందే యుండుటచే నిట నీపద, ప్రాతిపదికసంజ్ఞలు రెండును గలుగును. రాజ్ఞః పురుషః అనుచో నలోప మిట్ల యయినది. అదే తీరుగా రామనాయఁ డనునీసమాసమునందును రామశబ్దము ప్రాతిపదిక మవును గదా. ఉత్త్వము రా నగును. కావున నుత్వనిషేధ మవసరమే యనవలెను. రాముఁడు+రాయఁడు అనుచో నొకసారియు రామరాయఁ డు అనుచో నిం కొకసారియు రెండుపర్యాయము లుత్వనిషేధము నీయవికృతాంతం బనువివరణముచే సాధింపవలసియుండును.

దీనికంటె రాముఁడు+రాయఁడు అని యుండఁగా లుప్తవిభక్తికం బయ్యు ననఁ గా డుజ్విభక్తి లోపించి, యవికృతాంత మగును. ప్రాతిపదికము నంతము వికృతిరహిత మగు ననఁగా నీసూత్రముచేతనే యందున్నయుత్వవికారము పోయి, యంతకు ముందువలె నత్వ ముండు నని చెప్పుట యుక్తము. ఉత్వము పోవు ననఁగా

లోపింపఁజేసినచో 'రామ్' అని యగును. అదియు వికృతాంతమే యవును గదా. కావున నవికృతాంత మనుటచే నుత్వము పోయి, యత్వము నిలుచు నని యర్థము చేయుట కొంతవఱకు యుక్త మనవచ్చును.

ఇంతటివివాదాస్పద మగుప్రక్రియ యేల? ఈవిధానమునకుఁ బ్రయోజనము లుప్తవిభక్తిక మగుట కాదు. అది సమాససాధారణముగనే సిద్ధించుచున్నది. ఇంక నవికృతాంత మగుట యన్న దొక్కవిశేషము. దానికిఁ బ్రయోజన మత్వము నిల్చుటే యని నిర్ణయింపవచ్చును. అట్టిదానికై సిద్ధసమాసతుల్యతావిధాన మేల?

ఇట వి.వి. చూపినప్రక్రియయే యెంతయు సముచితముగా నున్న దని నిర్ణయింపఁదగును.

'ద్వ్యక్షరాదిచతుర్వర్ణపర్యన్తజననామసు లోప స్స్యా ड्वादिवर्णानां శబ్దే రాయాదికే పరే క్వచి దత్వం క్వచి చ్చాత్వం' అనురీతిగా వి.వి. పేర్కొన్నది.

రాముఁడు+రాయఁడు అనుచో 'లోప స్స్యా డ్వాదివర్ణానా' మనులక్షణముచే డుజ్విభక్తి లోపించి, రాము+రాయ. అని కాఁగా 'క్వచి దత్వ' మనుదళముచే నత్వ మయిన, రామరాయఁడు. క్వచి చ్చాత్వ మనుదానిచే నాకార మయిన, రామానాయఁడు అని యగును. కాఁగా ఉత్వము పోయి యత్వము నిలుచుటకు సిద్ధసమాసతుల్యతావిధానముకంటె నుత్వమున కత్వము విధించుకొనుటలో లాఘవమే కాక స్పష్టతయును గలుగును. కావున నమ్మార్గమే యుచితము. అందుకే సూరిసైతము నత్వమును విధించెను. (చూ. ఇతరాధారములు)

కాఁగా నీసూత్ర మిట్టిసమాసములలోఁ బ్రాతిపదిక మవికృతాంత మవుటకే చెప్పెను. అట్లు చెప్పుట సరి కాదు. ఇంక (నుత్వమునకు) నత్వము విధించుటయే యుక్త మని స్పష్టము.

ఈసూత్రమునందలి 'ఇయ్యది' యనుదానిచేత బిరుదాద్యుత్తరపదం బయిన కర్మధారయ మని మాత్రమే గ్రహింపవలె ననియు, మోహనరావు, ప్రభాకరరెడ్డి, మొద లయినస్థలములనుబట్టి 'ద్వ్యక్షరాదంతస్త్రీపుంసంజ్ఞావాచకం బగుపూర్వపదము' అనుదాని నంతను గ్రహింపరా దనియు (174) పేర్కొన్నది. దీని కాధారములు లక్ష్యములం దెచ్చటను గానరాదు. ఇంతవఱకును సూత్రకర్త చెప్పినకార్యము లెల్ల ద్వ్యక్షరాదంతశబ్దములకే యనుటలో ననుమానము లేదు. ఈసూత్రస్థలమున నైనను

భిన్నముగా ద్వ్యధికాక్షరములవానిని గ్రహించునుద్దేశ్యమే యున్న నట్టిదాని నొక్కటి నేని లక్ష్యములలోఁ జూపునే కదా. ఇట్టివి సూత్రకర్తదృష్టియందు లేకపోవచ్చును.

ఇటఁ దత్త్వ. 2,3 సూత్రములచే విధింపఁబడినయత్వేత్వములు మాత్రము ద్వ్యక్షరాదంతములకే వచ్చును గాని, అనాపామాదులును, రాయాదులును అన్నిటికిని ఉత్తరపదములుగా నుండవచ్చును.(256) కావున ద్వ్యక్షరాదంత నియమ మిటఁ బూర్వపదమునకు లే దని పేర్కొన్నది. 2,3 సూత్రము లని చెప్పి అనాపామాయాదుల ప్రసంగము చేయుటచే నాల్గవసూత్రముచే విధింపఁబడినయనాపామాయాగమము లిట నగువానింగూర్చియే తత్త్వ. పేర్కొన్న దని నిశ్చయింపఁదగును. అట్టియెడల నవ్వాని నుత్తరపదములుగాఁ బేర్కొనుట యసంగతము. అన, అప, అమ, అయ, యనునవి యాగమములుగాఁ జెప్పఁబడినవి. అవి యుత్తరపదము లగుట యేమి? ఆగమము పద మగునా? అట సూత్రమున 'ఇచ్చో' ననఁగా ద్వ్యక్షరాదంతస్త్రీపుం సంజ్ఞావాచకపూర్వపద, బిరుదాద్యుత్తరపద కర్మధారయమునందలిపూర్వపదంబు నకారంబునకు అన, అప, అమ, అయ యనునాగమము లంత్యావయవములుగా వచ్చు నని భావ' (253) మని యీవ్యాఖ్యయే పేర్కొనుట గమనింపఁదగును. కాఁగా ద్వ్యక్షరాదంతముల కనునియమము 2,3సూత్రములకే కాక నాల్గవసూత్రము నకును దదనుసారముగా నైదవసూత్రమునకును ననఁగా నింతకు ముందుసూత్రము వఱకు నన్వయింపఁజేయవలసినదే. అట్టియెడల నీయొక్కసూత్రమునందే తదితరములు సయితము గ్రహించుట విశేషము.

శంకరయ్య, సంజీవయ్య యని యుదాహరించుటచే 'అనాపామాయాదు' లనునవి నాల్గవసూత్రముచే విధింపఁబడినయాగమములు గాకపోవచ్చును. కాని పైరీతినర్థము గల్గుట కవకాశము లేకపోలే దని మాత్రము గ్రహింపక తప్పదు.

కందాళప్ప, కందాళయప్ప యనురీతిప్రయోగములు గలవు. వానిని సంగ్రహించు టెట్లు? అనఁగా నసలు వీనికి సమాస మెట్లు?

తత్త్వ. ప్రస్తుతసమాససూత్రము 6 చేతనే సమాసము ఇట్టివానికి జ్ఞాపిత మవుచున్న (256) దన్నది. ఈసూత్రకర్త సైతము డుమంతములకుఁ బూర్వపదత్వము నిటఁ బేర్కొనలేదు. కాన జ్ఞాపితము చేసికొనక తప్పదు. కాని యందులకై యీసూత్రము వఱకు నాగవలసినయవసరము గానరాదు. రెండవసూత్రమునొద్దనే యాపని చేయఁ దగును.

'కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయ్యె నేని ద్వ్యక్షరాదంతస్త్రీపుంసంజ్ఞా వాచకం బగుపూర్వపదంబు' అనుటయు రామానాయఁడు, సుబ్బానాయఁడు, అనురీతి నుదాహరించుటయు ననుసరించి, యీయర్థము జ్ఞాపకము చేసికొనవచ్చును. పుంసంజ్ఞావాచకములు డుమంతము లయియే కానవచ్చుచున్నవి. వాని కీసూత్రము దీర్ఘము చెప్పుచున్నది. కర్మధారయమునఁ బూర్వపదము డుమంత మవుటకు వీలు లేమింజేసి యిటఁ గర్మధారయసమాసమే లేమింజేసి యీదీర్ఘవిధానము వ్యర్థ మయినది. అది కొన్నియెడలఁ గర్మధారయమునఁ బూర్వపదము డుమంత మగుట కల దనునర్థమును జ్ఞాపకము చేయును. జ్ఞాపకసిద్ధ మైనయాయర్థమువలన (డుమంత మని సామాన్యముగాఁ దలంచుటవలనఁ దత్సమాచ్ఛికభేదము లేక రెండును నగును) రాముఁడు+నాయఁడు, సుబ్బఁడు+శాస్త్రి యనువానికి సమాసము సిద్ధించును. అట్టిసమాసములలోఁ బూర్వపదము ద్వ్యక్షరాదంత మయినచోఁ జివరి యత్తునకు దీర్ఘము వచ్చును. కావున నపు డీవిధానము సార్థక మగును. దీనివలన నారాయణరావు, శంకరయ్య, ప్రభాకరరెడ్డి యనురీతిసమాసములు సిద్ధించుట ప్రయోజనము.

తత్త్వ. యీరెండవసూత్రమే డుమంతములపూర్వపదత్వమునకు సాధక మగు నని తలంచియు లేదా 6 సూత్రము కాఁగల దన్నది. ఈసూత్రముచేతనే సిద్ధింపఁ జేసికొనవచ్చును. కాని తత్త్వ. ఈరెండవసూత్రముచే వీనిసమాసమును సాధించుటలో బహుళపద మిందుకు సాధక మనియుఁ దలంపవలయు (252) ననుట యనవసరము. సమాస మని చెప్పి, కార్యము చెప్పుచుండఁగా నాసమాసమునే బహుళపదము సాధించు ననుటకంటె జ్ఞాపకసిద్ధము చేయుట యుచితము. ఈయర్థమును జ్ఞాపకము చేయుట కాఅవసూత్రమునం దెంత యాధారము గలదో రెండవసూత్రమునందు నంతే కలదు.

కావున నీసూత్రముచేతనే యీసమాసములు జ్ఞాపకసిద్ధము లవుచున్న వని తలంచుట యొక్కటే మార్గము.

అత్త్వమును విధింపఁదగు ననుపక్షమున నిట్లు చెప్పరాదు. అట్టియెడల నారాయణరావు ఇత్యాదులలో నత్వము వచ్చుటకు వీలు లేదు దా. కావున సూరివలె జననామంబుల కని సామాన్యముగాఁ జెప్పుకొనవలెను. (చూ. ఇతరాధారములు)

బిరుదాదులనుచోటియాదిశబ్దముచే నార్యాద్యర్థములు గ్రహించి, రామయ్య, సీతమ్మ ప్రభృతులను సాధించుకొనవచ్చు.

సూత్రమునందలిబహుళపదమునకుఁ బ్రయోజనమును సూత్రకర్త వివరించెను. రామనాయఁడు ప్రభృతులలో నీదీర్ఘము వైకల్పికము. దీనిం గూర్చి సర్వ. 'రామాశాస్త్రి అనుచోట సయితము రామశాస్త్రి, అనురీతిరూపము గలదు. కావున రామశాస్త్రి ప్రభృతులందు వికల్ప మనుట లెస్స (168) యన్నది. అది యుక్తము. రామాశాస్త్రి యనుదానిని మొట్టమొదటగా సూత్రకర్త యుదాహరించియుండుటచే నద్దానినే మొదల గ్రహించి యిత్యాదుల వికల్ప మనుట యుక్తము. లేనిచో రామాశాస్త్రి యనురీతిగా నట దీర్ఘము నిత్య మనునభిప్రాయము గలుగును.

బహుళగ్రహణముచేతనే కృష్ణశాస్త్రి ఇత్యాదులందు దీర్ఘము లే దనెను వ్యాకర్త. దీనిని విమర్శించుచు సర్వ. కృష్ణశాస్త్రి యనుచో దీర్ఘము లే దని నిశ్చయించుట కాధారము లే దనియు, సర్వము సాంస్కృతిక మగుటచే నట్లు నిర్ణయించె ననుకొనుటకు వీలు లేకుండ రామాశాస్త్రి యనుచో దీర్ఘము నుదాహరించె ననియుఁ బేర్కొన్నది. (168) ఇది సరి కాదు. కృష్ణశాస్త్రి యనుచో దీర్ఘము లే దనుటకు నది సాంస్కృతిక మగుట కారణ మనుట యసంగతము. అంతట అని సూత్రమునఁ జెప్పి అంతట ననఁగా సాంస్కృతికాదులు మూఁట నని వివరించుటచే సాంస్కృతిక సమాసమునందును దీర్ఘమును విధించుచుండఁగా సాంస్కృతికము గావున లే దని సూత్రకర్త భావించె ననుట యసమంజసము. సాంస్కృతికసమాసమునందును రావలయును గనుకనే కృష్ణశాస్త్రి యనుచో దీర్ఘము ప్రాప్తించుచుండఁగాఁ గవిప్రయోగములందు దీర్ఘ మసలు లేకపోవుట ననుసరించి, లే దని చెప్పె నని గ్రహింపవలెను. రామాశాస్త్రి యనుచో దీర్ఘము గలదు గావున సాంస్కృతిక సమాసములం దన్నింట దీర్ఘ ముండ వలయు నని నియమింప వీలు లేదు గదా. ప్రయోగములు లే కున్న లక్షణ మేమి చేయును? లే దని నిశ్చయించుట కాధారము కవిప్రయోగములే. కృష్ణాశాస్త్రి అనునట్టికవిప్రయోగమును జూపిన సూత్రకర్త వివరణము ప్రామాదిక మగును.

రామశర్మ యిత్యాదులందును దీర్ఘము గానరాదు. కృష్ణరాయలు, మున్నగుమిశ్ర సమాసములందును దీర్ఘము గానరాదు. అట్టిదీర్ఘము లేనివానిని గృష్ణశాస్త్రీత్యాదులలో గ్రహింపవలె ననియే సూత్రకర్తయభిప్రాయము. అంతే కాని యాసమాసము

సాంస్కృతికమా, మిశ్రమా, యాచ్ఛికమా యనువివక్ష లేదు. అనఁగా సాంస్కృతిక మగుటచేఁ గృష్ణశాస్త్రి యనుచో దీర్ఘము లే దనియు, సాంస్కృతికసమాసము దేనియందును దీర్ఘము రా దనియు సూత్రకర్త యుద్దేశ్యము కాదు.

కృష్ణశాస్త్రి యనుచో 'సర్వమును సాంస్కృతిక' మను సర్వ.పలుకు సరి కాదు. సర్వమును సాంస్కృతిక మేమి? కొంత సాంస్కృతికమును గొంత యాచ్ఛికము నయిన నది మిశ్ర మగునే కాని సాంస్కృతికము గాదు. ఇంక నేమాత్రమును సాంస్కృతికము కానిచో నాచ్ఛికసమాస మగును.

ఇటఁ గు.పం. 'కృష్ణశాస్త్రీత్యాదులందు దీర్ఘంబు కలుగ దనుచున్నాఁడు. కృష్ణారెడ్డి, కృష్ణాపత్రిక ఇత్యాదివ్యవహారములు గల (103) వన్నది. ఇట్లే సుగమ.(155) కూడ. దీనివలన నీవ్యాఖ్య యిట్టిచోట్లఁ బూర్వపద మైనకృష్ణశబ్దమునకు నెప్పుడును దీర్ఘము రా దని సూత్రకర్త యభిప్రాయ మని తలఁచిన ట్లున్నది. అది సరి కాదు. రామాశాస్త్రి యనుచో దీర్ఘము చూపెను గావునఁ బూర్వపదముగా నున్నచో రామ శబ్దమున కెల్లపుడును దీర్ఘము వచ్చు నని యర్థమా? రామశర్మ యనుచో రామాశర్మ యని దీర్ఘము కలదా? కృష్ణశాస్త్రి మొద లైనవానిలో దీర్ఘము లే దనఁగా, కృష్ణ శబ్దమున కెప్పుడును దీర్ఘము రా దనునర్థ మెట్లు కలుగును?

రామశర్మ, తిక్కశర్మ యిత్యాదు లాదిపదముచే గ్రహింపఁదగు నని వివరణము నర్థము స్పష్టము.

ఈయభిప్రాయమును సుబో. తిరస్కరించినది. 'కృష్ణారెడ్డి అనుచో దీర్ఘము రా దని ప్రౌఢవ్యాకర్త చెప్పలేదు. అత డిచ్చినయుదాహృతులలో రెడ్డి ఉత్తరపదముగా గల వన్నియును దీర్ఘాంతములుగానే యున్న' (183) వన్నది. కాని యీసుబో. పంక్తులలో నొకయపార్థ మేర్పడుచున్నది. సూత్రకర్త యెల్లయెడల దీర్ఘమును జూపెను గావున రెడ్డి యుత్తరపద మయినపు డెల్లెడల దీర్ఘమే రావలె ననఁదగునా? కృష్ణారెడ్డి యనుచోఁ గలదీర్ఘము వెంగళరెడ్డి యనుచో లేదు. రామిరెడ్డి యనుచో నిత్వము విశేషము.

కు.పం. కృష్ణశబ్దము పూర్వపద మైనచో దీర్ఘము రా దనుట యెట్టిదో, సుబో. రెడ్డిశబ్దము ఉత్తరపద మైనపుడు దీర్ఘము రా దనుట కూడ నట్టిదే. పూర్వోత్తరపదములకు సంబంధించి వ్యాకర్త యీవివరణము చేయలే దని గ్రహింపవలెను.

కాఁగా నిది పూర్వపద మైనపుడు లేదా యిది యుత్తరపద మైనపుడు దీర్ఘము నిత్య మని కాని, రా దని కాని, నిర్ణయించుట వ్యాకర్తయభిప్రాయము కాదు. దీర్ఘముయొక్క భావాభావములను కవిప్రయోగముల ననుసరించి, బహుళశబ్దముచే సాధించుకొనఁదగును గాని, పూర్వోత్తరపదములనుబట్టి కా దని గ్రహింపవలెను.

కావున నీవివరణమునం దెట్టియనౌచిత్యమును లేదు. వైకల్పికస్థలములు మాత్రమే రామశాస్త్రీత్యాదులుగాఁ బేర్కొన్న లక్షణ మసందిగ్ధముగా నుండెడిది.

ఇంక సూత్రమునందు సైతము కొన్ని మారుపు లవసరము లని గుర్తించి యున్నారము. 6సూత్రమును దొలఁగించి యీసూత్రమును 'రాయాదులు పరంబుగాఁ గర్మధారయంబునం జననామంబుల కంతట నత్వం బగు' ననురీతిగా సూత్రించినఁ బై 3సూత్రమును గూడఁ దొలఁగింపవచ్చును. ఇట్టియెడ డుమంతపూర్వపదత్వము ప్రత్యేకముగాఁ జెప్పుకొనుటయే లెస్స.

**3. ఇటఁ బూర్వపదంబు నత్వంబున కిత్వంబు బహుళంబుగా నగు.**

ఇట ననఁగాఁ గర్మధారయంబు బిరుదాద్యుత్తరపదం బయి, పూర్వపదము ద్వ్యక్షరాదంతస్త్రీపుంసంజ్ఞావాచక మగునపు డని యర్థము. అట్టిపూర్వపదము తుది యత్తున కిత్వము బహుళముగా వచ్చు నని సూత్రమున కర్థము.

బహుళశబ్దముచేత సుబ్బినాయఁడు (సుబ్బానాయఁడు), ఎల్లిసెట్టి (ఎల్లాసెట్టి), యనుచో వికల్ప మగును. సుబ్బిసెట్టి, రామిసెట్టి యిత్యాదులలో నిత్య మనియు సూత్రకర్త స్పష్టము చేసెను. రామశాస్త్రి, సుబ్బశాస్త్రి యిత్యాదులం దిత్వము లే దని గ్రహింపవచ్చును.

ఈవిధానమును గూర్చి సర్వ. ఇందు దేనిని గాని నిత్య మని గాని యనిత్య మని చెప్పుట కవకాశము కన్పింప దనియు, వ్యవహారమునుబట్టియే గ్రహింపవలె ననియుఁ (170) బేర్కొన్నది. ఆవ్యవహారమునుబట్టియే సూత్రకర్త యిట్లు చెప్పె నని గ్రహింపఁదగును. ఇంతకు ముందు సూత్రస్థలమున సుబ్బానాయఁడు, ఎల్లాసెట్టి, యని చూపె. ఇట సుబ్బనాయఁడు, ఎల్లసెట్టి యని చూపుచున్నాఁడు. కాఁగా నిత్వము వైకల్పిక మనుటలో విరోధము లేదు గదా.

రామిసెట్టి, సుబ్బిసెట్టి యనుచో నత్య మనుట దోషమా? అయిన వ్యవహారము నుండి యైనను సుబ్బాసెట్టి, లేదా సుబ్బసెట్టి, యనురీతిరూపమును నిర్ధారించి

యాపయి నిందలివిరోధమును బేర్కొనవలె. కావున నీలక్షణమునందు నిరాధారము గా దోషము నూహించుట యుక్తము గాదు.

**4. కొన్నియెడల నిచ్చో ననాపామాయాగమంబు లగు.**

**5. పైయాగమంబులు కొన్నియెడల ద్విత్వయుక్తంబు లగు.**

పైస్థలములలోనే కొన్నియెడల అన, అప, అమ, అయ యనునవి యాగమము లుగా వచ్చును. అయ్యవి ద్విత్వయుక్తము లయి, అన్న, అప్ప, అమ్మ, అయ్య యనురీతిగా నవుటయును గల దని యర్థము. తిక్కనసోమయాజి, కృష్ణమ్మపంతులు ఇత్యాదులు లక్ష్యములు.

ఇట సర్వ. 4. ప్రస్తుతలక్ష్యములనుబట్టి చూడగా నన్నయ, కృష్ణయ మున్నగుప్రయోగము కవకాశము లే దని తోచును. బిరుదాద్యుత్తరపదవిరహిత మైనచోటను పైరీతి నుండుట కాక్షేపము లే దన్నసంగతి యందఱకు దెలిసినదే. సూత్రనిర్మాణము సక్రమముగా లే' (171) దన్నది. ఈరీతిరూపముల నీవ్యాకర్త యుదాహరించియే యున్నాఁడు. సంధి. మొదటిసూత్రమునొద్ద వ్యాకర్త చూపిన రామయ్య, సీతమ్మ యనురీతివి నన్నయ, కృష్ణయవంటివే యనుట నిర్వివాదము. మఱి యీసూత్రముచే నారూపములు వారింపఁబడిన వనుట సరి కాదు. రాముఁ డు+అయ్య, తిక్కఁడు+అన్న యనురీతిగా నిట నార్యాద్యర్థకములతో సమాస మవుటచే నేర్పడుట కభ్యంతరము లేదు గదా. తిక్కన, తిక్కనసోమయాజి యనునవి భిన్నములు. తిక్కనసోమయాజి యనుచో సోమయాజి యుత్తరపదము. బిరుదవాచకము. తిక్క+ సోమయాజి యనుచో నడుమ 'అన' అనునది యాగమము. తిక్కన యనుచో 'అన' అనునదే యుత్తరపదము. శ్రేష్ఠతావాచకము. కాఁగా తిక్కనసోమయాజిలో 'అన' ఆగమము. తిక్కనలో 'అన' ఉత్తరపదము. ఆగమ మగుటచే దానికిఁ బ్రత్యేక మైన యర్థము లేదు. అన ఆగమము లేకుండ తిక్కసోమయాజి యని యున్నను (ఇట్టి రూపము కానరాదు) నర్థ మంతే. తిక్కనలో 'అన' శ్రేష్ఠత్వ మనునర్థవిశేషమును దెలుపుచు నర్థవంత మైయున్నది.

ఇక్కడ 'అన' ఆగమముగాఁ జెప్పుటచేత 'అన' పదముతో సమాసము గాకుండుట యెట్లు? దీనిమూలముగా నీసూత్రరచనము సక్రమము గా దనుట సంగతము కాదు.

నన్నపార్య శబ్దమును గూర్చి ఘం. కొన్నివిశేషము లిట్లు పేర్కొన్నది.

'సమాస.2.చేఁ బూర్వపద మదంతము కావలెను. కాన నన్న+అప అని గ్రహింపవలసివచ్చినది. ఇట నన్ని+అప యనుట యుక్తము'(150)

అహోబలుఁడు నన్నపండితుని (కవిశి.653), ఇట్లే సూరన నన్నపండితుని దిక్కసుధీమణి నెఱ్ఱసత్కవిన్' (రాఘ.1.అవ) అని నన్నశబ్దమును జూపియున్నారు. కాఁగాఁ దదనుగుణముగా నన్న+అప యనురీతిగా విభాగించుట కేవలము నిరాధార మనరాదు.

నన్న+అప+ఆర్య. ఇట సవర్ణదీర్ఘసంధి జరిగి, నన్నపార్య ప్రాతిపదిక మగును. (150) తిమ్మమ+అంబ యనుచోఁ దిమ్మమాంబ యని యగుట విరోధించును గావున నిట సవర్ణదీర్ఘసంధియే చేయవలె (326) నని ఘం. పేర్కొన్నది. అత్త్వసంధి చేసిన తిమ్మమాంబ యనురూపము కాదు గదా. అనుకరణమునుబట్టి యిట నన్నపార్యశబ్దమున సవర్ణదీర్ఘసంధి చేయవలె ననుట యెంతమాత్రమును యుక్తియుక్తము గాదు. ఇంక నొకటి చెప్పవచ్చును. 'కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాస మట్ల యగు' ననుటవలన సిద్ధసమాసములం దెట్లు రాజాజ్ఞ, తటాకోదక మిత్యాదిగా సంస్కృతసంధికార్యములు జరుగుచున్నవో యట్లే యిట సిద్ధసమాసముల వంటి మిశ్రసమాసములయందు సయితము సంస్కృతసంధికార్యములే యవు నని సమర్థింపవచ్చు. పూర్వపద మవికృతాంత మవుటను జెప్పెను గాని సూత్రకర్త సంస్కృతసంధికార్యములను గూర్చి పేర్కొనలేదు. అత్వసంధిని జేసినను నిచట నన్నపార్యుఁ డనియే యగును గదా.

ఇంకను నొకయిబ్బంది యున్నది. రామ+అయ్య, సీత+అమ్మ యనురీతిగాఁ బూర్వపదము సంస్కృతసమ మైనస్థలములయందును మిశ్రసమాసత్వము సరిపడును గావున నయ్యవియు సిద్ధసమాస మట్లనే యవును. కాఁబట్టి యట సయితము సంస్కృతసంధికార్యములే కావలయును గదా. అట్టియెడల రామాయ్య, సీతామ్మ యని కావలసివచ్చునే. తిప్పాంబ, సూరాంబిక యిత్యాదిగా నుత్తరపదము తత్సమ మగుమిశ్రసమాసములయందు మాత్రము తిప్పంబ, సూరంబిక యిత్యాదిగా నత్వసంధి యవుట గానరాదు. కాని యీయర్థమును సిద్ధసమాస మట్ల యనునది సాధింపలేదు. కాఁగా సిద్ధసమాసతుల్యతవలన సంస్కృతసంధికార్యములే యవు నను నభిప్రాయము సూత్రకర్తకు లే దనియే చెప్పవలెను.

పోనీ. ఘం. పేర్కొన్నట్లు సవర్ణదీర్ఘసంధియే చేయుదము. నన్న+అప+ఆర్య (150) యనుచో రెండవచోట మాత్రమే యేల సవర్ణదీర్ఘము చేయవలెను? నన్న+అప యనుచోఁ జేయనక్కఱలేదా? నన్నాపార్యుఁ డగును. ఇట్లే తిక్కానసోమయాజి. రెండవస్థలమునం దగుటకును మొదటిచోటఁ గాకుండుటకును గారణ మేమి? చేసిన రెండుచోట్లను జేయవలె. లేదా రెండుచోట్ల మానవలె.

ఘం. నన్ని+అప, అని పూర్వపదము నన్ని యని విడదీయవలె ననియుఁ బేర్కొన్నది. అట్టియెడల రూపము నన్న్యపార్యుఁ డనురీతిగ యణాదేశముతో రూపము కావలసి వచ్చును.

కాఁగా సూత్రకారునిమతమునందు సయితము నివి సిద్ధసమాసములవంటివి గావున సిద్ధసమాసములలోవలె సంస్కృతసంధికార్యములే యగు నన్నపక్షమునఁ దిక్కానసోమయాజి యనురీతిరూపములు దుర్వారములు. రామాయ్య, సామ్యయ్య యనురీతిస్థలములలో సంధివిధానసామర్థ్యముచే సంస్కృతసంధి రా దని సమర్థించు కొన్నను దిక్కానసోమయాజి యనురీతి వగునీస్థలములందు బాధ తప్పదు గదా. అనాదు లాగమము లైనవి గావున నపదాదిస్వరసంధియే వచ్చు నని తలంపరాదు. సిద్ధసమాసమువంటిది కదా.

కాఁగా సిద్ధసమాసములవంటి వనుటచేత సంస్కృతసంధికార్యము లగు నని చెప్పుటకు వీలు లేదు.

ఇట సంస్కృతసంధికార్య మవుటను సిద్ధసమాసతుల్యవిధాన ముపయోగింపనిచో దెలుఁగుపదములనడుమ సంస్కృతసంధికార్యములు చేయుట కెట్టియాధారమును లేకుండఁబోవును. కాఁగా నన్న+అప యనుచోటవలెనే నన్నప+ఆర్య యనుచో సయితము సవర్ణదీర్ఘమును జేయుటకు వీలు లే దనియే చెప్పవలెను.

ఇంక ఘం. తిప్పమాంబ అనుచో సవర్ణదీర్ఘమే కల దని పేర్కొన్నది. అటఁ దెలుఁగుసంధి చేసినచో తిప్పమంబ యని కావలెను. కావున సవర్ణదీర్ఘము చేయక తప్పదు. ఇది యెట్లు? ముందుగా ఘం. ఇటఁ బ్రమాణముగా సూచించినవారి వాక్యములు గమనింతము.

నన్న+అప=నన్నప. తిక్క+అన=తిక్కన. అనువానిని సంస్కృతములుగ ననుకరించి 'నన్నప శ్చాసా వార్య శ్చ, తిక్కన శ్చాసా వమాత్య శ్చ' యనురీతిని

సిద్ధసమాసములుగా నంగీకరింపనగును. లక్ష్మమావరతనయా (పాం. 1.24) (వ్యా,సం.స. 1186) నన్నపార్య యనుచో సవర్ణదీర్ఘ మయ్యె ననుటకు నీవరఖుల వారివాక్యము లెంతమాత్రమును బ్రమాణములు గావు. వరఖులవా రట్టిరూపము లీసూత్రమునకు (దీనికి మూల మనఁదగు వి.వి.లక్షణమునకు) లక్ష్యములు గా వని పేర్కొనిరి. నన్న అనుదానికి అప యనుదానితో సమాస మై, నన్నప యనునది తెలుఁగునఁ జేయఁబడినసమాసము. కాఁగా సంస్కృతానుకరణముతో సంస్కృతమునఁ జేర్చుటచే సంస్కృతానుగుణముగా సంధికార్యము లైనవి. కావున వరఖులవారిప్రక్రియలో సవర్ణదీర్ఘ మగుట కభ్యంతరము లేదు. అదియే కావలసినది. కాని యీలక్షణముచేతఁ గాదే. 'నన్న ఆర్య' అనునది తెలుఁగునఁ జేయఁ బడినసమాసము గదా. (సిద్ధసమాసమువంటిది) మధ్యలో అప ఆగమము. ఇది తెలుఁగువ్యాకరణముచే నయినతెలుఁగుకార్యము. కావున సిద్ధసమాసముగా సమన్వయింతురా. రెండుచోట్లను సవర్ణదీర్ఘమే రావలె. లేదా రెండుచోట్లను రారాదు. వరఖులవా రనుసరించినప్రక్రియావిధానము భిన్న మగుటచే దాని ననుసరించి యిట సవర్ణదీర్ఘ మగుటనుగా గుర్తింపరాదు.

ఇటఁ దిప్పమాంబ యిత్యాదిరూపములను సాధించుటలో వరఖులవారి ప్రక్రియ యే యనుసరణీయ మని తోఁచుచున్నది. నన్నప, తిప్పయ, లక్ష్మమ యనురీతివానికి సంస్కృతమునం దనుకరణముతో నార్యాదులతో సమాసము చేసి సాధించుకొనుట యుక్తము.

ఉత్తరపదము సంస్కృతీయ మైనపుడే యిట్టికార్యము గల దనియుఁ బూర్వపదము సంస్కృతీయ మైనపుడు (ఇట్టికార్యము గలుగ దనియు) మిశ్రసమాసమే యైనను నీసిద్ధసమాస(సంస్కృతసంధికార్య)లక్షణము గానవచ్చుట లే దనియును నింతకు ముందు గమనించితిమి. దీనినిబట్టి చూచినను నన్నపేత్యాదులకు నార్యాది సంస్కృత శబ్దములతో సంస్కృతమున సమాస మయిన దనుట నిరాధారము గా దని స్పష్ట మగుచున్నది.

ఇట్లు సంస్కృతానుకరణముతో సమాసము చేయుటకు వరఖులవా రొక ప్రయోగము ప్రమాణముగా నిచ్చిరి. 'లక్ష్మమావరతనయా' లక్ష్మి+అమ యనునది తెలుఁగున నేర్పడిన దనుట నిర్వివాదము కదా. లేనిచో అమశబ్ద ముందు టెట్లు? అమశబ్దమునే సంస్కృతములోని కనుకరించిన లక్ష్మ్యమ యని సంస్కృతసంధి

(యణాదేశము) కావలెను. లక్ష్మమ యనునది సంజ్ఞ కావున లక్ష్మ్యమ యనుతీరుగా నుండుట విరుద్ధము. కాఁగాఁ దెలుఁగున 'లక్ష్మమ' యనురూప మేర్పడఁగా నీయది సంస్కృతములోని కనుకరింపఁబడి స్త్రీలింగముగా 'లక్ష్మమా' యని దీర్ఘాంత మై, 'వరతనయ' యనుసంస్కృతశబ్దముతో సమాసము నందినది. ఏమ్యాదులు, ఆల్వాదులు, పెన్వాదులు, అడుగ్వాదులు మొద లైనబాలప్రౌఢవ్యాకర్తలనిర్దేశములు తెలుఁగుశబ్దములు సంస్కృతములోని కనుకరింపఁబడి, సంస్కృతసమాస, సంధికార్యములు పొందు ననుటకుఁ బ్రమాణము లైయున్నవి.

వర్ఖులవా రీప్రయోగమును జూపుటలో నిం కొకప్రయోజనమును గమనింప వచ్చును. ఇది రాయాదిబిరుదవాచక ముత్తరపదముగాఁ గలిగినది కాదు. 'లక్ష్మమాయాః వరతనయః' అనుతీరుగా నీయది షష్ఠీతత్పురుషము. ఇట్టిసమాసమున (అమ ఆగమము గాదు గదా) కాఁగా లక్ష్మి+అమ యనునదే సంస్కృతమున ననుకరింపఁబడిన దని నిస్సంశయముగాఁ జెప్పవలెను.

పోతమాంబికావిభు (నృ. 1.15), రామమాంబారమణీమణిన్ (భీమ. 1.56), మల్లమాంబాతనూజ (మార్క. 1.288) మొద లగురీతిగాఁ బ్రయోగములు పైవర్ఖుల వారిసిద్ధాంతమునకుఁ దోడ్పడుచున్నవి.

వికృతివివేకము 'క్వచి న్మత్వం, క్వచి త్పత్వ', మని మ, ప లే విధించినది. అవి ద్విత్వయుక్తము లగుటను గూడఁ బేర్కొన్నది. అన్న-అన, అమ్మ-అమ యనురీతి విధానముల ననుసరించి చూడఁగా నిట నాగమములుగాఁ జెప్పినయాశబ్దము లార్యాద్యర్థకము లనఁదగు నయ్యాదులే యని సూచన గలదు. దీనింబట్టియును తిప్ప+అమ=తిమ్మప యనురీతిసమాసములే యివి యనియు నీయవి సంస్కృతము లోని కనుకరింపఁబడుటచేతనే తిప్పమాంబ యనురీతిరూపము లేర్పడిన వని యూహించుట యుక్తియుక్తమే.

ఇట్లు సంస్కృతములోని కనుకరింపఁబడుపద్ధతి యేల యనునుద్దేశ్యముతో సూత్రకర్త యిట్లు అనాదుల నాగమములుగాఁ జెప్పెను. అన, అప యనురీతిగా నాగమములు చెప్పుటలో వీని కన్నాదులతోడిసారూప్యమును సూత్రకర్త గుర్తించె ననవలెను. అన్నాదులతో సమాసము, మఱల వానికి సోమయాజి యిత్యాదులతో సమాసమును నే లని వాని నార్యాంబాద్యర్థకశబ్దములుగాఁ జెప్పక యాగమములుగా విధించియుండవలె. లేదా 'ఆర్యాంబాదిశబ్దా స్స్యుః శ్రేష్ఠతావాచకా యతః, తత

స్తదంతశబ్దేభ్యో' అనుట ననుసరించియే యాగమములుగాఁ జెప్పెనో. లేనిచో 'క్వచి న్మత్వం క్వచి త్పుతా' యనువాని ననుసరిచి 'నపమయ లాగమంబు లగు ననియే చెప్పియుండెడివాఁడే కదా యనిపించుచున్నది. కాని యివి యాగమములుగాఁ జెప్పుచోఁ బ్రక్రియాలాఘవముతో 'నపమయ' లని చెప్పుటయే యుక్తము. అవి నిరర్థకములే కదా. ఆగమము 'అన' అన్న నేమి? 'న' అన్న నేమి?

కావున వీని నాగమములుగాఁ జెప్పుటలో సూత్రరచనము సరిగా లే దని యూహించుట దోషము గాదు. తరువాతిసూత్రమునొద్ద లక్ష్య మగు 'పినకొండమాంబ' యం 'దమ' పదము గలదు. అది యీసూత్రమునకు లక్ష్య మగునా? కాదా? పూర్వసూత్రమునొద్ద నిట్టిదానికిఁ బ్రయోగము చూపలేదు. కొండమాంబ, కృష్ణమాంబ యనునవి రెండును లక్ష్యము లని చెప్పుట యుద్దేశ్యము గావచ్చును. కాని యట్టియెడల నన్న+అప+ఆర్య అనుచోవలె 'అమ' ఇట నాగమ మైన దన్నచో 'కొండమంబ' యని కావలెఁ గదా. దీనిని సూత్రకర్త గుర్తింపలేదా. గుర్తించియున్న 'సిద్ధసమాస మట్ల యగు' ననుట ననుసరించి సవర్ణదీర్ఘ మగు నని తలంచెనా? ఐన నాసూత్రవివరణమునం దిట్టిసూచనయే చేయలేదే. సర్వ. కొండమాంబయు లక్ష్య మన్నది (172) కాని యారూప మె ట్లయినదో తెలుపలేదు. ఇంకఁ బూర్వపద మవికృతాంత మవు నని లక్షణకర్త పూర్వపదవిషయముం జెప్పెఁ గాని యుత్తరపదవిషయమును బేర్కొనలేదు. 'లక్ష్మమావరతనయా' యనుచో దీర్ఘ మెట్లు? ఇట్లు ప్రౌఢవ్యాకర్తయభిప్రాయము నిశ్చయించి చెప్పరాకున్నది.

ఇట కు.పం. వింతలు చెప్పినది. 'ఇచ్చోన్+అ–ఇచ్చోన. ఇచ్చోటనే న ప మ య ఆగమము లగును. నన్న+ప+ఆర్యుఁడు = నన్నపార్యుఁడు. ఆగమాక్షరముల దీర్ఘము 'ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు' అనుప్రౌ.సంజ్ఞ3చే గల్గినది (103). నపమయలే యాగమములుగాఁ జెప్పుటలో లాఘవము గలదు. 'అప' యని ఆగమ మకారాది యగుటవలన 'నన్న+అప' యని యుండ నపదాదిస్వరసంధి చేయవలసివచ్చుట గౌరవము. నన్న+ప=నన్నప. అని యవుటలో సంధిప్రసక్తి లేమి లాఘవము గలదు. నన్నప+ఆర్య=నన్నపార్య. అనుచో సవర్ణదీర్ఘమును సమన్వయించినను (సిద్ధసమాసము గాన) 'నన్నప' యనుచో సవర్ణదీర్ఘప్రసక్తి యుండదు. కాని సంస్కృతసంధికార్యము లగుట సూత్రకర్తయుద్దేశ్యముగాఁ గానరా దనుకొంటిమి కదా. అమ్మాజియమ్మ, కందాళయప్ప యనురీతిగా (విధాన

సామర్థ్యముచే రామయ్య యిత్యాదులలోఁ దెలుఁగుసంధికార్యమే యయిన దని సమర్థించుకొన్నను) సంధ్యభావస్థలములలోఁ గూడ యడాగమరూప మైనతెలుఁ గుసంధికార్యమే కానవచ్చుచున్నది. కాని సంస్కృతసంధి యై, అమ్మాజ్యమ్మ, కందాళాప్ప యనుతీరుగా నుండుట లే దని గుర్తింపవలె. నన్నప+ఆర్య యనుచోఁ బరస్వరైకారాదేశమే (తెలుఁగుసంధియే) యైన దని ఫలితార్థము.

కాని న ప మ య లాగమము చేయుటకు కు.పం. చేసినసమన్వయము సరి కాదు. ఈకు.పం. సమన్వయమును సుబో. నిరసించినది. కాని కారణమును బేర్కొనలేదు. 'ఇచ్చోన' అనుచో ఇచ్చోన్+అ అని యవధారణార్థకమునకుఁ బ్రయోజన మేమియు లేదు. 'ఇటఁ బూర్వపదంబు' అనునింతకు ముందటిసూత్రమున నవధారణార్థకము లేదు. మఱి యటఁ జెప్పినయిత్వ మితరస్థలములలో వచ్చునా? అ ట్లయిన వ్యాకరణమునం దెన్నిలక్షణములలో నవధారణార్థక ముండవలెనో చెప్పుట కష్టము.

నాపామాయాగమంబు లనుచో దీర్ఘము 'ఒకచో హ్రస్వంబునకు దీర్ఘం బగు' నని యగుటలో విరోధము లేదు. 'అడంగ్వాదులడాకు, జూదాదులదాకు, అని చిన్నయసూరియును బేర్కొనెను. కాని యట డాకు, దాకు అనఁగా డకారమునకు, దకారమునకు, అనురీతిగాఁ బొల్లుహల్లే గ్రహింపఁబడును. కాకు గావచ్చును ఇత్యాదిగాఁ బ్రౌఢవ్యాకర్త చూపినయుదాహృతులలోను కకారమునకు గకారము వచ్చు ననురీతిగనే కదా యర్థము. అదే విధముగా నిక్కడ నాపామాయాగమము లన్నచో నకారము, పకార మనుతీరుగాఁ బొల్లుహల్లు మాత్రమే యాగమము కావలెను గాని న,ప,మ,య యనుతీరుగా అత్వముతోఁ గూడిన'న'కారాదు లాగమ మగుట యెట్లు?

కు.పం. సమన్వయ మసంగత మనక తీఱదు.

ఇంతకల్పన యేల? వ్యాకర్తయే తరువాతిసూత్రమునొద్ద 'కృష్ణమ్మపంతులు అనుచో 'అమ్మ' ప్రేమసూచకం బని యెఱుంగునది' యని పేర్కొనెను. ప్రస్తుతసూత్రముచే 'మ' అనునదే యాగమ మైనఁ దరువాతిసూత్రముచే నందలిహల్లునకు ద్విత్వము వచ్చి, 'మ్మ' యని యగును. ఇది ప్రేమసూచక మగు టేమి? అస లది యే మగు ననుసందేహ మెందుకుఁ గలిగినది?

ప్రస్తుతసూత్రముచే అమ (అకారాది యగుమవర్ణము) యాగమ మైనది. పై సూత్రముచే ద్విత్వము రాఁగా, అమ్మ అని యైనది. అమ్మ యనునది స్త్రీవాచకము. కృష్ణ(మ్మ)పంతులు అనునది పురుషసంజ్ఞ. పురుషసంజ్ఞలో అమ్మ యనుస్త్రీవాచక మెట్లు కుదురును? అనుసందేహము గలుగఁగా నిది స్త్రీకి వాచకము గాక, ప్రేమను మాత్రమే తెలుపు నని వ్యాకర్త సమన్వయము. కేవలము 'మ్మ' యనునదే యైన నిట సందేహమే గలుగదు కావున వ్యాకర్త యిట్లు వివరింపవలసినయవసరమును లేదు. కాఁగా నీవివరణమునుబట్టియే యిచ్చటియాగమములు అన, అప, అమ, అయ యనువిధముగా అకారాదు లని స్పష్ట మగుచున్నది.

కాఁగా నపమయ ఆగమము లను కు.పం.వివరణము సూత్రకృన్మతము గాదు.

ఈసూత్రమును విమర్శించుచు ఘం. 'అన లోనగువాని నాగమము లనుట తృప్తికరముగా గనబడదు. తిక్కన మున్నగువానిమీదనే బిరుదాదివాచకములను నిల్పుట యుక్త మనఁదగు' (150) నన్నది. ఈవివరణము స్పష్టముగా లేదు. తిక్కన యనుదానిపై సోమయాజి బిరుదముగాఁ జేర్పవలె నన్న నెట్లు? ఇట సంజ్ఞావాచకము తిక్క శబ్దముమాత్రమే. తిక్కసుధీమణి మొ. నన్న, తిక్క, ఎఱ్ఱ యనునవి సంజ్ఞలుగాఁ బ్రయుక్తము లైనవి. అట్టియెడల నన్నయ, ఎఱ్ఱయ యనురీతి గానే తిక్క యనుద్వ్యక్షరాదంతపుంసంజ్ఞావాచకమునకు, బిరుదాదికములోఁ జేరు అన యనుదానితో సమాస మై, తిక్కన యని యైనది. ఇందు 'అన' యనునదే బిరు దుదులలోని దైయుండఁగా దానికి మఱల సోమయాజి యనుబిరుదవాచకముతో సమాసము చేయవలె నన్నమాట. ఇది పరిశీలింపఁదగును.

నన్నపార్యుఁడు ఇత్యాదులు నిట్లే యన్నమాట. అయిన నిం కొకయంశమును గూడ నియమింపవలెను.

ప్రస్తుతసూత్రమున 'కొన్నియెడల' ననుటచే నొక్కొక్కశబ్దమున కాయాశబ్దములు పర మైనపు డాయాయాగమములు మాత్రమే వచ్చు నని చెప్పవచ్చును. నన్న శబ్దమునకు ఆర్యాదులు పర మైనపుడు అప అనునది మాత్రమే యాగమ మగును. తిక్క శబ్దమునకు అన మాత్రమే యాగమ మగును మొ. ఈఆగమవిధానము సరి కా దని తిరస్కరించునపుడు సమాసమే నియమింపవలెను. తిక్కన అనుదానికి మాత్రమే యమాత్యుఁ డిత్యాదులతో సమాస మగును. తిక్కయామాత్యుఁడు, మొద లగురీతి నుండవు గదా. అట్లే నన్ననభట్టు, నన్ననార్యుఁ డిత్యాదులు లేవు.

ఘం. పేర్కొనినట్లు సోమయాజి యనురీతిబిరుదవాచకములతో తిక్కన అనురీతి అనాద్యంతములకు సమాసము చేయుటలో నిబ్బందులు గలవు.

తిక్కన శబ్దమునకు అమాత్యశబ్దముతో సమాస మైన తిక్కన+అమాత్య - తిక్కనమాత్య అని యగును. తిక్కనామాత్య యని సంస్కృతసంధి రావలె నన్నఁ దెలుఁగునఁ గుదురదు కదా. తిక్కనసోమయాజి తెలుఁగునను, దిక్కనామాత్యుఁడు సంస్కృతమునను రెండువిధములుగాఁ జేయవలెను.

తిక్కన యని ప్రత్యేకముగాఁ గలదు. కావున దానికి సమాసము చేయవచ్చును. నన్నపార్యుఁ డనుదానిని సాధించుటకు ముందు 'నన్నప' యనునది తెలుఁగునఁ బ్రత్యేకముగా లేదు. తెలుఁగున నున్న నన్నయ యనుదానికి ఆర్యశబ్దముతో సమాసము లేదు. (నన్నయభట్టు) ప్రౌఢవ్యాకర్త చూపిన కృష్ణమరాజు, కృష్ణమ్మపంతులు అనుచో కృష్ణమ, కృష్ణమ్మ యనునవి విడిగా లేవు.

రామయ, తిక్కన్న, నన్నయ యిత్యాదులు ప్రౌ.సమా.2. సూత్రముచే సమాసము లై బహుళపదముచే దీర్ఘము రాక, (స్వరపరకతలో దీర్ఘము లే దనఁదగును) సంధి జరిగి, సిద్ధించును.

కాఁగా ఘం. పేర్కొన్న సమాసపద్ధతి పూర్తిగా కుదురుట లేదు.

అందుకే వికృతివివేకము పేర్కొనినట్లు ప్రౌఢవ్యాకర్త కూడ నపమయలు ఆగమములుగాఁ జెప్పిన బాగుండెడిది. నన్నపార్యుఁడు, కృష్ణమనాయఁడు మొద లైనవి యాగమ మైనస్థలములు. తిక్కనామాత్య, లక్ష్మమావరతనయా వంటివి, యేమ్యాదులు, ఇఁకాదులు మొద లగునితరములకువలె సంస్కృతసమాసములుగా సిద్ధింపఁజేసికొనవలెను.

వఝులవారు నన్నపార్యుఁ డనురీతి విట లక్ష్యములు గా వని భావించిరి.

కోనమాంబవంటిప్రయోగములు ప్రాచీనమహాకావ్యములలో లే వని వఝుల వారు పేర్కొనిరి.(వ్యా.సం.స.1188) కాని సూరనార్యునకును బోతమాంబకును, ఎఱ్ఱనార్యుండు నన్నయభట్టమహాకవీంద్రు (ఆర.7.469) నని యెఱ్ఱన దీనిం బ్రయోగించుట కానవచ్చు.

ఇంకఁ దరువాతిసూత్ర మీయాగమములు ద్విత్వయుక్తము లగుటను బేర్కొన్నది. ఇట సూత్రకర్త కృష్ణమరాజు, అనుద్విత్వరహితరూపమున కీప్రయోగమును జూపెను.

కృష్ణప్పనాయఁ డిత్యాదివ్యవహారము గలదు. 'కొన్నియెడల' ననుట యుక్తముగా నున్నది.

తత్త్వ. 255, సర్వ. 173, ఘం. 152 వ్యాఖ్య లీసూత్రము వ్యర్థ మని పేర్కొన్నవి.

కు.పం. ద్విత్వయుక్తములుగనే యాగమంబులను దొలుత విధించి పిమ్మట ద్విత్వలోపమును వైకల్పికముగ విధించుట మే లని కొందఱు. ద్విత్వాద్విత్వములకుం దుల్యబాహుళ్యము ప్రయోగములం గానమి అట్లు కాదయ్యె నని గ్రహింపవలయు (104) నని పేర్కొన్నది. సద్విత్వముగనే ముందు చెప్పఁదగు నని తలంచినవా రెవరో తెలియరాలేదు. కు.పం. ఈవిధానమును సమర్థించినతీరుంబట్టి యద్విత్వము లధికముగను, సద్విత్వము లరుదుగను బ్రయోగములం దుండుటచే నద్విత్వములనే యాగమములుగాఁ జెప్పుట యుక్త మని తెలియఁదగును. కాని సద్విత్వములనే చెప్పి, ద్విత్వమునకు లోపము చెప్పినను నిష్టరూపసిద్ధి కాకపోదు. అయినను బ్రయోజనహీన మగుసవరణము నుద్దేశింప నేల? ద్విత్వలోప మైనను బ్రత్యేకముగాఁ జెప్పుకొనవలసినదే కదా. (ఇక్కడి అయ్య మున్నగునవి యార్యాద్యర్థకములు కావు, కావున నక్కటాదిసూత్రము వర్తింపదు.) ఇంక కు.పం. నపమయ లాగమము లని భావించిన దగుటచే ద్విత్వవిధానము సముచితముగాఁ దలఁచుట యావ్యాఖ్య కనుగుణమే యనఁదగును. కాని సుబో. ప్రభృతివ్యాఖ్య లీద్విత్వవిధానమే వ్యర్థ మన్నవి. అన్న, అప్ప మున్నగుశ్రేష్ఠతావాచకములతో నిత్యసంధి చేసినయెడల రామన్న సెట్టి మున్నగునవి సాధింప వీలగును. అట్టియెడ నీసూత్ర మనావశ్యక మననగును. పయి యన్నాదులలోనిద్విత్వము బహుళముగా లోపించు నని సూత్రించినచో కృష్ణమ నాయఁడు మున్నగునవి కుదురు (సుబో. 152) నన్నది. నిత్యసంధికిని రామన్నసెట్టి యనురూపమునకును సంబంధ మేమో. రామన్న యనుచో అన్న శ్రేష్ఠతావాచక మని చెప్పఁబడినది. శ్రేష్ఠతావాచకాంత మగు రామన్న యనుదానికి సెట్టి యనుదానితో సమాన మైన దన్నమాట. ఘం. (152) కూడ నిట్లే చెప్పినది. కాని సూత్రకృన్మతమున రామన్నసెట్టి = రాముఁడు+సెట్టి యనురీతిగా భావింపవలెను. ద్విత్వము వచ్చిన 'అన' ఆగమము. 'అన్న' పదము కాదు. కాని సుబో. ఆర్యాద్యర్థకములలోనిదిగాఁ దలఁచుటచే సంధిప్రసంగము చేసిన దన్నమాట. ఈసందర్భమున నపమయాదు లపదములుగాఁ గాక యర్యాద్యర్థకశబ్దములుగా నీవ్యాఖ్యలు తలంచుటంజేసి ద్విత్వలోపమును సూత్రింపవలసినయవసరమును

గానరాలేదు. కావుననే తత్త్వ. అయ్యాదు లక్కటాదులలోని వనియు వానికి లోపము బహుళము (కాదు. సూరి చెప్పినది విభాష యని గుర్తింపవలెను)గా వచ్చు ననియు బాల.ప్రకీ. 8 సూత్రమువలనఁ దెలియఁబడుచునే యున్నది. కావున నద్విత్వములుగా విధించుటయు ద్విత్వము చేయుటయు వృథా ప్రయాస మని (255) స్పష్టము చేసినది. అది యావ్యాఖ్యలమార్గము ననుసరించి యుక్తమే.

కాని సర్వ. తానే సంధిపరిచ్ఛేదమున రామయ్య, సీతమ్మ యనురూపములు సాధించి, యిట నద్విత్వముగాను, సద్వితముగాను సూత్రకర్త పేర్కొనుట యుక్తముగా లే (173) దనుట విశేషము. సూత్రకృన్మతమున అన, అప, యిత్యాదు లాగమము లనఁగా నపదములు కావు. రామయ్య యిత్యాదులలో నయ్య శ్రేష్ఠతావాచకము. ఇట అయ్య నిరర్థక మగునాగమ, మంతే కాక, నన్న+అప+ఆర్య యనుచో అప పదమే యైన, 'అప అయ్య ఆర్య అని' యపశబ్ద మార్యార్థక మైయున్నది. దానిపై మఱల నార్యశబ్ద మేల? ఇట్లే కోనమాంబ. ఇట్టివానినే వి.వి. వారించినది. 'ఆర్యాంబాదికశబ్దా స్స్యు శ్శ్రేష్ఠతావాచకా యది తత స్తదంతశబ్దేభ్యో నైవ శ్రేష్ఠత్వగోచరాః' అని. పినకొండమాంబ యనుదాని నీతఁడు చూపుచున్నాఁడు. కావున అంబశబ్దము శ్రేష్ఠతార్థకము గాఁగా, 'అమ' నిరర్థక మగునాగమముగాఁ జెప్పుట యాతని యభిప్రాయము గావచ్చును. ఇట్లే నన్నపార్యుఁ డనునదియును వీనివలెనే తిక్కన సోమయాజి యన్న నంతే. కావున అన నిరర్థక మగునాగమముగాఁ జెప్పె ననఁ దగును.

కాని యిట్లు సమర్థించుటకును సూత్రకర్త యవకాశ మిచ్చుట లేదు. కృష్ణమపంతు లనుచో అమ్మ ప్రేమసూచక మని వివరించెను. అమ్మ స్త్రీబోధకము గా దనుటకే యీవివరణము. అట్టియెడ నర్థబోధ ననుసరించి కృష్ణమ్మపంతు లనుచో అమ్మ ప్రేమసూచకమే కాని యంబార్థకము కా దన్న రామన్నసెట్టి, తిమ్మప్పసెట్టి యనురీతి స్థలములలో నన్నాదు లే మగును. అర్థబాధ లేదు కాన స్వార్థబోధకములే యగునా? అట్టియెడల నచ్చో నాగమము లగునయ్యాదు లార్యాద్యర్థకములే యనవలెను. అపుడు సుబోధిన్యాదివ్యాఖ్యలు భావించినట్లుగా నీసూత్రమును, నాగమములను జెప్పినయింతకు ముందటిసూత్రమును నిరర్థకములే యని నిశ్చయించుట కనుమానింప నక్కఱ లేదు.

అట్లు గాక అనాపామాయ లాగమములు గావున నార్యాద్యర్థబోధకములు గా వన్నయభిప్రాయ మున్నచో నావ్యాకర్త కృష్ణమ్మపంతు లనుచో అమ్మ ప్రేమసూచక మని చెప్పుట కేవలము పొరపా టని నిర్ణయింపక తప్పదు.

ఇట నమ్మకుఁ బ్రేమసూచకత్వరూప మైనవిశేషార్థమే యున్న నాగమము నాయర్థమునందే విధించుట యవసరము. ఆగమము లని చెప్పి, యర్థము చూపు టెట్లు? రాజునాజ్ఞ యనుచో నుగాగమమున కర్థ మేమి? అమ్మాదు లర్థవంతము లగుపదము లనియే తలంచిన, వాని నాగమములుగాఁ జెప్పుట యయుక్తము.

ఇట సర్వ. కృష్ణమ్మపంతులు అనుచో నడుమ నున్న అమ్మ స్త్రీవాచక మని మొదలుగా వివరించుటకు సూత్రకర్తయొక్క పైప్రమాదమే మూలము. ఆగమ మయినశబ్ద మిది స్త్రీవాచక మగుట యసంభవ మని గుర్తింపఁదగు నన్నది. లక్షణమున విశేషార్థమునం దగుటను విధించినఁ దప్ప నాగమమునకు నర్థ ముండదు.

తత్త్వ. 'అమ్మకు రూపాంతర మగు అమ' పురుషసంజ్ఞ కాగమ మగుటకు (254) నని వివరించుటకును బైసూత్రకర్త ప్రమాదమే హేతువు. సూత్రకర్త అమ ఆగమముగాఁ జెప్పి దానికి ద్విత్వమును బేర్కొనెను. అట్టియెడ కృష్ణమరా జనుచోట అమ = అమ్మకు రూపాంతర మనుట యొప్పదు. ఆర్యాద్యర్థకములలోఁ జేరి యర్థద్యోతకముగాఁ దలఁతు రేమో యని వివరించుటవలన అమ్మ యనునది మూలరూప మై అమ రూపాంతర మనుట సిద్ధించిన దన్నమాట.

తత్త్వ. అన అప అయ అనునవి పురుషసంజ్ఞలకును అమ ఉభయమునకు నాగమ మగు నని (254) చెప్పినది. వఝలవారును బురుషవాచకములతుదిని అమ అప అనునవి నిల్చె ననుట సరి కా దనియు కృష్ణమరాజు మున్నగురీతిని అమ మున్నగువానిపై మఱల రాజు మున్నగునవి నిల్చుట సరి కా దనియుఁ దలఁచి కావలయును (అథర్వణుఁడు) పత్వమత్వముల నుపదేశించినవాఁ డయ్యె (వ్యా.సం.స.1186) ననిరి. అప యనునది పురుషవాచకముపైఁ జేరుటలో నిబ్బంది లేదు. అప పురుషవాచకము కాఁబట్టి. అట్టియెడఁ గృష్ణమరాజు అనుచో నయ్యది పురుషవాచకము గావున అమ్మ ప్రేమసూచక మన్నచో కోనమాంబ యనుచో నట్టియిబ్బంది లేదు గావున అమ స్త్రీవాచకమే యని సూత్రకర్తయుఁ దలఁచె ననవలెను.

ఇ ట్లివి యార్యాద్యర్థకములే కావలయు నని యూహించినచో నీసూత్రములు రెండును గేవలము వ్యర్థములే. కృష్ణమ్మపంతు లనుచో అమ్మ అనుదానికి సూత్రకర్త చేసినవివరణమే యింతప్రమాదమును దెచ్చిపెట్టిన దనుట స్పష్టము.

వి.వి. 'క్వచిత్ పతా, క్వచి న్మత్వమ్' అని పత్వమత్వములే చెప్పఁగా నీసూత్రకర్త అన, అమ యని పేర్కొనెను. నన్నపార్యుఁడు, కృష్ణమరాజు అనునవి ప్రసిద్ధములే. కాని నన్నప, కృష్ణమ యనునవి యాయర్థములందుఁ బ్రసిద్ధములు కావు. కావుననే యీయది సంస్కృతములోని కనుసరించి సమాసము చేయుటకంటె పత్వమత్వ విధానములే యుచిత మనుటకును వీలు లేకపోలేదు.

రామన్నసెట్టి, కృష్ణమ్మపంతు లనురీతివి గూడ గమనింపఁదగును. ఇట నుత్తరపదము లాచ్ఛికములే యవుటంజేసి తెలుఁగుననే సమాసము చేయుట యుక్తము. రెండుశబ్దములను సంస్కృతములోని కనుకరించి సిద్ధసమాసముగా సమన్వయింప నేల? దీనివలనఁ గృష్ణమనాయఁ డనుచో సిద్ధసమాసము గావున సంస్కృతప్రాతిపదికములకువలె నత్వమునకు నుత్వము రావలెను(నాయుఁడు). కాఁగా నాచ్ఛికోత్తరపదము లగునిట్టిసమాసములలో నివ్వాని నాగమములుగానే పేర్కొనుట యుక్త మని తోఁచుచున్నది.

తిక్కనసోమయాజి, నన్నయభట్టు ఇత్యాదిగా నున్నస్థలములలో అన, అయ శబ్దాంతములకే బిరుదవాచకములతో సమాస మైన దని భావించినను నన్నపార్యుఁ డు, కృష్ణమరా జనురీతిస్థలములలో 'ప,మ' లాగమము లనఁదగును. తిప్పమాంబు, కోనమాంబ యనురీతివానిని సిద్ధసమాసములుగానే సాధింపఁదగును. ఇచట సంస్కృతసంధికార్యము గన్పించుచున్నది. నయ లాగమములుగా స్పష్టముగాఁ జెప్పక, ప,మలనే వి.వి. విధించుటలో నిట్టియభిప్రాయ ముండియుండవచ్చును. వీనిసాహచర్యమున సూత్రకర్త నయలను గూడ నాగమములుగానే చెప్పియుండును.

ఇచట సారాంశ మేదియో సంగ్రహముగా గమనింతము.

వికృతివివేకానుసారముగా పమలు విధించుట యుక్తము. వానికి ద్విత్వమును గూడఁ జెప్పవలసియేయున్నది. తిక్కనసోమయాజి యిత్యాదులలో సూత్రకర్త పేర్కొన్న అన, అయ (అన్న, అయ్య) యనువాని నాగమములుగాఁ జెప్పుటకంటెఁ దిక్కన, నన్నయ యనునవే బిరుదవాకకములతో సమసించె ననఁదగును. (ఘం.152)

తిప్పమాంబ, కోనమాంబ యనురీతివానిని వఝలవారు పేర్కొన్నట్లు సంస్కృతమునఁ జేయఁబడినసమాసములుగా గుర్తింపఁదగును. సిద్ధసమాసతుల్యవిధానముచే సంస్కృతసంధికార్యము లగుటను సాధించుట సూత్రకర్తమత మనుట కాధారము చాలదు. కోనమాంబ యనులక్ష్యమునుబట్టి య ట్లూహించినను, అపాదు లాగమ ములుగాఁ జెప్పుటనుబట్టి నన్నాపాచార్య లనురీతిని గావలసివచ్చును గదా. లక్ష్మమావరతనయా, యనువానిసామ్యమున సుబ్బమావరతనయా, సూరమావర తనయా యనురీతి వంగీకరింపఁదగినవే యగును. కావున నార్యాద్యర్థకాంతము లగుసమాసములును సంస్కృతములోని కనుకరింపఁబడి సమాసములు చేయఁ బడుట కల దని యంగీకరింపనగును. సిద్ధసమాసతుల్యత మిశ్రసమాసములకు మాత్రమే చెప్పుటచే సుబ్బమ, సూరమ యనురీతియాచ్ఛికసమాసములకు సిద్ధసమాస తుల్యత సిద్ధింపమి నాలక్షణ మిద్దానికి సాధకము గాఁజాలదు. లక్ష్మమావరతనయా యనురీతిస్థలములను గూడ సంగ్రహించుటకు వీలుగా సిద్ధసమాసతుల్యత లేదు. ఉత్తరపదమును గూర్చి సూత్రకర్త స్పష్టము చేయలేదు కదా.

కాఁగా దీనింబట్టి సిద్ధసమాసవిధానము ప్రయోజనవంతము గాదు. ఇంక లక్షణము 'కొన్నియెడల నిచ్చో మప లాగమంబు లగు, నగుచోఁ గొండొకచో ద్విత్వంబును జూపట్టెడి' ననురీతిని జెప్పుట యుక్తము. దీనివలనఁ గృష్ణమ, కృష్ణమ్మ, నన్నప, యనురూపములు విడిగాఁ బ్రసిద్ధములు గాకుండుటయు సమర్థింపఁ బడును. తిక్కనామాత్యుఁడు, తిక్కామాత్యుఁడు, సూరయామాత్యుఁ డనురీతిసమాస ములలోనిసవర్ణదీర్ఘమునుబట్టి యవి తిక్కన, సూరయ యనురీతివానికే బిరుదాది వాచకములతో సంస్కృతమున సమాసము జరిగిన దనవలెను. కావున నన్నయభట్టు తిక్కనసోమయాజి యనువానిని గూడ నట్లే (నన్నయ, తిక్కన యనువానికి బిరుదవాచకముతో సిద్ధసమాసముగా) సమన్వయించుట యుచితమే. కావున నయ లాగమములుగాఁ జెప్పక తప్ప దని కృష్ణప, కృష్ణమ యనురీతివి నన్నయ, తిక్కన యనువానివలెఁ బ్రసిద్ధములు గావు గదా. అసలే లే వన్నను నిబ్బంది లేకవచ్చును.

సంస్కృతానుకరణము లేకయే యీరీతి సమాసము లెల్ల సంగ్రహింపఁదగు నని యెంచుచోఁ 'గర్మధారయం బియ్యది సిద్ధసమాసమట్ల యగు' నని చెప్పఁ దగును. అప్పుడు సిద్ధసమాసమునందువలె నిందును సంస్కృతసంధికార్యము లవును. తిప్పమాంబ యిత్యాదులు సిద్ధించును. అట్టియెడల నపమయ లాగమంబు

లగు' నని చెప్పుచో నన్నాపార్యుఁ డనురీతిరూపములను శంకింప నక్కఱ లేదు. కోనమాంబ యనులక్ష్యమునం దిట్టియంశమును సూత్రకర్త సూచించె నన్నను లుప్తవిభక్తికత్వము, పూర్వపద మవికృతాంత మవుటయును మాత్రమే కాకుండ సిద్ధసమాసమువలె నెల్లకార్యములును సంస్కృతానుగుణముగ నగు నని స్పష్టము చేయుట యవసరము. దానివలన లక్ష్మమ, సుబ్బమ యనురీతివి సైతము తిప్పమాంబ యనురీతివానివలె (సంస్కృతసమాసములవలె) బై సంస్కృతశబ్దముతో సమసించి 'రామయామాత్యభాస్కరుఁడు, లక్ష్మమావరతనయా, యనురీతివి గూడ సిద్ధము లగును. 'సిద్ధసమాసములట్ల యగు' నని చెప్పుటలో నీయభిప్రాయము సూత్రకర్త కున్నయెడల దానిని స్పష్టముగా వివరించియున్నచో నీవిధానము లన్నియు సార్థకము లయ్యెడివి. అనాద్యాగమములను మాత్రము నపమయలుగాఁ బేర్కొనఁ దగును.

ఇట్టియెడల రామయ్య యిత్యాదిస్థలములలో బిరుదాదులలోని వగునార్యాద్యర్థ కము లాచ్ఛికములు పర మగుచో సిద్ధసమాసతుల్యతచే సిద్ధసమాసమందువలె సంస్కృతసంధికార్యములు జరుగవలసియున్నను సంధి. 1 సూత్రము ప్రత్యేకముగా సంధిని జెప్పుట ననుసరించి యవి పర మగుచో సంస్కృతసంధికార్యములు రా వని నియమించుకొనఁదగును. దానిచేతనే యమ్మాజియమ్మ, యిత్యాదులలో సంధ్యభావదశయందు యడాగమ మవుటను సమర్థించుకొనవచ్చును.

మొత్తముమీఁద సూత్రకర్త సిద్ధము, చేసికొన్నప్రణాళిక సముచితముగానే యున్నను దానిని బ్రతిపాదించుటలో మాత్రము దోషము లేర్పడిన వని యంగీ కరింపవలెను.

## ధాతుజవిశేషణములు – సమాసవిశేషములు

### 8. ధాతుజవిశేషణంబులు తథార్థకావ్యయంబుతోడం గర్మధారయం బగు.

ధాతుజవిశేషణములు తథార్థక మగు అట్టు, అట్టులు అనిరీతియవ్యయము లతోఁ గర్మధారయసమాసము నందు నని సూత్రము చెప్పుచ్చున్నది. వేదముల్ చదువునట్లు, పోయినయట్లు మొద లగునవి.

ఈసూత్రారంభమును గూర్చి సర్వ. ధాతుజవిశేషణములు పూర్వపదము లగుట

విశేషము గా దని స్పష్టము చేసి, 'అన్నియవ్యయములకును సమాసమున నుత్తర పదముగా నుండుయోగ్యత లేదు. కావున అట్లు అనునవ్యయము కర్మధారయమున నుత్తరపద మగు నని చూపుట స్పష్టప్రతిపత్తికి సహకరించుచున్న' (179) దన్నది.

అన్నియవ్యయము లుత్తరపదములుగా నుండవు. అనఁగా నేసమాసమందును నవ్యయ ముత్తరపదముగా నుండుట లేదా? అయినచో నిట అట్లు అనుదానికిఁ గర్మధారయమునందే యుత్తరపదముగా నుంట చెప్పఁబడినది కావున నిది కర్మధారయేతరసమాసములలో నుత్తరపదముగా నుండదా? కాని, వానియట్లు, బకునట్లు ఇత్యాదిగా షష్ఠీతత్పురుషమున నట్లు అనునది యుత్తరపదముగా నున్నదే కదా. మఱి పైవివరణము ననుసరించి యట్లు అన్న దొక్కటే, కర్మధారయమునందు మాత్రమే, ధాతుజవిశేషణములపైనే, యుండవలెను గదా.

అన్ని యవ్యయము లుత్తరపదముగా నుండవు గాన 'అట్లు' చెప్పినచో నట్లు అనుదానికి భిన్న మైనయవ్యయ ముత్తరపదముగా నెప్పుడు నుండ దని యర్థ మగును. పోనీ, కర్మధారయమునందు మాత్రమే యైనను నట్లుభిన్న మగునవ్యయ ముత్తరపదముగా నుండ దని నిశ్చయింపనవునా?

ఎయ్యేని, ఎయ్యెడలన్ (ఎడల అవ్యయ మని సూ.ని.) అనురీతిగా నితరము లరుదుగ నైనను గానవచ్చును.

తత్త్వ. కొన్నియవ్యయము లుత్తరపదములుగా నుండుసమాసములు తెనుఁ గున లేనందునను, తథా అనునవ్యయ ముత్తరపదముగా నుండెడిసమాసము సంస్కృతమునను లేనందునను, విశదప్రతిపత్తికై యీసూత్రము రచింపఁబడె నని తెలియఁదగు (260) నన్నది. కొన్ని యవ్యయము లుత్తరపదములుగా లే వనుటచేఁ గొన్ని కల వని స్పష్ట మగుచున్నది. ఆకొన్నిటిలో 'అట్లు' ఒకటి కాఁగా, నట్లు భిన్నము లైనయవ్యయము లన్నియు లే కున్నను గొన్ని కలవు గావున అట్లు' అనుదానితోనే సమాస మేల చెప్పవలె? సంస్కృతమున తథా యనునవ్యయముతోడి సమాసములు లేవు గావున నిట్లు చెప్పఁబడిన దని సమర్థించుట యుక్తము గాదు. తెలుఁగునఁ జేసినసమాసము లన్నింటికి నర్థముతోఁ గూడ సంస్కృతమున మూల ముండ వలయు నని యెంచుట సరి కాదు. సంస్కృతమున లేనిసమాసములు తెలుఁగున నుండుట ప్రసిద్ధమే.

కావున 'అట్లు'తో సమాసమును జెప్పుచున్నయీసూత్రము ప్రయోజనవంతము గా దనియే నిర్ణయింపవలెను.

అట్లు అనునది యవ్యయమే కా దనియు నీసూత్ర మనావశ్యక మనియు సంజీవనీవ్యాఖ్యయభిప్రాయము. (వ్యా.సం.స.810,1210) అవ్యయమే యైనను నిట విశేష్యముగా వివక్షింపఁబడి కర్మధారయ మగుటలో నిబ్బంది లేదు. కాన నీసూత్ర మనావశ్యకమే.

**15. ఒకానొకచో గుణవాచకధాతుజవిశేషణంబు లవయవవిశేష్యపూర్వకంబు లై యవయవితో సమసించెడి.**

గుణవాచకము లైననల్లాదులును, ధాతుజవిశేషణములును, విశేష్య మగు అవయవవాచకము పూర్వమునందుఁ బ్రయోగింపఁబడుచుండఁగా, అవయవితో సమసించుచున్న వని యర్థము.

'ఒడలు తెల్లనితురగోత్తమువాలంబు'. 'తెల్ల' గుణవాచక మగువిశేషణము. 'ఒడలు' అవయవవాచకము. విశేష్యము. ఇది పూర్వమునం దుండఁగా తెల్ల యనునది యవయవి యైనతురగోత్తమశబ్దముతో సమాసము నందినది.

'తనువు మీన్పొలవల్చు జాలరిదాన' యనునది ధాతుజవిశేషణమున కుదాహృతి.

ఇట తత్త్వ. 'ఒడలు అవయవము. తురగోత్తమ మవయవి. తెల్లని యనునది ఒడలునకు విశేషణ మగుగుణవాచకము. ఇయ్యది ఒడలు అనువిశేష్యము ముందు గల దై (ఒడలు తెల్లని అయి) తురగోత్తముఁ డనువిశేష్యముతో సమాసము చెంద నై(268) నన్నది. తెల్లని యనునది విశేషణ మని విడిగాఁ జూపినను, తెల్ల అనునదే గ్రహింపవలెను. తెల్ల అనువిశేషణము విశేష్యముతో సమసించిన దనుట యెట్లు? ఇంక నీవ్యాఖ్య తురగోత్తమము తురగోత్తము అనురీతి చూపుట సరి కాదు. సుబో. తురగోత్తము అవయవవాచి. (194) (సుగమ.165)

తురగోత్తమశబ్దము మహద్వివక్షలో తురగోత్తముఁడు అని యైనది. ఇది యవయవివాచి. సర్వ., ఘం. వ్యాఖ్య లిట్ల పేర్కొన్నవి. తురగోత్తము(ని)యొక్క వాలము – తురగోత్తమువాల మని యైనది.

పైలక్ష్యములు రెండును సరి యైనవి కా వని సుబో. ప్రతిపాదించినది. 'తెల్లతుర

గోత్తమువాలంబు' అనుటకన్న ఒడలు తెల్లనితురగోత్తమువాలంబు అనుట సరసము గాదు. సంప్రదాయమును గాదు. ఇయ్యెడ ఉల్ల, తెల్లని యనుపాఠాంతర మున్న (194) దన్నది. సుబో. సారస్యముమాట య ట్లుంచి,'ఉల్ల' యనుపాఠాంతరము గలదు గావున నీయది ప్రబల మైనయాధారము గా దని మాత్రము చెప్పవచ్చును. ఆపాఠమును గ్రహించినచో నీసూత్ర మనవసర మనుటలో సుబో. అభిప్రాయ మిదే యనవచ్చును. ఘం. 'ఒడలు తెల్లని యపపాఠము. 'ఉల్ల తెల్లని' సాధుపాఠము. కాన నిది సరి యగులక్ష్యము గా (159) దన్నది. ముద్రితప్రతుల ననుసరించి యిట రెండుపాఠములు గానవచ్చును. అం దొకటి యసాధు వనుటకుఁ బ్రమాణ మేమియో యీవ్యాఖ్య స్పష్టము చేయలేదు.

అంతకు ముందు 'అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు నల్ల గలిగిన' (ఆది. 1. 32) నని యున్నది. తదనుగుణముగా నిట ఒడలు తెల్లనితురగోత్తము వాలంబు నల్ల సేసితి రేని యనుచు అమ్మహాశ్వంబుధవళదేహంబునందు వాలమున నల్ల గలుగునట్లు చేయుఁ దనునర్థమున నీపాఠము సరిపడుచునేయున్నది. కావున ఒడలు తెల్లని యనునది యపపాఠ మని నిర్ణయించుట కాధారము లేదు.

ఇ ట్లని 'ఉల్ల' యనుపాఠము నైన నపపాఠ మని నిర్ణయింపరాదు. శ.ర. ఉల్ల శబ్దము నసలు చూపలేదు. సూ.ని. 'ఉల్ల – నాతిదూరము, నాతిసమీపము కాని స్థలము' అని చెప్పినది. కద్రువ పరోక్షమునం దున్న ఉచ్చైశ్శ్రవమును గూర్చి చెప్పు చున్నది. కావున దానివిషయము తెలియనిసుతులకు నిక్కడికి నాతిదూరమునను, నాతిసమీపములో నున్నగుఱ్ఱముతోక నలుపు చేయు మనుటలో గుఱ్ఱ మెంతో దూరముగా లే దని గుఱ్ఱమును సూచించినట్లు ఉల్లశబ్దము ప్రయుక్త మైన దన్నను నిబ్బంది లేదు.

కావున నిం దేయొక్కదానిని గాని యపపాఠ మని నిర్ణయించుటకు వీలు లేదు. రెండుపాఠము లున్నవి కదా. కావున నీయది ప్రబల మైనయాధారము గా దని మాత్రమే నిర్ణయింపఁదగును.

తత్త్వ. 'ఆలోచింపఁగా నిట తెల్లని అనువిశేషణము తురగోత్తమముతోడనే యన్వయించును. ఒడలునందు+తెల్లని=ఒడలు తెల్లని యనుసప్తమీతత్పురుష సమాసము, విశేష్య మగుతురగోత్తమముతోఁ గర్మధారయ మగును. ఒడలునందుఁ దెలుపు గలతురగోత్తమము అని సమాసమున కర్థము. ఇట్లు సరళముగా సమాసము

సిద్ధించుచుండఁగా నీనూతనమార్గమున సమాసవిధాన మనావశ్యకమును అనుచితమును గూడ నగుచున్న (271) దన్నది. ఈసమన్వయము సరి గాదు. ఒడలునందు అని యస లుండదు. ఒడలుశబ్ద మౌపవిభక్తికము గావున ఒడలియందు అని యుండును. అట్టియెడల ఒడలితెల్లని అని కావలె. ఒడలుతెల్లని అని కాదు. ఒడలునందు+తెల్లని=ఒడలుతెల్లని అని చూపుటయు సరి కాదు.ఒడలియందు తెల్లన యనియో లేక తెల్ల యనియో చూపవలెను. తెల్ల అనుశబ్దమునకుఁ గర్మధారయము నందుఁ గావలసిననిగాగమమును (విడిగా నుండఁగా) జేసిచూపుట సంప్రదాయము కాదు. ఆపక్షమునందు ఒడలితెల్ల యనియు, ఒడలితెల్లన యనియో కావలెను గాని ఒడలుతెల్లని యని కానేరదు. ఇట విశేష్యము 'తురగోత్తమము' కాదు. 'తురగోత్త ముఁడు' అని చూపవలె నని యింతకు ముందు స్పష్టము.

ఒడలు తెల్ల యనుదానికి తురగోత్తమశబ్దముతో సమాస మగుట యొప్పునా? ఒడలితెల్ల యైనతురగోత్తముఁ డనునర్థము సరిపడుట యెట్లు?

కావున నీసమన్వయము సరి గాదు. ఒడలితురగోత్తముఁ డనుచో 'ఒడలు' అనునది వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడిన దనుట స్పష్టము.

ఇట సర్వ. 'తెల్లని మున్నగుపదములు ఒడలు మున్నగుపదముతో నన్వయించు చున్నట్లే మీఁదివిశేష్యముతో నన్వయించుచున్నవి. ఒడలు అన్నపుడు ఒడలుచేత అని యర్థము. ఒడలుచేత తెల్లని అనునది, ప్రత్యయము లోపింపగా, 'ఒడలు తెల్లని' అని యగును. అది పూర్వభాగముగా వ్యవహరించి తురగోత్తమువాలంబు అనునుత్తరభాగముతో సమసించుచున్న (197) దన్నది. ఇంతకు ముందు ఒడలునందు అనుతత్త్వ. చూపినదానివంటిదే యీ 'ఒడలుచేత' కూడ. కాఁగా ఇది సరి గాదు. ప్రత్యయము లోపించిన దనుటకు నాధార మేమియో స్పష్టము చేయలేదు. ఈసమన్వయమే లక్ష్యాంతరమున తత్త్వ. పేర్కొన్నది. మీన్నొల వల్చు అనువిశేషణము జాలరిదానికే యన్వయించును. తనువునందు (చేత) మీన్నొలవల్చు తనువు - మీన్నొలవల్చు అనుతత్పురుషము జాలరిది యనుదానికి విశేషణ మగుచు గర్మధారయ మగుచున్నది.(271) తత్త్వ. తత్పురుషసమాస మన్నది కావున విభక్తి లోపించిన దని తలంప నవకాశ మున్నది. సర్వ. అట్లు పేర్కొనలేదు కాని పిదప ఒడలుచేత తెల్ల నయిన మున్నగువిధముగా విగ్రహము చెప్పికొనినయెడల సమంజసముగా నుండు (197) నని తలఁచుటనుబట్టి సమాసముగానే యీవ్యాఖ్య తలఁచె నేమో,

యని యనుమానింపవలెను. ప్రత్యయము లోపింపఁగా 'ఒడలు తెల్లని' యని యగు ననుట సరి కాదు. నిగాగమాంతముగాఁ జూపుట సరి కాదు. 'ఒడలిచేత తెల్ల – ఒడలితెల్ల' అని యేని చేయవలె.

కాని యొడలిచేత తెల్లది యనుటయు సమర్థముగాఁ గానరాదు. ఒడలితెల్లది, ఒడలితెల్ల(ది) యగుతురగోత్తముఁడు. ఒడలితెల్లనితురగోత్తముఁ డనురీతిగా నిద్దానిని సమాసముగా సమన్వయించుటవలన నర్థము సరిచేయునవకాశము గలమాట నిజమే. కాని ఒడలు తెల్లనితురగోత్తముఁ డనురూపము గాదు గదా.

వీనికంటె ఘం. చూపినసమన్వయము సముచితముగా నున్నది.

'తనువునందు మీనుపోల వల్చు జాలరిదాన' అనుచో తనువునందు అనుసప్తమికిఁ బ్రథమ రాఁగా, తనువు మీన్పొల వల్చు జాలరిది అని యగును.(ఘం. 160) (సుగమ. 165) ఇట్లె ఒడలియందు తెల్ల నైనతురగోత్తముఁ డనుచోఁ గూడఁ బ్రథమ యైన దని సమన్వయించుచు ఒడలు తెల్లనితురగోత్తముఁ డనురీతి నుండవచ్చును. కాఁగా నీరెండులక్ష్యములందును సప్తమికిఁ బ్రథమ యైన దనురీతిసమన్వయముతో సూత్రము వ్యర్థ మనవచ్చును.

కాని తనువునందు మీన్పొల వల్చు జాలరిది యనుదానికంటె, మీన్పొల వల్చు తనువు గలజాలరిది యనియు, ఒడలియందు తెల్ల గలతురగోత్తమువాల మనుదానికంటె తెల్ల నైనయొడలు గలతురగోత్తమునివాల మనియు, సూత్రకర్త చూపినసమన్వయము సూటిగా నున్నది. అట్టియన్వయమే యంగీకరింపఁదగును.

అయినను నీవిధానము వ్యర్థ మని సర్వ. తలఁచినది. పరువు చాలనిపని, సిగ్గు లేనిమనుష్యులు మున్నగుచోట్ల నున్నట్లే? నడుమ నున్నధాతుజవిశేషణము పూర్వపదముతోను (ఇది సమాసపూర్వావయువముగా గ్రహింపరాదు.) ఉత్తరపదముతోను గూడ నన్వయము పొందును. అందువలన అవయవావయవి కల్పనము కూడ ఆవశ్యకము కాదు.(197)

పరువు చాలనిపని యిత్యాదులను విశేషముగాఁ జూప నక్కఱ లేదు. ఈయవి 'కర్మాదులకుం బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణములు కర్తతోడం బలె వానితోడ సమసించు' ననుసూత్రముచే సిద్ధించియున్నవి.

పనియందు పరువు చాలదు. మనుష్యులయందు సిగ్గు లేదు. అనుచో రాముఁ

డు వసించినపర్ణశాల (రాముఁడు పర్ణశాలయందు వసించెను) యన్నట్లుగా పరువు చాలనిపని, సిగ్గు లేనిమనుష్యు లనురీతి సమాసములు గుదురుపడుచున్నవి. ప్రస్తుతస్థలమునం దెట్లు? తనువు మీన్పొలవల్చు జాలరిది యనుచో జాలరిదాని తనువునందు మీన్పొలవల్చును అనియుండునా? ఇట నధికరణార్థమునకుఁ బ్రాధాన్యము వివక్షించిన 'మీన్పొల వల్చుతనువు' అని కావలెను. వల్చుజాలరిది యనుట కాసమాస మెట్లు? కావున గుణవాచకములకు ధాతుజవిశేషణములకును జరిగినయీసమాసము విశేషస్థలముగానే గుర్తింపవలెను.

అవయవావయవికల్పనము సరి కా దనుటకు సర్వ. చేసినవివరణము సముచితముగా లేదు.

అవయవావయవిభావసంబంధము లక్ష్యములందు లే దనియు శరీరశరీరిభావ మన్న సరిపడు ననియు తత్త్వ.(270) పేర్కొన్నది. ఘం. సూత్రమునందలియవయవ శబ్దము శరీరవాచక మనఁదగును. 'అంగః ప్రతీకో ఽవయవో ఽపఘనో ఽథ కళేబరం గోత్రం వపు స్సంహననం శరీరం వర్ష్మ విగ్రహః. అమరము.(160) అని సమన్వయించినది. ఇది సమంజసమే కదా.

ఇటఁ దత్త్వ. యింకను గొంత చర్చించినది.

విశేషణము లగునీపదములకును నవయవివాచకములకును బరస్పరాన్వయము లేనందున సార్థ్యము లేదు. అందుచే వీనికి సమాసము ప్రాప్తింపనందున విధింపఁ బడె నని యూహింపవలయును (269). ఇది కొంత సమంజసమే యనవచ్చును. సూత్రకర్త యీవిశేషణముల కవయవవాచకములే విశేష్యము లని చెప్పి తెల్ల నైన యొడలు గలతురగోత్తముఁ డని యన్వయము చేసెను. ఇట్టియన్వయమునకై యీరీతిసమాసము విధింపవలెనా?

మీన్పొలవల్చు జాలరిది, తెల్లనితురగోత్తముఁడు అనుచో నవయవియే విశేష్య మని సమాసము చేయుదము. ఇవి సమాసములు. తనువు, ఒడలు అనుపూర్వ ప్రయుక్తములు ప్రథమాంతములు గదా. వీని కన్వయ మెట్లు? ఇట్టిదే యనఁ దగినయన్వయవిశేషమును సూత్రకర్త స్థలాంతరమున నిరూపించెను. 'కొన్నియెడల సిద్ధసమాసమధ్యగతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడి' (సమా. 35) అని రూపవిలాససంపదన్ వంచితపంచబాణుఁ డనుచో సిద్ధసమాసగత మైన వంచితశబ్దముతో రూపవిలాససంపదన్ అనుభిన్నపదమున కన్వయము.

రూపవిలాససంపదచేత వంచింపఁబడినపంచబాణుఁడు గలవాఁ డని యర్థము. అదే తీరుగా నిట సయితము తనువు మీన్వ్రాలవల్చుజాలరిది యనుచో 'మీన్వ్రాలవల్చు' అనువిశేషణముతోఁ దను వనునది యన్వయించుట కభ్యంతరము గలదా? తనువున మీన్వ్రాలవల్చునది యైనజాలరిది యనురీతిగా నన్వయింపఁదగును గదా. ఘం. పేర్కొన్నట్లుగా నిట సప్తమికిఁ బ్రథమ యైన దందమా? ఇట్లె ఒడలు తెల్లనితురగోత్తము వాలం బనుచోఁ గూడ ఒడలియందు తెల్ల నైనతురగోత్తముఁ డనురీతిగా ఒడలు అనుప్రథమాంతభిన్నపదము తెల్లనితురగోత్తమువాలంబు అనుసమాసమందలి తెల్ల అనుదానితో నన్వయము గల్గియుండవచ్చును.

కాఁగా సమాస. 35 సూత్రము సిద్ధసమాసమధ్యగతపదము లనక, సమాస మధ్యగతపదంబుల కని సామాన్యముగాఁ జెప్పి మిశ్రాచ్ఛికసమాసములయందు నట్టియన్వయము నంగీకరించి(అంగీకరింపవలె నని యిట స్పష్టముగాఁ గలదు)నచో నీవిధానము చేయవలసినయవసరము లే దని నిశ్చయింపనవును. కావున నపు డీసూత్ర మనావశ్యకము.

తత్త్వ. అభిప్రాయ మిం కొకటి. ఈసందర్భమున నవయవవాచకపదమునకును దానివిశేషణమునకును సమాసము లేక వ్యస్తముగానే ముందువెనుకలుగా నుండుటయా యని సందేహింపవలసియున్నది. ఒడలు, తెల్లని అనుపదములు వ్యస్తములే యన్నచో విశేషణ మగుతెల్లని అనుపదము పూర్వమున నుండక యుత్తర పదముగా నుండుట కుదురదు. (269). ఈవివరణము పొరపాటు. ఒడలు తెల్లనితుర గోత్తముఁ డనునది మొత్తము వ్యస్తముగా నున్న దని యభిప్రాయము. తెల్ల అను విశేషణము, తురగోత్తముఁ డను పయియవయవివాచకముతో సమసించిన దనక తప్పదు. అట్లు సమాసము నందనిచో దానికి నిగాగమ మవుట లక్షణవిరుద్ధము. సామాసిక మైననిగాగమ ముత్తరపదపరకతలో వచ్చుచుండఁగా 'తెల్లని' అనునది విశేషణము, వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడిన దనుట కేవల మసంగతము కదా.

ఇంకను నీయవి వ్యస్తములుగాఁ బ్రయోగింపఁబడిన వని యూహించుచునే 'తెల్లని' ఉత్తరపద మనుట సంప్రదాయమున కనుగుణము కాదు. ఉత్తరపద మనునది సమాసచరమావయవ మనునర్థమున శాస్త్రమున రూఢ మైయుండఁగాఁ బరముగాఁ బ్రయుక్త మైన దనునర్థమునఁ బ్రయోగించుట యుక్తమా?

2. 'విశేషణ మెప్పుడును విశేష్యమునకు ముందుగనే ప్రయోగింపవలె' ననరాదు. విశేషణము విశేష్యమునకుఁ బిదపఁ బ్రయోగింపఁబడుట ప్రసిద్ధమే. 'భవజ్జనకుఁ బరీక్షితున్ .....అతిదాంతు' మొ.

ఇంక తెల్లని అనుచోట నిగాగమమునుబట్టి యిది వ్యస్తముగాఁ బ్రయోగింపఁ బడలే దని నిర్ణయింపఁదగును.

3. 'ఒక్కొకచో విశేషణవిశేష్యములు వ్యత్యస్తంబులు నగు' ననుసూత్రముచే వ్యత్యాసము వచ్చె ననుటకు వలనుపడదు. ఆసూత్రముచే వచ్చెడివ్యత్యాసము నివర్ణకాంతవిశేషణములకును, ధాతుజవిశేషణములకును సంభవింపదు (తత్త్వ. 269)

నివర్ణకాంతవిశేషణము లనఁగా గుణవాచకము లని యీవ్యాఖ్యయభిప్రాయము. నివర్ణకాంత మనుట సరి కాదు. ఇది యాగమము. ప్రౌఢవ్యాకర్తయు నిగాగమ మనియే పేర్కొనె. (సమా. 13) సమాసమునందు వచ్చెడియాగమము గావున తెల్లని యిత్యాదిగా వ్యస్తముగా నిలిచియుండదు. కాఁగా నిగాగమాంతవిశేషణము లన్నను సమాసమునఁ బూర్వపద మై, నిగాగమమును బొందినగుణవాచక మనుతీరుగా నర్థమును జెప్పవలయును. (చూ. శబ్ద. 9)

4. ఒడలు అనుపదము తురగోత్తము అనువిశేష్యముతో నన్వయింపవలయు నన్నచో యథాస్థితముగా నన్వయింపదు. ఒడలు అనుపదమునకు ఒడలు గల అనునర్థము రావలెను. అట్టియర్థము వచ్చుట సమాసముననే సంభవించుటంజేసి సమాసమే యనవలయును. (తత్త్వ. 269)

విశేష్యము 'తురగోత్తము' అనుట సరి కాదు. తురగోత్తముఁ డనుట యొప్పు. తురగోత్తముఁ డన్నది ఇట విశేష్య మనుట సరి కాదు. తెల్ల అనువిశేషణముయొక్క విశేష్యము అవయవ మగు'ఒడలు' శబ్దమే కాని యవయవి (తురగోత్తముఁడు) కాదు. అవయవియే విశేష్య మైనచో విశేషముగా సమాసవిధాన మేల? కాఁగా తెల్ల యనువిశేషణము విశేష్య మగునవయవముతో సమసింపదగియుండఁగా విశేష్యము గాని యవయవి(తురగోత్తముఁడు)తో సమసించుట విశేషము కావున నిట 'నవయవితో సమసించెడి' నని సమాసము విశేషముగా విధింపఁబడినది. మొత్తముమీఁద నవయవవాచకమే విశేష్య మని సూత్రమును స్పష్టముగాఁ బేర్కొనుచుండుటంజేసి తెల్ల యనువిశేషణము తురగోత్తముఁ డనునవయవితో

సమసించినను దానితోఁ గాక తెల్ల నైనయొడ లని యవయవముతోనే యన్వయించును. ఇంక నిది తురగోత్తముఁ డనుదానితో నన్వయించుట యె ట్లని ప్రశ్నము.

రాముఁడు చంపినరావణుఁడు. అనుచో చంపిన యనువిశేషణము రాముఁ డనుకర్తతోనే యన్వయించి, యాపిదప మొత్తమును రావణశబ్దముతో నె ట్లన్వయించునో అదే విధముగా నిట గ్రహింపఁదగును స్పష్టతకై ఒడలు గలతురగోత్తముఁ డని చెప్పఁబడిన దని గుర్తింపఁదగును. ఇంక నీవ్యాఖ్య చూపిన సమాసవిధానములోనియసామంజస్యమును గమనించితిమి కదా.

రాముఁడు చంపినరావణుఁ డనుచో చంపిన యనుధాతుజవిశేషణము కర్మవాచి రావణశబ్దముతో సమసించి, వ్యస్తముగా నున్నరామశబ్దముతోనే యన్వయించుట స్మరింపఁదగును.

5. ఒడలు తెల్లని యనునది విశేష్యపూర్వపదకర్మధారయ మన్నచో తెల్లని యనుపదము సమాసగతమే యగుటచే నిది యంతయు సమాసమే యనవలయును (270). అని విశేష్యపూర్వపదకర్మధారయముగాఁ జెప్ప నక్కఱ లేదు. ఇట్టివిశేష్యపూర్వ పదము లెచ్చటను గానరావు కూడ. తెల్లని యన్నది ప్రత్యేకపద మనునభిప్రాయ మిందును వ్యక్త మగుచున్నది. అది సరి కాదు. వ్యస్తముగా నున్నను విశేష్యముతో నన్వయించుట కిబ్బంది లే దని తాత్పర్యము. ఈవ్యాఖ్య తనువు మీన్పొలవల్చు జాలరిది యనుతరువాతిలక్ష్యమును గూడ విశేష్యపూర్వపదముగా సమన్వయింపఁ బూనినది(270). సూత్రకర్త చూపినలక్ష్యమును సమన్వయించుట కింతశ్రమ యనవసరము. సూత్రకర్త వీనిని విశేష్యపూర్వపదము లని తలంచియున్న నీసూత్ర మేల? 'తమ్మఁగుఱ్ఱలు..' అనుసూత్ర మున్నది కదా. అందుకే యీవ్యాఖ్య తరువాత–

6. 'ఇ ట్లంతయు సమాసమే యని తలంపనిచో ఒడలు అనుపదము వ్యస్తముగా నున్నను ఒడలు గల అనునర్థమును లక్షణచే బోధించుచు తెల్లనితురగోత్తము అను అనుసమాసములోని కన్వయింపవలయును. అపుడు ఒడలు అనుపదమునకు విశేష్యము ననుసరించి షష్ఠీవిభక్తియే రావలసియున్నను ప్రథమ వచ్చె నని భావింపవలయును. విశేష్య మేవిభక్తిలో నున్నను ఇయ్యది మాత్రము ప్రథమాంతము గనే యుండు ననియుఁ దలంపవలయు (270) నన్నది. వ్యస్తముగా నున్న ఒడలు

అనునది విశేష్యముతో సమన్వయింప దనునుద్దేశ్యముతోనే యీవ్యాఖ్య యింత చర్చించిన టీవివరణమువలన స్పష్ట మగుచున్నది. అ ట్లన్వయించు నని యింతకు మున్ను స్పష్ట మైనది. ఒడలు గల అనునర్థమును బోధించుచు, తెల్లని తురగోత్తముఁ డనుసమాసముతో నన్వయించు ననుట సరి కాదు. ఒడలు గల తెల్లనితురగోత్తముఁ డనునర్థ మేమి? శరీర మున్నతెల్లగుఱ్ఱ మనియా? ఇ ట్లన్వయిపనిచో శరీరము లేని తెల్లగుఱ్ఱ మని యర్థము రాదు గదా.

తెల్లనియొడలు గలతురగోత్తముఁ డనుసూత్రకర్త చూపినయర్థము సిద్ధింపవలె నన్న ఒడలు అనుదానితో తెల్ల యనువిశేషణమునకే యన్వయ ముండవలెను. కాని తెల్లనితురగోత్తముఁ డనుమొత్తము సమాసమునకుఁ గాదు. పైఁగా విశేష్యమును బట్టి యొడలు శబ్దము షష్ఠ్యంతము గావలె ననుటయు సరి కాదు. షష్ఠ్యంతము తురగోత్తముయొక్క యనునది. దానింబట్టి యొడలుశబ్దమునకు షష్ఠి రావలె నన్న ఒడలు అనునది తురగోత్తముయొక్క అనుదానికి విశేషణ మగునా? ఒడలియొక్క యనునది తురగోత్తముయొక్క యనుదాని నన్వయించుచో లక్షణ నాశ్రయించి ఒడలు అనుదానికి ఒడలు గల యని యర్థము చేయవలసినయవసర మున్నదా? ఒడలు గలదానియొక్క గుఱ్ఱముయొక్క యని యన్వయింపవలయునా?

అసలు తురగోత్తముయొక్క విశేష్య మగుటయు నొడలు విశేషణ మగుటయు నెట్లు? తెల్ల యనునది యేమి? విశేష్యమా? ఒడలు తెల్ల యనునవి రెండు విశేషణములా? తెల్ల యనుగుణవాచకము విశేషణ మనియు ఒడలు అనుఅవయవ వాచకము దానివిశేష్య మనియు, సూత్రకర్త చెప్పినయభిప్రాయ మీవివరణమునఁ దిరోహిత మైనది.

7. రెండవయుదాహరణమున విశేష్యము సంబోధనాంతముగ నున్నను తనువు ప్రథమాంతముగనే యున్నది కదా. (271)

లేనిచో తనువా! యిని యిదియును సంబోధనాంత మయియుండవలె నని యీవ్యాఖ్య యభిప్రాయమా? ఆలక్ష్యపద్యమును వ్యాఖ్య గమనింపలేదా? 'తనువు మీన్వొలవల్చు జాలరిదాన, నట్లు గాక' యనుచో 'నేను జాలరిదానను' అనురీతిగా మత్స్యగంధి తన్నుఁ గూర్చి చెప్పుకొనుచున్నది. కావున నీయది యస్మద్విశేషణము ప్రథమాంతమే. కాని సంబోధనాంతము కాదు.

ఇ ట్లీవ్యాఖ్య యిటఁ జేసినచర్చ యంతయు ననవసర మవుటయే కాక సూత్రకర్త యభిప్రాయమునకు విరుద్ధము నైయున్నది.

మొత్తముమీఁద సూత్రకర్త చెప్పినవివాదాస్పద మగునీలక్షణమునకుఁ బ్రయోగము లధికముగా లే వనవచ్చును. ఉన్నస్థలములయందును నన్వయ విశేషమును సమాస. 35 సూత్ర మాధారముగా గుర్తింపఁదగియేయున్నది.

కావున నీలక్షణము ప్రయోజనవంతము గా దని యీలక్ష్యములనుబట్టి నిర్ణయించుట దోషము గాదు.

## తచ్ఛబ్దవలోపము

**9. అట్టియిట్టియెట్టివిశేషణంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు.**

అట్టి, ఇట్టి, ఎట్టి యనువిశేషణములపై నున్నతచ్ఛబ్దమునందలి'వా' యనునక్షరమునకు వికల్పముగా లోపము వచ్చు నని సూత్రకర్త యభిప్రాయము. అట్టివాఁడు – అట్టిఁడు మొద లగునవి లక్ష్యములు.

తత్త్వ. ఇటఁ దచ్ఛబ్ద మనఁగాఁ బ్రాతిపదికమునే గ్రహింపవలెను. వాఁడు మున్నగుపదమును గ్రహింపరాదు. అ ట్లయినచో వానివలన మున్నగుపదములలో పంచమీవిభక్తిసంబంధి యగువకారమునకును లోపము రావలసివచ్చును. కావునఁ బ్రాతిపదికవకారమునకే యీసూత్రము లోపము విధించె నని భావింపఁదగు (261) నన్నది.

తచ్ఛబ్దవకార మనఁగాఁ బ్రాతిపదికయందలివకార మనియే యర్థము. దానిని విశేషముగాఁ జెప్ప నక్కఱ లేదు. సూత్రమునందలితచ్ఛబ్దముచే సుబో. 'వాఁడు, వారు అనుప్రథమాంతము లగుశబ్దములను గ్రహించుటచే నయ్యది సరి కా దని సూచించుటకే తత్త్వ. బహుశః ఇట్లు పేర్కొనియుండవచ్చును. లక్ష్యములనుబట్టి సుబో. వాఁడు, వారు అనువానిం జూపియుండవచ్చును. ప్రథమైకవచనాంత మగు తచ్ఛబ్ద మనురీతి కదా వ్యవహారము. కాఁగాఁ దచ్ఛబ్దవకార మనఁగాఁ బ్రాతిపది కావయవమునే గ్రహింపవలెను. సర్వ. దీనిని విమర్శించుట యసమంజసము. తత్త్వ. 'ప్రాతిపదికావయవ మగువకారమునకు లోపము చెప్పినది కాని ఆకారము

నకుఁ గాదు. ఇంక సర్వ. వానివలన అని యున్నపుడు ప్రథమాక్షరమునందలి వకారమునకు లోపము రా దని చెప్పుట వ్యాఖ్యాతలయభిప్రాయ మేమో. అపుడును వచ్చుట కవకాశము లేనేలేదు. కావున దానిని గూడఁ బేర్కొనవలసినయవసరము కానరాదు (187) అనుటయు సరి కాదు. పంచమీవిభక్తిప్రత్యయసంబంధి యగు వకారమున కని చెప్పుచుండఁగాఁ బ్రథమాక్షరమందలివకారమునకు లోప మని యర్థము చేయు టెట్లు? ఇంక వలనలో వకారము లోపింప దనుటచే వానివలన ననుచోటిప్రథమాక్షరమునందలివకారమునకు లోపము వచ్చు ననియే యర్థ మగు చున్నది.

వానివలన ననుచోఁ బ్రథమాక్షరమునందలివకారమునకు లోపము లేనేలేదు. కావునఁ జెప్ప నక్కఱ లే దనుట కాధార మేమి?సుబో. కూడ 'వకారాది యై ప్రథమావిభక్త్యంత మైయుండురూపమునే గ్రహింపవలయు (187) నని చెప్పినది. బాల.లో సయితము ప్రథమాంతమునే గ్రహింపవలయు నని చెప్పుట నిరాధారము. కాఁగాఁ బ్రకృతసూత్రముచే నట్టివాఁడు, వారు శబ్దములమొదటిహల్లు వకార వ్యంజనము లోపించినపిదప (వ్యా.సం.స.805) అని వఝలవా రిట్లు చెప్పుట కానవచ్చును. కాని ధాతుజవిశేషణములపైఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తము కాఁగా వచ్చినవానిని, వచ్చినవానిచేత నిత్యాదు లెల్ల నగును. వాఁడు, వారు అనుప్రయుక్తము లనుట సరి కాదు. అట ననుప్రయుక్త మైనస్థలములం దెల్లవిభక్తులును గ్రహింపఁ బడుచుండఁగా నిటఁ దచ్ఛబ్దవకారము లోపించుసందర్భమునఁ బ్రథమాంతమే గ్రహింపవలయు ననుట యెట్లు గుదురును?

కాని ద్వితీయాదివిభక్తులందు లోపము గానిరానిమాట వాస్తవమే. వచ్చినానిని, వచ్చినానిచేత నిత్యాదిరూపములు లే వనుట నిశ్చయమే. అట్టియెడల వచ్చినవానిని, వచ్చినవానిచేత ననురీతిరూపములే యున్నవి. కాని ప్రథమావిభక్తియందే వకారము లోపించు నని చెప్పుటకు సూత్రమునం దెట్టియాధారమును లే దనుటయు నిశ్చయమే. అందుకై 'ప్రథమాంతం బగు' ననుదళమును సూత్రమున నిలుపవలసియే యున్న దనవలె. కాని బాల.కాని, ప్రౌఢ. కాని యీయంశమును స్పష్టము చేయలేదు.

విభాష యనుపదమునకుఁ బ్రథమేతరవిభక్తులం దీకార్యము లే దని వ్యవస్థ చేసికొనవలసినదే. కాని తచ్ఛబ్దము అనుదానిచేతఁ బ్రథమాంతములు మాత్రమే గ్రహింపఁబడు ననుట మాత్రము సరి కాదు. వఝలవా రనుసరించినప్రక్రియా

విధానము వేఱు. అయ్యది గ్రంథాంతరమునఁ బరామర్శింపఁబడును. సర్వ. విధానము మాత్రము సరి కా దని పైవివరణమువలన స్పష్టము. ద్వితీయాది విభక్తులలో వలోప మగుట కవకాశము లే దని నిశ్చయించిన సర్వ. విభాషాపదము చేతనే నిషేధము సూచిత మగుచున్న (189) దనుట గమనింపఁదగును. అట్టియెడలఁ 'దచ్ఛబ్ద మనఁగా వాఁడు, అది, వారు అని యర్థము'. అని ప్రథమాంతములనే చూపుట సరి కాదు కదా (187).

'తనవర్ణకంబు పరం బగునపుడు తచ్ఛబ్దార్థమునకు లోపము' చెప్పఁగా నట ఆఁకొన్నవానితనము అనుస్థలమున 'వాని' అనుశబ్దము మొత్తము లోపించినది. అటఁ దచ్ఛబ్దార్థ మనఁగాఁ బ్రథమాంతమే యనియర్థము చేయలేదు. తచ్ఛబ్దార్థకము, తచ్ఛబ్దమును భిన్నము లనవలయునా? సర్వ. (282) అటఁ బ్రథమాంతమే యని వ్యాఖ్య చేయుట సరి కాదు. కావున నీవ్యాఖ్య ననుసరించి రెండుచోట్ల రెండు విధములుగా నర్థము చెప్పుట సరి కాదు. కావుననే తత్త్వ. వానివలన అనుచోఁ గూడఁ దచ్ఛబ్దవకారమునకు లోప మవు నని తలఁచినది. కాని యది ప్రయోగము లందుఁ గానరాదు. అంగీకార్యము కా దనవలెనే కాని, లక్షణముచే నవకాశమే లే దని స్పష్టముగా నిర్ణయింపరాదు. ప్రస్తుతస్థలమునందును 'అట్టిని, ఇట్టినిచేత, ఎట్టినికి' ఇత్యాదులు లేవు గదా. ప్రథమాంతం బగుతచ్ఛబ్దం బనురీతిగాఁ బేర్కొనుట యుచితముగా లేదు. కావున విభాషాపదాశ్రయణమే మార్గము.

ఇంక వకారలోపవిధానము సరి కా దనియు వాక్షరలోపము చెప్పఁదగు ననియు వ్యాఖ్యలు భావించుట యుచితముగా నున్నది. 'వాక్షర' అనుదానికంటె తత్త్వ. చూపిన'వాకార' అనుట సూత్రమునకు (వకారము–వాకారము) సన్నిహితము. సూత్రకర్త యట్లె చెప్పె నేమో యని యనుమానించుటకు వీలైనట్టిది. వకారలోప మనుట మాత్రము సరి కాదు. సూరి తచ్ఛబ్దవకారలోపముచే వండఁ గలాఁడను రీతిరూపములు సాధించియుండఁగాఁ దదనుగుణముగా నిటఁ గూడ అట్టాఁడు అనురీతిరూపములే యేర్పడవలెను. కావున లోపము 'వా'కు చెప్పుట యుచితము.

ఇంక వకారలోపవిధానము సరి కా దనియు, ఇట కు.పం. 'ఈయద్విశిష్టవకార లోపము 'కల' మీఁద గూడ గల్గి, ఎఱుక గలఁడు ఇత్యాదిరూపములు సిద్ధించు నని కవిసంశయవిచ్ఛేదకారుఁడును దెల్పియున్నాఁడు. ఎఱుక గలరె మగువ లెందు. భార.ఆది.(106) నన్నది. ఈయభిప్రాయమునే సుబో.(189), సుగమ.(161)

వ్యాఖ్యలు స్వీకరించినవి. ధాతుజవిశేషణములపై నని సామాన్యముగాఁ జెప్పుట యతివ్యాప్తిదోషమునకు హేతు వగుచున్నది. దీనివలన వచ్చువాఁడు, వచ్చెడివాఁడు, వచ్చెడువాఁడు, రానివాఁడు, అనురీతి ధాతుజవిశేషణములందును వాలోప మయి, వచ్చుఁడు ఇత్యాదిరూపము లేర్పడుప్రమాదము గలదు.

వఝలవా రీయభిప్రాయమును దిరస్కరించిరి. ఇవి 'కలరు' మొద లగు కలుగు ధాతువునుండి లడర్థమున నేర్పడినరూపములే కాని కలరె, కలఁడు అనుచో వాలోపము లే దనుట యుక్తమే (బా.స). కలరు ఇత్యాదులలో వాలోపము గల దన్నను కలదు, కలవు అనునమహద్రూపము లెట్లు సిద్ధించును? బాల.క్రియ. 104 సూత్రముచే కలుగునకుఁ గలాదేశమువలన నీరూపము లేర్పడిన వనుట యుక్తము. ఇవి విశేషణరూపములు కాక క్రియాపదము లగుటవలనచేతనే మేము ఎఱుక కలరము, నీవు ఎఱుక గలఁడవు అనురీతిరూపములు లేవు. (వఝలవారి యభిప్రాయమునందును విరోధము లున్నవి. (చూ.బా.స.) (వ్యాసం.స. 803)

కావున అట్టి, ఇట్టి, ఎట్టి అనువానిపై వాలోపమును జెప్పుట యుక్తము. 'ఇట్టియం దొక్కటి' యనుచోఁ దచ్ఛబ్ద మెల్ల లోపించుచున్నది. ఇది ప్రథమేతరవిభక్తివిషయ మవుటయు గమనింపవలసినది. క్రియ. 14–21 సూత్రములసందర్భముననే యిట్టి వానిని సంగ్రహింప నవకాశము గల్పింపఁదగును.

'తెలుఁగున విశేషణంబు లవిభక్తికంబు' లనుటచే నీయట్టివాఁడు, అట్టిఁ డనురీతివి సమాసములుగా గుర్తింపవలెను.

విశేషణంబు లనుటవలన ననుప్రయుక్త మగునట్టిశబ్దముపై నీకార్యము లే దనఁదగునా? వచ్చినట్టిఁడు అనురీతిప్రయోగములు గలవా? 'సేసలు చల్లినయట్టి రైరి' యనుచో (ఆది. 4. 17) పెట్టిన యనుధాతుజవిశేషణముపై విభక్తివివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తము కాఁగాఁ బ్రథమాబహువచనమునందు పెట్టిన+వారు అని యవును. 'ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టియనుపదంబు విభాష ననుప్రయుక్తం బగు' ననుదానిచే నట్టిశబ్ద మిట ననుప్రయుక్త మయి, పెట్టిన యట్టివారు అని కాఁగాఁ బ్రస్తుతసూత్ర మాధారముగా, వాలోప మయి, పెట్టినయట్టి రని యైనది. ఇట నట్టిశబ్ద మనుప్రయుక్తమే యగుట స్పష్టము. కాఁగా ననుప్రయుక్త మైనశబ్దము మీఁదఁ గూడ వాలోపము గానవచ్చుటంజేసి యిట సూత్రమున

విశేషణంబు లనుట సరి కాదు. అనుప్రయుక్త మయినయట్టి ప్రత్యేకముగా విశేషణ మనఁదగదు.

'అట్టి, ఇట్టి, ఎట్టి శబ్దంబులపైఁ బ్రథమాంతం బగుతచ్ఛబ్దంబు వాక్షరంబునకు లోపంబు విభాష నగు' ననుట యుచిత మని తోఁచెడిని.

## ఈ – సూచనార్థము

### 11. సమాసఘటితం బీశబ్దం బొక్కచో సూచనార్థకం బగు.

ఇదమర్థక మైన'ఈ'శబ్దము సమాసమునం దుండి, యొక్కచో సూచనార్థక మగు నని యర్థము.

'ఈయున్నపౌష్యపాలికి' అనుచో 'ఈ' అనుదానికి ఇదిగో నున్న యని యర్థ మని సూత్రకర్తయే వివరించెను.

సుబో. ఈయున్న అనుచో సమీపార్థమే తోఁచుచున్నది. ఆయర్థమే ప్రసిద్ధ (191) మన్నది. సూత్ర మిది వ్యర్థ మని భావము. సర్వ. ఆ అనుసర్వనామము దూరమును, ఈ యనునది సామీప్యమును ఏ యనునది ప్రశ్నమును సూచించును. పైప్రయోగమునందు ఈ–ఇక్కడ నున్న యనునర్థమునే యిచ్చుచున్నది. అర్థమునుబట్టి యిక్కడ విశేష మేమియు లే దని చెప్పి, యీసమాసమును గూర్చి వివరించి, సమాస మగుటలోను విశేషము లేదు గావున సూత్ర మనావశ్యక (208) మన్నది. ప్రస్తుతసూత్రము సమాస మగుటను గూర్చి పేర్కొనునది కాదు. కావున నావిషయ మును జర్చింపఁ బనిలేదు. అర్థమును గూర్చి మాత్రమే సూత్రము పేర్కొనుచున్నది.

ఈయున్న యనుచో నీశబ్దము సమీపార్థమును మాత్రమే బోధించుచున్నది కావున నర్థమునందును విశేషము లేదు. కావున సూత్ర మనావశ్యక మని వ్యాఖ్యల యభిప్రాయము.

ఈపద్యమునందుఁ గేవలము సమీపార్థము మాత్రమే యుద్దేశింపఁబడిన దనుట యుక్తము గా దేమో యనిపించుచున్నది. 'ఈయున్నపౌష్యపాలికిఁ బోయి' ఇక్కడ – ఈసమీపమునం దని సమీపార్థమునే కాక, ఇదిగో ఇక్కడే యనురీతిగా నాస్థానమును నిర్దేశించి చూపునదిగా నున్నది.

సమీపమునం దున్నపౌష్యునిపాలికిఁ బోయి, చాల దూరము పోయిన ట్లిన్నాళ్లేల మసలితి వనుటకంటె, ఇక్కడనే కనఁబడుచున్నంతదగ్గఱలో నున్న యని యావస్తువును సూచించుటయే యర్థవంతము. కాఁగా నిట నీశబ్దము సామీప్యమునే కాక ఆవస్తువుయొక్క ఉనికిపట్టును సూచించుచున్న దనుట సమంజసము గదా.

ఆ–దూరమును, ఈ–సమీపమును ఏ–ప్రశ్నమును దెల్పు ననుట కేది యాధారమో తెలియదు. (సర్వ.162) ఆ–తదర్థకము, ఈ–ఇదమాద్యర్థక మను రీతిగా సంస్కృతమందలితదాదులయర్థమందే యివి తెలుఁగున లాక్షణికులచేఁ బేర్కొనఁబడినవి.

(ఇదమ్ పురోవర్తిని దృశ్యే చరాచరే) ఈ – దేశ్యము సర్వనామము. ఎదుట నుండుదానిని దెల్పును. ఈతపము(శ.ర.) ఈయున్నపౌష్యపాలికి అనుదానివలెనే యీతప మనునదియు సమాసమే. ఎదుట నున్నసమీపవస్తువు నిది సూచించుచున్నది.

తత్త్వ. ఈయున్న అనుచో ఎ ట్లున్నవాఁడు అనునాకాంక్ష ఉద్భూత మయి నిలిచియుండును. కావున సూచనార్థము మాత్రమే చాలదు. ఇ ట్లున్నపౌష్యపాలికి అనురీతిగా ఉన్న అనుపదమునకు ఈవిధముగాన్ అని యర్థము వచ్చుచున్నది. అదియే యిచ్చట సందర్భానుగుణ (265) మని విశేషార్థమును జెప్పినది. పద్యమును జూచిన ఆకాంక్ష యిట్లుండదు. ఈయున్న అనుచో ఎట్లున్న అనునది యాకాంక్షయుఁ గాదు. ఈవిధముగా నున్న అనునది సమాధానమును గాదు. దూరమా, దగ్గఱా యన్నది చెప్పఁబడవలె. పోయివచ్చుట కగుసమయము గుర్తింపఁబడవలెను. దాని ననుసరించి 'యెట నున్న (ఎంత దూరములో నున్న) అన్నది యాకాంక్ష. పౌష్యుఁ డేవిధముగా నున్నను నిబ్బంది లేదు. పౌష్యునిపాలికిఁ బోయివచ్చుటకు, నిన్నాళ్లు మసలుటకు, నాపౌష్యుఁ డెట నున్నాఁ డన్నదియే ప్రశ్నము. ఈవిధముగా నున్నపౌష్యపాలికిఁ బోయి యిన్నాళ్లేల మసలితి వన్నచో నున్నయర్థమును బోవును. కాఁగా ఉన్న అనుదానికి ఎట నున్న అన్నది యాకాంక్ష. 'ఈ' యన్నది సమాధానము. ఈ యనుదానికి నిదిగో ఇక్కడ నని సూచన మర్థము. ఈశబ్దముయొక్క సూచనమే యనఁగా నావస్తువును నిర్దేశించి చూపుటయే సమాధానము. కావున నాకాంక్షకు సమాధానము ఈశబ్దము యొక్క సూచనార్థమే. కావున నీవిధాన మెంతయు నుచిత మని పైతత్త్వ. చర్చనుబట్టి యాలోచింపఁగా స్పష్ట మగుచున్నది.

సుగమ. తత్త్వ. ప్రభావముతోనే యిదిగో ఈవిధముగాన్ + ఉన్న యనుక్రియా

విశేషణము చెప్పవలయును. లేకున్న ఇదిగో నున్న యనురీతిద్రుతము చేరినరూప ముండ (162) దన్నది. ఈవ్యాఖ్య తత్త్వ. అభిప్రాయము సయితము సరిగా గమనింప లే దని తోఁచుచున్నది.

ఇదిగో నున్న యనుచో ద్రుతమునకై 'ఈవిధముగాన్' అని క్రియావిశేషణము చేరుట యేమో తెలియకున్నది. అట్ల చేరును గాక. ఈవిధముగా నున్న అనుదానినుండి 'యిదిగో నున్న' యని యేర్పడునా? 'ఈనున్న' యని యేని కావలెఁ గాని యిదిగో నున్న యని యగు టెట్లు? ఈనున్న యని మాత్ర మగుట యెట్లు? విధముగా ననునది పోయి ద్రుతము మాత్రమే మిగులునా? ఈయున్నపౌష్యపాలికి నని కదా ప్రయోగము. ఈయున్న యనుదానికి 'నిదిగో నున్న' యనునది యర్థ మని సూత్రకర్త చెప్పుచుండఁగా ఈయున్న యనుచో విధముగాన్ అనునది చేరుట ఇదిగో నున్న యని యగుట కని సమన్వయించుట కేవల మసంగతము.

క్రియావిశేషణ మేల చేరు నన్న (ఇదిగో నున్న) ద్రుతమునకై యని వ్యాఖ్య చెప్పుచున్నది. ద్రుతమునకై చేర్చు టేమి? అర్థముతో నిమిత్తము లేదా? అర్థము సమన్వయింపఁబడ నక్కఱ లేకుండఁగనే శబ్దస్వరూపమును సాధించుట కిట్లు చేర్పవలయు ననుట సంప్రదాయమా?

కావున సుగమ.వ్రాఁత యింకను బ్రమాదభూయిష్ట మని గుర్తింపవలెను.

'ఇదిగో నున్న' అనువివరణవాక్యమందలిద్రుతమును గూర్చి వ్యాఖ్యలు పరామర్శించినవి. కు.పం. 'పింగళి సూరనాదులు ద్రుతాంతముగనే వాడియున్నారు. వరాహపురాణకారాదులు కళగ వాడియున్నా రట (107). అని యిదిగోశబ్దముయొక్క ద్రుతాంతతను బాక్షికముగా సూచించినది. సుబో. శ.ర. ననుసరించి యీయది ద్రుతాంతమే యనుట, సూత్రకర్తమతముగాఁ బేర్కొనుట యుచితముగా నున్నది.

ఇదిగోఁ బురుషాహ్వయము, ఇదిగో దే.ద్ర. అదిగో. దే.ద్ర. అని శ.ర.లో నీసూత్రకర్త వీనిని ద్రుతాంతము లైనయవ్యయములుగాఁ బేర్కొనెను. కు.పం. కూడ నీశ.ర. అనుసరించియే పింగళి సూరనాదులు ద్రుతాంతములుగాఁ బ్రయోగించినా రని చెప్పియుండును.

అదిగో. ఇది కళగాను ద్రుతప్రకృతికముగాను గూడఁ గనఁబడుచున్నది. అదిగో కానఁగఁబడియె. వరా.7.84. సూ.ని. ఇదిగో కళ యవుటకుఁ బ్రయోగము

చూపలేదు. వఝలవారు సూ.ని. అభిప్రాయమునే సమర్థించిరి.(వ్యా.సం.స.309) దీనికి (కళాత్వవిషయమును గూర్చి నిర్ణయించుట య ట్లుంచి) పాక్షికముగా నైన ద్రుతప్రకృతికత్వము గలదు గావున ఇదిగో నున్న అని వివరించుటలో నెట్టిదోషమును లే దని నిర్ణయింపఁదగును.

కాఁగా సర్వ. ఇది కళ యనియు దీనిపై ద్రుతము రా దనియుఁ జెప్పుట (209) సరి కాదు. ఇంక నిరర్థకముగా ద్రుతము చేరిన దని సమన్వయింపఁదగు నన్న దీవ్యాఖ్య. శబ్ద.116 సూత్రముచే నుశబ్దము చేరిన దన్నను నీప్రయోగము దుష్టము గానేరదు. కాని యిట నిరర్థక మగునుశబ్దమును జేర్చి చెప్పవలసినయవరోధ మేమియు లేమి ఇదిగో శబ్దద్రుతాంతతవలనిద్రుతమే యని గ్రహించుటయే యుచితము. శ.ర. కనుగుణము నైయున్నది.

సర్వ. ఈవివరణమునం దిం కొకలోపమును జూపినది. ఇదిగో అన్నరూపముపై ఉన్న అనుధాతుజవిశేషణము చేరుట సాధారణముగా గోచరము కాదు. (209) ఇదిగో నున్న యనునది ప్రత్యేకపదముగాఁ బ్రయుక్త మయిన దని యీవ్యాఖ్య భావించియుండవచ్చు. ఉన్న అనునది 'ఉన్నపౌష్యపాలికిఁ బోయి' యని పద్యమునఁ బ్రయుక్త మయినదే యని గ్రహించుట సూత్రకర్తయభిప్రాయము. ఈఅనుదానికి సూచనార్థమును దెల్పుటయే వివరణముతాత్పర్యము. కావున సమాసగత మైన ఈశబ్దమునకు ఇదిగో ననురీతిగా నర్థము చేయఁగా, మిగిలిన 'యున్నపౌష్యపాలికిఁ బోయి' యనునది సాధారణముగా నన్వయించుట కుదురుచునేయున్నది.

కాఁగా నిదిగో నున్న యనుచో ఉన్న యనునది యచటనుండి మిగిలినలక్ష్య భాగము నంతయు గ్రహించుటకు సంక్షేపముగాఁ జెప్పఁబడిన దనియు నిదిగో అనునది 'ఈ' శబ్దముయొక్క సూచనార్థమును వివరించుటకుఁ జెప్పఁబడిన దనియు గ్రహింపఁదగును.

ఇదిగో ఇక్కడ నున్న పౌష్యపాలికి ననురీతిగాఁ జెప్పిన నింకను స్పష్టముగా నుండెడి దని మాత్రము చెప్పవచ్చును.

ఇంకఁ దత్త్వ. ఈసూత్ర మర్థమును గూర్చి పేర్కొనునదే కావున శబ్దశాస్త్రమునకు సంబంధించియుండమిచే వాక్యపరిచ్ఛేదమునందుఁ జెప్పుట యుచితము (265) గాఁ బేర్కొన్నది.

ఇట్లు నిర్ణయింప నక్కఱ లే దని తోఁచుచున్నది. ఈశబ్దము సూచనార్థక మవుట సమాసఘటిత మవునపుడే కదా. ఈయర్థము సమాసమునందే కావున సమాస పరిచ్ఛేదములోఁ జెప్పుటలో దోషము లేదు.

ఇంతకు ముందు చెప్పినముయ్యేడ్వాదిసూత్రమున ఇదమదఏతత్ సూత్రముప్రసక్తి యైనది కావునఁ దదనుసారముగా ఇదర్థక మైన ఈశబ్దముయొక్క యర్థమును గూర్చినప్రసంగించుట సందర్భానుసారముగా నుచితమే యనియు గ్రహింపవచ్చును. సూరి తత్సమపరిచ్ఛేదమున సందర్భానుసారము 'వికృతియం దికారాంతముల' యనురీతిగా నాచ్ఛికశబ్దములను గూర్చి పేర్కొనలేదా?

ఈవ్యాఖ్యయే గుణవాచకంబు (సమా. 14) అనుసూత్రము సమాసవిషయకము గాకున్నను బ్రాసంగికముగాఁ జెప్పఁబడె నని (266) పేర్కొనుట యిట గమనింపఁ దగును. ఇది యట్టిదే యననగును. అర్థసంబంధి యైనను సమాసమునందే యగుట యన్నది గుర్తింపవలసినయంశమే.

ఈయర్థము సమాసమునందే యనుసూత్రకర్తయభిప్రాయము నీవ్యాఖ్య యంగీ కరించినది. కావున నింత చర్చయు. కాని ఈశబ్దము సమాసఘటితము గాకున్నను సూచనార్థక మగుట కలదు. ఇది చూచితివా? యనుచో ఇది ఈశబ్దము ప్రథమాంత అమహద్రూపము (వ్యస్తము). సూచనార్థముతో నున్నదే కదా. వీఁడె ద్రోణుఁ డిత్యాదులలోను నిట్టిస్థితి గమనింపవచ్చును.

శ.ర.లోను సమాసమే చూపుటచే సమాసమందే సూచనార్థక మగు నని సూత్రకర్త తలఁచె నేమో. కాని వ్యస్తతయందును నియ్యది సూచనార్థక మగుట ప్రసిద్ధమే. ఆ అనునదియు నిట్లు. కాఁగా నీయంశమును సమాసమునందే యని చెప్పవలసినయవసరము లేదు. కాఁగా నీసూత్రము వ్యర్థము. కావున నీపరిచ్ఛేదము నందే కాక వాక్యపరిచ్ఛేదమునందు సైతము చెప్పవలసినయవసరము లే దని నిర్ణయింపఁదగును.

## ధ్వన్యనుకరణశబ్దములు - నిగాగమము

**12. ధ్వన్యనుకరణశబ్దంబులు కొన్నింటి కిందు నిగాగమం బగు.**

ఈకర్మధారయసమాసమునందుఁ గొన్ని ధ్వన్యనుకరణశబ్దములకు నిగాగమము వచ్చు నని యర్థము. గనగననినిప్పులు.

కొన్నింటికి ననునది విశేషణ మనియు, ధ్వన్యనుకరణశబ్దంబు లనునది విశేష్య మనియు స్పష్టము. సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులం దెయ్యది (బాల.కార. 26) యనుసూత్రముచే ముందు ప్రయుక్త మైనవిశేష్యమునకుఁ బ్రథమ యైన దని కు.పం. (107) పేర్కొనుట యుచితముగా నున్నది.

ఇట సర్వ. 'నిప్పులయొక్క కాంతిని దెలుపుపదము గనగన యనునది. దీనికి నిగాగమము కలిగి, తరువాత పదముతో సమసించు (190) నని పేర్కొనుట సరి కాదు. కర్మధారయసమాసమునందు నిగాగమ మగు నని సూత్రకర్త పేర్కొనుచుండఁ గా (అని గుర్తించియు) ముందుగా నిగాగమమును జేసి, గనగనని యని యైనపిదపఁ దరువాతిపదముతో సమసించు ననుట సక్రమము గాదు. ముందు సమాసము కాఁగా నాపిదప నిగాగమ మయిన దని పేర్కొనుట యుచితము.

ఈసూత్రము సమాసమును జెప్పునది కాదు. కాఁగా నీధ్వన్యనుకరణశబ్దములు స్త్రీసమములు గావునఁ 'గర్మధారయంబు త్రికస్త్రీసమ..' మున్నగులక్షణముచేఁ గర్మధారయసమాసమునందు నని గ్రహింపఁదగును.

బాల.సమా. 12 సూత్రముచే గుణవచనము లగునల్లాదులకు నిగాగమమును జెప్పినది. 'గనగన' మొద లగుధ్వన్యనుకరణములును కాంత్యాదిగుణములకు స్ఫోరకము లవుటంజేసి గుణవాచకములుగానే సమన్వయింపఁదగును. అపుడు బాల.చేతనే యిట నిగాగమము సిద్ధించును. వీనికి నిగాగమ మదంతములపయినే గానవచ్చుట గమనింపఁదగును. సూరిలక్షణమున నల్లాదులలో నీధ్వన్యనుకరణ శబ్దములు చేర్చుకొని నిగాగమమును సాధించుకొనుటలో దొసఁగు లేదు.

కాని సూరి యట్టి వుదాహరింపమిఁజేసి యట నీయంశము స్పష్టము గా దనియుఁ గాఁగా స్పష్టముగాఁ జెప్పుట యీసూత్రమునకుఁ బ్రయోజన మనియును గమనింపఁదగును.

'కొన్నింటికి నిగాగమం బగు' ననుటవలన ధ్వన్యనుకరణశబ్దంబు లన్నింటికి నిగాగమము రా దని స్పష్టము. కాని వచ్చెడునట్టికొన్నింటికి మాత్రము నిగాగమం బగు' ననుటచే నిగాగమము తప్పక రావలయు నని యర్థ మగుచున్నది. తళతళ మెఱుఁగులు, నిగనిగకాంతులు అనురీతి నిగాగమరహితరూపము లసాధువు లని సూత్రాభిప్రాయము. నిగనిగనిపచ్చికలు. (5.32), పుటపుటనికటికి (రాజ. 3.142),

నిగనిగనినొగలు (వసు. 1. 144), తళతళనిమెఱుఁగుఁదీఁగలు (పారి. 2. 80), ధగధగనిదేహరుచి (ఇది విశేషము, మను. 4. 117), నిగనిగనిపెన్నెఱిగుంపు (కువ. 5. 68) ఈరీతిగా నిగాగమము ప్రయోగదృష్ట మగుచున్నది.

తళతళమెఱుఁగులు అనురీతిప్రయోగములు వెదుకఁదగియున్నవి. అట్టివి లభించునెడల సూత్రమునఁ గొన్నింటికి ననుటకు బదులుగాఁ గొన్నియెడల యుండఁ దగు ననవలెను. కాని ప్రస్తుతము లభించినప్రయోగములనుబట్టి యిట్టిచో నిగాగమము నియతముగానే గాననగుటంజేసి యీలక్షణమునఁ 'గొన్నింటికి నిగాగమం బగు' ననుట విరుద్ధము గా దనియే నిర్ణయింపఁదగును.

## విశేష్యపూర్వపదకర్మధారయము

**16. తమ్ముఁగుఱ్ఱలు చిలుకమొకరి యిత్యాదులు విశేష్యపూర్వపదకర్మధారయంబులు.**

విశేషణమునకు విశేష్యముతోడిసమాసము కర్మధారయము. కాఁగా విశేషణము పూర్వపదముగను, విశేష్య ముత్తరపదముగను నుండును. కాని విశేష్యమే పూర్వపద మగుట విశేషము. కావున నీలక్షణ మారబ్ధ మైనది.

కుఱ్ఱ లైనతమ్ములు = తమ్ముఁగుఱ్ఱలు, మొకరి యైనచిలుక = చిలుకమొకరి. వీనిప్రక్రియ గమనింతము.

తమ్ములు+కుఱ్ఱలు అని విభాగించి, విభక్తిలోపము చేయుట తత్త్వ.(271), (సర్వ. 197), ఘం.(160) వ్యాఖ్యలలోఁ గన్పించును. కాని యీప్రక్రియ సమంజసము గాఁ గనఁబడదు. తత్పురుషాదులలక్షణము ప్రాయికముగ సంస్కృతోక్తమే. విశేషణమునకు విశేష్యముతోడిసమాసము కర్మధారయము. అట్టియెడల తమ్ములు అనువిశేష్యమునకు కుఱ్ఱలు అనువిశేషణముతో సమాసము చేయుట యెట్లు? పైఁగాఁ గర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజవిశేషణపూర్వపద మైయుండవలెను. తమ్ములు అనునదే పైవానిలో దేనియందును జేరమిఁ గర్మధారయము చేయుటకు వీలు లేదు.

సర్వ.(198) లువర్ణమును విశేషవిధి కల్పించుకొని లోపింపఁజేసినచో తమ్ము+కుఱ్ఱ(లు) అని యేర్పడు నన్నది. కల్పింపవలసినవిశేషవిధి సమాసమునకు సంబంధించినదిగా స్పష్టము చేయవలసియున్నది. సమాస మైనచో విభక్తి యగు

వర్ణకము లోపించుటలో అవరోధము లేదు. కావున లువర్ణకమును లోపింపఁ జేయుటకు విశేషవిధి యక్కఱ లేదు.

దీనికి విగ్రహము చెప్పునప్పు డయిన కుఱ్ఱ లైనతమ్ములు అనియే చెప్పవలెను. కావున 'ఆవిగ్రహము ననుసరించి కుఱ్ఱలు+తమ్ములు అని యుండఁగా విశేషణము నకు విశేష్యముతో (వ్యంసకో మయూరః అనురీతిగా) సమాస మగును. ఇట కుఱ్ఱ విశేషణ మగుటయే కాక, స్త్రీసమము నయినది. కోరు మెద్ది యయినఁ గుఱ్ఱ నీవు. (శ.ర.). కాఁగా కుఱ్ఱఁడు అనుడుజంతరూపముతోపాటు కుఱ్ఱ యనుస్త్రీమము కూడఁ గలదు కావున దానికి సమాసము చేయఁదగును. కుఱ్ఱ లైనతమ్ములు = కుఱ్ఱలు+తమ్ములు అనుచో విశేష్యపూర్వపదత్వమును వర్ణించుచున్నప్రస్తుతసూత్రమును బట్టి యుత్తరపదముగా నున్న విశేష్యము పూర్వపదము కాఁగా, తమ్ములు+కుఱ్ఱలు అని యగును. అనఁగా విశేష్యపూర్వపదకర్మధారయము లని చెప్పినసామర్థ్యముచే నీసూత్రముచేతనే విశేష్యము పూర్వపదముగా నిల్చు నని గ్రహింపవచ్చును. విశేష్యమును బూర్వపదముగా నీసూత్రము నిపతించుచున్న దని తలఁచినను దప్పు లేదు. (ఘం.328)

ఈపద్ధతిలో సమాస మగుటకు నెట్టియాటంకమును లేదు. సమాసము చేయు దశలో విశేషణమే పూర్వపదముగా నున్నది. అది డుమంతమును గాదు. సంస్కృత మందును నిట్లే కదా. సమాస మైనపిదప విభక్తి లోప మగుట కడ్డు లేదు. ఇట్లే అల్లుఁగుఱ్ఱ, కొడుకుఁగుఱ్ఱ మొ.

ఇంక తమ్ము+కుఱ్ఱ అని యుండఁగా నుగాగమ మెట్లు? కు.పం. పూర్వపదము డుమంత మగుటచే నుగాగమము రా దన్నది.(109) సుబో. తమ్ముఁగుఱ్ఱ అనుచో ఈప్రయోగమునుబట్టి స్త్రీసమమును కానట్టిఉదంతమునకు కూడ నుగాగమము వచ్చు ననుకొనవలె నన్నది. ఘం. 36 సూత్రముచే నగు నన్నది. బాల. స్త్రీసమముల కని స్పష్టముగాఁ జెప్పుటచే స్త్రీసమేతరము లని వ్యాఖ్యానించుట సరి కాదు. అనఁ గా నాసూత్రముచే నట నుగాగమము రాదు. సమాస.36 సూత్రము నాశ్రయించుట యొకమార్గమే. తత్త్వ. తమ్ముఁగుఱ్ఱ అనునిర్దేశముచేతనే నుగాగమము వచ్చు నన్నది. అల్లుఁగుఱ్ఱ, కూఁతుఁగుఱ్ఱ (శృం.శా'4.88)మునిమన్మఁగుఱ్ఱల ననురీతిగా నితర స్థలములందును (ఉదంతేతరములపైఁ గూడ) నుగాగమము కన్పించుచున్నది.

కావున నిచ్చటఁ బ్రత్యేకముగా నుగాగమము చెప్పమింజేసి సమాస. 36 సూత్రము నాశ్రయింపక తప్పదు.

చిలుకమొకరి, అల్లుఁగుబ్బ యిత్యాదు లగునితరస్థలములందును ముందుగా విశేషణమునకు విశేష్యముతో సమాసము చేసి, యాపిదపఁ బ్రస్తుతసూత్రముచే విశేష్యమునకుఁ బూర్వపదత్వమును గల్పించుట సముచితము.

వీనిని విశేషణోత్తరపదకర్మధారయము లనరా దని ఘం. వివరించినది. (329)

## విశేషణోభయపదకర్మధారయములు

### 17. ఆయీత్యాదిఘటితంబులు విశేషణోభయపదకర్మధారయంబులు.

ఆ, ఈ మొద లగువానితోఁ గూర్చినకర్మధారయములు విశేషణోభయపద కర్మధారయములు. ఇత్యాదు లనుటచే 'ఈయా', 'ఆయా' మొద లగునవి గ్రహింపఁ బడును. ఈయాదేశము, ఆయాకాలము మొ. ఇట్టివి విశేషణోభయపదములు. ఆయీనేరములు అనుచో నేరములు అనువిశేష్యమునకు ఆఈ యనునవి రెండును విశేషణములు. కావున నిది విశేషణోభయపదకర్మధారయ మని సూత్రకర్త యభిప్రాయము కావచ్చును.

తత్త్వ. విశేషణములు మాత్రమే సమసించు నవి విశేషణోభయపదకర్మధార యము లగును. ఆయీనేరములు అనునట్టివి కాఁజాల వనియు ఇయ్యది, ఎయ్యది, విన్నది, కుబ్జతగవరి, మున్నగువాని నీచోట నుదాహరింపఁదగు నని (227) పేర్కొన్నది. ఇందు విన్నది, కన్నది యన్నవి సమాసములు కావు. విన్న, కన్న యనుధాతుజవిశేషణములపై విభక్తివివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మైనవి.

కు.పం. 'ఇ ట్లనుట ఒక్కటికన్న నెక్కువ విశేషణములు కూర్పఁబడినవాని నెల్ల నుపలక్షకము. కావున నుదాహరించుచున్నాఁడు. ఎత్తినపెంచినేత్యాదులను (109) అన్నది. దీనింబట్టి కర్మధారయమున విశేషణము లొకటికంటె పెక్కు ఉండవచ్చు నని చెప్పుట సూత్రాభిప్రాయ మైనట్లు చెప్పవలయు (290) నన్నది సర్వ.వ్యాఖ్య. అట్టియెడల విశేషణోభయపదము లనుట యెట్లు? రెంటికంటె నెక్కువ విశేషణములు ప్రయుక్త మైనట్టి 'తెలిసునుసోగవెన్నెలలు' అనురీతివానిని గూడ విశేషణోభయపదము లనవలసినదే యని తలఁచినచో సంజ్ఞ సార్థకము కాదు.

విశేషణము పూర్వపదముగాఁ గలది విశేషణపూర్వపదము. కావునఁ దదనుసార ముగాఁ జూచినను బూర్వోత్తరపదము లుభయమును విశేషణము లైనవి. విశేష ణోభయపదము లనుట యుక్తముగా నుండును.

ఘం. ఆయీ మున్నగువిశేషణోభయపదకర్మధారయములు విశేష్యములతోఁ గూర్పఁబడియే తెనుఁగునఁ గనఁబడు నని తాత్పర్య (161) మన్నది. కాని యీ యర్థము సూత్రమునందుఁ గల దనుటకు వీలు లేదు. ఆయీత్యాదులతోఁ గూర్పఁ బడినసమాసము ఆయీనేరములు. ఇది విశేషణోభయపద మనురీతిగానే యీసమాస ములను గుర్తింపఁదగును.

ఇట్టివి విశేష్యములతోఁ గూర్పఁబడియే యుండు నని సూత్రాభిప్రాయముగా నీవ్యాఖ్య చెప్పుచున్నది. కాని తత్త్వ. అయ్యది ఇత్యాదులు విశేషణోభయపదసమాస ములుగాఁ బేర్కొన్నది. కొట్టినతిట్టినయాతఁడు మున్నగుచోట్ల కొట్టినతిట్టిన యను విశేషణములకు సమాస మై, యాపిదప నివి 'అతఁడు' అనుదానితో సమసించె ననురీతి సమన్వయము సరి గాదు.

'ఎత్తినపెంచినవారు' అనునది 32సూత్రమునకు లక్ష్య మనఁదగు (161)నని ఘం. పేర్కొన్నది. కర్మధారయము గా దని భావ మన్నమాట.

కావున నీయది విశేషణోభయపదకర్మధారయము కాదు. తత్త్వ. వీనిని విశేష ణోభయపదకర్మధారయము లనుట సరి కాదు. కావున ఆయీత్యాది విశేషణోభయపద సమాసములు మీఁదివిశేష్యముతోనే సమసించు నని సూత్రాభిప్రాయముగాఁ జెప్పుట సమంజస మనరాదు. ఏ లన ఎత్తినపెంచినవారు అనునది ద్వంద్వసమాస మనియుఁ బూర్వపదాంత్యావయవమునకు లోప మైన దనియు సూత్రకర్త తలంపలేదు గదా. ఆతఁ డిద్దానిని గూడ విశేషణోభయపదకర్మధారయమునకే లక్ష్యముగాఁ జూపెను. అట్టియెడల ఎత్తిన, పెంచిన యనురెండువిశేషణములు సమసించి వారు అను విశేష్యముతో సమాసము నందిన వని చెప్పవలెనా? ఈతత్పురుషమున నుత్తరపదార్థ ప్రాధాన్య మున్నదా? ఎత్తినపెంచిన యనువిశేషణములకు (విశేషణోభయపద కర్మధారయ) సమాస మేర్పడఁగా విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగముతో విన్నకన్నవారు, కొట్టినతిట్టినయాతఁడు అనున వగును. కొట్టినతిట్టినయాతఁడు ఏకవచనాంత మైయుండుటచేఁ గొట్టినయాతఁడు, తిట్టినయాతఁడు నని ద్వంద్వ సమాసముగా సమన్వయించుటకు వీలు లేదు. పై నున్నయాతఁడు విభక్తివివక్షలో

ననుప్రయుక్త మైనదే యనుట స్పష్టము. అట్టియెడల నిచ్చో విశేషణోభయపదములకు విశేష్యముతో సమాస మైనదా? ఐన దని సూత్రకర్త తలంచె ననుట కిట నాధారము లేదు. అట్టియెడల 'ఆయా' ఇత్యాదులే విశేషణోభయపదము లనియు నియ్యది విశేష్యముతోనే సమసించె ననియుఁ జెప్పుట కాధారము లే దనక తప్పదు.

విశేషణోభయపదకర్మధారయములకు ఘం. అహోబలునుక్తులను జూపినది. పిన్నపెద్ద యైనపింగళిసూరయ్యగారిఁ దలఁచి వేఁడి గారవమున, ఇతి యయాతి చరిత్రే. పిన్నపెద్ద లైన ఇతి బహువచన మపి. వయసా న్యూనో ఽపి వివేకేన గరీయా నిత్యర్థః. విశేషణసమాసో ఽపి క్వచి దిష్టో భవే న్మమ ఇత్యథర్వణవచనాత్ విశేషణసమాసః. మెత్తనివలుఁదపొదుగు, విననికననిమహిమలు(320.ఘం.)

పిన్నపెద్ద యైనసూరయ్యగారిఁ దలఁచి యనునది 'పూజ్యత్వే సద్రుతః కారుః' అనువి.వి.లక్షణమునకు లక్ష్యముగాఁ జూపఁబడినది. కాని విశేషణసమాస మనుటకుఁ గాదు. తఱుచుగా నహోబలపతివ్యాఖ్య ననుసరించు కవిజనమండన వ్యాఖ్యాతయు దీని నిట్లే 'పూజ్యత్వే' అనుదానికే ఉదాహరించెను (99). 'పిన్నపెద్ద యైన' యనునది విశేషణసమాస మగు నని మన మూహింపవచ్చునా? 'పిన్నపెద్ద లైన' అనుపాఠాంతరము నంగీకరించుచో నయ్యది ద్వంద్వసమాస మనఁదగియుండు నాదేశాభావము నీసూత్రకర్త పేర్కొనెనే కద. పిన్నపెద్ద యైన యనుపాఠమును గ్రహించునపు డిది కర్మధారయ మనవలెనా? వయసా న్యూనో ఽపి వివేకేన గరీయాన్ అనునర్థవివరణము ననుసరించి యిది వ్యస్తముగానే యహోబలుఁడు తలఁచె నేమో యనిపించును. కాని సమాస మన్నను ననవచ్చును. పిన్నపెద్ద యనునది విశేషణోభయపదకర్మధారయమే యనుచో నిట్టివి విశేష్యముతోనే సమసించు నని ప్రౌఢవ్యాకరణలక్షణముతాత్పర్య మన్న ఘం.కు ఇది విరుద్ధము. పిన్నపెద్ద యైన యనుటచే పిన్నపెద్ద యనువిశేషణము పింగళిసూరయ్య యనువిశేష్యముతో సమసింప లేదు కదా. మఱి దీని నిటఁ జూపుట యేల? ఇట్లే పిన్నపెద్దగా ఉ.హరి.5.90. (ఘం.329) వి.వి.లక్షణమును జూపి విశేషణసమాసము గల దని చెప్పినయహోబల పతి మెత్తనివలుఁదపొదుగు, కనని విననిమహిమలు అని చూపెను. ప్రస్తుతసూత్రకర్త యిటఁ జూపినలక్ష్యము లిట్టివే యగుట స్పష్టము. కాని యిటఁ గూడ మెత్తని వలుఁద యనురెండువిశేషణములకు సమాస మైనదా? వి.వి. కారికావివరణ సందర్భమున వఝులవారు నహోబలపతినే యనుసరించి యీప్రౌఢవ్యాకరణ

లక్ష్యమును జూపిరి. (వ్యా.సం.స. 1208) వీ రేమియు విశేషించి చెప్పలేదు. ఆయాకాలము, అనునది సైతము విశేషణోభయపదకర్మధారయములుగాఁ దలఁచుటంజేసి (వ్యా.సం.స. 1209) వారు చెప్పవలసిన దేమియు లే దనియే తలంచి యుండవచ్చును.

అయిన నిట విశేషణసమాస మెట్లు? అనఁగా 'సంస్కృతభాషావిదో విశేషణస్యాపి విశేష్యత్వవివక్షాయాం స్నాతానులిప్త ఇత్యాదౌ విశేషణం విశేష్యేణ బహులమ్ ఇతి సూత్రేణ సమాసనిర్వాహ ఇతి వదంతి'. (ఘం. 329). అని పేర్కొనె. వఝలవారు ని ట్లిది యనువదించిరి. (వ్యా.సం.స. 1208). తదనుసారముగాఁ దెలుఁగున నిట పరపద మగువిశేషణమును విశేష్యముగా వివక్షించి సమాసము స్నాతానులిప్తః అనుదానివలెఁ జేసినచో 'మెత్త నైన వలుఁద = మెత్తనివలుఁద' యని యగును. పొదుగు మెత్తనివలుఁద యనురీతివ్యవహార మున్నచో నట మెత్తనివలుఁద యనునది విశేషణసమాసముగా గ్రహింపవచ్చు. మహిమలు 'విననికననివి' యనుచో 'విననికననివి' విశేషణోభయపదసమాసమే యనవచ్చును. ఇట సూత్రకర్త చూపిన ఎత్తినపెంచినవారు అనున దిట్టిదే. కాని విన్నకన్నది యన్నదానిని ద్వంద్వసమాసముగ సమన్వయించినయీవ్యాకర్తమతమునే యనుసరించి ఎత్తినపెంచినవా రనునది ద్వంద్వముగా సమన్వయింపఁదగు నని ఘం. కూడఁ దలఁచినది. అట్టిదే 'వినని కననివి' యనునదియును. కాఁగాఁ గొట్టినతిట్టినయాతఁ డనునది యిట విశేషణ సమాసమునకు లక్ష్య మనఁదగును. అహోబలుఁ డైనను వి.వి.కారిక కట్టిదే లక్ష్యముగాఁ జూపుట యొప్పును. స్నాతానులిప్తః అనురీతిగాఁ గేవలము విశేషణ సమాసము తెలుఁగున మిక్కిలియరుదు. ఐనను గొన్నియే కలవు గావున నట్టివానిని విశేషణోభయపదకర్మధారయములుగాఁ బేర్కొనుట సంస్కృతసంప్రదాయమున కనుగుణము.

మెత్తనివలుఁదపొదుగు అనురీతి విట్టివి గావు. అట్టివి సంస్కృతమందలి మహాసితోత్పలమ్ అనురీతిసమాసములవంటివిగా గుర్తింపఁదగును. మహాసితోత్పల మ్మనుచో నసితం చ తదుత్పలం చ = అసితోత్పలమ్. మహాం శ్చాసౌ అసితోత్పలం చ = మహాసితోత్పల మ్మనువిధముగా సమాసము చెప్పఁబడుచున్నది. కాఁగాఁ దదనుగుణముగనే యిట 'వలుఁద యైనపొదుగు-వలుఁదపొదుగు'. మెత్త నైన వలుఁదపొదుగు - మెత్తనివలుఁదపొదు గనురీతిగా విగ్రహముతో సమాసమును

గుర్తింపఁదగును. తత్పురుష ముత్తరపదార్థప్రధాన మగుటంజేసి మెత్త యనుదానికిని పొదు గనునుత్తరపదముతోనే యన్వయ ముండుటలో నీపక్షమునను బాధ లేదు.

ఆయీనేరము లనురీతివి సైత మట్లే గుర్తింపఁదగును.

ఇవి+నేరములు=ఈనేరములు. అవి+ఈనేరములు=ఆయీనేరములు. ఈనీలోత్పల మనుచోట నెట్లు రెండు కర్మధారయము లగునో యాయీనేరములు మున్నగునవియు నట్లే కర్మధారయద్వయ మనిన చాలు (275) నన్నతత్త్వ. అభిప్రాయము సముచితము.

ఘం. అనుసరించినసమన్వయ మిట్టిది కాదు. 'ఆయీ' విశేషణోభయపదకర్మ ధారయ మన్నది. కాని యట్లు గుదురదు. ఆ ఈ అనుప్రాతిపదికలకు సమాస మెట్లు? అవి+ఇవి=ఆయివి యని యైనపిదప నాయివి యైననేరములు= ఆయీనేరము లని చేయవలెను. కాని యిట్లు ముందుగా విశేషణములకు సమాసములు చేసి, వానివిశేష్యములతో సమసింపఁజేయుటకంటెఁ బైమార్గము సంస్కృతానుసారముగా నుచితము గదా.

అహోబలుఁడు విశేషణసమాసములయెడఁ జూపినసమన్వయ మాతఁడు చూపినలక్ష్యములయెడఁ గానరాదు. అహోబలుఁ డట్లుదాహరించుట ప్రమాదము. కాఁగాఁ బ్రౌఢవ్యాకర్తృప్రభృతులు దానినే యనుసరించుటవలనఁ బ్రమాద మిటఁ గూడ నేర్పడినది.

అపి, క్వచిత్ శబ్దములచే మిక్కిలి యరు దని యథర్వణుఁడు చూపినవిశేషణ సమాసములు దెలుఁగున లేకపోలేదు. కావున (కొట్టినతిట్టినయాతఁడు, తత్త్వ. చూపిన కుఱ్ఱతగవరి మొ.) నాలక్షణము సార్థక మనఁదగును.

కవిశిరోభూషణానుసారముగా విననికననిమహిమ లనురీతివానిని విశేష ణోభయపదములుగాఁ జూపుట సరి కాదు. కొట్టినతిట్టినయాతఁడు, తప్ప నిటఁ జూపినలక్ష్యము లేవియు విశేషణోభయపదకర్మధారయము లనుట సరిగాదు. సర్వ. శీతోష్ణము అనునది యుదాహరింపదగు ననుట (210) సిద్ధసమాస మగుటచే నుదాహరింపరా దని తత్త్వ. వివరించుట యుచితమే.

పూర్వలక్షణములు పేర్కొన్నవిశేషణపూర్వపదకర్మధారయములకు విశేషముగా విశేష్యపూర్వపదములను (విశేషణ ముత్తరపదముగాఁ గలవానిని) బేర్కొని, యావెంట

విశేషణోభయపదము లనుటచేఁ బూర్వోత్తరపదములు (సమాసమున నెల్లపదము లును) విశేషణములే యైనసమాసములే యని యూహించుటకు నవకాశము గల్గుచున్నది. ఆయీనేరము లనుచో నుత్తరపద మగునేరము లనునది విశేషణము గాదు గదా.

ఇంకఁ దెలుఁగునఁ బ్రత్యేకముగా అవి+ఇవి=ఆయివి యనురీతిగా ముందుగా విశేషణములకు సమాసము చేసి యాపిదప దీనికి విశేష్యముతో సమాసము చేయునట్టిప్రక్రియ నాశ్రయింపఁదలఁచినచో నవ్విషయమును బ్రత్యేకముగా నిట విధించుట లేదా కనీసము వివరించుట యవసరము.

అట్లు చేయమి ఆయీనేరము లన్నది మొత్తము విశేషణోభయపదకర్మధారయ మని చెప్పక తప్పదు. అది సరి కాదు.

## వ్యవహితత్వము

**18. కొన్నియెడల విశేషణోభయపదంబులు త్రికక్రియాజన్యవిశేషణ ఘటితంబులు సందర్భయోగ్యపదవ్యవహితంబు లగు.**

పైఁ బేర్కొనినట్టిసమాసములలోనివిశేషణములు త్రికక్రియాజన్యములు రెండు గాని, లేదా క్రియాజన్యములు మాత్రమే కాని యైనచో నావిశేషణములు సందర్భ యోగ్యము లైనపదములతో వ్యవధానము గలిగి ప్రయోగింపఁబడుట గల దని సూత్రార్థమును సూత్రకర్తయే వివరించెను.

మహద్ద్వంద్వంబున, నప్రాణివాచకకృదంతశబ్దఘటితంబు, అనుచోట్లవలె నిటఁ గూడఁ ద్రికక్రియాజన్యవిశేషణఘటితంబు లనుచోఁ గేవలద్రికఘటితములందును విశేషణము లిట్లె వ్యవహితము లగు నని తలఁచుట కవకాశము గలిగియుండుటం జేసి దానిని వారించుటకై 'త్రికక్రియాజన్యవిశేషణోభయఘటితంబు లని కేవలక్రియా జన్యవిశేషణఘటితంబు లని ద్వివిధంబు' లని వివరించెను.

ఈవివరణము ననుసరించి యిట్టిసమాసములలోనివిశేషణములు రెండింటఁ గ్రియాజన్యవిశేషణమే రెండవదిగా నుండు ననియు, వ్యవధానము గలిగించుపదము ఆక్రియాజన్యవిశేషణముతో నన్వయించున దైయుండు ననియుఁ దాత్పర్యము.

'ఏకతమ తిరుగు నదరు లుమిసెడు కొఱవిదయ్యంబు' అనునది క్రియాజన్య

విశేషణఘటిత మగునిట్టిదానికి లక్ష్యము. తిరుగు, ఉమిసెడు అనునవి క్రియాజన్యవిశేషణములు. ఉమిసెడు అనుతరువాతిధాతుజవిశేషణముతో నన్వయించు 'అదరులు' అనుపదముతో వ్యవధానము.

పదములలో ననుటవలన ననేకపదములతో వ్యవధాన ముండఁదగు నని తెలియవచ్చును. 'బాగుగఁ గొన్న, రవిప్రకాశ మై యలరుచు నున్న' యనునది యీయంశమును స్పష్టము చేయుచున్నది. కొన్న, ఉన్న అనుధాతుజవిశేషణములకు నడుమ 'రవిప్రకాశ మై యలరుచున్' అనుపదములతో వ్యవధానము.

'చిక్కని, చక్కని, నున్నని, స్రుక్కని, తోలూడ్వఁబడని ఛుల్లిసెగలచే' ననులక్ష్యమును బట్టి విశేషణములు పెక్కు లుండ నగు ననియు స్పష్ట మగుచున్నది. (తత్త్వ. 277) ఎట నున్నను వ్యవధాయక మగుపదము ధాతుజవిశేషణమునకు సంబంధించిన దగుట, దానికి ముందు ప్రయుక్త మగుట లక్షణానుగుణము.

ఇట లక్ష్యములసమన్వయములో వ్యాఖ్యలలో భేదము గానవచ్చును. తత్త్వ. 'మొదటియుదాహరణము త్రికక్రియాజన్యవిశేషణఘటితము, తరువాతి యుదాహరణము లన్నియుఁ గేవలక్రియాజన్యవిశేషణఘటితము (276) లన్నది. (సుగమ. 169) చివరిలక్ష్యములో 'స్రుక్కని, తోలూడ్వఁబడని' యనునవి వ్యవధానముగ ముందువెనుకల నున్నవి ధాతుజవిశేషణములు. కాని చిక్కని ఇత్యాదులు ధాతుజవిశేషణములు గావు.

1. సర్వ. చాలి, కొలుపు, తెగడు అనునవి మూఁడు ధాతుజవిశేషణము లన్నది. ఇందు 'చాలి' యనునది క్త్వార్థకప్రత్యయాంతము. ధాతుజవిశేషణము కాదు. తత్త్వ. చాలి యనుక్త్వార్థకక్రియ సరి కా దనియు నది యట్లున్నచో 'మరునీలంపుటురుల' కన్వయింపవలసివచ్చు ననియుఁ గావున – చాలు, కొలుపు, గెలిచిన, తెగడు అను విశేషణము లన్నియు నేకజాతీయము' (278) లన్నది. అది సరి కాదు. ఏకజాతీ యము లన్నవీనిలో 'గెలిచిన' యనునది క్తవదర్థకము. తద్ధర్మార్థకవిశేషణము గామి నేకజాతీయత యనుసమతాగుణ మెట్లు గుదురును? చాలి యనుదానిని 'మరు నీలంపుటురులలోని కన్వయించుటలో బాధ యేమి? 'కల' యనునదియు కురులకు విశేషణ మని తలంచినయీవ్యాఖ్య యింతకు ముందు కొలుపు, గెలిచిన, తెగడు అనుమూఁడింటిని మాత్ర మేల పేర్కొన్నదో? 'నెఱులు గలమరునీలంపుటురుల సరులు గొనఁజాలి' యన్నది మొత్తము కురులలోని కన్వయించును. 'చాలి' యను

దానిని 'జాలు' అనురీతిగా దిద్దుటయు సరి కాదు. సమతకా? గెలిచిన యనునది కురులకు విశేషణము చేయుటచే నీవ్యాఖ్యమతమున నది తొలఁగిపోయినది. కావున నీతత్త్వ. వివరణము సరి గాదు.

సుగమ. 'నెఱులు గల, మరునీలంపుటురులసిరుల నరులు గొనఁజాలి నరులను మరులుగొలుపు, నిరులు గెలిచినతుమ్మెదగఱులఁ దెగడు కురుల' ననుచో కొలుపు, గెలిచిన, తెగడు అనుమూఁడును విశేషణము లన్నది (169). తత్త్వ.(278) ఘం. (162) వ్యాఖ్యలును గెలిచిన యనునది విశేషణ మన్నవి. గెలిచిన యనునది తెగడు అనుదానితో నన్వయించు తుమ్మెదగఱు లనుదానికి విశేషణ మనియు ననవచ్చును. అపుడు ఇరుల గెలిచినతుమ్మెదగఱుల యనునది మొత్తము వ్యవధాయక మగును.

మరులుగొలుపు, తెగడు అనువిశేషణములు తద్ధర్మార్థకములు కాఁగా, గెలిచిన యనునది క్తవదర్థక మగుట విశేషము. తద్ధర్మార్థకవిశేషణములతో నన్వయమే యుచిత మనిపించెడిని. కావున గెలిచిన యనునది తుమ్మెదగఱు లనుదానికి విశేషణముగా నన్వయించుటయే యుక్తము. సుబో. గెలిచిన యనుదానిని విశేషణముగాఁ జూపకుంట (198) యుచితముగా నున్నది.

ఈలక్ష్యములలో – నరులను మరులు గొలుపునిరులు గెలిచినయంతఃపురేందు ముఖులకురులు అనునది ప్రబల మైనది గాదు. మరులుగొలుపు అనుదానిని ఇరులకు విశేషణము చేసి, మరులుగొలుపునవి యైనఇరులు=మరులుగొలుపు నిరులు. ఇరులను గెలిచినతుమ్మెదగఱులు అనుచో జడంబుద్వితీయకుఁ బ్రథమ రాఁగా, (మరులు గొలుపు) ఇరులు గెలిచినతుమ్మెదగఱులు అని యవును. ఇరులు మరులు గొలుపునవి కాఁగా, నట్టియిరులను గెలిచినతుమ్మెదగఱులను దెగడునట్టివి యైనకురులయం దింకను మరులు గొలుపుటలోఁ గూడ నాధిక్యము సిద్ధించును. అట్టియెడల నిది సూత్రకర్త తలంచినవిశేషణోభయపదకర్మధారయమును గాదు. నెఱులు గల మరునీలంపుటురులసిరులను గెలువఁ జాలి యనుదానివలెనే యిది యంతయును గురులలోనికే యన్వయించును.

ఘం. మరులుకొలుపు అనునది విశేషణ మనుట యుచితముగా నున్నది. మరులుకొను అనునది శబ్దపల్లవ మగుధాతువు. అనుప్రయుక్తము కాని కొనుధాతువు నకుఁ బ్రేరణమునఁ గొలుపు అనురూపము లేదు. కావున నిట విశేషణము 'మరులుకొలుపు' అని చూపుటయే యుక్తము. ఇతరవ్యాఖ్యలు కొలుపు అని చూపినవి.

బలిమిఁ గుబేరునిం గెలిచి బాగుగఁ గొన్న, రవిప్రకాశ మై యలరుచు నున్న, పుష్పకమునందు అనులక్ష్యమున 'కొన్న, అలరుచునున్న, అనునవి రెండు విశేషణము లని సుబో.(198), సర్వ.(215) లు పేర్కొన్నవి. కాని, కొన్న, ఉన్న యనునవే ధాతుజవిశేషణములు. 'అలరుచున్' అనునది శత్రర్థకచువర్ణకాంత మగు ప్రత్యేకపదము. కాఁగా కొన్న, ఉన్న యనువిశేషణములు 'రవిప్రకాశ మై యలరుచున్' అనుపదములచే వ్యవహితము లైనవి. తత్త్వ.(276) ఘం.(163) సుగమ.(169) వ్యాఖ్య లిట్లు పేర్కొనుట యుక్తముగా నున్నది.

ఈచివరిలక్ష్యమునుగూర్చి సర్వ. 'చివరిలక్ష్యమునందు చిక్కని, చక్కని, నున్నని, స్రుక్కని, పడని, పడని – అని మొత్తము ఆరుధాతుజవిశేషణములు వాడబడిన వన్నది. ఇది యసమంజసము. చిక్కని, చక్కని, నున్నని యనునవి ధాతుజ విశేషణములు కావు. చిక్కన–చిక్కనిపోటుమానిసి (శ.ర.) ఇది చిక్కుధాతువునుండి యేర్పడినది కాదు. నున్నన–నున్ననికప్పు. (శ.ర.) చక్కన యనుదానిని గుణ వాచకముగా నీసూత్రకర్త యింతకు ముందే చూపెను. పడని, పడని యనునవి విశేషణము లనుట పొరపాటు. ఊద్వఁబడని, నొక్కఁబడని యనుచో నియ్యది కర్మార్థమునం దైన పడుజ్యనుబంధము. కావున దానిని బృథక్కరించి చూపుట సరి కాదు. ఊద్వఁబడని, నొక్కఁబడని యని చూపుట యుక్తము. తత్త్వ. (270) కూడ పడని యనియే చూపుట సరి గాదు. సుగమ.ఊద్వ ననుదానిని కుండలీకరణమునఁ జూపుట కొంత నయము. సుబో. (199), ఘం. (163) ఊద్వఁబడని, నొక్కఁ బడని యని మొత్తము చూపుట యుక్తము.

3. ఎత్తెడునట్టి యెట్టిగాఁ గాఁచినమడ్డుచందము అనుచో ఎత్తెడునట్టి, కాఁచిన యనునవి రెండు విశేషణము లని సుబో.(199), తత్త్వ. (270), సర్వ.(215), ఘం.(162) వ్యాఖ్యలు పేర్కొనఁగా సుగమ. ఎత్తెడు, కాఁచిన, యనునవి విశేషణము లన్నది. (169) ఇందు అట్టి యనునది ధాతుజవిశేషణముల కనుప్రయుక్త మగునట్టి దగుటచేత ఎత్తెడునట్టి యనునది మొత్తము విశేషణముగా గ్రహించుట తగును. సమాసము చేసినపిమ్మట ననుప్రయుక్తము చేసినను ధాతుజవిశేషణమునకు నవయవమే యగును గదా.

4. 'ఆనకదుందుభి ననరాని వినరాని దుర్వాక్యసూచుల' యనులక్ష్యస్థలమున సుబో. మాత్రము అనరాని, వినరాని యనునవి క్రియాజన్యవిశేషణము లని

పేర్కొన్నది. దీనవలన నిట వ్యవహితత్వము లేమి నీసూత్రమునకు లక్ష్యములు గా వని, రాని, రాని యనునవే విశేషణము లనుట సరి కా (199) దన్నది. ఇది సరి కాదు. ఇట రాని యనునవే ధాతుజవిశేషణములు. అనన్, వినన్ అనునవి నుఙ్యంత ము లగుప్రత్యేకపదములు. కావున 'వినన్' అనుదానితో వ్యవధానము గల్గె నని చెప్పుటయే యవసరము.

ఇంక సూత్రస్వరూపమును గూర్చి పరిశీలింతము. పూర్వసూత్రము నను సరించియే యిట వీనిని విశేషణోభయపదకర్మధారయములుగా సూత్రకర్త తలంచెను. ఇది సరి గా దని తత్త్వ.(277) పేర్కొనుట యుచితమే యని పూర్వసూత్రవివరణము స్పష్టము చేయుచున్నది. అనేకవిశేషణఘటితసమాసము లీయవి.

త్రికక్రియాజన్యవిశేషణఘటితంబు లనుదానిని 'త్రికక్రియాజన్యవిశేషణోభయ ఘటితంబులు, కేవలక్రియాజన్యవిశేషణఘటితంబు లని ద్వివిధము' లని సూత్రకర్త వివరించెను.

'చిక్కని, చక్కని, నున్నని, స్రుక్కని, తోలూడ్వఁబడని, ఛుల్లిసెగలచే నొక్కఁబడని, దండంబు' లనుచో చిక్క, చక్క, నున్న యనునవి గుణవాచకములే కాని త్రికక్రియా జన్యములు కావు. అయిన నిట స్రుక్కని, ఊడ్వఁబడని, నొక్కఁబడని యనునవి ధాతుజవిశేషణములే. వ్యవధానము వీనిమధ్యనే కన్పించుచున్నది. అనఁగా నితరము లగువిశేషణములసమాసము లున్నను నిట్టివానియందే వ్యవధానము గల దని చెప్పుట సూత్రకర్తయభిప్రాయమున కిది లక్ష్యమే యవుచున్నది. కాఁగా చిక్కని, చక్కని, నున్నని, తోలూడ్వఁబడని యనురీతిగాఁ బ్రయుక్త మైనచో నయ్యది యీసూత్రముచేత సాధింపఁబడక విరుద్ధ మగును. నున్న యనునది త్రికము కాని, క్రియాజన్యవిశేషణము కాని కాదు కదా.

ఇట్టిచోట్ల నన్నియెడల నితరవిశేషణములతో వ్యవహితము లగునవి ధాతుజ విశేషణములే యవును. వివరణము ననుసరించి కేవలత్రికవిశేషణోభయపద సమాసము గాని, లేదా క్రియాజన్యవిశేషణ, త్రికవిశేషణోభయపదము (అనఁగా గ్రియాజన్యవిశేషణము పూర్వపద మై, త్రికము పరపద మగువిశేషణసమాసము) గాని యిట గ్రహింపరా దని స్పష్టము. ఈయర్థమునకు సూత్రమున నాధారము లేదు. వివరణము మాత్రమే పరిశీలింపఁగా సూత్రమునఁ ద్రికశబ్ద మనవసర

మని తోఁచుచున్నది. విశేషణోభయపదములలోఁ గ్రియాజన్యవిశేషణములు సందర్భ యోగ్యపదవ్యవహితము లవుటను బేర్కొన్నఁ జాలును.

ఇట్టివానిని సూరి ధాతుజవిశేషణము లనియే పేర్కొనెను. 'భూతార్థే ప్రతిషేధార్థే న శ్చ ని శ్చ భవేత్ క్రమాత్, కర్మాదికర్తృతాయాం తౌ క్రియాజవిశేషణమ్' (కవిశి. 584) అనురీతిగా వికృతివివేకములోఁ గ్రియాజ(న్య)విశేషణము లనురీతిగా వ్యవహారము గానవచ్చును. చింతామణి 'క్రియా ధాతుః' అని చెప్పుట యందుకు దోహదము గావచ్చును. ధాతుజవిశేషణము క్రియాజన్యవిశేషణము ననువాని నీతఁడు పర్యాయములుగా గ్రహించినట్లు స్పష్టము. కాని క్రియ యనునది ధాతువునకుఁ బర్యాయము గాదు. సూరి ధాతువు అనఁగాఁ గ్రియ యని పేర్కొనకపోవుటయే కాక, వీనిని (ధాతువు– క్రియ) బర్యాయములుగా వ్యవహరించుటయుఁ గానరాదు.

శ.ర.లో నీసూత్రకర్తయు ధాతువు – భూధాతువు లోనగునది. (408) క్రియ– ధాత్వర్థము (212) అని చెప్పెను. ధాతువు ధాత్వర్థమును భిన్నములు గదా. ఈభేదము ననుసరించియే కావచ్చును, సూరి ధాతుజవిశేషణములను గ్రియాజన్యవిశేషణము లని వ్యవహరింపలేదు. ధాతువునుండి యేర్పడిన వీనిని ధాతుజవిశేషణము లనుట యుక్తము. కావునఁ బ్రౌఢవ్యాకర్తయు ధాతుజవిశేషణము లనియే వ్యవహరించిన బాగుండెడిది. అయినను 'ధాతుజవిశేషణ భావార్థకపూర్వవ్యవహితావ్యవహితకర్తృ పదప్రథమ' యని ధాతుజవిశేషణ మనియుఁ గొన్నియెడల వ్యవహరించెను.

'సందర్భయోగ్యపద' శబ్దము నీసూత్రమున నవసర మగుటయు ననుమానమే. స్పష్టతకొఱకే చెప్పె ననుకొనవలెను.

ధ్వన్యనుకరణశబ్దములు, విశేషణవిశేష్యములు మొ. వ్యవహితము లగుటను పేర్కొనెను. కాని యట నీదళమును జేర్పలేదు. కాని యిట నొకవిశేషము గలదు. వ్యవధాన మెపుడును ధాతుజవిశేషణములకే. అనఁగాఁ బరపదము ధాతుజవిశేషణ మయినపుడే విశేషణములు వ్యవహితము లగుట కానవచ్చును. వ్యవధాయకము లగునీపదములుధాతుజవిశేషణముతోనే యన్వయించుటయు నియతముగాఁ గాన వచ్చును. (తత్త్వ. 277) కావున ధాతుజవిశేషణములు 'తత్సంబంధిపదవ్యవహితంబు లగు' నని చెప్పుట యుక్తము గదా.

శబ్ద. 13 సూత్రమువద్ద 'ఓ వినువీధి నున్నఖచరోత్తములార' యనుచోటివలె నిటఁ గూడ ధాతుజవిశేషణములకు సంబంధించునట్టిపదములతోనే వ్యవధానము

గలదు. ఆసూత్రమునవలెనే యిక్కడను 'ఒక్కచో' నని చెప్పి, 'ఒక్కచో విశేషణోభయ పదసమాసంబునం బరపదము క్రియాజన్యవిశేషణ మగునపు' డనియు నితరశబ్దం బనఁగా నాక్రియాజన్యవిశేషణమునకు సంబంధించినపద మనియుఁ జెప్పవచ్చు. కాని యితరశబ్ద మనుటకంటె సందర్భయోగ్యపద మనుట కొంత నయము. స్పష్టత గూడ నవసరమే గనుక నీసూత్రము నిట్లు చెప్పియుండవచ్చును. అది దొసఁగు కాదు. (కాని యింకను సమగ్రముగాఁ జెప్పవచ్చును.)

కొన్నియెడల ననుటచే నీవ్యవహితత్వము నియతము గా దనియు యథా ప్రయోగముగా గ్రాహ్య మనియు సూచించుట సముచితము.

కవిత్రయప్రయోగములం దిట్టివి లే వని సూత్రకర్త స్పష్టము చేసెను. అయినను నితరమహాకవిప్రయోగములనుబట్టి చెప్పుట యుక్తమే. సూత్రమునందే 'కవిత్రయేతర ప్రయోగంబులం' దనకుండుట యుచితముగా నున్నది.

ధాతుజవిశేషణములప్రయోగము సందర్భమున నిట్టిస్థితి తఱచుగనే కానవచ్చు చున్నది. సమాసమందే కాక యితరస్థలములందును గల దని 'ఓ తోయజనేత్రుఁ గాంచినవధూమణి' యిత్యాదులు స్పష్టము చేయుచున్నవి. రాముఁడు చంపినరావణుఁ డనుచో రాముఁ డనునది నియతముగాఁ బూర్వముననే యుండును. చంపినరావణుఁ డు రాముఁ డనుతీరుగాఁ బ్రయోగించుట కానరాదు. 'ఏకవాక్యంబునందు' (బాల. కార. 37) అనుసూత్రముచొప్పున నిట ధాతుజవిశేషణముతో నన్వయించుపదములు ధాతుజవిశేషణములకుఁ బూర్వమునందే ప్రయుక్త మగుటలోఁ గ్రమసాపేక్ష మై యుండు నని గ్రహించుచో శబ్ద. 13 సూత్ర మనవసర మగును. కాని యట్టిక్రమ సాపేక్షత సమాసములందును గానవచ్చుటంజేసియు నట్టిసాపేక్షతను సూరి యట స్పష్టము చేసియుండకపోవుటచేతను నీయంశమును బ్రత్యేకముగాఁ జెప్పుట యుక్త మైయున్న దనఁదగును.

కావున నెల్లయెడల ధాతుజవిశేషణములతో నన్వయించుపదము తత్పూర్వమునం బ్రయోగింపఁబడు నని చెప్పి యెల్లయెడల ననుదానిచే రాముఁడు చంపినరావణుఁ డిత్యాదులందే కాక 'ఓ వినువీధి నున్నఖచరోత్తములార' యనురీతిస్థలమును నిట్టిసమాసములందు సయితము సాధించుట యుక్తముగా నుండు నని తోఁచు చున్నది.

ఈచోటను బ్రత్యేకవిధానమును చేయుటకంటె నన్నింటి నొకేచోట సంగ్రహించుట లాఘవము. ఒకే యంశమును సాధించుటకు మూఁడువిధానము లేల?

## అలరుఁబోఁడి

### 19. అలరుఁబోఁ డీత్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులు.

సూరి యిట్టివి బహువ్రీహిసమాసము లనియు, నిచట నుత్తరపదము 'మేను' అనియు, దానికి బోఁడి యాదేశ మయిన దనియుఁ జెప్పెను. తత్పూర్వలాక్షణికులును గొంద ఱిది బహువ్రీహిసమాస మనియే పేర్కొనిరి. పూవుబోఁడి, తలిరుబోఁడి, పూవిలుతుఁడు, వాలుగంటి, వాతవాడి, మించుమొలక, మచ్చెకంటి, ముక్కంటి యన బహువ్రీహి పెక్కువిధులు విస్తరిల్లు. (కా.చూ. 9.125) ప్రౌఢవ్యాకర్త పోఁడి శబ్దముతో నీయవి యుపమానపూర్వపదకర్మధారయసమాసము లనియు పోఁడి పర మైనపు డిట నెల్ల నుమాగమ మగు ననియుఁ జెప్పెను. మిత్తుగాఁ జెప్పుట బాలవ్యాకరణమునకంటె భిన్నము. ఈయాగమమువలన నలరుఁబోఁడి, ననఁ బోఁడి యిత్యాదులలో ఖండబిందువు గూడ సిద్ధించుట విశేషము.

ఇట కు.పం. 'బోఁడి యని సరళాదిగాఁ జెప్పినసూరిమతమున అలరుఁబోఁ డీత్యాదులలో నుగాగమద్రుతకార్యములు గలిగినఁ గల్గవచ్చుం గాని, ననఁబోఁ డీత్యాద్యనుదంతముల కీనుగాగమద్రుతకార్యములు సిద్ధింపమి ప్రౌఢకారునిమార్గమే వర' (111) మన్నది. ఇట సూరిమతమున అలరుఁబోఁడి అని ఖండానుస్వారము చూపుట సరి కాదు. అచ్చుపొరపాటు గావచ్చును. ననఁబోఁడీత్యాదులలో బిందువు సిద్ధించుట ఈలక్షణమందలివిశేష మనుట స్పష్టము. సూరి 'బోఁడి' యని సిద్ధ సరళాదిగాఁ జెప్పును గావున ద్రుతకార్యములవలనిప్రయోజనము బిందువు మాత్రమే. సరళము మొదటనే యున్నది కదా.ననఁబోఁడి యనురీతిఖండబిందు స్థలములనుబట్టియుఁ బ్రౌఢవ్యాకర్తృమతము వర మని నిర్ణయింప నక్కఱ లేదు. ఖండబిందు వుచ్చారణమునందు వినిపింపమింజేసి యది లే దన్నను గా దనుట కాధారము లేదు. తిక్కనాదులు ఖండాఖండప్రాసమును బ్రయోగించుటచేఁ బ్రాస స్థలప్రయోగమునుబట్టియు నిర్ణయింపరాదు. ఇఁక నన్నయప్రయోగములందుఁ బ్రాసగత మై ఖండబిందువుతో నిశ్చయించుటకుఁ బ్రమాణముగాఁ బ్రయోగము లభింపలేదు. కావున ఖండబిందువు ననుసరించి యిట్లు నిర్ణయింపరాదు. కాని

యనుదంతములపైఁ బూర్ణబిందువు గన్పించుచో మాత్రమే సూరియభిప్రాయము కంటెఁ బ్రౌఢవ్యాకర్తృమతము వర మని నిశ్చయింపవచ్చు. అందుకే ప్రౌఢవ్యాకర్త 'ద్రోవ దన్ తీయంబోఁడి' యనుప్రయోగమును జూపెను. (ఘం. 382) ఇది తప్ప నింకొకదానియం దనుదంతములపై నిట్టిచోట్లఁ బూర్ణబిందువు గానరాదు.

ఈప్రయోగమును గూర్చి సర్వ. 'ఇచ్చట తియ్య యన్నది ఉరమానము కాదు. గుణవాచక మైనవిశేషణము. ఇది నవర్ణకాంతము. దీనికి పరమం దున్నది పోఁ డి యనుశబ్దమే. తియ్యన–పోఁడి యని యున్నపుడు మధుర మైనయొప్పిదము అని కాని, మధురము మనోజ్ఞము నైనది అని కాని యర్థము చెప్పవలయును. అప్పుడు గుణవాచకంబులు కొన్నింటినిగాగమంబునకు (ప్రౌఢ. సమా. 13) సూత్రమునుబట్టి తియ్యంబోఁడి అని యగును (236). కావున దీనికై ప్రస్తుతసూత్రము చెప్పవలసినయవసరము లే దని నిశ్చయించినది. కాని యీప్రక్రియ సరి కాదు.

తియ్యన+పోఁడి యని యుండఁగా నిగాగమంబునకు బిందు వగు ననుసూత్రముచే బిందువు వచ్చు టేమి? ఇక్కడ నిగాగమ మేది? ఉన్నది నవర్ణకము. ఆసూత్రము ప్రవర్తింపవలె నన్న తియ్యని+పోఁడి యని చూపవలెను. ఇట తియ్యన (పోఁడి) యనునది క్రియకు విశేషణము కాదు. కావున ప్రౌఢ.సమా. 14 సూత్రముచే నవర్ణకమునకు బిందు వైన దనుటకు వీలు లేదు. ఈవ్యాఖ్య యిది కర్మధారయ సమాస మనుచున్నది. 'తియ్య' నల్లాదులలోనిది కావున 'గుణవచనంబు లగు నల్లాదులకుం గర్మధారయంబున' ననుసూత్రముచే నిగాగమ మయి, 'తియ్యని–పోఁడి' యని యగును. దీనిని నిగాగమాంత మనవచ్చును. కాని నవర్ణకాంత మనుట సరి కాదు కదా. కర్మధారయమున నల్లనకలువ, తెల్లనదామర యనురీతిగా నున్నవా? తియ్యన+పోఁడి యని యుండు టెట్లు? 'ఇది నవర్ణకాంతము' అనుచు 'నిగాగమంబునకు' బిందు వైన దనుట విరుద్ధము గదా.

ఇది యుపమానపూర్వపదము గాదు. కేవలకర్మధారయ మనుచో నీసూత్రము లేకయే తియ్యంబోఁడి యనురీతిశబ్దస్వరూపము సాధింపఁబడినది. కాని యర్థము కుదురకున్నది. దీని కీవ్యాఖ్య రెం డర్థములు చూపినది.

1. మధుర మైనయొప్పిదము. 2. మధురము మనోజ్ఞము నైనది. ఇందు మొదటియర్థము ననుసరించి ద్రోవది యనుమధుర మైనయొప్పిదమును వరించుటకు

నని చెప్పవలె. ఒప్పిదమును గలదానిని గదా వరించుట. ఒప్పిదమును వరించు టేమి? అందగత్తెను వరింపవలెఁ గాని యందమును గాదు గదా.

మధురమును మనోజ్ఞము నైనది యన్నది రెండవయర్థము. ఇదియు నంతే. తీయ, పోఁడి యను రెండువిశేషణములకును సమాసము విశేషణోభయపదకర్మ ధారయ మన్నమాట. ద్రోవది యనుతీయఁబోఁడి నని యుండుచో మధురమును మనోజ్ఞము నైనదానిని ద్రోవదిని ననురీతిగా నన్వయము కుదురును. ద్రోవది యనుమధురము, మనోజ్ఞ మైనదాని ననఁగా స్త్రీ నని యధ్యాహారము చేసికొనవలెనా? అలరుంబోఁడి, చిగురుంబోఁడి యనువానితో సామ్యము గలిగినతీయంబోఁడిని అలరుంబోఁడి యిత్యాదులవలెనే సాధించుట సక్రమము.

దాని కవరోధము– తీయ యనునది యుపమానము కాదు. గుణవాచకము మాత్రమే యని సర్వ. పేర్కొన్నది. తీయశబ్దమునకు లక్షణచే తీయ నైనది–చెఱకు అనురీతిగా నర్థము చేసినసూత్రకర్తమతములో దోషము లేదు. తీయవిల్తుఁ డనుచోఁ దీయ నైనవిల్లు గలవాఁడు=చెఱకువింటివాఁ డనురీతిగా నర్థము గ్రహింపఁబడు చున్నది. తీయవి ల్లనఁగాఁ జెఱకువి ల్లని యర్థము. ఇట నింకను జెఱ కనియే గ్రహింపఁదగుటలో విరోధమును లేదు.

కాని తీయఁబోఁడి యనునీయొక్కప్రయోగమునుబట్టి పోఁడియో యుత్తరపద మని నిర్ణయించు టెట్లు? ఇట్టిప్రయోగములు ప్రచురముగా లేవే. పూవుంబోఁడి, (భీమ. 5. 191) చిగుంబోఁడి(భోజ. 3. 90) అలరుంబోఁడి(రామా. 1. 72) యనురీతిగా నుదంతములపయిఁ బూర్ణబిందువు ప్రయోగములందుఁ బ్రసిద్ధముగా నుండఁగా ననంబోఁడి, విరింబోఁడి యనురీతిరూపములు కానరా వేల? (రమ. 350) బహుశః సూరి యిట్టికారణము ననుసరించియు 'పోఁడి'శబ్దముతో సమాస మనునభి ప్రాయమును మానుకొనియుండును. సూరి సూత్రాంధ్రవ్యాకరణమున నొకచో పూఁ బోఁడి యనుచో నుగాగమ మె ట్లని యనుమానించెను(కెంధూళి,కెంజడ, పూఁబోఁ డి. సంధి. 83, సంధి. 33?). పిదప మేనునకు బోఁడి యాదేశము చేసెను. ఉపమానం మేనునా స్త్రియామ్. (ఉపమానా న్మేనో ర్బోఁడి స్త్రియాం. పూఁబోఁడి. సమాస. 103)

ఇంక తీయఁబోఁడి యనుదానిని మాత్ర మనుసరించి బిందువును సాధించుటకై ప్రక్రియను మార్చుట యుక్తము గాదు. కావున నీకారణముచేఁ బ్రౌఢవ్యాకర్తృమతము పర మను కు. పం. వ్యాఖ్యాభిప్రాయ మంగీకారయోగ్యము గాదు.

తత్త్వ. పోఁడి యనునాదేశమును విధించి ప్రక్రియాగౌరవమును సహింపనక్కఱ లేకయే యీసమాసము సిద్ధించు (279) నని ప్రౌఢవ్యాకర్తృమతమును సమర్థించినది.

బాలవ్యాకర్త పోఁడి పర మగునపుడు నుమాగమమును గాని, నుగాగమమును గాని విధింపకపోవుటచేత ననఁబోఁడి యిత్యాదులు కావు. కావున ను మ్మగు నని యీవ్యాకర్త చెప్పినట్లు (290) నిర్ణయించినది. ఈయభిప్రాయము సుబోధినీవ్యాఖ్య నుండి (200) గ్రహింపఁబడియుండును.

కాని బాలవ్యాకర్త విధించినది 'బోఁడి' యనుసిద్ధసరళాది యగునాదేశము (కు.పం. 111) పోఁడి యనుపరుషాది కాదు. కావున ననఁబోఁడి యిత్యాదులలోని బోఁడిలోనిసారళ్యము బాలవ్యాకరణసిద్ధమే. బాల. చెప్పినయాదేశము విషయముననే సుబో. మొ. వ్యాఖ్యలు భిన్నాభిప్రాయముతో నుండుటచే నవి ప్రతిపాదించినయీసూత్ర సార్థక్యమును గూర్చి విచారింప నవసరము లేదు. బిందువిషయ మింతకు ముందే ప్రస్తావింపఁబడినది కదా. (అయినను సూరి నుగాగమము విధింపలే దనుచో నయ్యది చెప్పనగు. కాని సమాసమును మార్చు టేల? మేనునకు బోఁడి యాదేశింప వలసినగౌరవమును దగ్గించుటకా? బాలవ్యాకర్త విధించినయాదేశము పోఁడి యని తలఁచుటచే పోఁడి యనుదానికి మేను అనునర్థ మెచ్చుటను బ్రసిద్ధముగా లేకుండఁ గా నూతనముగా నాదేశమును గల్పించి బహువ్రీహి యనుట యనుచిత మగుటయే కాక ప్రక్రియాగౌరవహేతువు నగుచున్నది. కావున బాలవ్యాకర్త మార్గము సరి కా దనియు నిట్టివి కర్మధారయములే యనియుఁ బ్రౌఢవ్యాకర్తయాశయ' (288) మని తత్త్వ. పేర్కొన్నది. బాలవ్యాకర్త పోఁడి (పరుషాది) యాదేశించె ననియుఁ బ్రౌఢవ్యాకర్త పోఁడితోనే సమాసము చేసె ననియుఁ దలఁచుటచే నీవ్యాఖ్య కిటఁ బ్రక్రియా లాఘవము గానవచ్చినది. ఆదేశము బోఁడి యని సరళాదిగా గుర్తించిన బాల వ్యాకర్తృమార్గములో గౌరవము గల దనిపించెడిది గాదు. పోఁడి యనుటవలన నెల్లెడల నుమాగమ మవుటయు ద్రుతకార్యము లగుటయుఁ జెప్పవలసివచ్చినది. ఆదేశము బోఁడి యన్నపక్షమున ననబోఁడీత్యాదులలో నీకార్యములప్రసక్తి లేనే లేదు కదా. అలరుబోఁ డీత్యాద్యుదంతములవిషయమున మాత్రమే యట్టిప్రసక్తి గలుగును.

పోఁడి యనుదానికి మేను అనునర్థము లేకుండుటచే న ట్లాదేశించుటయు నుచితమును సంస్కృతాంధ్రవ్యాకరణములం దప్రసిద్ధము ననుతత్త్వ. అభిప్రాయ

మును సర్వ. ఖండించినది. 'సంస్కృతములో గమ్(లు) మొ. ధాతువులకు గచ్ఛ మొద లగునాదేశములు విధించుటనుబట్టి యట్లు బోఁడి యాదేశింపఁదగును (230). సర్వ.అభిప్రాయము యుక్తముగానే యున్నది. ఆదేశించినదానికి స్థానియొక్క యర్థ ముండవలె ననుటయు సరి కాదు. పో(బో)ఁడికి మేను అనునర్థ మున్నచో దానిని మేనున కాదేశింప నేల? దానితోనే సమాసము చేయవచ్చును గదా. ఇంకను మేనుశబ్దమున కాదేశింపఁబడినబోఁడి యపదము. ఆదేశ మయినపిదప దానికి స్థాని ననుసరించి మేను అనునర్థము గల దని యంగీకరింపఁదగునే కద.

పోఁడితో సమాసము చేసినను నర్థమునకు భంగము లే దనునభిప్రాయముతో తత్త్వ. ప్రౌఢవ్యాకర్తృవిధానము నంగీకరించినది. పోఁడితో వివక్షితార్థము సరిగాఁ గుదురునా?

పోఁడి యనుదానికి మనోజ్ఞ మని యర్థము. చిగురుంబోఁడి యనుచో చిగురువలె మనోజ్ఞము. చిగురువలె ఒప్పు (శ.ర.) అనురీతిగా నీయది ధర్మవాచకమే యగును గాని ధర్మి కాదు. చిగురుఁగేలు అనురీతియుపమానపూర్వపదకర్మధారయములలో చిగురువంటికేలు అనియే కదా యర్థము. అట్టియెడలఁ జిగురువంటికేలు గలది యనుతీరుగా నర్థము గలుగుట లేదు గదా. అట్లే యిటఁ గూడ సౌందర్యము చిగురువంటి దనవలెను. సుందరి(మేను) చిగురువంటి దనుట యెట్లు? దీనివలన లతాతన్వి, రతిసుందరి మున్నగుసమాసములవంటివే (తత్త్వ.279) యీయుపమాన పూర్వపదకర్మధారయము లనుట సరి కాదు కదా. తన్వి, సుందరి యనునవి యట స్త్రీవాచకము లై, ధర్మివాచకములు మాత్రమే. కావున లతాతన్వి యనురీతివానితోఁ బోలిక కుదురదు. దీనింబట్టి సూత్రకర్తయును బూవుఁబోఁడి యనఁగాఁ బూవువలె మనోజ్ఞురా లైన దని యర్థము చేయు టుచితము గా దని యంగీకరింపఁదగును.

అందుకే ఘం. ఉత్తరపదము పోఁడి యనుసూత్రకర్తసిద్ధాంతము నంగీకరించియు నివి యుపమానపూర్వపదకర్మధారయము లనుటను దిరస్కరించి, బహువ్రీహి సమాసములే యన్నది. (ఘం.166) కాఁగా తత్త్వ.నే యనుసరించిన సుగమ. వివరణము సైతము సరి గా దనుట స్పష్టము.(170)

వఝులవారు పోఁడి యనుదానికి విశేష్యత్వమున ఒప్పు అనియు విశేషణత్వమున ఒప్పిద మైనది యనియు నర్థములు. ప్రయోగదృష్టము లయియున్నవి. ఇందు

విశేష్యత్వమున మెఱుఁగుబోఁడి, ననబోఁడి, విరిబోఁడి మున్నగుచోటులందు బహువ్రీహియు విశేషణత్వమున నుపమానపూర్వపదకర్మధారయమును మెఱుఁగువలె నొప్పిద మైనది (స్త్రీ) పోఁడిశబ్దమునకు సందర్భపడుచున్నది. ఇట్లు ప్రసిద్ధ మగుపోఁడిశబ్దముతోడిసమాసము మూలముననే మెఱుఁగుబోఁడీత్యాదులు సిద్ధించుచుండుటంజేసియే నన్నయాథర్వణు లట్టివానిసిద్ధికై ప్రత్యేకముగా సూత్రింపరైరని యూహింపఁదగు (వ్యా.సం.స.1209) నని పేర్కొనిరి. (నన్నయాథర్వణు లిట్టివానిని గూర్చి చెప్పకుండుటను సమర్థించుటయు నిం దొకలక్ష్యముగాఁ గానవచ్చుచున్నది. విశేష్య మైనబహువ్రీహి విశేషణ మైన నుపమాన పూర్వపద కర్మధారయము నగు నని వీరిసిద్ధాంతము. అలరుబోఁడి యనునది బహువ్రీహియుఁ గావచ్చును. ఉపమానపూర్వపదకర్మధారయమును గావచ్చును. ఇట్లు రెండువిధము లని కాఁబోలును ఉద్ద్యోతములో బహువ్రీహిసమన్వయమును మానిరి. (చూ. బా.సూ.) విశేషణ మనుకొన్నపక్షమునఁ బూర్వపద మగునుపమానవాచకమును విశేషణమే. ఉత్తరపద మగుపోఁడిశబ్దమును విశేషణమే. అలరుఁబోఁడి యన్నది విశేషణోభయపదకర్మధారయమా? కాఁగా నీయలరుఁబోఁడి యనునది విశేషణమే కాని విశేష్యము కాదు. కాని శ.ర. అలరుఁబోఁడి. వి. పుష్పమువలె మనోజ్ఞురాలైనయింతి యని దీనిని విశేష్యముగనే పేర్కొన్నది. పూవువలె నొప్పిద మైనది యింతి యని విశేష్యముగానే చూపెను. దీనిం గూర్చి పైని నిర్ణయింతము.

ఘం. ఇవి యుపమానపూర్వపదకర్మధారయము లనుటను దిరస్కరించియు పోఁడితోనే బహువ్రీహి యనవలెను గాని సూరి మేనునకు బోఁడి చెప్పుట సరి గా దని నిర్ణయించినది. అందుకు రమణీయపంక్తుల నీవ్యాఖ్య విమర్శించినది.

లతాఙ్గీ, సుమాఙ్గీ యనువాని ననుసరించి తీఁగబోఁడి, యలరుబోఁడి అనురీతివి కల్పింపఁబడియుండును. కావున మేనునకు బోఁడి విధింపఁదగు నన్న (350) రమణీయాభిప్రాయము సరి గా దని ఘం. లతాంగీ, సుమాంగీ యనువానివలెనె కల్పించినచో మేను మున్నగుశరీరార్థకములతో సమాసము చేయుట జరుగును గావున కవులు మేనునకు బోఁడి చేసి రనుట హాస్యాస్పద మన్నది. ఇంకను మేనునకు బోఁడి నాదేశించుట వర్ణనాత్మకవ్యాకరణమున కుచితమే యైనను కవు లట్లు సమాసము చేసి రనుట సరి కా (262) దన్నది.

కాఁగాఁ గవు లేయుద్దేశముతోఁ బ్రయోగించిరో కాని, మేనునకు బోఁడి

యాదేశము చేసినపద్ధతి మాత్రము దుష్టము గా దని స్పష్ట మయినది. కవు లెట్టి యుద్దేశముతో సమాసము చేసి రనుటయే సరి కా దని ఘం. అభిప్రాయము. లతాంగీ, సుమాంగీ వంటి సిద్ధసమాసములకు సరిపెట్టవలె ననుతాత్పర్యముతో బాలవ్యాకర్త మేనునకు బోఁడి నాదేశము చేసి ప్రక్రియ నడిపె (164) నని యీ వ్యాఖ్యయు విరించినది. కాఁగా సూరియభిప్రాయము కూడ లతాంగీ, సుమాంగీ యనువానితో వీనిని సమములుగా సాధించుటయే. కవు లాయుద్దేశముతోఁ బ్రయోగింపలేదు గావున నట్లు సాధింపరా దని యీవ్యాఖ్య సిద్ధాంత మయినట్లు స్పష్టముగా గుర్తింప వీలు లేదు. ఏ లనఁ బైని తీయఁబోఁడి – మధురాంగి, ఇక్ష్వంగి వంటి సిద్ధసమాసములు కనబడ (282) వన్నది. ఇది రమణీయమునే కాక బాలవ్యాకర్త లతాంగీ, సుమాంగీ యనువానితో సరిపెట్టుటకు యత్నించుటను గూడ విమర్శించుట యని గుర్తింపనగును. (165)

1. ఇట్టివానికి సంస్కృతమునం దాధారము గల దని యూహించుచోఁ దెలుఁగున సమాసముల కెల్ల మూలము సంస్కృతమున నుండితీఅవలయు నని యాలోచించుట యుక్త మని తోఁపదు. సామ్యముచే నితరస్థలములందును గల్పింప వచ్చుఁ గదా. పోనీ, యాపద్ధతిని వీడి ఘం. ననుసరించి పోఁడితోనే సమాస మందము. తీయ నైన పోఁడి కలది=తీయఁబోఁడి. ఇట్టిసమాసములు సంస్కృతమం దున్నవా? ఉండ నక్కఱ లేదు. ఏ లన నీవ్యాఖ్య యిట్టివి సంస్కృతసమాసముల ననుసరించి కల్పింపఁబడిన వని చెప్పలేదు. కాని యాపైని తీయఁబోఁడి మున్నగు సమాసములను వివరించుచు 'అనాద్య స్యాపి శబ్దస్య కల్పనా క్వచి దిష్యతే' యను నధర్వణకారికచే నిట్టిసమాసములు సిద్ధించును. (284) అని పేర్కొన్నది. ఈకారికనే ము.ల.కౌ.లో సమా. 50 సూత్రముగా ననువదించి తీఁగఁబోఁడిని గూడ నీవ్యాఖ్యాత యటఁ బేర్కొనెను. కాఁగా బోఁడితో సమాసము నీవ్యాఖ్యానపక్షమున నయ్యది యనాద్యకల్పనముగా విశేషముగాఁ జెప్పుకొనవలసినదే యన్నమాట. అలరుబోఁడి యనురీతివాని నట ననాద్యకల్పనసందర్భమునఁ జూపలేదు. అనఁగా నీయవి యాద్యశబ్దానుగుణముగా నేర్పడినవా? అట్టియెడల బోఁడితో సమాస మేల? మేనునకు బోఁడి నాదేశించుసందర్భమున నైనను వీనికి సంస్కృతమున మూలము లేనపుడు వారిసమన్వయమం దెట్లో యట్లే 'యనాద్య స్యాపి శబ్దస్య కల్పనా' యనులక్షణమున కనుగుణముగా నైన వని యేల చెప్పరాదు? కావున బాల.ప్రక్రియ యంగీకార్యము

గా దనుటకుఁ జూపినయీమొదటికారణము (165) సరి కా దని స్పష్టము. అయిన సూరిలక్షణమునే పరోక్షముగా నంగీకరించిన ట్లయినది.

2. తీయంబోఁడివంటిబిందుఘటితరూపము బోఁడి యాదేశపక్షమున సిద్ధింప దని (165) సూరిమతమున నిం కొకయనౌచిత్య మీవ్యాఖ్య చూపినది. తీయంబోఁడి యనునొక్కపాంచాలీపరిణయప్రయోగమాత్రము ననుసరించి యెల్లెడ బిందువు గల దని యంగీకరింపరా దనురమణీయాభిప్రాయమునకు (రమ. 350) ఘం. మఱి యొక్కప్రయోగ మేని చూపిన బాగుండెడిది. గవనులు అనుప్రయోగము గలదు కదా యని నిత్యకుజ్వి్ధానము సరి కా దని తిరస్కరించితిమా? కెంధూళి, మొదలుగా నిట్టివిశేషప్రయోగస్థలము లెన్ని లేవు. ఇట్లు సామాన్యలక్షణమునకు భిన్నముగా నొండు రెండు ప్రయోగములు కానవచ్చినను నవ్వానిని విశేషస్థలములుగా గుర్తించుటయే యుక్తము. లాక్షణికసంప్రదాయము కూడ. అరు దగుస్థలమునుబట్టి భాషాసామాన్యలక్షణమును దిరస్కరింపరాదు. కావున నిదియును సరి యైన కారణము కాదు.

పోఁడి యుత్తరపదము చేసిన సరళ మగుటకు వీలు లేదు. కావున నుగాగమమును జెప్పినచో ఖండబిందు వుండవలసివచ్చును కావునను నిట బిందువు గానరాదు గావునను మేనునకు బోఁడి యాదేశింపఁదగు నని రమణీయ మన్నది. (349) దీనిం గూర్చి ఘం. తీవ+పోఁడి అనుచో బిందువు సమ్మతము కానిచో పకారమునకు బకారము విధించి ప్రక్రియ నడపవచ్చును. అప్పు డర్ధబిందువు ప్రసక్తము గా (202) దన్నది. పోఁడితో సమాసము చేసితి మనుతృప్తి కలుగుట ఫలము. పకారమునకు బకారము చేయుట యెల్లయెడల నవసరమే కదా. ఉదంత ములపై నుగాగమమువలన నది సిద్ధించును. కావున ననుదంతములపై విధించు కొనవలె. ఎల్లయెడల బకారము కనిపించునపుడు వచ్చునదే బోఁడి యనుట లాఘవము కదా. ఇ ట్లాదేశము చేయుట యుచితము గా దని యీవ్యాఖ్యయుఁ దలంపలేదు.

4. ఆపిదప నింకను విశేషముగా నీవ్యాఖ్య యిట్లు పేర్కొన్నది. ననబోఁడి, విరిబోఁడి మున్నగురూపములలో బకారశ్రుతి సర్వసమ్మతము. ఈబకారశ్రుతినిబట్టి నుగాగమము సకలకవిసమ్మత మని తెలియును. తీయంబోఁడి యనుప్రయోగము దీనిని బలపఱచును. (282) బకారశ్రుతి నిలిచి ముందు నుగాగమము గల

దనుట, యదియుఁ గవిసమ్మత మనుట సరి కాదు. ఎనుబదిలోను డెబ్బదిలోను బకారశ్రుతి యున్నది. అ ట్లని ముందు నుగాగమము గల దందురా? తీయంబోఁ డి యనుచో బిందువు గలదు గావున ననబోఁడీత్యాదులలో బిందు వున్న దనుటయు సరి కాదు. తొంబది యనుచో బిందు వున్నది గదా యని ఎనుబది యనుచో బిందు వున్న దందురా? తీయంబోఁడి యనుప్రయోగమా యాధునికము. పూవుం బోఁడి యిత్యాదిగా నుదంతములపయినే బిందువు ప్రసిద్ధము గాని ననంబోఁడి యిత్యాదిగా ననుదంతములపైఁ గానరాదు. ఎక్కడో యొకచోట నుండెఁ గదా యని యెల్లచోట్ల నుండు నని చెప్పు టెట్లు? పోఁడి పర మగునపుడు మాత్రమే యుదంతేతరములపై నియతముగా నుగాగమ మగు ననుట విశేషమే.

వఝులవారు ఖండబిందుస్థితిని నిర్వహించునాధారము లెవ్వియు లేవు. పూర్ణబిందుస్థితికి సైతము భారతాదిప్రాచీనప్రయోగములు లభింపలేదు. మను, వసుచరిత్రాదిప్రయోగములు మఱి కొన్ని (1240) అన్నది వ్యా.సం.స. అట్టియెడల తీయంబోఁడి యనుచో బిందు వున్న దని యితరస్థలములలో బిందు వుండవలె నను టెట్లో యర్థము కాదు. బిందుస్థితికిఁ బ్రాచీనప్రయోగము లే దనిరి కాని వఝులవారు అలరుబోఁడి యనుతీరుగా నిర్బిందురూపములను భారతాదిప్రాచీన గ్రంథములనుండి యుదాహరింపలేదు. అయినను ఖండబిందువును నిర్వహించు నాధారము భారతాదిప్రాచీనప్రబంధములందే కాక, యాధునికములందును లే వని వఝులవారియభిప్రాయము నెన్నవలెను. అట్టియెడలఁ బూర్ణ బిందువు లేని ననబోఁడి, విరిబోఁడి యనురీతిరూపములలో నసలు బిందువే లే దని చెప్ప వలయును గదా. బకారశ్రుతినిబట్టి నుగాగమము చేయ నారంభించిన నాద్రుత మే మైపోవును? ఇం తేల? బోఁడి నాదేశించినసూరి యుదాహరించినరూపములు బిందురహితములే కదా. అయ్యవి గ్రామ్యము లనవలెనా?

కావున బకారమునుబట్టి నుగాగమ మగు ననుట సరి కాదు. అంతే కాక సర్వసమ్మత మైనబకారశ్రుతినిబట్టి బకారాది యగు(బోఁడి)విధానమే తగు ననుటయు స్పష్టము.

5. అలరుబోఁడి వంటి బకారఘటితరూపములు బాలవ్యాకరణపక్షమున సిద్ధింప (169) వని యిం కొకదోషము చెప్పినది. దీనికి పోఁడి యుత్తరపద మన్నచో బాదేశము గావలె ననియు, నట్టిప్రయోగము లే దనియుఁ జెప్పినరమణీ

యాభిప్రాయ మాధారము గావచ్చును. కాని యలరుబోణి యనురీతి ణకారఘటిత రూపములు పోఁడిపక్షముననే సిద్ధించును. బోఁడి శబ్దాదేశపక్షమున సిద్ధింపవు. కాన మేనునకు బోఁడి యగు ననుట సరి కాదు.(283) (బా.గు.ప్ర.279, వ్యా.సం.స. 1240) అనునభిప్రాయము మాత్రము యుక్తము గాదు. అట్లు చెప్పుట కాధార మేమో యీవ్యాఖ్య స్పష్టము చేయలేదు. సూరి యండంగ్వాదులలో పోఁడిశబ్దమును జేర్చెను గాన దానికి ణత్వ మగు ననియు, అలరుబోఁడీత్యాదులను జేర్పలేదు కావున నట ణత్వము రా దనియుఁ దలంపఁదగునా? అడంగ్వాది యాకృతిగణము. ప్రయోగానుసారముగా నలరుబోఁడి యనురీతివాని నందుఁ జేర్చుటకు లక్షణము విరోధింపదు. ఇట నాదేశింపఁబడిన బోఁడి యపద మగుటచేఁ బ్రత్యేకముగా బోఁడిశబ్దము నందుఁ జేర్పరాదా?

కాఁగా ణకారఘటితరూపములు సిద్ధింపవు గావున సూరివిధానము సరి గా దనుటకు వీలు లేదు.

కాన మేనునకుబోఁడి నాదేశము చేయుపద్ధతి ప్రయోక్తృహృదయవిరుద్ధము. ప్రయోగవిరుద్ధము. పూర్వలాక్షణికవిరుద్ధము నగుటచే నగ్రాహ్య మనుట సరి కాదు. ప్రయోక్తహృదయ మిట్టి దని తెలియుట కిట నవకాశము చాలదు. ప్రయోగ విరుద్ధ మనునది నుమాగమముతో బిందువును సాధించినయీరూపములయెడనే వర్తించుచున్నది. కావున దీని ననుసరించి మేనునకు బోఁడి యాదేశము చేయవచ్చునో లేదో నిర్ణయింపరాదు. పూర్వలాక్షణికలక్షణము పరిశీలింతము.

పోఁడితోనే సమాసము చేయవలయు ననుట కీవ్యాఖ్య కొన్ని కారణములు చూపినది.

1. పూర్వలాక్షణికులు పోఁడిశబ్దముతోనే సమాసములు కల్పించినారు. పువ్వుబోఁడి. పువ్వుంబోణి, పువ్వుప్బోణి, అని బాలస. (203) ను మ్బోతః అనుసూత్రవ్యాఖ్యలోఁ జూపినది. అని యీవ్యాఖ్య యీయంశమున రెండు పర్యాయములు పేర్కొన్నది. (వావిళ్ల.పుట.175) కాని సాహిత్యపరిషత్ప్రతిలో నీయవి లేవు. మెఱుఁగుబోఁడి, పాణిపల్లవము ఇవి యుపమానసమాసములు (బా.స.246) సాహిత్యపరిషత్ప్రతిలో మెఱుఁగుబోఁడి, మచ్చెకంటి మొద లయినవి యుపమానములు(41పుట) అని యున్నది. ఇందు మచ్చెకంటి యనునది బహువ్రీహి యగుట నిర్వివాదము. దాని ననుసరించి పూర్వము చెప్పిన మెఱుఁగుబోఁడి యనునది సైత ముపమానపూర్వ

పదముగా నున్నయిది బహువ్రీహిసమాసమే యగుట విస్పష్టము. ఇయ్యవి యుపమానపూర్వపదకర్మధారయసమాసము లని బా.స. భావించె ననుట కీగ్రంథము ననుసరించి యెట్టియధారమును లేదు. వావిళ్లప్రతికి (1932) పరిష్కర్త లగువఝుల వారితరువాతి దగుసంహితాసర్వస్వములో (1951) మెఱుఁగుబోఁడి, తమ్మికంటి ఇత్యాద్యా ఉపమానగర్భబహువ్రీహయః (కవిశి. 629) అనునహోబలునివాక్యమును మెఱుఁగుబోఁడి, మచ్చెకంటి మొద లైనవి యుపమానములు (బా.స. 41). ద్విగుకర్మ ధారయా విత్యాదిసూత్రవ్యాఖ్య వావిళ్ల.ముద్రణము. (1236) మచ్చెకంటి యను దానిసాహచర్యమున మెఱుఁగుబోఁడి యనునదియు నుపమాగర్భబహువ్రీహి యనియె బాలసరస్వతులు సైతము బహువ్రీహి ప్రస్తావనమున వ్రాసినట్లు విశద మగుచున్న (వ్యా.సం.స. 1238) దనిరి. కావున నీబాలసరస్వతీయవ్యాఖ్యానమును బట్టి ప్రౌఢవ్యాకర్త కర్మధారయముగాఁ జెప్పె నను ఘం.ఊహ సరి కాదు. బాల సరస్వతి బహువ్రీహి యనియే భావించెను.

అయిన నిం దుత్తరపద మేది? పోఁడియా? కాదా? దానికి బాలసరస్వతీయము నిర్ణాయకముగా లేదు. కాన మేనునకు బోఁడి యగు నన్నసూరియభిప్రాయమునకు నిది మూల మనలేము. ఇంకను వఝులవా రన్నట్లు పోఁడియే యుత్తరపదముగా నెంచె నేమో యనియు సందేహించుటకు వీలు గలదు. ఏది యే మైనను ప్రౌఢ.కు బాలసరస్వతీయము లేదా కవిశిరోభూషణము మూల మనరాదు.

2. పోఁడిమి, పోఁడి, పువ్వుబోఁడి ఇత్యాదౌ డకార ఏవ న ణకారః ఇతి జ్ఞేయమ్. ఇట నహోబలుఁడు ణకారఘటితరూపము లే దన్నను పోఁడితోనే ప్రక్రియను జెప్పెను. (283) అహోబలునియభిప్రాయమును ని ట్లని నిశ్చయించి చెప్పరాదు. అందును బ్రస్తుతస్థలమున ణకారము రా దని చెప్పునదే కాని సమాసమును గూర్చి ప్రస్తావించునది కాదు.

కావున నీయవి బల మైనయాధారములు గాఁజాలవు. పోఁడి యనఁగ నెల్లెడలను నాడుంబేళ్లకును జెల్లు నభినవదండీ (ఆం.భా.భూ. 167) (ఘం. 283) ఈపద్యము పోఁడితో సమాసము చెప్పుచున్న దనుట సరి కాదు. 'ఆఁడును, నీఁడును, గత్తెయు, గాఁ డనుచోఁ గర్త యగు సగం బెఱుఁగంగాఁ బోఁడి యనఁగ నెల్లెడలను నాడుంబేళ్ల కును జెల్లు నభినవదండీ' (162) అనుపద్యసందర్భమునుబట్టి తద్ధితప్రత్యయములను గూర్చినప్రసంగమే కల దనుట స్పష్టము. అట్టియెడల పోఁడి తద్ధితప్రత్యయ మని

చెప్పె నని యేని చెప్పుట యుక్తము. కాని పోఁడితో సమాస మనుట కుదురదు. పోఁడిశబ్దముతోనే పూర్వవాక్యములు సమాసములు కల్పించినా రనుట కాధార మిది యెంత మాత్రమును గాదు. ఇది తద్ధిత మని భావించుట లేకపోలేదు. 'పూవుబోఁడి, మెఱుంగుబోఁడి నాసుకుమారతను మనోహరతను దనరి రెండుననువుగ మతుబర్థమున నిపాతము లగు' (అం.కౌ. 14పుట) నని తద్ధితప్రకరణముననే చెప్పెను. (సుకుమారత మేన్వర్థమును గ్రహించుట కాధారము కాఁగలదు.)

ఇంక మేనునకు బోఁడి నాదేశము చేయుట పూర్వలాక్షణికులలోఁ గానరా దనుట కివి యాధారములుగా గుర్తింపఁదగును.

కాఁగా బోఁడిశబ్దముతోనే సమాసము చేయవలయు ననుటకు బల మైనయాధార మేదియు లేదు.

ప్రయోగానుకూలముగాఁ బ్రక్రియ సుప్రసిద్ధ మగు పోఁడిశబ్దముతోఁ జెప్పుట కవకాశ మున్నపు డగతికగతి యనఁదగిన మేనునకు బోఁడి నాదేశము చేయుపద్ధతి యుక్తిసహము గా దని ఘం. (165) ఇం కొకకారణమును (వ్యా.సం.స. 1240) చూపినది.

అలరువంటియొప్పు గలది యనురీతిగాఁ జెప్పినను దప్పు లే దని యభిప్రాయము. మెఱుఁగువంటి మేను గలది, బంగారువంటి మేను గలది యనురీతిస్థలములలో ఒప్పు అనుదానికంటె శరీర మనురీతియర్థము బాగుగా నుండు ననుటకు సందేహింప నక్కఱ లేదు. కావుననే సూరి పోఁడితో సమాసము నిచ్చగింపక మేనుతోఁ జేసి బోఁడి మేనున కాదేశించెను. పోఁడితో సమాసము చేయుచో నర్థమునందుఁ గొన్నియెడలను, శబ్దస్వరూపమునందుఁ బెక్కెడలను సమర్థన మవసరము. ననబోఁడీత్యాదులలో ఖండబిందువున కాధారము లే దని వర్ఘులవారే తెల్పిరి గదా. ఇట్టియెడల నుమాగమము చెప్పి బిందువును సాధింప నేల? ఇట బోఁడిపరకత్వమునందు మాత్రమే నుమాగమ మనుటయుఁ జింత్యమే. ఉదంతములపై మాత్రమే బిందువు తఱచుగాఁ గనఁబడుచుండఁగా తియ్యంబోఁ డి యనురీతి గొండొక ప్రయోగమును విడిచిన నితరస్థలములందు లేనిబిందువును సాధింప ద్రుత మేల? కావలసినది సరళము. అట్టియపుడు బోఁడి యనునదే పరశబ్దముగాఁ జూపఁదగును. మేనున కాదేశించుటలో సంప్రదాయవిరోధమును

లేదు. అర్థమునందు సౌలభ్యమును గలుగును. ఉదంతములపై మాత్రమే బిందు వుండుటయుఁ బ్రయోగములకు ననుగుణముగా నుండును.

కావున లక్ష్యానుగుణముగా బోఁడిని జూపుటయు, నర్థానుగుణముగా దానిని మేనున కాదేశము చేయుటయు, సముచితములే యని గ్రహింపఁదగును.

పోఁడిశబ్దోత్తరపదకము లగుసమాసములు గూడ నిట్టిచోట్ల మాత్రమే తఱచుగా నుండు ననుటయు విలక్షణమే. కావున సూరివిధాన మెట్టిదొసఁగును లేక యుచిత మై యున్న దనఁదగును.

పూవుంబోఁడీత్యాదులలోఁ గవులయభిప్రాయ మేమి యన్నదానితో లాక్షణికులకు సంబంధ మెంతవఱకు. (పూవును) పోలినది–పోలింది–పోంది–పోండి–పోఁడి అగు నననూహ కలదు. (రమ. 351)

బొంది శబ్ద మొండు దేహ మనునర్థము గలదు. 'బొందితోడన దివి కేఁగు' (సూ.ని.) అదియే తేలినచో బోఁది–బోఁడి యగును. ఇపుడు దానికి దేహ మనియు నర్థ ముండును. పూవుంబోఁడి – పూఁబోఁడి యనురీతిగా నివి యేర్పడిన వేమో. కాని వ్యస్తముగా నేఁడు బోఁడిశబ్దము దేహ మనునర్థమున లేదు. కావున దానితో సమాస మనుట కవకాశము చాలదు.

ఒకప్పుడు వ్యస్తముగా నుండి వ్యవహారభ్రష్ట మై సమాసమందు మాత్రమే నిలిచియున్నచో నద్దానిని (వ్యవహారమం దుండి) బ్రసిద్ధ మగుమేనుశబ్దమున కాదేశము చేయుపద్ధతి చరిత్రానుగుణము నైయుండనోపు.

కాని యిట్టివి ప్రాచీనప్రయోగములలోఁ బ్రసిద్ధములు గాకుంట బోఁడి శబ్ద మిం కొకరీతిసమాసములలోఁ గూడఁ గానరాకుండుట విశేషములే. స్త్రీవాచక మైన బోఁటిశబ్దమే బోఁడిగా నీసమాసము లేర్పడిన వేమో. ఇట్టులు చరిత్ర నూహింప వలసినయవసరము శబ్దశాస్త్రకర్తలకు లేకుండుటచే సముచిత మగునర్థమున కనుగుణముగా శబ్దస్వరూపమును లాఘవముగా సాధించుటకు లాక్షణికుల కవరోధము లేదు.

కావున సూరి చెప్పిన 'పూవువంటిశరీరము గలది' యనురీతియర్థమే సముచితము. కావునఁ దదనుగుణముగా స్వతంత్రముగనే చెప్పె ననియు నయ్యది (సూరి చెప్పినది) గ్రాహ్యమే యనియు నిర్ణయింపనగును. అనఁగా మేనునకు బోఁడి యాదేశము చేసి బహువ్రీహిగా నిర్ణయించుట యుక్తము.

## ద్విగువు

**ముక్త.5. ద్విగువు మహదర్థఘటితం బదృష్టంబు.**

తెలుఁగున మహదర్థముతోఁ జేసినద్విగుసమాసము కానరా దని సూత్రార్థము.

అనఁగా త్రిపురుషాః అనురీతిగాఁ దెలుఁగున ముమ్మనుజులు అనురీతి సమాసము లుండ వని సూత్రాభిప్రాయమును వ్యాఖ్యలు స్పష్టము చేసినవి.

ఘం. మాత్రము ముప్వేలుపులయిక్క అనుసమాసమునుబట్టి మూఁడు–వేలుపులు – ముప్వేలుపులు అనురీతిని ద్విగువు మహద్వాచకముతోఁ గనఁబడు నని చెప్పవలసి యున్నది. కావున ద్విగువు మహదర్థఘటితంబు క్వాచిత్క మనఁదగు (260) నన్నది. కాని మూఁడు–వేలుపు లనురీతివిభాగము కుదురునా? మూఁ దనునది యమహద్వాచక మయినది. వేలుపు మహ త్తగుటచే దానికి విశేషణ మగు సంఖ్యావాచకము సైతము మహత్తే యగును. అట్టియెడల మూగురు వేలుపు లని యుండవలెను. ఇట నుగాగమము ప్రాతిపదికమునకు విధింపఁబడుటచేత విభక్తి లోపించునపుడు ప్రాతిపదికావయవ మగు గుక్కు లోపింపదు. మూఁడు (ముగ్గు) వేలుపు లనియే కావలెను. ఇట్టియెడల 'మహద్విశేషణ సంఖ్యావాచకంబులకుఁ గొన్నియెడల నమహత్కార్యంబు చూపట్టెడి' (శబ్ద.104) ననుసూత్రముచే నమహత్కార్యము చేసికొని మూఁడు–వేలుపు లని వ్రాసికొని, యాపిదప ముప్వేలుపు లని చేయవలయును. ఇట్టసమయమున దీనిని ముయ్యేద్వాదులలలోఁ జేర్చికొని హ్రస్వద్విత్వము లేవ్యాకరణమున నిత్య మనవలెను? సమాసము నిత్య మనవలె. సమాసము నిత్య మని చెప్పుకొనవలెను. లేనిచో మూఁడువేలుపు లనురీతిరూపము నుండవలసినస్థితి యేర్పడును గదా. దీనికంటె నిక్కలాదిసూత్రమునకు లేదా సమా.36 సూత్రమునకో యాయది లక్ష్యముగాఁ జేసికొనుట యుక్తము.

ఇట్లు చూడ విశేష్యము మహద్వాచము కాఁగా నిద్దరు, ముగ్గురు, అనురీతిగా సంఖ్యావాచకములు మహద్రూపము నందఁగా నట్టివానికి సమాసము గానరాదు. కావుననే సూత్రకర్త 'యదృష్టం' బని చెప్పె నని గ్రహింపవలెను.

కాని యొక్కశబ్దము విశేషణ మగుచో ఒక్కమనుష్యుఁడు అనురీతి సమాసము లుండుట కభ్యంతరము లేదు గదా.

ఘం.శబ్ద5 సూత్రమున నేకాంత మనుసంఖ్యాప్రయుక్తవిశేషణము మహ

ద్విశేష్యకము గా దని చెప్పుటచే ముప్వేలుపులువంటివి వాకర్త కనిష్టములు గా వని గ్రహింపనగు (260) నన్నది. ఇది సమంజసమే. రెండున్నరమానిసి యనుదానిని సూత్రకర్తయే యింతకుముం దుదాహరించెను. ఇట్టిది క్వాచిత్కమే కావచ్చును. కాని దీనికి లక్షణమునం దవకాశము కల్పింపవలెను గదా.

మహదర్థఘటితం బగుద్విగు వనఁగా సాధ్యద్విగుసమాసము గా దని (410) తత్త్వ. పేర్కొన్నది. సాధ్యసమాస మనుదానిని సూరి తత్సమములకుఁ జేసిన సమాసముగా వివరించెను. ఈవ్యాఖ్య తెలుఁగునఁ జేసినసమాస మనుసామా న్యార్థమునఁ బ్రయోగించుట విశేషము.

కాని సూత్రమున కి ట్లర్థము చేయునవకాశము లేదు. దానివలనఁ దెలుఁ గున సిద్ధద్వంద్వములును లే వని చెప్పవలసివచ్చును..

కాఁగా రెండున్నరమానిసి యనురీతిసమాసములు స్పష్టముగాఁ జూపియు నదృష్టం బని నిర్ణయించుట యుచితము గాదు.

ఈసూత్ర మీవ్యాకరణమునఁ జివరి దగుటచే గ్రంథమును మంగళాంతము చేయుటకై యదృష్టం బని ప్రయోగించియుండును.(ఘం.) కాని లక్షణము నిర్దుష్టముగా నుండవలయును గదా.

అదృష్ట మనఁగా దృష్టము లైనవానిని గ్రహింపఁదగు ననునభిప్రాయము సూత్రకర్తకుఁ గల దేమో.

## ముయ్యేడ్వాదులు

### 10. ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వంబులు నిత్యంబులు.

ముయ్యేడు మొద లగువానిలో హ్రస్వమును, ద్విత్వమును నిత్యముగా వచ్చు నని యర్థము. మూఁడు+ఏఁడులు=ముయ్యేఁడులు. అనఁగా నిరువదియొకటి. మూఁడేడు లనురీతిరూప ముండ దని యభిప్రాయము. ఇట్లే ముయ్యాఱు మొ.

ఈసూత్రారంభమును గూర్చి కు.పం. మీఁదిహల్లున కనియుండుటంజేసి హల్లు పర మగునపుడే బాల.సూత్రములు ప్రసక్తించు ననియు హ్రస్వద్విత్వములు నిత్యములే యన్నట్లు సూత్రరచన యగపడుచున్నను, మూఁడుజగ మేలు, మూఁడులోకములు అని కూడ నుదాహరించుఁ బూర్వసూత్రమునుండి విభాషానువృత్తి చిన్నయసూరి

కభిప్రేత మనియుఁ దలంచి, యాతఁ డీసూత్రమును రచించినట్లున్న ( (106) దని పేర్కొన్నది. ఇందు మొదటిది సరి యైనకారణము గాఁజాలదు. త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు విధించినను, ఆ+యశ్వము=అయ్యశ్వము అనురీతిగా నచ్చు పర మైనను యడాగమయకారమునకు ద్విత్వ మైనది కదా.

ఘం. బాల.సమా. 17 సూత్రము వర్తించును. ఏ లన నీసూత్రమున లోప ద్విత్వము లనఁగా రెండును గలిపి విధింపఁబడినవి. కనుక లోపద్విత్వములు కలిసియే వర్తింపవలెను. మూఁడు+ఏఁడులు అనుచో లేపము గలిగిన మూ+ఏఁ డు అని నిల్చును. ఇట హల్లు పరముగాకుండుటచే ద్విత్వమునకుఁ బ్రాప్తి లేదు కావున లోపద్విత్వములు రెండును వర్తింపవు.(150) కావున నీసూత్రము చెప్పఁ బడిన దన్నది.

మూడు+ఏఁడులు అనుచో డుజ్లోప మైనపుడు ద్విత్వము తప్పక వచ్చుచునే యున్నది. 'మూయేఁడు' లనురీతి నుండదు గదా. మూఁడు+ఏఁడు లనుచో లోప మైనపిదప హల్లు పరముగా లేదు కావున, ద్విత్వము రామి, లోపమును విధింప నక్కఱ లేదా? అనఁగా నీవ్యాఖ్య యీవిధానసామర్థ్యముచే డుజ్వర్ణము లోపించినపిదప దిత్వప్రాప్తి కనుకూలముగా యడాగమము వచ్చు (150) నన్నది. ఇదే పద్ధతిని బాల.లో ననుసరింపవీలు లేదా? డుజు లోపింపఁగా, మీఁదిహల్లునకు ద్విత్వ మనుటచే నందలిసామర్థ్యముచే యడాగమము రాఁగా నిష్టరూపము పిదప నగు నననగును గదా. ముజ్జగము లనురీతిగా హలాదిశబ్దపరకతలో బాల.విధానము సార్థకమే యగుటచేత నట విధానసామర్థ్యము నవకాశము లేదు. అట్టియెడ నిట విధానసామర్థ్యము నాశ్రయించుట తప్పు గాదు.

కాని సూత్రకర్త కీయభిప్రాయ మున్నదా? ఉన్న దన్నచో లోపము రాఁగా ద్విత్వమున కవకాశము లేకపోవుట బాలవ్యాకరణమున నచ్పరకతలో మాత్రమే కావున నట్టివానినే యిట లక్ష్యములుగాఁ జూపవలెను. మఱి సూత్రకర్త ముమ్మడుగు అనుదాని నేల యుదాహరించెను. ఇట లోపద్విత్వములు బాలవ్యాకరణముచే నగుట కిబ్బంది లేదు గదా. ఈరూపము నీవ్యాఖ్య బాల.చేతనే సాధించినది. ఈసూత్రము ప్రసక్తియే లేదు. మఱి సూత్రకర్త దీని నిట నేల యుదాహరించెను. అనఁగా నంతకు ముందు మూఁడు+మడుగు బాల.సమా. 17.మూ+మ్మడుగు. బాల.సమా. 13 ముమ్మడుగు. హ్రస్వద్విత్వములు నిత్యము లనుటచే సమాసపక్షమున

ముమ్మడుగు అనియే యగును. మూఁడు మడుగు అని కా (150) దన్నది. కాఁగా హ్రస్వద్విత్వములను నిత్య మనుటవలన మూఁడుమడుగు అని కా దనఁగా బాల.చేత 'మూఁడుమడుగు' అనురీతిగాఁ గూడ నుండవలసివచ్చు ననవలెను. లేనిచో బాల. చేత సమాసపక్షమున 'ముమ్మడు' గనియే యగుచుండఁగా మఱల 'మూఁడుమడుగు' గా దనుటకు నిత్య మన నేల?

కు.పం. వ్యాఖ్య విభాషానువృత్తిచే రెండురూపములు. మూఁడుమడుగు, ముమ్మడుగు. అని కావలసియుండుట ననుసరించియు నీసూత్రము ప్రారంభింపఁ బడిన దని తలఁచినది. సుబో. ప్రభృతులు నిట్లు చెప్పినవి.(190). (సర్వ.206, తత్త్వ.253, సుగమ161)

ఘం. నట్లే భావించినదా? కాని బాలవ్యాకరణమునం దీవ్యాఖ్య ఉత్తరపదంబు అనుటచే సమాసమును వివక్షింపనిచో మూఁడుజగములు, మూఁడులోకము లని యుండును. కాఁగా మూఁడుజగములు వ్యస్తరూపము. ముజ్జగములు సమాస (బాల.ఘం.246) మన్నది. అది యెంతయు సమంజసము. కాఁగా సమాసవివక్షలో బాల.చేత నీలోపద్విత్వములు నిత్యముగా వచ్చుచుండఁగా మూఁడుమడుగు అనురీతి రూపము సమాస మయినపు డుండకపోవుట బాల.చేత సిద్ధము గదా. అట్టియెడల దానిని వారించుట కిట హ్రస్వద్విత్వములు నిత్య మన నేల? కావున నిత్యకయియే యీవిధానము చేయఁబడినచో నయ్యది వ్యర్థ మనక తప్పదు. కాఁగా విభాష గావలసివచ్చుటచేత నిత్యతకై సూత్ర మారంభింపఁబడిన దను కు.పం, సుబో. వ్యాఖ్యలయభిప్రాయమును సమంజసము గా దని తేలుచున్నది.

ఇంతకును ముయ్యేడు, ముయ్యాఱు అనువానితోపాటు ముమ్మడు గనునదియు నుదాహరించుటచేత నచ్పరకత్వమున బాల.చేత లోపద్విత్వములు ప్రవర్తింపని స్థలములను సాధించుటకే యీసూత్ర మారంభింపఁబడిన దని చెప్పుట కాధారము లేకుండఁబోయినది.

కావున సూత్రకర్త కట్టియభిప్రాయము గల దనరాదు. సర్వ. ముయ్యేడులు బాల.చేతనే సాధించినది.(206).

ఇంక కు.పం. ప్రభృతులు భావించినట్లు సూరి యట ముజ్జగములు మూఁడు జగము లనునవి రెండును జూపుటచే వైకల్పిక మనునభిప్రాయము గలుగు ననియే

నిత్య మని యీసూత్రము నారంభించెనా? అట్టియెడలఁ బైవిచారణము ననుసరించి యీనిత్యవిధానము వ్యర్థమే యని నిర్ణయింపవలెను.

నిజమునకు ముయ్యే దనురీతిరూపములు నిత్యముగా నేర్పడుటను పేర్కొనఁ దలఁచినను, సూత్రము నిట్లు చెప్పరాదు. ఏ లన ద్విత్వము వచ్చినచో 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' నని హ్రస్వము నిత్యముగనే వచ్చును. ద్విత్వము విభాష యేమో యని యనుమానించుట కవకాశము గలదు. కావున హ్రస్వము నిత్య మని చెప్పవలసినయవసరము లేదు. ఇంక లోపద్విత్వములే నిత్య మనవలెను. అదియును బాల.సిద్ధ మగుటచే ననవసరము.. కాని సూత్రకర్త యీసూత్రము బాల.ను దృష్టిలో నుంచికొనియే చెప్పెనా యని సందేహము.

'ఇదమదఏతద్యత్తచ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహులం హ్రస్వం ప్రపద్య దీర్ఘాః ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి' యని చింతామణి హ్రస్వద్విత్వములను విధించుట గమనింపఁదగును. ప్రస్తుతసూత్రవివరణమునను సూత్రకర్త చింతామణిప్రసక్తిని దెచ్చెను.

ఇదమద సిత్యాదిసూత్రమందలియదఃప్రభృతులు వ్యర్థము లగుచు స్వేతరంబులకు నక్కార్యంబు లని తెలుపుచున్నది. ఇద మద సేత చ్ఛబ్దములు మూఁడును ఈ అనుదానినే బోధించుచున్నవి. మూఁ డేల? ఒకటి చాలదా? రెండువ్యర్థము లై యితరముల కక్కార్యములు గల వని చెప్పుచున్నది. ఆయితర మీమూఁడుశబ్దము. దీనికిఁ గలిగినయక్కార్యము లనఁగా హ్రస్వద్విత్వములే గదా, చింతామణి చెప్పు చున్నది. కావునఁ జింతామణిలక్షణమును దృష్టిలో నుంచుకొనియే దానికి వివరణముగా నీసూత్రము ప్రారంభింపఁబడిన దని చెప్పుచో హ్రస్వవిధానము సముచితము గాఁగలదు. అక్కడ 'దీర్ఘాః బహులం హ్రస్వం ప్రపద్య ఉపర్యక్షరస్య ద్విత్వం జనయన్తి' యని చెప్పఁబడినది. దీర్ఘమునకు హ్రస్వము వచ్చుట బహుళము. దీర్ఘము హ్రస్వ మైనచో నది మీఁదివర్ణమునకు ద్విత్వమును జేయును. అ ట్లగుచో హ్రస్వము నిత్య మనుట సార్థకమే. కాని హ్రస్వము వచ్చినచో ద్విత్వము నియతము గావున ద్విత్వము నిత్య మని వేఱ చెప్ప నక్కఱ లేదు. స్పష్టతకయి రెండింటిని జెప్పియుండు ననవలె. స్వేతరము లనఁగాఁ ద్రికేతర మగునీమూఁడుశబ్దమును గ్రహించినచో నిందు డుజ్లోప మెట్లు?

బాల. సముచిత మైనప్రణాళికతో లక్షణము సేసియుండఁగాఁ బెక్కెడల బాల.నే దృష్టియం దుంచుకొని లక్షణము చేయువాఁ డైయుండియు నిట నసమగ్రముగా నున్నచింతామణిలక్షణమునకు వివరణముగా నీసూత్రమును జెప్పవలసిన యవసరము గానరాదు. కాఁగా నట్లు చూచిన నీలక్షణము చింతామణికి వ్యాఖ్యాన మనఁదగినను విశేషలక్షణము గా దని యంగీకరింపక తప్పదు. ఈయర్థము నెట్లో చింతామణికి ముడి వెట్టుప్రయత్నము చేసెను గాని యం దీవ్యాకర్త సఫలుఁ డు కా లే దనవలెను.

ఈయర్థమును జ్ఞాపనము చేయుటలో స్వాంశమునందుఁ జారితార్థ్యము అనఁ గా అదస్ ఏతత్ శబ్దములపునర్గ్రహణము సార్థ మగుట సాధింపఁబడలేదు. కావున స్వేతరములకు నిక్కార్యము కలుగు నని యర్థాంతరమును జ్ఞాపనము చేసినపద్ధతి సంప్రదాయానుగుణముగా లే దని తత్త్వ. పేర్కొనుట సముచితముగా నున్నది. కావున నీవ్యాకర్త ప్రయత్నము వృథాప్రయాస మైనది.

బాల. సాధించినను జింతామణియందు సాధింపఁజూచుట నిరర్థక మనరాదు. (సర్వ. 207) కాని యాప్రయత్నము సముచితముగా లేదు కావున నిరర్థకము.

ఇట నొక్కవిషయము మాత్రము గమనింపఁదగును. బాల.ననుసరించియే సమాసమునందు లోపద్విత్వములు నిత్యములు గావున వానిని విధింపనవసరము లేదు. కాని మూఁడేడు లనురీతిరూపము లసలే యుండరా దని నిర్ణయింపఁ దలఁచుచో నట్టివి వ్యస్తములు గావున వ్యస్తరూపములు లే వన్నమాట. అనఁగా నిట సమాసము నిత్య మని యర్థ మైనది. కావున నిట్టిచోట్ల సమాసమును నిత్యముగా విధించుట యుక్తము. మూఁడుమడుగులు, మూఁడార్లు, మూఁడేళ్లు అనురీతివి లోకవ్యవహారమునం దున్నవి. అవి కావ్యవ్యవహారమునఁ గానవచ్చుచో మాత్రమే యీలక్షణము వ్యర్థ మని నిర్ణయింపవలెను.

## వారార్థకశబ్దములు - సంఖ్యాపూర్వకత్వము

**21. వారార్థకశబ్దంబు లద్విరుక్తంబులు తఱచుగ సంఖ్యాపూర్వకంబు లగు.**

తడవ, తేప మొద లగునవి వారార్థకశబ్దములు. ఇవి ద్విరుక్తము లయినచో తడవతడవకు, తేపతేపకు ఇత్యాదిగా నుండును. ద్విరుక్తములు గానిచో నీశబ్దములకు

పూర్వమునందుఁ దఱచుగా సంఖ్యను దెలియఁజేయుశబ్దము ఉండును. అనఁగా నపు డివి ద్విగుసమాసము లగు నన్నమాట. తఱచుగా ననుటవలన ద్విరుక్తములు గానపుడును సంఖ్యాపూర్వకములు గాక, తడవకు, సారెకు ఇత్యాదిగా నరుదుగాఁ బ్రయోగింపఁబడును. అని సూత్రమునభిప్రాయము. (కు.పం. 112)

తత్త్వ. ఈసూత్రము స్పష్టార్థ మన్నది.

తడవకు అనుచోట విభక్తియే యేకత్వమును జెప్పుటచే సమాసమును వివక్షింప లే (283) దన్నది. ఒకతడవకు, ననుసమాసమున మాత్రము కువిభక్తి యేకత్వమును బోధించునది కాదా? ఏకత్వమును బోధించుటకును సమాసమును వివక్షింప కుంటకును సంబంధ మేమియో స్పష్టము గాదు. ఒకతడవకు, రెండుతడవలకు ననియు సూత్రకర్త యిట నుదాహరించెను.

ఇది యిట్లుండఁగా సర్వ. 'తడవకు మాటికి మున్నగువిధముగా నద్విరుక్తము లైనచోట్ల కూడ తడవ తడవకు, మాటిమాటికి అనువానియర్థమునే కలిగించును. ఏకత్వమునే యపేక్షించునపుడు ఈతడవకు మున్నగువిధముగా నిర్దేశాత్మక మగు సర్వనామమును గాని యేకార్థకసర్వనామమును గాని ముందుగాఁ బ్రయోగించుట సాధారణముగా జరుగుచుండు' (219) నన్నది. దీనింబట్టి పైతత్త్వ. అభిప్రాయము సముచితము గా దని స్పష్టము. తఱచుశబ్దముచే నద్విరుక్త మైనను ఈతడవకు, ననుచో నర్థవిశేషమునఁ ద్రికము ముందు నిల్చుట విరుద్ధము గా దని గ్రహింపఁ దగును.

స్పష్టము చేయలేదు గాని యీసర్వ.వివరణము ననుసరించి ప్రస్తుతసూత్రము వ్యర్థ మని తెలియవలెను. సంఖ్యాపూర్వకత్వమును విధింప నక్కఱ లేదు. ఏక త్వార్థమును జెప్పవలయుచో నొకశబ్దమును ముందు చేర్చుటయు, ననఁగా నొక శబ్దమునకు దీనితో సమాస మగుటయు, నట్టియాయాసంఖ్యార్థములతో రెండుతడవలు, మూఁడుసార్లు అనురీతిగా నవుటయు సామాన్యాంశములే గాని వారార్థకశబ్దములప్రత్యేకలక్షణము కాదు. అట్లే యర్థవిశేషములందు ఈసారికి, ఆతడవకు ననురీతిగాఁ ద్రికమును గానవచ్చుచునేయున్నది. కావున సంఖ్యా పూర్వకము లగుట యన్నది విధింపవలసినయంశము గాదు.

తడవతడవకు నిత్యాదిగా ద్విరుక్త మవునపుడు సంఖ్యాపూర్వము గా దని చెప్పుట కయినను నీవిధానము (అసలు లక్ష్య మది గాకున్నను) అనవసరము. భృశార్థమును

వివక్షించునపుడే ద్విరుక్తి సంభవించును. కావున సంఖ్యాపూర్వకత్వప్రసంగమే లేదు. తడవకు ననునది గూడ తడవతడవకు ననురీతిగా నర్థము నిచ్చుచున్నది. దాని నీసూత్రము సాధించుట లేదు. సాధింపవలసినయవసరమును లేదు. కాని ఒకతడవకు, తడవకు నని యుదాహరించుటలో తడవకు ననునది యేకత్వబోధకమే యైయున్న దని సూత్రకర్త తలఁచె నేమో యని యనుమానింపవలసివచ్చుచున్నది. ద్విరుక్తము లగునపుడును నద్విరుక్తము లై సంఖ్యాపూర్వకము లగునపుడును నర్థమున భేదము గోచరించుచున్నది. కావున నీరెంటిని గలిపి యభిన్నము లనురీతిగా లక్షణము చేయుట యుక్తముగా లేదు.

సారెకు, మాటిమాటికి (శ.ర.) మాటికి ముహురర్థకము. తూరి తడవ ఆవృత్తి. ఇది యేకాద్యర్థకపూర్వకముగనే ప్రయోగింపఁబడును. ఒకతూరి, ఈతూరి (శ.ర.) తఱచుశబ్దము నీయర్థమును సయితము సాధించుటకు సూత్రకర్త చేర్చియుండ వచ్చును.

మొత్తముమీఁద ద్విరుక్తము లైనపుడు సంఖ్యాపూర్వకములు గా వని చెప్ప నక్కఱ లేదు. ద్విరుక్తములు గానపుడు సంఖ్యాపూర్వము లగు ననియుఁ జెప్పనక్కఱ లేదు. ఒకతూరికి ననువానివిషయ మిట సూత్రకర్త ప్రస్తావింపనే లేదు. కాఁగాఁ బ్రస్తుతసూత్ర మేయర్థమును గాని, విశేషముగాఁ జెప్పునది కాదు. కావున నీసూత్ర మును జెప్ప నక్కఱ లే దని నిర్ణయింపఁదగును.

## మిశ్రద్విగువు - ఏకవచనము

**20. ఒక్కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతంబు నగు.**

'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగ నగు' నని యాగక సూరి 'మిశ్రంబునకుఁ గాదు' అనియుఁ జెప్పెను. అధర్వణుఁడు సయితము 'ద్విగో రమిశ్రతాయాం ప్రాయ ఏకత్వ మిష్యతే' యని చెప్పి యూరకుండక 'మిశ్రతాయాం బహుత్వం స్యాత్' అనియుఁ జెప్పెను. దీనివలన మిశ్రద్విగువున కేకవచనము నిషిద్ధ మైనది. ప్రయోగానుసారముగా మిశ్రద్విగువునందును నేకవచనము గల దని సూత్రకర్త చెప్పుచున్నాఁడు.

నల్దిక్కు, ముల్లోకము, ముమ్మూహూర్తము అనుమొద లగునవి లక్ష్యములు.

కు.పం. ఇది యథర్వణులకు సమ్మతమే(112) యన్నది. అది నిరాధారము. వి.వి. ఏకవచనము 'అమిశ్రతాయామ్' అనుటయే కాక, 'మిశ్రతాయాం బహుత్వం స్యాత్' అని మిశ్రద్విగువునకు బహువచనమే యగు నని కూడఁ బేర్కొన్నది. కావున మిశ్ర ద్విగువున కేకవచనము వి.వి. సమ్మతించె ననరాదు. అందుచేతనే 'అన్య త్రాపి క్వచి ద్భవే' త్తనుకారిక కహోబలుఁడు కూడుచీర యనుద్వంద్వమునందలియేక వచనమును లక్ష్యముగాఁ జూపె నని తలంపఁదగును. వ్యా.సం.స. (1231) ఇది ప్రౌఢ. చెప్పినవిశేషముగానే పేర్కొన్నది. వి.వి.కారికావివరణసందర్భమున వఝల వారు చేసినసమాహారద్విగుప్రసంగ మనుచితము. (చూ.బా.సూ.)

సర్వ. 'ఇట దీనికి నాలుగుదిక్కులయొక్క సమాహారము అని సమాహారార్థమును జెప్పికొనినయెడల నేకవచనాంత మైనప్పటికి నర్థప్రకటనమునందు ఇబ్బంది గలుగ' (218) దన్నది. సమాహార్థమువలనఁ బ్రయోజన మేమి? ఏకవచనము విధించుట యవసరమా? యనవసరమా? ఈవ్యాఖ్య వివరింపలేదు. అట్టియెడల నేక వచనమును విధింపవలసినదే యనియు నిట్టివి విశేషప్రయోగము లనియు నావ్యాఖ్య భావించిన దనవలయును. ఇంక సమాహారార్థము చెప్పుకొనుటవలనఁ బ్రయోజన మేమి? ఏకవచనాంత మైనను నర్థము గుదురుట యనవలెను. సమాహారార్థమును జెప్పనిచో నర్థమున కిబ్బంది యుండునా? అట్టియెడల సూరి సాధించిన ముచ్చిచ్చు మొద లగునాచ్ఛికద్విగువులు నేకవచనాంతములు గాన నటఁ గూడ సమాహారార్థము చెప్పవలె నని యీవ్యాఖ్య యేల వ్రాయలేదు.(217) ఆచ్ఛికద్విగువులం దేకవచన మగునపుడు సమాహారార్థము లేకయు నర్థము గుదురునపుడు మిశ్రద్విగువులయం దేకవచనము విధించుటకు నేల యిబ్బంది కలిగినది. బహువచనమునకు విధించుటచేత నీయేకవచనము బహుత్వార్థకమే యగుట సిద్ధించుచున్నది. కులిశ ధారల్ కుంఠితం బయ్యె, మొద లగుచోట్ల నేకవచన మట్లే బహుత్వార్థక మగుట లేదా? కాఁగా సమాహారార్థమును జెప్పనిచో మిశ్రద్విగువున కేకవచనాంతమునకు నర్థమునం దిబ్బంది గలుగు ననుట సమంజసము గాదు.

తత్త్వ. 'సంస్కృతమున తద్ధితార్థోత్తరపదసమాహారే చ అనుపాణినిసూత్రముచే వచ్చెడి సంఖ్యావాచకశబ్దములసమాసములు మాత్రమే ద్విగుసమాసము లనఁబడును. అనఁగా సంఖ్యావాచకములు పూర్వమునఁ గలవి యెల్ల ద్విగుసమాసము లని తలంపరాదు. అందుచేఁ దెలుఁగున సంఖ్యాపూర్వకసమాసములు ఏకవచనాంతము

లుగా నున్నచో ద్విగుసమాసము లనియు, బహువచనాంతములుగా నున్నచోఁ గేవలకర్మధారయసమాసము లనియుఁ దలఁపఁబడవలసియున్నది. మిశ్ర మయినను నాచ్ఛిక మైనను భేద మేమియు లే' (252) దని చెప్పి తెలుఁగులాక్షణికు లెల్లరు నీ విషయమునఁ బ్రమాదపడి రనినది. వి.వి. మొదలుగా నీతెలుఁగువ్యాకరణము లన్నియు సంఖ్యావాచకము పూర్వమునఁ గలకర్మధారయసమాసము ద్విగు వనియే తలఁచినవి. సమాహారద్విగు వనురీతివ్యవహారము లేదు. సూరియు వి.వి.నే యను సరించెను. అట్టియెడల నీవ్యాకర్త లెల్లఁ బ్రమాదపడి రని (అనఁగా సంస్కృతలక్షణ మర్థము చేసికొనలేకపోయి రని యర్థమా?) తలఁచుటకంటెఁ దెలుఁగున ద్విగువును బ్రత్యేకముగా నిర్ణయించి రని పేర్కొనుట యుక్తముగా నుండును. వి.వి.లోను నీసంస్కృతలక్షణమును సమన్వయించి వఝులవారు ప్రమాదపడిరి. (చూ.బా.సూ.) కాఁగా నాచ్ఛికసమాసములందే యేకవచనము తఱచుగా నుండుట మిశ్రద్విగువున లేకుండుట యనురీతిభేదము ననుసరించి తెలుఁగుద్విగువును దెలుఁగులాక్షణికులు ప్రత్యేకముగాఁ దలఁచి రని చెప్పుటయే యొప్పును. నల్గడ యనునది సమాహార ద్విగు వనియు నల్గడ లనునది సామాన్యకర్మధారయ మనియుఁ (తత్త్వ.282) జెప్పుటకంటె వి.వి. ఆదిలక్షణములు చెప్పినట్లుగా బహువచనమున కేకవచన మై, (ఆయేకవచనము బహుత్వార్థక మై)న దనుట యుక్తము.

నల్దిక్కు ఇత్యాదిమిశ్రద్విగువులలో నేకవచనము క్వాచిత్క మగుటయు విధించు నీలక్షణమును సార్థకమే యగుచున్నది.

## షష్ఠీతత్పురుషము - నగాగమము

**1. షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాష నగు.**

షష్ఠీతత్పురుషసమాసములలో 'న' యనునది విభాషగా నాగమ మగు నని యర్థము. కిత్త్వమునుబట్టి పూర్వపదమునంత్యావయవమున కగుట గుర్తింపవలెను.

జవ్వనంబుయొక్క విలసనంబు - జవ్వనంబువిలసనంబు - జవ్వనంబున విలసనంబు.

తత్త్వ. ఈనగాగమ ముదంతజడవాచకములపైనే యగు నని పేర్కొన్నది (251). అది యుచితము. సర్వ. ఇచ్చటినగాగమము ఉదంతము లయినయమహత్తులకు

మాత్రమే కలగు (67) నన్నది. ఘం. కూడ నమహత్తుల కన్నది. (147) అమహత్తు లనుట యుక్తము గాదు. జడములతోపాటు స్త్రీతిర్యగ్వాచకములును నమహచ్ఛబ్దముచే బోధింపఁబడుటంజేసి వానికి నుదంతముల కీనగాగమము రావలసియుండును. వధువునయాననము, (వధువునాననము) ఏనుఁగునబలము (ఏనుఁగుబలము) అనురీతిగా స్త్రీతిర్యగ్వాచకములపయి నీకార్యము గానరాదు గదా. కావున నుదంత జడవాచకము లనుటయే లెస్స.

కాని సూత్రమునం దిట్లు స్పష్టముసేయుదళము లేదు. విభాషాపదాశ్రయణము లేకుండ స్పష్టముగాఁ జెప్పుట యుక్తము. కావున 'షష్ఠీతత్పురుషమునం దుదంతజడ వాచకమునకు నగాగమంబు విభాష నగు' ననురీతిగా సూత్ర ముండుట కొంత యుచితము.

ఇట్టియెడల విభాష నగు ననుటయు సరి కాదు. విభాష నగు నని సామాన్యముగాఁ జెప్పఁదగినంతటిప్రచురముగా నిక్కార్యము గానరాదు. ఉదంతజడ వాచకము పూర్వపద మయినపు డెల్ల నగాగమము విభాషగా వచ్చు నని చెప్పుట లక్ష్యానుగుణ మయియుండదు. కావున 'నగాగమంబు చూపట్టెడి' ననురీతిగాఁ బ్రయోగానుగుణముగా గ్రాహ్య మగుటను, గ్వాచిత్క మగుటను సూచించుట యుక్తముగా నుండును.

ఇట లక్ష్యములంగూర్చియు వ్యాఖ్యలు పరామర్శించినవి.

యోగక్షేమంబునతెఱంగు అనుచో నున్నది సప్తమీనవర్ణక మనియు, నయినను యోగక్షేమంబునఁ దెఱఁగు ననురీతిగా ద్రుతకార్యములు లేమింజేసి యివి వ్యస్తము లని తలంపరా దనియు తత్త్వ. పేర్కొన్నది (250). సర్వ. దీని నంగీకరించినది.(166)

కాని యివి ప్రాసాదిగతంబులు గామింజేసి ద్రుతకార్యము లున్న వన్నను దప్పు లే దనుట సరి కాదు (250). దీనిని సర్వ. తిరస్కరించుట యుచితమే (166). ప్రాసాదిగతప్రయోగములు ప్రబలము లగుట యథార్థమే యైనను, గావు గదా యని యథేష్టముగా దిద్దఁదలఁచుట సరి కాదు గదా.

ఇంక తత్త్వ. ఇందలినవర్ణము సప్తమీవిభక్తిగా సమన్వయింపఁదగు ననియు నీయది సప్తమ్యలుక్సమాస మనియుఁ బేర్కొన్నది (250). సర్వ. సప్తమీతత్పురుషములుగా స్వీకరించి యలుక్సమాసము లనుకొన్నచో- అరదంబునన్+ఉరవడికిన్ అను

చోట సమాసద్రుతమునకు లోపము చేసి, అరదంబునయురవడికిన్ అనురూపమును సాధింపవచ్చును. కాని యంతటిప్రక్రియాగౌరవము ప్రయోజనవంతము గాదు. కావున షష్ఠీతత్పురుషరూపమునందు నగాగమప్రాప్తి నంగీకరించుటయే యుత్తమము. పక్షమునయందు మున్నగుచోట్ల సైతము నగాగమము గలుగుట చూచితిమి. ఇదియు నట్టిదే (166) యన్నది.

అరదంబునన్+ఉరవడి యనుచో ద్రుతలోపము చేయుట ప్రక్రియాగౌరవ మనుట సంగతము గాదు. కేవలము దాని ననుసరించియే నగాగమ ముక్త మన్నచో నది సరి గాదు. అరదంబునయురవడి యనుచో యడాగమము రెండు పక్షములందు సమానము. అందుకే సర్వ. దాని బేర్కొనియుండకపోవచ్చు. కాని 'యరదముయొక్క+ ఉరవడి' యనుచో విభక్తిలోపము నగాగమము అనురెండు కార్యములు ప్రవర్తింపఁ జేయవలెను. అట్లు గాక సప్తమ్యలుక్సమాస మన్నచో సామాసికద్రుతలోప మొక్కటే కార్యము. అట్టియెడ షష్ఠీతత్పురుషపక్షముననే గౌరవము గల దని స్పష్టమే కదా.

ఇంక నగాగమ ముత్తమ మనుటకు సర్వ. చూపినహేతువుకంటె కు.పం. చూపినహేతువు కొంత యుక్తముగా నున్నది. 'కొన్నియెడల సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబు నగు' ననుదానిచేత విధింపవచ్చును గాని వీనిలో సంబంధార్థ ముండుటచే వీని ని ట్లని వేఱుచేసి సాధించె నని తోఁచుచున్నది. (కు.పం. 102). సంబంధార్థమును బట్టి నవర్ణకము గా దని కు.పం. అభిప్రాయము.

ఘం. కూడ నిట్లే భావించినది (319). సప్తమీతత్పురుషముపక్షమున ఎల జవ్వనంబునందలివిలసనంబు అనురూపములును బాక్షికముగా నేర్పడవలయు ననియు ఇట నూత్నయౌవనవిలాస మనురీతిగానే కవిహృదయ మనియు ఘం. అభిప్రాయము. కాని ఎలజవ్వనంబునందలివిలసనంబు అనుటలో ననౌచిత్య మేమి? కువలయంబునవారు అనుసప్తమ్యలుక్సమాసము పక్షాంతరమున 'కువలయంబు నందలివా' రని యుండు నని ప్రౌఢవ్యాకర్తయే పేర్కొనుట గమనింపఁదగును. కాఁగా 'ఎలజవ్వనంబునందలివిలసనంబు' అనురీతిరూపములు గా వనునభిప్రాయము సూత్రకర్తకు లేదు. కావున నాయభిప్రాయముతో నగాగమము విధించె ననుట సమంజసము కాదు. మిగిలినవి కూడ నిట్లే సమన్వయించుచోఁ గవిహృదయము భగ్నము కాదు.

ఘం. చూపిన–రూపమునయేడ్తెర విరా. 1.226, చెల్వమునయేడ్తెర విరా. 1.298,

భవంబునతుది. శాంతి. 3.348 మున్నగునవి కొన్నియు (319) నిట్లు సప్తమీతత్పురుష ములుగా సమన్వయింపఁజాలినవి కాకపోవు. సప్తమిగా సమన్వయించుచో నర్థము కుదురనపు డట్టిచోట్లను బ్రస్తుతసూత్రమునకు లక్ష్యములుగాఁ జూపఁదగును.

సూత్రమును వ్యర్థము చేయుతలఁ పొక్కటే కాదు, సప్తమిగా సమన్వయించుటకుఁ దగినయాధారమును గూడ తత్త్వ. చూపినది.

ఈనగాగమ ముదంతామహత్తులకే యగుటను ఘం. అంగీకరించినది. (అమహత్తు లనుట సరి కాదు.) ఈయంశమే యిది సప్తమీప్రత్యయత్వమును జాటుచున్న (251) దని తత్త్వ. పేర్కొన్నది. ఉదంతజడంబు సప్తమికే కద నవర్ణక మగునది. ఇట నగాగమము సైత ముదంతజడములకే యగుచున్నది. ఇట్టి సామ్యమును జూపిన దీనికి సమాధాన మేమి? తత్త్వ.వలె నుదంతజడముల కని భావింపమి నీవ్యాఖ్య యాసామ్యమును గూర్చి ప్రస్తావించియుండకపోవచ్చును.

కాని సప్తమీసమన్వయ మెల్లెడఁ గుదురుట లేదు. ఘం. చూపిన ఔత్సుక్యంబున కలిమి, మలీమసవృత్తంబునపొంత యనుచో ఔత్సుక్యమునందలికలిమి, మలీమస వృత్తమునందలిపొంత యనురీతి సమన్వయము సరి కాదు గదా. కావున నట్టియెడల మాత్రము సప్తమీనవర్ణసమన్వయము సరి కా దనక తప్పదు. సూరియును 'నీ వ్యాకరణంబునమూలం బయినకృతిని బోలఁ గనఁదగున్' అని బాలవ్యాకరణము చివరఁ బ్రయోగించెను. ఇట నీవ్యాకరణముయొక్క మూలంబు అని షష్ఠీతత్పురుషము గా మాత్రమే సమన్వయింపవలెను గదా. కావున షష్ఠీతత్పురుషమునందు నగాగమము నంగీకరింపక తప్పదు. కాని య ట్లని తత్త్వ. అభిప్రాయము కేవలము సూత్రమును వ్యర్థము చేయుటకుఁ జెప్పినదిగాఁ దిరస్కరింపరానిదిగాఁ గూడ గుర్తింపవలసియున్నది.

సూరియును సూత్రాంధ్రమున 'షష్ఠీసమాసే' యని షష్ఠీసమాసమున నగాగమము విధించియున్నాఁడు. 'నగాగమంబు షష్ఠికి సమాసంబునయం దగు' నని చెప్పెను. (శ.ల.సం. 3.58) కావున షష్ఠీసమాసమునందు నగాగమము విధింపవలసిన యవసరము సూరియు గుర్తించెను.

అట్టియెడలఁ గొండొకచో షష్ఠియందు నగాగమ మెట్లును నంగీకరింపవలసి నపుడు మిగిలినపైయుదాహృతులందు మాత్రము షష్ఠీతత్పురుషమునందలినగాగమ మని యేల సమన్వయింపరాదు. అని యనుమానము గలుగుట సహజము.

సప్తమ్యర్థమే సముచితముగా నున్నచోట సప్తమ్యలుక్సమాసములుగాఁ జెప్పుటయు షష్ఠ్యర్థము సరిపడుచోట నగాగమముగాఁ జెప్పుటయు యుక్తము కదా. ఇంక నిట్టియెడల నీసూత్రకర్త చెప్పిన సప్తమ్యలుక్సమాసమును బరిశీలించి నిర్ణయించుట యుక్తము.

## సప్తమ్యలుక్సమాసము

### 37. కొన్నియెడల సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబు నగు.

దీనికి ముందు సూత్రకర్త యలుక్సమాస మని పేర్కొనెను. కాఁగా సప్తమీతత్పురుష మునందు నవర్ణక మనఁగా సప్తమీనవర్ణకము లోపింపకయే నిలిచియుండు నని యర్థ మగుచున్నది. ఇట తత్త్వ. 'నకారమును కానవచ్చు' ననుట (304,308) యేల? నకార మన నవర్ణము గావచ్చును. కాని సప్తమీవిభక్తిప్రత్యయ మగునవర్ణ మనియో, సప్తమీనవర్ణక మనియో చెప్పిన స్పష్టముగా, సందేహము కలుగకుండును గదా.

కువలయంబునన్+వారు = కువలయంబునవారు మొద లగునవి లక్ష్యములు. ఇటఁ గువలయంబునందలివా రనుతీరుగా సప్తమ్యర్థము మాత్రమే కుదురును. కువలయముయొక్కవారు = కువలయమునవా రనురీతిసమన్వయ మిట సరిపడునా? నిజకులంబునవారికి మొద లగున వెల్ల నిట్టివే. కావున సప్తమ్యలుక్ సమాసమున నవర్ణకముతోడిరూపములు నంగీకరింపక తప్పదు.

షష్ఠీతత్పురుషమందును నగాగమము గలదు. సప్తమియందును నవర్ణక మున్నది. కావున నవర్ణము గన్పించున వెల్ల షష్ఠీతత్పురుషము లని కాని, సప్తమీతత్పుషము లని కాని చెప్పవలసినయవసరము లేదు. కావున నర్థానుగుణముగా షష్ఠిలో నగాగమ మనియో, సప్తమ్యలుక్సమాస మనియో గుర్తింపఁదగును. పైని అరదంబునయురవడి, యోగక్షేమంబునతెఱఁగు అనునవి షష్ఠీతత్పురుషములే యనఁదగియున్నవి. కాని 'ఎలజవ్వనంబునవిలసనం' బనుచో 'జవ్వనంబునన్ విలసనం' బని సప్తమ్యర్థ ముచితము. కావున నయ్యది సప్తమ్యలుక్సమాసము. పక్షాంతరమున జవ్వనంబు నందలివిలసనం బనియే యుండవలసినయవసర మేమి? మాటయందలినేర్పు = మాటనే ర్పనురీతిగనే జవ్వనంబునందలివిలసనంబు = జవ్వనంబువిలసనం బని

యుండఁదగును గదా. కాఁగా నుదంతజడముపైనే యానవర్ణము కన్పించినను గొన్నియెడల సప్తమ్యర్థముకంటె షష్ఠ్యర్థమే సముచిత మైయుండుటచేత షష్ఠీసమాస మందలినగాగమముగా సమన్వయింపక తీఱ దని మాత్రమే సమాధానము చెప్ప వలసియుండును.

ఈనగాగమమునకును నచ్పరకతలో సూరి చెప్పిననుగాగమమునకును సంబంధము లేదు. అయ్యది మహత్తు లమహత్తు లనువివక్ష లేక యన్నింటికి నచ్పరకత్వముననే యగును. ఇది యుదంతముల కమహత్తులకు (జడములకు) మాత్రమే యచ్ హల్ పరకత్వమున నగును. అయిన నానుగాగమమువలె నియ్యది సాధారణ మైయుండదు.

ఇంక నీసప్తమ్యలుక్సమాసవిధానమును గూర్చి విచారింతము.

'సప్తమీతత్పురుషంబులందు నవర్ణకంబు నగు' నని నవర్ణకము చెప్పఁబడినది. ఇట్లు నవర్ణకమును విధించు టేల? కువలయంబునన్+అనుచో నవర్ణక మంతకు ముందే యున్నది. అలుక్సమాసమున నయ్యది లోపింపలే దంతియ. అట్టియెడల నున్నదానిని విధింప నేల? అనఁగా కు.పం. 'అందలి అనునర్థమున నవర్ణక యోగము ప్రయోగములం గొండొక కన్పట్టుచున్నను బాల.లో తత్సాధకవిధి మృగ్య మైనందునను ఆకొఱంత నీసూత్రముచే నితఁడు తీర్చినాఁ' (120) డన్నది. అందువిభక్తితో సూరి యలుక్సమాసమును జూపెను. కావున నవర్ణకముతోడి యలుక్సమాసము సాధింపనికొఱఁత యేర్పడినదా? అట సూరి యలిగాగమమును విధించెను గాని, యలుక్సమాసమును జెప్పలేదు. అలుక్సమాసములను బ్రస్తావింపనే లేదు. ఇంక విధానసామర్థ్యముచే నయ్యవి బాల.సిద్ధము లైన వని భావించుచో నవర్ణకమునకు సంబంధించి యట్టివిశేషకార్యము లేమిఁ జెప్పకుండుటవలన నాసమాసము సాధింపఁబడ దనుట యుక్తమా? నిజమునకు – చేత, తోడ, వలన, అందు అనువానికి భిన్నముగా సమాసములలో విభక్తిలోపింపకుంట యన్నది నవర్ణకముననే యనవచ్చును. తలన్+ప్రాలు అనుచోఁ గొండొకచో (సప్తమ్యర్థక) ద్వితీయయు లోపింపదు. అట్టిది బాల.సిద్ధము (సంధి.35). కావున సప్తమీ నవర్ణకముతోడియలుక్సమాసములు గల్గుటను బేర్కొనుట యుచితమే యగును. అనఁగా నవర్ణకము లోపించుట లే దని చెప్పుట యుక్త మనఁదగును.

అట్టియెడల 'నవర్ణకంబు నగు' నని యీసూత్రము నవర్ణకమును విధించు చున్నట్లుగాఁ జెప్పఁబడినది.

ఇటఁ దత్త్వ. నవర్ణలోపంబు రాకుండుటయుం గల దని చెప్పఁదగు (305) నన్నది. దీనివలన నవర్ణకమునకు లోపము వచ్చి కువలయమ్ముvా రనురీతిగాను నగు నన్నమాట. నవర్ణకంబునకును లోపము రాకుండుట గల దన్నచో నందువర్ణక లోపము లేమి కూడ స్మరింపఁబడెడి దనవచ్చును. అలిగ్విధానముచే నది యెట్లును సిద్ధమే యని యభిప్రాయము గావచ్చును.

'నవర్ణకంబు నగు' ననుచోట నుశబ్దముచేత కువలయంబునందలివా రనియు నుడవచ్చు నని సూత్రకర్త వివరించెను. సప్తమ్యలుక్సమాసములో నవర్ణకమే కాక యందువర్ణకము నుండవచ్చు నని యభిప్రాయ మనవలెను. విభక్తిలోపపక్షమున కువలయమ్మునవా రనురీతిగ నుండఁదగు ననియు నూహింపవచ్చును.

నవర్ణకము లోపింపనిచో కువలయంబునన్+వారు. స్థిరము పర మగుటచే ద్రుతలోపము మాత్రము వచ్చును. నవర్ణకము లోపింపదు. కువలయంబునవారు. (304) అను తత్త్వ.ప్రక్రియ సరి కాదు. ఇది యలుక్సమాసము గాదా? విభక్తి లోపింపకున్నను నీయది సమాసమే కావున 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' ననుసూత్రము ననుసరించి యిట ద్రుతము లోపించిన దని పేర్కొనవలెను (ఘం. 182). స్థిరపరకత్వముచే లోపించిన దన్నచో 'సరళస్థిరంబులు పరంబు లగునపు' డనుసూత్రముచే నగులోపము విభాష గావున రానిచో 'కువలయంబునన్ వారు' అని కావలె. పరుషపరకత్వమున నాపరుషములు సరళము లగుట మొద లగుద్రుతకార్యములు రావలెనే కాని ద్రుతము లోపింపదు (క్షేమంబున తెలుఁగు). కాఁగా నట్టి 'కువలయంబున న్వారు' అనురీతివానిని వ్యస్తరూపములుగానే సమన్వయింపఁదగియుండఁగా నలుక్సమాస మన నేల? బాల. సంధి. 24చే నిట నిత్యముగా ద్రుతము లోపించు ననియు, స్థిరపరకతలో లోపించు ననుట పొరపా టనియు నిశ్చయింపఁదగును.

ఈవ్యాఖ్య యీసూత్రముచే గతార్థ మగుటంజేసి 'షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాష నగు' ననుసూత్ర మనావశ్యక మని యింతకు ముందు చెప్పఁబడె' (304) నన్నది. అనఁగా నచ్చోటిలక్ష్యము లెల్ల నీసూత్రముచేతనే సిద్ధించు

నన్నమాట. అట క్షేమంబునతెఱఁగు, అరదంబునయురవడి యని సూత్రకర్త చూపినవి యీసూత్రమునకు లక్ష్యము లగుచో మాత్ర మట్టిరూపము లగు నని తత్త్వబోధిని యటఁ బేర్కొన్నది. సరళాదేశాదులు రాకుండుటకై యీసూత్రము చెప్పఁబడిన ట్లీవ్యాఖ్య (250) స్పష్టము చేసినది. ప్రస్తుతవివరణము ననుసరించి యది కుదురదే. పరుషపరకత్వముననను, నచ్పరకత్వముననను ద్రుతలోపము నీసూత్ర మెట్లు చెప్పును? యోగక్షేమంబునం దెఱఁగు, అరదంబున నురవడి యని కావలదా? ఇట్లు ద్రుతకార్యము లుండుచో నీయవి వ్యస్తరూపములే యగు ననియుఁ బ్రాసగతములు కామి ద్రుతకార్యములు గల వన్నను నిబ్బంది లే దని యిటఁ జెప్పినది. (250)

కాఁగా యోగక్షేమంబునతెఱఁగు, అరదంబునయురవడి యనునవి యీ సూత్రమునకే లక్ష్యము లనుతత్త్వ.అభిప్రాయ ముచితముగా లేదు. అట 'నరదంబు నందలియురవడి' యనుటకంటె 'నరదముయొక్క యురవడి' యనుటలో నర్థము గుదురుట సులభము (ఘం. 319). పైఁగా నీవ్యాకరణంబునమూలంబు, ఔత్సుక్యంబునకలిమి యనురీతిస్థలములనుబట్టి షష్ఠియందు నగాగమ మెట్లును విధింపక తప్పదు. కావున నర్థము సులువుగా సరిపడుట ననుసరించి యాసూత్రము నకే లక్ష్యము లనఁదగు.

సర్వ. సమాససూత్రమున షష్ఠీతత్పురుషములోఁ జెప్పిననగాగమమునకును నిచ్చటివిభక్తికిని భేదము లేదు. కావున నచ్చటవలెనె యిచ్చటను సంబంధార్థము చెప్పుకొనఁదగు ననియుఁ గావున నీసూత్రమే వ్యర్థ మనియుఁ బేర్కొన్నది. (280) తత్త్వ.(204) ఇట్టియభిప్రాయముతోను దిరస్కరించినది.

కాని దినమునయినుమాడ్కి, గృహమునకల్మి (ఘం. 330) అనురీతిస్థలముల సప్తమ్యర్థము గుదురువడినట్లుగా సంబంధార్థము గుదురువడదు.

కావున నీసూత్రము వ్యర్థ మనుట సమంజసము గా దని నిర్ణయింపఁదగును.

కువలయమ్మువా రనురీతిప్రయోగములు లభించునట్టియెడలఁ గువలయమ్ము యొక్క వారు-కువలయమ్మువారు అనురీతి సమన్వయము గుదురునా లేదా? గత్యంతరాభావస్థితిలో యొక్కషష్ఠితో సమాసము చేయనగును. కాని సప్తమీనవర్ణక లోపముతోఁ గుదురువడుటకు నవకాశ ముండఁగా షష్ఠితో సమాస మేర్పడుట యన్నది యనవసర మగుసమన్వయము. మాటనేర్పు అనుదానిని మాటయందు

నేర్పు అనురీతిగా సప్తమీతత్పురుషముగా సమన్వయించుట లేదా? మాటయొక్క నేర్పు అనురీతిగా షష్ఠిగా సమన్వయించుచున్నామా? అదే విధముగాఁ గువలయమ్ము వారు అనురీతివి సైతము కువలయమ్ముయొక్క వారు అని సమన్వయింపవలసిన యవసర మేమి?

కావున నవర్ణకముతో సప్తమీతత్పురుషముగా సమన్వయించుటయే యుచితము.

కాని యిట లక్ష్యములలో నొకటిమాత్రము షష్ఠీతత్పురుషముగా సమన్వయింప వలసినది గలదు. వీఁ డేవంశమ్మునవాఁ డనుచో వాఁ డనునది యుత్తరపదముగాఁ గన్పించుచున్నను నయ్యది స్వార్థమునం దున్నది గా దని వీఁ డనునదియే నిరూపింపఁ జాలుచున్నది. ఇట్టియెడలఁ దచ్ఛబ్దముతో సమాస మగుట యెట్లు? తత్పురుష ముత్తరపదార్థప్రధాన మయియుండవలెను గదా. తచ్ఛబ్దార్థ మిటఁ బ్రధానము గాదే. సూరి 'సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు' నని చెప్పెను. కావున సంబంధార్థవివక్షయుఁ దచ్ఛబ్దముతోడిసమాసమును గుదుర్ప వలయును. దివ్యతేజంబునవాఁడు (తద్ధి. 19)అనుదాని నీరీతిగనే సమన్వయించితిమి. అట్లే వంశమ్మునవాఁడు అనురీతివియును సమన్వయించుట యుక్త మని తోఁచు చున్నది. నావంశమునకు సంబంధించినవాఁ డనురీతిగా నిట సంబంధార్థమునఁ దచ్ఛబ్దముతో షష్ఠీతత్పురుష మై, నగాగమ మయిన దనఁదగును.

కువలయమునవా రిత్యాదులలోఁ గువలయముయొక్క వా రనురీతిని సంబం ధార్థము సరిగా సమన్వయింపదు. కావున మిగిలినలక్ష్యము లిటఁ జూపఁదగి యున్నవి.

తత్త్వ. ఈలక్ష్యములం దెల్ల వాఁడు, వారు అనునవి తచ్ఛబ్దార్థమును జెప్పుట లే దనియు నట్లు చెప్పకుండుట సమాసమునందే సంభవించును గావున నివి సమాసము లనవలెను గాని, లేనిచో వ్యస్తము లనఁదగు (304) నన్నది. అట్టియెడల 'చిత్తమునదుఃఖంబు' లనునది వ్యస్తమే యగునా? (ఇ ట్లని యీవ్యాఖ్య స్పష్టము చేయలేదు.) కువలయమ్మునవారు ఇత్యాదులలో వారు తచ్ఛబ్దార్థకము గా దనుట సరి కాదు. పయిఁగా సమాసము చేసినఁ దదర్థ ముండ నక్కఱలే దనుటకు నాధార మేమి? సమాసంబునం దుత్తరపద మగుతచ్ఛబ్దము తదర్థము నీయ దనుటకుఁ బ్రమాణ మెద్ది యేని చూపవలసినది. అట్టివాఁడు, ఉన్నవాఁడు అనునవి (304) చూపిన దీవ్యాఖ్య. 'ఇం దున్నవాఁడు' సమాసము గాదు. ధాతుజవిశేషణము.

విభక్త్యంతరూపము. అట్టివాఁడు సమాసమే. కాని సంబంధార్థమునందుఁ దచ్ఛబ్దముతో సమసించుటచేత నటఁ దచ్ఛబ్దము తదర్థక మగుట లే దని గుర్తింపఁదగును. నల్లనివాఁడు మొద లగున విట్టివి.

కాని కువలయంబునవా రనుచో సమాస మైనను దదర్థము లే దనుట యెట్లు? సంబంధార్థమునం దనుసూత్రమున కిది లక్ష్యము గాదు గదా. అయిన షష్ఠీ సమాసమున నగాగమ మనవలె. అపు డీసూత్రము వ్యర్థమును, సమాససూత్ర మనవసరము నగును. అది యీవ్యాఖ్యసిద్ధాంతము గాదు. కాఁగా తత్త్వ. సమన్వయము సరి కా దని స్పష్టము.

## క్లీబసమము - ద్వంద్వము

**29. ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమం బగు. అగుచో నాముపర్ణకంబునకు లోపం బగు.**

'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' నని సూరి ద్వంద్వసమాసములోఁ బ్రాయికముగాఁ బూర్వపదము స్త్రీసమము నుత్తరపద మాచ్ఛికము నైయుండు నని పేర్కొనెను. అట్లు గాక పూర్వపదము క్లీబసమముగా నుండుట విశేషముగా నీసూత్రము చెప్పుచున్నది. అట్టిక్లీబసమముయొక్క ముపర్ణక మీసమాసమున లోపించు నని సూత్రమున నుత్తరార్థము చెప్పుచున్నది.

అందము+చందము=అందచందములు. వెచ్చము+సచ్చము=వెచ్చసచ్చములు.

ఇట ముపర్ణకమునకు లోపము చెప్పుట యవసరమా యని సందేహము. తత్త్వ. సమాసవిభక్తికి అనుసూత్రముచే ముపర్ణకము లోపించు నని స్పష్టము చేసినది. సరసపుపలుకు మున్నగుకర్మధారయములలో పుంపువిధానసామర్థ్యముచేత లోపింపకున్నను, నిట నట్టియవరోధము లేమి లోపించు (291) ననుట యుక్తమే. కాని 'సరసపుపలుకు' అని నుగాగమరహితముగాఁ జూపుట మాత్రము సరి కాదు. 'సరసపుఁబలుకు' అని సామాసికనుగాగమముతోఁ జూపవలెను.

ముపర్ణకంబునకు విధించుకార్య మనఁగా ముపర్ణకమునకుఁ బ్రత్యేకముగాఁ దదర్థకశబ్దముతో విధించినకార్యము మాత్రమే ముగాగమమునకు నగును. సామాసికవిభక్తిలోపము ముప్రత్యమున కట్లు ప్రత్యేకముగా విధించినది కాదు.

కావున ముగాగమమునకు రాదు. అందువలననే గుణములప్రోక యనుచో ముగాగమము లోపింపలే దని సిద్ధాంతము చేసి, తత్త్వ. ఆపిదప ముపర్ణకవిధానము లోనిగూఢాభిప్రాయము నిట్లు పేర్కొన్నది.

'గుణములప్రోక మున్నగువానియందువలె అందచందములపోక, అందచంద ములతీరు అందచందములను మున్నగుముగాగమస్థలములందు ముపర్ణకమునకు లోపము బాలవ్యాకరణముచే సిద్ధింపదు. ఆకారణముచే 'ముపర్ణకంబునకు' అని ముపర్ణకమును గ్రహించి లోపము ప్రౌఢవ్యాకర్త విధించుకొనవలసివచ్చె నని గూఢాభిప్రాయమును దెలిసికొనఁదగును' (292). ఇట ముగాగమస్థలములలో ముపర్ణకలోప మన నేమో యర్థము గాదు. సమాసవిభక్తి కనుసూత్రము ముపర్ణక మునకుఁ బ్రత్యేకముగా లోపము చెప్పలేదు గావున నాసూత్రముచే ముగాగమ మునకు రా దందము. ముపర్ణకమునకు వచ్చుట కిబ్బంది యేమి? అందము+ చందము అనుచో నున్నది ముపర్ణకము గాదా? దానికి బాల.చేత లోపము రాదా? బాల.సూత్ర మసలు ముపర్ణకమునకే లోపము చెప్పదా? బాల.సూత్రముచే ముపర్ణకమునకు లోపము రా దనునభిప్రాయ మీవ్యాఖ్యకు లే దనఁదగును. ఉన్నచో నిట వివరణమున అందచందములు అనుముపర్ణకలోపస్థలమును గూడ నుదా హరించెడి దనవచ్చును. కాఁగా బాల.చే ముపర్ణకము లోపించును గాని ముగాగమము లోపింప దని వ్యాఖ్యయభిప్రాయము గావలెను. అట్టియెడల ముగాగమస్థలములలో నాముపర్ణలోపము రా దని చెప్పుట వ్యాఖ్యయుద్దేశ మై యుండఁగా, 'క'వర్ణ మచ్చుపొరపాటునఁ జేరిన దనవలయును. కాని 'బాల.చే సిద్ధింపకపోవుటవలనఁ బ్రౌఢవ్యాకర్త 'ముపర్ణకంబునకు' అని చెప్పె నన్నది. ముపర్ణక లోపము బాల.చేతనే సిద్ధించుచున్నను ముగాగమలోపము సిద్దించుట లేదు గావున ముగాగమలోపము చెప్పవలెను. ముగాగమము లోపించు నన్న ముపర్ణకము లోపింప దేమో యనునసుమానము కల్గకుండ సమగ్రతకయియును సూత్రకర్త ముపర్ణకంబునకు ననురీతిగాఁ జెప్పె ననియు తత్త్వ. తలఁచిన ట్లూహింపఁదగును.

కాని వ్యాఖ్య చూపినవివరణమున విరోధములు గలవు. గుణములప్రోక యనుచో ముపర్ణకలోపము బాల.చే రాదు. అందచందములతీ రనుచోఁ గూడ రాదు. కావునఁ బ్రౌఢవ్యాకర్త చెప్పినదానిచే (ఉత్తరపదమందును ముక్కు లోపించి పిదప ముపర్ణకేతరవిభక్తిపరకత్వమున నాగమ మైన దనవలెను.) పూర్వపదమున

ముగాగమము లోపించిన దన్నమాట. అనఁగా నిట విగ్రహము నెట్లు చూపవలె? అందముయొక్క చందముయొక్క (తీరు) (290) (గుణములయొక్క ప్రోకతోఁ బోల్పఁ బడినది గదా.) అని యుండునా? అట్టియెడల షష్ఠ్యంతమునకు మీఁదిపదముతోఁ జేసినయీసమాసము షష్ఠీతత్పురుషము గావలెఁ గాని ద్వంద్వ మె ట్లయినది? ప్రథమాంతములు గాకున్నను ద్వంద్వము చేయనగునా? కావున ముగాగమమునకు బాల.చే లోపము రా వీలు లేమి దానిని సాధించి అందచందములతీరు అనురీతి రూపములు సాధించుటచే సూత్రకర్త ముపర్ణకలోపము చెప్పిన నయ్యది యసంగత మనక తప్పదు.

అందము+చందము=అందచంద. సమాసము ప్రాతిపదిక. దీనిపై షష్ఠీవిభక్తిలో అందచందములయొక్క – తీరు. అందచందములతీరు అనురీతిగా దీనిప్రక్రియ గమనింపవచ్చును. అట్టియెడల అందము+చందము అనుస్థితిలో లోపించినది. ముపర్ణకమే కదా. ఆముపర్ణకలోపము బాల.చేతనే సిద్ధించుచున్నది. అనఁగా అందచందములతీరు ఇత్యాదిరూపములు బాల.చేత సిద్ధ మవునే కదా.

ఇట సమాసము చెప్పుకొన్నఁ జాలదా? ములోప మేల చెప్పవలె?

బాల.చేత సిద్ధింపనిది ముగాగమలోపము గదా. దానికి లోపప్రసక్తి యెక్కడ? అందచందములు అనుచోట నైనను అందము+చందము, (వెచ్చము+సచ్చము) అనియె విభాగింపఁదగును గదా. ఈవ్యాఖ్య యట్లె చూపినది. అందములు+ చందములు అనురీతిగా విభాగింపనక్కఱ లేదు. అట్టియెడ ముగాగమమునకు లోపము చేయవలసినయగతికస్థితి యేది?

కావున నద్దానికై ముపర్ణకలోపము చెప్పవలసినయవసరము లేదు. అసలు సూత్రకర్త ముగాగమలోపమును సాధించుటయే ప్రధానప్రయోజనముగా ముపర్ణక లోపమును జెప్పె ననుటకును నాధారము గానరాదు.

సమా.39 సూత్రమున అవసరమక్కఱలు అనుమిశ్రద్వంద్వము నీతఁడు సాధించెను. ఇందుఁ బూర్వపదము క్లీబసమ మగుటయే పేర్కొనెను. కాని ముపర్ణకము లోపింపకపోవుటను గూర్చి పేర్కొనలేదు. తత్త్వ. భావించినట్లు ముపర్ణకము బాల.చేతనే లోపించు నని (ముగాగమలోపమునకె ప్రస్తుతసూత్రమున ముపర్ణకలోపమును జెప్పె ననియు) తలంచియున్నచో నట ముపర్ణకము లోపింపక పోవుటను బేర్కొనియుండెడివాఁడే కదా. లోపము లేనిచోట లేకపోవుటను

జెప్పకుంటనుబట్టియు, మువర్ణకము లోపింప దనియే ప్రౌఢవ్యాకర్త తలcచిన ట్లూహింపcదగును. అది సరి కా దని పైని స్పష్ట మగును. కాcగా నీసూత్రమున మువర్ణకలోపమును జెప్పుట వ్యర్థము. 'ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమం బయి చూపట్టెడి' నని మాత్రము సూత్రించినc జాలును.

ఇంక నాయయివ్యాఖ్యలు తలంచినట్లుగా సూరిలక్షణమునందే యెట్లును బ్రాయిక శబ్దము గలదు గావునc బ్రాయికశబ్దము ననుసరించి పూర్వపదము స్త్రీసమము గాకుంటయుc గల దని గ్రహింపవచ్చును.

అట్టియెడల నీయరు దగురూపములు, పూర్వపదము క్లీబసమ మయినద్వంద్వ సమాసములు బాల.చేత సాధ్యము లగును.

ప్రాయికశబ్దముప్రయోజనమును సూరి యట స్పష్టము చేయలేదు. కావునc దద్వివరణప్రాయముగా మాత్ర మీవిధానము గర్తింపcదగును.

ఇట్టివానికిc బ్రాచీనము లైనప్రయోగములు చూపcబడలేదు. కాని ప్రయోగము లెల్ల గుర్తింపcదగియే యున్నవి గావున నిట్లు చెప్పుట యుక్తమే.

## మిశ్రద్వంద్వము

**33. ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబుగను నందలిపూర్వపదంబు క్లీబసమంబునుగc గానంబడియెడి.**

కు.పం., సుబో. వ్యాఖ్య లీసూత్రము నిట్లు చూపcగా తత్త్వ. సర్వ. ఘం. సుగమ.వ్యాఖ్యలు 'మిశ్రంబుగను, క్లీబసమంబుగను' అనుపాఠము చూపినవి.

అవసరమక్కఱలు అనుద్వంద్వమునc బూర్వపదము సంస్కృతసమము, మువర్ణ కాంతము నైనది. ఇట్లు గానవచ్చుచున్న దని సూత్రమునభిప్రాయము. బాల. ననుసరించి పూర్వపదము స్త్రీసమము గావలసియుండcగా సంస్కృతసమమును, మువర్ణకాంతమును నగుట విశేషము గావునc జెప్పcబడిన దన్నమాట. ఇట తత్త్వ. 'బాలవ్యాకరణమున ఆచ్ఛికశబ్దంబుగా నుండవలయు నని మాత్రము నియమము లభించుచున్నది. ప్రథమపదమును గూర్చి నియమము గానరాదు. ఐనను సూరి చూపినలక్ష్యములనుబట్టి మిశ్రము లుండరా దేమో యనుననుమానము గల్గ వారించుటకై ఈసూత్రము వ్రాయcబడెను. ద్వంద్వమున స్త్రీసమము పూర్వపద

ముగా నుండు ననియు బాలవ్యాకర్త చెప్పుటచే' (295) అని వివరించినది. ఇది పరస్పరవిరుద్ధముగా నున్నది. పూర్వపదము స్త్రీసమ మని నియమించుట లేదా? తత్త్వ. మిశ్ర మగుటం గూర్చి పైవివరణము చేసినట్లున్నది. అనఁగా నుత్తరపద మాచ్ఛికము గావలె నని నియమింపలే దని యభిప్రాయ మన్నమాట. స్త్రీసమ మని తరువాతఁ జెప్పుటంబట్టియు తత్త్వ. అభిప్రాయ మదియే యని స్పష్టము. అది సరి గాదు. స్త్రీసమ మనుదానిని సూరి యాచ్ఛికములవిషయముననే విధించి నియతముగాఁ బ్రయోగించెను. (బా.ర) కాఁగా స్త్రీసమ మనుటచేతనే పూర్వ పదమును స్త్రీసమ మైనయాచ్ఛికము గావలయు నని నియమించిన ట్లయినది.

కాఁగా 1. పూర్వపద (స్త్రీసమ) మాచ్ఛికమే కావలె ననుటచే సంస్కృతసమ మగు ననుటయు, 2. స్త్రీసమమే కావలసియుండుటచేఁ గ్లీబసమ మవుటయు ననురెండంశములు బాల.కు భిన్నముగా విశేషముగా నిటఁ జెప్పఁబడిన వన్నమాట. ఇందు కొకటే లక్ష్యము. అవసరమక్కఱలు. ఇం దవసర మనుపూర్వపదము సంస్కృత సమ మగుటయే కాక క్లీబసమము నైన దని సూత్రకర్త యభిప్రాయము.

ముపర్ణకాంతసంస్కృతసమాచ్ఛికశబ్దము లన్నింటిని సూత్రకర్త క్లీబసమములుగాఁ దలఁచె ననుట స్పష్టము.(ఘం.176)దీనిని గ్లీబసమ మనుటను తత్త్వ. విమర్శించినది.

అవసరశబ్దము పుంలింగము. క్లీబసమత్వమునకై కంధరాదులలోఁ జేర్చుట మొద లగునవి కుదుర వనుచు నాచ్ఛికశబ్దము కానందున ఆచ్ఛి.2 సూత్రముచేతను గ్లీబత్వము రాదు. అదంతామహద్వాచక మయినందుననే దీనికి ముపర్ణకము వచ్చినది. నపుంసక మగుటచేత గా(296) దని స్పష్టము చేసినది. అదం తామహత్త్వముచేతనే ముపర్ణకము సిద్ధించును గావునఁ గ్లీబసమత్వవిధాన మనవసరము. కంధరాదిప్రసంగము సూత్రకృన్మత మగు నేమో యని యత్నించుట కావలెను. లేనిచో ననవసరము.

కాని యిట నాచ్ఛికము గానందున ఆచ్ఛి.2.సూత్రముచేఁ గ్లీబత్వము లే దనరాదు. అటఁ జెప్పఁబడినది క్లీబసమత్వము. అది గుర్తించినను దాని ననుసరించి స్త్రీసమము లైనవి యాచ్ఛికములే కావలె నని సూరి నియమించిన ట్లీవ్యాఖ్యయు గుర్తించెడి దనవచ్చును. అవసరశబ్దము శ్రీభాష్యకారాచార్యులు తత్త్వబోధినివ్యాఖ్యలో క్లీబసమము కా దనిరి. అదంతామహద్వాచక మని వారియుద్దేశ్య (162) మని సుగమ. పేర్కొన్నది. అనఁగాఁ గ్లీబసమ మనియే సుగమ. ఉద్దేశ్య మన్నమాట.

అవుఁ గాక. క్లీబసమ మైనంతమాత్రమున నాశబ్దమందలియదంతత పోవునా? అమహత్త్వము పోవునా?

దీనిం గూర్చి సర్వ. 'ప్రస్తుతసూత్రమునకు లక్ష్య మయిన అవసరము అనునది తత్సమపదము. దీనిని సంకేతింపవలసివచ్చునపుడు క్లీబతుల్య మని యనుట సమంజసముగా నుండు' (247) నన్నది. ఇదియు నసమంజసము. క్లీబతుల్య మనుటచే నీశబ్దము క్లీబము గా దనునభిప్రాయము స్పష్టము. కాని దీనికిఁ గ్లీబతుల్యత యేల? ముువర్ణకము సిద్ధించుటకే కదా. అవసరశబ్దమునకు (పుంలింగ మైనను) నమహత్త్వముచేతనే ముువర్ణకము సిద్ధించుచుండఁగాఁ గ్లీబతుల్యత యేల? ఎవరు చెప్పిరి? చెప్పకయే క్లీబతుల్య మె ట్లయినది? ముువర్ణకాంతతను సూచించుటకుఁ గ్లీబతుల్యము లనఁదగు ననుటయు సరి కాదు.

కాఁగా నవసరశబ్దమును గ్లీబసమ మనరాదు. క్లీబతుల్య మనియు ననరాదు. ముువర్ణకాంత మని చెప్పుటయే యుక్తము. తత్త్వ. ముువర్ణకాంత మని చెప్పుట తగు నని సవరించుట యుక్తమే.

అవసరము+అక్కఱ= అవసరమక్కఱలు అని యవును. అవసరము+అక్కఱ యనుసమాసమున విభక్తిలోపము రావలసియున్నది. లే దని సూత్రకర్త చెప్పలేదు. ఇట్టియెడ సుబో. పూర్వపదము చివరివర్ణము సమాసమున లోపించినను అది క్లీబసమ మగు నని చెప్పుటచే 'ము' చేరినది.(211). పూర్వపదము చివరివర్ణ మనఁగా ముువర్ణక మని యభిప్రాయము.

క్లీబసమ మగు ననుటచే లోపించినముువర్ణకము చేరు ననుట సరి కాదు. లోపింపకుండుట కాక లోపించి మఱల వచ్చుట సంగతము గాదు. ఇంకను ముందరి(32)సూత్రమున ముువర్ణకంబునకు లోపింపకుండు ననుట కొంతనయము. (తత్త్వ.296) ఘం. ఇట్లే 'లోపింపవలసియున్నను గ్లీబసమంబుగను అనుదాని స్వారస్యమున ముువర్ణకము లోపింప' (176) దన్నది. అంతే కాక 29 సూత్రమున ములోపము చెప్పుటను గూడ ఘం. క్లీబసమంబుగ ననుటచే ముువర్ణకము లోపింప దనుట కవకాశము లేకుండ లోపము విధింపఁబడిన దని చెప్పినది. (173)

క్లీబసమ మనుటవలన ముువర్ణకము లోపింప దనునభిప్రాయము సరి కాదు. పూర్వపదము క్లీబసమ మగు ననుటకు నీరీతి ముువర్ణకాంతమునకుఁ బైపదముతో సమాసము సిద్ధించుట మాత్రమే ప్రయోజనము. అట్టిపదమును దొలఁగించినచో

మువర్ణకాంతము పైపదముతో సమసించు నని చెప్పుట కేపదము నుపయోగింప వలెను. మువర్ణకము లోపింపనియీసందర్భమున లోపింప దని చెప్పకుండుటయు లోపించునట్టి(29)సందర్భమున లోపించు ననియుఁ జెప్పుటచే సమాసమున మువర్ణకమునకు లోపము లే దనియే యీవ్యాకర్త భావించె నని చెప్పవలెను.

ఈయభిప్రాయ ముచిత మగు నేమో పరిశీలింతము.

సరసము+అలుక యని యుండఁగా సమాసమునందు విభక్తికి లోపము రావలసియున్నది. కాని కర్మధారయమునందు దానికి పుంపులు విధింపఁబడినవి. మువర్ణకము లోపించిన పుంపులు దేని కగును? లోపించుమువర్ణకమునకుఁ జెప్పుటచే నీవిధానము వ్యర్థ మయినది.

సమాసవిభక్తికి రావలసినవిభక్తిలోపము మువర్ణకమునకు రా దని యర్థాంతర మును జ్ఞాపకము చేసినది. దీనివలన సమాసమున మువర్ణకము లోపింపకుండుట సిద్ధ మైనది.

కావున మువర్ణకము నిలిచియుండఁగా దానికి పుంపులు వచ్చి పుంపువిధానము చరితార్థ మైనది.

మువర్ణకమునకు సమాసమున లోపము రా దనుజ్ఞాపకసిద్ధ మైనయర్థమువలన మువర్ణకలోపము లేదు. కావున అవసరమక్కఱలు అనుచో మువర్ణకము లోపింపక నిల్చినది ఇది యన్యత్రఫలము.

పుంపులనుబట్టియే సమాసమున మువర్ణకము లోపింప దని ప్రౌఢవ్యాకర్తయు నెంచియుండవచ్చును. అట్టియెడల నిట ములోపము లే దని చెప్పకుండుట యుచితమ కాఁగలదు.

కాని యట్టియెడల అందచందము లనుచో ములోపమును జెప్పుటయు నవసరమే యనరాదు. 'జ్ఞాపకసిద్ధం న సర్వత్ర' యనుదాని ననుసరించి మువర్ణక లోపము లే దనుజ్ఞాపకసిద్ధ మైనయర్థము సర్వత్ర చెల్ల నక్కఱ లేదు గదా. కావున అవసరమక్కఱలు అనుచో లోపింపకుండుటయు అందచందములు అనుచో లోపించుటయు సిద్ధించుచున్నవి. మఱి యట్టియెడల ములోపము చెప్పుట స్పష్టత కనవలెను. (అంతకంటెఁ గూడఁ బ్రస్తుతసూత్రమున మువర్ణకము లోపించిన దని చెప్పి యట మువర్ణకలోపప్రసంగము చేయకుండుట యింకను స్పష్టతకుఁ గారణము

కాఁగల దని తోఁచుచున్నది.

గుణములప్రోక, సంజీవకమురావము, వనముచేరువ మొద లగుస్థలములలో పుంపులు రానిసందర్భమున ముగాగమము లోపింపకుండుటయును నీజ్ఞాపకసిద్ధ మైనయర్థమువలననే సిద్ధించుచున్న దని గుర్తింపవలెను. ముపర్ణకంబునకు విధించు కార్యము ముగాగమమునకు సైతము రావలసియున్నది గదా. సింగపుంగొదమ యనుచో పుంపు లిట్లే కదా వచ్చినది.

కాని తత్త్వ. మొ.వ్యాఖ్యలు ముపర్ణకమునకు విధించుకార్య మనఁగా ముపర్ణక మునకే ప్రత్యేకముగా విధింపఁబడినకార్యము మాత్రమే ముగాగమమున కగు ననియు సమాసవిభక్తి కెల్ల సామాన్యముగాఁ జెప్పిన దగుటచేత ముగాగమమునకుఁ రా దని పేర్కొన్నది. (291) కాని యాయభిప్రాయము సమ్మతింపఁదగినదిగాఁ గానరాదు. ఆసూత్రముచే నగులోపము ముగాగమమునకు సైతము వచ్చు ననియే చెప్పవలెను. చుట్టముయొక్క+టిక=చుట్టటికము. అగ్గలముయొక్క+ఇక=అగ్గలిక యనుచో ముగాగమము లోపించినదే కదా. కావున ముగాగమమునకు రా దని నియమించుటకు వీలు లేదు.

తద్ధితప్రత్యయపరకత్వమునఁ బ్రౌఢవ్యాకర్త ప్రత్యేకముగా విభక్తిలోపము చెప్పెను. కాని సూరి వ్యాకరణములో సమాసవిభక్తికి ననుసూత్రముచేతనే చేయవలెను గదా. ప్రౌఢవ్యాకరణమం దైనను డువర్ణకాదు లనుటచే నటఁ గూడ ముపర్ణకమునకుఁ బ్రత్యేకముగా నక్కార్యము విధింపఁబడలేదు. ఇఁక నాదిశబ్దముచేత ముగాగమము లోపించు ననురీతిగా సమన్వయించుట యవసర మగును. ఘం. నిక్కలాదిసూత్రము చే ముగాగమలోపము చేయుట సమంజసముగాఁ గానరాదు. సూరి కట్టి యభిప్రాయము గలదనుట కాధార మేమియో వ్యాఖ్య స్పష్టము చేయలేదు.

ఇంక విభక్తిలోపము చేయునది సమాసవిభక్తికి ననుసూత్రముచేతనే కావునను ముపర్ణకంబునకు విధించుకార్యము ముగాగమమున కగు ననుటయును నాధార ముగాఁ జేసికొని యాసూత్రముచేతనే ముగాగమమునకు లోపము చేయఁదగును.

ఇట్టిముగ్లోపము తద్ధితపరకత్వముననే కాని, సమాసములం దెచ్చటఁ గల దనవచ్చును. సమాసములం దట్టియవకాశము తక్కువ. బహువ్రీహి, ద్వంద్వము రెండింట ముగాగమలోపప్రసంగమే లేదు. కర్మధారయమునందు పుంపు లగుచున్నవి

కదా.

ఇంక వ్యధికరణసమాసములందు మాత్రమే ముగాగమము లోపింపవలెను. కాని పుంపులు రానిసందర్భములలో ముగాగమము లోపించుట లేదు. కావున ముగ్లోపమును లోపాభావమును రెండింటిని సాధించుకొనుటకుఁ బైరీతిగా నర్థాంతరమును జ్ఞాపకము చేసికొనుట సముచితమే కదా.

ఇంక పుంపువిధానము వ్యర్థ మని చెప్పకుండ విధానసామర్థ్యముచే పుంపులు వచ్చుసందర్భమునందు మాత్రమే ములోపము రా దనియు నర్థము చేసికొనుట యొకమార్గము గాఁగలదు.

అట్టియెడల పుంపులు రానిసందర్భమునం దెల్లెడలను మువర్ణకము లోపించు ననియే యర్థము చేయవలయును.

అట్టియెడల నందచందము లనుచో ములోపవిధానము వ్యర్థ మయి అవసర మక్కఱ లనుచో లోపాభావమును జెప్పకుండుట విరుద్ధ మగును గదా.

మచ్చెకంటి యనుచో బహువ్రీహియందును మువర్ణకము లోపించును. కావునఁ బైరీతి విధానసామర్థ్యము నాశ్రయించినను సూరిమతమున నిట్టియెడల నిబ్బంది లేదు. కాని సూరి చుట్టఱికము, అగ్గలిక యనిరీతివానిని జూపెనే. అట ముగాగమ లోప మెట్లు? ముగాగమలోపమునకుఁ బ్రత్యేక మైనవిధానము లేదు గదా.

కావున నిట్టివానిని గూడ సంగ్రహించుటకు వీలుగాఁ బైరీతి నర్థాంతరజ్ఞాపన విధానమే యుచితముగా నుండును.

అవసరమక్కఱ లనురీతిప్రయోగము లల్పము లని వ్యాఖ్యలు నంగీకరించినవి. సర్వ. ఈయొక్కదానికై యింతటిలక్షణము చేయుట యనవసర మని భావించినది. (240) ఇది యుక్తమే.

కెంధూళి, కెంజడ లనురీతిగా నీయది విశేషప్రయోగముగా గుర్తించుట యుక్తము. ఇది యనింద్యగ్రామ్య మనఁదగు నని వఝలవారు పేర్కొనిరి. (వ్యా.సం.స.256)

దీని కీసూత్ర మనవసర మనుట నిర్వివాదము. ఇందుఁ జెప్పినవిశేషములు– సమాసము మిశ్ర మగుట, పూర్వపదము క్లీబసమ మగుట. ఇట్టిదాని కిం కొక్కప్రయోగమును లేకపోవుటచేతనే మిశ్రంబుగను, పూర్వపదంబు క్లీబసమంబునుగ

అని విస్పష్టముగాఁ జెప్పఁగల్గెను. క్లీబసమేతర మైనసంస్కృతసమము పూర్వపద మగుట గాని, లేదా యెట్టి దైనను సంస్కృతసమ ముత్తరపద మగుట గాని, లేనే లే వని సూత్రకర్తయభిప్రాయము స్పష్టము. అట్టియెడల నీసూత్ర మేల? ఇంతకు ముందఱిసూత్రమునఁ బూర్వపదము క్లీబసమ మగుటను బేర్కొనెను.(29) అయిన నటఁ బూర్వపద మాచ్ఛికము. ఇట సంస్కృతసమము. ఆచ్ఛిక మగుట కొకసూత్రము, మిశ్ర మగుట కిం కొకసూత్రము నేల యనవచ్చును. కాని యట ములోపము రాఁగా, నిట లేదు. ఈభేదమునుబట్టి దీని నీతఁడు వేరుచేసియుండ వచ్చును. కాని యాసూత్రముకడనే విశేషరూపముగా దీనిని జూపి యీసూత్రమును జెప్పకుండవచ్చును.

ఈప్రయోగమునుగూర్చి కు.పం. ఇంకొకవివాదమును గల్పించినది. ఈప్రయోగములు రెండును మిశ్రద్వంద్వము లనక షష్ఠీతత్పురుషము లని చెప్పరాదా. షష్ఠీసమాసమున నుగాగమ మితనిమతమున సార్వత్రికము కాదు గదా (117) యన్నది.

దీనిని సుబో. తిరస్కరించినది.(211) ఆట ద్వంద్వమే యుచిత మనియుఁ గైదువుకర్జము లనునది మిశ్రద్వంద్వ మనుట సరి కా దనియు సుబో. చెప్పినది.

కైదువుయొక్క కర్జము అనుషష్ఠీతత్పురుషమును సముచితముగా సమన్వయించుటకు నవసరమందలియక్కఱ – అవసరమక్కఱ యనురీతిగా సప్తమీ తత్పురుషముగా 'నావేళయం దవసర మైనకార్యములలో' ననురీతిగాఁ జెప్పుటయు నుచితముగానే యున్నది.

వేటదోట లనునది ద్వంద్వమే. దీనిసాహచర్యమునఁ బైరెండింటిని ద్వంద్వము లని చెప్పవలెను. కాని తత్పురుషములుగా సమన్వయించుటలో నర్థమునం దెట్టి దోషమును గానరాదు.

ఏది యే మైన నీప్రయోగము విశేష మనఁదగును. సంజ్ఞాపరిచ్ఛేదమున గ్రామ్యపదప్రయోగార్హతావిషయమున రామాభ్యుదయమునుండి చూపినసందర్భము నందలిదే యీప్రయోగము నగుట గమనింపవలసియున్నది. దీనిని, నిట్టివానిని గూడ సంగ్రహింపఁదలఁచుచో 'ద్వంద్వంబునం బూర్వపదంబు స్త్రీసమేతరం బయి క్వాచిత్కంబుగఁ జూపట్టెడు' ననురీతిగాఁ జెప్పఁదగును.

పూర్వపదము క్లీబసమ మైనఁ దత్సమమ యైన నిం కే మైనను నుత్తరపద మాచ్ఛిక మగుటయే నియతముగాఁ గాననగుచున్నది.

## ద్వంద్వము - పూర్వపదాంత్యదీర్ఘము

**28. కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదాంత్యస్వరంబునకు దీర్ఘంబునుం జూపట్టెడు.**

సూత్రమందలిమహచ్ఛబ్దముచే మహతీవాచకము గూడ గ్రహింపవలె నని సుబో.(207), ఘం.(172), సర్వ. (240) పేర్కొన్నవి. అ ట్లెట్లు గ్రహింపఁదగునో తత్త్వ. స్పష్టము చేసినది. 'మహతీనాం చ మహతాం చ మహతాం' అని యేకశేషవృత్తి యని గ్రహించుట ప్రౌఢవ్యాకర్త కభిమతము'. విగ్రహమును బ్రథమాంతముగా నిర్దేశించిన బాగుండెడిది.

షష్ఠ్యంతముగాఁ జేసి ద్వంద్వశబ్దముతో సమాసమును జేయనగును.

కాఁగా మహన్మహతీవాచకములకుఁ జేసినద్వంద్వసమాసములోఁ బూర్వ పదాంత్యస్వరమునకు దీర్ఘము వచ్చుటయుఁ గనఁబడుచున్న దని సూత్రార్థము.

అన్నదమ్ములు-అన్నాదమ్ములు. ఇది మహద్వాచకముల కయినద్వంద్వము. అప్పచెలెంద్రు-అప్పాచెల్లెంద్రు. ఇది మహతీవాచకముల కయినద్వంద్వము. తల్లీదంద్రులు-తల్లీదంద్రులు. ఇది మహతికి మహత్తునకుఁ జేయఁబడినద్వంద్వము. ఇట బాలవ్యాకర్త చెప్పినద్వంద్వసమాసలక్షణమున కనుగుణముగాఁ బూర్వపదము స్త్రీసమమును నుత్తరపద మాచ్ఛికము నైయున్నది. ప్రయోగానుగుణ మగునీదీర్ఘ విధాన ముచితముగా నున్నది.

దీనిం గూర్చి కు.పం. 'అపి మాషం మషం కుర్యా చ్ఛందోభంగం న కారయేత్ అనున్యాయమున ఛందోనిర్బంధమున వచ్చిన ఈద్వంద్వపూర్వపదాంత్యదీర్ఘములు క్వాచిత్కము లని సూరి యెంచియుండు' (115) నన్నది. ఇట్టియభిప్రాయము సూరికే కల దనుట సమంజసము గాదు. అలికంబున నక్షిని డాచిన సర్వజ్ఞునిగా తాను బ్రశంసించినసోమన ఛందోనిర్బంధముచే నట్లు ప్రయోగించె నని సూరి యుపేక్షించె ననుట యుక్తము గాదు. తిక్కనప్రయోగము గూడ నిట్టిదే యగుట వింత.

దిక్ప్రదర్శనముగాఁ జెప్పినలక్షణము బాల. విశేషప్రయోగముల నేర్చి కూర్చినది ప్రౌఢ. సూరికి లేనియుద్దేశ్యము చేర్చుట సరి గాదు.

వఝలవా రిట 'నయ్యన్నం దమ్ముని' అని సోమనప్రయుక్తపాఠ మనిరి. కవిప్రయుక్తపాఠములను ని ట్లూహించుట యేల? ఉన్నదాని నంగీకరించి లక్ష్యము చేసికొనఁదగును గదా. ఇట్లె తల్లిందండ్రియు ననునదే కవిప్రయుక్త మనిన (1257) వ్యా.సం.స. తిక్కనప్రయోగమును మాత్రము అప్పఁజెలియ లనురీతిగాఁ దాళపత్రమాతృకలోనిపాఠమును గ్రహించినది. (1257). వీరు తాళపత్రమాతృక నిటఁ బ్రమాణముగా గ్రహించుట విశేషము.

ఏది యే మైనను గవిప్రయోగములను యథాతథముగా స్వీకరించి దానికిఁ దగినట్లుగా లక్షణము చేసికొనుటయో లేక వైశిష్ట్యమును గుర్తించుటయో యుక్తము. కాని పాఠములు దిద్దివేయుట సరి కాదు.

అహోబలుఁడు 'వచ్చీరానికుచంబులు' అని చూపెను. వినీవినములు ఇత్యాదుల లోను నియ్యది విన్పించును. అట్టివాని కవకాశము లేకుండఁజేయ నేల? అవి యసాధువు లనెను గదా యని యుపేక్షించెఁ గాఁబోలు నీతఁ డెట్లును నంగీకరించు చునేయుండెను. కావున ద్వంద్వమున నని సామాన్యముగాఁ జెప్పిన నట్టివానికిని నవకాశము గల్గును గదా. వినీవినమిన్ (బాలక.186) అనురీతి ప్రయోగము లున్నను నిట్టిసమాసములం దట్టిప్రయోగములు వెదుకవలసియున్నది.

దీర్ఘంబునుం జూపట్టెడు ననుచోఁ జార్థకనుశబ్దముపై మఱల నిం కొకద్రుతము చేసినాఁడు. సూత్రకర్త బహుశః దీర్ఘఘటితరూపములు మిక్కిలి యరు దని చెప్పుట యుద్దేశ్య మేమో.

ఏ మైనను నీసముచ్చయార్థకంబువలన దీర్ఘము రాని అన్నదమ్ములు వంటిరూపముల ప్రాచుర్యము స్పష్టము.

## ద్వంద్వము - భావార్థకలోపము

### 31. భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపం బగు.

భావార్థకము లైనకృదంతరూపములకుఁ జేయఁబడినద్వంద్వసమాసములోఁ దొలిపదమునందలిభావార్థకప్రత్యయమునకు లోపము వచ్చు నని సూత్రమున

కర్థము. టవర్ణకంబునకే సూత్రమున లోపము చెప్పినను నది కృత్ప్రయమున కుపలక్షణ మనుటవలన భావార్థకప్రత్యయములు మొత్తము లోపించును.

కొఱ+కామి=కొఱగాములు. దీనిని వేఱుచేసి చూపుటలో సూత్రకర్త అవుట కామి యని యిచ్చెను. (సుబో. ఔట యని చూపినది. 200) ఇది సరి కా దని సర్వ. చెప్పినది. (244) ఔట యని చూపిన బా గుండెడిది. ఔగాములు అనునది కవి ప్రయోగముగాఁ జూపెను. ఇది బావార్థకటవర్ణకాంత మనుట స్పష్టము చేయు నుద్దేశ్యముతో, అవుట యని చూపియుండవచ్చును. దీనింబట్టి 'యవుగాము లనునది యౌగాము' లని యవు ననియు నూహించుట కవకాశము గలదు. (అగుగాము లనురీతిరూపముకంటె నవుగాములు, ఔగాము లనునవి ప్రసిద్ధములు.)

చెల్లుచెల్లములు, వచ్చురాములు అనుచోఁ గూడ టప్రత్యయమే లోపించినది. వినివినములు అనుదానిని సూత్రకర్త వినికి+వినమి యని విభాగించెను. వినికి యనుచో భావార్థకప్రత్యయము ఇకి (బాల. కృత్. 16). కృత్ప్రత్యయమున కుపలక్షణ మనుటచే నిటఁ గృ త్తయిన ఇకి ప్రత్యయము మొత్తము లోపింపవలెను గాని, కి మాత్రమే యనుట సరికాదు. (సుబో. 209) దీనిం గూర్చి తత్త్వ. టవర్ణకము కృదంతమునకు చివరియక్షరముగా నుండును. అందుచే దానిచే నుపలక్షిత మగు లోపము గూడ కృత్ప్రత్యయముచివరియక్షరమునకే యని యూహించుకొన వలయును. కృత్ప్రత్యయాంతాక్షరంబున కనుట యుచిత (204) మన్నది. చివర సవరణము బ్రతిపాదించుటచేఁ దనసమర్థనము సరి గా దని యీవ్యాఖ్య గుర్తించిన దనఁదగును. నిజ మంతే. ట వర్ణకము కృదంతము చివర నుండఁగా దానిచే నుపలక్షిత మగునది కృత్ప్రత్యయమే కాని లోపము గాదు.) కావున కృత్ప్రత్యయము మొత్తము లోపింపక తప్పదు. అవుట+కామి యనుచో నంత్యాక్షర మొక్కటే లోపించిన దనఁగా నది యొక్కటే కృత్ప్రత్యయము గావున. వినికి యనుచో 'కి' ఒక్కయక్షరము మాత్రమే కృత్తు గాదు కదా. కావున నీసమర్థనము సరి గాదు. (సర్వ. 245)

సుగమ. 'వినికి- వినమి మొదటిపదము లోపించి సమాసము కాగా వినివినములు అయిన' (180) దన్నది. ఇది సక్రమము గాదు. సమాస మయి బావార్థకము లోపించిన దనుట యుక్తము.

ఇట సర్వ. 'వినివినములు అనుచో పూర్వశబ్దము విని అనుకృదంత మనుటకంటె 'విని' అనుక్త్వార్థమే యనుట యుచితముగా నుండును. చేసిచేయములు, మున్నగునవి

పూర్వశబ్దము క్త్వార్థకముగానే నిరూపించుచున్న (245) వన్నది. ఘం. వినికి+వినమి అనువ్యాకర్త పదచ్ఛేదము సరి కాదు. విని+వినమి అనియే ఛేదము. విని–వినుట అని యర్థము. ఇది భావార్థకమే(329) యన్నది.

'ద్వంద్వః కేషాఞ్చి దిష్ట స్స్యాత్ క్త్వార్థశబ్దేన కుత్రచిత్' అని వి.వి. క్త్వార్థకమునకు సమాసము చెప్పినది. వఝలవారు క్త్వార్థ మన నిట భావార్థక మని యర్థము చేసియును బైకారికయందు 'త్వార్థశబ్దేన' అనుపాఠాంతరమును సృష్టించిరి. క్త్వార్థశబ్దేన అని తృతీయాంత మగుటచే నుత్తరపదము గావలసివచ్చు ననునభిప్రాయము కారణము గావచ్చును. ఈకారికావివరణమున చేసిచేయము లిత్యాదిగా క్త్వార్థకము పూర్వపదముగానే చూపియున్నారు. అహో. ఈవఝలవారిసమన్వయము కొంత ఘం. వ్యాఖ్య కాధారము గావచ్చును. 'విని' అను'ఇ'ప్రత్యయాంతమునకు వినుట యనురీతిగా భావమే యర్థ మని ఘం. అభిప్రాయము. వినివినమి యనుచోఁ గేవలము క్త్వార్థము సమన్వయింపఁబడదు. అ ట్లని యిది భావార్థకముగా నంగీకరింపఁదగునా? తొల్లి చూచి యెఱుఁగను (చూచి–చూచుట), చొచ్చియెఱుఁ గఁడు (చొచ్చి–చొచ్చుట), ఏఁగి యెఱుంగవు (ఏఁగి–ఏఁగుట) యనుతీరుగా భావార్థము గల దని ము.ల.కౌ. క్రియా. 19సూత్రమున ఘం.కర్త పేర్కొనెను. ఇవి కేవలము భావార్థకములే యగుచో ట ప్రత్యయమువలెనె టప్రత్యయమును గూడ భావార్థమునంద చెప్పి విభక్తులు నిలువకుండుటను సూత్రింపఁదగును. కాని యివి కేవలము భావార్థకములుగా సమన్వయింపఁబడవు. తొల్లి చూచి యెఱుఁగ ననుచో నింతకు మునుపు చూచియుండలే దని యర్థము. అనఁగా నిట భూతార్థము స్పష్టము. కాఁగా చూచి యెఱుఁగను అనుదానికిఁ జూచుట యెఱుఁగ నని మాత్రమే యర్థము చేయరాదు. ఇంకఁ జూచియుండుట యెఱుఁగ నని చెప్పవలసియుండును. (ఇట్లు ఉండుధాతురూపాధ్యాహారముచేతనే యట 'ని' ప్రత్యయస్థితియు శాస్త్రసిద్ధ మగును.) ఇట్లే మిగిలినలక్ష్యములందును గమనింపఁదగును. అట్లే యీసమాసము లందును గుర్తింపవచ్చును. వచ్చిరానికుచంబులు అనుచో వచ్చియున్నవియును, రాకున్నవియు నైనకుచము లనియే కదా యర్థము. కేవలము వచ్చుట యనునది యెట్లు సమన్విత మగును? చేసిచేయము లనుచోఁ గూడ నిట్లే చేసియుండుటయును జేయకుండుటయును అని యర్థము.

కాఁగా నిట క్త్వార్థకములకే మీఁదిపదముతో సమాస మైన దనుట లెస్సయే

కాని భావార్థము భూతార్థవిశిష్ట మైయుండుట యన్నది గమనింపవలెను. ఆభావార్థము సైతము క్త్వార్థకక్రియయందుఁ గాక యధ్యాహృత మగునుండుధాతువుతోనే సమన్వయించుచున్నది. ఔగాములు అనుచోటవలె వినివినములు, చేసిచేయములు ఇత్యాదులలో భావార్థము సమన్వయింపఁబడకుండుట గమనింపఁదగును.

అందువలననే చేసిచేయములు, వినివినములు ఇత్యాదిస్థలములలో నస లైనభావార్థకరూపములు పూర్వమున నిల్చుట లేదు. చేయుచేయములు, వినువినములు అనురీతివి లేవు కదా. ఔగాము లనునర్థమున ఐ(అయి)గాములు అనియు లేదు. ఆయంశమును గూడ దృష్టియందుంచుకొన్న నీక్త్వార్థకములు కేవలము భావార్థకములు గా వనుట స్పష్ట మగును.

కాఁగా ఔగాములు, వచ్చురాములు ఇత్యాదులసిద్ధికయి భావార్థక'ట'వర్ణక లోపమును జెప్పినయీవిధానము సమంజసమే యని స్పష్ట మగుచున్నది. కృత్ ప్రత్యయమున కుపలక్షణ మనుటయు వినికివినము లని యిటఁ జూపుటయు మాత్రమే సరి కా దని చెప్పవలెను.

సర్వ. ఈసూత్రమున కొకమార్పును ప్రతిపాదించినది. పైరూపములు గూడ తఱచుగా కనిపించునవి కావు. కావున నొకానొకచో నని సూత్రమునందుఁ జేర్చిన సమంజసముగా నుండెడిది.(240) కాని యిది సరి కాదు. ఇట నీసూత్రము ద్వంద్వసమాసమును విధించునది గాదు. ద్వంద్వసమాస మయినపిదప నందు టలోపమును విధించునది మాత్రమే సమాస మయినపుడు 'ట'లోపము నిత్యమే కదా. అవుటగాములు వచ్చురాములు అనురీతిరూపములు గలవా? 'ఒకానొకచో' ననుదళమును జేర్చిన టలోపము తఱుచుగా రా దని యర్థ మగును. దానివలన నవుటగాములు అనురీతిసమాసములే తఱుచుగా నుండవలసినస్థితి యేర్పడును. కాఁగా బాల.చేతనే యిట వీనికి సమాసము లేర్పడుచున్నవి. కావున వీనికి సమాస మగుట యరు దని యట గుర్తింపఁదగును.

తొలిపదంబుటవర్ణకంబున కనుటచే నుత్తరపదమునందలివ్యతిరేకభావార్థక మగు మిఙికి లోపము రాలే దని గమనింపఁదగును.

## ద్వంద్వము - పూర్వపదాంత్యావయవలోపము

### 32. ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండె నగు.

పూర్వపదాంత్యావయవ మనుటచే నిట సమాసమునందలిపదములు రెండవయవములు గలిగిన వైయుండు నని గ్రహింపఁదగును. అట్టివానికి ద్వంద్వసమాస మేర్పడినపుడు పూర్వపదమునందలియంత్యావయవమున కొకపక్షమున లోపము వచ్చు నని యర్థము. పుట్టుగట్టు+క్రుంకుగట్టు - పుట్టుగ్రుంకుగట్లు. ఇట పుట్టుగట్టు అనుపూర్వపదమునంత్యావయవము గట్టునకు లోప మైన దనుట స్పష్టము. ఇట్లే తొవదమ్మివిందు మొ.

ఇట సర్వ. ఒకవిశేషమును జెప్పినది.

'ఇచ్చట పూర్వపదము సమాస మై, ఉత్తరపదము కూడ సమాస మైయుండ వలయును. రెండుసమాసములందును నుత్తరభాగము సమాస మైయుండ వలయును. అప్పుడు మాత్రమే పూర్వసమాసమునందలిఅంతిమభాగమునకు లోపము వచ్చును. ఇట్టియెడల ద్వంద్వసమాసము కలిగినప్పుడు లోపము నిత్యముగానే వచ్చును. లోపము రానిసందర్భమున సమాసము కూడ నేర్పడును. (246) ఇందలిచివరివాక్యము స్పష్టతకుఁ గావచ్చును. సమాస మైనపుడు లోపము నిత్య మనుటచేతనే యట్లు లోపము రానిచోట సమాసము గా దని స్పష్ట మవుచున్నది. లోపము రానపుడు సమాస మేర్పడ దనుట యేమి? సమాస మైనపిదపఁ గదా లోప మగునది.

మొదటివాక్యము సూత్రవివరణమే. పుట్టుగట్టు, క్రుంకుగట్టు అనుచో పుట్టుగట్టు అనునది పూర్వపదము. గట్టు అంత్యావయవము. ఇది సమాసము గానిచో పుట్టుగట్టు పూర్వపద మగుటయు గట్టు పూర్వపదాంత్యావయవ మగుటయుఁ గుదురదు. వ్యస్తము లగుచోఁ దరువాతిపదముతో సమాస మగుట యెట్లు? ద్వంద్వంబున నని కదా విధింపఁబడుచున్నది. పూర్వపదము సమాసమే కావలె నని నియమించుట యును యుక్తముగాఁ దోఁపదు. ఏల యన సూత్రకర్త యిట 'విన్నకన్నది' యని యుదాహరించెను. ఇందు విన్నది యన్నది సమాసము గాదు. విన్న యనుధాతుజ విశేషణముయొక్క విభక్త్యంతరూపము. ధాతుజవిశేషణము అనుప్రయుక్త మగు తచ్ఛబ్దము ననురెం డవయవములలో నంత్యావయవము లోపించిన దని సూత్రకర్త

సమన్వయము. కాని సర్వ. ఇట్టివియు సమాసము లనియే తలంచుటచేఁ బైరీతిని బూర్వపదమును సమాసము కావలయు నని చెప్పియుండును.

ఉత్తరపదమును ద్వ్యవయవ మైయుండవలయు ననియుఁ బూర్వోత్తరపద ములలో నంత్యావయవము సమాస మైయుండవలె ననియుఁ జెప్పుట యీవ్యాఖ్య యందలివిశేషముగా గుర్తింపవచ్చును. ఈయంశ మవసర మైనను సూత్రమునందుఁ జెప్పఁబడమి యొకలోప మనఁదగును.

తౌవదమ్మివిందు, విన్నకన్నది యనువానిలో బహుత్వము రాకుంటయు విన్నకన్నది యనుచో గసడదవాదేశమును రాకుండుటయు గుర్తింపఁదగును. వీనిని విశేషరూపములుగా భావించుటయే యుచితముగా(246) సర్వ. పేర్కొన్నది. విశేష రూపము లనుటలో నివి యీసూత్రమునకు లక్ష్యములు గా వని యీవ్యాఖ్య యభిప్రాయపడలే దేమో. ఏలన నంతకుముందు వీనియధుఁ బూర్వపదాంత్యావయవ లోపమును జూపినది గదా. అది సూత్రకృన్మతవివరణమా? బహుత్వము రాకుండుట విశేషము గాదు. తౌవవిందు+తమ్మివిందు =తౌవదమ్మివిందు. అని కాఁగా నిట బహువచనము రావలసియే యున్నది. కాని 'ద్వంద్వం బప్రాణివాచకకృదంతశబ్ద ఘటితం బేకవచనాంతంబు నగు' ననుసూత్రముచే (నివ్వాని నప్రాణివాచకములుగా వివక్షించి చంద్రుఁడును, సూర్యుఁడును గదా) నేకవచనము సాధించుకొనుట యుక్తము. విన్నకన్నది యనుచోఁ గూడ నిట్లే కృదంతఘటితత్వమునుబట్టియు నేకవచనాంతత సాధించుకొనఁదగును.

విన్నకన్నది యనుచో గసడదవాదేశము లేకుండుట విశేషమే. చతపలకు సదవలు గానంబడకుండుటను మాత్రమే సూత్రకర్త యింతకుముందు చెప్పెను. కకారమున కిట గకారము రాలేదు. కావున సంధి. 6. సూత్రము సమగ్రము గా దనవలెను.

విన్నకన్నది యనుదానిలో నిం కొకవిశేష మున్నది. విన్నది+కన్నది=విన్నకన్నది. అని యైన దనఁగాఁ బూర్వపదాంత్యావయవ మగు 'ది' మాత్రమే లోపించిన దన్నమాట. విన్నకన్నయది యనుటయు దుష్టము గాదు గదా. కావున విన్న+అది, కన్న+అది యని యుండఁగా మొదట 'అది' లోపించి, విన్న+కన్న అది యని కాఁ గా వృత్తి నత్తునకు లోపము చేసి విన్నకన్నది. (లోపము చేయకున్న విన్నకన్నయది) యనురీతిని సాధించుకొనుట యొకమార్గము.

అస లిటఁ బూర్వపదాంత్యావయవలోపప్రసంగము గలదా? లోపించిన దనియే యనుకొందము. పూర్వపదాంత్యావయవమునకే కదా యీసూత్రము లోపమును జెప్పుచున్నది. కావున విన్నకన్నది యనురీతిగా నుత్తరపదాంత్యావయవ మగు 'అది' లోపింపదు. దీనిపైఁ బ్రథమైకవచనమున సుప్రత్యయము చేసి లోపింపఁ జేసినను ద్వితీయాదివిభక్తులలో నెట్లు? విన్నకన్నది యనుదానిపై నువర్ణకాదు లగునా? విన్నకన్నదానిని యనురీతిరూపము లెట్లు?

ఇటఁ బూర్వావయవలోపముతో నిద్దానివిభక్త్యంతరూపము లెల్ల సమన్వయింపఁ బడ వలె నన్న 'విన్నది+సు+కన్నది+సు(ఘం.176) అనురీతిప్రక్రియ చూపరాదు. అసలు విన్నది+సు అని చూపుట యెట్లు? విన్న అనుధాతుజవిశేషణముపై విభక్తి వివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మైనది. విన్న+ఆ+సు అని చూపవలెను. విన్నదిలోని 'ది' అనునది ప్రథమైకవచనమే (శబ్ద58). దానిపై మఱల విభక్తి (సు అనుప్రథమైక వచనము) ఏమి? దీని ననుసరించి సూత్రకర్తయభిప్రాయమును గుర్తించుటకు యత్నింపవచ్చును. విన్న+ఆ+సు, కన్న+ఆ+సు అని యుండఁగా విభక్తి లోపించి, పూర్వపదాంత్యావయవ మగునది 'ఆశబ్దము'. కావున నది లోపింపఁగా, విన్నకన్న+ఆ అని యుండును. దీనిపైఁ బ్రథమాదివిభక్తులలో విన్నకన్నది, విన్నకన్నదానిని నిత్యాదిగా రూపము లవును. కాని యిట సుప్రత్యయమును జూపిన ప్రక్రియ యుచితము గాదు. ప్రథమైకవచనమున దిప్రత్యయ మయి, విన్న+అది+ కన్న+అది అని యుండును. కావున విభక్తిలోపముచే దిప్రత్యయము పోవును. పూర్వపదాంత్యావయవ మగునది 'అ'కారము. కావున నది లోపించును. ఉత్తరపదాంత్యావయవ మగు'అ'కారము మాత్రము లోపింపక విన్నకన్న+అ యని యుండును. ప్రథమైకవచనమున 'ది' రాఁగా, 'విన్నకన్నది' యని యగును. కాని ద్వితీయాదివిభక్తులలో శబ్ద.53 సూత్రముచే దకారము పూర్వాగమము కాఁగా విన్నకన్నదానిచేత ననురీతిగాఁ గావలసివచ్చును. విభక్తి లోపించినను బ్రాతిపదిక వికారము లోపించుట యెట్లు? శబ్ద.57 సూత్రమున 'విభక్తి పరం బగునపుడు' అని హ్రస్వమును విధించెను. కావున విభక్తి లోపించుటచే పరం బగుట లేదు గావున హ్రస్వము పోయి, దీర్ఘమే నిల్చు నని సమర్థించుటకు వీలు లేదు. రాముని బాణములు అనుచో యొక్కవిభక్తి లోపించినను నిగాగమము లోపించినదా? అటఁ గూడ 'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు' అనియె కదా

నిగాగమము విధింపఁబడినది. కాఁగా సమాసమునందు విభక్తి లోపించుచోఁ బ్రాతిపదికవికారములు పోవు నని చెప్పుటకు వీలు లేదు. కాఁగా నీప్రక్రియ నాశ్రయించినను ద్వితీయాదివిభక్తులలో నిట్టిరూపములు సిద్ధింపనేరవు.

ఘం. విన్నకన్నది అని ప్రాతిపదిక మవు ననుట సరి కాదు. ప్రౌఢ. ప్రత్యేకముగా సర్వనామశబ్దములప్రక్రియను చెప్పినది. (చెప్పని బాలవ్యాకరణమునం దైనను నిట్టిప్రక్రియ గుదురు నని నిర్ణయింపలేము.) విన్నకన్నది యనునది ప్రాతిపదిక మై, ద్వితీయయందు 'దాని' అని యగు టెట్లు గుదురును? ప్రౌఢ. ప్రక్రియ దాని కనుకూలముగా లేదు గదా.

లేక విన్నదానిచేత కన్నదానిచేత ననువానికి ద్వంద్వము చేసి, విన్నకన్నదాని ప్రాతిపదిక మనియుఁ దృతీయలో చేత రాఁగా విన్నకన్నదానిచేత నని యవు ననవలెనా? విన్నకన్నదాని ప్రాతిపదిక మనుట యెంతయు నసహజము కదా.

సూత్రకర్తయుఁ బ్రథమైకవచనరూపమును మాత్రమే దృష్టియం దిడుకొని చెప్పియుండె నేమో. ఇంక నీరూప మె ట్లన్నది ప్రశ్నము.

ప్రౌఢవ్యాకర్తయే యింతకు ముందు విశేషణోభయపదకర్మధారయములలో ఎత్తిన పెంచినవారి, కొట్టినతిట్టినయాతఁడు, విన్నకన్నయర్థము అనురీతివి చూపెను. వీనిని సాధించుచో ఘం. ముందుగా విశేషణములకు సమాసము చేయఁగ నయ్యది విశేషణోభయపదకర్మధారయ మగు ననియు, నయ్యదియే పిదప విశేష్యముతో సమసించు ననియుఁ బేర్కొన్నది. అట్టియెడల విన్నకన్నయర్థము అనుదానిని విన్నది+కన్నది=విన్నకన్నది. విన్నకన్నది యైనయర్థము విన్నకన్నయర్థ మనురీతిగాఁ బ్రక్రియను జెప్పవలెను. కాఁగా విన్నకన్నది యన్నది విశేషణోభయపదకర్మధారయ ముగా స్పష్టము చేసిన ట్లయినది. అది యిట ద్వంద్వ మనుటయుఁ బూర్వపదాంత్యావయవము లోపించు ననుటయు నెట్లు? సూత్రకర్తయే విశేషణోభయపదకర్మధారయము ఘం. చెప్పిన ట్లగు నని తలంచినచో నిట దీనిని ద్వంద్వసమాసముగాఁ జెప్పుట విరుద్ధ మగును. ఇంక నట ఘం. విశేషణోభయపదకర్మధారయము విశేష్యముతో సమసించియే తెలుఁగునఁ గనఁబడు నని సూత్రకర్త తాత్పర్యముగాఁ బేర్కొన్నది. విన్నకన్నది యనుచో నియ్యది విశేష్యముతో సమసింపలేదు గావున ద్వంద్వ మని చెప్పుట యుక్త మనవలెనా? అసలు విశేషణోభయపదకర్మధారయ మని చెప్పినసూత్రకర్త యయ్యవి విశేష్యముతో సమసించు నని పేర్కొనియే

యుండలేదు. సూత్రము సాధించుచున్నవిశేషణోభయపదకర్మధారయములు (విన్న కన్నవి) అస లుండ వనియు (ఉన్నచో నవి ద్వంద్వములే యగునా?) స్పష్టముగాఁ జెప్పుటయు యుక్తమా? కాఁగా విశేషణోభయపదకర్మధారయ మన్నదానిని ఘం. సమన్వయించినతీరు సూత్రకర్త యుద్దేశించినది కా దని చెప్పక తప్పదు. అనేక విశేషణములతో నున్నకర్మధారయమే విశేషణోభయపదకర్మధారయ మని సూత్రకర్త తలంచె ననవలె. లేనిచో నిట విన్నకన్నది ద్వంద్వ మనుట విరుద్ధ మగు.

ఇట విన్నకన్న యన్నదే విశేషణోభయపదకర్మధారయముగాఁ బేర్కొన్నది. అయ్యది ప్రాతిపదికమా? ప్రథమాంతమా? విశేష్యముతో సమసించియే ప్రయోగింపఁ బడు నని యావ్యాఖ్యతలంపు గావున నది ప్రథమాంతము గాదు. అది ధాతుజ విశేషణమే కావున విభక్తి వివక్షించినచోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మై యమహదర్థమున విన్నకన్నది యని యవును. అట్టియెడల నీయది విశేషణోభయపదకర్మధారయమే యవుచున్నది. ద్వంద్వసమాస మను టేల? ఇంకఁ బూర్వపదాంత్యావయవలోప విధానము లేకయే 'విన్నకన్నది' యని యగుచుండఁగా నిట వాలోప మేల?

విన్నకన్నయర్థము అనుచో ఘం.వలె విన్నకన్న(అది) యనురీతిగా విశేషణోభయ పదకర్మధారయముగాఁ దలఁపలే దన్నచో సూత్రకర్తమత మెట్టిదో తెలియవలసి యుండును. విన్న కన్న యనువిశేషణములు రెండును అర్థము అనువిశేష్యముతో సమసించిన వని సూత్రకర్త తలంచియుండు ననవలె. అట్టియెడ విన్న కన్న యను విశేషణములకు సమాస మవు నని సూత్రకర్త తలఁపలేదు. కావున 'విన్నకన్నది' ద్వంద్వసమాస మని చెప్పియుండు ననవచ్చును.

అట్టియెడలఁ బూర్వపదాంత్యావయవలోపము చెప్పవలెనా? విన్నకన్నయర్థము అనుసమాస మె ట్లయినది? విన్న(య)ది+కన్న(య)ది+అర్థము అనియే విభాగించుచో తచ్ఛబ్ద మెట్లు లోపించినది? విభక్తిలోపమువలనఁ దచ్ఛబ్దము లోపించు నన్నను విభాష గావున తనపరకతలోఁ బ్రత్యేకముగా విధించె ననఁదగును. కావున నద్దానిం బట్టి యిట నిర్ణయింప వీలు లేదు. (కొట్టినయాతఁడు+తిట్టినయాతఁడు అనుచోఁ దచ్ఛబ్దలోపము స్పష్టముగా గుర్తింపవచ్చును. అట్టియెడల నట లోపించినతచ్ఛబ్ద మిట మాత్ర మేల లోపింపదు? విన్నది+కన్నది యనుద్వంద్వసమాసమునను విభక్తి తోపాటు తచ్ఛబ్దము లోపించును గదా. మఱి పూర్వపదాంత్యావయవలోప మేల? కొట్టినతిట్టినయాతఁడు అనుచో ధాతుజవిశేషణముపయిఁ దచ్ఛబ్దము లోపించిన

దని సూత్రకర్త తలంచిన నిటఁ బూర్వావయవలోపవిధానము వ్యర్థమే యని నిర్ణయింప వలెను. అట్లు గాక ధాతుజవిశేషణము పూర్వపదం బయియుండు ననులక్షణముచేతఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తము గాకయే కొట్టిన+తిట్టిన+ఆతఁడు అనురీతిగా సమాస మగు నని తలంచియుండవలె. (ఘం.బాల.240., చూ.బా.స.) అట్టియెడ నటఁ దచ్ఛబ్దలోపప్రసంగము లేదు గావున 'అది' శబ్దము లోపింప వీలు లేమి నిటఁ బూర్వపదాంత్యావయవలోపవిధానావసరము గల్గిన దని గుర్తింపవచ్చును. అయినను నిట నింకొకయిబ్బంది గలదు. ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు అనునీసూత్రము ద్వంద్వసమాస మేర్పడినపిదప నగువిశేషకార్యమును గూర్చి చెప్పునదే కాని ద్వంద్వసమాసమును విధించునది కా దనుట స్పష్టము. కాఁగా సమాస మెట్లు గావలె? 'ఆచ్ఛికంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' ననులక్షణముచే రావలెను. దాని ననుసరించి పూర్వపదము స్త్రీసమము కావలెను. 'విన్నది' యన్నది స్త్రీసమ మయినదా? ఆప్రాతిపదికమునకుఁ బ్రథమైకవచనమున దిప్రత్యయము విధించుటంజేసి యిటఁ బ్రథమైకవచనలోపప్రసంగము లేదు కదా. (ఘం.179) అట్టియెడల వీనిని స్త్రీసమము లనుట యెట్లు? ప్రథమైకవచనమున దివర్ణము విధింపఁబడుటంజేసి వీనికి స్త్రీసమత్వాతిదేశము లే దని గ్రహింప వలయును గదా. 'సుజస్సులకు దివి యుగు, అది రా హ్రస్వం బగు' (శ.ల.సం.199,200) అట్టియెడల విన్నది, కన్నది యనువానికి ద్వంద్వసమాస మెట్లు? ఇంక సూరిలక్షణమునందలిప్రాయికశబ్దముచే నిట ద్వంద్వ మయిన దని చెప్పవలయునా? అట్టియెడల విన్నది+కన్నది యని యేల చూపవలె. విన్న+కన్న యని ధాతుజవిశేషణములనే చూపవచ్చును గదా. ధాతుజవిశేషణములు స్త్రీసమములు గావు. కావునఁ బ్రాయికశబ్దము నాశ్రయించియే సమాసము చేయవలె నట్టియెడల ధాతుజవిశేషణపూర్వపదం బయియుండు' ననుస్థలమున మడిసెడు (దడములు) అనుధాతుజవిశేషణమునకు సమాస మయినట్లె యిట విన్న+కన్న(ది) యనుధాతుజవిశేషణములకే సమాసము చేయవచ్చును. ఇంకఁ బూర్వావయవ లోపవిధాన మేల? కాఁగాఁ జెప్పఁదలఁచిన ననుప్రయుక్త మగుతచ్ఛబ్దమునకు సమాసమున నెల్లెడల లోపము చెప్పవలెఁ గాని యిటఁ బూర్వపదాంత్యావయవము లోపించు ననుట సరి కాదు. ఉత్తరపదాంత్యావయవమువలన ద్వితీయాదివిభక్తులలో నేర్పడుచున్నయిబ్బందిని గుర్తించితిమి.

కాఁగా నెట్లు చూచినను విన్నకన్నది యనునది యిట నుదాహార్యము కాదు. అనఁగా నిటఁ బూర్వపదాంత్యావయవలోపసమన్వయ ముచితము కాదు. విన్న+ కన్న = విన్నకన్న = విన్నకన్నది యనురీతిని ద్వంద్వమే యుక్తము.

ఇదియే యి ట్లుండఁగా ఘం. 'ఎత్తినపెంచినవారి' యనునదియు నిటనే యుదాహార్య మనుట సరి కాదు. ఎత్తినవారు, పెంచినవారు అనువానికి ద్వంద్వ సమాసమే కుదురదు. ఆవ్యాఖ్య యనుసరించినప్రక్రియనుబట్టి యెత్తినపెంచినవారు అనునది ప్రాతిపదిక మైన ద్వితీయాదివిభక్తులలో రూపములు సిద్ధింపవు. ఎత్తిన వారికి+ పెంచినవారికి ననురీతిగా ద్వితీయాంతములకు సమాసము (చేయరాదు గాని) చేసినచో – 'ఎత్తినపెంచినవారి' ప్రాతిపదిక మగుట యసంభవము. ఘం. కన్నపెంచినవారు అనునది కన్నవారు+పెంచినవారు కన్నపెంచినవారు(329) అను రీతిగా నవు నన్నది. ఇట కన్నవారు అనునది స్త్రీసమము కాదు. పోనీ. ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నట్లు క్లీబసమ మైనఁ గాకయు ద్వంద్వసమాస మెట్లో వివరింపలేదు. వఝలవా రివి విశేషణోభయపదము లనవలె ననిరి. (257) కాని కన్నవారు, పెంచినవారు అనునర్థమున కన్న+పెంచిన అనువానికి సమాసము చేసి కన్నపెంచినవారు అనురీతిని సాధింపనగును.

ఇట్లు పరిశీలింపఁగా మిగిలినలక్ష్యములును దగిన వగునా యని సందేహము గల్గుచున్నది. పుట్టునదియును గ్రుంకునదియును ననునర్థమున పుట్టుగ్రుంకునవి యనియును పుట్టుగ్రుంకునవి యైనగట్లు – పుట్టుగ్రుంకుగట్లు అని యవును. పుట్టు గ్రుంకుగ ట్లనఁగా ఉదయాస్తాచలములు అని యర్థము. (వ్యా.సం.స.1263) ఉదయం చ అస్తమయం చ ఉదయాస్తే. ఉదయాస్తయో రచలౌ ఉదయాస్తాచలౌ. అని యది సంస్కృతమున నేర్పడుచున్నది. దాని ననుసరించియు నీసమన్వయము సరి కా దని తలఁప నక్కఱ లేదు.

ఇట్లే తౌవయును దమ్మియును=తౌవదమ్మి. తౌవదమ్మియొక్క విందు= తౌవదమ్మివిందు. (అప్రాణిద్వంద్వ మగుటచే తౌవదమ్మి యనుచో నేకవచన మగుట దోషము కా దని గ్రహింపఁదగును. తౌవదమ్ములవిందు అని యుండుటయు విరుద్ధము కాదు.)

ద్వంద్వాంతమునం దున్న గట్లు, విందు అనునవి ద్వంద్వఘటితము

లయినపదము లన్నింటితోఁ బ్రత్యేకముగా నన్వయించుటయు సంప్రదాయాను గుణమే.

పూర్వోత్తరపదాంత్యావయవము సమాస మై యుండవలె నను నంశమునుబట్టి చూడఁగా నుత్తరపదాంత్యావయవమే పూర్వపదముతోను నన్వయించుచున్న దనుట స్పష్టము. అట్టియెడల నట్టియవయవకల్పనమును ననవసర మనియే పైరీతి సమన్వయమున గ్రహింపవచ్చును.

మొత్తముమీఁద నీసూత్ర మనవసరము. అట్టిప్రయోగములను గుర్తింపఁజేయుటే ప్రయోజనముగాఁ జెప్పవలెను.

## ద్వంద్వము - ఏకవచనాంతత

### 30. ద్వంద్వం బప్రాణివాచకకృదంతశబ్దఘటితం బేకవచనాంతంబు నగు.

సుబో. ప్రాణిని బోధింపనికృదంతశబ్దముతో గూడియున్నద్వంద్వసమాసము ఏకవచనాంతముగా గూడ ఉండు (208) నన్నది. కూడుగుడ్డ మొద లగుసూత్రకర్త చూపినలక్ష్యములలో కూడు మున్నగునవి కొన్ని యప్రాణివాచకములే కాని కృదంతములు కావు. కావునఁ బైసుబోధినిని దిరస్కరించుచు 'అప్రాణివాచకఘటితము కృదంతశబ్దఘటితము నైనద్వంద్వ మనురీతిగా రెండింటిని వేర్వేరుగా (తత్త్వ. 292) నితరవ్యాఖ్యలు నిరూపించుట యుక్తముగా నున్నది.

కాఁగా నప్రాణివాచకములు కృదంతములు ఐనశబ్దములకుఁ జేయఁబడిన ద్వంద్వసమాసమున కేకవచన మగును.

కూడును గుడ్డయును కూడుగుడ్డ. అనుచో నయ్యది కేవల మప్రాణివాచకము లకుఁ జేయఁబడినద్వంద్వము. ఇట్లే రేవగలు మొ.

తాఁకును దగులును తాఁకుదగులు. ఇది కేవలము కృదంతములకుఁ జేయఁ బడినద్వంద్వము.

ఇట సర్వ. 'కూడుగుడ్డ సమాసమున రెండుపదములు అప్రాణివాచకములే. అట్టివే తరువాతిమూఁడుప్రయోగములును (243) అన్నది. కూడుగుడ్డ, కూరగాయ, దరిదాపు, రేవగలు, తాఁకుదగులు అనునైదింటి నిట సూత్రకర్త యుదాహరించెను. ఇందు మొదటినాలు గప్రాణివాచకముల కుదాహృతు లని సర్వ. అభిప్రాయము.

ఇది సరి కాదు. వానిలో కూడుగుడ్డ, రేవగలు అనురెండే యప్రాణివాచకద్వంద్వములు. కూరగాయ యనుచో (కూర కృదంతము కాదు) కాయ కృదంతము. (కాయు+అ. బాల.కృదంత.19) దరిదాపు అనుచో (దరి కృదంతము కాదు) దాపు కృదంతము. (బాల.కృదంత.11)

అనఁగా నిట నప్రాణివాచకమునకుఁ గృదంతముతో సమాస మైన దన్నమాట. కాని పూర్వపదములు మాత్ర మీనాలుగింట నప్రాణివాచకములే. ఆయుద్దేశ్యముతో సర్వ. అట్లు పేర్కొన్నదా? కాని యప్రాణివాచకములతోఁ గాని కృదంతములతోఁ గాని యేర్పడినద్వంద్వసమాసము లనునంతకుముందరివివరణములో ద్వంద్వ సమాసమునందలిపూర్వపదమును మాత్రమే యుద్దేశింపలేదు. ఉత్తరపద మే దైనఁ గాని పూర్వపదమే యప్రామాణికవాచకము గాని, కృదంతము గాని కావలె నని సూత్రకర్తయభిప్రాయము గాదు. కాఁగా సూత్రమునం దప్రాణివాచక కృదంతశబ్ద ఘటితం బనుటలోఁ బూర్వోత్తరపదము లీరెంటిలో నేదియో యొకటి కావలె ననియే తాత్పర్యము. అనఁగా 1. కేవల మప్రాణివాచకములకుఁ గాని 2. కేవలము కృదంతములకుఁ గాని 3. అప్రాణివాచకమునకుఁ గృదంతముతోఁ గాని, 4. కృదంతమున కప్రాణివాచకముతోఁ గాని చేసినసమాసమే యిట గ్రాహ్యము. (మహద్ద్వంద్వంబున ననుచోట నిట్లె కదా) ఇందుఁ గొన్నింటికి లక్ష్యము లిటఁ జూపకపోవచ్చును. (పూర్వపదము కృదంత మై, యుత్తరపద మప్రాణివాచక మైన దుదాహరింపఁబడలేదు.) కానిచో విశేషణోభయపదంబులు త్రికక్రియాజన్య విశేషణఘటితంబులు (సమా.18) అనుచోటవలె విరించెడివాఁడే కదా.

ఇంక నీసూత్రమునఁ గృదంతశబ్ద మవసరముగాఁ గానరాదు. అప్రాణివాచక శబ్దముచేఁ బ్రాణివాచకము గ్రహింపఁబడదు. కృదంతములలోఁ బ్రాణి వాచకములను గ్రహించునుద్దేశ్య మున్నపు డది సార్థకము గాఁగలదు. కాని యీతఁడు చూపినలక్ష్యములలోఁ గృదంతములు గూడ నప్రాణివాచకము లైయున్నవి. ప్రాణివాచకము నొక్కటే నుదాహరింపలేదు. సూత్రము ననుసరించి కృదంతము ప్రాణివాచక మయినను వానికి ద్వంద్వము చేయుచో నేకవచనము రావలసియున్నది. అట్టిదానికి సాధక మగులక్ష్యమును జూపకయే కృదంతశబ్దమును బ్రయోగించుట వ్యర్థము.

ఆలుబిడ్డ పట్టెలు గని (నిర్వ. 1.37) ఆలుబిడ్డ లేనియట్టిత్రిమ్మరి (ఉద్యో. 2.9) అత్తమామ నాఁగ (రామా. 9.141) (వ్యా.సం.స. 1256) అని వఝలవారు ప్రాణి వాచకములద్వంద్వమున కేకవచన మగుటను దిక్కనప్రయోగములనుండి నిరూపించి యున్నారు.

ఇవి ప్రాణివాచకముల యైనను గృదంతములు గావు. కావున నీసూత్రము వానిని సాధింపలేదు. కాఁగా నిట సూత్రమునఁ గృదంతశబ్దము ప్రయోజనవంతము కా దనక తప్పదు.

కాఁగా 'అన్య త్రాపి క్వచి ద్భవే' త్తనుదాని ననుసరించుచు 'ఒకానొకచో ద్వంద్వం బేకవచనాంతంబు నగు' నని మాత్రము చెప్పినఁ జాలు ననవచ్చును.

ప్రౌఢ.సమా. 31 సూత్రము కృదంతములసమాసమును నిరూపించుచున్నది. కాని యట నేకవచనము లేదు. దాని ననుసరించి చూచినను ద్వంద్వసమాసమున కేకవచన మగుట యరు దని స్పష్టము. కావున వి.వి.వలెఁ గ్వాచిత్కతను సూచించుచు 'ఒకానొకచో' ననుట యవసరము. 'ఏకవచనాంతంబు నగు' ననుచోట సముచ్చయార్థకముచే నేకవచనము రాని ఆలుబిడ్డలు, కూరగాయలు ఇత్యాదిగా బహువచనాంతరూపములును సంగ్రహింపఁబడును.

తత్త్వ. ఈఏకవచనవిధానమే యనవసర మని యెంచినది. సంస్కృత వ్యాకరణము ననుసరించి సమాహారద్వంద్వ మయినపు డేకవచనమును, ఇతరేతయోగ ద్వంద్వ మయినపుడు బహువచనమును గలుగును. కావున కూడుగుడ్డ ఇత్యాద్యేక వచనాంతములు సమాహారద్వంద్వము లనియు కూడుగుడ్డ లిత్యాదిబహువచ నాంతము లితరేతరయోగద్వంద్వము లనియుఁ జెప్పఁదగును. కావున నీసూత్రము వ్యర్థ మని తత్త్వ. అభిప్రాయము. (293)

ఘం. పైయభిప్రాయమును దిరస్కరించినది. ప్రాణ్యంగాదులలో మాత్రమే సంస్కృతము ననుసరించి యేకవచన మగును. కూడుగుడ్డ ఇత్యాదులం దేకత్వము (ఏకవచన మని యర్థము. ఏకవచన మైన నర్థము మాత్రము బహుత్వమునందే యుండును గదా.) రాదు. 'అన్య త్రాపి క్వచి ద్భవే' త్తనుకారికయెడల నహోబలుఁ డిట్లే భావించె నని ఘం.(320) పేర్కొన్నది.

కాని యీకారికను వ్యాఖ్యానించుపట్టున వఝలవారు, అన్యత్రాపి = సమాహార

ద్విగుసమాసేతర మగుసమాహారద్వంద్వమునందును, క్వచిద్ భవేత్ = క్వాచిత్కముగ నేకవచన మగును. కూడుచీరకై (1229) అని దీనిని సమాహారద్వంద్వముగాఁ జూపిరి. సమాహారద్వంద్వము లితరములను వ్యా.సం.స. (1146) స్పష్టము చేసినది. కాని పైని 'కూరగాయలు, ఆలుబిడ్డ మున్నగుప్రయోగములనుబట్టి ప్రాణ్యంగాదులకే సమాహారద్వంద్వ మనెడిసంస్కృతవ్యాకరణనియమమును దెలుంగున లే దని విశద మగుచున్న (1229) దనిరి. దానింబట్టి పైని కూడుచీర సమాహారద్వంద్వ మనుట సంస్కృతభిన్న మైనతెలుఁగుసంప్రదాయముగా వీ రెంచి రనఁదగును.

కాని యిది యనవసరము. తెలుఁగున ద్వంద్వ మేకవచనాంత మగుట మిక్కిలి క్వాచిత్క మగుటనుబట్టియు, సంస్కృతమునందలిసమాహారసమన్వయము తెలుఁ గునఁ గుదురక క్వాచిత్కము లగునట్టిస్థలములయందే యవ్యాప్త మగుటయు, ననుసరించి సమాహారద్వంద్వ మగుటచే నేకవచన మయిన దనువిధ మైనసమన్వయ మనవసరము. కావునఁ దెలుఁగునందలివైలక్షణ్యము ననుసరించి యేకవచనమును వికృతివివేకమువలెనె ప్రత్యేకముగాఁ జెప్పుటయే యుక్తము.

## సమాసగతపదములు – అన్వయవిశేషము

**34. ఒక్కొక్కచో సమాసగతపూర్వపదంబు వ్యవహితోత్తరపదం బొంటితోడను వానిపెక్కింటితోడను నన్వయించెడి.**

కొన్నియెడల సమాసమునందలిపూర్వపదము వ్యవధానముతోఁ బ్రయుక్త మయినయుత్తరపద మొక్కదానితోను, దానికి సంబంధించిన పెక్కింటితోను నన్వయము గలిగియుండు నని యర్థము.

రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడియె. ఇచట రాహుకంఠము అను సమాసమునందుఁ బూర్వపదము రాహువు(యొక్క) అనునది 'తెగి' యనుపదముతో వ్యవధానము గలిగి, తరువాతఁ బ్రయోగింపఁబడిన 'దేహము' అనుపదముతో నన్వయించి 'రాహుదేహము పడియె' ననునర్థము నిచ్చును. ఇది పరపదం బొంటితో (దేహ మనునొక్కటి) నన్వయించుచున్నందుకు లక్ష్య మగుచున్నది.

ఒక్కొకకన్నును, జెవియును, జెక్కును, జను, బొడ్డు, మూఁపు, చెలు వగుచేయున్ అనుచోఁ బెక్కింటితో నన్వయించిన దనవలయును. ఒక్కొకకన్నును,

ఒక్కొకచెవియును, ఒక్కొకచెక్కును.....

ఇంక లక్షణమున నుత్తపదం బనఁగాఁ బరపద మనియే యర్థ మనియు నీయది పారిభాషికపదము గా దనియు ఘం. పేర్కొన్నది (177). ఉత్తరపద మనునది సమాసచరమావయవ మనునర్థమున రూఢ మైయుండఁగా లక్షణగ్రంథ మందే సామాన్యార్థమునఁ బ్రయోగించుట యుక్తమా? ఘం. పేర్కొన్నట్లుగాఁ బరపద మనియే నిర్ణయింపవలసియున్నది. కాని యట్లు ప్రయోగించుట సరి కాదు. (వాని పెక్కింటితో ననునది సమాసచరమావయవ మనునర్థముచొప్పున నన్వయింపదు గూడ.) దేహము అనువ్యస్తముగాఁ బ్రయుక్త మైనపరపదముతోనే యన్వయ ముండుట లక్ష్యమునందును స్పష్టము. కాఁగా సూత్రమునఁ బరపద మనుట యుక్తము.

అట్లే పూర్వపద మనఁగా సమాసమందలియాద్యవయవ మని యర్థము. పది కడవలనేయిఁ బెరుగుఁ బాలు – అనుచోఁ బదికడవలపాలు, పదికడవలనేయి, పదికడవలపెరుగు, పదికడవలపాలు అని యర్థము. పదికడవలు (కడవలయొక్క యనుట యుక్తము.) పెరుగు, పాలు అనువానితోను సమన్వయించినది. అసలు సమాసగతపూర్వపదముగాఁ బదికడవలు అనుదానినే గ్రహింపవలెను. లేదా పూర్వపద మనఁగాఁ బదసమూహ మనియు నర్థ మని యైన ననుకొనవలెను. (212) పదసమూహ మని యర్థము చేయవలసినయవసరము గానరాదు. పది యైనకడవలు పదికడవ లని యగును. పదికడవలయొక్క నేయి పదికడవలనేయి యనుసమాసమునఁ బదికడవల యనునది మొత్తము పూర్వపదమే యైనది గదా. తత్త్వ. (297) ఇట్లు సమన్వయించినది. అది యుక్తమే.

సూత్రమందలిసమాసశబ్దమును గూర్చి సర్వ. సిద్ధసాధ్యసమాసములు రెండును గ్రహింపవచ్చును. కాని లక్ష్యము లన్నియును సాధ్యసమాసములే యగుటచేత వానిసాహచర్యమున 'రాహుకంఠము' అనుమొదటిది సైతము సాధ్యసమాస మనియే సమన్వయింప నగు ననియుఁ దరువాతిసూత్రము సిద్ధసమాసములవిషయమును జెప్పుచున్నాఁడు కావున నీసూత్రము సాధ్యసమాసవిషయమునే సూచించుచున్న దనుట సమంజస మనియుఁ (252) బేర్కొన్నది. తరువాతిసూత్రము సిద్ధసమాస విషయమును సూచించుటచే నీయది సాధ్యసమాసవిషయక మనుట సమంజసము కాదు. తరువాతిసూత్రము సిద్ధసమాసవిషయమునను నొకయంశమును విధించుచో

రెండుసూత్రము లేల? ఈసూత్రమున సమాస మని సామాన్యముగాఁ జెప్పుటచే సిద్ధసాధ్యములు రెండును గ్రహించుట కవకాశము గల దని యీవ్యాఖ్య గుర్తించియే యున్నది. అట్టియెడ నీసూత్రమునుంచి తరువాతిసూత్రమును దొలఁగింపవచ్చునే కదా. నిజమునకు సూత్రకర్త యీరెండు సూత్రములను వేఱుగాఁ జెప్పుట సిద్ధసాధ్య సమాసభేదమునుబట్టి కాదు.

ప్రస్తుతసూత్రము సమాసగతపూర్వపదము వ్యవహితముగాఁ బ్రయుక్త మయిన తరువాతిపదములతో నన్వయించుటను బేర్కొనుచున్నది. తరువాతిసూత్రము 'కొన్నియెడల సిద్ధసమాసమధ్యగతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడి' ననునది. ఇట సమాసమధ్యగతపదము లనుటచేఁ బూర్వపదమే కావలె ననునియమము లేదు. (ప్రస్తుతసూత్రమునఁ బూర్వపద మని చెప్పఁబడినది) అది సమాసగతపదములతోఁ దద్భిన్నముల కన్వయము. ఇది సమాసగతపూర్వపదము నకుఁ బరపదముతో నన్వయము. ఇది ప్రధాన మైనభేదము. ఇంక సమాసగత పూర్వపదము వ్యవహిత మైనతరువాతిపదముతోనే యన్వయించుచుండఁగా వారి యస్మదీయోరుచమూసమూహము లనుచో 'వారి' యనునది సిద్ధసమాసమాసమం దున్న 'ఉరుచమూసమూహము' లనుదానితో నన్వయించుచున్నది.

కావున దానికిని దీనికిని నన్వయవిధానమువిషయమున భేదము గలదు. కాఁబట్టి సిద్ధసమాసవిషయము తరువాతఁ జెప్పఁబడుటచే నీసూత్రము సాధ్యసమాస విషయక మని నిర్ణయించుటకు వీలు లేదు.

ఇంక మిగిలినది రాహుకంఠము సిద్ధసమాసమా? సాధ్యసమాసమా? అన్నది. రెండును గావచ్చు ననుట వ్యాఖ్యలో స్పష్టము. కానీ మిగిలిన వన్నియు సాధ్యములే యగుటచే నిది కూడ సాధ్యసమాసమే యని చెప్పుట మాత్రము ప్రబల మైన యాధారము గానేరదు.

రాహుకంఠ మనుదానిని సాధ్యముగా సమన్వయించుచోఁ దత్త్వ. ఇ ట్లన్నది. 'రాహువుయొక్క అనుపదములోని వువర్ణకము లోపింపఁగా (శబ్ద. 26) రాహుయొక్క అని యుండును. తత్సమపదము. కంఠము అనుతత్సమపదముతో సమసించి రాహుకంఠము అని సాధ్యసమాస మయ్యెను' (298) రాహువుయొక్క యనుచో వువర్ణక మనుట పొరపాటు. శబ్ద. 26 సూత్రములోఁ బ్రౌఢ. వువర్ణక మనుట పొరపా టనియు రాహువులు అనుచో నున్నది వుగాగమమే కాని వర్ణకము కా

దనియు (91) నీవ్యాఖ్యయు స్పష్టము చేసినది. రాహువులు అనుచోటవలెనే రాహువుయొక్క యనుచోట నున్నది గూడ వుగాగమమే. కావున వువర్ణకము లోపించిన దనరాదు. ఈవ్యాఖ్యలో నిట వర్ణక మనుచో కవర్ణ మచ్చుపొరపా టన్నc బైపొరపా టుండదు. శబ్ద. 26 సూత్రమునc బ్రౌఢ. వుగాగమమునకు లోపము నుదాహరించుట యనవసరము. సూరి యుకారాంతములకు వుగాగమము బహుళముగాc జెప్పెను గావున వుగాగమము (వచ్చి లోపింపలేదు) రాకుండుటచేతనే రాహుయొక్క అని రూప మగును. మొత్తముమీcద నిది సాధ్యసమాస మనc దగియు నున్న దనుటలో విరోధము లేదు. కానీ సిద్ధసమాస మనుటకును నవకాశము గలదు. కావున నీకారణముచే సాధ్యముగాను సమన్వయింపcబడును. కావున నీ లక్షణము సాధ్యసమాసవిషయకమే యని నిర్ణయింప వలనుపడదు.

అయినను సిద్ధసమాసముల నిట గ్రహింపరా దనుటకుc దత్త్వ. ఇం కొక కారణమును జూపినది. 'సమాగతపూర్వపదములతో వెనుక నున్నపదము లన్వయించుట క్వాచిత్కముగ సంస్కృతభాషయందును గలదు. (దేవదత్తస్య గురుకులమ్) సమాసపూర్వపదము పరముగా నున్నభిన్నపదములోనికి విశేషణముగ నన్వయించుట మాత్ర మెచ్చటను లేదు. ఆకారణముచేతనే సిద్ధసమాసపూర్వపదము లకు ఈసూత్రము విధించుకార్యము వర్తించు నని చెప్పరాదు'. (298)

ఈకారణమును సరిగాc దోcపదు. దేవదత్తస్య గురుకులమ్ అనుచో సమాసగత పూర్వపదముతో దానికి వెనుక నున్నపదమున కన్వయము సంస్కృతమునc గలదు. కాని పూర్వపదము భిన్నముగా నున్నతరువాతిపదముతో నన్వయించుట యెచ్చటను లే దన నేమి? సంస్కృతాంధ్రములు రెండింటను లేదా? తెలుcగున నెచ్చటను లేనపుడు, లేదు గావున నట్లు చెప్పరా దనుకొనవచ్చును. కానీ యట్టియెడల సంస్కృతముప్రసక్తి యేల? సంస్కృతమున లేదు గావున నిచ్చటc జెప్పరా దని యభిప్రాయమా? సంస్కృతమునం దున్నదానినే చెప్పవలయు ననియు, లేనిదానిని జెప్పరా దనియుc జెప్పుట యుక్తము గాదు.

'వారి యస్మదీయోరుచమూసమూహము' లనుచో 'ఉరుచమూసమూహము' లనుదానితో 'వారియొక్క' యనుదాని కన్వయము గలదు. అట నుత్తరపదములోనికి వారియొక్క యనుపూర్వప్రయుక్త మగుభిన్నశబ్ద మన్వయించుట నీవ్యాఖ్య సముచిత మైనలక్ష్యముగాc బేర్కొన్నది (310). సంస్కృతమునc బూర్వపదమే విడిగా వెనుక

నున్నపదమున కన్వయ ముండు ననిరి. ఉత్తరపదముతో నన్వయించుటను దెలుఁగునఁ జెప్పరా దనఁదగునా?

ఇంక సిద్ధసమాసములందలి పూర్వపదము భిన్నముగాఁ బ్రయుక్త మయిన తరువాతిపదముతో నన్వయించుట తెలుఁగున లేదు. కావున సిద్ధసమాసములందిట్టియన్వయము నంగీకరింపరా దని చెప్పినచో నట్లు ప్రయోగములనుబట్టి నిర్ణయించుట యుచితమే. కానీ సమాసము లని సామాన్యముగాఁ జెప్పుటచే సిద్ధ సమాసములందును నిట్టియన్వయ మిష్టమే యని సూత్రకర్తయభిప్రాయ మనియు రాహుకంఠము అనుదానిని సిద్ధసమాసముగనే సూత్రకర్త తలఁచె ననియుఁ జెప్పుచో సూత్రమునుబట్టి యట్లు చెప్పరా దనుట గుదురదు.

తత్త్వ. 'రాహుకంఠము అనునది సిద్ధసమాస మనియు మిగిలినవి సాధ్య సమాసము లనియు వ్యాకర్త తలంచియుండును. కనుకనే 'సమాసగత' అని సామాన్యముగాఁ జెప్పెను. అట్లు కానిచో సిద్ధ అనియో సాధ్య అనియో విశేషణము గూడఁ జేర్చియుండును గదా (297) యన్నది. సిద్ధ అనియో సాధ్య అనియో ... అను మొద లగువాక్యము సమంజసము గాదు. రాహుకంఠము సిద్ధసమాస మైనను మిగిలినయచ్చోఁ జూపినలక్ష్యములు సాధ్యసమాసములే. సాధ్యసమాసములను గూడఁ జూపి 'సిద్ధ' యనువిశేషణము చేర్చుట యెట్లు?

ఇంక 'సాధ్య' యనువిశేషణము చేర్చుట సంగతి. రాహుకంఠము సిద్ధసమాస మగు నని వ్యాకర్త తలంచియుండు నని యీవ్యాఖ్యయే స్పష్టము చేసినది. అట్లు గాక యితరవ్యాఖ్యలవలె నదియు సాధ్యసమాసమే యన్నను 'సాధ్య' విశేషణము చేర్చుట సరి కాదు. సూరి సాంస్కృతికాచ్ఛికమిశ్రము లని సమాసములను త్రివిధములుగా విభాగించి సాంస్కృతికము సిద్ధము సాధ్యము నని రెండు విధము లనెను. 'సంస్కృతసమంబులసమాసంబు సాధ్యంబు నాఁబడు' నని వివరించెను. అట్టియెడల సాధ్యసమాసము లని పేర్కొన్నచో సంస్కృతసమములకు ఒక్కొక కన్ను అనువానిని బాల. ననుసరించి యాచ్ఛికసమాసము లనవలయునే కాని సాధ్యసమాసము లనుట యెట్లు? సాధ్యసమాస మని చెప్పుట ప్రమాదమూల మగును. కావున నట్లు చెప్పరాదు. నిజమునకు సర్వ. మిగిలినవి సాధ్యసమాసము లనుట పైవివరణమునుబట్టి సరి గాదు.

అయినను దీనింబట్టి సిద్ధసమాసవిషయకము కా దని నిర్ణయించుటకు వీలు లే దని పైని స్పష్టము.

రాహుకంఠ మనునది సిద్ధసమాస మైనను, దెలుఁగున నన్వయించునపుడు రాహుయొక్క కంఠము తెగి యనురీతిగాఁ జెప్పుదుము. రాహు (యొక్క) అనునది దేహ మనుతరువాతిపదముతో నన్వయించుటలో భేదము లేదు.

మొత్తముమీఁద సిద్ధసమాసములందలిపూర్వపదము భిన్నముగాఁ బ్రయుక్త మైనతరువాతిపదముతో నన్వయించుటకు రాహుకంఠ మనునది లక్ష్యమె. ఇంకను ప్రబలము లైనప్రయోగములకై వెదకవలసియున్నది.

సూత్రమున వ్యవహితోత్తరపద మనుచో వ్యవహితశబ్దమువలన నొకయిబ్బంది గలదు. 'ఒక్కొకకన్నును జెవియును జెక్కును జను బొడ్డు మూఁపుఁ జెలు వగు చేయున్' అనుచో కన్ను మొద లగునవి వ్యవహితములు గాకున్నను వానితో నన్వయము గలదు. అట్లె పరులధనమునకు విద్యాపరిణతికిని, పదికడవల నేయి బెరుగుఁ బాలు అనుచోట్లును వ్యవహితములు గావు. కావున 'వ్యవహిత' మనువిశేషణమును బ్రస్తావింపకుండుట యుక్తము. అపుడు వ్యవహిత మైనను, (రాహుకంఠము తెగి దేహము) వ్యవహితము గాకున్నను (ఒక్కొకకన్నును జెవియును..) నిట్టియన్వయము లక్షణసిద్ధ మగును.

'ఒంటితోడను వానిపెక్కింటితోడను' ననుట యనవసరము. పరపదములతో నని సామాన్యముగాఁ జెప్పినను సందర్భానుగుణముగా నొకదానితోనో, పెక్కింటితోనో యన్వయము గ్రహింపవచ్చును. కావునఁ బైరీతిని బరిశీలింపగా 'సమాసగతపూర్వ పదం బొక్కొకచో భిన్నప్రయుక్తంబు లగుపరపదంబులతో నన్వయించెడి' నని తెలుపుట యుక్తముగా నుండును.

**35. కొన్నియెడల సిద్ధసమాసమధ్యగతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడి.**

సంస్కృతమునందే సిద్ధించినసమాసము సిద్ధసమాసము. సిద్ధసమాసగత పదములతో వ్యస్తముగాఁ బ్రయుక్తము లైనయాయయిపదము లన్వయించు నని సూత్రమున కర్థము.

'బహువేదఘోషములఁజేసి నిరస్తసమస్తకిల్బిషోత్కరు లగుచున్నధన్యు' లనుచో

బహువేదఘోషములంజేసి యనునది నిరస్త మున్నగుసమాసములోనిపూర్వపద మగు నిరస్త యనునొక్కదానితో నన్వయము గలిగియున్నది. ఇట్లె అఖండితరూపవిలాస సంపదన్ వంచితపంచబాణుఁడు, అం దొకటిచే జనితాధరపీడ యై–యనునవియును.

ఇచ్చటిలక్ష్యములలో 'వారియస్మదీయోరుచమూ సమూహము' లన్నది భిన్నముగా నున్నది.

ఇట విడిగాఁ బ్రయుక్త మైన వారియొక్క యనునది అస్మదీయోరుచమూసమూహ మనుసిద్ధసమాసమున నురుచమూసమూహము లనునుత్తరపదముతో నన్వయము గల్గియుండుట స్పష్టము. సిద్ధసమాసగతపూర్వపదము లనక మధ్యగతపదము లనుట కీలక్ష్యమే యాధార మని నిర్ణయింపవచ్చును. ఇట్టి దిం కొకటి సూత్రకర్త చూపలేదు. ఇట ఘం. 'వారి అపపాఠము. వాలి సాధుపాఠము. వాలి – యుద్ధమునకు దిగి అని యర్థము' (179) అన్నది. దీని కాధారము వఝలవారివివరణ మనఁదగును. వఝలవారు పద్యము మొత్తము చూపి, వాలి యనునదే సరి యైనపాఠ మనిరి. కాని ముద్రితప్రతులం దెల్ల 'వారి' యనుపాఠమే కాననగుచున్నది.

'వైరి యవధ్యుఁ డాతనికి వారక యెన్నఁగఁ బెద్దసైన్యముల్
సారబలోద్ధతిం దొడరి చంపుదు మేని ననేకవర్షవి
స్తారములందునుం దెగవు సంక్షయ మొందును వారియస్మదీ
యోరుచమూసమూహ మెటు లూరక యేటికి నిందుఁ జావఁగన్ (హరి. ఉత్త. 2. 105) వాలు ధాతురూపాంతరము వాలు, వాలి యనఁగా యుద్ధమునకు దిగి యని యర్థము. యుద్ధమునకుఁ గడఁగి నేనలు క్షయ మొందు ననెడి సముచిత మైనయర్థము కవిప్రయుక్త మనఁదగియున్నది (వ్యా. సం. స. 1113). వారిసైన్యములు దెగవు, యుద్ధమునకు దిగిన నాసైన్యములే చెడు, ననునర్థమును సముచితమే. కాని 'వారి' యనుపాఠము నేల తిరస్కరింపవలె? ఉన్నపాఠము కవిప్రయుక్తము గా దన నేల? ఎన్నేండ్లు పోరినను వారిసైన్యము నశింప దనఁగా మనకు విజయము లభింపదు. యుద్ధమున వారిసైన్యమును నాసైన్యమును జచ్చు ననుటయు యుక్తమే. వారిసైన్యము దెగదు కానీ నాయురుసైన్యమే నశించు నని తలంచుట యుచితమును గాదు గదా. గెలుపోటములు లేకుండ నుభయపక్షములందును బ్రయోజనరహితము లైనచావులు తెచ్చిపెట్టు టేల యని యర్థము చేసినఁ దప్పు లేదు. వారి అనునది యపపాఠ మని తిరస్కరించుట సరి కాదు.

మిగిలినలక్ష్యము లెల్ల మార్గాంతరమునఁ దత్త్వ. సమన్వయింపఁబూనినది (300). అట్టి క్లిష్ట మైనయన్వయమునకుఁ బాల్పడకుండ నీవిధాన ముచితముగా నంగీకరింపఁదగును.

ఇంక సూత్రమునందుఁ గొన్ని లోపములను వ్యాఖ్యలు పేర్కొన్నవి. సంస్కృతమున త్రిపదసమాసములె చాల నరు దని తత్త్వ. అభిప్రాయపడినది (300). కాని తెలుఁగున నిట్టిసిద్ధసమాసములలో దీర్ఘములు ప్రసిద్ధములే. ఐనను సిద్ధసమాసమధ్యగత పదములతో ననుచో మధ్యపద మనవసర మనునభిప్రాయ ముచితమే (తత్త్వ. 300). ఆద్యంతములు గానిది యనురీతి భ్రాంతి గల్గు ననుసర్వస్వాభిప్రాయము నుచితమే. మధ్యశబ్దము లేకుండుట యుక్తము.

కానీ సిద్ధసమాసగతపదంబులతో (సర్వ. 254) అనియుఁ జెప్ప నక్కఱ లేదు. సమాసగతపదంబులతో నని మాత్రము చెప్పినఁ జాలును. ఏల యన నిట్టిస్థితి యాచ్ఛికమిశ్రసమాసములందును గానవచ్చును.

రాముఁడు చంపినరావణుఁడు, తోయజనేత్రుఁ గాంచినవధూమణి, మొదలగుసమాసము లిట్టివే. పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుపన్పు అనుచోట సైతము నిట్టియన్వయమే గలదు. ఇట నేకదేశాన్వయము లే దని వఝులవా రందురు. (వ్యా.సం.స. 1113) ధర్మసుతుపన్పు సమాసము గా దని వారి యభిప్రాయము. అది సరి గాదు. (ప్రౌఢ.కార. 21) ప్రౌఢవ్యాకర్త యిట నేకదేశాన్వయమును దలఁపలే దేమో. కాని కల దనుట యథార్థము. ఏ లన 'ధర్మసుతుపన్పు' సమాస మనియే చెప్పెను గదా. అట్టియెడల 'పార్థివప్రాగ్రసరుండు' అనునది ధర్మసుతుయొక్క' అనుపూర్వపదముతోనే విశేషణముగా నన్వయించుచున్న దనుట స్పష్టము. ప్రథమా విధానముచేతనే యట 'ధర్మసుతు' అనుదానితో నన్వయించుట సిద్ధించె ననియుఁ జెప్ప నవకాశము లేకపోలేదు. వఝులవా రివి వ్యస్తము లనఁగాఁ బ్రౌఢ. సమస్తము లనుటంబట్టియే యాతనిమతమున నేకదేశాన్వయము చెప్పక తప్ప దని స్పష్ట మగుచున్నది. అట్టియెడ నిట సిద్ధసమాస మనుట పొరపాటు.

ఒడలు తెల్లనితరగోత్తమువాలంబు, తనుపు మీన్పొలవల్చు జాలరిదాన అను సమాసములను గూడ నిట్లేకదేశాన్వయము గల దని గుర్తించుచో 15 సూత్రము నవసర మని నిర్ణయింపవచ్చును.

కావున నట్టివానికిని సాధక మగునట్లు 'సమాసగత' యని మాత్రమె చెప్పుట యుక్త మనిపించెడిని.

'తద్భిన్నపదంబులకు' నని చెప్పినను నీసమాసములకుఁ బూర్వమునందుఁ బ్రయుక్తము లైనవానికే సమాసగతపదములతో నన్వయము గల దని గ్రహింప నగును. తరువాతిపదముల కన్వయము లేదు. అవ్యవహితం బగుపూర్వ భిన్నపదంబుల కని చెప్పుట స్పష్టముగా నుండును.

34 సూత్రము సమాసపూర్వపదము వ్యవహితావ్యవహితోత్తరపదములతో నన్వయించుచుండఁగా నిందు అవ్యవహితపూర్వప్రయుక్తము లగుపదములకే 'సమాసగతపద' పదముతో నన్వయము కలదు.

కావున నిట్టిభేదము ననుసరించి 34,35 సూత్రములను వేర్వేఱుగాఁ జెప్పుట యుక్తముగా నున్నది.

## ఆచ్ఛికసమాసాలు – వర్ణవికారాలు

**36. ఆచ్ఛికసమాసములం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్య వైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి.**

ఆచ్ఛికసమాసములలో నాయావర్ణములు లోపించుట, యాగమ మగుట, ఆదేశ మగుట మున్నగువికారములు పెక్కు తెఱఁగులుగా నిత్య వైకల్పికము లయి తఱచుగాఁ గానవచ్చు చున్న దని సూత్రార్థము.

అంత + దాఁక = అందాఁక, అంతదాఁక. ఇత్యాదులలో వికల్పమును, ఆఁదోక ఇత్యాదులలో నిత్యముగను గల్గు నని సూత్రకర్తయే వివరించెను.

ఇంక నిటఁ జూపఁబడినలక్ష్యములను బరికింతము. అచ్చుతెల్పు, ఏటవాలు కప్పురవీడెము, గందవొడి, గుండ్రకడుపు, చెంద్రకావి, చప్పరమంచము, చొక్కసగతులు, దట్టకెంపు, నాటకసాల, సత్తెపలక, బెల్లమండెగ, బోనపుట్టిక వలిపవెన్నెల, సగపాలు, సుంకసరకు అనుచో సమాసమున మువర్ణకలోప మయినది. పుంపు విధానము ననుసరించి మువర్ణకలోపము లే దనునర్థాంతరము జ్ఞాపక మైన ట్లింతకు ముం దూహించితిమి. అట్టియెడ నిట ములోపము విశేషము. కాని 'జ్ఞాపకసిద్ధం న సర్వత్ర' యనుట ననుసరించి యిటఁ గొన్నింట (నాటకసాల మొ)

ములోపము లేకపోవుటను సమర్థించుకొన్నను, అచ్చుతెల్పు అనురీతికర్మధారయ సమాసములందు మువర్ణకము లోపింపకపోఁగా, బుంపులు రాకుండు టెట్లు? ఐనను మువర్ణకలోప మనునది సమానముగాఁ బెక్కురూపములందుఁ గానవచ్చు చుండఁగా దానిని బ్రత్యేకముగా సూత్రించుకొనుట యుక్త మనిపించెడిని.

నాటకము అనునది వైకృతమును గలదు. (శ.ర.) కావున నాటకసాల యిట నాచ్ఛికసమాసముగా నుదాహరింపఁబడినది.

ఆతరువాతిలక్ష్యములలో అందాఁక, ఇందాఁక, ఎందాఁక, ఆఁదోక, ఉద్దరి, పెత్తనము, సాఁబాలు అనునవి 'అన్యంబులకు' ననుసూత్రముచే సిద్ధించును. (సర్వ. 257) కావున వీని నన్యవములలోఁ జేర్చుకొనఁదగును. (కవ్వడియు నట్టిదే) పెనుశబ్దము ప్రాఁతాదులలో గణింపఁదగినది. (వ్యా.సం.స. 379) పెందుఱుము అనునది ప్రాఁతాదిత్వముచేతనే సిద్ధించును గావున వాని నిటఁ జూప నక్కఱ లేదు. పైఁగా నీసూత్రకర్తయే క్రొత్తాదులలో పెనుశబ్దమును జేర్చి పెన్నగము అని సమా. 7 సూత్రముకడ నుదాహరించియు నున్నాఁడు. కావున దీని నిటఁ జూపుట సరి గాదు. క్రొత్తాదులలోనే సగము అనుదానిని సైతము చూపి సగరాజ్యము అని యుదాహరించె. (సాఁబాలు. అనుచోటిసాము, సగము శబ్దము రూపాంతరమే సగము+పాలు అని యుండఁగా సగఁబాలు అనురీతిగా నుగాగమకార్యములు లేమింజేసి సగపాలు అనునదానిని బైని మువర్ణలోపమున కుదాహరించియుండును. శ.ర.లో సగము- దీనికి వృత్తియందు హల్లు పర మగుచో వికల్పముగ నంత్యవర్ణ లోపము అనెను. సగరాజ్యము అనునదియు నిట్టిదే. మఱి సగపాలు అనుదాని నిటఁ జూపి సగరాజ్య మటఁ జూప నేల? అనఁగా నయ్యది మిశ్రసమాస మగుటచేఁ గావచ్చును. ఆచ్ఛికసమాస మైనపు దంత్యవర్ణలోప మనియు, మిశ్రసమాస మైనచో క్రొత్తాదిత్వమువలన నంత్యవర్ణలోప మనియు రెండువిధములుగఁ జెప్పుటకంటె నీరెంటి నొకేచోట సంగ్రహించుట యుక్తము. ఇట్టివర్ణలోపాదులు మిశ్రసమాసము లందును గలవు. రాచ+కొమరుఁడు=రాకొమరుఁడు అనుదానివలె రాసుతుఁడు వీటిరాసుతుల్ (పాం. 1. 110) దినవెచ్చమునకు (పాం. 13. 16) రాసుతుల్ (రామా. 5. 257) ఇంగాలతేజ మై (భీమ. 4. 107) కనకవీణలు (భీమ. 5. 103) కనకకోవి (పాం. 4. 8) దినవల్వలు (విజ. 2. 144) రాతరుణులు (కవిశి.). కాఁగా నిట్టివాని ననుసరించి మువర్ణకలోపాదులు మిశ్రసమాసములయందును గల వని

స్పష్ట మగుచున్నది. రా. రాచశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. 'రాచతురాస్యోపాస్య .రామా. 4.' (ఇది రెండర్థములకు నుదాహరణము) శ.ర.అని యీతఁడును జూపెను. కాఁగా నిట్టికార్యము మిశ్రసమాసములయందును గ్వాచిత్కముగాఁ గానవచ్చుచున్న దని యంగీకరింపవలెను.

అట్టియెడల నిక్కార్య మాచ్ఛికసమాసములందే తఱుచుగ నుండుటచే నాచ్ఛిక సమాసములం దనక తప్పదు. తఱు చనుశబ్దముచే మిశ్రసమాసములయం దరు దని యర్థము చేయఁదగును. కాని సూత్రకర్త మిశ్రసమాసము నుదాహరింపక పోఁగా నాయంశమును బ్రస్తావింపనులేదు. అయినను దఱచుశబ్దముచే నట్టివి సాధించుట కవకాశము గలదు. కావున సాధింత మన్నను దప్పు లేదు. (అట్టి యుద్దేశ్యము నితనికిఁ గానరాదు. ఇట్టియెడ ఘం. మిశ్రసమాసములందు సహిత మీసూత్రముచేఁ గ్వాచిత్కముగా నాదేశాదికార్యములు కావచ్చు (చూ. 20.సూ) నని యర్థము చేయుట విశేషము. కానీ 20. సూత్రమును జూడు మనుటచే నీయభిప్రాయము ప్రౌఢవ్యాకర్తకే కల దని యీవ్యాఖ్య చెప్పఁదలఁచినట్టు తోఁచు చున్నది. ఆ. 20. సూత్రమునకు 'ముల్లోకము, ముమ్ముహూర్త మనున వుదాహృతములు. వానియెడను నిట్లే 'ఆదేశాదు లగు' నన్న దీవ్యాఖ్య. అనఁగా దుజ్లోపమే కాక ద్విత్వము వచ్చునా? అయిన ముయ్యేద్వాదిసూత్రము వ్యర్థము గాదు. అటఁ గూడ ద్విత్వము సూత్రముచేతనే వచ్చుచుండ ద్విత్వమునకుఁ బిదప హ్రస్వ మెట్లును వచ్చు నిఁక నాసూత్ర మేల? ఇంక 'నిత్యవైకల్పికంబు లయి' యని సూత్రమునం దెట్లును గలదు. కావున నిట నిత్య మగుట సిద్ధించును. 'ముమ్ముహూర్తమున' కనుమిశ్రసమాసములు దీనికి లక్ష్యము లగునా. అయిన నీ ఘం. అట నారూపములను నీసూత్రముచే సాధింపక బాల.చేత నేల సాధించినది. (166) బాల.చేతనే యివి సాధింపఁబడుటంజేసి వాని నిట సూత్రకర్త యుదాహరింప ననవసర మని చెప్పవలసియుండఁగా నుదాహరింపనివానితో, మూలమున లేని యనౌచిత్యమును గల్పించుకొన నేల?

వ్యాకర్త సూచనము ననుసరించి యలౌకికవిగ్రహములను గల్పించి వర్ణలోపాదులమూలమున నాయాసమాసములప్రక్రియలు గ్రాహ్య (81) మన్నది ఘం. వ్యాకర్త సూచన మేదో స్పష్టము చేసిన బాగుండెడిది.

దీని నింతకంటె సులువుగఁ జెప్పఁదగును. సూత్రకర్త యావర్ణవికారములు

నిత్యవైకల్పికము లయియుండు నని పేర్కొనెను. కావున బహుళ మని చెప్పుట వ్యర్థము గానేరదు. తఱుచుగా నిత్యవైకల్పికంబు లయి యనుదళములకు బదులుగా 'బహుళంబుగా నగు' ననవచ్చు. ఇట్టియెడఁ 'బెక్కులు' అనుదళమును లేకున్న నిబ్బంది లేదు. బహుళపదముచేత నన్యకార్యముగా నరుదుగ మిశ్రసమాసము లందును సాధింపఁదగును.

ఇట సూత్రకర్త ముయ్యేడు (మూఁడు+ఏడు) ఇట్లు ముయ్యాఱు మొ. అని పేర్కొనెను. మొదలగున వనుటచేత ముమ్మడు గనునది సయిత మిటఁ జూపఁ దగిన దని సూత్రకర్తయభిప్రాయము గావచ్చును. కానీ 'ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వంబులు నిత్యంబు' లని యింతకు ముందు పేర్కొనెను గదా. అట్టియెడల వాని నిటఁ జూప నేల? మూఁడు+ఏడు అని యుండఁగా డుజ్లోప మైన దీసూత్రము చేతనే యని సూత్రకర్త భావించెనా. దీనింబట్టి ఘం. మూఁడులు+ఏడు+లు అలౌకిక విగ్రహము బా. సమాస. 25. చే మూఁడు+ఏడు (ప్రౌఢ. సమా. 10.చే హ్రస్వ ద్విత్వములు నిత్యముగా రావలసియుండుటచే బా.సమా. 17 చే, మూ+ఏడు అని నిల్చి (157) అని చూపిన ప్రక్రియ సరి గాదు. వ్యాకర్తయే సమా. 36 సూత్రమున మూఁడు+ఏడు అని చూపియుంటంబట్టి యీ. 36 సూత్రముచేత డుజ్లోపము చేయఁ దగు ననుట యుక్తము గదా. ఇంక నీఘం. మూఁడు+లు అనురీతిగాఁ జూపుటయు నసంగతము. అమహదర్థమున సంఖ్యావాచకములు నేకవచనాంతము లని సూరి స్పష్టము చేసెను. ఏకవచనాంతశబ్దముపై బహువచనమును మ ఔకవిభక్తిని జూపుట యుక్తమా?

కాఁగా బ్రౌఢ. ఇట మూఁడు+ఏడు అని చూపుటంబట్టి ప్రస్తుతసూత్రముచేత డుజ్లోప మగు ననియు, నట సమా. 10. సూత్రమున హ్రస్వద్విత్వములు చెప్పుటంజేసి యాసూత్రముచే హ్రస్వద్విత్వము లైన వనియుఁ జెప్పవలసియుండును.

కానీ సూత్రకర్తయభిప్రాయ మదియే యైనను సమంజసము గాదు. ఈసూత్రముచేత విధింపఁబడినది వర్ణలోప మొక్కటే గాదు గదా. ఆగమాదేశ వికారములు. కావున ద్విత్వము సంగ్రహింపఁబడదా? 'నాన్నాళ్లు' అనుదాని నీ సూత్రకర్తయే యిట లక్ష్యముగాఁ జూపెను. అట ద్విత్వ మున్నది. కాఁగా ద్విత్వము నీసూత్రముచేతనే చేయఁదగును. కావున హ్రస్వద్విత్వములను విధించిన యాసూత్రము వ్యర్థ మని నిర్ణయింపఁదగును.

ఇటఁ దత్త్వ. 'అవియు నాచ్ఛికసమాసములందలివికారము లగుటచేత నిట నుదాహరింపబడిన వనియు నీసూత్రముచేతనే యయ్యవి సాధ్య మయినను బాలవ్యాకరణమున 17 సూత్రముచే డులోపద్విత్వాదులు విధించుటంజేసి యా సూత్రమును దిద్దుటకై హ్రస్వద్విత్వములు విధించుకొనవలసివచ్చె నని యూహింపఁ దగు (302) నన్నది. కానీ యీసూత్రముచేతనే సిద్ధించునపు డిటనే సవరింపఁ బడిన ట్లగుచుండఁగా సవరణమునకు మ ఱొకసూత్ర మేల? అసలు సవరణ మేమి? డులోపద్విత్వములను హ్రస్వద్విత్వము లనుటయా? సవరణ మనునభిప్రాయము సరి కా దని యింతకు ముందు (సమా. 10) గమనించితిమి.

'నాన్నాళ్లు అనుదానిని తానే మ ఱొకచోట సాధించె' (257) నని సర్వ. పేర్కొన్నది. అచో టేదో పేర్కొనలేదు. రెన్నాళ్లు, వేన్నీళ్లు అనురీతిరూపమును సాధించిన సంధి. (15) సూత్రమునకు నీయది లక్ష్యము గానేరదు. ఇట నాలుగు+నాళ్లు అనుచో నకారము వచ్చుటకు ముందు డకారము లేదు. 'అన్యంబులకు సహిత' మను సూత్రముచేఁ దొలియచ్చుమీఁదివర్ణముల కెల్ల లోపము రాఁగా, నా+నాళ్లు అని యై, ద్విత్వము వచ్చి, నాన్నాళ్లు అని యవును. కాని యిట దీర్ఘమునకు హ్రస్వము రావలసియున్నది. తన్నివారణోపాయము లేమి దీనిని సూత్రకర్త యిటఁ జేర్చె నేమో. అన్యంబులలోని దనియుఁ దలఁపక పోవచ్చును. అట్టియెడ వేన్నీళ్లు అనుచోఁ గూడ హ్రస్వాభావము కలదు. కావున దానిని గూడ నిటఁ జేర్పఁదగును.

సుబో. 'మిండతపసి అనుదాని నిట నుదాహరింప నక్కఱ లేదు. మిండఁడు+ తపసి. సమాస మగునపు డెట్లును మిండతపసి అని యగుచునే యుండు (216) నన్నది. ఇది కొంత యుక్తమే ఏలన మిండఁడు అనుడుజంతమునకు బూర్వపదత్వము బా.సమా.5 లక్షణముచేఁ గుదురదు (ఘం.181) కావున సమాస మగుటయే విశేషము. కాని సమాస మైన విభక్తిలోప మెట్లును సిద్ధించును. మిండమేఘము మిండతుమ్మెద యనునవియును గలవు. మిండఁ డైనతుమ్మెద, మిండఁ డైనమేఘము అని యుండవచ్చునా? విశేషణము లివి పుంలింగతుల్యము లన్నను మహత్తులు గావున డుఋ రాదు. కయిరాదులలోఁ జేర్పవలయినా? కయిరాదు లమహత్తులు గదా. మిండ యని యియ్యది స్త్రీసమముగాఁ గూడఁ గలదు. (బా.సూ.) కావున మిండ యైనతపసి=మిండతపసి, మిండ యైనజంగము=మిండజంగము. మిండ యైనమేఘము=మిండమేఘ మనురీతి విగ్రహముతో నీసమాసములు కుదురుపడును.

ఘం. 'ఈసూత్రము తద్ధితవృత్తి కుపలక్షణ మని సమాసంబులన్ అనుబహువచన సారస్యముచేతను, గొప్పతనము అనునుదాహరణసారస్యముచేతను గ్రహింపనగు' (181) నన్నది. ఈయభిప్రాయము సమంజసమే. కాని సూత్రకర్త యిట నుదాహరించినది పెద్దతనము – పెత్తనము అనునదే కాని గొప్పతన మనునది గాదు. దీనివలన సమాసమునఁ జెప్పినకార్యము తద్ధితవృత్తిలో వచ్చుటను ప్రౌఢ. కూడ ననుసరించినట్లే. కావునఁ 'దద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు పదంబులడువర్ణకాదులకు లోపం బగు' నని చేసినవిధాన మనవసర మని యీయుదాహరణసామర్థ్యముచే గుర్తింపవలెను. (చూ. తద్ధి. 1)

కానీ యీసూత్ర మనవసర మని నిర్ణయింపఁదగును. ఇట సూత్రకర్త నిక్కల, కవ్వడి అనువానిం గూడ నుదాహరించెను. నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబు లని సూరి చెప్పినలక్షణమునకే యివి, యట్లే యిక్కడిమిగిలినవి లక్ష్యము లగు చున్న వని స్పష్టము చేసిన ట్లయినది.

కాఁగా సూరి యథాప్రయోగముగా ననఁగా నీతఁ డాప్రయోగముల స్వరూపమును లోపాగమాదేశము లని వర్ణించె నన్నమాట. కాఁగా నీయది నిక్కలాది సూత్రమునకే వివరణము. ఇట్టియెడల సర్వ. తనవ్యాఖ్యలో దీనిని నిక్కలాది సూత్రమునకుఁ బిదపఁ జూపవలసినది.

నిక్కలాదిసూత్రముచే నీయవి బాల. సిద్ధము లవు చుండుటచే నీసూత్రము లేకున్నను నిబ్బంది లేదు. ఇచ్చట లక్ష్యములను వఝలవారు నిక్కలాదిసూత్రముచేతనే సాధించుట గమనింపవచ్చును. (బా. ఉ.)

ఇంక సూరి నిక్కలాదు లనుటచే నాచ్ఛికసమాసములకే యనునియమము లేదు. కావునఁ బ్రయోగానుసారముగా మిశ్రములను గ్రహించుటకు నవకాశము నున్నది. కాక యాచ్ఛికములకు మాత్రమే యన్న నాసూత్రమునందలి 'నిక్కల' యాచ్ఛికసమాస మగుటచే యాలక్షణ మాచ్ఛికసమాసములకు మాత్రమే సంబంధించిన దని చెప్పుటకు నవకాశము స్పష్టమే.

## లుగలుక్సమాసములు

ఇట నుండి లుక్సమాసములు, నలుక్సమాసములును గలిపి చెప్పఁబడుచున్నవి.

**38. అట్లు పోలె బలె వలె శబ్దంబు లివార్థకంబులు.**

**1. ఉపమేయము ప్రథమాంత మగునపు**
**డట్లు పరం బగుచో నుపమానంబు లగు**
**నామతదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠియు,**

**2. పోలెబలెలు పరంబు లగుచో నామతచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు,**
**నస్మదర్థప్రభృతులకు ద్వితీయయు,**

**3. వలె పరం బగుచో నామతచ్ఛబ్దార్థములకు షష్ఠియు.**
**నస్మదర్థాదులకు షష్ఠీద్వితీయలయం దెదియే నొక్కటియుఁ గ్రమంబున నగు.**

**4. ఉపమేయము ద్వితీయాద్యంత మగునపుడు**
**పోలెప్రభృతులు నుపమానంబుల కుపమేయవిభక్తుల యగు.**

**5. పోలినయెడఁ దచ్ఛబ్ద మేతదాదులకు నుపలక్షణముగా గ్రహించునది.**

**6. అట్లు కరణ్యాదులకు గ్రాహకము.**

ఇది యెల్ల నొక్కసూత్రము. వ్యాఖ్య లీసూత్రమును విపులముగా వివరించినవి.

**43. అట్టి పోని బోఁటి వంటి శబ్దంబులు వదర్థకంబులు.**
**బోఁటి తనంతఁ బ్రత్యయార్థంబు నగు.**
**అట్టిప్రభృతులు పరంబు లగుచో నట్లుప్రభృతిపరకనామాదులకుంబలెఁ బూర్వపదంబులకు విభక్తులు త్రివిధంబులం బరగు.**
**అందు బోఁటివంటులు సమానంబులు.**
**అవి పరంబు లగుచో నాత్మార్థమునకు నామతచ్ఛంబులకుం బోలెఁ గార్యంబు.**
**పోని పరం బగుచో దువర్ణకంబుమీఁద ద్రుతంబు నిత్యంబు.**

పయి రెండుసూత్రముల యభిప్రాయమును నీపట్టికయందు గమనింపఁదగును.

# సమాస. 38, 43 సూత్రములతాత్పర్యము

| ఉపమేయము– ప్రథమాంతము | | ఉపమానము | | | | |
|---|---|---|---|---|---|---|
| ఇవార్థకము | వదర్థకము | నామ | ఏతాదాదులు | అస్మద్ | యుష్మద్ | ఆత్మ |
| 1. **అట్లు** కరణి | | **షష్ఠి** నారాయణునట్లు | **షష్ఠి** వానియట్లు వీనియట్లు | **షష్ఠి** నాయట్లు | **షష్ఠి** నీయట్లు | **షష్ఠి** తనయట్లు |
| | 1. అట్టి | రామునియట్టి | వానియట్టి వీనియట్టి | నాయట్టి | నీయట్టి | తనయట్టి |
| 2. పోలె | | ప్రథమ చంద్రుండువోలె తామరపాకు | ప్రథమ (పాముల) వాఁడుపోలె | ద్వితీయ నన్నుఁబోలె | ద్వితీయ నిన్నుఁబోలె | ద్వితీయ తన్నుఁబోలె |
| 3. బలె | | నీరుబలె | వాఁడుబలె | నన్నుబలె | నిన్నుబలె | తన్నుబలె |
| | 2. పోని | సురకన్యవోని | వాఁడువోని | నన్నుఁబోని | నిన్నుఁబోని | తన్నుఁబోని |
| 4. వలె | | షష్ఠి రామునివలె | షష్ఠి వానివలె | షష్ఠి/ద్వితీయ నావలె నన్నువలె | షష్ఠి /ద్వితీయ నీవలె నిన్నువలె | షష్ఠి/ద్వితీయ తనవలె తన్నువలె |
| | 3. బోఁటి | రామునిబోఁటి | వానిబోఁటి | నాబోఁటి నన్నుబోఁటి | నీబోఁటి నిన్నుబోఁటి | తనబోఁటి |
| | 4. వంటి | రామునివంటి | వానివంటి | నావంటి నన్నువంటి | నీవంటి నిన్నువంటి | తనవంటి ద్వితీయలేదు |

| | |
|---|---|
| ఉపమేయము ద్వితీయాద్యంత మైనచో– | ఉపమేయవిభక్తియే వచ్చును. |
| పోలె | వీరులవోలె మమ్ము, |
| బలె | దేవరకుంబలె నవ్వధూటికిన్ |
| వలె | నీకువలె వారికిని |
| పోనిప్రభృతుల కిట్టిది లేదు. | మిమ్మువంటిలోకోత్తరులకు, |
| | మావంటితైర్థికావళికి. మొ. |

ఈసూత్రమువివరణములో వ్యాఖ్యలయం దభిప్రాయభేదములు గానవగు చున్నవి. దీనికిఁ గారణ మీసూత్రమును సూత్రకర్త 38 సూత్రముతో ముడివెట్టుటయే.

అట్లు మొద లైనవి పర మగునపు డేవిభక్తు లగునో యవియే యట్టి మొద లైనవి పర మగునపుడు నగు నని సూత్రము చెప్పుచున్నది.

అట్లు పోలె బలె వలె నను నవి యట నాలుగు. అట్టి పోని బోఁటి వంటి యనున విట నాలుగు. కాని విభక్తులు మాత్రము మూఁడు. సమన్వయ మెట్లు? లక్షణము ననుసరించియు సూత్రకర్త చూపినలక్ష్యములనుబట్టియు నభిప్రాయము నిట్లు గుర్తింపఁదగును.

1. అట్టి పర మగుచో అట్లు పర మైనప్పటివలెనే నామతదస్మద్యుష్మ దాత్మర్థకములకు షష్ఠీవిభక్తి యగును.

రామునియట్టి, వానియట్టి, నాయట్టి, నీయట్టి, తనయట్టి.

ఘం. అట్లు పర మగునప్పటివలె అట్టిప్రభృతులు పర మగునపుడును నామాదులకు షష్ఠి యగు (194) నన్నది. ఇది పొరపాటు. అట్టి పర మయినపు డీ ప్రభృతు లనరాదు. ఈవ్యాఖ్య యన్ని విభక్తులను అట్టి ప్రభృతు లన్నింటివిషయమున ననఁగా ప్రభృతిపరకత్వమున నన్నివిభక్తులను సమన్వయింపఁబూనినది. షష్ఠి నట్టి పరకతయందే యీవ్యాఖ్య యిట నుదాహరించినది. వానిపోని, నాపోని, నీపోని, తనపోని యని యుండవచ్చునా? ఈవ్యాఖ్య యుచితము గాదు.

2. 38 సూత్రమున 'పోలెబలెలు పరం బగుచో నామతచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు నస్మదర్థప్రభృతులకు ద్వితీయయుఁ జెప్పఁబడినది. రెండవయంశ మాత్రమము ననుసరించి యిట పోని బోఁటి యనురెండు పర మయినపు డిక్కార్యము రావలసియుండును. అందుకే సూత్రకర్త బోఁటివంటులు సమానంబు లని చెప్పెను. దానివలన పోలెబలెలు పర మగునపు డగువిభక్తులు ఇచట పోని పర మగునపుడు మాత్రమే యగును. అనగాఁ బోని పర మగునపుడు నామతచ్ఛబ్దములకుఁ బ్రథమ యగును. సురకన్య వోని, వాఁడు వోని, మన్మథుండునుం బోని యనుసూత్రకర్త చూపినలక్ష్యములను గుర్తింపఁదగును. పోని పర మగునపుడు (పోలె బలెల పరకతలోవలె) నస్మదర్థప్రభృతులకు ద్వితీయ యగును. నన్నుఁబోని, నిన్నుఁబోని, తన్నుఁబోని యని సూత్రకర్త యుదాహరించుటలో నభిప్రాయ మిదియే.

సూత్రకర్తయే యిట్లు లక్ష్యములందు లక్షణమును స్పష్టము చేయుచుండఁగా ఘం. పోలెబలెలు పర మగునప్పటివలె అట్టిప్రభృతులు (అట్టి పోని బోఁటి వంటి) పర మగుచో నామతచ్ఛబ్దార్థములకుఁ బ్రథమ యగును. అస్మద్యుష్మదాత్మార్థములకు ద్వితీయ యగు (194) ననుట సరి కాదు. దీనివలన రాముఁ డట్టి, నే నట్టి, తా నట్టి యనియుఁ గావలెను. కానీ యీవ్యాఖ్య అట్టి ప్రభృతు లని వివరించియుఁ బోనిపరకత యొక్కటియే యుదాహరించినది.

ఇటఁ దత్త్వ. అట్లు మున్నగునాల్గింటిలో పోలె, బలె నునవి సమానకార్యములను బొందును. ఇట నట్లే బోఁటివంటులు సమానము (318) లన్నది. అదియుఁ బొరపాటే. ఇట యథాక్రమముగా గ్రహింపవలెను. కాని యందు సమాసము లైనవేవో, అట్టికార్యములే యిందు సమానము లయినవానికి వచ్చు నని చెప్పరాదు. (అది యట్టిద యైన అట్లు పోలె బలె వలె అనుక్రమము ననుసరించి పోలెబలె కార్యమె బోఁటివంటుల కగుచో అట్టి బోఁటి వంటి పోని అన్న వేమో)

1. అట్లు ..... 1. అట్టి

2. పోలె, 3. బలె ..... 2. పోని

4. వలె.......... 3. బోఁటి, 4. వంటి

అనురీతిక్రమమునే సూత్రమునుండి గ్రహింపవలెను. తత్త్వ. చేసినసమన్వయము నంగీకరించుచో పోలె బలెలు పర మగునప్పటివిభక్తులే యిట నైనచో రాముఁ డుబోఁటి, రాముడుబంటి, యనియు రూపములు గావలసియుండును. నన్నువంటి నిన్నుబోఁటి యనుచో ద్వితీయ మాత్ర మై, సాధువు లైన నావంటి, నీబోఁటి యను షష్ఠి లక్షణవిరుద్ధము గావలసివచ్చును. అంతే కాక యీసమన్వయము ననుసరించి పోని పర మైనపు డేవిభక్తి రావలె. వలె పరకవిభక్తి యగునా? ఇది సక్రమమా? లక్ష్యానుగుణమును గాదు. నీవలె అనురీతిగా ‘నీపోని’ అని యుండదు గదా.

బోఁటి, వంటులు సమానంబు లనుటలో సూత్రమునభిప్రాయము నిట్లు గుర్తింపఁదగును. వదర్థకములలో అట్టి పరకతలో అట్లు పరకవిభక్తి యగును. ఇంకఁ దరువాతిది బోఁటి. అట్లు ప్రభృతులలో రెండవ దగు పోలె పరకతయందు వలె దీనిపరకతలో విభక్తి రావలె. అట విభక్తి పోలె పరకతలో నెట్లో బలె పరకతలో గూడ నట్లే. కావున పోలె బలెలపరకతలోనివిభక్తి యిటఁ బోనిపరకతలో నవును.

అట్లు ప్రభృతులలోఁ దరువాతిది వలె. వలె పర మగునపు డేవిభక్తి యవునో ఇట అట్టి ప్రభృతులలో మూఁడవ దగు బోఁటిపర మగునపు డదే విభక్తి యవును. ఇంక నట్లు ప్రభృతులలో నిం కొకటి లేదు. అట్టిప్రభృతులలో వంటి మిగిలియే యున్నది. ఇది పర మగునపు డేవిభక్తి యగును?

అట్లు గాక అట్లుప్రభృతులలో రెండవది మూఁడవదియు నైన పోలె,బలెలు పర మగునపు డొకేతీరుగా విభక్తు లవుట ననుసరించి యిటఁ గూడ రెండవ యంశమున పోని, బోఁటి యనునవి పర మగునపు డొకే తీరుగా విభక్తు లవునా? ఈరీతియనుమానములకు సమాధానమే బోఁటివంటులు సమానంబు లన్నది. ఆదానికిఁ బైరీతి సమన్వయము సముచితముగా సరిపడుచున్నది.

3. కాఁగా నీక్రమము ననుసరించి బోఁటి, వంటి యనునవి పర మగునపుడు వలెపరకతయందువలె నామతచ్ఛబ్దార్థములకు షష్ఠియు, నస్మదర్థాదులకు షష్ఠి, ద్వితీయలయం దెద్దియే నొక్కటియు నగును. వానివంటి, వావంటి, ననువంటి, నీబోఁటి, నినుబోఁటి యని యగును. ఇట్లే యాత్మార్థమునకును షష్ఠీద్వితీయలం దెద్దియే నొక్కటి రావలసివచ్చుచుండఁగా 'నవి పరంబు లగుచో నాత్మార్థమునకు నామతచ్ఛబ్దంబులకుం బోలెఁ గార్యం' బనుటచే షష్ఠి మాత్రమే యై, తనవంటి అనియే యగును. అనగాఁ 'దన్నువంటి' అనుద్వితీయ యుండదు.

తత్త్వ. పైని జేసినసమన్వయ మసంగత మని ఆత్మార్థమునకు నామతచ్ఛబ్దకార్య విధానము స్పష్టము చేయుచున్నది. పోలె,బలెలు పర మగునపు డగువిభక్తులే బోఁటివంటులు పర మగుచో నగు నన్నది గదా. తత్త్వ. పోలె బలెలు పర మగుచో నామతచ్ఛబ్దములకుఁ బ్రథమ యగును. (సమా. 36) ఇట బోఁటి,వంటులు పర మగుచో నామతచ్ఛబ్దములకువలెఁ గార్య మగు ననఁగాఁ బ్రథమ యగు నని చెప్పవలయును. 'తానువంటి' యని యగునా? సూత్రకర్త 'తనవంటి' యని యుదాహరించెను. తత్త్వ. సమన్వయముచే నీవిధానము విదుద్ధార్థక మగుఁ గాదా!

ఈవిధానమునుగూర్చి తత్త్వ. 'ఆత్మార్థకశబ్దమునకు అట్లుప్రభృతులు పరంబు లగునపుడు అస్మద్యుష్మచ్ఛబ్దములవంటివిభక్తులు వచ్చుచున్నవి. బోఁటివంటులు పరంబు లగునపుడు మాత్రము అట్లు గాక నామతచ్ఛబ్దంబులకు వచ్చునట్లు వచ్చును. అని పేర్కొన్నది. (318) ఇది సరి కాదు. అన్మద్యుష్మచ్ఛబ్దములకు వలెఁ గాక

నామతచ్ఛబ్దంబులకువలె వచ్చు నని యర్థము. అట్లువలె పర మైన షష్ఠి పోలె బలె పర మైన ప్రథమ ఏది వచ్చును. ఈవ్యాఖ్య యంతకు ముందు చేసినసమన్వయము ననుసరించి పోలెబలెలయెడవలె రావలె. అట్టియెడల నట్లుప్రభృతు లని సామాన్యముగా నిర్దేశింప నేల?

ఈయభిప్రాయమును సరి గాదు. యథాక్రమాన్వయమును వివక్షింపక పోవుటచే ఘం.వలె నిందును విరోధము లేర్పడిన వనవచ్చును.

ఇంక ఘం. వలె పర మగునప్పటివలె అట్టిప్రభృతులు పర మగుచో నామతచ్ఛబ్దార్థములకు షష్ఠి యగును. అని మొదలుగాఁ బేర్కొన్నది (195) ఇదియు సరి గాదు. అట్టి పర మగుచో నెల్లెడల షష్ఠియే. అస్మదర్థాదులలో షష్ఠీద్వితీయలలో ద్వితీయ వచ్చుట లేదు. నామతచ్ఛబ్దార్థములకు షష్ఠి యగుటకు వలె పర మగునప్పటివలె అని ఆమొదటియంశముచేతనే అస్మదాదులకు షష్ఠి కాఁగా రెండవ యంశము (194) (పోలె బలెలు) వలె ద్వితీయ వచ్చును. ఇట్లు షష్ఠియు ద్వితీయయు నవుచుండఁగా నీవ్యాఖ్య చేసినయీయర్థము పూర్వముననే సిద్ధ మయి యుండుటంజేసి వ్యర్థ మైనది.

ఈవ్యాఖ్యలు తాము చేసినయర్థమును లక్ష్యములందు సమగ్రముగా గుదుర్చుటకు యత్నించిన నిట్టిపొరపాటు వచ్చియుండెడిది గాదు. తత్త్వ. ననుసరించిన సుగమ. వివరణమును (197) నట్లే యుచితము గాదు. సుబో.లో (228) నిట్టి పొరపాటు గలదు.

సర్వ. అట్టిప్రభృతులు పర మైనపుడు మూఁడు విభక్తులు గల వని సామాన్యముగాఁ జెప్పి లక్ష్యముల ననుసరించి యాయావిభక్తు లగుటను వివరించినది. ఆవివరణ ముచితమే. కానీ 36 సూత్రము ననుసరించి యాయా విభక్తులే యీసూత్రముచేత స్పష్టముగా నిర్ణయింపఁబడిన వని సర్వ. గుర్తించిన చిహ్నములు లేవు.

అందువలననే బోఁటివంటి యనునవి ప్రక్రియనుబట్టి సమానములు. కావున అవి పరము లగునపుడు నామతచ్ఛబ్దములకువలెనె ఆత్మార్థకమునకును గార్య మగు (274) నన్నది. ఇవి సమానము లగుటకును నామతచ్ఛబ్దములకు వలె నాత్మార్థకమునకుఁ గార్యము లగుటకును సంబంధ మేమి?

ఇట సర్వ. 'ప్రౌఢవ్యాకరణము బోఁటి శబ్దమునందు అర్ధానుస్వారమును నిల్పుట సమంజసము కాదు. శబ్దరత్నాకరమునందు నట్లే యున్నది. నిరనుస్వార మయిన బోటిశబ్దమునకు వంటి అని యర్థము. సానుస్వారమునకు స్త్రీ యని యర్థము శబ్దరత్నాకర మీరెండింటిని విపర్యయముగా చూపినది. పోలె అనునది సారళ్యమును బొంది బోలె అని యై, టింటులను బొంది, బోటి అని యేకవచనమునను, బోంట్లు బోటులు అని బహువచనమునను నుండును. (277) అని పేర్కొన్నది. నినుబోంట్లను అనురీతిగాఁ బూర్ణబిందువుతోడిరూపమును సూత్రకర్తయే చూపుచుండఁగా నయ్యది నిరనుస్వార మను టెట్లు? స్త్రీ యనునర్థమందే బిందువు గల దనియు వంటి యనునర్థమున లే దనియు నీవ్యాఖ్య చెప్పుచున్నది. కానీ సూ.ని. రెండర్థముల యందును బిందువుతోనే చూపినది. నాబోఁటిభీతుని అనునీసూత్రకర్త చూపిన ప్రయోగమునే సూ.ని. కూడఁ జూపినది. మిముబోంట్లకు ననుపూర్ణబిందు రూపమును గూడఁ జూపినది.

పోలె బోలె బోటి యనురీతిప్రక్రియ చరిత్ర యాధారముగాఁ జూపిన దేమో యీవ్యాఖ్య. ఇది శబ్దశాస్త్రసిద్ధ మగుట యెట్లు?

సూరి 'టి' యనుదానినే యౌపవిభక్తిక మనెఁ గాని 'ంటి' యనుదానిని బ్రత్యేకముగాఁ జెప్పలేదు. 'హ్రస్వముమీఁదిటివర్ణంబునకు ముం' దనుసూత్రముచేత నిట దీర్ఘము(బో)పై బిందువు రాదు.

అసలు బోంట్లు అనురూప మెట్లు? ఔపవిభక్తికములు ద్వితీయాద్యేకవచనములు పర మగునపుడే గదా యవునది. బోంట్లు, బోంట్లకు నని బహువచనమందు నౌపవిభక్తికములు గావు. బోలె ననుదానియందే యగు టేమి? పోలె ననుచో నేల లేదు? పోంట్లు, నీపోంట్లు అని యుండవలదా?

కావున బోఁటి సానుస్వారమే యని నిర్ణయింపఁదగును. అపుడే బోంట్లు, బోంట్లకు ననురీతిగా బహువచనమందు సయితము సంయోగపరకతయందే పూర్ణబిందువు కనఁబడుచుండుటనుబట్టి 'సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లబో ఖండబిందునకుం బూర్ణం బగు' నన్నదానిచే ఖండబిందువే పూర్ణబిందు వయిన దనుట యుక్తము. బహువచనమందు సంయోగపరకత లేనిచో బోఁటు లనురీతిగా నుండుటయును దీనినే నిరూపింపఁజాలుచున్నది.

కాఁగా సర్వ. చూపినలోపము సరి గా దనియు నాప్రక్రియసయితము శబ్ద శాస్త్రవిరుద్ధ మనియు గ్రహింపఁదగును.

ఈబోఁటిని పోలెశబ్దమునుండి సాధింపఁజూచుటయు సరి గా దని ప్రస్తుత విభక్తివిధానమునుబట్టియు గుర్తింపవచ్చును. పోలె, బోలె, బోఁటి అని బోఁటి పోలెనుండి యేర్పడిన దన్నచోఁ బోలెపరకత్వమునం దగువిభక్తులే బోఁటి పరకతయందు నుండఁదగును గదా! కానీ పోలె పర మైనపుడు నామతదర్థములకుఁ బ్రథమ రాఁగా బోటి పర మగుచో షష్ఠి యవును. పోలె పర మగుచో నస్మదాదులకు ద్వితీయ వచ్చుచుండఁగా, బోటి పర మగుచో నస్మద్యుష్మదర్థకములకు ద్వితీయతో పాటు షష్ఠియు వచ్చుచున్నది. ఇంక నాత్మార్థమునకు షష్ఠి మాత్రమే యవుచున్నది.

ముఖ్యముగా బోలె ఇవార్థక మనియు బోటి వదర్థక మనియుఁ జెప్పఁబడినది. కావున పొలె– బోటి యయ్యె ననుటకు శబ్దశాస్త్రానుగుణ మైనయాధార మేమియును లేదు. ఇది ప్రత్యేకపదము. విభక్త్యంతము నవు నని సూత్రకర్త స్పష్టము చేసెను. బోఁటులు – బోంట్లకు మొ. ఇది విశేషము. పోలె ప్రభృతు లవ్యయములు గదా. (సూ.ని.,శ.ర.) బోఁటి విశిష్ట మైనది.

పిదప సర్వ. అట్టి, వంటి, బోఁటి ము న్నగునవి అట్టు, వలె, పోలె మున్నగువానికి ఔపవిభక్తికరూపములే యని చెప్పుట సమంజసము కాదు. తరువాత విశేష్యముతో సమసించునపుడు ఔపవిభక్తికరూపము నొంది అట్టి, వంటి, బోఁటి, అని యగును (277). ఇందు బోఁటి అట్టిది గా దనుట పైని స్పష్టము. పైఁగా విశేష్యముతో సమసించునపుడే యౌపవిభక్తిక మవు నని చెప్పునప్పుడు మాబోంట్లు అనుచో మీఁద సమాసమైనదా? మఱి యీవ్యాఖ్యమతము ననుసరించినను ఔపవిభక్తిక మె ట్లయినది? కావున బోఁటి పరిహరింపక తప్పదు.

అట్టి, వంటి యనున విఁక మిగిలినవి. అట్టుల అనుచో 'ల'వర్ణమును. వలె అనుచో టివర్ణము నై ముందు పూర్ణబిందువు నైన దనవలెను. కానీ యివి యవ్యయములే. ద్వితీయాద్యేకవచనములు పర మగునపుడు గదా యౌప విభక్తికములు కావలసినది. అట్లు అనుదానిపై ద్వితీయాద్యేకవచనపరకత్వ మేది? ఔపవిభక్తికము లగుటకు 'ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టియనుపదంబు విభాష ననుప్రయుక్తం బగు' నని సూరి. అట్టిని పదముగాఁ బేర్కొనియున్నాఁడు. కావునఁ జారిత్రకముగా నీవ్యాఖ్య చేసిన సమన్వయము (విశేషణత్వ సూచకముగా

నీయవి చేరుట యనురీతిగా) కుదురు నేమో. కాని శబ్దశాస్త్రము ననుసరించి యట్టిసమన్వయము కుదురదు. నిఘంటువులు వీని నవ్యయములుగాఁ జూపుటయు గమనింపవలసియున్నది.

**39. ప్రథమాంతముమీఁది పోలె బలె పోని శబ్దంబులు ద్రుతపూర్వకంబులు విభాష నగు.**

ప్రథమాంతములపై నున్న పోలె, బలె, పోని యనునవి విభాషగా ద్రుతపూర్వ కము లగు నని సూత్రమునర్థము. పేదయుఁబోలె, అగ్నియుఁబోలె మున్నగు నుదాహరణములం దుపమానవాచకమునకుఁ బూర్వమందు ద్రుతము మాత్రమే కాక 'యు' వర్ణము కూడఁ గనవచ్చుచున్నది. 'దీనినిబట్టి యిట్టియెడల ద్రుతమును గాక 'ఉను' అని సముచ్చయార్థకమును విధించిన సమంజసముగా నుండెడిది. హవ్యవహుఁడుం బోలెన్ అన్నట్లు సమర్థించుకొనుట సముచితముగా నుండును. ఏకరీతి యును గన్పడు' (268) నని సర్వ. పేర్కొన్నది. (ఘం.190) చారిత్రక మైనదృక్పథముతో 'ఉను' అనుశబ్ద మని చెప్పియుండవచ్చును. కానీ యీప్రౌఢవ్యాకర్త యనుదంతములపై యువర్ణపూర్వకముగా వచ్చు నని నుశబ్దమే చాద్యర్థకముగాఁ జెప్పెను. అదియే యుచితము. (చూ.శబ్ద.116) 'ను' శబ్దమే చాద్యర్థకము గాన హవ్యవహుడుంబోలెన్ అనుచో 'ను' శబ్దమునే సమన్వయింప నగుఁ గావున నయ్యది కేవలము ద్రుతము గా దని తెల్పుటకైనను నిట 'ఉను' అనునదే ప్రయుక్త మైన దని చెప్ప నక్కఱ లేదు.

కాఁగా సూత్రకర్త కేవలము ద్రుతపూర్వక మనుటకంటె 'ను'శబ్దమునుగాఁ జెప్పుటయే సమంజసము.

తత్త్వ. 'ఈద్రుతము సమాసమున స్వత్వము నెట్లు చెందెనో విచార్యము. సమాసములందు ద్రుతమునకు స్వత్వము రాదు గదా. స్వత్వమును విధించుటయు లేదు. కావున ద్రుతపూర్వకము లనుటకు బదులు నుశబ్దపూర్వకంబులు అని సూత్రించి యుండవలసినది (313) యన్నది.

ద్రుత మనక నుశబ్ద మన్నచో నీసమాసమున స్వత్వము సాధింపఁబడు నను నభిప్రాయమును సమంజసము గాదు. ప్రత్యయాగమావ్యయాత్మక మై యనునీవ్యాకర్త చెప్పినద్రుతలక్షణము ననుసరించి యీ'ను'శబ్దము ద్రుతమే కదా. ద్రుత మని కాక

భంగ్యంతరముగా నుశబ్ద మని చెప్పినను నయ్యది ద్రుతమే యగును. హవ్యవహుడుం బోలెన్ అనుచో బిందు విది ద్రుత మగుటచేతనే కదా యైనది. అట్టియెడల ద్రుత మని చెప్పుచోఁ గలుగు స్వత్వనిషేధము 'ను' శబ్ద మన్నను బ్రాప్తింపక తప్పదు. కావున నుశబ్ద మనవలయు ననుట కిది హేతువు గాఁజాలదు.

'నుశబ్దపూర్వకంబులు' అని సూత్రింపవలయు ననుటయు సమంజసముగా గానరాదు. 'ను'శబ్దము పోలె నిత్యాదులకుఁ బూర్వము విధించుటకంటె దానికిఁ బూర్వమందలిపదమునకే చివర విధించుట యుక్తముగా నుండును. అనుదంతతను బట్టి యువర్ణపూర్వకముగా వచ్చుట యన్నది పూర్వశబ్దము ననుసరించియే గదా సిద్ధించుచున్నది. సూత్రకర్తయే యిట నివి ద్రుతపూర్వకములు విభాష నగు నని చెప్పి, పిదప 43. సూత్రములో 'పోని పరం బగుచో డువర్ణకంబుమీఁద ద్రుతంబు నిత్యం' బని చెప్పుట గమనింపఁదగును. ఆసూత్రమునం దావాక్యమును దొలఁగించి యిట విభాషాపదముచే నట నిత్య మని యీసూత్రముకడ వివరించుట సముచితముగా నుండు నని తోఁచుచున్నది (ఘం.190) కాఁగా నిటఁ గూడఁ దదనుగుణముగా పోలెప్రభృతులకంటెఁ బూర్వపదమునకుఁ జెప్పుకొనుట యుక్త మగును.

ఇవి సమాసములే కానిచో శబ్ద.116చేతనే యీశబ్దము చేరును. కావునఁ బ్రత్యేకవిధానముచేతనే యివి సమాసము లని సూత్రకర్త భావించె నని (313) తత్త్వ. తలఁచుట యుచితముగా నున్నది.

కానీ సర్వ. ఇవి సమాసములు గా వని భావించినది. "సమాసమునందు కావలసినవిభక్తిలోపాదు లిచ్చుట వచ్చుట లేదు. పైఁగా ద్రుతమునకు సమాసమున స్వత్వరూపము కూడఁ గల్గుచున్నది. పోలె, బలె మున్నగునవి ఏసి, అవ మున్నగు వానివంటియపదములు. కావున అవి పరమం దున్నప్పుడు పూర్వరూప మె ట్లుండునో చెప్పుకొనుట యవసర మగును. అంతమాత్రముచేత వానితోడిరూపములను సమాసములుగా నంగీకరింపవలసినయవసరము లేదు. (268) ఈ యభిప్రాయమునను గొంత యసామంజస్యము గలదు. సమాసమందుఁ గావలసిన విభక్తిలోపము లేదు గావున నివి యసమాసము లనుట సరి కాదు. సమాసము లందు విభక్తిలోపము నియతము గాదు. విభక్తి లోపింపనియలుక్సమాసము లే మగును. అందుచేతఁ గదా సూత్రకర్త వీనిని లుగలుక్సమాసము లని పేర్కొనుట

జరిగినది. కావున విభక్తి లోపింపకపోవుటచేత నీయవి యలుక్సమాసము లగును. అసలు సమాసములు గావనరాదు.

స్వత్వ ముండుటనుబట్టి సమాసములు గా వనుట యుక్తమే. కానీ పోలె బలె మున్నగునవి ఏసి, అవ అనువంటియపదము లనుట విచార్యము. అవక్కు ఆగమ మనుటచే నపదమే. 'ఏసి' అపద మనుట సరి కాదు. 'ఏసి' దే. అవ్య. శర., సూ.ని. అని యేని యవ్యయముగా నిఘంటువులు స్పష్టము చేసినవి. పోలె– దే. ద్ర. శ.ర. బలె – దే. ద్ర. కావున నివి గూడ నవ్యయములె కాని, యపదములు గావు. అవ గాగమమునకును, పోలె బలె ననువానికిని బోలిక లేదు. ఏసియు దీనివలె నవ్యయము గాన నవ్యయత్వమునఁ బోలిక గలదు. పోలె బలెలు ద్రుతాంతము లైనయవ్యయములు గాఁగా నేసి ద్రుతాంతము గానియవ్యయము.

ఆపదము లైనంతమాత్రమునఁ బూర్వశబ్ద మె ట్లుండవలెనో చెప్పవలె ననుటయు సరి కాదు. 'సమాసే ऽవ స్తు సర్వదా' యని అవ (ప్రత్యయముగా?) సమాసమందే విధించుటయు గమనింపవలెను. ఏసికిఁ బూర్వశబ్ద మె ట్లుండవలెనో యెవ రైన జెప్పిరా? పోలెబలెలకుఁ బూర్వ ముండుశబ్దములం గూర్చి చెప్పుటకు? కావున నాకారణముచేత నిటఁ బూర్వశబ్దమును గూర్చి చెప్పఁబడె నని తలఁపరాదు. అట్లు ప్రభృతులవిషయమున నేల చెప్పెను? అవియు నపదములే యనవలెనా?

తత్త్వ. ఈకార్యములు వదర్థకము లగు పోని బోఁటి వంటులు పరంబు లగు నపుడును వచ్చు నని తెలిసికొనవలయు (313) నన్నది. ఇందు 'పోని' విషయమును సూత్రకర్త యీసూత్రమునందే సంగ్రహించెను. బోఁటి వంటులు సూత్రమునఁ బేర్కొనలేదు. అసలు వచ్చుట కవకాశ మున్నదా. బోటివంటులు పర మగునపుడు నామ,తదర్థములకు షష్ఠియు, అస్మద్యుష్మదర్థములకు షష్ఠీద్వితీయలం దెద్ది యే నొక్కటియు, నాత్మార్థమునకు షష్ఠియు నవును. అనఁగాఁ బ్రథమ యగుట యన్నది యెచ్చటను లేదు. ఈసూత్రము ప్రథమాంతములమీఁద గదా చెప్పుచున్నది. కావుననే సూత్రకర్త అట్టి, పోని, బోటి, వంటి యనునవి వదర్థకములు నాలు గుండగాఁ బోని మాత్రమే గ్రహించుట జరిగినది. కాఁగా బోఁటివంటులపరకత్వమున నీకార్యము గల దనుట సరి కాదు. అట్టిప్రయోగముల నీవ్యాఖ్య చూపిన బాగుండెడిది.

ఇంక నీవిధాన ముచితముగానే యున్నది. కాని సమా. 26. సూత్రమువలెఁ బ్రథమాంతములమీఁది పోలె బలె పోని శబ్దంబులు 'ను' శబ్దవ్యవహితంబులు

విభాష నగు నని చెప్పుట యుక్త మని తోఁచుచున్నది. (సమా. 26. సూత్రముకడ సర్వ (ను) శబ్దముచే నవి సమాసము లనరా దని చెప్పలేదు) ఇంక నిట స్వత్వము గాననగుటం జేసి వీని నలుక్సమాసము లని యేని చెప్పుట యుక్తమా? పైని స్పష్ట మగును.

## పెక్కింటి కొక్కటి

**40. కొన్నియెడల నుపమానంబులు పెక్కు లగుచో నివి కడదాని కొక్కటిక చూపట్టెడి.**

ఉపమానములు పెక్కు లుండుచోఁ గడయుపమానమున కొక్కదానికే యట్లు ప్రభృతులు చేరుట కొన్నియెడలఁ గనబడుచున్న దని యర్థము.

కమలషండంబు, నాగలోకంబు, తలిరుఁబాన్పు, కల్పాంతమున జముబానసంబు నింటిలోపలవోలె, వీంద్రును వాంద్రునుబలె అనునవి యిట లక్ష్యములు.

ఇట సర్వ. 'సూత్రమునందుఁ జూపట్టెడి నని యనుటకంటె కొన్నియెడల ననుట సమంజసముగా నుండెడిది. ఉపమావాచకము తక్కినయుపమానములపైని సైతము ప్రయుక్తము కావచ్చు' (269) నన్నది. సూత్రమునందు (మొట్టమొదటనే) కొన్నియెడల ననునది ప్రయుక్త మైయుండఁగా మఱల నిం కొకటి చేర్పవలె ననుట సరి కాదు.

మొదటిలక్ష్యమునుగూర్చి 'ఇచట విభక్తి కూడ చివరియుపమానముమీఁదనే చేరినది. తక్కిన వన్నియు ప్రథమాంతములుగానే యున్న (269) వన్నది. ఇంటి లోపలవోలె ననుచో లోపలవిభక్తి కూడఁ జివరిదానియొద్దనే కల దని యర్థము. ఈ'లోపల' విభక్తి యవునా? లోపలను షష్ఠీప్రత్యయముగానే చింతామణ్యాది వ్యాకరణములు పేర్కొన్నవి. ఈయది నిర్ధాణమునందే యవును. ఇంటిలోపల అను నిచట నిర్ధారణము లేదు. అధికరణమే యర్థము. ఈయర్థమున సప్తమి రావలెను. లోపల షష్ఠి. సప్తమియం దగు నని బాల.తోపాటు ప్రౌఢ.కూడఁ జెప్పలేదు. (చెప్పవలసియున్నది.) చింతామణ్యాదులును బేర్కొనలేదు. అట్టియెడల వీరిమతమున నిచ్చటిలోపలను బ్రత్యయముగాఁ జెప్ప వీలు లేదు. కావున ఇంటియొక్క లోపల – ఇంటిలోపల ననురీతిగా లోపల యుత్తరపద మనవలయును. అయ్యది మిగిలిన యుపమానములయెడఁ బ్రయుక్తము గాలేదు. సర్వ. లోపల ప్రత్యయ మనరా దని ప్రౌఢ.ను ఇతఃపూర్వము విమర్శించినది (చూ.కార.)

కమలషండంబు మున్నగునవి ప్రథమాంతము లని సర్వ. చెప్పుచున్నది. ప్రథమావిభక్తి యె ట్లయినది? ఇవి విశేషణములు గావు. కావున సమాసాంతర్గత విశేష్యములవిశేషణములషష్ఠికిఁ బ్రథమ యైన దని తలఁచుటకు వీలు లేదు. కాఁగా కమలషండంబుయొక్క, నాగలోకంబుయొక్క మున్నగురీతిగా యొక్క ప్రత్యయాంతము లనియు నాయొక్కప్రత్యయము లోపించిన దనియుఁ దలంచుట యుక్త మని తోఁచుచున్నది.

ఇట ఘం. పాండుభూపాలుని, ధర్మనందనుని, పంకజనాభునియట్ల కావె (ద్రోణ. 3. 54.) (330) యనునది యట్లున కిట్టిప్రయోగముగాఁ జూపినది. ఇందు మొదటియుపమానములలోనినిగాగమస్థితినిబట్టి యొక్క ప్రత్యయము లోపించిన దని స్పష్టముగా గుర్తింపవచ్చును. దీని కనుగుణముగాఁ బైని గమలషండంబు ఇత్యాదులు ప్రథమాంతము లనుటకంటె యొక్కప్రత్యయము లోపించిన వనుట యుక్త మని తోఁచుచున్నది. కానియెడల యింటిలోపల ననుసమాసమందలి 'లోపల' యనునది సయితము పూర్వమందలియుపమానము లన్నింటితో నన్వయించుట విశేషముగా గుర్తింపవలసివచ్చుచున్నది. దీనికంటె సప్తమియందు లోపల ప్రత్యయము నంగీకరించి, యదియే లోపించె ననఁదగును.

తత్త్వ 'ఇదియును సమాసఘటితము కాక వేఱుగా నున్నపదమే యనుకొనినచో సముచ్చయబలముచేత నన్నిపదములకును నన్వయించును. వాండ్రును వీండ్రును వచ్చిరి. అనుచోటిక్రియాపద ముభయశబ్దములతో నన్వయించుచున్నది గదా. సమాస మని యభూతనిరర్థకకల్పనము చేయుటచే నిట్టివిధాన మావశ్యక మయ్యె' (314) నన్నది. సంస్కృతమునం దిట్టిసమాసము లుండుట నీవ్యాఖ్యయు నిరూపించినది. అభూతకల్పన మగునా?

హిమమయూఖుఁడపోలెన్ అనుచో వ్యస్తతను ఘం. సంస్కృతసంప్రదాయాను గుణముగనే సాధించినది. (330) అట్లే యివియు వ్యస్తము లనవచ్చును. వాండ్రును వీండ్రును వచ్చి రనుచో సముచ్చయార్థము (వ్యస్తతయు) స్పష్టము. ఇట నట్లు గాదు. మొదటియుదాహరణములో లోపల అనునదియు నిట్లే యన్వయింప వలయుటయు గమనింపఁదగును. కానీ కేవల మీకారణమునుబట్టి వ్యస్తము లని నిర్ణయింప నక్కఱ లేదు.

ఇట్లు పెక్కుచోట్ల కొక్కటికిఁ గడదానికిఁ బైని బ్రయుక్త మవు నని చేసి ప్రభృతులు పెక్కులీ సూత్రకర్త నిరూపించెను. స్పష్టతకై వీని నెల్ల నెక్కడి కక్కడ సూత్రకర్త చెప్పియుండ వచ్చును. కానీ యిట్టివాని నెల్ల నొకగణము చేసి యొకే సూత్రముగా జెప్పుటలో లాఘవము గలదని తోచుచున్నది.

## పోలె ప్రభృతులు - ఉత్రేక్షాద్యోతకత్వము

**41. పోలె ప్రభృతులు తఱచుగాఁ బ్రథమాదివిభక్త్యంతనామంబులకంటెను దాదర్థ్యార్థకక్రియలకంటెను బరంబు లయి యుత్ప్రేక్షాద్యోతకంబు లగు.**

పోలె ప్రభృతులలో నిట బలెను సూత్రకర్త యుదాహరించెను. ఇవి ప్రథమ మొద లగువిభక్త్యంతములకంటెఁ బరముగా నుండియుఁ, దాదర్థ్యార్థకక్రియ లనఁ గా నుజ్యంతక్రియలపైని నిల్చియుండియుఁ దఱచుగా నుత్ప్రేక్షను దెలుపు నని సూత్రమునర్థము.

దారచక్రంపుబిళ్లవోలె ననుచో బిళ్లయో యనఁగా ననురీతిగాఁ బ్రథమపైని బోలె ఊహను దెలుపుచున్నది. నిరవకాశతన్ బోలె, నెవ్వగఁ బోలె ననుచో తృతీయార్థక మైనద్వితీయపై నిలిచి యుత్ప్రేక్షాద్యోతక మైనది. 'గార యిచ్చుటకును బోలె' అనుచో షష్ఠ్యంతముపై నున్నది. 'దుఃఖమునఁ బోలె' ననుచో సప్తమిపై. 'మాన్పఁగాఁబోలె' ననుచో నుజ్యంతము పైని జేరి యిట లక్ష్య మైనది.

'ప్రథమాదివిభక్త్యంతనామంబులకంటె' ననుచో నామ మనుప్రయోగము విశేషము. వస్తువాచకశబ్దము లని యితఁడు నామములను నిర్వచించెను. ప్రాతిపదిక మనునర్థమున వ్యాకరణములం బ్రయుక్త మైనది. అట్టియెడల భ్రాంతికి హేతు వగునామశబ్దప్రయోగ ముచితమా యని సందేహము. అయినను నిట సుబంత ములను బోధించుటకే నామంబుకంటె నని ప్రయోగించె ననుట స్పష్టము. అయినను నయ్యది యనవసరమే. ప్రథమాదివిభక్త్యంతంబులకంటె నన్నను జాలును.

తాదర్థ్యార్థకక్రియలపైఁ జేరుట విశేషము. ఇట సూత్రకర్త యుత్ప్రేక్షాద్యోతకత్వము నొక్కటియే చెప్పఁదలఁచినట్లు కానరాదు. అట్టియెడలఁ 'బోలెప్రభృతులు కొన్నియెడల నుత్ప్రేక్షాద్యోతకంబు లగు' నన్నఁ జాలును. ఇంక నివార్థకము లైనయీశబ్దములు పరముగా నుండఁగా నుపమేయము ప్రథమాంత మగునపు డుపమానము

లగునామాద్యర్థకశబ్దము లేవిభక్తులలో నుండునో యింతకు మున్ను చెప్పెను. ఇట ఉత్ప్రేక్షాద్యోతకము లగునపుడు పోలె ప్రభృతు లెట్టిశబ్దములపైఁ జేరునో చెప్పుట సయితము సూత్రకర్తయభిప్రాయ మనఁదగును. ప్రథమాదివిభక్త్యంతములపైని, నుజ్యంతక్రియలపైని, దాదర్థ్యార్థమునం దున్నవానిపైని, జేరు ననియు, నపు డవి యుత్ప్రేక్షాద్యోతకము లగు ననియుఁ జెప్పుట సూత్రకర్తయభిప్రాయము.

ఇవియును నలుక్సమాసము లనియే సూత్రకర్త తలంచె ననఁదగును. నుజ్యంత క్రియ పూర్వపద మగుట యిట విశేషము.

'మాన్పఁగఁ బోలె' ననుచో నుజ్యంతముపైఁ బోలె చూపి, మఱల 'అగ్గలికంబలె' నని ప్రథమావిభక్త్యంతముపైఁ బలెఁ జేరుట నుదాహరించుటలో బోలె నుదాహరించుట యై, బలె కుదాహరణ మిచ్చుట లక్ష్య మనఁదగు. లేనిచో 'మాన్పఁగాఁ బోలెన్' అనుదాని నన్నింటికంటెఁ జివర నుంచుట క్రమము గదా.

పోలెప్రభృతులలో 'బలె' ఒక్కటియే సూత్రకర్త యిటఁ జూపెను. పోలె ప్రభృతు లనుటచే 'అట్లు' అనుదానికి గ్రహణము లేదు. వలెకుఁ బ్రయోగ మీతఁడు చూపలేదు. పూర్వసూత్రమున పోలె, బలె, పోని అనువానిని జూపెను. ఇటఁ బోలె ప్రభృతు లన నవి గ్రహింపఁదగు నని యుద్దేశమా? పోని యనుదానికి నిట లక్ష్యము చూపలేదు. పోలె, బలె ననువాని కుత్ప్రేక్షాద్యోతకత్వము సూ.ని. చెప్పి యుదాహరించినది. కానీ పోనికి (విశేషణము) ఇట్టియర్థము చూపలేదు. బోఁటి వంటి, అట్లు, అట్టి, వలె అనుమిగిలినవానికి నీయర్థము సూ.ని. చూపలేదు.

'మఱి యవి కొన్నియెడల' ననుతరువాతిసూత్రమునఁ దథార్థకత్వమును జెప్పుచో 'అవి' అనెను. అవి యనఁగా నిటఁ బూర్వసూత్రోక్తము లైన పోలెప్రభృతులు గ్రహింపవలెను. అట సూత్రకర్త పోలె ననునది యొక్కటే యుదాహరించెను. వలెకుఁ బ్రకారార్థము సూ.ని. చూపినది. ఎటువలె వచ్చునో (సారంగ. 2. 233) మునుపటివలె (కాళ. 3. 168) (సూ.ని) దాని ననుసరించి యిట పోలె ప్రభృతులలో వలె గ్రహింత మన్న వలె కుత్ప్రేక్షాద్యోతకత్వము సూ.ని. చూపలేదు. శ.ర. పోలె బలెలకుఁ గూడ నుత్ప్రేక్షాద్యోతకత్వము చెప్పలేదు. కాఁగా నిప్పటికి లభించిన ప్రమాణముల ననుసరించి పోలె బలె ననునవి రెండే యుత్ప్రేక్షాద్యోతకము లగుచున్న వని గుర్తింపవచ్చును. అట్లు అనునది తథార్థకావ్యయముగాఁ బ్రౌఢవ్యాకర్తయే

యింతకు మున్ను చెప్పెను. (సమా. 8) కానీ 'అట్లు'కును నుత్ప్రేక్షాద్యోతకత్వము సూ.ని. కూడఁ జూపలేదు.

అందుచే నిటఁ బోలె ప్రభృతు లనక (ఇందువలనఁ బూర్వసూత్రము ననుసరించి పోలె బలెలతోపాటు పోని గూడ గ్రహింపవలసివచ్చును.) పోలె బలెలు పరంబు లగునపు డని స్పష్టముగా నిర్ణయించి చెప్పుట యుక్తము.

వీనియుత్ప్రేక్షాద్యోతకత్వమును వ్యాకరణము చెప్పవలసినయవసరమును గానరాదు. నుజ్యంతక్రియలపైఁ జేరుటను ఇవార్థకము లైనయివి యర్థాంతరద్యోతకము లవుటయును సందర్భమునుబట్టి సూత్రకర్త యారంభించియుండును. 38, 43 సూత్రములలో నివార్థకములు, వదర్థకములు నని చెప్పుట సయితము స్పష్టతకుఁగా మాత్రమే గ్రహింపఁదగును. అర్థవిశేషమునం దవి దాదా పెల్లశబ్దములపైఁ జేరుట గలదు. అట్టివానిని నిరూపింపవలసినయవసరమును నీశాస్త్రమున లే దనవచ్చును. ఇట్టివి సైతము సమాసము లని భావించుటచేతనే సూత్రకర్త యీసూత్రమును జెప్పియుండె నని యూహింపవలసియున్నది.

## పోలెప్రభృతులు - తథార్థకత్వము

**42. మఱి యవి కొన్నియెడల నామంబులప్రథమాదివిభక్తులు కొన్నింటికిఁ బరంబు లై తథార్థకంబు లయ్యెడి.**

అవి యనఁగాఁ బూర్వసూత్రోక్తము లయిన పోలెప్రభృతులు.

'ఇపుడు బోలె'. అనఁగా ఇప్పటిప్రకారముగా నని యర్థము. అట్లే సూత్రకర్త చూపిన మిగిలినలక్ష్యములందును గమనింపవచ్చు. 'ఘూర్ణమానాబ్ధిఁ బోలెఁ బెన్ మ్రోఁత లడర' మున్నగుచోట్ల పోలె నివార్థక మన్నను నిబ్బంది గానరాదు.

కాని 'మున్నువోలె' మున్నగుచోట్ల మునుపటిప్రకారముగా ననురీతిగాఁ దథార్థకత్వము తప్పదు.

'మఱి యవి' యనుట సరిగా లే దని యింతకు ముందు సూత్రమున గమనించితిమి. అవి అనుటచేఁ బోలెప్రభృతులు గ్రహింపవలెను. అటఁ బోలె ప్రభృతు లనఁగాఁ బ్రయోగానుసారముగాఁ బోలె, బలె నను నవి రెండే యగును. అట్టియెడఁ బ్రస్తుతసూత్రస్థలమునను నవియే గ్రహింపఁబడును. కాని వలె

తథార్థకముగా సూ.ని. చూపినది. ఎటువలె, మునుపటివలె (సూ.ని) అట్లు తథార్థకావ్యయముగా నీసూత్రకర్తయే పేర్కొనెను. (సమా. 8) ప్రస్తుతస్థలము ననుసరించి యాసూత్రార్థమును గూడ నిందుఁ జేర్పవచ్చును. ప్రథమాదివిభక్తులతో పాటు ధాతుజవిశేషణములను గూడ నిట సంగ్రహించిన నింక నాసూత్ర మేల? కానీ యట్లు, కరణి అనుమున్నగునవి విడిగాఁ గూడఁ దథార్థకములను నభిప్రాయముతో వాని నిటఁ జేర్చియుండఁ డని తలఁపవచ్చును.

ఇవియును సమాసములుగా భావించుటచేతనే యిట్లు పేర్కొనె నని యూహింప వచ్చును. తథార్థకము లగుటను విధింపవలసినయవసరము లేదు.

మొత్తముమీఁద నీసూత్రమునకును బ్రత్యేకప్రయోజనము సమాసముగాఁ జెప్పఁ దలఁచినపుడే. ఇవి సమాసములే కా వన్నచో 39, 40, 41, 42 సూత్రములు కేవలము స్పష్టతకై చెప్పఁబడినవే యనియు, వానివలనఁ బ్రయోజనము ప్రత్యేకముగా లే దనియు నిర్ణయించుటలో దోషము లేదు.

'లుగలుక్సమాసములు' అనుశీర్షిక యుంచి సూత్రకర్త 38 నుండి 43 వఱకు సూత్రములు రచించెను. అనఁగా నివి యెల్లను లుగలుక్సమాసము లని తాత్పర్యము. (కు.పం. 122) ఇం దాయయిశబ్దములు పరము లగుచో షష్ఠి వచ్చుసందర్భములు మాత్రమే లుక్సమాసము లనఁదగియున్నవి. ప్రథమాదివిభక్తు లగుసందర్భమున నావిభక్తులు లోపింపకుండుటంజేసి యవి యలుక్సమాసములే యవును.

'ప్రథమాద్వితీయాదివిభక్తులు లోపింపకుండుటచే నీయవి సమాసము లన నక్కఱ లేదు. యొక్క అనునది లోపించుచున్నది. కానీ అది వాక్యమం దయినను లోపించును. కావున సమాస మన నక్కఱ లేదు. 3. తిండికాఁడునుబోలె ననుచోట్ల స్వత్వ మిది వ్యస్త మని తెలుపును. 4. సమాసమే యగుచో 'ను' శబ్దమునకు స్థితి యుండరాదు. ప్రత్యేకవిధానమును లేదు. కాఁగా విభక్తిని జెప్పునీయవి కారకప్రకరణమునందు జెప్పఁదగును గాని సమాసము లనరా (311. 312) దని తత్త్వ. అభిప్రాయము.

విభక్తి లోపింపమి నలుక్సమాసలక్షణమె యైనను దప్పనిసరిగా సమాసము లనవలసినయవసరము లే దనుట యుక్తమే. యొక్కలోపము వ్యస్తతయందును గలదు. కావున యొక్కలోపస్థలములు సైత మన్నిము వ్యస్తములే యనరాదు. బకునియట్ల ఇత్యాదులలో భేదము కానరాకపోవచ్చును. కానీ నారాయణునట్లు,

నలునట్లు ఇత్యాదులలో నుగాగమ మెట్లు? ఇట సమాసము గానిదే నుగాగమము రా వీలు లేదు. (లేదా వ్యస్తతలోను నుగాగమమును విధించుకొనవలెను.) కావున వీనిని వ్యస్తము లనరాదు. ఇంక నుగాగమము వచ్చినవి మాత్రమే సమాసము లనియు, నుగాగమము లేని 'దీపమట్లు' వ్యా.సం.స. (1165) దానిని సమాసమె యన్నది. వానియట్లు, నీయట్లు అనురీతిని వ్యస్తము లని సమన్వయించుటయు సహజముగా నుండదు. కావున షష్ఠీవిభక్తి యగుతావులలో మాత్రము సమాస మనుట యొప్పుకొనవచ్చు. మిగిలినచోట్లను గూడ నొకే కోవలోనికిఁ దెచ్చుటకై సూత్రకర్త వాని నలుక్సమాసము లనియుండును. కాఁగా నీయవి సమాసము లనుట కిది యొకయాధార మైనది.

తిండికాఁడునుబోలె ననుచోటిస్వత్వము సమాసము గా దనుట కాధారము. కావున తత్త్వ. చెప్పినయీయంశ ముచితమె. కానీ సమాస మైనచో నుశబ్ద ముండరా దన నేమి? వ్యా.సం.స. (1164) లో వఝులవారు నిట్లే పేర్కొనిరి. అది ద్రుతమె యైన సమాసమున లోపింపకుండుట, వేఱొకశబ్దము గావున సమాసమధ్యమున నిలుచుట కవకాశము గల్గుట, 39.సూత్రమున విధానసామర్థ్యమువలన సిద్ధించును. కావున దానిస్థితినిబట్టి సమాసము ననుమానింపనవసరము లేదు. 'పదియు నొక్కండ్రు' అనుదానివలెనే 'ను'శబ్దప్రయోగ మున్నను నయ్యవి సమాసము లగుట కవరోధము లేదు. షష్ఠియం దిట్టివి సమాసము లనక తప్పమి దీనిని మొత్తము కారకపరిచ్ఛేదమునందుఁ జెప్పుటకు వీలు లేదు. అట్లు అనుదానికొఱ కైన నిటఁ జెప్పిన సందర్భానుసారముగా మిగిలినవియుఁ జెప్పఁదగియుండు, లేదా, దీని నెల్లఁ గారక పరిచ్ఛేదమందే చెప్పి, షష్ఠి మాత్రమే సమాసపరిచ్ఛేదమునఁ జెప్పవలెనా? (షష్ఠీవిభక్తియా? సమాసమా? ఇట నిర్ణయింప రాకున్నది.)

వఝులవారును నీయవి సమాసము లనవలసినయవసరము లే దనియే భావించిరి. వారియభిప్రాయమునందలియంశము లిట్లు గుర్తింపవచ్చును. 1. నదివోలె మున్నగుచోటులందలివాదేశమును నిచటి వ్యస్తతను దెల్పును. (వ్యా.సం.స. 1164) ఇది బల మైన కారణము గాదు. నలువది, నలుగడలు, ఒండుగడ, తెల్లిదమ్మి యనురీతిగా సమాసములందు గసడదవాదేశము గాననగుచుండఁగా నయ్యది వ్యస్తతయందు మాత్రమే యుండు నని నియమించు టెట్లు కుదురును?

2. ఇట వఝలవారు హిమమయూఖుండపోలెన్, వైశ్యులపోలె (వ్యా.సం.స. 1164) అనురీతివానిం బెక్కు చూపిరి (ఘం.330). ఇట నవధారణార్థకప్రయోగము వీనివ్యస్తతకుఁ బ్రమాణ మనుట యుక్తమే. కాఁగా 'తగరునుబోలె' ననుచోటి స్వత్వమును, నిచ్చటియవధారణార్థకము నననవి రెండు వీనివ్యస్తతకు నాధారములు గాఁగలవు.

కాఁగా నివి యెల్ల సమాసములే యని కానీ లేదా వ్యస్తములే యని కానీ నియమించుట కవకాశము లేదు.

వఝలవారు ఇవశబ్దముతోడిసమాసము సంస్కృతమునందె నిత్యము కామింజేసి తెల్గునందును నివార్థకములతోడిసమాసమున కనిత్యత నంగీకరించుట వింత కా (వ్యా.సం.స. 1164) దనిరి. అంతకు ముందే 'ఇవేన సమాసో విభక్త్యలోప శ్చ. ఈ సమాసము వైకల్పిక మనుట భాష్యసమ్మత మై, ఉద్బాహు రివ వామనః అనుకాళిదాసు వ్యస్తప్రయోగము సాధు వగుచున్న దని పేర్కొనిరి. (వ్యా.సం.స.1150 ఘం. 330) కాఁగాఁ దెలుఁగునను నిత్యసమాసము చేయవలసినయవసరము లేదు. అసలు సంస్కృతమునందు సమాసము నియతము గావలయు నన్ననియమ మొక్కెడ నున్నప్పటికిఁ దెలుఁగున నట్లే చెప్పవలసినయవసరము లేదు. ప్రయోగానుగుణముగా వ్యస్తములను సాధించుకొనుట సంస్కృతభిన్న మైనను విరుద్ధము గానేరదు. ఇట సంస్కృతమునను నాధారము గల దన్న మఱియు సంతోష మంతే.

కాఁగాఁ దెలుఁగున వీని నెల్ల సమాసము లనవలసినయవసరము లేదు. ఇంక రామునట్లు, రామునట్టి యనురీతివాని ననుసరించి షష్ఠీస్థలములందు మాత్రమే సమాస మగు ననియు నిందు లుక్సమాసము లే దనియుఁ జెప్పనగును.

నారాయణునట్లు అనురీతిప్రయోగముల ననుసరించియే యిట షష్ఠి కైనను సమాస మంగీకరించుట. లేనిచో నివి మొత్తము వ్యస్తము లని చెప్పఁదగును. నీ(దు)నట్లు నా(దు) వలె, నా-నాయది యనురీతి దుగాగమాభావమును విభాషాపదముచే (బా.సమా.11) సాధించికొనఁదగును.

ఇట్లు నిర్ణయించుచో నుశబ్దమునకు స్వత్వస్థితి మున్నగునవి సిద్ధించుచున్నవి. అట్టియెడల 39 నుండి 42 వఱకుఁ గలసూత్రములు స్పష్టతకుఁ జెప్పిన వని గ్రహింపఁదగును. 38 సూత్రము ననుసరించి ప్రథమాంతములు గానిచో నుశబ్దము లేదు. పోలె, బలె, పోలె, భిన్నములకు లేదు. కావున 38 సూత్రము కొంతవఱకు

ప్రయోజనవంతమె. కేవలము శబ్ద.116 చే వచ్చు నని (తత్త్వ.313) తలంప రాదు. కావున వ్యా.సం.స. ప్రభృతివ్యాఖ్యల నాధారము చేసికొని షష్ఠ్యంతములే యివార్థకములు మున్నగువానితో సమసించు ననియు, నితరవిభక్త్యంతములు సమసింప వనియుఁ దలఁపఁదగును. ఇట్టినుశబ్దాదులతోడివ్యవధానము షష్ఠీ స్థలములలోఁ గానరాదు గూడ.

కావున లుగలుక్సమాసము లనుపేరితో వీనిని బరిగణింప నక్కఱ లే దనవచ్చును.

ఇట సర్వ. లుగలుక్సమాసము లనఁగా 'లుక్సమాసము లయ్యును అలుక్స మాసము లైన వన్నయర్థము వెంటనే స్ఫురింపవచ్చును. (276) అని పేర్కొనుట యుచితముగా లేదు. విభక్తి లోపించినవి లుక్సమాసములు, లోపింపని వలుక్సమాసములు గాఁగా లుగలుక్సమాసము లనుదాని కే మర్థ మగును. విభక్తి లోపించియు లోపింపనిసమాసములా? లోపించియు లోపింపకుండుట యన నేమి? లుక్సమాసము లయ్యును అలుక్సమాసము లగుట యన్న నదియే కదా. విభక్తి లోపించినఁ గాని లుక్సమాసములు గావు. లోపింపకున్నఁ గాని యలుక్సమాసములు గావు. లుక్సమాసము లయ్యు నలుక్సమాసము లవుట యసంభవము. కావున లుక్సమాసములు కొన్ని, యలుక్సమాసములు కొన్ని, యున్న వన్నదృష్టితో ద్వంద్వసమాసముగనే పైశీర్షికను వాడుకొనె (270) ననుట యుక్తము. అట్టిసర్వ. అభిప్రాయము సముచితము.

**ఇది సమాసపరిచ్ఛేదము.**

# ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యానుశీలనము

## తద్ధితపరిచ్ఛేదము

వివిధార్థములం దగుతద్ధితప్రత్యయములు పూర్వలక్షణగ్రంథములందుఁ గొన్ని ప్రస్తావింపఁబడినవి. విశేషములను గొన్నింటిని బ్రయోగానుసారముగ గుర్తించి వానిని వివరించుటకై యీపరిచ్ఛేద మారంభింపఁబడినది.

"తద్ధితము లనఁగా విశేష్యవిశేషణము లగుశబ్దములమీఁద భావాద్యర్థములందు రాఁదగినప్రత్యయవిశేషము లని యర్థ' మని తద్ధితములను గూర్చి వ్యాకర్త ముందుగా వివరించెను. చింతామణ్యాదు లగులక్షణగ్రంథము లాయాప్రత్యయములను దద్ధితములను గొన్నింటిని బేర్కొన్నవి. కాని తద్ధిత మనుసంజ్ఞనుగూర్చి వివరింప లేదు. ఇంతకు ముం దితఁడు శబ్దపరిచ్ఛేదమున 'శబ్దములు విశేషణములు విశేష్యము లని ద్వివిధంబు' లని పేర్కొనెను. అట్టివిశేష్యవిశేషణములపై నాయాయర్థములం దవుప్రత్యయములకుఁ దద్ధితము లని వ్యవహారము. సుబంతములపయి భావాద్యర్థములం దగున వని గ్రహింపవచ్చు. శబ్దపరిచ్ఛేదము సుబంతములప్రక్రియయే కదా నిరూపించినది.

సర్వ., సుగమ.వ్యాఖ్య లీవాక్యములు సూత్రకర్తరచితములు కా వని యెంచిన వేమో చూపలేదు. కు.పం. ప్రభృతివ్యాఖ్యలు చూపి వివరించినవి.

'తద్ధితము లనఁగా ... అని యర్థము' అని చెప్పుటచే నీచెప్పినయర్థము తద్ధిత శబ్దార్థ మేమో యనిపించునవకాశము గలదు. సుబంతములపై భావాద్యర్థములందు వచ్చుట యన్నది తద్ధితప్రత్యయములలక్షణము.

తద్ధితము అనుశబ్దమునర్థ మిట్లు గ్రహింపఁదగును. తద్ధిత – పుం. తేభ్యః విగ్రహస్థ తత్తత్ప్రకృతీనామ్ స్వవిశిష్టతయా ప్రయోగేభ్యః హితః. వ్యాకరణోక్త ప్రత్యయభేదే. (శబ్దస్తో.) శబ్దార్థచింతామణి ననుసరించి వఝలవారును 'ఆయాయర్థములకుఁ – బ్రకృత్యర్థభిన్నార్థస్వార్థములకు హిత మైన వనఁగా

నాయాయర్థములను దెల్పునవి తద్ధితము లని యర్థ' (వ్యా.సం.స. 1261) మని పేర్కొనిరి.

ప్రయోగమునకు హిత మైన వనియు తద్ధితశబ్దార్థము చెప్పఁబడుచున్నది.

కాఁగా భావాద్యర్థములందు నామములపై – సుబంతములపైఁ జేరి ప్రయోగింప బడుట తద్ధితములక్షణముగా గ్రహింపఁదగును.

## డువర్ణకాదిలోపము

**1. తద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు పదంబులడువర్ణకాదులకు లోపం బగు.**

బాలవ్యాకరణమున 'సమాసవిభక్తికి లోపం బగు లట్టునకుఁ గా' దనుసూత్ర మందలిసమాసశబ్దమే తద్ధితవృత్తికి నుపలక్షణముగా విభక్తిలోపము నాసూత్రము చేతనే సాధించుకొనవలసియున్నది. స్పష్టతకై యిట్లు చెప్పఁబడిన దని కు.పం. పేర్కొన్నది.

ఉపలక్షణ మనురీతిగా భావించుట యనుక్లేశమును బోగొట్టుటకై యిట్లు చెప్పఁ బడిన దని (321) తత్త్వ. పేర్కొన్నది.

కానీ యీవిభక్తిలోపవిధానము చెప్పఁబడినమాత్రమున సమాసశబ్దము తద్ధిత వృత్తికి నుపలక్షణము గా నక్కఱ లే దని నిర్ణయించుటకు వీలు లేదు. (సర్వ. 280)

'సరసపుఁదనము' అనుచో మువర్ణమునకుఁ బువర్ణ మైనది, కర్మధారయంబు లందుఁ జెప్పబడినకార్యమే. కాన నట సమాసము తద్ధితవృత్తి కుపలక్షణము కాక పుంపులు రావు. తనప్రత్యయపరకత్వమున పుంపులు వచ్చుటకే యవకాశము లేనపుడు పుంపులకుఁ దనంబు పరం బగునపుడు నుగాగమమును విధించుట యెట్లు పొసఁగును. దీనిచేతనే సూరి విస్పష్టముగా సమాసము తద్ధితవృత్తికి నుపలక్షణ మని సూచించిన ట్లయినది.

అట 'సరసపుఁదనము' మొదలుగా బిందుసంశ్లేషరూపములు మూఁడు మాత్రమే యుదాహరించెను. స్వత్వము నేల చూపలేదు? సంధి. 26 సూత్రముచేత నిట స్వత్వము రాదు. (బాల. ఘం. 64) 'సమాసంబులందు ద్రుతంబునకు' ననుసూత్రము

నందును సమాసశబ్దము తద్ధితవృత్తికి నుపలక్షణ మనవలెను. లేనిచో స్వత్వమును గూడఁ జూపవలెను.

అదే విధముగా సమాసవిభక్తి కనుసూత్రమందలిసమాసశబ్దము తద్ధితవృత్తి స్థలమును గ్రహించుట కెట్టియిబ్బందియు లేదు. సూరియభిప్రాయ మదియే. కాఁగా నాసూత్రముచేతనే తద్ధితప్రత్యయపరకత్వమున విభక్తి లోప మవును.

ఇట్టియెడల సమాసవిభక్తికి ననుసూత్రముచే లబ్ధ మగునర్థవిశేషమును మాత్రమే వివరణప్రాయముగా నిట్లు చెప్పినచోఁ బైని బేర్కొనఁబడినరీతి వగుమిగిలినస్థలముల యందలికార్యములగతి యేమి? ప్రస్తుతవిధానము లక్ష్యమును పూర్తిగా సాధింపఁ జాలదు.

పైఁగా నీసూత్రమునుబట్టి సమాసమునఁ జెప్పినవిభక్తిలోపము రా దన్న సమాసమునఁ జెప్పినమిగిలినకార్యములును ప్రవర్తింపమి, సరసపుఁదనము ఇత్యాది రూపములు సిద్ధింపమింజేసి సూరివిధానము వ్యర్థ మనవలసియుండు. ఇట్లు చెప్పి మిగిలినచోట్ల సమాసమందుఁ జెప్పినకార్యములు తద్ధితవృత్తిలో రాకుండఁ జేయుట యనునర్థము దీనివలనఁ గల్గుచున్నది. కాఁగా విభక్తిలోపమును బ్రత్యేకముగా విధింపఁబూనినపుడు పుంప్వాదులనుగూర్చియును బేర్కొనుట యవసరము. వివరణమునకుఁ బ్రారంభింపఁబడ్డలోపము పూర్వార్థమును సంకుచితము చేయుట యుక్తమా?

ఇం తేల? ప్రౌఢవ్యాకర్తయే సమాస36 సూత్రమునొద్ద పెద్దతనము-పెత్తన మని యుదాహరించెను. అనఁగా సమాసమునఁ జెప్పినలోపాదికార్యములు తనప్రత్యయపరకతలో ననఁగాఁ దద్ధితవృత్తియందు వచ్చుట నీతఁడె యంగీకరించి, ప్రవర్తింపఁజేసెను. ప్రౌఢ. సమాసములోఁ జెప్పినకార్యము తద్ధితవృత్తిలో వచ్చినపుడు బాల. చెప్పినయీవిభక్తిలోపకార్యము మాత్ర మేల రాదు. కాఁగా నీలక్షణ మనవసరము. (చూ. పుట. 261)

ఇంక నీసూత్రమునందలియితరాంశములం గూర్చి వ్యాఖ్యలు పరామర్శించినట్లు గానరాదు. అయ్యది గమనింపఁదగును.

ప్రస్తుతసూత్రము తద్ధితప్రత్యయములు పరము లగునపుడు పదంబుల డువర్ణకాదులకు లోపము చెప్పుచున్నది. రామునియొక్క + తన = రామునితనము అనురీతిగా నవును.

డువర్ణకాదు లనుచో డువర్ణక మనునది ప్రథమైకవచనప్రత్యయ మని స్పష్టము. అనఁగాఁ బ్రథమైకవచనమునందు విహిత మయిన డుఙ్ ప్రత్యయమే. అట్టియెడల డువర్ణకాదు లనుటకంటె డుజ్వర్ణకాదు లనుట యుక్తము. డువర్ణక మన్నచో డు మాత్రమే లోపించి జిత్త్వమునకు ఫల మయినబిందువు నిలిచియేయుండు నని యర్థ మవును. మధ్యమముడుజులకు, మూఁడుశబ్దముడుజ్వరంబునకు ననురీతిగా సూరి యీరీతిసందర్భములలో జకారమును గూడఁ బేర్కొనుట గమనింపవచ్చును. డువర్ణము మాత్రమే లోపించి జిత్త్వముఫల మగుబిందువు నిలిచియేయుండు నని సూత్రకర్త తలఁచియున్నచో నట్లు విశేషముగాఁ జెప్పుట ప్రయోజనవంత మగును. అట్టిది గానరాదు. మగఁటిమ్యాదులలోనిబిందు వన్యథా సిద్ధము. 'మగాదిభ్య ష్టిమిజాదయః (సూత్ర), మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' (బాల.తద్ధి.8) అనుచో నీపద్ధతి నాశ్రయింప నక్కఱయే లేదు. కావునఁ గేవలము డువర్ణకాదు లనుట సరి కాదు.

అది య ట్లుండ నసలు డువర్ణకలోపవిధాన ముచితమా? సూరి గాని యాతఁడు గానీ డువర్ణకాంతము(ప్రథమైకవచనాంతము)లపైఁ దద్ధితప్రత్యయములను జెప్పుటయు నా'డు'వర్ణకము లోపించుటయు నీవ్యాకరణములందుఁ గానరాదు.

కానీ యీవ్యాకర్త మిండఱికము (మిండఁడు–ఱికము) మిండత (మిండఁడు–త) యనురీతిగా శ.ర.లో డుజ్లోపమును జూపెను. (దీనినిబట్టియు మిండత ఇత్యాదుల బిందువు లేదు. అందుచే సూత్రమున 'డుజ్వర్ణకాదు' లనుట యుచితము.) కావునఁ దదనుగుణముగనే యీసూత్రము చెప్పఁబడిన దనుట స్పష్టము.

కానీ యట డుజ్లోప మయిన దని తలఁచుటయే యుచితము గాదు. భావార్థకప్రత్యయము షష్ఠ్యంతముపై నగునే కాని ప్రథమాంతముపైఁ గాదు. తనవర్ణకము సయితము భావార్థమునందే విహితము. అట్టియెడల రామునియొక్క+తన=రామునితనము అనురీతిగాఁ దనప్రత్యయమువలెనే యీఱికప్రత్యయమును షష్ఠ్యంతముపైనే యవును. అట్టియెడ మిండఁడు+ఱికము అనురీతిగా దీనిని బ్రథమాంతముపైఁ జూపుట సంప్రదాయము గాదు.

తరువాతిసూత్రమునొద్ద ఆఁకొన్నవానితనము అనియే ప్రౌఢవ్యాకర్తయుఁ జూపెను. ఇట ఆఁకొన్నవానియొక్క + తన అనియే చూపవలెఁ గాని ఆఁకొన్న

వాఁడు+ తన అని కాదు గదా. తన షష్ఠ్యంతముపై నవునపుడు ఱిక ప్రత్యయము ప్రథమాంతముపై నవు నని చెప్పుటకు లక్షణమునం దెట్టియాధార మే నున్నదా మిండనిఱికము అని కా నక్కఱ లేదా? మిండఱిక మవుట యె ట్లనవచ్చును. ఆ యిబ్బంది లేదు (బా.సూ.) అట్టియిబ్బంది యేర్పడనపుడు ప్రథమాంతముపైని నవుట యెట్లు? అయ్యది బాలవ్యాకరణోక్తము గా దనుచోఁ బ్రౌఢవ్యాకర్త యేని తనసిద్ధాంతమున కనుగుణముగాఁ జెప్పవలెను.

మిండత యనుచోఁ బ్రత్యయము మతుబర్థకము. ప్రథమాంతముపైనే కావలయు గదా యని యనుమానింపవచ్చును.

ఇటు నొకభేదము గలదు. (మిండఱికము చూ.బా.సూ.) సూరి యువతి విటీరజస్వలలు గుబ్బెతమిండతముట్టుతలు నాఁబడుదు రని దీనిని నిపతించెను.

అట్టినిపాతమువలననే మిండఁడు–త మిండత యని యైన దనవచ్చును. అది డుజ్లోపమును నిపతింపఁబడినదిగా గుర్తింపఁబడునపుడు ప్రత్యేకముగాఁ దద్ధిత ప్రత్యయము పర మైనది గావున డుఙు లోపించిన దని చెప్పవలసినయవసరము లేదు. కావున దానికై డుజ్లోపవిధానము వ్యర్థము. పైఁగా స్త్రీసమ మగు మిండ శబ్దము (బా.సూ.) పైనే తత్ప్రత్యయము నిపతింపఁబడిన దనుచో నీడుజ్వర్ణప్రసక్తియే లేదు. బాల. ఇట నెల్లఁ బ్రథమాంతములే నిర్దేశించినది. దొంగ, లంజె, చుట్టము అనువానివలె 'మిండ' అనునది సయితము ప్రథమాంతమే యగును. అగుచో నయ్యది స్త్రీసమ మనవలయును. మిండతపసి, మిండమేఘము మున్నగునవి యిట్లు సిద్ధము లవును. డుమంతము లయినచోఁ గర్మధారయమునఁ బూర్వపదముగా నుండుటకు వీలు లేదు గదా.

శ.ర.లో నీసూత్రకర్తయే మిండ+కాఁడు – మిండగాఁడు అని చూపెను. ఇట మిండ ప్రాతిపదికమా? ప్రథమాంతమా? మతుబర్థమున నవర్ణమును జెప్పి దివ్యతేజంబునవాఁడు అని ప్రథమాంతముపయినే చూపెను. కాఁగా మిండఁడు+ కా(ఁడు) అనునీమతుబర్థకము చేరినమిండశబ్దము సయితము ప్రథమాంతమే కావలె. సూ.ని. కూడ శ.ర. మార్గమునే యనుసరించినది.

ఘం. 'మిండనియొక్క+ఱిక. సమాస.25చే మిండని+ఱిక అని కాఁగా నిక్కలాదిసూత్రముచే మిండఱిక మైన (బాల.ఘం.257) దన్నది. సూరి 'మిండ'

శబ్దమును జూపుచుండఁగా మిండఁడు అనుదానిని గ్రహించు టెట్లు? చుట్టము, అగ్గలము ఇత్యాదిగా నెల్లెడ నీపరిచ్ఛేదమునఁ బ్రథమాంతములే నిర్దేశించుచుండఁ గా నీయొక్కచోటనే ప్రాతిపదికమును నిర్దేశించె ననవలయును. అది యుచితము కాదు గదా.

నిక్కలాదిసూత్రమును బ్రవర్తింపఁజేయుటయు విశేషమే. మొత్తముమీఁద నిట డువర్ణకమునకు లోపము చెప్పుటవలనఁ బ్రయోజనము గానరాదు.

'డువర్ణకాదులు' అనుచో నాదిశబ్దము కూడ సముచితస్థానమునందుఁ బడలేదు. డుప్రత్యయము మొద లగునవి యనఁగా నాయితరములు ప్రత్యయములే కావలసిన యవసరము లేదు. ప్రత్యయేతరములును గావచ్చును. (మగనితన మనుచో నిగాగమమును లోపించి 'మగతన' మని కావచ్చు. అయిన దీనిని మగఁటి మ్యాదులలోఁ జేర్ప నవసరము లేదు.) విభక్తీతరము లిట్లు లోపించుట యెక్కడనో వ్యాకర్త ప్రదర్శింపలేదు. ఎచట నైన నితరములు లోపించుచో నట్టియెడలఁ బ్రత్యేక విధానము జరుగుచునే యున్నది. 'ఉక్కివంబునకు వలోపం బగు' ఇత్యాదులు. ఒంటి అనుచో 'టి'ని 'డు' కాదేశము చేయుట మొదలగున విట్టివి. తనవర్ణకము పర మగునపుడు తచ్ఛబ్దార్థమునకు లోపము నీసూత్రకర్త ప్రత్యేకముగాఁ జెప్పెను. 'ఆది' శబ్దముచే సంగ్రహించునుద్దేశ్యము సూత్రకర్తకుఁ గానరాదు.

ఇంక 'డు' మొద లగువిభక్తిప్రత్యయములకే లోప మవుటను విధింపఁదలఁ చె ననవలయును. అట్టియెడల డువర్ణకాదు లనుటకంటె 'డ్వాదివర్ణకములు' అని చెప్పుట కొంతవఱ కేని యుక్తము.

సూత్రమందు 'పదంబుల' అనుదళము సయిత మనవసరము. డువర్ణకాదు లనుచుఁ 'బదంబుల' యని చెప్పవలసినయవసర మేమి? అపదములయందును డువర్ణకాదు లుండునా? అట్టివానికిఁ దద్ధితప్రత్యయములు పర మయినపుడు లోపము రాకుండుటను బ్రయోజనముగాఁ జెప్పుట కట్టిస్థితియే లేదు గదా. విశేషణవిశేష్య ములపైనే తద్ధితప్రత్యయము లవుట నింతకు ముందు పేర్కొని యుండెనే.

'పదంబులడువర్ణకాదులకు' ననునది కేవలము విస్తరణమే. 'విభక్తిలోపంబు' అని చెప్పినఁ జాలును.

'లోపం బగు' నని యిట లోపము నిత్యముగానే విధింపఁబడినది. వగలాఁ

డు, వగలాఁడి యిత్యాదులలో సూత్రమున 'బహువచనాంతంబు' అనురీతి ప్రత్యేక నిర్దేశమువలన బహువచనము లోపింపలే దని గ్రహింపఁదగును. కావున 'లోపం బగు' ననుట యుక్తమే.

కానీ యీవ్యాకర్త మతుబర్థమున నవర్ణకము చెప్పి 'దివ్యతేజంబునవాఁ' డని యుదాహరించెను. 'దివ్యతేజంబు' అనుచోఁ బ్రథమైకవచన మేల లోపింపలేదో చెప్పలేదు. నిల్చుటకు నాసూత్రమందుఁ గాని, యీసూత్రమందుఁ గాని యెట్టి యాధారమును లేదు.

కాని దానికై లోపము ప్రాయిక మనురీతిని జెప్పుటయు యుక్తము గాదు.

కాఁగాఁ 'దద్ధితప్రత్యయములు పరంబు లగునపుడు విభక్తిలోపం బగు' నన్నఁ జాలును.

అస లామాత్ర మేని విధింపవలసినయవసరము లేదు. సూత్రము స్పష్టతకే. సమాసవిభక్తికి లోపం బగు ననుబాల.లక్షణముచేతనే యీలోప మగు ననియు, బాల.లోనే కాక ప్రౌఢ.లోను సమాస మనునది తద్ధితవృత్తికి నుపలక్షణ మనియు మొదటనే గుర్తించితిమి.

## తచ్ఛబ్దలోపము

**2. తనవర్ణకంబు పరం బగునపుడు తచ్ఛబ్దార్థంబునకు లోపంబు విభాష నగు.**

ధాతుజవిశేషణములకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగును. తనప్రత్యయము పర మైనపు డాతచ్ఛబ్దమునకు విభాషగా లోపము వచ్చు నని సూత్రమున కర్థము.

వచ్చినవాఁడు, వచ్చినది. ఇత్యాదులలోఁ దచ్ఛబ్ద మున్నది. విభక్తివివక్షలో ననుప్రయుక్తముగాఁ జెప్పబడిన దవుటంజేసి యీతచ్ఛబ్దము స్వార్థము నీయదు. వలనకు ఉండి యనుప్రయుక్త మవును. వనమువలననుండి వచ్చె ఇత్యాదిస్థలము లలో ఉండి పదము ఉండు ధాతువు క్త్వార్థము నీయదు కదా. సంస్కృతమునందు 'ఏధాం బభూవ' మొద లగున విట్టివి.

కాఁగాఁ బ్రస్తుతసూత్రమునఁ దచ్ఛబ్దార్థమునకు ననఁగా సంస్కృతమునందలి

తచ్ఛబ్దమునకుఁ బర్యాయమైన 'ఆ'శబ్దము అని యర్థము. ఇది చింతామణిలోని 'దారార్థే కత ఉ దపి రః' అనుచోటి 'దారార్థే' యనుదానివంటి దనవచ్చును.

ఐనను సూరి 'తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' నని చెప్పినదాని ననుసరించి 'తచ్ఛబ్దంబునకు లోపం బగు' నని చెప్పినను నెట్టియిబ్బంది యుండెడిది కాదు.

ఈలోపవిధానము యుక్తమే యని వ్యాఖ్యలు కొన్ని భావించినవి. ఘం. తద్ధిత ప్రత్యయములు పర మగునప్పటియీలోపము బా. సమాస. 20సూత్రముచే సంపాదించుకొనవలసియున్న దనియుఁ గావున నది యాసూత్రమునకు వివరణ ప్రాయ మనియుఁ బేర్కొన్నవి. (196)

అనఁగా నిటఁ దచ్ఛబ్దము లోపించుటకు నిక్కలాదిసూత్రమే సూరి యుద్దేశించె నని చెప్పవలయును.

కానీ సూరి 'కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదం బయియుండు' (సమా) నని సూత్రించి 'మడిసెడుదడములు' అనునది ధాతుజవిశేషణ పూర్వపదత్వమున కుదాహరించెను. ఘం. ఆస్థలమునఁ దచ్ఛబ్దలోపము నిక్కలాది సూత్రముచే నవు నని పేర్కొనలేదు. విభక్తివివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగును. అమహత్త్వమున మడిదెడునవి యైనదడములు = మడిసెడుదడములు కావలె నన్న 'అవి' యనుతచ్ఛబ్దము లోపింపఁజేయవలెను గదా.

సమాససందర్భమునందు ముందుగాఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తము కా దని చెప్పి సమర్థించుటయు నావ్యాఖ్యయందుఁ గానరాదు. ('ఆ'బృందము అనుదానివలె 'మడిసెడు' అనువిశేషణము, 'దడములు' అనుదానితో సమసించును.)

ఇంక నిట్టియెడలఁ దచ్ఛబ్దానుప్రయోగము సూరిసమ్మతమా, కాదా యన్నది పరిశీలింపవలయును.

సూరి 'ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టియనుపదంబు విభాష నను ప్రయుక్తం బగు' (బాల.సమా. 10) అని అట్టిఅనుప్రయోగమును జెప్పెను. వచ్చినట్టి రాముఁడు, వచ్చునట్టివాఁడు అనునవి లక్ష్యములుగాఁ జూపెను. ఇందు మొదటిది సమాసము. ఇట్టియెడ ధాతుజవిశేషణమునకుఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మయినచో వచ్చినవాఁడు రాముఁడు అని కావలయును. వచ్చినవాఁడు డుమంతము కదా. మఱి దీనికిఁ గర్మధారయము గుదురునా? బల్లిదుఁ డగుమల్లుఁడు అనుదానివంటి

యిట సమాస మెట్లు? కాని సూత్రమున ధాతుజవిశేషణములను బ్రత్యేకముగా జేర్చుటచే నీయవి డుమంతము లయినను గర్మధారయము కుదురు నని చెప్పు కొనవలెనా? అట్లే యంగీకరింతము.

ఎల్లయెడల ననుటచే సమాసమందును వ్యస్తతయందుఁ గూడ అట్టి యను ప్రయుక్త మవు నని లక్ష్యము స్పష్టము చేయుచున్నది. (వికాస. 280) ఘం. వ్యాఖ్యయు ఎల్లయెడల ననుటచే సమాసమునందును, వ్యస్తమందును అట్టి యనుప్రయుక్తము విభాష నగును. వచ్చినట్టిరాముఁడు సమాసము. వచ్చునట్టివాఁడు వ్యస్త (బాల. ఘం. 241.) మని స్పష్టము చేసెను. కానీ యట్టియెడల 'అట్టి' యనుదాని నెల్లయెడల ననుప్రయుక్తము చేయ నేల? వ్యస్తతయందుఁ జెప్పినచో వచ్చినయట్టివాఁడు రాముఁ డని యుండును. విభక్తి లోపింపఁగాఁ దచ్ఛబ్దము లోపింప వీలు లేదు. నిక్కలాది సూత్రముచేత లోపించు నని వ్యాఖ్య చేయఁబడినది. అట్టి యనునదియు లోపింపఁ జేసి సమాస మయినది కావున నెల్లయెడల ననుదానిచేత సమాసమునందును నవు నని చెప్పవలయునా? ఇది కేవలము క్లిష్టకల్పనము. పైఁగా సమాసమునందుఁ దచ్ఛబ్దము లోపించు ననియు నీవ్యాఖ్య పేర్కొనలేదు.

అసలు సమాసమునందును వ్యస్తతయందును రెండుచోట్ల నవు నని చెప్పుటకు నెల్లయెడల నని చెప్పవలయునా?

సూత్రాంధ్రమున 'జికా త్పరతః అట్టి ర్వా స్యా దుత్తరపదే' యని సమాసమునందే యొకచోఁ జెప్పియు 'జికా దట్టి ర్వానుప్రయుజ్యతే' యని వే ఱొకచో సామాన్యముగఁ జెప్పెను.

ఇ ట్లిన్నిసార్లు తచ్ఛబ్దానుప్రయోగమును జెప్పినవెంటనే సమాసము నుదాహరించుచు ననుప్రయుక్తముగాఁ దచ్ఛబ్దము లోపించుటం గూర్చి తలఁప కుండె నను టెట్లు? సూత్రాంధ్రమున 'నిత్యం తచ్ఛబ్ద స్సుపి' 'ఉత్తరపదే తస్య లోపః అని ప్రత్యేకముగా లోపమును విధించెను. బాల.లోఁ జెప్పలేదు. ఈతచ్ఛబ్దము విభక్తి వివక్షించునపుడు ధాతుజవిశేషణమున కనఁగాఁ బ్రాతిపదికమున కనుప్రయుక్తముగాఁ జెప్పఁబడుటచే నీయది ప్రాతిపదికావయవ మగునే కాని ప్రత్యయావయవము గాదు. ప్రత్యయత్వము లేదు కావున విభక్తిలోప మవునపుడు సమాసమునం దీతచ్ఛబ్దము లోపించునవకాశము లేదు. ప్రత్యయావయవముగాఁ

జెప్పుటయు సరి కాదు. ప్రాతిపదికావయవముగాఁ జెప్పినపు డీతచ్ఛబ్దమును బ్రాతిపదికమే (ధాతుజవిశేషణముతో) యవుటచేఁ బైనున్నప్రథమాదివిభక్తులతో వాఁడు, అది యిత్యాదిగా నాయయితచ్ఛబ్దరూపములు పొందుట యుక్తము. ప్రత్య యావయవముగాఁ జెప్పినచో వాఁడు అనురీతిరూపములు ప్రత్యయములుగా నేర్పడును. అది యసంగతము గదా.

అయిన నీకర్మధారయసమాసమునఁ దచ్ఛబ్దము లోపించుట నెట్లు సాధింపవలెను. అది బాలవ్యాకరమం దనుక్తము చేసె ననుట యుక్తమా.

సమాసమును జేయఁబోవుచో ధాతుజవిశేషణములకుఁ దచ్ఛబ్దానుప్రయోగము లే దని చెప్పుటయే సూరిమత మేమో యని తోఁచుచున్నది.

ఎల్లయెడల ననుప్రయుక్తము చేసినను 'ఉత్తరపదే తస్య లోపః' అని సమాసమున లోపము చెప్పినసూరి యాసూత్రాంధ్రమునందే 'జిక స్తచ్ఛబ్దో ఽనుత్తరపదే' యని యొకచోఁ బేర్కొనెను. 'అనుత్తరపదే' యనుటచే వ్యస్తతయందే యనఁగా విభక్త్యంతముగాఁ బ్రయోగింపఁదలఁచినపుడే తచ్ఛబ్ద మనుప్రయుక్త మవు ననఁగా సమాసము చేయఁబోవుచో ధాతుజవిశేషణమునకుఁ దచ్ఛబ్దానుప్రయోగము లే దని తాత్పర్యము.

బాల.లో సమాసమునఁ దచ్ఛబ్దమునకు లోపము చెప్పకపోవుటంబట్టియు నద్దాని నుదాహరించుటయే కాక, యెల్లయెడల నట్టి యనుప్రయుక్త మవుట చెప్పుటం బట్టియు సూత్రాంధ్రమునందుఁ బేర్కొన్న పైరీతి రెండభిప్రాయములలోను నీరెండవయభిప్రాయమునే (అనుత్తరపదే) ప్రమాణీకరించి యిట్లు చెప్పె నేమో యనిపించుచున్నది. కాఁగా విభక్తి వివక్షించునపు డనఁగా విభక్త్యంతముగాఁ బ్రయోగింపఁబడుట వివక్షించునపు డనఁగా వ్యస్తతయందే తచ్ఛబ్ద మనుప్రయుక్త మవు నని యర్థ మెన్నఁదగును. తరువాతిసూత్రమునం దెల్లయెడల ననుటంబట్టియు ని ట్లూహింపనవు.

అనఁగాఁ దరువాత నెల్లయెడల నట్టియనుప్రయోగ మవు నని చెప్పి, సమాసమును, (ముందు) వ్యస్తస్థితి నుదాహరించుటచే రెండుచోట్లను అట్టి యనుపద మవు ననియు గ్రహింపఁదగును. కాఁగాఁ బూర్వోక్త మగుతచ్ఛబ్దానుప్రయోగము మాత్ర మెల్లయెడలఁ గాదు. అనఁగా నచట నుదాహరించినప్రకారముగా

వ్యస్తతయందే యవును. అనియు నర్థము చెప్పుకొనఁదగును.

దీనివలన సమాసమున నిటఁ దచ్ఛబ్దలోపము చెప్పకుండుటయు, మడిసెడు దడములు, వచ్చినరాముఁ డనురీతిగా నుదాహరించుటయు నిక్కలాదిసూత్రము నాశ్రయింపకయే సముచితముగా సమన్వయింపఁబడుచున్నది.

అయిన నిట ధాతుజవిశేషణములు ప్రాతిపదికలు గదా. వీనికి సమాస మవుట యె ట్లననవచ్చును. 'త్రిక స్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదం బయి' యనుటచే ధాతుజవిశేషణపూర్వపదత్వము ప్రత్యేకముగాఁ జెప్పఁబడి యుండుటం జేసి ప్రాతిపదికమె యైనను సమాస మవుట శాస్త్రానుగుణమే యవును. ఆబ్బృందము ఇత్యాదులలోఁ ద్రికపూర్వపదత్వమున ఆ ఈ ఏ యనుసర్వనామములు ప్రాతిపదికములే కదా. ఆ+సు+బృంద+ము అనురీతిగా నగతిక మవుట సువిభక్తి నాశ్రయించి తల్లోపముతో నద్దానిపూర్వపదత్వమును జక్కగా గుర్తింపవచ్చును. వాఁడిమాట యనురీతిగానే స్త్రీసమపూర్వపదస్థలమునందు వాఁడి+సు + మాట+సు అనురీతిగానే కదా, చూపవలసియున్నది. కావున నీవిధానమునుబట్టి మడిసెడు+సు దడములు అనురీతిగా నుండుచో సామాసికవిభక్తిలోపముచేఁ బైరీతి రూపములు సిద్ధించును.

కాఁగా ధాతుజవిశేషణములకుఁ దచ్ఛబ్దానుప్రయోగ మవ్వానిని విభక్త్యంత ములుగా, వ్యస్తముగాఁ, బ్రయోగించునపుడే సంభవించు ననియు ధాతుజ విశేషణ ములును గర్మధారయాదిగా సమాస మవునపుడు తచ్ఛబ్దానుప్రయోగము లే దనియు నందువలననే తచ్ఛబ్దలోపమును గూర్చి ప్రత్యేకముగా సూరి బాల.లోఁ బ్రస్తావింపలే దనియు గ్రహింపఁదగును.

సూరి మతము ననుసరించి సమాసము తద్ధితవృత్తి కుపలక్షక మవుటచేతనే యిటను దచ్ఛబ్దానుప్రయోగము లే దని భావింపనవును. కావునఁ దచ్ఛబ్దలోపమును తనప్రత్యయపరకత్వమున విధింపవలసినయవసరము లే దని గుర్తింపనవును.

సర్వ. 'ఇట ధాతుజవిశేషణములపై విశేష్యములు చేరుటవలన నేర్పడినట్లే తనము అన్నది చేరినపుడును కర్మధారయసమాస మేర్పడవచ్చును. కావున ధాతుజ విశేషణమునకు తచ్ఛబ్దమును జేర్చుటయు, దానిని లోపింపఁజేయుటయు, ప్రక్రియా భారమునకు పాల్పడుటయే. తనము అనఁగా ప్రకారము. ఆఁకొన్నప్రకారము

ఆకొన్నలక్షణము అని యున్నట్లుగా ననుకొన్నను ఇచ్చట ఇబ్బంది కలుగ (283 పుట) దన్నది.

కానీ యీప్రతిపాదనము సరి గాదు. విశేష్యములు చేరుటవలన సమాస మైనట్లు తనము చేరుటచేఁ గర్మధారయ మేర్పడుట యన్నది యసంగతము. సమర్థంబు లగుపదంబు లేకపదం బగుట యేది? ఆఁకొన్న యనుదానికి తనము అను ప్రత్యయముతో సమాస మెట్లు? ఇట తనము అని చూపుటయే సరి గాదు. ఆఁ కొన్న=తన అని కాఁగా నాతద్ధితాంతమునకుఁ బ్రాతిపదిక సంజ్ఞ యై, పిదపఁ బ్రథమైకవచనమున ముపర్ణకము వచ్చి, 'ఆఁకొన్నతనము' అని యవును. కాని 'తన' విడిగాఁ బ్రయోగించునపుడు ప్రత్యయముపై ముపర్ణకము రాదు.

ఇది కర్మధారయ మనుటయు విలక్షణమే. కర్మధారయములందుఁ బూర్వపదము ప్రథమాంతము కాఁగాఁ దనప్రత్యయము షష్ఠ్యంతముపై నవుచున్నది. (షష్ఠీ తత్పురుష మందు రేమో?)

ఇట్టి ఆఁకొన్నతన మనురీతివి సమాసములే యనుచోఁ బెక్కుఇబ్బందులు గలవు. 'ఆఁకొన్నతన' మనుదానివలెనే 'నల్లతన' మనునదియు సమాసమే యవును. అపుడు గుణవచనంబు లగునల్లాదులకుం గర్మధారయంబునం దగునిగాగమ మిటఁ గూడ వచ్చి, 'నల్లనితనము' అని కావలయును.

ఇవి సమాసము లనుచో సంధి.36 సూత్రము కొంత వ్యర్థ మవును. ఆ సూత్రమున సూరి ఉదంతస్త్రీసమములకును, బుంపులకును, నదంతగుణ వాచకములకును దనము పర మగునపుడు నుగాగమము చెప్పెను. ఇవియు సమాసములే యవుచోఁ దనప్రత్యయాది'త'కారము పరుషము పర మవునపుడు సంధి. 25 సూత్రముచేతనే నుగాగమ మవును. అదంతగుణవాచకములకు మాత్రమే యా25 సూత్రముచే నుగాగమము రాదు. కావున వానికి మాత్రము ప్రత్యేకముగా జెప్పినఁ జాలును. అందుకే యీవ్యాఖ్య కేవలనుగాగమప్రాప్తియే యుద్దిష్ట మైన యెడల సూరిపద్ధతి దోషజుష్ట మనక తప్పదు. (128) అని సాహసించి పేర్కొన వలసివచ్చినది. దాని కట నీవ్యాఖ్య చూపినప్రయోజనము సరి గాదు. అది గ్రంథాంతరమున నిరూపింపఁబడును. సమాసము తద్ధితవృత్తికి నుపలక్షణ మన్నను నిట్టియిబ్బంది యేర్పడును. కానీ యాసూత్రప్రయోజనము వేఱు. ఇట నప్రస్తుతము.

ఏది యే మైనను దద్ధితవృత్తిని సమాసముగానే పరిగణించుట మాత్ర ముచితము గాదు.

ధాతుజవిశేషణములపైఁ దచ్ఛబ్దమును జేర్చుటయు లోపింపఁజేయుటయుఁ బ్రక్రియాభార మను టుచితమే. కానీ య ట్లని సంప్రదాయవిరోధము తెచ్చిపెట్టు కొను టెట్లు కుదురును? స్త్రీసమములకు సుప్రత్యయము చేసి లోపింపఁజేయు టేల? కావున నవసర మైనప్రక్రియానిర్వహణము భారము కాదు. అనవసరముగాఁ జెప్పినస్థలములో మాత్రమే యిట్టి విచారము. క్రియాపదములసాధనమునం దొక్కొక్కచోఁ బెక్కు విధానములు వర్తింపఁజేయవలసివచ్చుట యిట్టిదే కదా.

ఆఁకొన్నప్రకారము ఆఁకొన్నలక్షణ మనురీతిగా ఆఁకొన్నతన మని యవు ననుటయు సరి కాదు. రామునిప్రకారము = రామునిలక్షణము = రామునితనము అని యట మాత్ర మి ట్లేల సమన్వయింపరాదు. రామునియొక్క+తనము (ఇట ముందుగా ముపర్ణకము చూపుట సరి కాదు) (281) అని యొక్కలోపము నీవ్యాఖ్య యేల చేసినది.

నిడుపుఁదనము, మేలుతనము మొద లయినవానియెడల సైతము నిడు పైన దానితనము మే లయినదానితనము మొద లగువిధముగాఁ జెప్పుకొనవలసివచ్చు నేని మఱింత యసంగతముగా కనిపించును (283). అం దసంగతి కలదో లేదో తరువాతిసంగతి. కానీ సూత్రకర్త మాత్ర మిట ధాతుజవిశేషణములపైని మాత్రమే తచ్ఛబ్దలోపము చెప్పుటంజేసి నిడు పయినదానితన మనురీతిగాఁ జూపినచో నటఁ దచ్ఛబ్ద మీసూత్రముచే లోపించుటకే వీలు లేదు. కావున నిడుపుఁదన మని కానేకాదు.

తత్త్వ. ధాతుజవిశేషణములకే కాక యితరవిశేషణములకును బైని తచ్ఛబ్దము తెలుఁగునఁ జేరు ననియు గొప్పవానియొక్క తనము గొప్పతనము అని యవు ననియు (322) పేర్కొన్నది. దానిని విమర్శించుటకై సర్వ. పేర్కొన్న దన్నను నుచితము గాదు. నిడుపుఁదన మని యగు టెట్లు?

తత్త్వ. ఇతరవిశేషణముల కని సామాన్యముగాఁ జెప్పుటయు నట్టిచోట్లను దచ్ఛబ్దమునకు లోపము వచ్చు ననియుఁ జెప్పుట విశేషము. ఇట్టిలోపమును బ్రస్తుతసూత్రము పేర్కొనుట లేదు. బాలవ్యాకరణము ధాతుజవిశేషణములపై మాత్రమే విభక్తివివక్షలోఁ దచ్ఛబానుప్రయోగమును జెప్పినది. ప్రౌఢవ్యాకరణమును

నితరవిశేణములకుఁ దచ్ఛబ్దానుప్రయోగమును జెప్పలేదు. పైఁగాఁ దెలుఁగున విశేషణంబులు సాధారణంబుగ నవిభక్తికంబు (సమా. 9) లని పేర్కొనెను. కావుననే ధాతుజవిశేషణములపయి మాత్రమే ప్రస్తుతసూత్రము సయితము తచ్ఛబ్దలోపమును విధించుచున్నది.

వఝలవారు బా. సమా. 25 సూత్రముచేత లోపించు ననియు నాసూత్రములోని సమాసశబ్దము తద్ధితవృత్తికి నుపలక్షణ మనియు లేదా సమాసము మున్నగు వాని విభక్తికి = విభక్త్యాదులకు అని యిచట వ్యాఖ్య చేయవలయు ననియు సూరి యాశయ (వ్యా. సం. స. 1265) మని పేర్కొని, త్రిలింగలక్షణశేషకర్త యారీతి గ్రహింపక ప్రస్తుతసూత్రము చెప్పె నని ప్రౌఢవ్యాకర్తను దిరస్కరించిరి.

కానీ సమాస మనఁగా సమాసము మున్నగువానికి ననియు విభక్తికి ననఁగా విభక్త్యాదులకు ననియు నర్థము నెట్లు చెప్పుదురు? సూరియాశయ మింత గంభీరముగా నుండఁగాఁ ద్రిలింగలక్షణశేషకర్తయే కాదు వఝలవారు తప్ప మఱి యెవ రైనను గ్రహించుట యసాధ్యమే.

'లేదా' యనుటచే సమాసశబ్దము తద్ధితవృత్తికి నుపలక్షణముగా గ్రహింపకయే పైరీతిగా నర్థము సిద్ధించినట్లు చెప్పుట యింకను నుచితము గాకున్నది.

సమాసమున విభక్తి మాత్రమే లోపించుచుండ నాదిశబ్దముచే (ఇది సూరి సూత్రమందు లేదు. వఝలవారి వ్యాఖ్యానమందలిది) గ్రహింపఁబడుతద్ధితవృత్తిలో విభక్త్యాదులు లోపించు టేమి? సమాసమునందు మడిసెడుదడము లనుచోఁ దచ్ఛబ్దలోపము గల దని సంజీవనీవ్యాఖ్య పేర్కొనలేదు.

కానీ యీరీతియర్థము సూరిసూత్రమునకుఁ జెప్పుట కేవలము నిరాధారము.

సంజీవనీవ్యాఖ్య గొప్పదానితనము=గొప్పతనము, నల్లదానితనము=నల్లఁ దనము అని యవు నని (వ్యా. సం. స. 1265) పేర్కొన్నది. వానిగొప్పతన మనుచో వానిగొప్పదానితన మనురీతిగా నన్వయించుట యొప్పునా? తచ్ఛబ్ద మనుప్రయుక్త మవుచో నల్లయది, నల్లవాఁడు అని ప్రథమైకవచనమునం దవును. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు, నల్లనిది (శ. ర.) ఇత్యాదులలో నిగామ మెట్లు? విభక్తి వివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మైన దనురీతిగా సమన్వయించునపుడు వీనిని వ్యస్తము లనవలయునే కాని సమాసము లనరాదు గదా. నల్లనివాఁడు, నల్లనిది

యనుచో నయ్యవి సమాసము లనక తప్పదు. వృత్తియం దత్తు (అదియవిశబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు) లోపించుటచేతనే గదా, నల్లనిది యని యవును. నల్లనితన మనురీతిగా రూపము లుండవచ్చునా?

చిన్నదానియొక్క భావము = చిన్నటికము అనురీతిగా (వ్యా.సం.స. 1266) చూపుటచే టిక ప్రత్యయపరకతయందును దచ్ఛబ్దలోప మవును. నవర్ణకస్థితియం దిట్టిదానిని సంజీవనీవ్యాఖ్య చూపలేదు.

దీని ననుసరించియే కాఁబోలు తత్త్వ. "ఈసూత్రమునఁ దనవర్ణకము టికాదులకు నుపలక్షక మని భావింపవలయును. చిన్నవానియొక్క టికము చిన్నటికము" (322) స్పష్టతకయి, చిన్నవానియొక్క + టికము అని చూపియుందురు. అది సంప్రదాయ బద్ధము గాదు.

ఇట్లే ధాతుజవిశేషణము లితరవిశేషణములకు నుపలక్షక మనలేదు.

సూత్రమందలి 'తనము' ఇతరముల కుపలక్షక మైనచో నిం కొకయిబ్బంది యున్నది. ప్రస్తుతసూత్రమునఁ దనపరకత్వమునఁ దచ్ఛబ్దార్థమునకు లోపము విభాషగాఁ జెప్పఁబడినది. కావున దానిచే గ్రహింపఁబడు టికప్రత్యయము పర మగునపుడు సయితము లోపము విభాషగానే వచ్చును. చిన్నవానియొక్క + టిక చిన్నటికము అని యవును. విభాష యవుటచే లోపము రానిపక్షమున ఆఁకొన్న వానితనము అని సూత్రకర్త యుదాహరించినట్లుగాఁ జిన్నవానిటికము అనురూపము కాక తప్పదు. అట్లే పేదవానియొక్క టిక = పేదటికము, పేదవానిటికము అనురీతిగా గావలెను. ఇంక టికాదులు పర మైనపుడు లోపము నిత్య మని సూత్రమునందలి విభాషాపదమునకు వ్యవస్థ చేయవలె. లేనిచో నల్లదానియొక్క భావము=నల్లన, నల్లదానిన, పుల్లదానియొక్క భావము= పుల్లన, పుల్లదానిన యనురీతిగా నేర్పడవలె. తత్త్వ. పైరీతి వ్యవస్థను సూచించియుండమింజేసి పైయపరూపము లీవ్యాఖ్యమతమున సిద్ధింపక తప్పదు.

సంజీవనీవ్యాఖ్య సయితము ప్రౌఢవ్యాకర్తృలక్షణముచే ధాతుజవిశేషణములు కానివానిపై నీలోపమును స్పష్టము చేయలే దని పేర్కొన్నదే కాని విభాష యనుటం గూర్చి పేర్కొనదాయెను. అట్టియెడల సంజీవనీవ్యాఖ్యాపక్షముననుఁ బైరీతి యపరూపములప్రస్తావనకు నవకాశము లేకపోలేదు.

నల్లదానితనము, పుల్లదానితన మనురీతిగాఁ దనప్రత్యయపరకత్వమునం దైనను దచ్ఛబ్దము నిలిచియున్నప్రయోగము కలదా. అట్టియెడలఁ దనప్రత్యయ పరకత యందు వీనికి లోపము నిత్య మని స్పష్టము చేసియుండవలసినది.

నల్లదానియొక్క తన, చిన్నదానియొక్క ఱిక యనుచోఁ దచ్ఛబ్దము లోపింపఁ జేయుట సూరియాశయమా యన్నది ప్రస్తావింపవలసియున్నది.

'చిన్నాదులకు ఱికవర్ణకం బగు' నన్నసూరి చిన్న, కన్నె, చుట్టము ఇత్యాదిగాఁ జిన్నాదులు నిరూపించెను. చుట్టము ప్రథమైకవచనాంతము కదా. ఇట నాయాగణము లందలిపదములను నిర్దేశించునపుడు సూరి ప్రథమాంతములనే చూపుట గమనింప వచ్చును. ప్రాతిపదికలను జూపుట యుక్తమును గాదు. కాఁగా నిట చిన్న యను దానిని సయితము సూరి ప్రథమాంతముగానే చూపె నని స్పష్టము. కావునఁ జిన్నయొక్క భావ మనురీతిగాఁ జెప్పుటయే సూరిమతము. సమాసవిభక్తి కనఁగా విభక్త్యాదులకు ననియు నిటఁ దచ్ఛబ్దము లోపించు ననియు సూరియాశయ మయియున్నచోఁ జిన్నది అనియే చూపవలసియుండును. కాని 'చిన్న' యని కాదు. చిన్నాదు లగువిశేషణములకును విభక్తివివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మవు ననియు నాతచ్ఛబ్ద మిట లోపించు ననియు సూరియాశయ మగుచో నిటఁ జూపిన చిన్న యనునది ప్రాతిపదిక మనవలయును. ఇట్లు ప్రాతిపదికము చూపు టెచ్చటనే నీపరిచ్ఛేదమునం దున్నదా? ఇటనే చుట్టము అనుదానిని బ్రథమైకవచనాంతముగాఁ జూపినవాఁడు చిన్న యనునది మాత్రమే యేల ప్రాతిపదిక నిచ్చెను? ఇట్లే నల్లాదిసూత్రమునొద్ద సయితము నల్ల, తెల్ల ఇత్యాదిగాఁ గాక నల్లది, తెల్లది ఇత్యాదిగాను జూపవలెను. నల్ల తెల్ల ఇత్యాదిగాఁ బ్రాతిపదికములనే ప్రదర్శించె ననుట యసమంజసము.

కావున వఝలవారు సూరియాశయముగాఁ దచ్ఛబ్దలోపము గల్గుటను వర్ణించుట యథార్థము గా దని స్పష్టము.

ఇట్లె యిం కొకచో నిబ్బంది యున్నది. పెద్దసోదరుఁడు, చిన్నరాముఁడు, నల్లనికృష్ణుఁడు ఇత్యాదికర్మధారయసమాసము లె ట్లేర్పడును.

ఇటఁ బెద్దవాఁ డైన సోదరుఁడు, చిన్నవాఁడు+రాముఁడు అనురీతిగాఁ జూపవలెను. అపుడు పెద్దవాఁడు, చిన్నవాఁడు అనుడుమంతములను 'స్త్రీసమముగంత

ధాతుజవిశేషణపూర్వపదం బయియుండు' ననుచో పెద్దవాఁ డిత్యాదులు త్రికము గాని, ముగంతము గానీ, ధాతుజవిశేషణము గానీ గావు. పైరీతి ప్రక్రియ ననుసరించి యిది స్త్రీసమ మనుటకును వీలు లేదు. అట్టియెడల నల్లనికృష్ణుఁడు ఇత్యాదిగా సమాసము లసాధువు లనియే సూరిమతమును నిర్ణయింపవలెనా? అటఁ జిన్న యైనరాముఁడు, నల్ల యైనకృష్ణుఁడు అనురీతిగా విగ్రహము చెప్పనిది సమాసము కుదురదు. అపు డివి స్త్రీసమములుగాఁ గర్మధారయమునఁ బూర్వపదము లగుట సూరిలక్షణము ననుసరించి సిద్ధమవును.

కావునఁ దచ్ఛబ్దలోపము సూరియాశయముగాఁ జెప్పుట సమంజసము కాదు.

తత్త్వ. ఇట్టిశబ్దములు నల్ల, తెల్ల ఇత్యాదులు ధర్మవాచకము లగునపు డొక్కొక్క యెడఁ దచ్ఛబానుప్రయోగము లేకుండినను ధర్మి ('ర్మ' అచ్చుపొరపాటు) వాచకములుగా నున్నపుడు మాత్రము సాధారణముగాఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగుచునే యుండు'. (322) నన్నది. నల్ల=నలుపు ఇది ధర్మము. నల్లవాఁడు నల్లది, నలు పనుధర్మము గలవాఁడు, కలది. ఇది ధర్మి. ఇట్లు ధర్మిని బోధించునపుడే పైని దచ్ఛబ్దము గానవచ్చును.

కావున ధర్మవాచక మైనపుడు ఒక్కొక్కయెడఁ దచ్ఛబ్దానుప్రయోగము లేకుండినను అనఁగా నేమి? ఇవి ధర్మవాచకము లయినపుడు సయితము పెక్కెడల వీనిపైఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మవు ననియా? అట్టిచో నల్లవాఁడు, నల్లది యను తచ్ఛాబ్దాంత ములును నలుపు అనురీతిగా ధర్మమును సయితము బోధింపవలయును. కాని యట్టిస్థితి కానరాదు. కాఁగా ధర్మవాచకము లైనపు డెప్పుడును నీయవి తచ్ఛబ్దాంతము కా వని నిర్ణయింపవలయును.

ఇంక ధర్మవాచకములుగా నున్నపుడు మాత్రము సాధారణముగాఁ దచ్ఛబ్దము చేరుచుండు నన్నది. అనఁగా నసాధారణముగా నైనను దచ్ఛబ్దాంతములు గాకయు నియ్యవి ధర్మివాచకము లగుట యంగీకరింపఁబడిన ట్లయినది. కావునఁ దచ్ఛబ్దమును నియతముగాఁ జేయ నక్కఱ లేదు.

నల్ల విణ. నల్లనిది. తురగోత్తమువాలంబు నల్ల సేసితి (సూ.ని.) (శ.ర.) అనఁగా నల్ల యనునది నల్లనిది యనురీతిగా ధర్మివాచక మైనది. నలుపు. ఒకతె దెలు పోర్తు నలుపు. సూ.ని. ఇట నలు పనఁగా, నల్లనిది, తెలు పనఁగాఁ దెల్లనిది.

కావున నలుపుతెలుపులు గూడ ధర్మివాచకము లైనవి. తెల్ల. తెలుపు, తెల్లనిది (సూ.ని) పచ్చ పసుపువన్నె, పసుపు వన్నెగలది (శ.ర.) తియ్య. తీపిగలది (సూ.ని.) ధర్మి. ఎఱ్ఱ – ఎఱుపు, ఎఱ్ఱ నైనది (శ.ర.) కమ్మ. మధురము, వాసనగలది (కమ్మ, మాధుర్యము) శ.ర. ధర్మివాచకము మాత్రమే. ఇందుఁ గొన్నింటిని గేవలధర్మ వాచకములుగా వ్యా.సం.స. సమన్వయించుట సహజముగా లేదు (1275).

ఇట్లు నల్లాదులు ధర్మధర్మివాచకము లవుటను శ.ర. గుర్తించుటచేతనే వీనిపైఁ దచ్ఛబ్దము విభక్తి వివక్షయం దవు నని కాని, యద్దానికి నిట లోపము వచ్చు నని కాని చెప్పలేదు.

త్వ ప్రత్యయమువలెనే యీతనప్రత్యయము సైతము ధర్మివాచకములపైనే నిలుచును. కాన బంటుతనము = భటత్వము కలవాఁడు. బంటు అని యర్థము ఇ ట్లగుటచే నీభావార్థకప్రత్యయములు పోఁడిమి, వాఁడిమి మున్నగుధర్మవాచకముల పయి నిలువనేరవు. (1262) అని వ్యా.సం.స. స్పష్టము చేసినది.

ఒమ్మ శబ్దము ధర్మవాచి యవుటతోపాటు ధర్మి యవుటను సంజీవని నిరూపించినది. 'ఇట్లే మేలు = శుభము, శుభ మైనది. ఇ ట్లిది యర్థవిశేషములలో ధర్మవాచకమును ధర్మివాచకము నయి యున్నది. పోఁడి = ఒప్పిద మైనది. (ఒప్పు అనుధర్మవాచిత్వమును గలదు) ఇట్లె వాఁడి శబ్దమునకును వ్యా.సం.స. (1268) పేర్కొన్నది.

అదే విధముగా బైని నల్లాదులవిషయమునను గ్రహింపవచ్చును. చిన్న చిన్నం గనుగొంటి, మొన్నటిచిన్నకు (సూ.ని.) ఇట్లు చిన్న యనునదే చిన్నది, చిన్నవాఁ డనురీతిగా ధర్మివాచక మవుట గలదు. అట్టియెడ చిన్నయొక్కభావ మనురీతి నూహించుట యుచిత మనవలె. వఝలవారు చూపినదానిలో వాఁడియొక్క భావ మనురీతి వ్యవహార మేది?

కావున నదే విధముగఁ జిన్నాదులకును, నల్లాదులకును భావార్థకప్రత్యయము లవుటలోఁ దచ్ఛబ్దప్రయోగప్రసక్తి తే నక్కఱ లేదు. నాకంటె వాఁడు పెద్ద, వానికంటె నేను జిన్న. కడు నెఱ్ఱ లయ్యె దిశలు. (శ.ర.) అనురీతిగా నీయవి ధర్మవాచకములు గను నుండుటచేఁ దచ్ఛబ్దానుప్రయోగము చేయవలసినయవసరమును లేదు. కావున ఒమ్మ ఇత్యాదులపైవలె నీచిన్న, నల్లాదులకును దచ్ఛబ్దాంతములు గాక భావార్థక ప్రత్యయము లవుటలో నెట్టియిబ్బందియును లేదు.

సంజీవనీవ్యాఖ్య తన ప్రత్యయము ధర్మివాచకముపై మాత్రమే వచ్చు ననుచో నిట్లు చెప్పినది.

పెద్దతనము, చిన్నతనము మున్నగుచోటులందు పెద్ద, చిన్న మున్నగుధర్మి వాచకములు స్త్రీసమవిశేషణములు, గాన వానిపయి షష్ఠీవిభక్తి నిలువనేరదు. కాన తద్ధితవృత్తివిగ్రహరచనకై వానికి విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దముతో నవి సమసించును గాన నట్టిరూపముతో విగ్రహరచనము చేయవలయు ననియుఁ దద్ధితప్రత్యయములు నిలుచునపు డావిభక్తితోఁ దచ్ఛబ్దము సైతము లోపించి ప్రాతిపదికమె నిల్చు ననియు నెఱుంగనగును. పెద్దదానియొక్క+తనము=పెద్దతనము (వ్యా.సం.స. 1263).

పెద్ద చిన్న మున్నగునవి ధర్మివాచకము లగుస్త్రీసమవిశేషణములు (ఇవి యసలు ధర్మవాచకములే గావు) గావున వీనిపయి షష్ఠీవిభక్తి నిలువనేరదు. అనఁగా నేమి? వచ్చి లోపించునా? లేక యసలు రాదా? పోనీ యిట షష్ఠి యసలు రా దనియో లేక వచ్చి లోపించు ననియో, యంగీకరించిన నితరవిభక్తులు నిలువవచ్చు నని యర్థ మవును. మిగిలినయన్నివిభక్తులు నిలుచుచుండఁగా షష్ఠి మాత్రమే నిలువ నేర దను టేమి? ఇట షష్ఠి యొక్క ప్రత్యయమే యగునా? అయినచో షష్ఠి నిలువనేరదు గావునఁ దచ్ఛబ్దమును జేర్పవలసినయవసరము లేదు. ఏల యనఁ బ్రౌఢ.'యొక్కకు లోపంబు బహుళం' బని చెప్పి ధాతుజవిశేషణభావార్థపూర్వవ్యవహితావ్యవహితకర్తృ పదప్రథమకు వచ్చినయొక్కషష్ఠి నిత్యముగా లోపించు ననుటను దిరస్కరించుచు ఇట్లు వ్రాయుటకు మ ఱెచ్చట యొక్క లోపము కల్గదో తెలియకున్నది ( వ్యా.సం.స. 1032) యనిరే. ఎచ్చట నైనను యొక్క లోపించుచో నిక్కడ నిలువనేర దనుచింత యేమి? దానికై తచ్ఛబ్దమును జేర్పవలసినయవసర మేమి?

షష్ఠీవిభక్తి నిలువనేరకపోవుటకుఁ గారణ మేమి? స్త్రీసమవిశేషణములు గాన ననుటచే స్త్రీసమవిశేషణము లవుటచే షష్ఠి నిలువదా? అనఁగా స్త్రీసమవిశేషణము లయినచో నితరవిభక్తులు నిలుచును గాని షష్ఠి మాత్రమే నిలువదా? స్త్రీసమము గావున నిలువ దనుట యావ్యాఖ్య యభిప్రాయ మనలేము. అన్నాదు లగుశబ్దము లెల్ల స్త్రీసమములే. అవి విభక్త్యంతములు కాకపోవుట లేదు గదా.

ఇంక నీయది స్త్రీసమ మైనవిశేషణము గాఁబట్టి విభక్తులు నిలువ వనవలె.

ఒమ్మొయొక్క భావము=ఒమ్మిక. అనుచో నీవ్యాఖ్య చూపిన ఒమ్మొ స్త్రీసమ మయిన విశేషణము గాదా? షష్ఠి నిలిచిన దేమి? అదియు ధర్మియే గదా. స్త్రీసమవిశేషణము లన్నింటికిఁ గాదు. పెద్ద మున్నగుకొన్నింటికే విభక్తి నిలువ దనుతాత్పర్య మీ వ్యాఖ్యానపంక్తి యీయఁజాలదు.

ఇతరవిభక్తులు నిలుచును గాని షష్ఠి నిలువనేర దనునభిప్రాయము వ్యాఖ్యాతకు లే దనియును విభక్తులే నిలువ వని తాత్పర్య మనియు నిటఁ బ్రసక్తము షష్ఠీవిభక్తి యవుటచే నది నిలువనేర దని చెప్పె ననియు నాలోచింతము. అయిన స్త్రీసమ విశేషణములపైనే విభక్తులు నిలువవా? ఏవిభక్తులును నిలువనపుడు దానిని స్త్రీ సమ మను టెట్లు? స్త్రీసమత్వాతిదేశము కలవానికిఁ బ్రథమైకవచనలోపాదికము ఫలము. (బాల.ఆచ్ఛి.20) అనఁగాఁ బ్రథమైకవచనేతరములు నిలుచును. అవి యేవియు నిలువనపు డవ్యయ మన్న సరిపోవునే. మొత్తముపై స్త్రీసమవిశేషణము గాన ననుకారణము యుక్తము గాదు.

తద్ధితవృత్తిరచనకై వానికి విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దముతో నవి సమసించు నని యీవ్యాఖ్య పేర్కొన్నది.

అనఁగా నేమి? తద్ధితవృత్తివిగ్రహమునకుఁ గాక విశేష్యానుసారముగా వ్యస్తముగాఁ బ్రయోగించుచో విభక్తి వివక్షింపనే రాదా? విభక్తి వివక్షించినను దచ్ఛబ్దము రాదా? నల్లవాఁడు రాముఁడు అనురీతిగాఁ బ్రయోగింపరాదా?

అట్టియపుడు తద్ధితవృత్తివిగ్రహరచనకే యన నేల? విభక్తివివక్షలో నని సామాన్యముగా నిర్దేశించుట యుక్తమును బ్రయోజనవంతము నయియుండును.

అది య ట్లుండఁగా విభక్తివివక్షలో నవి తచ్ఛబ్దముతో సమసించు ననుట యసంగతము. విభక్తి వివక్షించునపు డనుటచేత నింకను నయ్యది విభక్త్యంతము గాలేదు. ప్రాతిపదికమే యన్నమాట. ఈప్రాతిపదికమునకుఁ దచ్ఛబ్దముతో సమాస మెట్లు? పెద్ద+వాఁడు అనురీతిగా విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దము ననుప్రయుక్తము చేసినపు డది యెల్ల వ్యస్త మగుపదమే యవును గాని సమాసము గాదు. వచ్చునట్టివాఁ డు వ్యస్తముగా సూరి నిరూపించుట గమనించితిమి. రామునియొక్క+అది = రామునిది. తెల్ల+అది = తెల్లది మొ. కర్మధారయాభాసము లని (వ్యా.సం.స.1271) యీవ్యాఖ్యాత పేర్కొనె నది యసంగతము. (బా.సూ.)

ప్రాతిపదిక లైనను విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దముతో సమసించు ననునపు డివి విశేష్యముతో నట్లే సమసించి కర్మధారయము లగు నని చెప్పరాదా? పెద్ద యనునది వాఁడు అనుతచ్ఛబ్దముతో సమసించినట్లే రాముఁ డనురీతివిశేష్యములతో సమసించి పెద్దరాముఁ డనురీతి నవు నని చెప్పవచ్చునే కదా.

పెద్ద చిన్న యనుప్రాతిపదికలకుఁ దచ్ఛబ్దముతో సమాసమే కుదురుచోఁ దద్ధిత వృత్తియందు మాత్ర మట్లే యేల చేయరాదు. కర్మధారయమునఁ బ్రథమాంత మైనఁ జాలును. చిన్న గొప్ప మొద లగుప్రథమాంతములు గలవు. కావున నట్లు సమాసము చేయఁదగు నని యీవ్యాఖ్య పేర్కొనలేదు. ప్రథమయందును జిన్న వాఁడు అని యేల? ఇట్లు వ్యాఖ్యాసమన్వయ ముచితముగా లేదు.

ధర్మివాచకములు స్త్రీసమవిశేషణము లనుటలో నీవ్యాఖ్యాతయభిప్రాయము గమనింపవలెను. విశేషణము లనఁగా ధర్మివాచకములు. విశేష్యతకె యనఁగా ధర్మవాచకత్వమునకె. విశేష్యములె యనగా ధర్మవాచకములె. ధర్మివాచకము లనఁ గా విశేషణములు (వ్యా.సం.స.1271) అని ధర్మివాచక మయినచో విశేషణ మనియు ధర్మవాచక మయినచో విశేష్య మనియు నీవ్యాఖ్యాత పేర్కొనెను. కానీ యట్లు నిర్ణయించుటకు వలనుపడదు.

చిన్నతనంపుఁజేష్టలు మున్నగుచోట్ల భావార్థకప్రత్యయాంతము లైనయీయవి ధర్మవాచకములే. కాని విశేషణములు. విశేష్యములు గావు. కన్నె, లంజె, దొంగ ఇత్యాదులు విశేష్యములు. ఇవి ధర్మివాచకములె కాని ధర్మవాచకములు గావు.

కావున నీసమన్వయమందలిలోపముల ననుసరించి యిది యాధారముగా నల్లాదులకుఁ దచ్ఛబ్దానుప్రయోగము చేయవలె ననియుఁ జేసిననే కాని తద్ధిత ప్రత్యయములు చేరుటకు వీలుగా విగ్రహరచన కుదుర దనియుఁ జెప్ప నక్కఱ లేకపోవుచున్నది.

కాని వీఁడు నల్లవాఁడు, ఇది నల్లది అని తచ్ఛబ్దాంతముగనే కానవచ్చును, గాని వీఁడు నల్ల, ఇది నల్ల యనురీతిగా వ్యవహారమునందును గానరాదు. అయినను గొన్నియెడల నీయవి ధర్మివాచకము లవుట గాననవుచున్నది. కావున దానిపైనే భావార్థకాదిప్రత్యయములు, దానికే సమాసములును నిర్వహించుట యనుసూరి మతము ననుసరించుటయే యుక్తము.

ఒకే శబ్దము ధర్మవాచకమును ధర్మివాచకము నవుట సయితము వ్యా.సం.స. నుండియే గ్రహించియున్నారము. రమణకెక్కు అనుదాని వివరించుసందర్భమున నహోబలడును నీవిషయమును (కవిశి. 467) స్పష్టము చేసియున్నాఁడు.

నల్ల మొద లగునవి ధర్మివాచకములుగానే కాక, ధర్మవాచకములుగాఁ గూడ వ్యస్తముగాఁ గానరావు. ఈరంగు నలుపు, తెలుపు, నల్లన, తెల్లన ఇత్యాదిగనే ప్రసిద్ధము.

ధర్మవాచక మైనను, ధర్మివాచక మయినను దచ్ఛబ్ద మనుప్రయుక్త మగు నన్న నల్లవాఁడు, నల్లది యనునవి సయితము ధర్మవాచకములు గావలసివచ్చును. ధర్మివాచకము లవునపుడును నల్లవాఁడు, నల్లది యనువానితోపాటు సామాసిక మైననిగాగమము గల నల్లనివాఁడు, నల్లనిది యనురీతిగాఁ గూడ రూపము లున్నవి.

సూరి సూత్రాంధ్రమున 'త్రిక ధికటిష్మగాధిభ్యః' అని ధికశబ్దముచే నీయదంత గుణవాచకములకును దచ్ఛబ్దానుప్రయోగమును జెప్పెను. ధికస్య నిక్ – ధికస్య నిక్ స్యాత్ సమానాధికరణే ఉత్తరపదే. చల్లనివాఁడు. దీనిపైనే కాక అల్లువాఁడు, తమ్మువాఁడు, మగవాఁడు అనురీతిగా నితరములపైఁ గూడఁ దచ్ఛబ్దమును జెప్పెను.

అయినను బాల.లో ధాతుజవిశేషణములకు మాత్రమే (జికశబ్దముచే సూత్రాంధ్రమునఁ జెప్పెను.) చెప్పుటనుబట్టి నల్లాదులపై విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగమును బరిహరించుట జరిగినది. నల్లనివాఁ డనురీతి రూపము లుండుటయుఁ గారణము కావచ్చును.

అందలిసూత్రములు కొన్నియే తెనిఁగించెను గావున నిది విడువఁబడిన దైనను గ్రాహ్య మనరాదా? యనవచ్చును.

త్రిక స్త్రీసమ ముగంత అనుసూత్రముచే స్త్రీసమశబ్దముచే నీయవి గ్రహింపఁ బడుట యెట్లు? నల్లవాఁడు+ రాముఁడు = నల్లనిరాముఁ డని యేర్పడు ననియే తలఁచిన నీకర్మధారయమునఁ బూర్వపద మగు 'నల్లవాఁడు' డుమంతము గదా. ఈసమాసము లక్షణవిరుద్ధమే.

కావున నది విశేషలక్షణముగా గ్రహించుట సూరియభిమత మనుటకు వీలు లే దనక తప్పదు. కానీ సూరి యొకచో రెండవవాఁడు, మూఁడవది యనురీతిగా

నుదాహరించెను. అటఁ దచ్ఛబ్ద మెట్లు? అవి సమాసములే యనవలయునా? వచ్చినవాఁడు అనుచోటువంటిదే మూఁడవవాఁడు అనునది సయితము.

దీనిం గూర్చి ప్రౌఢవ్యాకర్తయు నొకచో నిట్లు చెప్పెను.

తెనుఁగున సాధారణంబుగ విశేషణంబు లవిభక్తికంబులు. (సమా. 9) అట్టి ఇట్టి ఎట్టి విశేషణములపై నున్న 'వాఁడు' శబ్దములోని వావర్ణము లోపించుటచే అట్టిఁడు అని యేర్పడు నని సూత్రకర్త చెప్పుచున్నాఁడు. అట్టియెడలఁ బ్రౌఢవివరణము సందర్భ మేమి? అనఁగా అట్టి ఇట్టి ఎట్టి అనువానిపైఁ బ్రథమైకవచనమున డుజ్విభక్తి వచ్చుటచేతనే 'యట్టిఁడు' అనురీతిరూపములు సిద్ధించును. కావున వాలోపము చెప్పినవిధానము వ్యర్థ మని తలంచుట కవకాశము లేకుండుటకయి యవిభక్తికంబు లనెను. కావున అచ్చట నున్నడుజ్ అట్టి ప్రాతిపదికపైఁ జేరినవిభక్తిగా భావింపరా దనియు వాఁడులో వాలోపముచే నేర్పడినదే యనియుఁ, గావున వాలోప విధాన ముచితమే యనియు సూత్రకర్త తాత్పర్యమును తత్త్వ. (262) స్పష్టము చేసినది. (సర్వ. 189) అతఁడు మొదలగువానియందలి 'డు' విభక్తిప్రత్యయ మని తలంపరా దని భావము. (సుగమ. 161) అనుట సరి గాదు. వాఁడుశబ్దమునకు సంబంధించినదే యైనను నయ్యది విభక్తి కాకుండఁ బోవు టెట్లు? అట్టి యను ప్రాతిపదికపై సరాసరిగాఁ జేరిన డుజు కాదనియే కాని, యది యసలు విభక్తియే కా దని సూత్రకర్తతాత్పర్యము కాదు.

సూత్రకర్తతాత్పర్యము తత్త్వబోధిన్యాదులు పేర్కొన్నదే యైనను ననవసరము. అట్టి యనుదానిపై డుజ్విభక్తి చేరుటచే 'అట్టిఁడు' అనునది యేర్పడు నని చెప్పుట కెంతమాత్రమును వీలు లేదు. అట్టి యనునది యికారాంతము. కావున విశేషణములు సవిభక్తికంబులే యైనను దీనిపై డుజ్ రాదు. ఇట్లే పైసూత్రముచేఁ బ్రథమైకవచనము లోపింపక తప్పదు. తండ్రి ఇత్యాదు లిట్టివే. అట్లే అట్టి స్త్రీసమములలోఁ జేర్పవలసినదే కాని పుంలింగతుల్య మన్నను డుజు రాదు. దానికిఁ బ్రత్యేకముగాఁ బుంలింగతుల్యత్వ మతిదేశించి తత్సామర్థ్యమున డు జవు ననురీతి సమన్వయించుటకంటె డుజును విధించుటయే లాఘవము గదా.

ఏది యే మైనను నిటఁ బ్రౌఢవ్యాకర్త తెలుగునందలివిశేషణములు సాధారణముగ నవిభక్తికంబు లని చెప్పెను. అవిభక్తికంబు లనఁగా విభక్తు లసలే చేర వనియుఁ

ప్రాతిపదికలే ప్రయోగింపఁబడు ననియుఁ జెప్పుట యుక్తము కాదు గదా. విశేషణములపై నెల్లవిభక్తులకు లోపము చెప్పుటకును బ్రమాణము లేదు. అట్టియెడల నవిభక్తికంబు లనఁగా విభక్త్యంతము లయి ప్రయోగింపఁబడుట లే దని తాత్పర్యము నెన్నఁదగును. అనఁగా విశేషణములు వ్యస్తముగాఁ బ్రయోగింపఁ బడుట సాధారణముగ లే దని యర్థము. కాఁగా నీయవి సమాసగతము లయియే యుండును. కాని వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడవు. అమహదర్థమున 'పలు' అనుసర్వనామ మెట్లు కేవలము సమాసగత మయి మాత్రమే కన్పించుచున్నదో వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడుట లేదో యట్లే తెలుఁగునందలివిశేషణములు సమాసగతము లయియే ప్రయుక్త మవుచున్నవి, కాని వ్యస్తముగాఁ బ్రయోగింపఁ బడుట లే దని యీవివరణవాక్యమునభిప్రాయము గ్రహింపదగును.

మఱి అట్టివాఁడు అనునది యేమి? సమాసమే యనవలెను. అట్టి శబ్దముపై విభక్తివివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగుటవలన నట్టివాఁడు అనురీతిగా నేర్పడిన దని తలఁచుచో నీయది సమాసము కాదు. ఇంక అట్టిశబ్దముపైఁ బ్రథమావిభక్తి వివక్షించుటయు మొదలుగా నీప్రక్రియుచేత అట్టిశబ్దముయొక్క ప్రథమా విభక్త్యంతరూపము అట్టివాఁడు. ఇట్లె నల్లవాఁడు అనురీతిగా సమన్వయింప వలయును. అపు డిది విభక్త్యంతము గాకపోవు టేమి? సవిభక్తికమే యవుచున్నది.

కావున ధాతుజవిశేషణములపైవలె నిట విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగము చేత అట్టివాఁడు అనురూపమేర్పడె నని చెప్పుటకు వీలు లేకున్నది. కావున వీనిని సమాసములుగాఁ బరిగణింపవలె. అవిభక్తిక మగుచోఁ బ్రాతిపదిక మవుట సమాస మె ట్లనవచ్చును. త్రికమువలెనే వీనిపై సుప్రత్యయమును జూపి స్త్రీసమములుగా గర్మధారయసమాసమును సాధించుకొనఁదగును.

అపుడే ఇది నల్లనిది, వీఁడు నల్లనివాఁడు ఇత్యాదులును నిగాగమముతో సిద్ధించును. బాల.లో ధాతుజవిశేషణముపైని మాత్రమే తచ్ఛబ్ద మనుప్రయుక్త మవుటను పేర్కొన్నసూరిమతమున కిది యనుగుణమే యనవలె.

ఇట నొకవిషయము గుర్తింపవలసియున్నది. కమలజునట్టిండు, ఇతం డిట్టిఁడు అనురీతిగా నీస్థలములందు అట్టివాఁడు, ఇట్టివాఁ డనురీతిగా నీయవి సమాసములే యైనను నిం దుత్తరపద మగుతచ్ఛబ్దమున కర్థప్రాధాన్యము లేదు.

వచ్చినవాఁడు అనుచో విభక్తివివక్షలో ననుప్రయుక్త మైనతచ్ఛబ్ద మెట్టిదియో యట్లే యిదియు. అట్టియెడల వీనిని సమాసము లను టెంతవఱకు యుక్త మన్నదియుఁ బ్రశ్నమే. 'నల్లనివాఁడు, నల్లనియది ఇత్యాద్యాః కర్మధారయాభాసాః' అని అహో. (వ్యాసంస. 117)

సంజీవనీవ్యాఖ్య ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపు డనుచోటిధాతుజ విశేషణశబ్ద మితరము లగుకొన్నివిశేషణములకును నుపలక్షక మని భావించెను. విశేషణములే యేల? విశేష్యములకు నిట్టిస్థితి గల్గుటను సూరి సూత్రాంధ్రమున స్పష్టము చేసెను. 'త్రికధికటిష్మగాదిభ్యః (సూత్ర) తమ్మువాఁడు దే.వి. తమ్ముఁడు శ.ర.,సూ.ని కూడ వీనికిఁ బ్రయోగ మీయలేదు. అల్లుఁడు అల్లుఁడు, అల్లువానికి బోలెన్ సమా.4 శ.ర. వలిమలయల్లువాఁడు (పారి. 5. 6) అల్లువారికి నెల్ల నీయవగుణంబు (కాశీ. 7. 50) (సూ.ని) ఇట్లే మగవాఁడు మొ.

కానీ చిన్నయసూరి యిట్లు ధాతుజవిశేషణము లితరవిశేషణముల కుపలక్షణ మని యుద్దేశించెనా? నిశ్చయముగాఁ జెప్పలేము. ఇట ననుక్త మని సూత్రాంధ్రాదుల నాశ్రయించి గుర్తింపవచ్చు నేమో పరిశీలింపవలెను.

వీనిని సమాస. 9 సూత్రమునకుఁ గాక 8 సూత్రమునకు లక్ష్యములు చేయుట యుక్త మని తోఁచుచున్నది. 'సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబు తోడ సమసించు' (బాల. సమా. 8) ననుదానిచే నల్లాదులును సంబంధార్థమునందుఁ దచ్ఛముతో సమసించును. సంబందార్థవివక్ష ననుసరించి నల్లయొక్క వాఁడు – నల్లవాఁడు, నల్లది యనురీతిగా నవును. ఇట్లు సమాసములుగా గుర్తించుటవలన నిగాగమముతో నల్లనివాఁడు, నల్లనియది యని యవును. ఇం దుత్తర పదము లగు 'వాఁడు, అవి' యనునవి సంబంధార్థమాత్రబోధకములే యవును. కాని తచ్ఛబ్దార్థము నీయజాలవు (వ్యా.సం.స. 1174) కావున నీయవి కర్మధారయాభాస మనునహోబలునిమతమున కిది యనుగుణము. ఆచ్ఛికవిశేషణములకు విభక్త్యంత రూపభేదములు లేవు. కానీ యిట సంబంధార్థవివక్ష విశేషారంభముచే యొక్క చేసికొని తచ్ఛబ్దముతో సమసింపఁజేయఁదగును.

ఇట నర్థ మేమి? అనఁగా బాహువీర్యమ్ములయొక్క వారు = బాహువీర్యముల వారు. బాహువీర్యములు గలవాఁడు, నాగాయుతబలంబుయొక్క (కల) వాఁడు

పేదమనసుయొక్క (కల) వాఁడు (వ్యా.సం.స. 1034) అనురీతిగా నల్లయొక్క కలవాఁడు = నలుపు కలవాఁడు = నల్లనైనవాఁడు అనురీతిగా నవును. ఇట సంబంధార్థము నాధారాధేయరూపముగా గుర్తింపవచ్చును. పేదమనసు ఆధేయము, పేదమనసు వాఁడు ఆధారము. నల్ల ఆధేయము. నల్లవాఁడు ఆధారము. అనురీతిగా సమన్వయించుట యుక్తము. ఇట్లు సంబంధార్థమునందే తచ్ఛబ్దముతో సమాసము చేయుటవలన నల్లది యిత్యాదిగా ధర్మవాచకము లైనపుడును దచ్ఛబ్దాంతము గావలసినయక్కఱ యుండదు. కానీ సూరి యట్లును నుదాహరింపలేదు. నల్లనిది యనురీతి (ధాతుజవిశేషణసందర్భములం దన్న, కృద్వృత్తిగా సమన్వయింపఁ దగును. ఇట సూత్రమందలిబహుళపదము నాశ్రయింపవలె.

నిగాగమము వ్యస్తతలో నవు నన్న సమాసమునందుఁ జెప్పుట యనవసర మగుచున్నది. నల్లనివాఁ డగురాముఁ డనుచో సమాసము రాదు. కానీ చేసినను నిగాగమము లోపింప నక్కఱ లేదు. కావున నల్లవాఁడు+రాముఁడు = నల్లనిరాముఁ డనియే యగును. ఇంక నిగాగమ మేల. అందుకే సూరి నల్లాదివిశేషణములకు విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగమును జెప్పలే దేమో.

మూఁడవవాఁ డనురీతివానిం గూర్చి గ్రంథాంతరమున స్పష్ట మగు.

కాఁగాఁ దెలుఁగున నల్లాదు లగువిశేషణములు సంబంధార్థమునఁ దచ్ఛబ్దముతో సమసించియే ప్రయోగింపఁబడు ననియు నందువలననే ప్రౌఢ. 'తెలుఁగున విశేషణంబులు సాధారణంబుగ నవిభక్తికంబు' లని చెప్పె ననియు గ్రహింపవచ్చును. ఇట్టి సంబంధార్థమువలన సమాసములందును దద్ధితసమాసవృత్తులలోను నల్లాదులును, జిన్నాదులును యొక్కషష్ఠ్యంతము లై నిలిచి, తత్తద్రూపముల నందు ననియుఁ జెప్పఁదగును. వ్యస్తముగాఁ బ్రయోగించునపుడే తచ్ఛబ్దముతో సమసించు ననుటవలన నల్లన, చిన్నఱికము, గొప్పతనము ఇత్యాదులలో వానిని యొక్కతోఁ జూపుట విరుద్ధము గా దనియు గ్రహింపఁదగును.

'నల్లనివాఁడు పద్మనయనమ్ములవాఁ' డనుచోఁ బద్మనయనమ్ములయొక్క వాఁ డనురీతిగానే నల్లయొక్క వాఁ డనురీతిఁ జెప్పఁదగు. ఇట సంబంధార్థవివక్షచే యొక్క యవుట విశేషముగా గుర్తింపవలె. నల్లయొక్క యని విడిగా రూపము లుండవు.

ధాతుజవిశేషణములకు మాత్రమే తచ్ఛబ్దానుప్రయోగమును సూరి చెప్పెను. చిన్నాదివిశేషణములకుఁ జెప్పలేదు. ఆరెండికిఁ గొంతభేదము గమనింపవచ్చును. రామునికంటె లక్ష్మణుఁడు చిన్న, లక్ష్మణునికంటె రాముఁడు పెద్ద, కృష్ణునికంటె రాముఁడు పూర్వము. ఇత్యాదిగా నీయవి తచ్ఛబ్దము లేకయుఁ బ్రయుక్తము లగు చున్నవి. (ఇందుఁ బెద్ద యనుదానికి బెద్దలు, పెద్దలయం దిత్యాది విభక్త్యంత రూపములు గలవు. కానీ యితరములకు గొప్పచేత (గొప్పవానిచేత) నిత్యాదిగాఁ గానరాదు.) కావున నీయవి స్త్రీసమము లనఁదగును. చిన్న యైనవాఁడు చిన్న వాఁ డనురీతి సమాసమును నిర్వహించుకొనవచ్చును. (వ్యా.సం.స. 1171). కానీ ధాతుజవిశేషణములకు నీరీతిగా వాఁడు వచ్చిన, ఈమె రాఁగల, చిలుక పలుకని, యనురీతిగా నుండదు. వచ్చినవాఁడు, రాఁగలది, పలుకనిది యనురీతిగాఁ దచ్ఛబ్దముతోనే వ్యస్తతలో ప్రయోగింపఁబడుచున్నవి. వచ్చినకంటె, పాలించుకొఱకు, అనురీతివి విశేషములుగాఁ బ్రత్యేకముగా సాధించుకొనఁదగినవి. కావుననే ధాతుజ విశేషణములకు మాత్రము సూరి తచ్ఛబ్దానుప్రయోగమును జెప్పియుండును.

గొప్పయొక్క, చిన్నవలన ననురీతిగా నిట నితరవిభక్తులతో వీనికి రూపములు ప్రత్యేకముగాఁ గానరావు. కావున చిన్నయొక్క భావ మని చెప్పుట యె ట్లన్నది ప్రశ్నమే. ఇది పైని జూతము.

ధాతుజవిశేషణములవలెనే నల్లాదులును వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడునపుడు తచ్ఛబ్దాంత మవుటయే ప్రసిద్ధము. అ ట్లని ధాతుజవిశేషణములకువలె వీనికిని దచ్ఛబ్దానుప్రయోగము చేయుటకు వీలు లేదు. నల్లనివాఁ డనుచో నిగాగమ మెట్లు? నల్లవాఁడు వ్యస్తమును నల్లనివాఁడు సమస్తము ననవలెనా? నిగాగమసూత్రమందలి బహుళశబ్దముచే వ్యస్తతయందును నిగాగమము చెప్పఁదగునా? అయినను నమహదర్థమున నల్లనిది, నల్లనియది యనుచో నత్వము లోపించుట యెట్లు? వృత్తియందుఁ గదా యదియవులయత్తునకు లోప మగునది. వచ్చెడిది.

మొత్తముమీఁద ధాతుజవిశేషణములపై నైనను దచ్ఛబ్దమునకు లోపము చెప్పవలసినయవసరము లే దని స్పష్ట మవుచున్నది.

పైఁగా సూత్రకర్త యాలోపము విభాష యని చెప్పుచున్నాఁడు. అట్టియెడల నీ సూత్రము సాధించు ఆఁకొన్నవానితన మనురీతిరూపములు బాల.సాధ్యములు

కావు. సూరిమతముననే తచ్ఛబ్దలోపమును మార్గాంతరముగ సాధించిన సంజీవనీ వ్యాఖ్య విభాషగా లోపము చెప్పి ప్రౌఢ. సాధించుచున్న ఆఁకొన్నవానితనము అనురూపములం గూర్చి పేర్కొనలేదు. ఇట్టిరూపములు లే వనియును నావ్యాఖ్య పేర్కొనలేదు. ధాతుజములు కాని విశేషణములపై నీలోపము నంగీకరింపలే దని చెప్పుచు సంజీవనీవ్యాఖ్య సూ.ని. పంక్తు లుద్ధరించినది. కానీ అటనే సూ.ని. క్రియాజన్యవిశేషణములమీఁద విభక్తినిమిత్తక మగుతచ్ఛబ్దము లేకుండఁగనే ఇయ్యది (తన) కనఁబడుచున్నది. ఉదా. ఆఁకొన్నతనము, ఓర్వలేనితనము అనియుఁ బేర్కొన్నది. దీనింగూర్చి సంజీవని యేమియుఁ జెప్పలేదు.

ఇంక సూ.ని. తచ్ఛబ్దము లేకుండఁగనే యనుటచేఁ బ్రస్తుతసూత్రకర్త చూపిన ఆఁకొన్నవానితన మనురీతిగాఁ దచ్ఛబ్దము నిలిచియున్నరూపములు కవిప్రయోగము లందు లే వని స్పష్ట మగుచున్నది.

కాఁగా విభాష యని చెప్పి ప్రౌఢ. విశేషముగా సాధించిన ఆఁకొన్నవానితన మనురీతివాని నంగీకరింపవలసినయవసరము కవిప్రయోగానుగుణముగా లేదు. అట్టియెడల నీలోపమును విభాష యని చెప్పుట యుక్తము గాదు. ఈనియమము నంగీకరించినవ్యాఖ్య లేవియు నిట్టిలోపము లేనిరూపమునకుఁ బ్రమాణమును జూపలేదు.

అట్టియెడల విభాషాపదమును దొలఁగించి లోపము నిత్య మన్నచో ఆఁకొన్న తన మనురీతిరూప మొక్కటియే యవును. ఇట్లు తచ్ఛబ్దము లేనిరూపము మాత్రమే నిలుచుటచేత నయ్యది బాల. సిద్ధమే యవుటచేతను నీవిధానము వ్యర్థ మగుచున్నది.

విభాష యని చెప్పినయీవ్యాకర్త సయితము లోపము లేనిప్రయోగమును జూపలేదు. పెల్లాఁకొన్నతనాన నని చూపినప్రయోగములోఁ దచ్ఛబ్దము లోపించినదే కదా. ఇటఁ బెల్లాఁకొన్నతనాన నని కాక పెల్లాఁకొన్నకతాన ననుపాఠ మున్నది. ఈసూత్రమందలివిభాషాపదముం గూర్చి విమర్శింపఁబూనిన వఝలవారు లోపము లేనిప్రయోగములు చూపకపోవుట యుక్తమే.

## పూజారి - సొన్నారి

**3. మతుబర్థంబునం దరివర్ణకంబు పరం బగునపుడు పూజసొన్నములకడ యచ్చునకు వైకల్పికముగాను నిత్యముగాను దీర్ఘం బగు.**

మతుబర్థమునం దయిన అరిప్రత్యయము పర మగుచుండఁగాఁ బూర్వమునం దున్నపూజశబ్దమునకు దీర్ఘము వికల్పముగా వచ్చును. పూజారి, పూజరి యని రెండు రూపము లగును. సొన్నశబ్దమునకు నిత్య మవుటచే సొన్నారి యని యొకేరూప మగును.

కు.పం. సుబో. వ్యాఖ్య లీసూత్రార్థమును గూర్చి విశేషించి పేర్కొనలేదు. తత్త్వ. 'పూజా+అరి అనుచో సంధి వచ్చిన, పూజారి అని యవును. సంధిరా దన్నచో పూజయరి అని కావలె దీర్ఘము వచ్చునపు దరివర్ణకములోనిఅకారమునకు లోప మగుట వ్యాకర్త కభీష్టము. కడయచ్చునకు అనఁగా సంధిలో ఏకాదేశముగా వచ్చిన ఆకారమునకు దీర్ఘము వచ్చు నని యైన తలంపవలెను' (323) అని పేర్కొన్నది.

ఈసూత్రముచే దీర్ఘము రాఁగా సంధి వచ్చు ననుటకు వీలు లేదు. పూజా+అరి యనుచో సంధి జరిగిన మఱలఁ బూజరి యని యగును. అపుడు దీర్ఘవిధానమే వ్యర్థ మగును. భుజ్ ఇంచు అనుచోఁ జింతామణిలో 'లఘ్వక్షాక్షరపూర్వ'సూత్రముచే నిత్వము రాఁగా, 'భుజి ఇంచు' అని యవును. ఇత్వవిధానసామర్థ్యమునుబట్టియే యచట సంధి రాక, యశ్రుతి రాఁగా నుద్దిష్ట మగు 'భుజియించు' అనురూపము సిద్ధ మవుచున్నది. అట్లే యిచటఁ గూడ దీర్ఘవిధానసామర్థ్యము ననుసరించి యపదాది స్వరసంధి చేయరాదు. కావున 'అపదాదిసంధి రాఁగా పూజరి అనియే యగు' నని సర్వ. (296) సుగమ. (201) పేర్కొనుట యుక్తము గాదు.

సంధి రా దని యంగీకరింపక తప్పదు. కాని యిష్టరూపమును సిద్ధింపదు. సంధి లేమి యడాగమము వచ్చి, పూజాయరి యనురీతిగా నపరూప మేర్పడక తప్పదు. ఇటఁ దత్త్వ.లో సంధి రానిచో 'పూజయరి' అని హ్రస్వ ముండుట యచ్చు పొరపాటు.

ఇంకఁ దత్త్వ. కడయచ్చున కనఁగా సంధిలో నేకాదేశ మయి వచ్చినయకారమున కని తలంపవలయు ననుటయు నుచితము కాదు.

అది పర మగునపుడు పూజసొన్నములకడ యచ్చున కని కదా, సూత్రము చెప్పుచున్నది. దానింబట్టి పూజ+అరి అనురీతిస్థలమునే సూత్రకర్త యుద్దేశించుట స్పష్టము. అనఁగా సంధి రాక ముందరిరూపమే. సంధి యైనపిదప 'అరి' పర మగుచుండ పూజలో గడయచ్చునకు దీర్ఘ మగుట యెట్లు? ఇట్లే సొన్నారి అనుచోఁ గూడ.

పైఁగా సూత్రమున పూజసొన్నముల అని సొన్న మనుదానిని ముపర్ణ కాంతముగా నిర్దేశించుటయు గమనింపవలెను. పూజ+అరి అని యుండఁగా ననియే తాత్పర్యము.

పూజా+అరి అనురీతిగా దీర్ఘము వచ్చినపు దరిప్రత్యయమందలియకారము లోపించుట సూత్రకర్తయభీష్ట మని తత్త్వ. పేర్కొన్నది. వ్యాకర్త యభీష్ట మది కావచ్చును. 'పూజయరి' అనురూపము సాధింపవలయు నని యెట్లు తలఁచును? అతఁ డుద్దేశించిన యర్థము సూత్ర మీఁజాల దనుట మాత్ర మంగీకరింపక తప్పదు.

ఘం. పూజా+అరి సమాస. 36 చే అత్వలోపము (197) అని పేర్కొన్నది. 'ఆచ్ఛికసమాసంబులం' దనుసూత్రముచేతనే వర్ణలోపము చేయుట సూత్రకర్త యుద్దేశ మని యూహించుట యుచితముగా లేదు. ఒకవేళ నాయభిప్రాయమే యున్నచో నీవిధానము వ్యర్థము. పూజ+అరి యని యుండఁగా నీసూత్రముచే దీర్ఘము చేసి 'ఆచ్ఛికసమాసములం' దనుసూత్రముచే 'అరి'లో అకారలోపము చేయుటకంటె దాని ప్రకారమే పూజారి యనుచో వికల్పముగా దీర్ఘ మయిన దని చెప్పిన నిష్టరూపసిద్ధి సులువుగా నయిపోవును గదా. మఱల నీసూత్ర మేల?

కావున నీ ఘం. చూపినయభిప్రాయము సూత్రకర్తకు లే దనక తప్పదు. ఇంక కమ్మందేనె యనుచో నిగాగమమునకు బిందువును మాత్రము చెప్పి, సరళాదేశమును జెప్ప మఱచినట్లె యిట నకారలోపము చెప్ప మఱచె ననవచ్చును.

'అరి' అనుప్రత్యయములోనియకారమునకు లోపము చెప్పుటకంటె సర్వ. పేర్కొన్నట్లు పూజసొన్నములకు మతుబర్థంబునం దరివర్ణకము తొలియచ్చునకు (296) దీర్ఘమును సాధించుకొనుట కొంత నయ మేమో.

పూజ+అరి = పూజ+ఆరి = పూజారి యని చూపుట కొంత మెఱుఁగే. పూజరి, సొన్నరి యనుచో సంధి యైనపిదప దీర్ఘము చెప్పుకొనుటయు యుక్త

మగుమార్గమే. ఏతము=ఏతాము. అనురీతిగా హ్రస్వము దీర్ఘ మగుట ఓయారము= ఒయారము, ఆరాటము=ఆరట మనురీతిగా దీర్ఘము హ్రస్వ మగుట యాచ్ఛికశబ్దము లందుఁ గలదే కదా.

సొన్నారి తెలంగునం (శ.ర. కమ్మటము) పూజారివధూటి వచ్చి (శ.ర.)

సూత్రమునందు 'మతుబర్థంబునం' దనుదళము స్పష్టతకు మాత్రమే. అది లేనందువలన నెట్టియిబ్బందియును లేదు. మతుబ్భిన్నార్థములం దరివర్ణకము బాల. చెప్పలేదు. ఈవ్యాకర్తయుఁ జెప్పలేదు. కావున నితర మగునర్థమం దైన'యరి'వర్ణకము పర మైనపు డీకార్యము లే దనుప్రయోజనమున కవకాశము లేదు.

ఇంకఁ బూర్వసూత్రమున 'తనవర్ణకము పరం బగునపు' డని చెప్పినట్లే యిట 'నరివర్ణకంబు పరం బగునపు' డని చెప్పినఁ జాలు. 'త్వార్థే తన శ్చ' యని 'తన' త్వార్థమునం దవుట చింతామణియం దుక్త మనియు, 'అరి' చింతామణి చెప్పక పోవుటచే నీతఁ డిట్లు మతుబర్థము చెప్పె ననుటకు వీలు లేదు. మతుబర్థంబు నం దరివర్ణకము నీసూత్రము విధించుట లేదు. కావున బాల.చే అరిప్రత్యయము చేయఁగా నది పర మయిపు డని యర్థము చేయక తప్పదు. కావున 'మతుబర్థంబునం' దనుట స్పష్టతకు మాత్రమే యనవలెను.

'పూజసొన్నములకడయచ్చునకు' ననుచో సొన్నము అని ముపర్ణకాంతముగాఁ గాక 'పూజసొన్నల' యని చెప్పినను దప్పు లేదు. తద్ధితప్రత్యయపరకత్వమున విభక్తి లోపింపఁగా, మిగిలిన పూజ, సొన్న యనునవే గ్రహింపఁబడును. సొన్నము కడయచ్చునకు దీర్ఘ మనుటచే ముపర్ణకాంతనిర్దేశముసామర్థ్యమువలన ముపర్ణకము లోపింపక, యాముపర్ణకమునం దున్నయుకారమునకే దీర్ఘ మవు నని యర్థ మగును. చెలి, నయములకుఁ గారప్రత్యయము చెప్పుచో కార విధింపఁబడుచున్నది. కావున నయము అనురీతిగా నిర్దేశింపవచ్చును. దానితో దీనికిఁ బోలిక లేదు.

దీర్ఘవిధానమునందలిలోపము లింతకు మున్న స్పష్టము.

## చెంచిత

**4. మతుబర్థంబునం జెంచునకుఁ దవర్ణకంబు పరం బగుచో నిత్వంబు నగు.**

చెంచుజాతికిఁ జెందినస్త్రీ యనునర్థమున చెంచు శబ్దముపై బాల. తద్ధి. 18 సూత్రముచే నయిన 'త' ప్రత్యయము పర మగుచుండఁగా ముందున్న చెంచుశబ్దము లోనిచివరియుత్త్వముస్థానమున ఇత్వ మాదేశముగా వచ్చు నని సూత్రమున కర్థము. చెంచిత. బాల.తద్ధి.19చే చెంచుశబ్దమునకు ఎత్వ మయిన 'చెంచెత' యనియు, రానిపక్షమున 'చెంచుత' యనియు రూపము లుండును.

కు. పం., ఘం. 'ఇత్వం బగు' అనుపాఠమును జూపినవి. తత్త్వ. 'ఇత్వం బగు' ననుపాఠమునే చూపి వివరణమున 'ఇత్వంబును అగు=ఇత్వము గూడ నగు నని యర్థము. అనఁగా ఎకార మొక్కటియ కాక ఇకారము కూడ వచ్చు నని భావ (324) మని పేర్కొన్నది.

కాఁగా 'ఇత్వంబు నగు' ననుపాఠమ యిందు నుండవలెను. సుబోధిని ఇత్యాదు లగు నితరవ్యాఖ్యలు 'ఇత్వంబు నగు' ననురీతిగా సముచ్చయార్థకముతోఁ గూడిన పాఠమునే చూపి తత్ప్రయోజనమును వివరించినవి.

'ఇత్వం బగు' ననునిత్యపాఠము నంగీకరించినచో జెంచెత (శ.ర.) అను నెత్వ ఘటితరూపమునకు నవకాశ ముండదు. నిత్య మగునిత్వముతోడి 'చెంచిత' యనురూప మొక్కటి మాత్రమె సాధు వనవలసివచ్చును.

శ.ర.లో నీసూత్రకర్తయె 'చెంచెత' యనుదానియొద్ద 'చెంచితలన్' అనునీ ప్రయోగమును జూపి యీకవిప్రయోగముచేత 'తవర్ణకంబు పరం బగునపుడు ఇకారంబును వచ్చు నని తోఁచెడి' (273) నని పేర్కొనెను. కావునఁ దదనుగుణముగా 'ఇత్వంబు నగు' అనురీతిగా సముచ్చయార్థకముతోఁ గూడినపాఠము సముచితము.

దానిచేఁ జెంచిత యనుదానికి ముందు చెంచెత యనునదియు సాధువే యవుట స్పష్ట మవును.

ఇంక నీయిత్వమున కాధారములు రెండు. 1. చెంచిత యనుపోతనప్రయోగము. 2. చెంచిత యనుగ్రామ్యజనులవ్యవహారము. రెండవయాధారమును వ్యాఖ్య లెల్ల నంగీకరించినవి. ఘం. 'తుమ్మెద తుమ్మ్రెద యనురీతిగా గ్రామ్యజనవ్యవహారమం

దున్నది. కావున చెంచీత యనువ్యవహారము చెంచిత అనునిత్వమునకు సాధక మన నక్కఱ లే దని చెంచెత – చెంచిత అనియు వ్యవహరింపఁబడనవు నని వివరించినది. ఇది యుక్తముగా నున్నది. కావున బాల. సాధించిన చెంచెత యన్ననెత్వఘటితరూపమే చెంచీత యనురీతి గ్రామ్యజనవ్యవహారమునకు మూలము గావచ్చును. 'చెంచెత' యనునదే చెంచీత యని వ్యవహరింపఁబడును గావున చెంచీత యనుదానినిబట్టి యిత్వమును సాధింప నవసరము లే దనియు నీసూత్ర మనవసర మనియుఁ జెప్పిన ట్లయినది.

పై పోతన ప్రయోగమున 'చెంచిత' అని యున్నచో అంచిత అనుదాని ననుసరించి యంత్యప్రాసము కుదురు నని సర్వ. (258) తత్త్వ. (324) ఘం. (198) మొదలుగాఁ బేర్కొన్నవి. కాని చెంచెత యనురీతిగా నెత్వపాఠ మున్నను ఎత్వ, ఇత్వములు తాలవ్యములే కావున సరిపెట్టుకొనవచ్చును. చెంచెత అని యున్నను నంత్య ప్రాసమునకు భంగము లేదు. (వ్యా.సం.స. 1303) అని సంజీవని భావించినది.

అప్పకవి అంఘ్రితుదిఁ బ్రాయి డాపలియక్షరంబు లఘు వైన వర్గయుగ్మంబు నడఁచు స్వరవిభేదంబు గాక (అప్ప. 3. 383) అని పేర్కొని, మదనా, రదనా, కదనా, వదనా (390) యని చూపెను. తదనుగుణముగ గ్రహించుచో నిట అంచితలన్, చెంచితలన్ అనురీతిగా మూఁడక్షరములు కూర్పఁబడినవి.

ఏది యే మైన చెంచితలన్ అనుపాఠమె ప్రతులం దుండుటనుబట్టి దానినే యంగీకరించుట యొప్పును.

కాని 'యిత్వంబు నగు' నని యిత్వమును విధించుటకంటె 'నిత్వంబు చూపట్టెడి' ననుచోఁ బ్రయోగవర్ణనమును దన్మాత్రగ్రహణావసరమును సూచింపఁబడి యుచితముగా నుండు నని తోఁచుచున్నది.

ఇంక నీసూత్రమునందు 'మతుబర్థంబునన్' అనుదళము పూర్వసూత్రము (తద్ధి. 3) నందువలెనే కేవలము స్పష్టతకు మాత్రమే చేర్పఁబడిన దనవలయును. తద్ధిత మగుతప్రత్యయము తద్భిన్నార్థములందు బాల. కాని, ప్రౌఢ. కాని పేర్కొనలేదు. కావున మతుబర్థంబునం దనుటవలనఁ బ్రయోజనము లేదు. విశేషించి చెప్పఁ దలఁచినను 'చెంచునకు దవర్ణకంబు పరం బగుచో నిత్వంబు నగు' ననవచ్చును.

# అవర్ణకము – మతుబర్థము

**5. చెడుగు దుడుకు నిడుపులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బకారం బగు.**

చెడుగు, దుడుకు, నిడుపు అనుశబ్దములు మూఁడింటికి 'అ' అనుప్రత్యయము మతుబర్థమునం దగును. చెడుగఁడు ఇత్యాదిగా రూపము లవును.

ఈవిధానారంభమును గూర్చి తత్త్వ. 'అడప – తాంబూలకరండవాహి. మతుబర్థంబునం దప్రత్యయంబు' అని సూరి పేర్కొన్నను ఆశబ్దములు స్త్రీసమము లగుటచే నియ్యవి యచట నుదాహరింపకుండుటచేతను స్పష్టప్రతిపత్తికొఱ కిట్లు విధింపఁబడె నని తెలియనగు (325) నన్నది. (ఘం. 198) ఆశబ్దములు స్త్రీ సమము లనుతత్త్వ.వాక్య మస్పష్టము. 'శబ్దములు' అనుటకు సూరి యట అడప యనుదానిం దప్ప నప్రత్యయాంతము నింక నొక్కటి యుదాహరింపలేదు. ఇవి స్త్రీసమము లనఁగా అప్రత్యయాంతము స్త్రీసమ మని యభిప్రాయము. అడపము అనునది క్లీబసమము. అ ప్రత్యయాంత మగు 'అడప' శబ్దము స్త్రీసమము.

కాని అప్రత్యయాంతముగాఁ జూపినయయ్యది స్త్రీసమమును స్త్రీవాచకము నైనది. కాని యప్రత్యయాంతము లెల్ల స్త్రీసమము లనునభిప్రాయ మున్నదా? స్త్రీత్వమునందు మాత్రమే యగు నననభిప్రాయము నచట లేదు. అంతకు ముందు మంటమారి, తిండిపోతు అనుచోఁ దాఛ్ఛీల్యమున మారి, పోతు ప్రత్యయములు జెప్పెను. తిండిపోతు, తిండికాఁడు, తిండికత్తె (శ.ర.) ఇట్లు పోతు పుంస్త్వస్త్రీత్వములు రెంట వచ్చినది. మంటమారి యనుచో స్త్రీత్వార్థమును శ.ర., సూ.ని చూపలేదు. పెండ్లము అనుచో అము స్త్రీత్వమాత్రబోధకము. కావున నీప్రత్యయములు పుంస్త్రీత్వ వివక్ష సేయకయే వివరింపఁబడినట్లు స్పష్టము. అందుచే యథాప్రయోగముగా గ్రహింపవలయు ననియే సూరియుద్దేశము.

అప్రత్యయాంత మగు అడప యనునది స్త్రీసమము గావున నప్రత్యయాంతము లెల్ల స్త్రీసమములే కావలయునా? అస్పష్టము. ఎట్లును నిర్ణయింపరాదు.

కాఁగా చెడుగు, దుడుకు, నిడుపుల కప్రత్యయ మవుటను సూరి యుదాహరించియు నుండలేదు. కావున నీవిధాన మవసరమే. ఈమూఁడింటిపై నవు ననునంశము తెలుపుటకును నీలక్షణ మవసరమే.

అకార మనఁగా నీయది తద్ధితమే కావునఁ బ్రత్యయ మని గ్రహింపవలెను. 'అవర్ణకం బగు' నన్న నింకను బా గుండెడిది.

ఇట్లు అ ప్రత్యయము చేరఁగా చెడుగ, దుడక, నిడుప అని యేర్పడును. వీనిం గూర్చి కు.పం. 'అప్రత్యయాంతమునకు మగాదిగణగణనంబునంజేసి డుఙు వచ్చు (129) నన్నది. సర్వ. అదంతము లయిన యీమూఁడును మగాదులలోఁ జేరు (300) నన్నది. మగాదులలోఁ జేరుట కదంతత్వము కారణము కాదు. కా, ఈ, ఆ, ప్రత్యయంతము లదంతములు గాకున్నను సూరియే మగాదులలోఁ జూపెను.

దీనిని సుబో. విమర్శించినది. 'ఇది మగాదులలో సూరి చేర్చలేదు. మహద్వాచక మగుటచే డుఙు ఎట్లును వచ్చు ననుట యసమంజసము. తత్స. 22 సూత్రము పుంలింగ మగుమహద్వాచకమునకు డుఙ్ చెప్పినది. కాని కేవలము మహద్వాచక ములకు కాదు. కావుననే మిత్రాదులకు నపుంసకలింగపక్షమునను మహ ద్వాచకత్వమునుబట్టి డుఙు వచ్చుట నివారిత మవుచున్నది. కావున డుఙు రావలయు నన్న పుంలింగమో, పుంలింగతుల్యమో కావలయును. తత్త్వ. (325) ఘం. (198) ఇది పుంలింగతుల్య మన్నవి.

దీని పుంలింగతుల్యత్వ, మహత్త్వములనుబట్టి డుఙు వచ్చినను నంతకు ముందే చివరియత్వమున కుత్వము రావలయును.

కావున వీని కుత్వమును వారించుటకు మగాదులలోఁ జేర్పవలయు నని తత్త్వ. 325 స్పష్టము చేసినది. (వ్యా.సం.స.1318).

డుఙు వచ్చుటకయి మగాదులలోఁ జేర్ప నక్కఱ లేదు. (బా.సూ) మగాదులలోఁ జేర్చుట యుత్వమును నివారించుటకు. అందుచే మగాదులలోఁ జేరును కావున డు ఙగు ననుట సరి కాదు. ఉత్వము కా దనుట యుక్తము.

ఇంక నిందుఁ జెడుగు శబ్దమునకు శ.ర.లో నీతఁడు క్రూరము, ధూర్తురాలు అనియే యర్థములు చూపెను. అందుకే మతుబర్థమునం దప్రత్యయమును జెప్పి యుండనవు. కానీ చెడుగు శబ్దమునకే చెడుగఁ డనునర్థమును గలదు. చెడుగు ధూర్తుఁడు, చెడుగు, గావరి, నీచు, ... ధూర్తుపేరు వెలయు (ఆం.భా.3.7) చెడుగుల్ కొందఱు గూడి (కాళ.శ.101) సూ.ని. అట్టియెడల కొడుకు, కొడుకఁడు అనురీతిదిగా దీనిని గుర్తింపవచ్చును.

'కడుం జెడు గీపొడపాఁపఁబుర్వు' అనుచో నమహత్తుగాను, 'ఓసి చెడుగ' యనుచో మహతిగాను, శ.ర. 'చెడుగుల్ కొంద' అనుచో మహత్తుగాను నీయది కాననవు.

దుడుకు నిడుపు శబ్దముల కిట్టిస్థితి గానరాదు. కావున వాని కీయది విధింప నవును. చెడుగు శబ్దమునకు మాత్ర మప్రత్యయము మతుబర్థమునం దవు నని చెప్ప నక్కఱ లేదు.

## నవర్ణకము – మతుబర్థము

**19. ఒకానొకచో మతుబర్థంబున నవర్ణంబు చూపట్టెడి.**

దివ్యతేజంబునవాఁడు అనునది దీనికి లక్ష్యముగాఁ జూపఁబడినది. లక్ష్యము ననుసరించి లక్షణము సమగ్రముగాఁ గానరాదు. జూదముపై మతుబర్థమునం దరి ప్రత్యయముచే, జూదరి యనురీతిగాఁ బ్రయోగింపఁబడునట్లుగా దివ్యతేజంబు శబ్దముపై నవర్ణక మైనపిదప దివ్యతేజన(ంబు)న అనియో, దివ్యతేజ(ంబు)నుఁడు అనురీతిగనో యీయది ప్రయోగింపఁబడుట లేదు.

పైని జేరిన 'వాఁడు' అనునది యెక్కడిదో సూత్రకర్త వివరింపలేదు. తత్త్వ. ఇయ్యది విశేషణమే యగుటచేఁ బ్రత్యేకముగాఁ బ్రయోగములందుఁ జూపట్ట దనియు విశేష్యముతోఁ గూడియే ప్రయోగింపఁబడు ననియు నూహించుకొనఁ దగు (333) నన్నది.

'దివ్యతేజంబున' అనునది విశేషణ మయి, వాఁడు అనునది విశేష్య మయిన దని యీవ్యాఖ్యయభిప్రాయపడిన దనవలయు. అయిన నీయది సమాసమా, లేక వ్యస్తమా? విశేషణముస్వరూప మెట్లు? మతుబర్థమునం దయిన దగుటచే నవర్ణకాంతము దివ్యతేజంబు కలిగినవాఁడు లేదా కలిగినది అనునర్థ మీవలె. యథోచితముగాఁ బైని విభక్తి రావలె.

'దివ్యతేజంబున' అనునది వేఱుగాఁ బ్రయోగింపఁబడనిమాట నిజమే. సూత్ర కర్తయే, దివ్యతేజంబునవాఁడు – దివ్యతేజంబుగలవాఁ డనురీతిగాఁ దచ్ఛబ్దముతోడనే చూపియున్నాఁడు. తద్ధితాంతము లేవియు నిట్టివి గానరావు.

కావుననే వ్యాఖ్యలు ఇది తద్ధితప్రత్యయము గా దన్నవి. (సర్వ. 312, ఘం. 312)

తత్త్వ. ఇం దిం కొకలోపము చూపినది. దివ్యతేజంబు అనుదానిపైఁ దద్ధిత ప్రత్యయము చేరినపుడు విభక్తి లోపింపవలయును గదా. ఉదాహరణమునుబట్టి లోపింప దని యూహింపఁజేయుటకంటె లోపాభావమును సూత్రించుట యుక్తము. 'తద్ధితప్రత్యయములు పర మగునపుడు డువర్ణకాదులకు లోపం బగు' నని నిత్యముగనే యీవ్యాకర్త విధించియున్నాఁడు. కాని లోపాభావమున కవకాశ మీయలేదు. లోపాభావము చెప్పకున్నను, మువర్ణకముపై వచ్చు నన్నను వగలాఁడు ఇత్యాదుల వలె లోపాభావము లక్షణసిద్ధ మయ్యెడునవకాశము కొంత గలదు. ఇంకఁ దత్సమముపై నవుట యన్నది యిం కొకవిశేషము. బంటి తత్సమములపై నగుటను విశేషముగా సూత్రించెనే. ఇట లక్ష్యమునుబట్టి తత్సమములపై నవుట నూహింప వలెనా? లక్షణము చెప్పినదానికంటె లక్ష్యముచే నూహించుకొనవలసినయంశములే యధికముగా నున్నవి.

నవర్ణకము మతుబర్థక మన్నచో నవర్ణకవిరహితమున కాయర్థ ముండరాదు. అనఁగా 'దివ్యతేజమువాఁడు' అనుచో దివ్యతేజంబు గలవాఁ డనునర్థము రాదా? అహోబలుఁడు చూపిన పీతాంబరమువాఁడు అనున దిట్టిదే. పేదమనసువాఁ డనురీతిగా నవర్ణకము లేకయే మతుబర్థ ముండఁగా నవర్ణమును మతుబర్థకముగాఁ జెప్పుట యుచితము గాదు.

ఇది తద్ధితము గా దని సర్వ., ఘం.లు పేర్కొన్నవి. ఇంక ఎలజవ్వనంబున విలసనంబు ఇత్యాదులలోవలె షష్ఠీతత్పురుషమునం దాగమముగా వచ్చిననవర్ణమే యిది యని యీవ్యాఖ్యలయభిప్రాయము. (సర్వ.311, ఘం.204) ఇట ఘం. ఇట్టివాని నాభాసబహువ్రీహు లందు (204) రన్నది. 'స్యా దాభాసబహువ్రీహిః ప్రథమాదిప్రయోగతః' అను వి.వి.లక్షణ మిట ననుసంధింపఁబడినది.

ఈసంజ్ఞ నిటఁ దెచ్చుట యనవసరము. బాల.మాత్రమే కాక ప్రౌఢ.సయితము నాభాసబహువ్రీహులను గాని యాభాసకర్మధారయములను గాని, యీసంజ్ఞలను గూడ స్వీకరింపలేదు. ఇంకను 'స్యా త్కర్మధారయాభాసః కర్తృత్వే కారకాశ్రితే' యని యాభాసకర్మధారయమును వి.వి. పేర్కొనఁగా దానిని సూరి 'కర్మాదులకుం బ్రాధాన్య వివక్షయం దని కర్మధాయసమాసముగ విధించెనే కాని యాభాసకర్మధారయము లని పేర్కొనలేదు. కావున వానిని వి.వి. మతముగా మాత్రము గుర్తింపఁదగును.

ఇంక 'స్యా దాభాసబహువ్రీహిః ప్రథమాదిప్రయోగతః' అని వి.వి. చెప్పిన లక్షణము బాల. ప్రౌఢ.లమతమునను సమన్వితము గాదు. ప్రథమాదిప్రయోగతః అని యథర్వణుఁడు చెప్పె. ఇట షష్ఠీవిభక్తి లోపించుటయే కాని దానికిఁ బ్రథమయో ద్వితీయయో వచ్చునట్టిప్రక్రియ లేదు. కావున నిటఁ బ్రథమాదిప్రయోగపద్ధతి లేదు. (వ్యా.సం.స.1232) అస లాగ్రంథమునందే యాభాసబహువ్రీహిలక్షణము సమన్వయించుట సహజముగ లేదు. గ్రంథాంతరమున నయ్యది పరామర్శింపఁ బడును.

వ్యాఖ్యలసమన్వయ ముచితముగనే యున్నది.

ఇంక నీసమాసములలోనివిశేషలక్షణము నిట్లు గుర్తింపవచ్చును. షష్ఠ్యంతము లగునాయాశబ్దములు విశేష్యములతో సమాసము నందునపుడు తప్పక తచ్ఛబ్దము గాననవుచున్నది. 'పట్టుపుట్టముయొక్క' యనునది 'దొర'తో సమసించిన, 'పుట్టుపుట్టముదొర' యని యవును. అ ట్లుత్తరపదము లేనపుడు 'పుట్టపుట్టమువాఁడు, పేదమనసువాఁడు, దివ్యతేజంబువాఁ' డనురీతిగాఁ దచ్ఛబ్దము కాననవుచునే యున్నది. (వ్యా.సం.స.1034) కవలవారు, బాహువీర్యమ్ములవారు ఇత్యాదిగా నిటఁ దచ్ఛబ్దము స్వార్థము ప్రధానముగాఁ గలది గాదు. వచ్చినవాఁడు ఇత్యాదులం దెట్లో యట్లే విశేషార్థవిహీన మనుట స్పష్టము.

'సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు' నని సూరి పేర్కొనెను. సంబంధార్థమునందే సమాసము చెప్పఁబడుటచే నిటఁ దచ్ఛబ్దము స్వార్థమును బోధింపకుండుట శాస్త్రసిద్ధ మవుచున్నది. (వ్యా.సం.స.1174) కావునఁ దచ్ఛబ్దోత్తరపదకత్వమును, గేవలసంబంధార్థబోధకత్వమునుబట్టి యిట్టివానిని బ్రస్తుత సూత్రమునకు లక్ష్యములును, షష్ఠీతత్పురుసమాసములు ననుట సమంజసము. పుట్టుపుట్టముదొర ఇత్యాదులు షష్ఠీతత్పురుషసమాసము లవుట ప్రసిద్ధమే.

కాఁగా 'దివ్యతేజంబుయొక్క' అనుషష్ఠ్యంతము పైసూరిసూత్రము ననుసరించి తచ్ఛబ్దముతో సమసించుటవలననే 'వాఁడు' అనునది పైని గాననవుచున్నది. షష్ఠీ తత్పురుషము లవుటచే నగాగమ మవుటయు నంగీకార్యమె.

సర్వ. దివ్యతేజంబునవాఁ డనుచో స్వస్వామిసంబంధమును సూచించుట 'న' అనునగాగమ మైన దనుట యుక్తము గానేరదు. ఆగమము రాక మునుపే

దివ్యతేజముయొక్క వాఁడు అనుచో యొక్క యనుషష్ఠీవిభక్తి శేషార్థమును జెప్పుచునే యున్నది. శేషంబునందే గదా, యొక్క షష్ఠి యైనది. అది సమాసమున లోపించినను నాయర్థమున కెట్టిభంగమును లేదు. రామునియొక్క దాసుఁడు = రామునిదాసుఁ డగుచో యొక్క పోయినను స్వస్వామిసంబంధము పోయినదా?

సూత్రకర్త షష్ఠీసమాసమున నగాగమంబు విభాష నగు నని విభాషగాఁ గదా చెప్పినది? విభాష గావున నిటఁ గూడ నగాగమము రానిచో నాపక్షమున 'దివ్య తేజంబువాఁ' డనుదీనియం దాసంబంధార్థము లేనట్లా?

ఈవ్యాఖ్య యిటనే కాక సమాస 37లో సప్తమ్యలుక్సమాసమందలినవర్ణమును శబ్ద. 21సూత్రముచే నగు నగాగమమును గూడ సంబంధమునందుఁ గలుగు నాగమముగా నొకే విధముగాఁ జెప్పవలయు నన్నది. (312) ఉదంతము లగు నమహత్తుల కనుసూత్రముచేఁ బటమ్మున+అందు అనుచోఁ బ్రాతిపదికకును బ్రత్యయమునకు నడుమ నగునాగమ'న'వర్ణము సంబంధబోధక మగుచుఁ జేరె ననుట యసంగతము. రామునకు నిత్యాదులలో వలె నట నట నగాగమమున కర్థవిశేషము లేదు. 'దివ్యతేజంబునవాఁ' డిత్యాదులందు నిట్లే నవర్ణ మర్థవిశేషయుక్తము గాదు. సప్తమ్యలుక్సమాసములం దున్నది నప్రత్యయము, అధికరణార్థకము. దాని నాగమముగాను సంబంధబోధకముగాను జెప్పవలయు ననుటయు సరి గాదు.

మొత్తముమీఁద 'దివ్యతేజంబునవాఁ' డనునది షష్ఠీసమాసమును, అందు నగాగమయుక్తరూపమే కాని నవర్ణకము తద్ధితము గా దనునభిప్రాయము బాగుగనే యున్నది.

ఇటఁ దత్త్వ. దివ్యతేజంబుతోఁ గూడియున్నవాఁడు అనునర్థమున తృతీయార్థక మైన నవర్ణకాంతముతోఁ గూడిన యలుక్సమాసము కానగును. కావున నీసూత్రము త్యాజ్య మన్నది. (334)

ఈతత్త్వ.అభిప్రాయము అవిమర్శమూలకము (330) అని ఘం. తిరస్కరించినది. ఎట్లో వివరింపక కేవల మవిమర్శకమూలక మనుట యుక్తము గాదు. ఇంక స్యా దాభాసబహువ్రీహిః అను వి.వి.లక్షణము ననుసరించి తత్త్వ. అభిప్రాయము సరి గా దనవలె. అయినచో నిది యస లేసమాసము? బహువ్రీహిసమాసము కాదు. షష్ఠీతత్పురుషంబునందు నగాగమము చేయవలె నని ఘం. పేర్కొన్నది. (204)

అట్టియెడ నిది షష్ఠీతత్పురుష మనక తప్పదు. ఈవ్యాఖ్య షష్ఠితో సమన్వయింప నావ్యాఖ్య తృతీయతో సమన్వయించినది. అందలిలోప మేదియో స్పష్టము చేయవలయును గదా.

ఇది యాభాసబహువ్రీహి యని బాలప్రౌఢవ్యాకర్తలమతమునఁ బేర్కొనుట కాధారము లే దని గమనించితిమి. ఇంకను సూరిలక్షణము ననుసరించి సంబంధార్థమునందుఁ దచ్ఛబ్దముతో నైనసమాసముగాఁ బైప్రయోగమును గుర్తించి యుంటిమి. కాఁగా నిది షష్ఠీతత్పురుషము. ఆభాసబహువ్రీహి యనువ్యవహార మీవ్యాకరణములందు లేదు.

ఈయది యాభాసబహువ్రీహి యనుచు ఘం. (దివ్యతేజంబు+యొక్క+వాఁడు + డుజ్ అలౌకికవిగ్రహము అని పేర్కొన్నది. (330) ఇట యొక్కవిభక్తి పర మగుచుండ ముగాగమము. దానికిఁ బూర్ణబిందుపూర్వకబువర్ణ మనుప్రాతిపదిక కార్య మయినది. ఇట్లే వా+డుజ్ అనుచోఁ గూడ. కానీ యింతకు ముందే యీవ్యాఖ్య నాయఁకరము రూపసాధనమున నాయఁక+యొక్క+కర అనురీతి చూపిన దేమి? యొక్క పరకత్వమున నిగాగమము నంతకు ముందే యుత్వము నేల రాలేదు. ఇట ముగాగమాదు లె ట్లయినవి. అసలు తెలుఁగున నలౌకికవిగ్రహ మన నెట్టిదో విస్పష్టముగా నిరూపించుట యవసర మని తోఁచెడిని. నాయఁకర మనుచోటవలె నలౌకికవిగ్రహమున నిటఁ జూపినచో 'దివ్యతేజనవాఁడు' కావలసియుండును. ఇచ్చోటవలె నచ్చట నలౌకికవిగ్రహము చూపినచో నాయఁకునికర మని కావలె. అందుకై యీవ్యాఖ్య యెప్పటి కెయ్యది యవసరమో యప్పటి కద్దానిని జూపినది. అది సక్రమము గా దనక తప్పదు.

ఇంకఁ దత్త్వ. యభిప్రాయమును బరిశీలింతము. దివ్యతేజంబుతో ననుచోఁ దృతీయ. దీనికి 'ఉదంతజడంబుతృతీయకు' నవర్ణకము. దివ్యతేజంబునన్ వాఁడు అలుక్సమాసము గావున ద్రుతము మాత్రము లోపించి దివ్యతేజంబునవాఁడు అని యగును. విభక్తి లోపించిన నే మవును? ఇట విభక్తి నిత్యముగా లోపించునా? 'దివ్యతేజంబువాఁడు' అనియు నవును. ఇది తృతీయాతత్పురుషసమాస మవుటచే బుంపులును రా వన్నమాట.

ఈప్రక్రియయును నిర్దుష్ట మనరాదు.

మొదటియంశ మిచ్చటితృతీయకు నవర్ణక మగునా? దివ్యతేజంబుతోఁ గూడి యున్నవాఁ డనునర్థము ననుసరించి యిట సహార్థమును జెప్పవలె. సహార్థమునం దగు 'తోడకు' నవర్ణకము వచ్చుట ప్రయోగములం దెచ్చటను గానరాదు.

చేతతోడలు తృతీయావిభక్తులు గదా. కరణార్థమునందు మాత్రమే యివి రెండు నవును. సహార్థమునఁ దోడయే కాని చేత లేదు. హేత్వర్థమునఁ జేతయే కాని తోడ లేదు. తృతీయకు విధించినద్వితీయ కాని, నవర్ణకము కాని చేతతోడలు రెండు నయ్యెడు కరణార్థమునంద కాననవు. కాఁగా దివ్యతేజంబుతో ననునర్థమునఁ దృతీయకు నవర్ణక మవుట యనుమానము. దివ్యతేజంబునన్ అనుదానికి దివ్యతేజంబుతో అనునర్థము గలదా?

ఇంక రెండవయంశ ముత్తరపదము తచ్ఛబ్దము. ఇది తృతీయాతత్పురుషమే యైనఁ దచ్ఛబ్దార్థమునకుఁ బ్రాధాన్య ముండవలయును. కానీ తచ్ఛబ్ద మట్టిది కాదు. దివ్యతేజంబువాఁడు, బాహుబలమ్మువాఁడు ఇత్యాదిగాఁ దచ్ఛబ్దముతోడఁ గాన్పించుటనుబట్టియుఁ దచ్ఛబ్దార్థము ప్రధానము గాకుండుటంబట్టియు వీనికిఁ దచ్ఛబ్దముతో సమాసము సంబంధార్థమునం దయిన దని గుర్తించితిమి. అట్టిది షష్ఠ్యంతమునకే కాని తృతీయాంతమునకుఁ గుదురదు. కావున నీరీతిరూపములు బాల.లో సంబంధార్థమునఁ దచ్ఛబ్దముతో సమాస మవుటచే నేర్పడిన వనఁదగి యుండుటచేతను గూడ నివ్వానిని షష్ఠీతత్పురుషము లనుటయె యుక్తము గాని తృతీయాతత్పురుషము లనుట యుచితము గాదు.

కావునఁ దత్త్వ సమన్వయముకంటె నితరవ్యాఖ్యలసమన్వయ మనఁగా షష్ఠీ తత్పురుష మనునదే సముచితముగా నున్నది. కావున నట్లే గ్రహింపఁదగును.

తత్త్వ. సమాస 1,37 సూత్రములును తద్ధి. 19 అగు నీసూత్రమును నకారమునకు (నవర్ణ మని యర్థము) సంబంధించినవి గావున నొకసూత్రముచేఁ జెప్పఁదగిన వనియు, సమాస. 37 సూత్రముచేతనే యివి రెండును సిద్ధించు ననియు ననుట (334) సరి గాదు.

సమాస. 1 సూత్రముచేత నిట్టిరూపము సాధింపఁబడును. కావున నీసూత్రముఁ జెప్పుట యనవసరము. సమాస. 1,37 సూత్రములు వేర్వేఱుగా నుండఁదగినవే.

ఇంకను సమాస. 37 సూత్రమే స్పష్టత మాత్రప్రయోజకముగాఁ జెప్ప నక్కఱ లేనిదిగా గుర్తించితిమి.

మొత్తముమీఁద నవర్ణకమును దద్ధితముగా విధించిన యీసూత్ర మసంగత మనుపెక్కువ్యాఖ్యలయభిప్రాయసారము సమంజసము. 'ఇతరంబులు ప్రయోగ దృష్టంబులు గ్రాహ్యంబు' లనుసూత్రకృద్వివరణము ప్రస్తుతతద్ధితనిరూపణము సమగ్రము గా దని సూచించుచు సముచితముగా నున్నది.

## ఒంటి

### 15. టివర్ణకం బొండునంత్యవర్ణంబునకు భావంబునం దగు.

ఒండు అనుశబ్దములోనిచివరియక్షర మగుడువర్ణముస్థానమున నాదేశముగా 'టి' యనునక్షర మవు నని సూత్రమునర్థము.

అంత్యవర్ణ మనఁగా డువర్ణ మని వ్యాఖ్యలు పేర్కొన్నవి. కానీ యంత్యవర్ణమునకు ననఁగా డువర్ణములోనిఉకారమున కని యర్థ మగును. ఆదేశ మగుటివర్ణక మనేకాల్లు గావున డువర్ణమునకు మొత్తమున కాదేశ మవు నని సూత్రకర్త యెంచె నేమో. కానీ యంత్యవర్ణంబున కని విశేషముగాఁ జెప్పుటవలన డువర్ణము మొత్తమున కాదేశ మగు నననర్థమును బాధింపఁబడును. 'అంత్యవర్ణంబున' కనుటకంటె 'ఒండు డువర్ణంబున' కనుట యుక్తము. ఇం కొకశబ్దమున కీవిధానము లేదు. అట్టియెడల డువర్ణంబున కనుటలో స్పష్టతయుఁ గల్గును. 'అంత్య' అనుటకు బదులు 'డు' అని చెప్పుటలో నవాంతరప్రయోజనముగా లాఘవము సయితము సిద్ధించును.

సుబో. కడపటియక్షరమున కాదేశముగ 'టి' వచ్చు నని చెప్పుచునే 'ఒండు+టి' యని విడిగాఁ జూపుట సముచితము గాదు.

ఇట ఘం. 'తద్ధితప్రత్యయములు స్వార్థికప్రత్యయములు తప్పఁ దక్కినవి సుబంతములకంటె నిల్చుట శాస్త్రసంప్రదాయము. కావున ఒండులోనిడువర్ణమునకు టివర్ణకము నాదేశముగ విధించుట పొరపా' (202) టని పేర్కొన్నది. ఇందు టివర్ణము సుబంతమునకుఁ జెప్పఁబడలే దనియు నాదేశముగా విధింపఁబడిన దనియు రెండుదోషములు సూచింపఁబడినవి. అనఁగా 'ఒండు' అనునది సుబంతము కాలే దని యీవ్యాఖ్య భావించిన దనవలయును. ఇది సుబంతమె యవుచోఁ

బరముగా విధింపఁబడకపోవుట మాత్రమే ప్రస్తావింపవలెను. ప్రాతిపదికలపై నగుస్వార్థికప్రత్యయములును బరముగా నవునవే కాదా. కావున స్వార్థిక ప్రత్యయములు తప్ప అనుప్రస్తావనము ననుసరించియు నిట ఒండు అనునది సుబంతము గాదు. ప్రాతిపదికయే యైన దని భావించ ననవలెను.

'ఒండు' అనునది ప్రథమైకవచనాంత మగుపదము ఆచ్చి. 24 సూరి దీని నిట్లు చూపియున్నాఁడు. ప్రౌఢ. శబ్ద. 81 వీనిని ప్రథమైకవచనాంతముగా సాధించి యున్నది. ఇందుఁ బ్రాతిపదిక 'ఒక' యనునది. కాఁగా నిట సూత్రకర్త టివర్ణకమును 'ఒండు' అనుప్రథమైకవచనాంతమునకుఁ జేసె నన్నమాట. తద్ధితప్రత్యయములు ప్రథమైకవచనాంతములపైఁ జూపుట శ.ర.లో నాయకుఁడు+కరము (స్పష్టత కి ట్లిచ్చె నేమో) అనురీతిగాఁ గానవచ్చున్నది. ఇట 'ఒండు' అను ప్రథమైకవచనాంత రూపము చూపుట యట్టిదే యనఁదగు.

ఇంక రెండవదోషము ఆదేశముగా జెప్పుట. ప్రత్యయము నాదేశముగా విధించుట సరి కా దని ఘం. తాత్పర్యము. (202)

ప్రత్యయము ఆదేశముగా వచ్చుట నూతన మని తత్త్వ. కూడఁ బేర్కొన్నది. (329) ప్రత్యయ మాదేశముగా వచ్చుట ప్రసిద్ధము గాదు.

ఇది యొక్కటి దోష మయిన నెట్లో సమన్వయింపవచ్చును. కానీ యీలక్షణము నందు దోషము లింకను గలవు.

భావార్థకప్రత్యయమును బ్రథమాంతముపైఁ జేయుట మొదటిదోషము. భావార్థకము షష్ఠ్యంతముపై రావలయును. 'ఒండు'శబ్ద మౌపవిభక్తికము. ఒంటి కన్ను, ఒంటికంబము, ఒంటికాలనె మున్నగురూపము లీవిషయమును స్పష్టము చేయుచున్నవి. ఒంటియొక్క భావ మనుచో యొక్క విభక్తి లోపింపఁగా 'ఒంటి' యని మిగులును. ఇం దంత్యాక్షరము 'టి'. దీనికి టివర్ణము నాదేశించినను 'ఒంటి' యనియే రూప మగును.

'ఒండు' అని ప్రథమైకవచనాంతముగా నిర్దేశించినను నిట మాత్రము ప్రథమైకవచనముననే టివర్ణక మగు నని సూత్రకర్త భావింపలే దనియు షష్ఠ్యంతముపై నవుటయే యాతనియుద్దేశ్య మనియు, ననఁగా ఒండు – ఒంటి యని కాక, ఒంటి యొక్క భావము ఒంటి (ఔపవిభక్తిక మైన'టి'కి తద్ధితప్రత్యయ మైన'టి' యాదేశము)

ఒంటి యని యవు ననియే సూత్రకర్త తలంచె ననియుఁ జెప్పినఁ బైదోష మీ సూత్రకర్తమతమున నుండదు.

కానీ యాతనియభిప్రాయ మది యనుట కాధారము లేదు. పైగా ఒంటి యొక్క భావము అనియే యూహించినచో టివర్ణము శబ్దమునం దుండఁగా మఱల నాదేశింప నేల? భావార్థమునందు ఇప్రత్యయ మవు నని చెప్పినచో, ఒంటి+ఇ= ఒంటి యనురీతిగా నవును. ఇకారము గూడ టివర్ణమునం దంతకు ముందే కలదు గదా యనరాదు. భావార్థమును సాధించుట కే దేని ప్రత్యయమును జూపవలయును గదా. ఇట్లు 'ఇ'ప్రత్యయమును జెప్పుటచే నది పరముగానే యవుటలో నిబ్బంది లేమి నాదేశింపవలసినయవసరము నుండెడిది కాదు.

కాఁగా ఒంటియొక్క అనుదానిపైనే యీప్రత్యయమును సూత్రకర్త యూహింపలే దనుట యుక్తము.

'ఒండు' అనుప్రథమాంతముపైనే యవు నని తలఁచియుండవలె. టివర్ణకమును సాధారణముగా విధించిన నయ్యది పరముగాఁ జేరి ఒండు+టి యని యవును. ఇందు బిందుపూర్వకడువర్ణము డుజ్వర్ణకమే. తద్ధితప్రత్యయపరకత్వమున డువర్ణకాదులకు లోప మవు ననుతద్ధి.1లక్షణము ననుసరించి డుజ్వర్ణకము లోపింపఁగా బిందువు గూడఁ బోవును గావున 'ఒటి' యనియే యవును గాని 'ఒంటి' యని కాదు. అందుకయి విలక్షణముగా 'ఒండు'లోని డువర్ణమునకు 'టి' యాదేశించెను. బిందువును నిల్పుట యాదేశించుటలోనిప్రయోజనముగా సూత్రకర్త యుద్దేశించె ననవచ్చును.

అట డువర్ణకాదు లనుటచే డువర్ణము మాత్రమే లోపించు ననియు జిత్త్వఫల మగుబిందువు లోపింపక నిల్చియే యుండు ననరాదు. డువర్ణకాదు లనుట సరి గాదు. అ ట్లన్నను నాతనియభిప్రాయము బిందువుతో డువర్ణము లోపింపవలయు ననియే. మిండఁడు+త (శ.ర) అనుచో డువర్ణము మాత్రము లోపించి బిందువు నిల్చినచో, మిండఁత, మిండంత యని కావలదా? అందుకే డు జనవలయు నని యాసూత్రముకడఁ దలఁచితిమి.

కాఁగా నీసూత్రకర్తయభిప్రాయము ననుసరించి భావార్థకప్రత్యయమును బ్రథమాంతముపైఁ జేయవలెను. అది సరి కాదు.

అస లిట దీని భావార్థకత్వమును గూర్చి విచారింపవలసియున్నది. బాల. ఒండు అనుదానిని మహదర్థకముగాను, నమహదర్థకముగాను జూపినది. (ఆచ్చి. 24) కానీ ప్రౌఢ. అమహదర్థంబునం గకారాదులకు లోపబిందువులును విభాష నగు (శబ్ద. 8) నని యమహదర్థమునందు మాత్రమే 'ఒండు' అనురూపము సాధించినది. శ.ర.లోఁ గూడ దీని కమహదర్థమును మాత్రమే చూపెను. అట్టియెడల నాతనిమతము ననుసరించి 'ఒం దన నిట ఏకము (ఒకటి) అనియే యర్థము. దానిపై భావార్థమున టివర్ణకము చేయఁగా నేర్పడిన యొంటిశబ్దమున కర్థ మేమి? 'ఏకత్వ మన ఐక్యము అని కావలయును. శ.ర.లో ఒంటి అనుదానికి ఏకాకిత్వ మనునర్థము చూపఁబడినది. (శ.ర.) అట నాయర్థ మెట్లు గుదురును? ఒకదాని తనము = ఐక్య మని కదా యర్థము చూపవలయును.

'ఒండు' కేవలము మహదర్థకమే యని తలఁచుట పొరపాటు. ఒండు, ఒండులు, ఒండ్లు అని దీనిమహదర్థమును సూరి స్పష్టము చేసెను. సూ.ని. కూడ ఒండు ఒకఁ డని మహదర్థమును జూపినది. కానీ ప్రయోగము చూపలేదు.

పెద్దవా రొండ్లు లే రై రేనియు (సౌప్తి. 2. 112) పల్కె దొండులన్ (ఇతరులను ద్రోణ. 4. 209) ఒండ్లవి సొమ్ములు ర మ్మనిన్ వచ్చునె (అర. 4. 347) ఒత్తొరు వొండులవలనఁ బుట్టదు గదా (ఉ. 1. 278) ఒండువరునిం గాంక్షింప నే నేర్తునే (భాగ. 9. 529) దుర్జనుం డొక్కనిఁ జొచ్చి క్రిం దుండఁడు నొండ్లను గీ డొనరింపఁ గల్గినన్ (మను. 3. 50) ఒండ్లకున్ గోచర మట్టి (కర్ణ. 1. 266) ఒండ్లకును రాదు మగుడ్పఁగ (సా. 2. 72) అనురీతిగాఁ బ్రయుక్త మయియున్నది. అన్యార్థమునం దీప్రయోగము లధికముగా నున్నవి.

దైవంబు దప్పించినన్ మరి వే ఱొండుల కెక్కునె (సిం. 10. 102) అనురీతి స్థలమున వే ఱొక్కరికి ననురీతిగా నేకార్థము సుసమన్విత మవుచున్నది. అపు డేకార్థక మగు ఒకశబ్దమురూప మగు నిద్దానికి అసహాయుఁ డనురీతి యర్థమున గలదా? ఒండు – అన్యము, ఏకము. ఏకము – అన్యము, అసహాయము శ.ర. అని చూపుటచే ఒండుశబ్ద మసహాయార్థమున లే దేమో యనిపించును. సూ.ని. కూడ నసహాయార్థము చూపలేదు. కాని తెలుఁగున నొంటిశబ్దము గలదు గదా. దానికి శ.ర. ఏకాకిత్వ మనునర్థము మాత్రమే చూపినది.

కాని సూ.ని. ఒంటి – ఏకాకి, ఒంటరి, అసహాయుఁడు, ఒంటి యనంగను నొప్పు నేకాకియై. (ఆం.భా. 3.25) అతఁ డొంటిగ (సూ.ని.) అని దీని కేకాకి అసహాయుఁ డనునర్థము స్పష్టము చేసినది. ఒంటి, యొంటరి, యొంటిగాఁడు నా నేకాకి అని సూరియుఁ బేర్కొనెను. (ఆం.శ.శా. తత్సమ. 125) ఒండు శబ్దమున కీ యర్థము గానరాదు.

ఒంటిమెయి నుండఁగా ననుచో నేకాకిత్వ మని భావార్థకము. దీనిని శ.ర. స్పష్టము చేసినది. కాఁగా ఒంటి యనునది ధర్మధర్మివాచక మైయున్నది.

ఇంక నసలు ఒంటి యనురూప మేర్పడుట యె ట్లన్నది ప్రశ్న. ఒండు శబ్దమున కసహాయుఁ డనునర్థ మేరును జూపలేదు. కానీ ఒకఁడు అనుదానికి సూ.ని. ఏకాకి అనునర్థము ప్రదర్శించినది. ఒండు అనుదానికి ఒకఁడు అని యర్థము చెప్పుటనుబట్టి యేకాకి యనునర్థము ఒండు శబ్దమునకును గల దని చెప్పవచ్చును. దానితో నిమిత్తమును బ్రస్తుతము లేదు.

అపుడు ఒండు శబ్దమునుండి భావార్థమున ఒంటి యనురూపము సాధింప వలసినయవసరము లేదు. ధర్మవాచకమే కాక ధర్మివాచియు నయినది గదా.

'ఏకా దాకిని చ్చాసహాయే' యని సంస్కృతమున నసహాయార్థమునందు ఏకశబ్దమునకు స్వార్థమున ఆకినిచ్ ప్రత్యయము విహితము. కావున నట్లే తెలుఁ గునను టిప్రత్యయము స్వార్థముననే విధింపఁదగును.

'అసహాయార్థమునం దొకశబ్దమునకు స్వార్థంబున టివర్ణకంబును ముందటి కవర్ణంబునకు బిందువు నగు' నని చెప్పుకొనుట సముచితము. ఇట్లు ఒంటి యనునది ఏకాకి యనునర్థమున సిద్ధింపఁగా దానిపై భావార్థమునందు 'ఇ' ప్రత్యయమును స్వార్థమునందు 'అరి' ప్రత్యయమును నైన వని గ్రహించి, ఒంటరి, ఒంటిగాఁడు ఒంటరిగాఁడు, ఒంటరీఁడు అనురీతి నవు నని యూహింపవచ్చును.

దీనివలన నిం కొకయిబ్బందియు వారింపఁబడును. ఒంటిశబ్దమునకు ఒకఁ డు (ఒక్కటి) లేదా ఒక్కనితనము (ఒక్కదానితనము) అనురీతియర్థము లేదు. అందులకే కావచ్చును. ప్రౌఢవ్యాకర్త 'టివర్ణకం బమహదర్థంబున నొక్కాఁడాదుల డువర్ణంబునకు' (శబ్ద. 82) చెప్పియు నట ఒండుశబ్దమున డువర్ణమునకు టివర్ణ మవుట నుదాహరింపలేదు. ఒంటి (ఒకటి) అనురూపము చూపలే దన్నమాట.

ఇంక నీతఁడు మహదర్థమున 'ఒండు' అనురూపము నంగీకరింపనే లేదు.

కావున అసహాయార్థమునందు మాత్రమే యొకశబ్దమునకు స్వార్థమున 'టి' ప్రత్యయమును విధించుకొనుట సముచితముగా నుండును. ఏకాకిత్వ మను నర్థమునకై మఱల భావార్థమున 'ఇ' ప్రత్యయము విధించుకోవలె.

మొత్తముమీఁద నీవిధానము సముచితము గా దని యంగీకరింపక తప్పదు.

## స్వార్థికములు – అడప్రత్యయము

**6. వేఱున కడవర్ణకంబు స్వార్థంబునం దగు.**

సర్వ. వేఱు అనుపదమునకు అడము అనుప్రత్యయము స్వార్థమునందు చేరు (301) నన్నది. ఇతరవ్యాఖ్యలు స్పృశింపకున్నను ఘం. స్వార్థమున నగుప్రత్యయములు ప్రాతిపదికలమీఁదనే చేరుట సంప్రదాయ (199) (202) మని స్పష్టము చేసినది.

కావున వేఱు అను'పదమునకు' అనుట యుక్తము గాదు.

సర్వ. అడము అనుప్రత్యయము చేరు ననుటయు సరి గాదు. సూత్రకర్త అడ ప్రత్యయ మనుచుండఁగా అడము ప్రత్యయ మనుట యెట్లు?. అడ ప్రత్యయాంత మైన వేఱడ యనుతద్ధితప్రత్యయాంతము ప్రాతిపదికము కాఁగాఁ బ్రథమైకవచనమున ముప్రత్యయము చేరుటచే 'వేఱడము' అని యవును. అడ అనుతద్ధితప్రత్యయముపై విభక్తివివక్ష (మువర్ణకాదు లగుటయు) కుదురదు.

నల్లతనము అని యైనపిదప నుగాగమము చెప్పుసందర్భ మగుటంజేసి సూరి తనంబు పరం బగునపు డన్నాఁడు. అక్కడ నైనను దద్ధితప్రత్యయము తనము కాదు. కావున 'అడము ప్రత్యయ మనవచ్చు' ననరాదు. (ముపర్ణక మచ్చుపొరపాటున జేరిన దన్న వేఱడ యనుప్రాతిపదికముపై ముపర్ణక మవుటను బేర్కొనవలెను.) దానిని సర్వ. ప్రస్తావింపలేదు.)

సుబో. అమహ త్తగుటవలన ముప్రత్యయము (233) అగు నన్నది. తత్త్వ. (325) ఇట్లే చెప్పినది. అమహ త్తగుటచే ముప్రత్యయ మయ్యె ననుట సరి కాదు. ఆచ్ఛికశబ్దముల కమహత్త్వమునుబట్టి బల్లిదాదులకుఁ దప్ప ముపర్ణకము రానేరదు (బా.సూ). ఇంక 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ..' నను నసూత్రముచేఁ గ్లీబసమత్వము రాఁగాఁ గ్లీబసమ మవుటంబట్టి ముపర్ణకము వచ్చిన దనవలయును.

కు.పం., ఘం. దీని క్లీబసమత్వమును గూర్చి పేర్కొనకయే తత్స. 39 సూ.చే. మువర్ణకము వచ్చు ననుటలో నమహత్త్వమునుబట్టియే చేయఁబడినదేమో యని యనుమానించుటకు నవకాశము గలదు. అ ట్లయిన నది కుదురదు.

## అడి వర్ణకము

**7. వెల్ల కడివర్ణకంబు స్వార్థంబునం దగు.**

వెల్ల శబ్దమునకు స్వార్థమునందు 'అడి'ప్రత్యయ మై, ప్రథమైకవచనము లోపింపఁగా వెల్లడి యని యేర్పడు నని సూత్రకర్తయభిప్రాయము. అజాదితద్ధితప్రత్యయములు పర మగునపు డీసంధి యెల్లెడ నిత్యముగా నగు నని తత్త్వ. (325) పేర్కొన్నది. అంద్వవగితరాపదముతొలియచ్చు పర మగుచో సంధి నిత్యమే కద.

కు.పం. ఇట డివర్ణక మనినను జాలు (130) నన్నది. వెల్ల అనుదాని కొక్కదానికి మాత్రమే యీప్రత్యయమును విధించుటచేతను 'వెల్ల' యనుదానిలో నెట్లును నత్వమును గలదు గనుకను, దానిని బ్రత్యయమునందు నిబంధించుట యనవసర మనుట యుక్తమే. వెల్ల+డి వెల్లడి అని సులువుగా రూపసిద్ధి యవుచుండఁగా నడిప్రత్యయ మని చెప్పి, మఱల నపదాదిస్వరసంధి చేయవలసినయవసరమును గొనితెచ్చుకొను టేల? సుబో.ప్రభృతవ్యాఖ్య లీకు.పం.అభిప్రాయమును బరామర్శింపలేదు. కానీ డిప్రత్యయ మనఁదగు ననుకు.పం. ఉద్దేశ ముచితమే.

ఘం. సూత్రము వ్యర్థ మని సూచించినది. వెల్ల–తెల్లనిది, ధవళము, వెల్లడి బయలు, ప్రసిద్ధి. కాఁగా వెల్లకు వెల్లడి యనునర్థము లేదు (ఘం.199).

వేఱడము అనుచో వేఱు+అడ (ము) శ.ర. అని చూపినట్లే వెల్లడి యనుచో వెల్ల+అడి అనురీతిగా శ.ర. విభాగింపలేదు. వై.దీ.లో వళక్షశబ్దభవముగా వెల్లను (106) మాత్రమే చూపెను. తెల్లనిది, ధవళము అని యర్థము చూపెను. ప్రస్తుత మగు 'వెల్లడి' యనుచో బయలు, ప్రసిద్ధి యనురెండర్థములకును బైని ప్రకృతిశబ్దార్థము కంటె భిన్న మగునర్థమును దెలుపు (సం.పట్టిక) గుర్తు లుంచుటచే నీయర్థములు దెలుఁగున విశేషము లగుట స్పష్టము. కాఁగా వెల్లడి యనునదియు వళక్ష శబ్దభవమే యనియు నిది ప్రకృతిభిన్నార్థము గల్గియున్న దనియుఁ జెప్పుట యుద్దేశ మనవలె.

కానీ వెల్లశబ్దమున కీయర్థము లేకుండుటయే కాక వెల్లడి శబ్దమునకు వెల్ల

యర్థమును లేకుండుటచే నీయది వెల్ల శబ్దమునుండి యేర్పడిన దనుట కానీ, వెల్ల శబ్దము వళక్షశబ్దభవ మని గాని భావించుట సమంజసముగాఁ గానరాదు.

వెలి శబ్దమునకు బయలు అనునర్థము శ.ర. చూపినది. వెలువడు ఇత్యాదుల లోను బూర్వావయవము వెలిగానే చూపినది. వెలిశబ్దముపైఁ జేయుద మన్న నాయర్థమున నీయది దేశ్యము. వెల్లడి వైకృత మని గదా. శ.ర. పేర్కొనుచున్నది. వైకృత మైనపుడు వెలిశబ్దము వెల్లశబ్దమునర్థమే కలదు. ద్విత్వ మెట్లు? వెల్లి శబ్దమున కీయర్థము లేదు. కావున వైకృతముగాఁ జూపిన శ.ర. ననుసరించి వెల్ల యనునిది ప్రత్యయపూర్వభాగము కావలె. లేదా వెల్లడి యనునది వెల్ల+అడి యనురీతిగా విభాగింప రానియొకే శబ్దముగా నైన భావింపవలెను. కానీ వేఱడము మొద లగు చోట్లనుబట్టి యిట శ.ర. కర్త విభాగించి చూపలేదు. కావున వెల్లడి యనుచోఁ దద్ధితప్రత్యయము లే దని నిర్ణయింపలేము. కాఁగా వళక్షశబ్దభవ మైన వెల్ల (వై.దీ. 106) అనుదానిపై అడి ప్రత్యయము చేరి వెల్లడి అని యైన దను ప్రౌఢ. అభిప్రాయమునకు శ.ర. విరోధింపదు. కానీ యీవైకృతశబ్దములో నర్థము మాఱిన దని వ్యాకర్త భావించియుండవచ్చును. అ ట్లర్థము మాఱునపుడు స్వార్థమునం దగు నని చెప్పుట భిన్నము.

కావున స్వార్థమునం దగు ననుట సమర్థింపరాకున్నది.

సూ.ని. వెల్లడి శబ్దమే చూపలేదు.

కాఁగా వెలిశబ్దముపై నడిప్రత్యయము చెప్పి, లకారమునకు ద్విత్వము చెప్పుకొనుట యొకమార్గము. లేదా వెల్లడి తద్ధితాంతము గాని ప్రత్యేకశబ్ద మని తలంచుట యొకమార్గము.

సూత్రాంధ్రమున సూరి 'స్వార్థే సందో రడిః. వ్యతిరేకే ఇతి వర్తతే. మందా న్మందురాయామ్. మందడి వెల్లడి ప్రభృతయః' అని పేర్కొనెను (తద్ధి. 40) మంద దేశ్య మనియు మందడి వైకృత మనియు శ.ర. కావున వెల్లడి యనుచో అడి స్వార్థమునం దయిన దని సూత్రాంధ్రమునుబట్టి యూహించె నేమో. కాని యట సూరిలక్షణము అడి ప్రత్యయ మనుట కాధార మైనను వెల్లశబ్దమో, స్వార్థమం దైనదో నిర్ణయించునదిగాఁ గానరాదు. వెలి శబ్దమునకుఁ బైని జేర్చి లకారద్విత్వము చేయవలయు నని సూరి యెంచె నేమో. ఆధారము గానరాదు.

మొత్తముమీఁద వెల్లకు స్వార్థమునం దడి యవు ననుట మాత్రము సముచితము గా దనుట యథార్థము.

ఇట సర్వ. వెల్ల పదమునకు ప్రాతిపదికార్థమునందు అడి యనుప్రత్యయము కలుగు నని (301) చెప్పుట సరి గాదు. వెల్ల ప్రాతిపదికపై ననుట యుక్తము. సంజీవనీవ్యాఖ్యయు సూత్రమునందలియనౌచిత్యమును బ్రస్తావింపలేదు.

## ఇడి ప్రత్యయము

### 8. తెలివి విరివి వినికి లేమి రాపులకు స్వార్థంబునం దిడి వర్ణకం బగు.

తెలివి, విరివి, వినికి, లేమి యనుప్రాతిపదికలపై 'ఇడి' ప్రత్యయము రాఁగా తెలివిడి యిత్యాదిగా నవును. రాపు ఉదంత మగుటచే ఇడి ప్రత్యయ మనవలె నని కు.పం. పేర్కొనుట (130) యుక్తముగా నున్నది. 'ఇడి అనవలయునే కాని 'డ' యన్నం జాల' దని యదంతముగా నట నుంట యచ్చుపొరపాటు. 'డి' యని యుండఁదగును. 'రాపు' అనునది యిందుఁ జేర్పవలసినయవసరము గానరాదు. (కృదంత. 2) అపుడు 'డి' ప్రత్యయ మన్నంజాలును.

ఇడిప్రత్యయముం గూర్చి తత్త్వ. ఇడివర్ణకమును వే ఱొకయర్థమున బాల. విధించెను. కాని స్వార్థమున విధింపలే (326) దన్నది. అర్థమే కాదు. ప్రత్యయము నది భిన్నము. అభావద్యోతకముగా మతుబర్థమున సూరి విధించిన యిఁడి ప్రత్యయము ఖండబిందుసహితము. వాలిండి, వీఱిండి యనియు నట రూపము లుండును. స్వార్థమున నీవ్యాకర్త చెప్పిన 'యిడి' ప్రత్యయము ఖండబిందురహితము (సర్వ. 302). కావున నివి రెండు స్వరూపమునందును భిన్నములు. స్వార్థమునందుఁ జెప్పఁబడినయీప్రత్యయములను వరుసలోఁ జూపక సర్వ. ఇఁడి ప్రత్యయవిధాయక సూత్రమునకుఁ బిదపఁ (బాల. తద్ధి. 24) జూపుట యుక్తముగా లేదు. మధ్యలో నది తెచ్చి పెట్టవలసినయవసరము లేదు.

స్వార్థమునందుఁ జెప్పఁబడినవి కావున తెలివి – తెలివిడి ఇత్యాదు లగు నీయవి సమానార్థకములే. కానీ ఘం. తెలివి – తెలివిడి శబ్దములకుఁ గొంత యర్థభేదము కల దని చెప్పినది. శబ్దరత్నాకరమే యిట్టియీషదర్థభేదమును జూపినది ఇ ట్లర్థము కొంత మాఱుట విశేషము గాదు. 'రాయు'నుండి యేర్పడిన 'రాయిడి'కి

ఉపద్రవ మనునర్థము విశేషమే. ఘం. అయుక్త మనకుంట యుచితముగా నున్నది.

ఈశబ్దములను దద్ధితాంతము లనుటకంటెఁ గృదంతము లనుటయే లాఘవ మేమో యనిపించుచున్నది. శ.ర.లో వినికి+ఇడి=వినికిడి. స్వార్థము. ఇడి విరివి+ఇడి =విరివిడి. స్వార్థమున ఇడి. అని రెంటికి జెప్పియును, తెలివిడి కేలొకో చెప్పలేదు.

విరివి యనునది విరియు అనుధాతువునుండి యేర్పడినట్లు సూ.ని. పేర్కొన్నది. శ.ర. ప్రభృతులు వీనికిఁ బ్రయోగములు చూపలేదు. ప్రసిద్ధము లని యుపేక్షించి యుండనవు.

ఇ ట్టీరూపము లంగీకార్యముల. కానీ వీనిపై 'వి' అనుకృత్ప్రత్యయము చేసియుఁ బైని స్వార్థమునం దిడి ప్రత్యయము చేయు టేల? తెలియు విరియు ధాతువులపై విడి ప్రత్యయము కృత్తుగాఁ జెప్పికొనవచ్చును. వకారము పర మైనది కావున ఇటం గృత్కగతపవేము (బాల.కృ.2) లను సూత్రముచే యువర్ణము లోపించి తెలివిడి, విరివిడి యని యవును. విప్రత్యయ మైన తెలివి, విరివి, యనియు నవును. రెండును వేఱ చెప్పుట దొసఁగును గాదు.

'ఇక వర్ణకం బంజ్వాదుల' కని కోరిక సాధించిన సూరి 'కోరికి' సాధించుటకు 'ఇకి కోర్వాదులకు' విధించెనే కదా. ఇవర్ణకము స్వార్థమునఁ దద్ధితముగా నవు నని చెప్పలేదు.

ఇడి ప్రత్యయాంతము లన్నను నర్థభేద మెట్లును లేదు. స్వార్థమునందే యవు నని మఱలఁ దద్ధితముగాఁ జెప్ప నేల? కోరునకు ఇకి, ఇక, లైనట్లే తెలియు విరియులకు వి, విడి లవుటలో విరోధము లేదు.

విను ధాతువుపైఁ గృత్తుగా కిడి ప్రత్యయ మన్న 'ఇత్వంబు గాని యెత్వంబు గాని' యను సూత్రముచే నిత్య మై, వినికిడి కృదంతముగా సిద్ధించును. ఇకి ప్రత్యయ మైన వినికి.

## ఇతవర్ణకము

**9. ఇతవర్ణకం బింపు బిగు పోరులకు స్వార్థంబునం దగు.**

ఇంపు మొద లగువానిపై ఇతవర్ణకము రాఁగా ఇంపిత యిత్యాదిగాఁ గాఁగాఁ గ్లీబసమత్వమునుబట్టి మువర్ణక మై, 'ఇంపితము' ఇత్యాదిగా నవును.

ఇందు బిగు శబ్దమునకు ఇత చెప్పుటను గూర్చి కు. పం. 'బిగువు శబ్దమునకు గడ(వాలు లోపించు ననియుఁ జెప్పనగు. ముపర్ణకాగమము మీఁద వ్యాఖ్యాతము (150) నన్నది. ముపర్ణక మాగమ మనుట సరి కాదు.

సర్వ. ఇట దిగు అన్నది తద్ధితవృత్తియందు అంత్యాక్షరము లోపింపఁగా మిగిలిన బిగువుశబ్దముయొక్క రూపము. బిగు+ఇతము=బిగితము (303) అన్నది. తద్ధిత వృత్తిలో నైనను నంత్యాక్షరము లోపించుట యెట్లో వివరించియుండవలసినది. ఆవిషయము ప్రసిద్ధము గాదు గదా.

ఘం. బిగుశబ్దమునకు బదులుగా సూత్రమునందే బిగిశబ్దమును జూపినది. ఇంక నేవ్యాఖ్యయందు నీపాఠము గానరాదు. శ.ర.లో బిగువు రూపాంతరముగా బిగి చూపఁబడినది. అంతే కాక బిగిత మనుచో బిగి+ఇతము అని బిగిశబ్దమునే చూపెను. కావున నిందును బిగిశబ్దమునే చూపుట సూత్రకర్తకు నిష్ట మనవచ్చును. శ.ర. అందు కాధారము.

బిగి శబ్దము ప్రసిద్ధమే యగుటచే దానిని గ్రహింపఁగా నింక నంత్యవర్ణలోప ప్రసంగమే యవసరము కాదు.

ఇవి యమహత్తు లగుటచే ముపర్ణక మగు నని సుబో. (234) సుగమ. (203) పేర్కొనుట సరి కాదు. క్లీబసమత్వముచే ముపర్ణక మయ్యె ననుట యుక్తము.

వీనికిని స్వార్థమునందే చెప్పఁబడినది.

కాఁగా వీనిని గూడఁ గృదంతములుగనే సమన్వయింపనవును.

పోరు ధాతువుపై ఉవర్ణకము కృ త్తయి, మఱల స్వార్థమున 'ఇత' తద్ధితముగా వచ్చిన దన నేల? పోరుధాతువుపై ఇత ప్రత్యయమును గృత్తుగాఁ జెప్పినచో నీ తద్ధితకల్పన మవసరము కాదు.

బిగియు ధాతువుపై ఇతప్రత్యయమ యైనచో యకారలోపము రాదు. ఇమి పర మైనపుడే కాని యికారము పర మయినపుడు యలోపము రాదు కదా. కానీ బిగి యనునది సయితము బిగియు ధాతుజన్యమే. (సూ.ని.) చేయి, వ్రాయి, ఇత్యాదులలో లోపించుట లేదు. కావున విధింపవలసినదే. కావున బిగియు ధాతువునకు ఇ, ఇత ప్రత్యయములును, యలోపమును విధించి కృదంతముగా సాధింపఁదగును.

ఇంచు ధాతువుపైఁ గూడ నిట్లే కృత్తుగా 'ఇత' ప్రత్యయమును, చకారమునకు బకారమును విధింపఁదగును.

## ఇరివర్ణకము

**11. స్వార్థంబునం దిరివర్ణకంబు వాఁపున కగు.**

వాఁపు+ఇరి = వాఁపిరి అని యవును. తత్త్వ. సర్వ. వ్యాఖ్యలు వాపు, వాపిరి యని వీనిని నిర్బిందువులుగాఁ జూపుట యుక్తము గాదు.

వాఁచుధాతువున ఖండము గలదు. (శ.ర.) వాఁపిరి. వాఁపు+ఇరి అని శ.ర. దీనిని సబిందుకముగాఁ జూపినది. నిర్బిందుక మగువాపుశబ్దమున కర్థము వాయింపు. దానికి వాపిరి అనురూపము లేదు. (సూ.ని.)

వాచు ధాతువున కిరి ప్రత్యయమును, నగుచోఁ బకారంబు చకారంబున కగు ననియుఁ జెప్పుట యొప్పు ననిపించు. అపు డిది కృదంతముగానే సిద్ధించు. వాచుధాతువుపై పువర్ణము కృత్తుగాఁ జేరి దానిపై స్వార్థమున 'ఇరి' చేరిన దనుట గౌరవము కదా. వాఁపు, వాఁపిరి యనునవి రెండును గృదంతములుగానే సిద్ధించును.

## మిరి వర్ణకము

**14. చలికి మిరి వర్ణకంబు స్వార్థంబునం దగు.**

చలిమిరి. ఆం.శ.శా. చలిమిరి, చలిమిడి ,చలువ, శీతంబు అని చెప్పినది చలిమిడికి శ.ర. సూ.ని. నీయర్థము చూపలేదు. చలువ యనుదానిం గూర్చి ప్రౌఢ. పేర్కొనలేదు. ఉవప్రత్యయ మిట స్వార్థమం దైన దనవలెను.

## ఇదవర్ణకము - స్వార్థమతుబర్థములు

**10. ఇదవర్ణకం బొప్పుతప్పుపెల్లులకు స్వార్థంబునందును, క్రొవ్వుబెట్టులకు మతుబర్థంబునందును నగు.**

స్వార్థమందలి 'ఇద' ప్రత్యయాంతము లీయవి క్లీబసమము లవుటచే ముపర్ణక మందును. మతుబర్థమునం దయినపుడు బెట్టిదశబ్దము బల్లిదాదులలోనిది గావున బెట్టిదుఁడు, బెట్టదురాలు అనియు నాయైయర్థములం దవు.

పల్మఱు బెట్టు సూపినన్ క్రౌర్యము, లోకము వెఱచుట బెట్టిదంబు గలుగుట జుమ్మి క్రౌర్యము (సూ.ని., శ.ర.) అనుచో బెట్టు, బెట్టిదము సమానార్థకము లై యుండుట గమనింపఁదగును. అనఁగా బెట్టు శబ్దముపై నిద ప్రత్యయము స్వార్థమునందు నయినది. బెట్టుశబ్దము బల్లిదాదులలోనిది గావున బల్లిదము బల్లిదుఁడు, బల్లిదురాలు అనురీతిగా బెట్టిదము, బెట్టిదుఁడు, బెట్టిదురాలు అనురీతిరూపములలో నీరీతి యర్థ ముండుట సహజమే. సూరి సూత్రాంధ్రమున ఒప్పిదము, క్రొవ్విదము, బెట్టిదము, పెల్లిదము, ఎల్లిదము అని చూపెను. దానింబట్టి ఒప్పిదము, పెల్లిదము అనువాని నడుమ నున్న క్రొవ్విదము, బెట్టిద మనునవి స్వార్థికతద్ధితాంతములే యని సూరి తలఁచె ననవచ్చును. లేనిచో వానిని వేఱుగా మతుబర్థముతో నిరూపించెడివాఁడే కదా.

క్రొవ్వు శబ్దమునకు నిట్లే క్రొవ్వు = బలుపు. తామ్రచూళికలక్రొవ్వు (సూ.ని.) క్రొవ్విదము=బలియుట, బలుపు. చన్నులక్రొవ్విదంబు (సూ.ని.) అని సమానార్థకత్వము నిరూపితము. అట్టియెడల నిట నిదప్రత్యయము స్వార్థమునందే యవుట స్పష్టము. దుష్కార్య మనునది లక్షణచే సిద్ధించునర్థముగాఁ గుదురు. కావున క్రొవ్వు బెట్టులకును స్వార్థమునందే యిద ప్రత్యయ మవు ననుట యుక్తము. ఇట్టియెడఁ గ్రొవ్వుధాతువుపై నిది కృత్తుగాఁ జేయుట యుక్తము.

## కార ప్రత్యయము – స్వార్థభావార్థములు

**13. కారవర్ణకంబు చెలినయములకు భావంబునందును, నుడికొలతలకు స్వార్థంబునందు నగు. ఈకకారమునకుఁ గొన్నియెడల గకారం బగు.**

సుబో. సూత్రమునఁ గొలతకు బదులుగా 'కొల' యనియే చూపి, యిది తవర్ణము లోపింపఁగా మిగిలినరూప మన్నది (235). సుగమ (205) దీని ననుసరించినది. మిగిలినవ్యాఖ్య లెల్ల గొలత యనియే సూత్రమునఁ జూపినవి.

అది య ట్లుండఁగా కొలత యనురూప మేర్పడుట యెట్లు? ఇది కొలుచు ధాతువునుండి యేర్పడినట్లు సూ.ని. చూపినది. తజ్వర్ణకము చేసిన బిందు వుండవలయును. ఇట బిందువు లేదు. ఆవులించు లోనగువానిలోఁ జేర్చి తవర్ణకము చేసిన ధాతువు కొలుచు అని యుకారమధ్య మవుటచే కొలుత యని యవును గాని

కొలత యని యకారమధ్య మేర్పడదు. తజిప్రత్యయము విధింపఁబడి చకారము నకు వకార మైన కొలువత కావలె. కాఁగా తప్రత్యయమును, ముం దత్వమును జెప్పుకొనవలె. దానిని బాల. కానీ, ప్రౌఢ. కానీ నిరూపింపలేదు.

సుబో. కొలఁత యని ఖండబిందువును జూపినది (235). కొలుచు ధాతువులో ఖండబిందువు లేదు. శ.ర. కానీ సూ.ని. కానీ దీనిని బిందుసహితముగాఁ జూపలేదు. కావున నది పొరపాటు.

మొత్తముపైఁ గొలత యనురూపమును సాధింపకయే దానిపైఁ దద్ధితప్రత్యయ మిట నుడవఁబడినది.

చెలినయములకు భావార్థమందును, నుడికొలతలపై స్వార్థమందును గార ప్రత్యయము నీసూత్రము చెప్పుచున్నది.

ఇందుఁ జెలికారమును సూరి మగఁటిమ్యాదులల జేర్చెను. (బాల.తద్ధి.8.) ఇటఁ బ్రసంగవశమున మఱలఁ జెప్పబడినట్లు ఘం. (201) పేర్కొన్నది.

నయగార మనుదానిప్రక్రియలోని నయయొక్క కారము అని యుండ 1.సూ.చే. విభక్తి లోపించినట్లు పేర్కొన్నది. నయయొక్క అనిచూపుట సరి కాదు. యొక్క ప్రత్యయము పర మగుచుండఁగా ముగాగమము రావలయును గదా. యొక్క ప్రత్యయము చేసి ముగాగమము చేయకముందే కారప్రత్యయ మగు నని చెప్పవలయునా?

సూరి యట నగ్గలికంపుఁదన మని చూపెను. ఆగ్గలిక(ము)యొక్క భావ మనురీతిగా ముగాగము చేయకున్నచో అగ్గలికంపుఁదన మని పుంపు లగుట యెట్లు? భావార్థకమునందు తన ప్రత్యయ మగునపుడు ముగాగము నీవ్యాఖ్యాతయే యటఁ జూపెను. అదే భావార్థమున కారప్రత్యయ మవుచుండఁగా ముగాగమము రాకముందఱిరూపమును జూపుట యెట్లు?

కాగా నయముయొక్క అనియే చూపవలసియున్నది. ముగాగమ మెట్లు లోపించు నన్నది ప్రశ్నము. అగ్గలిక యనురూపసాధనమున నీఘం. అగ్గలముయొక్క + ఇక అని యుండ నిక్కలాదిసూత్రముచే ములోప మవు నని (బాల.ఘం.258) పేర్కొన్నది.

అట్లే ప్రస్తుతస్థలమునొద్దను నయముయొక్క కార అనుచో నిక్కలాదిసూత్రముచే గాకున్నను 'ఆచ్ఛికసమాసంబులందు' నను ప్రౌఢ. లక్షణముచేతను సాధింపవచ్చును

గదా. ఇట నట్టియిబ్బందియు లేదు. ప్రౌఢ.తద్ధిత.1 సూత్రముచేతనే యొక్క లోపించు నని వ్యాఖ్య పేర్కొన్నది. అందు డువర్ణకాదు లనుచోటి యాదిశబ్దముచేత ముగాగమము లోపించు నని చెప్పిన విరోధము గలుగునా?

బాలవ్యాకరణమం దయినను నిక్కలాదిసూత్రముచే ముగ్లోపమును జేయవలసిన యవసరము లేదు. 'సమాసవిభక్తికి లోపం బగు' ననుసూత్రముచేతనే యొక్క ప్రత్యయముతోపాటు ముగాగమము సయితము లోపించును. సమాసవిభక్తి కనుచో విభక్తిమువర్ణమునకు లోపము చెప్పఁగా నాగమమువర్ణ మెట్లు లోపించు ననుసంశయ మక్కఱ లేదు. మువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమమునకు నవును గదా. అందము కా (బాల. ఘం.262) అనుచో మువర్ణకము లోపించినట్లే యిట ముగాగమమును లోపించును. అగ్గలముయొక్క+ఇక=అగ్గలిక. చుట్టముయొక్క+ఱిక=చుట్టఱిక మనురీతిగా నయముయొక్క+కార=నయగార మని యవును.

అగ్గలికంపుఁదన మనుచో ముగాగమము లోపింపలేదు. కానీ య ట్లిట లోపింప దనుభయము లేదు. భావార్థస్థలమే యైన 'చుట్టఱిక' మనుచో లోపించినది గదా. 'ఉదంతస్త్రీసమంబులకును బుంపులకు' (సంధి.35) ననుసూత్రము తనము పర మగునపుడు పుంపులకు నుగాగమము చెప్పినది. కాఁగాఁ దనప్రత్యయపరకత్వమున ముగాగమమునకు లోపము రాక, పుంపులే యవు ననువిషయము జ్ఞాపిత మవు చున్నది. కావుననే యందగాఁడు, మతకరి, ఒయారి యిత్యాదులలో మువర్ణక మునకుఁ బుంపులస్థితి లేదు. కావునఁ దనప్రత్యయపరకతయందు మాత్రమే తద్ధిత వృత్తిలో ముగాగమమునకుఁ బుంపు లవు నని గ్రహింపవచ్చును. ఊడిగంపు గత్తెలు, ఊడెపుగత్తెయో యనన్ (సిం.8.144) అనుక్వాచిత్కప్రయోగములు విలక్షణములుగా గర్తింపఁదగియున్నది. కాఁగా సమాసవిభక్తి కనుసూత్రముచేతనే ముగాగమము లోపించు ననుట కెట్టియవరోధమును లేదు. అగ్గలిక, అగ్గలికపుఁ దన మనుసూరిలక్ష్యములే యాయంశమును నిరూపింపఁజాలుచున్నవి. కావున దీనికై నిక్కలాదిసూత్రాశ్రయణ మవసరము కాదు.

నయయొక్క అని చూపుట సరికాదు. కు.పం. నయము కొలతశబ్దములకు అంత్యవర్ణలోపమును (131) అని పేర్కొన్నది. కానీ యీవాక్యము నయము+కార అనురీతిగా దానిని బ్రథమాంతముగా నూహించె నేమో యనిపించును. ప్రథమాంతమే

యగుచో ప్రౌఢ. తద్ధి. 1. సూ. చేతనే లోపము చేయఁదగియుండ నావ్యాఖ్య యంత్య వర్ణలోప మని విశేషముగాఁ జెప్పఁబూనుట యనవసరము.

తద్ధి. 1 సూ. అవసర మని భావించినవీరు డువర్ణకాదు లనుచోటియాది పదముచేత నయముయొక్క యనుచో ముగాగమమును, కొలతలోని తవర్ణమును లోపించు నని చెప్పవచ్చునే కదా.

నయముయొక్క స్వభావము అనునర్థమున నయము+కారము అని యుండి మువర్ణకమునకు లోపము రాఁగా నయ+కారము అని యగు (305) నని సర్వ. నయముయొక్క భావ మని చెప్పుచునే నయము అని ప్రథమాంతమును జూపుటయు మువర్ణకము లోపించు ననుటయు, నసంగతములు. శ.ర.లో నీసూత్రకర్త నయము+కారము అని చూపెను. అయ్యది స్పష్టతకై చూపఁబడిన దనవలెను. ఇట్లే చుట్టము+ఱికము. కానీ యాతఁడు నచ్చటఁ బ్రథమాంతమే యుద్దేశించె నన్న నయ్యది పొరపా టనక తీఱదు. నిఘంటవు లట్లు చూపుటను స్పష్టత కని గుర్తింపఁదగును.

సుగమ. నయ+కార+ము (205) అని చూపెను. ఇందు విభక్తి లోపించిన దని యావ్యాఖ్య భావించె నేమో. నయ యనునది ప్రాతిపదికము. ప్రాతిపదికముగనే చూపినపక్షమున నది యసంగతము.

నయముయొక్క+కార=నయగార మని యైన దనుట చుట్టఱికమునందువలె సముచితము.

ఈనయగారమును సూరి మగఁటిమ్యాదులలోఁ జేర్చి చూపలేదు. చేర్చుకొన వచ్చును.

ఇంక నుడిపై స్వార్థమునఁ గారప్రత్యయము విహితము. నుడి యన్నను నుడికార మన్నను నర్థ మొకటే యని తత్త్వ. (328) సర్వ. (305) స్వార్థమునందు విధించుటను సమర్థించినవి. కాని ఘం. 'కారప్రత్యయము నుడికొలతలకు స్వార్థమున నయ్యె ననుట సరి కాదు. నుడి=మాట, నుడికారము= మాట చమత్కారము'. సూత్రకర్తయే శ.ర.లో నీయర్థభేదమును బేర్కొనెను. మఱి యిట స్వార్థమునం దైన దనుట విశేషము.

కానీ సూ.ని.లో నుడికారము– పలుకు, మాట యని నుడిశబ్దార్థము సయితము

చెప్పఁబడినది. 'నుడుగు నుడువు, నుడి నుడికారము, నొడువు నొడి, నొడికారము నాఁగఁ బద మొప్పు' అనుఆంధ్రభాషార్ణవప్రమాణమును జూపినది.

కాఁగా నుడికారమునకు నుడి యనునర్థమును గల దని యంగీకరింపవచ్చును. కానీ నుడికారమునకు మాటచమత్కారము, మాటతీ రనురీతియర్థములును గలవు. కావున నుడి (నొడి) శబ్దములపైఁ గారప్రత్యయము స్వార్థమునందే కాక భావార్థము నందును నవుచున్నది. మాటతీరు, మాటస్వభావ మని యర్థ మవును.

ఆం.భా. ననుసరించి నుడి, నుడికారములు పర్యాయము లని యీ సూత్రకర్త యెంచెనా? శ.ర.లో నీఆం.భా. నుదాహరింపక పోవుటే కాక, నుడికారమునకు నుడి యనునర్థమే యీయలేదు.

నుడికారమునకు నుడి యని యర్థము చెప్పిన సూ.ని. మాటచమత్కార మను నర్థమునకుఁ బ్రమాణముగా సూత్రకర్త చూపిన 'నుడికారము సొంపెసలార' ననుప్రయోగమే చూపినది. ఇట నుడికార మనుదానికిఁ గేవలము నుడి యను నర్థము గల దనుట యుక్తముగా లేదు. పలుకునుడికార మనునది యిం కొక ప్రమాణము సూ.ని చూపినది. ఇటఁ గూడ నుడి యనునర్థమును మాత్రమే యీయదు. పలుకునుడికార మనఁగాఁ బలుకునందలిభాషాస్వభావ మనియే యర్థ మగు. 'ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు పలుకునుడికారమున నాంధ్ర భాష యండ్రు' అనుచోఁ బ్రౌఢి యనుగుణమునుబట్టి సంస్కృత మందు రనియుఁ దెలుఁగుభాషాస్వభావానుగుణ మగువిన్యాసమునుబట్టి తెలుఁ గందు రనియు నర్థము చేయఁదగును. కేవలము పదపర్యాయమే యైనచో నీయది తెలుఁగును సంస్కృతము నని యను టెట్లు? తెలుఁ గయినను సంస్కృతప్రౌఢిమనుబట్టి సంస్కృతమే కాని తెలుఁగు గా దని కొంద ఱనఁగా సంస్కృతప్రౌఢి యున్నను దెలుఁగువాక్యము తీరునుబట్టి, తెలుగుభాషాస్వభావసిద్ధ మగులక్షణమునుబట్టి యాంధ్ర మందు రని తాత్పర్యమును గ్రహింపఁదగును. అనఁగా సంస్కృతపదప్రచుర మైనను వాక్యముతీరు తెలుఁగుభాషాసహజమే యనియు నర్థము. కావున నిటఁ గూడ నుడికార మన్నది పదపర్యాయము గానేరదు.

ఇట్లు పరిశీలింపఁగా నుడికార మనుదానికిఁ గేవలము నుడి యనునర్థ మప్రసిద్ధ మనుట స్పష్టము.

కావున నుడికి స్వార్థమునందుఁ గారప్రత్యయము వచ్చు ననుట యుక్తము గాదు. ఇంక నుడియొక్క స్వభావము, మాటతీరు అనురీతిగా నుడికారమునర్థము గ్రహింపవచ్చును. పల్కునుడికారపుమాట లనురీతివ్యవహారమునందు నిట్టిదే గదా యర్థము. కావున స్వార్థ మనుట సరి గాదు.

నుడువుధాతువునుండియే (నుడువు, నొడువు) నుడి శబ్దమును సాధింపఁదగును. ప్రత్యేకవిధాన మవసరము.

వ్యాఖ్య లన్నియు కొలగార మనుచోఁ గారప్రత్యయము స్వార్థమునం దయ్యె ననుటను దిరస్కరించినవి. కొలత యనఁగాఁ గొలుచుట యనియుఁ, గొలగార మనఁగాఁ గొలత కిచ్చినకూలి యనియు శ.ర., సూ.ని పేర్కొన్నవి. కావున దాని ననుసరించియు నిట స్వార్థమునం దవు ననుట యుక్తము గాదు. కొలగారము ధాన్యాదుల కొలిచినందుల కిచ్చుకూలి. శ.ర. బ్రౌ. కొలుచుట కొలత. బ్రౌ. సూ.ని. కూలి యనునర్థమునకు శ.ర. బ్రౌ. నిఘంటువులె యాధారము. కొలగారము (హం.4.84) అనుప్రయోగము గలదు.

బ్రౌణ్యనిఘంటువు కొలగార మనుదానికి కొలత యనునర్థమును సయితము చూపినది. కాఁగాఁ బ్రౌఢ. యీబ్రౌణ్యనిఘంటువు నాధారముగాఁ జేసికొనియే కొలతకు స్వార్థమునఁ గారప్రత్యయము చెప్పిన దేమో. కానీ శ.ర.లో మాత్ర మీయర్థమును జూపలేే దేలనో?

(కానీ రెండర్థములకును బ్రామాణికప్రయోగములు గానరావు)

కొలత+కార అని యుండ తలోపమును వ్యాఖ్యలు పేర్కొన్నవి. కానీ సూ.ని. కొలగార మనునది కొల యనుదానినుండి యేర్పడినట్లు పేర్కొన్నది. కొలత యనునర్థమున కొల యనుశబ్దము గల దని సూ.ని చెప్పుచున్నది. కొల-కొలత కొలుచుట యని చెప్పి, వ్యవహారవాక్యము నుదాహరించినది. దీనికిఁ గవి ప్రయోగము దొరకియుండకపోవచ్చును.

(కొలయే కొలత) కొలతయే కొలగార మగుచోఁ గొలుచుధాతువుపైనే కార ప్రత్యయమును గృత్తుగాఁ జెప్పి చులోపమును 'ఇటం గృత్కగతపవేము' లనులక్షణముచే సాధించికొని (ముందటిలువర్ణమునుత్వమునకు) యత్వమును జెప్పుకొనవలెను. అప్రత్యయ మవుచో చులోపము నత్వము రెండును జెప్పికొనవలె.

సూత్రమునం దుత్తరభాగ మీకకారమునకుఁ గొన్నియెడల గకారము చెప్పుచున్నది. కొన్నియెడల నన్నను నిచ్చట నయము కొలతలపైనే. అట్టియెడల కొన్నియెడల నని చెప్పుట కంటె 'నయ, కొలలపై' నని స్పష్టముగాఁ జెప్పుట యొప్పును. మిగిలిన రెండింట నసలు వచ్చుట లేదు. వీనికి రాకుండుటయు లేదు. నయకారము, కొలకార మనురీతి నుండవు కదా. కావునఁ గొన్నియెడల నని యస్పష్టముగాఁ జెప్ప నేల?

నుడుగుధాతువున కాది నొత్వమును జెప్పుకొనవలసియున్నది. అట్టియెడల నొడికార మనునదియు సిద్ధించును.

## నాయఁకరము

**12. కవర్ణకంబు నాయకశబ్దంబునకు భావంబునం దగు.**

నాయక+కర అని కాఁగా కర పర మైనపుడు నాయక శబ్దాంత్యకకారము లోపించు నని కు.పం. (131) పేర్కొన్నది. ఈయభిప్రాయమును గొన్ని వ్యాఖ్య లనుసరించినవి.

అస లిందు విధింపఁబడినప్రత్యయమును గూర్చియే యభిప్రాయభేదములు గానవచ్చుచున్నవి. సుబో. 'రవర్ణకం' బనుపాఠమును జూపి, కు.పం.ను విమర్శించుచు అచ్చుతప్పుప్రతి ననుసరించి యట్లు కు.పం. గ్రహించిన దనియు తద్ధితప్రత్యయము పర మగునపు డెయ్యెడను నంత్యవర్ణలోపము చెప్పఁబడలే దనియుఁ బేర్కొన్నది (235). కానీ యచ్చుతప్పు లేనియేప్రతి ననుసరించి యీరవర్ణక పాఠము స్వీకరింపఁ బడినదో సుబో. వివరింపలేదు. అంత్యవర్ణలోపము విధింపఁబడనిమాట వాస్తవమే. ఉక్కివము – ఉక్కీఁడు అనుచో మాత్రము సూరి ప్రత్యేకముగాఁ జెప్పుకొనెను. కానీ యీవ్యాఖ్య తద్ధి.13సూత్రమున కొలతలో తకారము లోపింపఁగా నన్నది. ఎట్లు లోపించినది? అది యంత్యవర్ణము గాదా? అట లోపించిన దని సుబో. అన్నట్లుగా నిట లోపించిన దని కు.పం. పేర్కొన్న దన్నచో సమాధాన మేమి? శ.ర.లో కరప్రత్యయము చూపుటచే నీ సుబో. పాఠము త ప్పని తత్త్వ. (327) స్పష్టము చేసినది.

ఘం. 'శబ్దరత్నాకరమున నాయంకరము. నాయకుఁడు+కరము. ఆధిపత్యము

అనియే కలదు. కావున కరవర్ణకము ప్రౌఢవ్యాకర్తకు సమ్మత మనుట స్పష్ట (305) మన్నది. ఈశ.ర.పంక్తిలో నాయకుఁడు + కర అని చూపుట దోష మను ఘం. అభిప్రాయము(305) సమంజసము.

సుబో. నాయక+ర+ము అని ప్రక్రియ చూపుట త ప్పని ఘం. పేర్కొన్నది. అది యుక్తమే. భావార్థమునం దవున దవుటచే నాయకునియొక్క+ర= 'నాయకునిరము' లేదా నిగాగమాభావపక్షమున 'నాయకురము' అని కావలయునే కాని 'నాయఁకరము' కాదు.

సుబో. అభిప్రాయములోనిదోషమును గుర్తించిన తత్త్వ. ఒకసవరణము ప్రతిపాదించినది.

నాయఁడు, నాయరాలు మున్నగుపదములనుబట్టి నాయ యనుప్రాతిపదికము గల దనుట స్పష్టము గావున నాయఁడుగారియొక్క భావము లేదా ధర్మ మను నర్థమున లోకములో నున్న నాయఁకర మనుదానిని నాయశబ్దముపై కరజ్ ప్రత్యయ విధానముచే సాధింపఁదగు నని దానితాత్పర్యము.

సర్వ. నాయక అని కకారాంతశబ్దము లేదు. ఉన్న దని యంగీకరించినప్పటికిని కకారము లోపింపఁజేయుట అవసర (304) మని భావించినది.

ఇది యసంగతము. నాయఁకుడు అనుశబ్దమును శ.ర. చూపినది. ఎఱుకు నాయంకుఁ డొక్కరుఁడు వచ్చి (శ.ర.) దీనికిఁ బెక్కు ప్రయోగములు సూ.ని. చూపినది. నాతల్లి నాయక్క నాయంకురాల (సూ.ని)

తత్త్వ. నాయఁకశబ్ద మంగీకరించియు నాయశబ్దముపైనే కరజ్విధాన ముచిత మని భావించినది. ఈయభిప్రాయమును విమర్శించుచు ఘం. ఒకవంక నాయఁక శబ్దము కల దని చెప్పుచు నాయఁకుయొక్క భావము నాయఁకరము కా దనియు నాయనియొక్క భావము నాయఁకర మనుట బా గనియు వ్రాయుట యవిచారమూలక (306) మన్నది. తత్త్వ. ప్రక్రియలో లోప మున్నమాట వాస్తవము. కాని యది ఘం. గుర్తింపలేదు. నాయఁకశబ్ద మున్న దని యంగీకరించినమాత్రమున నాయఁడు శబ్దముపైఁ జేరరా దనుట యెట్లు? నాయఁడు శబ్దమును లేకపోలేదు గదా. ఏది లాఘవముగా నున్న నద్దానినుండి సాధింపనవు. అర్థమునందు భేదము చూపకుండ నట్లు గ్రహించుట దోష మనరాదు.

తత్త్వ.లోనిలోప మిది. ప్రక్రియలో లాఘవ మున్న దని నాయశబ్దమునకే కరజ్ చెప్పుదుము గాక. కాని యీప్రత్యయము భావార్థమునం దవునది. కావున నాయనియొక్క యనుషష్ఠ్యంతముపైఁ జేయవలయును. రామునితనము మనుమనితనము మొద లగున విట్టివే కదా. నాయనియొక్క+కర=నాయకర అని యె ట్లవును. యొక్కప్రత్యయము లోపింపఁగా నిగాగమము నిలిచియుండవలెనే. నాయ యనుప్రాతిపదికపై కరజ్ ప్రత్యయము చేయుదురా? భావార్థకప్రత్యయము ప్రాతిపదికముపై నగునా? పైఁగా నీయది యనుదంత మగుతెనుఁగుడమంతము గావున నిగాగమము నిత్యము. అందుచే 'రాముతన' మనుదానివలె 'నాయఁకర' మనురీతిగా (నిగాగమము లేని 'నాయయొక్క' యనుదానినుండి) నేర్పడు నని యూహించుటకు వీలు లేదు. అనఁగా నాయకశబ్దమునుండి సాధింపవలయుచో కకార లోప మెట్లు? అని భావించి నాయశబ్దమును గ్రహించిన నిట నిగాగమ లోప మెట్లు? అన్నది ప్రశ్న మైనది. కావునఁ దత్త్వ. చూపినసవరణము ప్రయోజనవంతముగా లేదు.

తత్త్వ. సూత్రకర్తపక్షమును బరామర్శించుచు నాయఁక+కర కకారలోపము నాయఁకరము. కకారలోపమును విధించు సూత్ర మెద్దియు లేకున్నను శ.ర.నుబట్టి వ్యాకర్త కది యిష్ట మని నిశ్చయించినది (327). ఈయభిప్రాయమును విమర్శించుచు ఘం. నాయఁక+కర+ము అని నిల్చుట యసంగతము. సుబంతము కంటెఁ దద్ధితప్రత్యయము నిల్చును. కాన నాయఁక+యొక్క+కర అనునలౌకిక విగ్రహమునుండి రూపసాధన చేయఁదగు (305) నన్నది. ఈభావార్థకము తద్ధితము లని సామాన్యముగాఁ జెప్పినను స్వార్థికములు గాని వని యీవ్యాఖ్యయభిప్రాయము నెన్నఁదగును. స్వార్థికము లైనతద్ధితములు ప్రాతిపదికముపై నవును గదా. (ఘం.199) ఇతరములు సుబంతముపై నిల్చు ననుట యుక్తమె. తత్త్వ. ప్రాతిపదిక పైఁ జూపుట సరి కాదు. నాయఁకుడు=కరము అనుశ.ర.పంక్తి ననుసరించి డుజ్విభక్తిని లోపింపఁజేసె నని తలంచినను నాయఁకు=కర అని యుత్వముతో జూపవలయును. కావునఁ దత్త్వ. ప్రాతిపదికయే చూపినది. అది పొరపాటు. కరజ్ ప్రత్యయపక్షమునను నాయఁకర అనియే యీవ్యాఖ్య యూహించిన దన్నమాట.

కానీ ఘం. చూపినమార్గము సయితము సమంజసము కాదు. నాయఁక

యొక్క కర అని యలౌకికవిగ్రహము చూపవలె నన్నది ఘం. అలౌకికవిగ్రహ మగుటవలన నిగాగమమును, ముందు ప్రాతిపదిక కుత్వమును రాలే దన్నమాట.

తద్ధితప్రత్యయము లవుసందర్భములం దెల్లెడల నిట్టియలౌకికవిగ్రహమే చూపవలయునా? లేక యీకారప్రత్యయ మగునపుడు మాత్రమే యగునా? రామయొక్క+తన=రామతన మని యవును గాని రామునితన మని కాదు. ఇట్లే మనుమతన మిత్యాదిగానే కావలయును. అగ్గలయొక్క+తన=అగ్గలతన మనియే కావలె. సూరి చూపిన రామునితనము, అగ్గలపుఁదన మనురీతి వసాధువు లని తాత్పర్యమా? అట నిగాగ మె ట్లున్నది? ఇట నేల లేదు.

తనయొక్క+మయ, తమయొక్క+మయ అనునవియు (203) నలౌకిక విగ్రహములే యగునా? అయిన విభక్తినిమిత్తకము లయినవికారము లట నేల వచ్చినవి. అట్లే యిట ఉత్త్వనిగాగమములు వచ్చిన, నాయఁకునియొక్క+కర కావలయును గదా. ఇచ్చటవలె నచ్చటను నలౌకికవిగ్రహమును వ్రాయఁగా ననఁగా విభక్తి మాత్రము చేసి విభక్తినిమిత్తము లగుప్రాతిపదికవికారములు చేయనిచో ఏకబహువచనములు రెండింట తాయొక్క+మయ యని యుండి, 'తామయము' అనియే కావలయునే. తనమయము, తమమయ మని యె ట్లయినవి?

ఇంక నట్లు గా దని యెల్లెడల లౌకికవిగ్రహమే యుండును గాని యీకర యనుతద్ధితప్రత్యయ మగునపుడు మాత్రమే విగ్రహ మలౌకికరూపమునం దుండు నని యభిప్రాయమా? ఐన నిద్దానివైలక్షణ్య మేమి? ఇది సూత్రకర్త యెటనే సూచించెనా? శ.ర.లో సయితము నాయఁకుఁడు అని ప్రథమాంతమె చూపెను గాని ఘం.వలె నిందలివిలక్షణతను గుర్తించి 'నాయఁకకర' అని చూపియుండలేదే.

కావున ఘం. చూపినవిగ్రహ ముచిత మని నిర్ణయించుటకు నెట్టియాధారమును లేదు.

రవర్ణ మనక కరవర్ణక మనుటలో సూత్రకర్తయభిప్రాయమును ఘం. ఇట్లూహించినది. నాయఁకుఁడు+ర అని నిల్పినను నాయఁకుయొక్క+ర అని నిల్పినను నాయఁకర మనురూపము సిద్ధింపదు. నాయఁకుర మనుననిష్టరూప మేర్పడవలసి వచ్చును. కాన కరవర్ణకము విధింపఁబడియుండును (ఘం. 306).

నిగాగమము వచ్చినపక్షమున నాయఁకునియొక్క+ర=నాయఁకునిరము అని యిం కొకయనిష్టరూపము గూడ నేర్పడు నని గుర్తింపఁదగును.

పైవాక్యములంబట్టి రవర్ణకము విధించినచో నాయఁకుర మని కావలసివచ్చును. గావున కర ప్రత్యయము చెప్పె నన్నమాట. అనఁగా కరప్రత్యయము విధించుటచేతఁ బైరీతిగా విభాగించినను నాయఁకర మని యవునా? ఎట్లు? నాయఁకుఁడు+కర విభక్తి లోపించి 'నాయఁకుకర' మని యవును. నాయఁకుయొక్క+కర=నాయఁ కుకరము. నిగాగమపక్షమున నాయకునియొక్క+కర=నాయకుని+కర మని యవును గాని నాయఁకర మె ట్లయినది?

నాయఁకురము, నాయఁకునిరము, ఎట్టివో నాయఁకుకరము, నాయఁకుని కరము నట్టివే. అనఁగా రప్రత్యయమును చెప్పిన నెంతప్రయోజనమో కరప్రత్యయము చెప్పినను నంతే. సాధురూపము మాత్రము సాధ్యము గాదు. అసాధువులు రెం డవును.

రప్రత్యయపక్షమున నాయఁకుడు+ర, నాయకుయొక్క+ర యని విభాగించిన యీవ్యాఖ్య కరప్రత్యయపక్షమున న ట్లేల చూపలేదు? నాయఁక+యొక్క+కర యని యేల చూపినది? నిజమునకు నాయఁక+యొక్క అని చూపుచో నీకర ప్రత్యయముకంటె రప్రత్యయ మనుటయే యుత్తమము. నాయఁక+యొక్క+ కర అనుచో విభక్తిలోపముతోపాటు కవర్ణలోపమును జెప్పుకొనవలయును. ర ప్రత్యయ మనుపక్షమున నాయఁక+యొక్క+ర. విభక్తిలోపము. నాయఁకర అని యవును. కలోపప్రసంగము లేమి లాఘవము ప్రయోజనము. కాఁగా ఘం. చూపినప్రక్రియ ననుసరించి చూచినచో కరప్రత్యయవిధానముకంటె రప్రత్యయవిధానమే యుచితము.

కరప్రత్యయ విధానమునం దెట్టివిశేషప్రయోజనమును లే దనక తప్పదు.

ఈవ్యాఖ్య కర ప్రత్యయము చేసినపు డొకరీతిగాను రప్రత్యయము చేయవలసినపు డిం కొకరీతిగాను విభాగము చూపుట సక్రమముగా లేదు. రప్రత్యయ మనుటలో లోపమును, గరప్రత్యయ మనుటలోనివైశిష్ట్యమును బ్రకటింపవలె నన్న రెండెడలను నొకేరీతివిభాగము చూపుట యవసరము.

సుగమ. అరవర్ణకము పర మగుచోఁ బైసూత్రములందువలె నాయఁక+ అర+ము నాయఁకరము అనురీతి అపదాదిస్వరసంధి చేసినచో సుసంగతముగ

నుండు నని తోఁచెడు (205) నన్నది. అపదాదిస్వరసంధి చేసినచో ననుట సరి కాదు. దీనివలనఁ జేయనిచో నని యనుమానము గల్గును. ప్రత్యయ మరయే యైనచో నపదాదిస్వరసంధి చేయవలసినదే. ఇంక 'అర' ప్రత్యయ మనుటలోని సంగతి యేమి? నాయఁక అనుప్రాతిపదికపైఁ జేర్చుట యసంగతము. ప్రాతిపదిక పైనే చేర్చుచో రప్రత్యయ మన్న సుబో. మతమే లాఘవము. అపదాదిస్వరసంధి చేయవలసినయవసరము నుండదు. ఇంక షష్ఠ్యంతముపైఁ జేయుచో నాయఁ కునియొక్క+అర=నాయఁకునర మని యవును. (నిగాగమాభావపక్షమున నాయఁ కరము అని కాఁగలదు) దానిని వారించు టెట్లు? కాఁగా అరప్రత్యయ మన్నను బ్రయోజనము లేదు. నిగాగమాభావపక్షమున 'నాయఁకర' మని యగును. అట్టియెడల నిట నిగాగమ మసలు లే దనవలెను. లేదా లోపము చెప్పవలెను.

పయివిచారణమునుబట్టి 'నాయఁక + కరము అనుచో కకారమును (కవర్ణ మన్నమాట) లోపింపఁజేసికొనవలె ననియు శ.ర.లో చూపినట్లు నాయఁకుఁడు+ కరము అనుచో డువర్ణమును, దానికి ముం దున్నకువర్ణమును లోపింపఁ జేసికొనవలయు' (304) నని సర్వ. చెప్పుట యసంగతము. పైరీతివిభాగములు రెండును సరి గావు. అంతకు ముందు సర్వ. చూపినట్లు నాయఁకునియొక్క యనియే యుంచవలెను.

ఘం. అంతకు ముందటివ్యాఖ్యలను గూర్చి 'నాయఁకశబ్దమునందలికవర్ణ లోపమునకు దారి లే దనుకొనుట యీయనర్థమునకు మూల' (306) మన్నది. వ్యాఖ్యానవిషయములనుబట్టి యది యుచితమే. సుబో. కొలతలో నట్టిమార్గము చూపకయే లోపము చేసినది. కాని యిట నట్లు పేర్కొనలేదు.

ఇంక ఘం. చూపినమార్గ మేమి, యనఁగా నాచ్ఛికసమాసంబులం (సమా. 36) దనుసూత్రముచే కవర్ణము లోపించు నని. అట్టియెడల నాయఁక+యొక్క+కర అనురీతివిగ్రహమునే యిట విలక్షణముగా నేల చూపవలె? నాయఁకునియొక్క+కర యనియే చూపి సమా. 36సూత్రముచే 'కుని' వర్ణములు రెండును లోపించు నన్న నిబ్బంది యేమి? కవర్ణమును లోపింపఁజేయగల్గినది, 'కుని'వర్ణములు లోపింపఁ జేయుటకు విరోధించునా?

ప్రౌఢ. తద్ధి. 1. సూత్రమును బ్రయోజనవంతముగనే యీవ్యాఖ్య భావించినది.

అట్టియెడల దువర్ణకాదు లనునప్పటి యాదిశబ్దముచే 'కుని' వర్ణములను లోపింపఁ జేయనవును గదా. సూత్రకర్త ద్వాదివర్ణకము లనలేదు. కవర్ణలోపమున కీఘం. చూపినమార్గ మసలు సూత్రకర్తకు సమ్మత మనుటకు మాత్ర మాధారము లేదు.

కాఁగా సూత్రము మిగిలినదాని నట్ల యుంచి 'ర'ప్రత్యయ మన్నను 'కరజ్' ప్రత్యయ మన్నను, నాయశబ్దముపై 'కర'ప్రత్యయ మన్నను, 'అర'ప్రత్యయ మన్నను నీరూపము సిద్ధింపనేర దని నిస్సంశయముగాఁ జెప్పనగును.

శ.ర.లోఁ జూపినవిభాగ మెట్లును సమంజసము గాదు. కావున నీసూత్రము నిట్లు చెప్పరాదు. నాయఁకశబ్దమునుండి సాధింపఁదలఁచిన 'ర' వర్ణకమునే చెప్పి యయ్యది ప్రాతిపదికకే యవు ననవలె. తత్త్వ. అన్నట్లు కరజ్ ప్రత్యయ మయినను నాయ అనుప్రాతిపదికముపైనే యవు నని విశేషించి చెప్పక తప్పదు.

సర్వ. నాయఁకునిభావము నాయఁకర మని నిపతించుట సమంజస మని భావించినది. ఇయ్యది కొంత నయము. మగనియొక్క భావము మగతన మనురీతిగా నిగాగమలోపము ననుసరించి సూరి దీనిని మగఁటిమ్యాదులలోఁ జేర్చెను. అట్లే ఇట 'కుని'వర్ణలోపము కలదు. మగఁటిమ్యాదులలోఁ జేర్చుట లాఘవము. మగఁ టిమ్యాదులలోఁ జేర్పఁదగు నని సూత్రించుట యిట యుక్తముగా నుండదు. కావున నిపతించుట యొకమార్గ మయినది.

## ఎఁడు – పరిమాణార్థము

### 16. పరిమాణార్థంబునం బ్రథమైకవచనంబునంద యెడు వర్ణకం బగు.

ఇది తద్ధితప్రత్యయము నొకదానిని విధించునది కాదు. ఇంకఁ బూర్వవ్యాకరణ సిద్ధ మగునర్థమును నియమించునది. బాల. 'మానార్థంబున కేకత్వంబునం దెఁ డువర్ణకం బగు' (తద్ధి. 25) నని చెప్పెను. ఏకత్వ మనఁగా నయ్యది సప్తవిభక్తుల యందు నుండనవు. కావున నట్లు కా దనియుఁ బ్రథమైకవచనమునందే యనియు నియమించుట కీలక్షణ మారంభింపఁబడిన దనుట స్పష్టము. (తత్త్వ.330)

దీనిం గూర్చి కు.పం. సూరిసూత్రమున ఏకత్వమునం దనుటకు ప్రథమైక వచనమునం దనునర్థము సూర్యుదాహృతములంబట్టి తెలియుచున్నను స్పష్టార్థ మిట మఱల సూత్రింపఁబడిన (132) దన్నది. సర్వ. దీనినే పేర్కొని సూత్రమునుబట్టి

పొరపాటున ఈపద్ధతిలోనే యర్థము గ్రహించుచో ఏకత్వంబున అనఁగా నెల్ల విభక్తులు గ్రహింపఁబడవలె నని ప్రథమైకత్వమున ననునది సవరణమున కవకాశము గల దని ఈసవరణము ప్రతిపాదింపఁబడె నని యూహించినది. (307) విశేష్యంబు భిన్నవచనవిభక్తికం బయ్యు మానార్థకశబ్దములమీఁదఁ బరిమాణార్థమునఁ బ్రథమైకవచనమందే యెఁడువర్ణకంబు వచ్చు నని సూత్రార్థ మనుసూత్రకర్తవివరణ మిది స్పష్టతకుఁ గాక సవరణముగాఁ జెప్పఁబడిన దని సూచించుచున్న (203) దను ఘం.వివరణము సరి కాదు.

బహువచనమున సూరిలక్షణముచే నెట్లును రాదు. ఇంక నేకత్వము. విశేష్యము భిన్నవిభక్తితో నున్నను, విశేషణ మగుమానార్థకము ప్రథమయందే యుండి, యెఁడు ప్రత్యయము నందు నన్నమాట. అనఁగా విశేష్యానుగుణముగా విశేషణము ప్రథమేతరవిభక్తులలో నున్నపు డయ్యది యేకవచనాంతమె యైనను దాని కెఁడు ప్రత్యయము రాదు.

ఇటఁ దత్త్వ. పుట్టికి+ఎఁడు=పుట్టికెఁడు అనియుఁ గాదు. కావున బహువచ నాంతమునకు రానట్లే ద్వితీయాదివిభక్త్యంతములకును ఎఁడుప్రత్యయము రా దని దిద్దవలసియున్నట్లు భావించి సూత్రమును నిర్మించియుండు (330) నన్నది. కానీ యీదృష్టితో సూత్రము రచింపవలసినపని లే దని యావ్యాఖ్య స్పష్టము చేసినది. (330)

ఇంక ఒకపుట్టికి ధాన్యమునకు మున్నగుచోట్ల ఒకపుట్టెఁడు ధాన్యమునకు ననురీతిని షష్ఠ్యాద్యంతములకును ఎఁడు ప్రత్యయము వచ్చుటచే నాతఁడు విభక్తి ప్రథమయే కావలె నని శాసింపలే దని తత్త్వ. పేర్కొన్నది. (330) అనఁగా పుట్టికి+ ఎఁడు అని యుండఁ దద్ధితవృత్తిలో కిప్రత్యయము లోపించి, పుట్టెఁడు అని యవు నన్నమాట. సర్వ.వ్యాఖ్యయు నట్లే సమన్వయించినది. (308)

ఈపద్ధతిని దిరస్కరించుచు ఘం. పుట్టి+కు+ఎఁడు అనురీతిప్రక్రియ చూపరా దనియు, పుట్టెఁడు తవిదలకు అనుచో గూడ పుట్టి+ఎఁడు అనురీతిగానే చూపవలయు ననువిశేషము తెలుపుటకు ప్రథమైకవచనంబునంద యని యిట జెప్పఁబడె ననియుఁ (203) బేర్కొన్నది.

కానీ యీవ్యాఖ్య పుట్టి యనురీతిగాఁ బ్రథమయే యేల యుండునో వివరింప

లేదు. తవిదలు అనునది ధాన్యవాచకము గావున నిత్యబహువచనాంతము. (శబ్ద. 37) కాన బహువచనమం దున్నది. పుట్టి యేకత్వవిశిష్టమే కావున నయ్యది యేకవచనాంత మైనది. నిత్యబహువచనము గావున విశేష్యము బహువచనాంత మైనను విశేష్యము బహువచనాంత మైనను, విశేషణ మట్లు గామి, నేకత్వవిశిష్టతను బోధించుచు నేకవచనాంత మయియున్నది. అపుడు 'పుట్టికి తవిదలకు' ననియే కదా యుండవలయును. విశేషణషష్ఠికి విభాషగాఁ బ్రథమ వచ్చును గావునఁ బ్రథమ చేసినచో 'పుట్టి తవిదలకు' నని యుండుటయు, నెఁడు ప్రత్యయ మయి, 'పుట్టెఁడు తవిదలకు' నని యవుటయు సిద్ధించును. ప్రథమ రానిచో 'పుట్టికి తవిదలకు' ననియు నుండవచ్చును గదా. కానీ 'పుట్టికి తవిదలకు' ననురీతిసందర్భమున బాల.చే. ఎఁడుప్రత్యయము చేయరా దనుటకుఁ గానీ లేదా ప్రాప్తించుచుండఁగా నీతఁడు నివారించినచో నందువలనిప్రయోజనమును గాని వివరించి యుండ వలసినది. అట్లు చేయక, పుట్టి+తవిదలకు ననియే యుండు ననుట యెట్లు? పుట్టికి ననియు రూప ముండునే కదా. ఇంక నట్లు గాక పరిమాణవాచకము గూడ బహువచనాంతము గావలయు నన్న 'రెండు పుట్లకు తవిదలకు' ననురీతి నుండవలె. అపు డెట్లును బహుత్వమునుబట్టి సూరిసూత్రముచేతనే ఎఁడు ప్రత్యయము రాదు.

సూత్రము సార్థక్యము నెన్నుటకు సూత్రకర్త చెప్పుకొన్నసూత్రార్థమును గూర్చి పరిశీలింపవలెను.

విశేష్యము భిన్నవచనవిభక్తికం బయ్యు మానార్థకములమీఁదఁ బ్రథమైకవచన మందే యెఁడు వర్ణక మగు ననుచున్నాఁడు ప్రౌఢవ్యాకర్త. అన నర్థ మేమి? వచనము విషయము సూర్యుక్తము, గావున విభక్తివిషయము విచారింతము. విశేష్యము భిన్నవిభక్తిక మయ్యును విశేషణ మగుమానార్థకము ప్రథమావిభక్తియం దున్నపుడే యెఁడు అవు నని యర్థమా? ఉదాహరణమునకు 'రెండుపుట్లకు తవిదలకు' ననుచో 'తవిదలకు' ననువిశేష్యము షష్ఠీబహువచనమం దున్నది. తదనుగుణముగా విశేషణము నట్లే యున్నది. ఎఁడు రాలేదు.

అనఁగా నిట విశేష్యము భిన్నవచనవిభక్తిక మయ్యును విశేషణ మవుమానార్థక శబ్దము ప్రథమైకవచనమం దుండుట సంభవింపలేదు. 'పుట్టికి తవిదల' కని

యున్న దనుకొన్నచో విశేష్యము షష్ఠీబహువచనమం దుండఁగా విశేషణము షష్ఠ్యేక వచనమం దున్నది. ఏ మైనను బ్రథమైకవచనమందు లేదు. ఇక్కడను ఎఁడు రాదు. కాని యిట నెఁడు వచ్చు నన్న నిబ్బంది లేకుంటను దత్త్వ. పేర్కొన్నది. అది యుక్తమే.

అనఁగా మానార్థక మెపుడు ప్రథమైకవచనాంత మయియుండునో యప్పుడే ఎఁడు వచ్చును.

'మూరెఁడు తోఁక' యని యుదాహరింతము. అటు గాక 'తోఁక రెండు మూర' లని యున్న దనుకొందము. అపుడు విశేష్యము ప్రథమైకవచనమందే యున్నది. ఇట ఎఁడు రాదు.

మఱి యిట సూత్రకర్త విశేష్యములప్రసంగము తెచ్చు టేల? మానార్థకశబ్ద మెప్పుడు ప్రథమైకవచనమం దుండునో యపుడే దాని కెఁడు ప్రత్యయ మవును. అట విశేష్యము విభక్తివచనములం గూర్చి ప్రసంగించుటవలనఁ బ్రయోజనము లేదు. (వ్యా.సం.స.1308)

'మూరెఁడు తోఁక, తూమెఁడు బియ్యము, పుట్టెఁడు తవిదలు, పుట్టెఁడు తవిదలకు' ననులక్ష్యములక్రమము మాత్ర మెంతయు నుచితముగా నున్నది. మొదటివానిలో విశేష్యమునఁ బ్రథమైకవచనాంత మవుటయే కాక యేకత్వబోధకమును మూరకు ఎఁడు అయినది.

'తూమెఁడు బియ్య' మనుచో విశేష్యము బహుత్వబోధకము. కాని నిత్యైకవచనాంత మవుటచే నేకవచనమం దున్నది. తూమెఁడు అని యెఁడు వచ్చినది.

'పుట్టెఁడు తవిద' లనుచో విశేష్యము బహుత్వబోధకము, బహువచనాంతము నైనది. పుట్టి కెఁడు అయినది.

'పుట్టెఁడు తవిదలకు' ననుచో విశేష్యవిభక్తివచనములు భిన్నములు. కాని వీనింబట్టి లక్షణమునం దర్థవిశేష మేమియు లభింపదు.

ప్రథమైకవచనమునంద యనువివరణమునఁ బ్రథమైకవచనమునం దున్నపుడే యని యర్థము చేసినపుడే సమన్వయము గుదురును. లేనిచో విశేష్యము భిన్న విభక్తివచనములలో నున్నను మానార్థక మగువిశేషణము ప్రథమైకవచనమందే యుండి యెఁడు ప్రత్యయమునందు ననునర్థ మేర్పడఁగలదు.

ఇంతకును సవరణాంశ మేది? వ్యాఖ్యలనుబట్టి 'పుట్టికి తవిదలకు' ననుచో సూరిమతమున పుట్టికి ననుదానిపై ఎఁడు చేసి, తద్ధితవృత్తిలో విభక్తిలోపము చేయుట యొకటి.

పుట్టి యనువిశేషణమునకుఁ బ్రథమావిభక్తిని జేసి దానిపైనే యెఁడు ప్రత్యయము చేయవలె నని ప్రౌఢ.మత మను టొకటి. ఇం దేది యెట్టిది? ఏది గ్రాహ్యము?

ప్రౌఢ. 'పుట్టెఁడు తవిదలకు' ననుషష్ఠ్యంతము నిచ్చెను గాన నట విశేషణంబుల షష్ఠికిఁ బ్రథమ చేసి రూపములు సాధించితిమి. కాని భిన్న మగువిభక్తి షష్ఠియే కావలె నని యేమి?

పుట్టెఁడు బియ్యమును గొనెను. పుట్టెఁడు తవిదలకొఱకు పోయెను, పుట్టెఁడు వడ్లవలన నరపుట్టి బియ్యము, పుట్టెఁడు బియ్యమునందు ననురీతిగా విశేష్య మితర విభక్తులయం దున్న దనుకొందము. ఇట విశేష్యానురూప మగువిభక్తి విశేషణమునకు రాఁగా, పుట్టియందు బియ్యమునం దనురీతిగా నుండవలెను. ఇపుడు షష్ఠీతరము లగునీవిభక్తులకుఁ బ్రథమ యగుట యెట్లు? కొన్నియెడలఁ గాదే (ప్రౌఢ.కార. 22) ఇవి తఱచుగానే కానవచ్చుచున్నవి. వీని కెల్లఁ బ్రథమయే రానపుడు ఎఁడుప్రత్యయ మగుట యెట్లు?

కాఁగాఁ బైవ్యాకర్తృవివరణమునకు విశేష్య మేవిభక్తియం దున్నను మానార్థకము ప్రథమయం దున్నపుడే యెఁడు ప్రత్యయము వచ్చు నని యర్థము చేసినచోఁ బైచోట్లఁ బ్రథమ వచ్చుట కవకాశము లేమింజేసి యెఁడుప్రత్యయము వచ్చు నవకాశమును లేదు. దాని కిం కేమి యర్థము చెప్పవలెను.

ఇ ట్లని సూరిమతమున పుట్టియందు+ఎఁడు. అందువిభక్తి లోపము. పుట్టెఁడు అని సమన్వయించుట సమంజస మనలేము. ఏల యనఁగాఁ 'బుట్టియందు బియ్యమునం' దనురీతి వ్యవహారము లేదు. ఎఁడుప్రత్యయము లేకుండ పుట్టివడ్ల వలన, పుట్టిబియ్యమునందు ననియే యుండు నేమో. కాని యితరవిభక్తులు గానరావు.

ఇంక విశేష్య మేవిభక్తియం దున్నప్పటికిని మానార్థకము ప్రథమావిభక్తియందే యుండు ననియు దాని కెఁడు ప్రత్యయ మవు ననియు నర్థము చేయవచ్చునా? అనఁగాఁ బ్రథమైకవచనమునందే యెఁడు వచ్చు నని చెప్పుచున్నాఁడు గాని యది ప్రథమైకవచనమందే యుండు నని ప్రథమైకత్వమును విధించుట లేదు. అ ట్లయిన

రెండుపుట్ల గింజ లిత్యాదులు విరుద్ధము లవును గదా.

అట్టియెడల నీసూత్రమే వ్యర్థము గాఁగలదు. బాల. ఏకత్వమున నని చెప్పినది. కావున బహువచనస్థలమున రాదు. ఇంక విశేష్యమునకు ముందు మానార్థక శబ్దములు ప్రథమయందే యుండు ననుచోఁ బ్రథమైకత్వమునందే యవుట యన్నది బాల.సిద్ధ మగును. ఇంక నీసూత్ర మేల?

ఇంకను మానార్థకశబ్దము విశేష్యమునకు ముందు ప్రథమయందే యుండు నని చెప్పుట యేని విశేషము గాఁగలదు.

కావున నీసూత్రవివరణములు ప్రయోజనవంతములు కావు. బాల.లో బ్రథమయందే కాక యితరవిభక్తులపైని గూడ ఎఁడు ప్రత్యయము వచ్చు నను తత్త్వబోధిన్యాదులవాక్యములును సుసంగతము లై కానరావు. త్వార్థక మైన తన షష్ఠ్యంతముపై నేల యయినది. అది త్వార్థము గనుక సంస్కృతసంప్రదాయాను సారముగా షష్ఠ్యంతముపై నైనది. అట్లే పరిమాణార్థక మగు ఎఁడు ప్రత్యయము సయితము 'తదస్య పరిమాణమ్' అనువిగ్రహముచొప్పున సంస్కృతమునఁ బ్రథమాంతములపై నగుచున్నట్లుగాఁ బ్రథమయందే యవును. కాఁగాఁ బ్రథమైకత్వమందే యవుట బాల.సిద్ధము. కావున నీసూత్రము వ్యర్థము.

బాల.చేఁ బ్రథమైకత్వమునందే యవు ననునపుడు 'తవిదలకు' ఇత్యాదు లె ట్లనవచ్చును. ఈయవి సమాసమ లనఁదగు. 'తవిదలు పుట్టెఁడు' అనుచో నయ్యది వ్యస్తము. ఈయవి సమాసము లనుటకు నాధారము లేకపోలేదు. రెండుపుట్ల గింజ లనురీతి బహువచనస్థలములు సమాసములే కదా. బారత్రాడు, క్రోసు దూర మిత్యాదులు సయితము సమాసములే యనఁదగును. వారు క్రోసు నడిచిరి అని యున్నట్లు క్రోసెఁడు నడచి రని యుండదు. (ఉన్నచో నిందు లేనిపదము దూరము మొ. నధ్యాహారము చేసికొనవలసియుండును.) క్రోసెఁడు దూరము నడచిరి యనురీతిగనే కానవచ్చును. ఎఁడుప్రత్యయాంతపదము లసమాసమం దౌపవిభక్తికము లని సూ.ని. పేర్కొనుటలో పుడిసెఁడు నీరు, పిడికెఁడు కౌను ఇత్యాదులు సమాసము లని భావించినట్లు తెలియవచ్చును.

లేనిచో ఎఁడు ప్రత్యయాంతములు తఱుచుగాఁ బ్రథమయందే ప్రయుక్త మవు నని చెప్పుకొనవలెను. నేల జేనెఁడు అనురీతిగాఁ బ్రథమాంతముగా నుండుటయే

ప్రసిద్ధము. నేల జేనెటిని, జేనెటిచేత ఇత్యాదివ్యవహారము గానరాదు. కాని జేనెంట జుట్టింటిలో (వ్యా.సం.స.699) అనురీతిప్రయోగములు క్వాచిత్కముగాఁ గానవచ్చుటజేసి తఱుచుగా మాత్రమే ప్రథమాంత మైయుండును.

## బంటివర్ణకము

**17. దష్ఠ్యర్థంబునం దత్సమపదంబుల మీదను బంటి కానంబడియెడి.**

బాల. బంటిని తెలుఁగుశబ్దములమీఁద మాత్రమే చేర్చి యుదాహరించినది. తక్కిన తద్ధితప్రత్యయములు తెనుఁగుపదములమీఁదనే చేరుచున్నవి. కావున తత్సమ పదములమీఁద తద్ధితప్రత్యయములు చేర (309) వని సర్వ. సామాన్యముగాఁ బేర్కొన్నది.

తన అనుతద్ధితప్రత్యయము తత్సమములపై నవుటను బేర్కొనుచుఁ దత్త్వ. బాలవ్యాకరణమునందలిమిగిలినతద్ధితప్రత్యయములు మాత్ర మాచ్ఛికశబ్దములకు మాత్రమే యుద్దేశింపఁబడిన వని (310) పేర్కొన్నది. తన మాత్రమే తత్సమములపై వచ్చు ననియు నితరము ల ట్లుద్దేశింపఁబడలే దనియుఁ జెప్పుటకు సూరి యట జూపినలక్ష్యములే యాధార మనవలెను. కానీ లక్షణమునందు మాత్ర మట్టి యాధారము లేదు. 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' ననువిధానమునకును 'దష్ఠ్యర్థంబున బంటి కొలఁదు లగు' ననువిధానమునకుఁ దత్సమాచ్ఛికవివక్షతో సంబంధము గానరాదు. ఇంక లక్ష్యముల ననుసరించియే 'తన' తత్సమములపైని గూడ నవు ననియు నితరము లాచ్ఛికములకే యవు ననియుఁ జెప్పుదము.

తనేతరతద్ధితము లెల్ల నాచ్ఛికములపై మాత్రమే యగుచుండఁగా నిందు బంటి మాత్రము తత్సమములపై వచ్చు నని చెప్పుటనుబట్టి తదిరము లయినతద్ధిత ప్రత్యయములకుఁ దత్సమములపై బాల,లో లేనినిషేధము ప్రౌఢ. చేయుచున్నది.

కోపకాఁడు, కోపకత్తె అనునవి మిశ్రము లనియు అనింద్యగ్రామ్యము లనియు శ.ర.లోఁ జెప్పెను. ఇవి గ్రామ్యము లవు టేమి? అట శ.ర. కవిప్రయోగములు చూపలేదు. శ్రీనాథుఁడు 'కోపగాఁ డౌనొ కాఁడొ' యని ప్రయోగించె నది గ్రామ్యమును, రామాభ్యుదయమందలి 'కటిబంటి' సాధువునా? ఈవివక్ష యేల? కాకత్తెలు సయితము తత్సములపయి వచ్చు నని చెప్పవలదా?

ఇట వఝ్ఝలవారియభిప్రాయములు నుచితములు కావు. (బా.సూ.) తద్ధిత ప్రత్యయములు తత్సమములపైఁ గలుగుట నహోబలపతి యంగీకరించెను. (కవిశి. 216) మాయలాఁడు. మాయలు అనుతత్సమముపై 'ఆ' ప్రత్యయ మైనది. (బా.సూ) మహామాయలాఁడు (హరి.ద్వి. 1.1854).

కావునఁ దద్ధితప్రత్యయములు క్వాచిత్కముగఁ దత్సమములపై నవుటను గుర్తించుట యుక్తము. బంటి నొక్కదానినే యట్లు చెప్పి యితరములను గ్రామ్యములు సేయుట సరి కాదు.

ఈవ్యాకర్తయే 'ఒకానొకచో నవర్ణకంబు మతుబర్థంబున విధించి, దివ్యతేజంబున వాఁ డని యుదాహరించెను. అది తత్సమముపై నె ట్లయినదో? ఒకానొకచో ననఁ గాఁ దత్సమముపైని గూడఁ గావచ్చునా?

సూరి ఆటాదులు, వగాదు లిత్యాదిగా నిర్దేశించుటచే యథాప్రయోగముగఁ దత్సమములు చేర్చుకొనుట కవకాశము గలదు. 'తన' వలెనె బంటి విధానము సాధారణముగనే చెప్పఁబడినది. అయిన నాచ్ఛికములే యుదాహరించుటంబట్టియు దత్సమములకు నిషేధము లేమింజేసియుఁ దత్సమములపైఁ గ్వాచిత్క మనవచ్చును.

వఝ్ఝలవా రీసూత్ర మనవసర మని భావించిరి. (వ్యా.సం.స. 1311) బంటి యనునది మాత్రము, అందువలెఁ బ్రత్యేక మగుపదముగాఁ గూడ నున్నది. కావునఁ దత్సమముపై నవు నని చెప్ప నక్కఱ లేదు. సమాసములుగా సిద్ధించు నని వారి యభిప్రాయము. కాఁగాఁ దత్సమములపై నున్నబంటి స్వతంత్రపదమే, కాని తద్ధితము గా దని తాత్పర్యము. ఆచ్ఛికములమీఁదఁ బ్రత్యయమే కావచ్చు. అందుకే ఇట ప్రౌఢ. సూత్రమున బంటి శబ్దము తద్ధితప్రత్యయ మనుట పొరపా (1312) టని నిర్ణయించిరి.

ఇది ప్రత్యేకపద మనుటకు వఝ్ఝలవారు చూపినకారణములు రెండు. 1. మాత్రశబ్దము ప్రత్యయముగానే కాక స్వతంత్రపదముగాఁ గూడఁ గలదు. కావున బంటి కొలఁదులు నట్లు స్వతంత్రపదములుగా నుండును (1311).

ఇది సరి కాదు. మాత్రార్థకము లని సూరి గాని, ప్రౌఢ. గానీ పేర్కొనలేదు. వి.వి. సయితము 'మాత్రజర్థే తు బంట్యాది స్తతః పూర్వత్ర నః క్వచి' త్తని మాత్ర జర్థకములుగాఁ బేర్కొన్నదే కాని మాత్రార్థక మనలేదు. మాత్రచ్ ప్రత్యయార్థమున

బంట్యాదులకు ననcగా మాత్రశబ్దమువలె నివి స్వతంత్రము లనుట యెట్లు? మాత్రచ్ ప్రత్యయమును, మాత్రశబ్దమును భిన్నములు గదా. (బా.సూ)

మాత్రచ్ ప్రత్యయము సంస్కృతము. పరిమాణార్థమునc దెలుcగునc గలది మాత్రశబ్దము. కానీ సంస్కృతమునc బ్రత్యేకశబ్దము మాత్రజర్థకముగా లేదు. సంస్కృతమందలి మాత్రశబ్దము తెలుcగున స్వతంత్రముగా నున్నను నయ్యది పరిమాణార్థకప్రత్యయము గాదు. స్వతంత్ర మగుపదమే.

అందు శబ్దమువలెc బ్రత్యేకపదత్వము గల దనిరి. అందలివారు ఇత్యాది స్థలములలో అందు అనునది ప్రత్యేకపదముగా స్పష్టముగాc బ్రసిద్ధ మయియున్నది. దానివంటిదే యైనపుడు బంటి యనుదానికి స్వతంత్రప్రయోగ మేది?

బంటి – నీళ్లకొలcదిని తెలిపెడిప్రత్యయము. మోcకాలిబంటి, మొలబంటి పుక్కిటిబంటి ఈcతబంటి. (శ.ర) (సూ.ని) ఇట్టు లీనిఘంటువులు బంటిని బ్రత్యయముగానే పేర్కొనినవి.

కాcగా అందువలె నిది ప్రత్యేకముగా నొకటి గల దనుట కాధారము లేదు.

2. మోcకాలిబంటి, ఔమ్ములబంటి యనుచో షష్ఠీసమాసోత్తరపదములవలెc గన్పట్టుచున్నవి. కావున నిది స్వతంత్రపదమే యని యిం కొకయాధారమును జూపిరి.

ఇదియు యుక్తము గాదు. ఔమ్ములయొక్క యనుదానికి బంటి యనుదానితో సమాసము చేయుట కసలు బంటి యనుపద మొక టుండవలయును గదా. పరిమాణబోధకముగా స్వతంత్రముగా లే దన్నను నింక నేయర్థమున నున్నది? కొలcది యనునది కలదనుట యథార్థమే. మోcకాలిబంటి యనుదానిని సమాసముగాc బేర్కొనుటవలననే సూరి దఘ్నార్థమున బంటి, కొలcదులు చెప్పినయెడ నుదాహరించిన మోcకాలిబంటి యనున దసంగత మనియు నది తద్ధితప్రత్యయము కా దనియుc జెప్పవలసివచ్చినది. (వ్యా.సం.స.1314)

ఔమ్ముబంటి యనుచో బంటి ప్రత్యయమును ఔమ్ములబంటి యనుచోc బదము నని వీ రభిప్రాయపడి రన్నమాట. ఔమ్ముబంటి యనునది మాత్ర మేల సమాసము కాదు. ఔమ్ముయొక్క బంటి – ఔమ్ముబంటి యని సిద్ధించునే కదా. అట్టియెడ నిట్టి వన్నియు సమాసములే యన్న సరిపోవుదాని కొకచోc బ్రత్యయ

మనియు మఱి యొకచోఁ బద మనియుఁ జెప్ప నేల? అధర్వణుఁడు 'మాత్రజర్థే తు బంట్యాదిః' అని చెప్పుట కారణము కావచ్చును.

బంటి యనునది వ్యస్తముగాఁ గాని వీరు చూపినసమాసముల ననుసరించిన సమాసపూర్వావయవముగాఁ గాని కానరాదు. అట్టియెడల బంటి యనున దొక స్వతంత్రపద మనియు నిది సమాసమునం దుత్తరపద మయియే కానవచ్చుచున్న దనియు దీనియర్థము పరిమాణమే యనియుఁ జెప్పుటకంటెఁ బరిమాణార్థమున నాయయిశబ్దములపైఁ జేరినతద్ధితప్రత్యయ మనువికృతివివేకాదులయభిప్రాయ మెంతయు సముచితము.

పుక్కిటిబంటి, ముక్కునబంటి, లస్తకంబునకొలఁది, కవుఁగిటికొలఁది, చేతికొలఁది యనురీతిప్రయోగములును నివి వ్యస్తములు గా వనియు సమాసములే కావున బంటికొలఁదు లుత్తరపదములే యనియు వానిస్వాతంత్ర్యమును దెల్పిరి.

కానీ యీలక్ష్యములలో ముక్కునబంటి, లస్తకంబునకొలఁది యనునవి బంటి పద మని నిరూపింపఁజాలదు. మాత్రజర్థే తు బంట్యాది స్తతః పూర్వత్ర నః క్వచిత్ అని వి.వి. వీనికి ముందు నవర్ణమును జెప్పినది.

మోకాలికొలఁది, మోకాలిబంటి యనురీతిగా సూరి చూపినలక్ష్యముల ననుసరించి బంటికొలఁదులు షష్ఠ్యంతముపైనే యవు నని గ్రహింపవలె.

ఎఁడు ప్రత్యయమును బరిమాణార్థమునందే యవున దైనను దానికిని వీనికిని భేదము కొంత గలదు. మోకాలిబంటి యనఁగా మోకాలివఱకుఁ గలపరిమాణ మర్థము. మోకాలివఱ కెంతయో యంత యని యర్థము. మోకాలు ఎంత పరిమాణమో అంత అని కాదు. మూర పరిమాణము గలది యనునర్థముతో ఎఁడు ప్రథమాంతముపై నవుట యుక్తము. కాఁగా మోకాలివఱకుఁ గలపరిమాణ మనునర్థవిశేషమునుబట్టి షష్ఠ్యంతముపై నవుట యుక్తము. సంస్కృతమున దఘ్నచ్ ప్రత్యయము నిట దఘ్నార్థ మనెను గదా సూరి. షష్ఠ్యర్థములోఁ బ్రథమాంతముపై నవుచున్నది. కానీ తెలుఁగున షష్ఠ్యర్థమున షష్ఠ్యంతముపైనే యవుట విశేషము. సూరి యయ్యది లక్షణమున స్పష్టము చేసిన బాగుండెడి దనిపించుచున్నది. (బా.సూ)

కావున నివియు బంటి పదత్వమును నిర్ధారింపఁజాలవు. పైని బేర్కొన్నట్లు బంటిని దద్ధితప్రత్యయముగాఁ జెప్పుట యుక్తము. కటిబంటి యనుచోఁ

దత్సమముపై నుండుటనో లేదా షష్ఠ్యంతముపైని గన్పించుటనో యాధారముగాఁ జేసికొని పదముగాఁ గల్పించుటకంటెఁ దత్సమములపైఁ గ్వాచిత్కముగ నుంటయు షష్ఠ్యంతముపైనే యీప్రత్యయ మవుటయును గుర్తించుట యుక్తము.

ఈయర్థమున సూరి కొలఁదిని విధించుట పెక్కు విమర్శలకు లోనైనది. ఆ విమర్శలలో నౌచిత్యము నున్నది. (బా.సూ)

ఏది యే మైనను బ్రస్తుతప్రౌఢ.విధానము సరి కాదు. ఇతరతద్ధితాంతములను కోపగాఁడు ఇత్యాదులను గూడ సంగ్రహించిన కొంత యుక్త మనఁదగును. బాల. తత్సమములపై నిషేధింపకయు నెల్లెడల నాచ్ఛికములనే యుదాహరించుట తత్సమములపైఁ గ్వాచిత్క మవుటను సూచించుచున్న దన్నను దప్పు లేదు. కాన నీసూత్రము వ్యర్థమే కాక యనర్థకము నైనది.

## మయ ప్రత్యయము

**18. ప్రాచుర్యార్థంబునం దెనుఁగుపదంబులమీఁదను మయట్ ప్రత్యయము చూపట్టెడు.**

సంస్కృతప్రత్యయ మైన మయట్ అనునది తెలుఁగుపదములమీఁదను గాన బడుచున్న దని సూత్రము నర్థము.

సుబో. 'తెనుఁగుపదములమీఁదను అనుసముచ్చయమువలన మయట్ప్రత్యయ ము తత్సమములమీఁదను రావచ్చు నని తెలియుచున్నది. రామునిమయము మున్నగునవి తత్సమముల కుదాహరణము' (238) లన్నది. దీనిని విమర్శించుచుఁ దత్త్వ. 'తన తప్పుఁ దద్ధితము లెవ్వియుఁ దత్సమములకు రా వనియుఁ దెనుఁ గునకు వర్ణము లనుసూత్రమునందువలె నాచ్ఛికభాషయే యిటఁ దెలుఁగుశబ్దముచేత గ్రహింపవలె ననియుఁ, దత్సమములకును నిష్ట మైన నాంధ్రభాషకు వర్ణంబు లనుచోటవలె నాంధ్రమున కనియే చెప్పెడివాఁ డనియుఁ (333) బేర్కొన్నది.

దివ్యతేజంబునవాఁ డనుచో నీసూత్రకర్తయే తద్ధిత మగునవర్ణకమును దత్సమముపైఁ జూపెను.

రామునిమయమువంటి రూపములసాధుత్వము ప్రయోగమునుబట్టియే నిర్ణయింపఁదగు నను టుచితమే. కాని యట్టివాని కీలక్షణమం దవకాశము లే

దనునభిప్రాయము మాత్రము సరి కాదు. తెనుఁగునకు వర్ణము లనుసూత్రమందలి తెనుఁగుశబ్దమున కాచ్ఛికమే యర్థ మనుటకు వీలు లేదు. అది య ట్లుండఁగాఁ దెనుఁగు, ఆంధ్రము అనునవి భిన్నము లనునభిప్రాయమును యుక్తము గాదు. (బా.సూ.) కావున నీసూత్రమందలితెలుఁగుశబ్దము సంస్కృతసమసహిత మగుతెలుఁగుభాషను మొత్తమును బోధించును. చూపట్టెడు ననుటచేఁ దత్సములపైఁ గలుగుటను బ్రయోగానుసారముగా గ్రహింపవలసినదే. ప్రయోగములం దొకవేళ నుండుచోఁ దత్సమములమీఁదిమయప్రయోగమును సంగ్రహించుటకు సూత్రము నందలితెలుఁగుపదమే సమర్థ మయియున్నది. కావున సుబో. సముచ్చయార్థకశబ్దముచే నీయర్థము సాధించుట సరి కాదు. దానివలన నావ్యాఖ్యయు తెలుఁగు, ఆంధ్రము భిన్నము లనునభిప్రాయమును గల్గించుచున్నది.

సంస్కృత మైన మయట్ ప్రత్యయము సంస్కృతమునం దవుట సాధారణ మయియుండఁగాఁ దెలుఁగుపైఁ గన్పించుట విశేషముగా సంస్కృతమునందువలె ననునర్థముననే సముచ్చయార్థకము ప్రయోగింపఁబడిన దని గమనింపఁదగును.

వ్యాఖ్య లెల్ల నీవిధానము నాదరించినవి. కానీ సంజీవనీవ్యాఖ్య మాత్రము తిరస్కరించినది. మయట్ ప్రత్యయార్థక మగు 'మయ' పదము తెలుఁగునఁ గల దనియు బ్రోవులయొక్క మయము=బ్రోవులమయము అనురీతిగా నీయవి సమాసము లనియు వఝులవారిసిద్ధాంతము (వ్యా.సం.స.1313). ఇది మిక్కిలి యసంమజసము. (చూ.బా.సూ.)

కాఁగా మయప్రత్యయార్థకముగాఁ దెలుఁగున మయము అనుపదము గల దనరాదు.

అ ట్లని యీలక్షణ ముచిత మని యంగీకరింపను రాదు. సంస్కృతప్రత్యయ మేమి? తెలుఁగుపదములపై వచ్చు టేమి? ఇది భాషాస్వభావమునకుఁ గొంత యనుగుణము కావచ్చు నేమో, కానీ శాస్త్రసంప్రదాయమునకు మాత్ర ముచితము గాదు.

ఇంకఁ దెలుఁగుపదములపైఁ గన్పించునీ'మయ'ను తెలుఁగుప్రత్యయముగా సాధించుకొనుటయే సముచితము. ఇం దనాంధ్రవర్ణములు లేవు. ప్రత్యయమునం దీవర్ణము లుండరా దను నియమము లేదు. అట్టియెడల మయ యనుదాని నచ్చతెలుఁ

గుతద్ధితప్రత్యయముగా సమన్వయించుట యుక్తము.

తనమయము, ప్రోవులమయ మనురీతిగా నీయది షష్ఠ్యంతములపైఁ గాన నవుటయుఁ బ్రత్యేకతయే.

కావున షష్ఠ్యంతములకుఁ బైని బ్రాచుర్యార్థమున మయప్రత్యయమును విధించుకొనుట యనఁగాఁ దెలుఁగుప్రత్యయముగాఁ జెప్పుకొనుట సముచిత మని నిర్ణయింపఁదగును.

ఇదే విధముగా మేల్తర మనుచో సంస్కృతప్రత్యయమగు 'తర' వచ్చిన దనుటయు సరి కాదు.

'ఒకానొకచో దరవర్ణకం బాచ్ఛికంబులమీఁదను గానంబడియెడి' (ము.ల. కౌ. తద్ధి. 31) తెలుఁగుప్రత్యయముగాఁ జెప్పుకొనుట సముచితము.

ప్రౌఢవ్యాకర్త కారేఫప్రత్యయములనే (ఇఫలో ఫ వర్ణ మనాంధ్ర మున్నను) తెలుఁగునఁ బ్రత్యేకముగాఁ జెప్పెను. (లడాదులను సూరియు నిట్లే విధించుట గమనింపఁదగును.)

మొత్తముపై నిట్టివిశేషప్రయోగములను సంగ్రహించు టవసరమ యైనను సంస్కృతప్రత్యయమే తెలుఁగుపదములపై నవు ననుట మాత్రము సరి కా దనక తప్పదు.

## ఇది తద్ధితపరిచ్ఛేదము

# ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యానుశీలనము

## క్రియాపరిచ్ఛేదము

తెలుఁగునందలిలక్షణగ్రంథములు క్రియాపదములను గొంచెమో గొప్పయో నిరూపించినవి. ఆచ్ఛికక్రియాపదములనిరూపణమునఁ బ్రత్యేకశ్రద్ధయే కాక క్రియా పదములనిరూపణమున విశిష్ట మగుప్రణాళికను సిద్ధము చేసికొని బాలవ్యాకరణము నందుఁ గ్రియాపరిచ్ఛేద మింకను బ్రత్యేకతను సంతరించుకొన్నది. ప్రౌఢవ్యాకరణ మితరవిశేషములను గొన్నింటి నీప్రకరణము బ్రతిపాదించుచున్నది.

### ద్వికర్మకములు

**35. అడుగ్వాదులు ద్వికర్మకంబులు.**

అడుగు మొద లయినధాతువులు రెండు కర్మలు గలిగిన వైయున్న వని యర్థము 'ఈయర్థమును వాని నడుగుము' అనుచో 'నర్థము, వానిని' నను నవి రెండు కర్మములు. అడుగు – యాచించు మున్నగున వని కు.పం.(148) పేర్కొన్నది.

వచ్యర్థాముఖ్యకర్మంబున (బాల.కార.6) కనుసూత్రమున నముఖ్యకర్మను బ్రస్తావించిన సూరిలక్షణము ననుసరించి ముఖ్యకర్మము నముఖ్యకర్మము నని రెండు కర్మ లుండుటను సూరియే భంగ్యంతరముగా సూచించినట్లు సర్వ.(502) స్పష్టము చేసినది. స్పష్టత ప్రస్తుతసూత్రమునకుఁ బ్రయోజనము.

### అంతర్భావితప్రేరణములు

**34. కరఁగు తలఁగు మెఱయ్వాదు లంతర్భావితప్రేరణంబులు.**

కరఁగు ప్రభృతులు స్వార్థముతోపాటు ప్రేరణార్థమును గూడఁ గలిగి యుండును. అనఁగాఁ బ్రేరణార్థకము లగునించుగాదులు చేరకయు నీయవి ప్రేరణార్థకము లగును. 'బాణములు గూడ నైదు కరఁగి' యనుచో 'కరఁగి' అనుదానికి 'కరఁ

గించి' యనురీతిగాఁ బ్రేరణ మర్థము. కు.పం.వ్యాఖ్య శ.ర. ననుసరించి ప్రయోగములు వీనికిఁ జూపినది. (147) ఇతరవ్యాఖ్యలు నివి గ్రహించినవి. (తత్త్వ.371. సుబో.264 మొ.)

అదిపదముచే ఆఁగు, కురియు మున్నగువానిని గ్రహింపవలయు నని సర్వ. స్పష్టము చేసినది. (501)

కరఁగించు, మెఱయించు ఆఁపు అనురీతిగాఁ బ్రేరణార్థమునం దించుగా ద్యాగమములతోడిరూపములును వీనికిఁ గలవు.

## మహద్బహుకర్తృకక్రియ - వచనము

**6. మహద్బహుకర్తృకక్రియకు నేకవచనంబు విభాష నగు.**

చెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడున్.

ఇందుఁ బడుట యనుక్రియకుఁ జెప్పనివాఁడు, సత్యము చెప్పనివాఁడు అను నిరువురు కర్తలు. కావున నీక్రియ బహుకర్తృకము. కర్తలు మహత్తు లవుటచే క్రియ మహద్బహుకర్తృక మైనది. బహుకర్తృత్వము ననుసరించి క్రియ బహు వచనమునందే ప్రయోగింపవలసియున్నది. ప్రస్తుతసూత్ర మేకవచనమును విభాషగాఁ జెప్పినది. 'పడుదురు' అనుబహువచనమునకు బదులుగా 'పడున్' అనురీతిగాఁ గ్రియ యేకవచనమునఁ బ్రయుక్త మయినది.

సూత్రమందలిమహచ్ఛబ్దముచే మహతిని గూడ గ్రహింపవలె నని సర్వ. పేర్కొన్నది. (335) మహతీవాచకములు పెక్కు కర్త లున్నపుడు సైతము క్రియ యేకవచనాంతముగా విభాషగా నుండవచ్చు నని యావ్యాఖ్యయభిప్రాయము. అట్టిప్రయోగము గల దేమో వెదుకవలసియున్నది. సర్వనామక్రియాపదంబుల బహువచనంబులు మహతికి మహత్తునకుం బోలె నవును గావున న ట్లూహింప వచ్చును. కాని మహచ్ఛబ్దము రెంటికిని బోధక మగుట యేకశేష మయి కలదు. కావున ని ట్లర్థము చేయుట దోషము గాదు. లక్ష్యమే కావలసియున్నది.

తత్త్వ. పరిశీలింపఁగా సూత్రమున మహత్పద మనావశ్యకము. కర్త లమహత్తు లయినను బాల.క్రి.25 సూ.చే ఏకవచనము గలదు. అయిన నిట వైభాషిక మగుటచే నియ్యది రానిపక్షమున బహువచనము వచ్చు ననుసందేహము కలుగకుండుటకై

యమహత్తుల నిందు తప్పించునభిప్రాయముతో మహత్పదమును జేర్చె నని భావింపవలె (343) నన్నది. కాఁగాఁ బరిశీలించినపిదప నమహత్తులకు వైభాషికము గాకుంటనుబట్టి మహత్పదము సార్థకమే యని యెంచుటచే ముం దనావశ్యక మనుట యనవసరము.

ఇట నిం కొకభేదము కలదు. బాల.క్రియ. 25 సూత్రముచేత నమహత్తు లయినచో నెట్లును నేకవచనము వచ్చు ననుట సరి కాదు.

ఆసూత్రము తిర్యగ్జడములు వాచ్యము లగునపుడే యట్టికార్యమును బేర్కొన్నది. అమహత్తే యైనను మహతీకర్తృకమున కాకార్యము రాదు. రుక్మిణియు సత్యయు వత్తురు, వచ్చిరి యనురీతిగాఁ గ్రియాపదము మహద్రూపముననే (బహువచనముతో) యుండును. చిలుకలు పలుకు ననువిధముగా, రుక్మిణియు, సత్యయు వచ్చును, లేదా వచ్చెను అనురీతిగా నేకవచన ముండదు.

ఇంకను బాల.సూత్రము లిడ్లాట్టులయందు మాత్రమే ప్రథమబహువచనమున కేకవచనము చెప్పుచున్నది. ప్రస్తుతసూత్ర మట్లు గాదు. ఇట సూత్రకర్త తద్ధర్మార్థక క్రియ నుదాహరించినను నాయర్థమునందే యేకవచన మవు నని చెప్పలేదు. లడాదులందుఁ బ్రౌఢ.లక్షణము ప్రవర్తింప దనుటకు వీలు లేదు. సూరిలక్షణ మట్లు గాదు. కాఁగా నిత్యముగా నవు ననినది లిడ్లాట్టులయందే. ప్రథమపురుష యందే. తిర్యగ్జడకర్తృకములకు మాత్రమే. కావున నీసూత్రము విభాష యన్న యన్నితావులందును బాల.చే నిత్యముగా సిద్ధించుచున్న దనుటయు సరి కాదు.

ప్రస్తుతసూత్రరచనమును నిర్దుష్టము గాదు.

మహద్బహుకర్తృకక్రియ యనుటలోనియొకలోపమును తత్త్వ. (342) సర్వ. (335) వ్యాఖ్యలు పేర్కొన్నవి. మహద్వాచకము లగుకర్తృవాచకశబ్దము లేకవచనాంతము లైనపుడే యవు ననియు చెప్పనివారు, సత్యము చెప్పనివారు అనురీతిగా బహువచనాంత మైయున్నపు డేకవచనము విభాషగా సైతము రా దనియు నీవ్యాఖ్య చెప్పినయర్థము సముచితము. ఈయర్థమును సాధించుటకు సూత్రమునం దాధారము లేదు. ఏకవచనాంతమహత్కర్తృకపదంబులు పెక్కు లున్నను అని (335) సవరింపవలె నని సర్వ. పేర్కొన్నది.

కర్తృపదములు పెక్కు లుండక యొక్కటే యుండి బహువచనాంత మైనను

నాక్రియ బహుకర్తృకక్రియయే యవును. సత్యము చెప్పనివారు అని మాత్రమే ప్రయుక్త మైనను పడు అనునది బహుకర్తృకమే. అపుడును నేకవచనము వచ్చునా? 'చెప్పనివారు నరకమునఁ బడును' అనుట యొప్పునా? కావున మహద్బహుకర్తృ క్రియ యనుదళము సూత్రకర్త యుద్దేశించినయర్థ మీఁజాలదు. సర్వ. సవరణము కొంత యుచితమే కాని యంతమాత్రముచే లక్షణము నిర్దుష్టము గాదు.

'క్రియ కేకవచనంబు' అనుసామాన్యనిర్దేశమువలన నన్నిలకారములయందును విభాషగా నేకవచనము రావలసియున్నది. చెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును నరకమునఁ బడెను అనురీతివ్యవహారము లక్ష్యవిరుద్ధము గదా.

సంజీవనీవ్యాఖ్య ఆరామవిభున కీయంగనామణియు, నీరామ కారామన్న పతియుఁ దగు (రంగనా.) ననియు, బలము గలవాఁడు, తేజము గలవాఁడును, నధికసేన గలవాఁడును రాజనామము దాల్చున్ (ఆది. 47) (వ్యా.సం.స. 1379) అనుప్రయోగములు చూపినది.

వీనింబట్టి లాట్ప్రథమపురుషబహువచనమే యేకవచన మగుట కానవచ్చుచున్న దన్నమాట.

హాటకేశ్వరుఁడు, మహాకాళనాథుండు, దారకేశ్వరుండు, దలిరుబోఁడి యిచ్చట లింగము లయియున్నారు. (కాశీ. 3. 104) అనురీతిగా బహువచనమే ప్రయోగ ప్రసిద్ధము.

కావునఁ బ్రయోగానుగుణముగా నావిషయమునే చెప్పఁదగును. మహద్బహు కర్తృకక్రియ కని సామాన్యముగాఁ జెప్పు టుచితము గాదు. పడున్ అనుతద్ధర్మ క్రియను జూపుటలో తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపు డనుసూరిలక్షణము సరి గా దని నిరూపించునుద్దేశము ప్రౌఢవ్యాకర్త కుండియుండవచ్చును. కానీ యితరము లగులకారముతోడిక్రియ నొక్కటి నేని చూపిన బాగుండెడిది.

'తిర్యగ్జడేతరములు వాచ్యము లగునపుడును లాట్టు ప్రథబహువచనంబున కేకవచనంబు చూపట్టెడి' ననురీతిగాఁ జెప్పుట యొకమార్గము.

ప్రథమేతరపురుషలయందును నీకార్యము గానరాదు గదా.

నీవు నేనును వచ్చితిని, వాఁడును నీవును వచ్చెను. అనువ్యవహార ముందునా? కావునఁ బైసూత్రకర్తలక్షణ మతివ్యాప్త మవుచున్నది.

సంజీవనీవ్యాఖ్య యీసూత్రమే యనవసర మన్నది. ప్రత్యేకాన్వయముతో చెప్పనివాఁడు పడున్, సత్యము చెప్పనివాఁడును బడున్ అనురీతిగా నేకవచనము సమన్విత మగు నని ఘం. (331) స్పష్టము చేసినది. ఇయ్యది సంస్కృత సంప్రదాయానుగుణము నవును. కావున నంగీకార్యమె (వ్యా.సం.స. 1379) దీనినే ఘం. అనువదించినది. (331) ఈయభిప్రాయ ముచితమే.

కర్తృవాచకము లేకవచనాంతము లై పెక్కులుగా నుండునపుడే యి ట్లేకవచన మగుటయు, నట్లు గాక కర్తృపదమొక్కట యయి బహువచనాంత మయియున్నపు డీరీతిగా నేకవచనము గాన్పింపకుండుటనుబట్టియు నిట్టిప్రయోగములు విభాష యని చెప్పఁదగినంత ధారాళము గాకుండుటంబట్టి కూడఁ బ్రత్యేకాన్వయమార్గమే సముచిత మని నిర్ణయింపఁదగును. కావున నీసూత్రము చెప్ప నక్కఱ లేదు. ఇట్టి ప్రయోగములను గుర్తింపఁజేయుట మాత్రము ప్రయోజనముగా గ్రహింపవచ్చును.

## అనేకకర్తృకక్రియ

### 15. అనేకకర్తృక క్రియ సమీపకర్తయొక్క లింగవచనంబులగు (వాక్య)

క్రియకుఁ గర్త లనేకము లయినను నాక్రియాపదమునకు సమీపమునందుఁ బ్రయుక్త మవునట్టికర్తయొక్క లింగవచనములే యాక్రియకు నవు నని సూత్రము నర్థము.

'ఏవానిబంధుమిత్రులు జీవధనంబులు దప్పిఁ జెందును' అనుచోఁ జెందు క్రియకు బంధుమిత్రులు, జీవధనంబులు అనునవి కర్తలు. ఇందు మొదటిది మహత్తు బహువచనాంతము. రెండవది యమహత్తు. బహువచనాంతము. చెందు అనుక్రియకు సమీపములోఁ బ్రయుక్త మయినకర్తృవాచిశబ్దము జీవధనంబులు. కావునఁ గ్రియాపదము నమహదర్థమునందే ప్రయుక్త మైనది. జీవధనంబులు అనురీతిగా నాకర్తృపదము బహువచనాంత మవుటచేఁ గ్రియకును బహువచనమే యవు. కాని యది జడ మగుటచే బాల.క్రియ. 25చే నేకవచన మైనది.

తమసేనలను వారును విశ్రమించిరి. అనుచో సమీపకర్త మహత్తును బహువచనాంత మవుటచే సేనలు 'విశ్రమించినవి' అని కాక 'విశ్రమించిరి' అని మహదర్థమునను బహువచనాంతముగను బ్రయుక్త మయినది.

సూత్రమునందలిలింగశబ్దము మహత్త్వామహత్త్వములను జెప్పునదిగాఁ దలంపవలె నని తత్త్వ. (399) పేర్కొన్నది. సూత్రకర్తయభిప్రాయము సయిత మదియే కావచ్చును.

కానీ లింగశబ్దమునకు మహత్త్వామహత్త్వము లని యర్థము చేయుటకు నాధారము గానరాదు. తెలుఁగులోనిమహదమహద్విభాగమును సంస్కృతమందలి పుంలింగాదివిభాగమును భిన్నములు. పుంలింగము మహ త్తని, స్త్రీలింగము మహతి యని, నపుంసకలింగము మహతీతరామహ త్తని నిర్ణయించుటకు వీలు లే దనుట ప్రసిద్ధము. (బా.సూ.)

సూత్రకర్త లింగ మవు ననుచున్నాఁడు. బాల. క్రియాపదములను సాధించు నపు డమహదర్థంబున, మహదర్థ మనురీతిగనే వ్యవహరించెను గానీ పుంలింగాది గా లింగశబ్దముతోఁ బేర్కొనలేదు.

వృక్ష మున్నది యందుమే కాని వృక్ష మున్నాఁ డనము.
భార్యలు మెత్తురు అందుమే కాని భార్యలు మెచ్చును అనము.
మిత్రము మెచ్చుగలఁ దందుమే కాని మిత్రము మెచ్చుఁగల దనము.

కావునఁ గ్రియలకు సైతము లింగముతో వ్యవహారము తెలుఁగున లేదు. కాఁ గా 'మహదమహత్త్వవచనంబు లగు' ననురీతిగాఁ జెప్పుట సముచితము.

వచనమునకు సూత్రకర్త ప్రత్యేకలక్ష్య మీలేదు.

ధరణియు బుక్షములు, బరాశరుడు తోయధియు నింతపుణ్యంబు సేయునె. (శాంతి. 2. గీ) అనులక్ష్యమును వ్యా.సం.స. అదనముగాఁ జూపి, తోయధి యనుదానికి సరిగనె లింగవచనములు ప్రయుక్త మయిన వన్నది (1777). (ఘం. 333) తోయధి పుంలింగము. చేయును ఏలింగమో? భిన్నలింగమునం దైన నె ట్లుండునో స్పష్టము చేయవలసినది. ఇట నొకయనుమానము.

అనేకకర్తృకక్రియ యని సామాన్యముగాఁ జెప్పుటచేతను మహద్బహుకర్తృక క్రియ కింతకు మున్ను చూపినలక్ష్యము దీనిచేతనే సిద్ధించునవకాశము గల్గుచున్నది. చెప్పనివాఁడును, సత్యము చెప్పనివాఁడును పడున్ అనుచో సమీపకర్త యగు సత్యము చెప్పనివాఁడు అనుదాని ననుసరించి యిది యేకత్వమునఁ బ్రయోగింపఁ బడుటను సాధింపవచ్చును. సమీపకర్త యనఁగా వ్యవధానము లేక క్రియ వెనుకనే

కర్త యుండఁ బనిలేదు. 'ధాత్రీజాదుల్ నరవర నీ కేయపకృతి గావించె' ననుచో సూత్రకర్త చూపినలక్ష్యములలో నిట్టివ్యవధానము కలదు. అట్లే అంగనామణియు రామనృపతియుఁ దగును. బలము గలవాఁడును సేనగలవాఁడును రాజనామము దాల్చున్. అనునవియు దీనిచేతనే సిద్ధించును. అటఁ గర్త లెల్ల నేకవచనాంతములే కావలెను గాన నేకవచనములో నుంట కిబ్బంది లేదు. లాడ్భిన్న లకారమా కనరాదు. అట్టియెడ నాసూత్ర మేల? అవి దీనిచేతనే సాధింపవచ్చును.

కానీ వీన నొకభేద మున్నది. 'డప్పిఁ జెందును' అనుప్రస్తుతలక్ష్యస్థలములోఁ 'దప్పిఁ జెందుదురు' అనురీతిగా నిం కొకరీతిప్రయోగము కుదురదు. కాని పైని 'కుందుదురు' అన్నట్లు నరకపంకమునఁ 'బడుదురు' అనియు ననవచ్చును. కావున నద్దానిం బ్రత్యేకముగాఁ జెప్పవలసివచ్చిన దని సూత్రకర్త యట్లు సూత్రించెను.

ఈసూత్రమునందు 'లింగవచనంబు లగు' నని యందులకే నిత్యముగా విధించి యుండవచ్చును. అట విభాష నగు నన్నాఁడు గదా.

కానీ ప్రస్తుతలక్షణమునను సవరణాపేక్ష లేకపోలేదు.

రాముఁడును సీతయు వచ్చుచున్నారు. అనుచో సమీపకర్తయొక్క లింగ వచనము లయినచో వచ్చుచున్నది యనురీతిగాఁ బ్రయోగింపవలసియుండును. మహద్బహుకర్తకక్రియకు లక్ష్యము చేసినచో వచ్చుచున్నారు అనియుఁ గావచ్చును. కాని యేకవచన మైన నె ట్లుండును? వచ్చుచున్నది యని యుండునా, లేక వచ్చుచున్నాఁడు అని యుండునా? విభాషాపదమునకు వ్యవస్థ చేయవలయునా?

అస లిట వచనమును గూర్చి చెప్పవలసినయవసరము లే దేమో యనిపించెడిని. ఇంతకు ముందు సూత్రమునవలెనే యిటఁ గూడ లిడ్లాట్టులే ప్రదర్శింపఁబడినవి. కొన్నియెడల లిడ్లాట్టులలో బహువచనమున కేకవచన మవును.

'తనసేనలు వాఁడును విశ్రమించెను' అనుచో నిబ్బంది లేకపోవచ్చును. కాని కర్త లెల్ల బహువచనాంతము లై యుండ సమీపమునం దున్నమహత్కర్త మాత్ర మేకవచనాంత మైయున్నఁ గ్రియ యేకవచనాంతమే యవునా? అట్టిదానికి లక్షణ కర్త లక్ష్యమును బ్రదర్శింపలేదు. 'కపిశ్రేష్ఠులును రాముఁడు లంకపై వెడలిరి' యనుట తప్పా? 'వెడలెను' అనియే యనవలెనా? 'వెడలెను' అనుట యుక్తమా? మహద్బహుకర్తృకక్రియ కనుసూత్రమున కిది లక్ష్య మవును గావున వెడలెను అనవచ్చునే. విభాషకు వ్యవస్థ చేయవలెనా?

ఒకవేళఁ బూర్వమునం దున్నకర్త లమహత్తు లయినచో నెట్లు? 'సర్వభూతంబులు నసురుఁడును వినాశగతుఁడు కాఁడె' యని యుండఁదగునా? మహద్బహుకర్తృక క్రియ యనుసూత్ర మిటఁ బ్రవర్తింపనేరదు గావున నేకవచనము నిత్యముగాఁ గావలెనే. కాఁగా 'సర్వభూతంబులు నసురుఁడు వినాశగతులు కారె' యనుట దుష్ట మనవలె. 'వానిసేనలును వాఁడును వచ్చుచున్నాఁడు' అనురీతిగా నుండునా? 'కాంచిరి తామరయు నెలయు ఘనసుఖవృత్తుల్' అని యహోబలుఁడు చూపెను. (కవిశి. 701)

అట్టియెడల మహత్తు లైన, నమహత్తు లైనను గర్తృబహుత్వము ననుసరించి క్రియాపదము బహుత్వమునందె యుండును. ఇంక సమీపకర్తయొక్క మహత్త్వామహత్త్వములు మాత్రమే క్రియకు నగుట విశేష మని చెప్పవచ్చును.

అనగా 'అనేకకర్తృకక్రియకు సమీపకర్తయొక్క మహత్త్వామహత్త్వంబు లగు' నని చెప్పె ననుకొందము. అపుడు సూత్రకర్త యిటఁ జూపినలక్ష్యములును సిద్ధించును. వీనితోపాటు 'రాముఁడును సీతయు వచ్చిరి' యనుచో గర్తృ బహుత్వమునుబట్టి బహువచనము నుండుటకు నవరోధము లేదు. సీత యమహ త్తయినను గ్రియ బహుత్వమునం దుండవలయుటచే కర్తృబహుత్వము ననుసరించి మహతికి బహుత్వమున నిట మహద్రూపము వచ్చును గదా. కావున 'వచ్చిరి' యని యుండుటలో నిబ్బంది లేదు.

కపిశ్రేష్ఠులును రాముఁడును వచ్చిరి. సేనలును వాఁడును వచ్చిరి. సర్వభూతంబులు నసురుఁడును వచ్చిరి యనురీతి ప్రయోగమున కిబ్బంది లేదు.

కాఁగా వచనములను గూర్చి ప్రస్తావింపక సమీపకర్తయొక్క మహత్త్వా మహత్త్వము లవుటనే పేర్కొనుట యుచిత మని తోఁచుచున్నది.

చివరిలక్ష్యమునం దిం కొకవిశేష మున్నది. 'సర్వభూతంబులును దేవాసురులు వినాశగతులు కారె' యనుచో వినాశగతులు అనుసమీపకర్త ననుసరించి 'కారె' యనునది మహదర్థముతో బహువచనాంతముగాఁ బ్రయుక్త మవుట సూత్రసిద్ధము. కాని 'వినాశగతులు' అనురీతిగా విశేషణము సయితము మహద్రూపమునే యందుట విశేషము. 'సర్వభూతంబులు' అనుదాని ననుసరించిన 'వినాశగతములు కావె' అని కావలె ననియు 'దేవాసురు' లనుదానింబట్టి 'వినాశగతులు కారె' అని యైన దనియు సర్వ.(584) పేర్కొన్నది. అనఁగా 'వినాశగతులు' అనుచో మహద్రూపము

సైత మీసూత్రముచేతనే యైన దని తాత్పర్యము. వినాశగతి శబ్దము విశేషణము గదా! దాని కె ట్లగును? ఇది వినాశగతి(ఇదంత)శబ్ద మవుటచే మహ దమహదర్థములు రెంట వినాశగతు లనియే యుండును గాని 'వినాశగతములు కావు' అని యుండ నక్కఱ లేదు.

ఇటఁ గు.పం. ఒకవిశేష మిట్లు చెప్పినది. క్రియా. సూ. 26 క్రిందఁ జూపఁ బడిన నేను నాసేనయు దాడివెట్టెద మన్నగులక్ష్యము లీసూత్రమునకు బాధకములు కావునఁ బ్రథమపురుషయందే యీసూత్రము వర్తించు నని వ్యవస్థ చేసికొనవచ్చును. (160) లక్ష్యములు బాధకము లన నాలక్షణము బాధక మనవలె. అట్టియెడల నయ్యది 'తత్కర్తృకంబులు విభాష నగు' నని విభాషగాఁ జెప్పఁబడినది. అది ప్రవర్తింపనిలక్షణమున దీనికి బాధ లేదు. కావున నిది ప్రవర్తించునా? ఐన 'నేను నాసేనయు దాడి పెట్టును' అనవచ్చునా? ఆసూత్రమునౌచిత్యము పైని స్పష్టము గాఁగలదు.

ఇంక నీవిధి ప్రథమపురుషయందే యవు నని వ్యా.సం.స. (1778) స్పష్టము చేసినది. ప్రథమయం దనువిషయము సూత్రమున స్పష్టము చేసిన నింకను నుచితముగా నుండెడిది.

మొత్తముమీఁద నీయంశము చెప్పఁదగినదే. కాని సూత్రము నిర్దుష్ట మని చెప్పుట కవకాశము చాలదు.

## యుష్మదస్మత్కర్తృకక్రియ - వచనము

**26. ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాష నగు.**

సహార్థమున యుష్మదర్థ మభిహిత మగుచోఁ గ్రియ తత్కర్తృక మగును. 'నీవును నీనిషాదియున్ వెల్వడుము' అనుచో నిషాది యన్యము. అయినను నీవు అనుయుష్మదర్థ మభిహిత మయినది కావునఁ గ్రియ తత్కర్తృక మై, తదనుగుణముగా మధ్యమపురుషైకవచనమునం దుండి(వెల్వడుము)నది.

ఇట్లే సహార్థమున నస్మదర్థ మభిహిత మైనపుడు క్రియ తత్కర్తృక మగును. 'నేను నాసేనయు దాడివెట్టెదను' అనుచో సేన అన్యము. అయినను నేను అనునస్మదర్థ

మభిహిత మైనది గావునఁ గ్రియ తదనుగుణముగా నుత్తమపురుషైకవచనమునం దున్నది.

కు.పం. సముచ్చయము సహార్థవ్యంజక మని వివరించుట (145) యుక్తముగా నున్నది. బాల.చే సహార్థమందుఁ దోడ రావలసియున్న దను (145) కు.పం. ప్రభావముచేతఁ గాఁబోలును, సర్వ. 'సూత్ర మున్నతీరునుబట్టి తోడప్రత్యయ మున్నపుడే పైకార్యము జరుగు నని యనిపించును. కావున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు సహార్థంబున కొకానొకచో సముచ్చయార్థం బగు, అగుచో గ్రియలు విభాషను దత్కర్తృకంబు లగు అని యుండిన యోగ్యతరముగా నుండెడి' (499) దన్నది. సవరణ ముచితముగాఁ గానరాదు. సహార్థంబునకు సముచ్చయార్థం బగు ననఁగా సహార్థము పోయి సముచ్చయార్థము కలుగునా? సహార్థమున కనుటలో నాయర్థమునం దైన తోడ ప్రత్యయస్థానమున సముచ్చయార్థకం బగు నుశబ్దము చేరు నని వ్యాఖ్యభిప్రాయ మనవచ్చును.

'బ్రదుకు దీవు తమ్ములు సుతులున్' అనుచో సహార్థమున ముందు తోడ ప్రత్యయముతో– తమ్ములతోడ సుతులతోడ వని యగును. సహార్థక మగుతోడ ప్రత్యయముస్థానమున చార్థకమును జేసిన తమ్ములయును, సుతులయును అని కదా కావలయును. విభక్తికార్య మగు లట్టు గూడఁ బోవునా? అదియు సహార్థక తోడ ప్రత్యయమునదే యని దానిని దొలఁగింతము. అపుడు తమ్మును, సుతును అని గదా యుండవలయును. ఇట బహుత్వార్థము లభించునా? అస లిట్టి రూపములె యుండవు.

పైఁగా బైని లక్ష్యస్థలములందు నీవును నీనిషాదియున్, బ్రదుకు దీవుఁ దమ్ములు సుతులున్ అనురీతిగా యుష్మదర్థకము సైతము సముచ్చయార్థకనుశబ్దాంత మయి యున్నది.

కాగా నీసర్వ. చూపినసవరణము సమంజసము గాదు.

తత్త్వ. సముచ్చయార్థంబున ననుట తగు నన్నది. (365) సహార్థంబున ననుదానికి 'కూడ' అనునర్థము నొకవేళ సూత్రకర్త యుద్దేశించినను విస్పష్టముగా భ్రాంతి లేకుండఁగా సముచ్చయార్థంబున ననుట యుక్తమే. దీనివలనఁ బైసర్వ. వివరణమందలిలోపము లెల్ల వారింపఁబడును. తమ్ములు సుతులున్ అనురీతిగాఁ బ్రథమాంతప్రయోగము నిర్బాధ మయి, యర్థము చక్కగాఁ గుదురును.

సహార్థమున అనుచోఁ బ్రధానకర్త మాత్రమే క్రియలోని కన్వయించును గావున నభిహితము లగుయుష్మదస్మదర్థకశబ్దములే కర్తలుగాఁ గ్రియలోనికి అన్వయించు చుండఁగా మఱల విధించుట వ్యర్థ మను తత్త్వ. (364) అభిప్రాయ మెంతయు సముచితము.

ఇట్టియెడల సహార్థంబున ననుట వ్యర్థము. సముచ్చయార్థ మవసర మని గుర్తింపవచ్చును.

కు.పం. తదనుగుణముగ నేకవచనాంతక్రియ నుపయోగించవచ్చు నని తెలుపుచున్నాఁ (145) డన్నది. సుబో. ఇట్టియభిప్రాయమునే గల్గినట్లు తోఁచును. 'అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తంబు బలీయం' బనుదానిచేత యుష్మదస్మత్ ప్రాధాన్యము స్పష్టమే. ఐనను గర్తృబహుత్వము ననుసరించి క్రియ బహువచనాంతమె కావలసియుండుటచే నీనాశబ్దము లభిహితము లైనపుడు క్రియ యేకవచనాంతము విభాష నగు నని యీప్రౌఢవ్యాకరణపూరణమునకుఁ దాత్పర్య' (223) మన్నది.

ఇట్లు నీనాశబ్దము లభిహితము లైనఁ గ్రియ యేకవచనాంత మగు నని సామాన్యముగఁ జెప్పుట సమంజసము గాదు. మేము మాసేనయు దాడి పెట్టెదము, బ్రదుకుదురు మీరును సుతులున్ అనురీతిగా నుండుట విరుద్ధమా? అనఁగా నభిహితము లగుయుష్మ(దస్మ)దర్థకములు బహువచనాంతము లగుచోఁ గ్రియ యేకవచనాంతము గానేరదు గదా.

ఇంకఁ దత్త్వ. నీనాశబ్దములనుబట్టి మధ్యమోత్తమపురుషప్రత్యయములె వచ్చు (363) నన్నది. దీనింబట్టి యుష్మదస్మదర్థములు బహువచనాంతము లైయున్నపుడు క్రియాపదము బహువచనాంతమే యవుట సిద్ధించును.

కానీ యీయర్థము ననుసరించిన సూత్రము వ్యర్థము గాక తప్పదు. ఘం. పేర్కొన్నట్లుగా 'నన్యయుష్మదస్మత్కార్యములం' దనుబాల.లక్షణముచేతనే యిట మధ్యమోత్తమపురుషప్రయోగము సిద్ధించుటచే నీసూత్ర మేల? తత్త్వ. ఈవిషయము గుర్తింపకపోలేదు. ఇం కొకకారణమునుబట్టి యీసూత్ర మనావశ్యక మని నిర్ణయించినది. అది పైని జూతము.

కు.పం., ఘం. వ్యాఖ్యలు భావించినట్లుగా నేకవచన మగుటయే సూత్రకర్త యుద్దేశ మనుట కాధారము లేకపోలేదు. విభాష యని చెప్పినసూత్రకర్త పక్షమున

'మోహాంధుండు భీష్ముండు కేశవ నీవుం గడగుండు' అని బహువచనమును జూపెను. అనఁగా సూత్రముచే నేకవచనము రానిపక్షమున బహువచన మవు నని సూత్రకర్త యభిప్రాయము. నీవును నీనిషాదియున్ వెలువడుము అనునీ సూత్రములక్ష్యము నందును 'కడగుండు' అనుపక్షాంతరలక్ష్యమునందును యుష్మత్కర్తృకత ననుసరించి క్రియ మధ్యమపురుషమునం దుంట రెంట సమానమే. ఇంక విశేషము సూత్రము ప్రవర్తించినపు డేకవచన మగుటయే. అనఁగా అన్యయుష్మదస్మత్కార్యంబులం దను సూత్రము ననుసరించియే మధ్యమోత్తమపురుషలయం దుండుట సిద్ధించు ననియు నీసూత్రము విశేషముగాఁ జెప్పునది యేకవచనాంత మగుటయే యనియు గ్రహింప వలసియున్నది.

అట్టియెడల నీసూత్రరచనమునం దిం కొకలోప మేర్పడినది. అభిహితము లగుయుష్మదస్మదర్థము లేకవచనాంతములే కావలయు ననునియమము నేర్పఱుప వలెను. లేనిచో 'మేమును మాసేనయు దాడివెట్టెదము' అనుచో నెట్లు? ఇట బహు వచన మగుట బాల. కనుగుణము. యుష్మదస్మతర్తృకతావిధానముచే సూత్రముచే నిట విరోధము సంభవింపదు. కానీ సిద్ధసాధనమే యగును. పైఁగా నీసూత్రము విభాష నగు నన్నది. విభాషవలన నిది లేనపు డన్యకర్తృక మై 'మేమును మాసేనయు దాడివెట్టును' అనురూపాంతరము గూడ నేర్పడవలసివచ్చును.

యుష్మదస్మత్కార్యము లవుట యన్నది పూర్వసిద్ధ మవుటచేఁ జెప్ప నక్కఱ లేదు. ఇంక యుష్మదస్మదర్థకము లేకవచనాంతము లైయున్నపుడు క్రియ యేకవచనాంత మవుట యన్నదే విశేషము గావున విధింపవలసియున్నది.

కాఁగా 'నొకానొకచో సముచ్చయార్థంబున యుష్మదస్మదర్థంబుల కేకవచనం బగు' నని చెప్పఁదగు. తత్కర్తృకము లనుట యిట స్పష్టతకే. లేకున్నను దత్కర్తృకత బాల.చే సిద్ధింపఁగా నేకవచనము నిది సాధించును.

పక్షంబున నని ప్రారంభ మైనసూత్రకర్తవివరణ మీపక్షముననే యుచిత మగును. ఏల యనఁ బక్షంబున ననఁగా విభాష యవుటచే సూత్రము ప్రవర్తింపనియెడల నని యర్థము. సూత్రమున విధించినది యుష్మదస్మత్కర్తృకత. అనఁగాఁ బక్షమున ననుచో యుష్మదస్మత్కర్తృకత లేనిపక్షమున నని యర్థ మగును. 'నీవుం గడగుండు' అనుచోఁ గ్రియాపదము యుష్మదర్థకమే కదా. ఇంకఁ గర్తృబహుత్వము ననుసరించి (బహువచనమునకు) ఏకవచన మగుటయే భేదము. కావున నీవివరణము సార్థక

మగుటకును నేకవచనమును సూత్రముచే నిబంధింపవలసియున్నది.

ఏకవచనము సయితము విధింప నక్కఱ లే దని తత్త్వ. పేర్కొన్నది. కర్తృ వాచకము లనేకము లయినపుడు అయ్యవి వేర్వేఱుగాఁ గాని, అన్నియు గలిసి మొత్తముగాఁ గాని క్రియతో నన్వయింపవచ్చును. వేఱుగా నన్వయించు నన్నచోఁ గర్తృవాచకము లేకవచనాంతము లయినచోఁ గ్రియ కేకవచనము చేరును. అన్నియు గలసి మొత్తముగాఁ గ్రియతో నన్వయించుట వివక్షిత మయ్యె నేని బహువచనాంత మగును (365). కావునఁ బ్రత్యేకాన్వయముతో నేకవచనమును, లేనిపక్షమున బహువచనమును నవును. కావున నీసూత్ర మనావశ్యక మని తాత్పర్యము. ఈ వివరణమే యీసూత్ర మావశ్యక మని స్పష్టము చేయుచున్నది. ఎ ట్లనఁ బ్రత్యే కాన్వయపక్షమందును గర్తృవాచకము లేకవచనాంతము లైయున్నపుడు గదా క్రియ కేకవచన మగునది. తద్భిన్నమును సూత్రకర్తయే యిటఁ జూపెను.

'బ్రదుకు దీవు దమ్ములు సుతులున్' అనుచోఁ గర్తృవాచకములు ఈవు, తమ్ములు, సుతులు అనునవి మూఁడు. ఇందు 'ఈవు' అనున దేకవచనాంతమె. కాని 'తమ్ములు, సుతులు' అనునవి యేకవచనాంతములు కావు. ప్రత్యేకాన్వయపక్షమున ఈవు అనుకర్త యేకవచనాంత మైయన్వయించును గాక. తమ్ములు, సుతులు, అనుకర్తలు బహువచనాంతము లైయుండఁగా బ్రత్యేకాన్వయపక్షమును వానిక్రియ యేకవచనాంత మగుటయు నెట్లు? తమ్ములు, సుతులు అనువానికిఁ బ్రదుకుదువు అనుమధ్యమపురుషక్రియతో నన్వయ మస లెట్లు కుదురును?

తత్త్వ. పేర్కొన్నట్లుగాఁ బ్రత్యేకాన్వయము గుదురదు. పురుషభేద ముండుటచే నీసూత్రోదాహరణములలఁ బ్రత్యేకాన్వయము చెప్పుట కవకాశము లే దని (332) ఘం. సముచితముగాఁ బేర్కొనె. నీవును నీనిషాదియున్ వెలువడుము అనుచో బ్రత్యేకాన్వయపక్షమున నీవు కర్తగా నన్వయించుచుఁ గ్రియ మధ్యమపురుషయం దుండవలెఁ గాన సరిపడును. కాని నిషాది యనునది కర్తగా నన్వయించుచోఁ గ్రియ ప్రథమపురుషయందుఁ గదా యుండవలసినది. కావున నిటఁ బ్రత్యేకాన్వయ పక్ష మసలు కుదరదు.

'మహద్బహుకర్తృకక్రియ' కనుసూత్రమునొద్దఁ బ్రత్యేకాన్వయము గుదురుటకుఁ గారణ మవి ప్రథమపురుషకు మాత్రమె సంబంధించుట. అనఁగాఁ బురుషభేదము లేకుండుట. కావున నిద్దానికిని దానికిని బోలిక కుదురదు. (తత్త్వ. 365)

మహద్బహుకర్తృక్రియ కనుసూత్రము వ్యర్థ మని భావించితిమి గనుకనే యిట నేకవచనవిధానము నంగీకరింపవలసియున్నది. కాని లేనిచో నీవిధానమును నవసరము కాదు. ఎ ట్లన నా సూత్రమునఁ బ్రథమపురుషక్రియలయందే యని చెప్పబడలేదు గదా!

నీవును నీనిషాదియున్ వెలువడుము అనుచో నీయది మహద్బహుకర్తృక క్రియయే. అచ్చోట మహచ్ఛబ్దముచే మహతియు గ్రహింపఁబడుటలో నభిప్రాయ భేదము లేదు. ఆరామవిభున కీయంగనామణియు, నీరామ కారామనృపతియుఁ దగును (ఘం. 331) అనునది యుదాహరింపఁదగినదే. సంజీవనివ్యాఖ్యయు దీనిం జూపినది. కావున దీని కేకవచనము విభాషగా రాగా 'అన్యయుష్మదస్మత్కార్యంబులం' దనుసూత్రము ననుసరించి మధ్యమపురుషయు మహద్బహుకర్తృకక్రియకు నను సూత్రముచే నేకవచనమును రాఁగా 'వెలువడుము' అనియే యవును. ఇట్లే యితర లక్ష్యములును సమన్వయింపఁబడును. విభాష యవుటచే నేకవచనము రానపుడు 'భీష్ముడు కేశవ నీవుం గడగుండు' అనురీతిగా బహువచనమును నుండవచ్చును.

అట్టియెడల నాసూత్రమునే యుంచి యిది తొలఁగింపరాదా యనవచ్చును. దానికంటె నియ్యది స్పష్టత కుపయోగించు నని దీని నంగీకరింపఁదగును. అ ట్లని యీసూత్రము యథాతథముగా గ్రాహ్యము గా దనుటయు స్పష్టమే. 'ఒకానొకచో ననేకకర్తృత్వంబున యుష్మదస్మదేకత్వార్థంబు లభిహితంబు లగునపుడు క్రియ లేకవచనాంతంబులు నగు' నని చెప్పుట యుచితము గావచ్చును.

'కడగుండు' అనుక్రియను గూర్చి సుబో. ఈసహార్థమున 'నీవు' కర్త కానపుడు క్రియ 'కడగుండు' అనునది. ఇయ్యది యుష్మదర్థము క్రియకు కర్త కానప్పటి యుదాహరణము (259). సుగమ. నీవు, భీష్ముండును అనుకర్తల ననుసరించి బహువచనాంతమున నున్నది. ఇది యుష్మదర్థమునకు క్రియ కానట్టిది. అయినచో 'కడంగుము' అనియే యుండు (229) నన్నది.

ఈయభిప్రాయములు సరి గా వనుట స్పష్టము. క్రియ మధ్యమపురుషయందే యున్నది. కర్తృబహుత్వము నననుసరించి బహువచనాంత మయియున్నది. కడఁ గుము (ఏకవచనము) అనుదానివలెనే కడగుండు (బహువచనము) అనునదియు మధ్యమక్రియయే.

## అవయవకర్తృకక్రియ

### వాక్య. 17. కొన్నియెడల నవయవకర్తృకక్రియ తదవయవికర్తృకం బగు.

అవయవము కర్తగాఁ గలక్రియ కొన్నియెడల నాయవయవము కలది (అవయవి) కర్తృక మై తదనుగుణ మైనరూపము నందు నని తాత్పర్యము.

తల వడంకుచునుండు తనపితృవరుల. ఇట వడంకుట యనుదానికిఁ గర్త తల. అవయవము. తల (అవయవము) గలవారు గావున పితృవరులు అనునది యవయవి. తలవడంకుచుండుట గలపితృవరులు అనురీతిగా నీక్రియ యవయవి కర్త గలది యగుచున్నది. ఇట లక్ష్యములను వ్యాఖ్యలు సముచితముగా సమన్వయించినవి.

'లతాంగి హృదయంబున నీదెసఁ గూర్మి యెంతయున్ నెక్కొనియున్నది' అనునది సరి యైనలక్ష్యము గా దని తత్త్వ. (406) ఘం. (252) వ్యాఖ్యలు పేర్కొన్నవి. హృదయంబున కూర్మి లతాంగి నెక్కొనియున్నది యని సూత్రకర్త యన్వయించెను. లతాంగి హృదయంబునఁ గూర్మి నెక్కొనియున్నది. అని యన్వయింపవచ్చు నని వ్యాఖ్యలయభిప్రాయము. లతాంగియొక్క మనసులో నీపయిని గూర్మి యున్న దని కూర్మిని గర్తను చేయుటకంటె హృదయంబునందు నీపయిని గూర్మి లతాంగి కలిగి యున్న దని లతాంగిని గర్త చేయుటలో నాధిక్యము వ్యక్తముగాఁ గలదు. లతాంగి కర్తృత్వమువలన నర్థవిశేషమున కన్వయ మున్నది. కానీ యట్టివివక్ష చేయక కూర్మినే కర్తగాఁ జేసినను నన్వయమునకు బాధ లే దని వ్యాఖ్య లన్నవి. వ్యాఖ్యలు చూపినసమన్వయము సరిగా లే దనరాదు. కాని సూత్రకర్త చూపిన దింకను నుచితముగా నున్న దని మాత్ర మంగీకరింపఁదగును.

ఘం. మిగిలినలక్ష్యములను సయితము తిరస్కరించినది. తేఁకువసెడు లోనగునవి శబ్దపల్లవములు. 'క్రియాయా ఉపచార స్స్యాత్ ప్రథమాపదసంగతే' అత్రాధేయనిష్ఠక్రియా ఆధారారోపః ఉపచార ఇ త్యుచ్యతే. (కవిశి. 624) తేఁకువసెడియె నీపాఱుఁ దనుచో తేఁకువ ఆధేయము, పాఱుఁ డాధారము. చెడిన దాధేయభూత మగుతేఁకువయే, యైనను నది యాధారభూత మగు పాఱుఁ డనుకర్తయం దుపచరిత మగుచున్నది. ఇట్లే తక్కినలక్ష్యములు. కాన వీనిని వేఱుగా సూత్రించు టావశ్యకము (ఘం. 334).

వి.వి. అభిప్రాయ మదియే కావచ్చును. కాని శబ్దపల్లవములను నిర్వచించిన సూరి యర్థవిలక్షణతను బేర్కొనెనే కాని యిట్టియన్వయవైలక్షణ్యమును బేర్కొనలేదు. ఒకవేళఁ బ్రౌఢవ్యాకర్త పై వి.వి. అభిప్రాయమునే యిట్లు సూత్రించె నేమో. ఈయది బాలవ్యాకరణసిద్ధము లగుశబ్దపల్లవములందు సాధ్యము గాదు. వికృతివివే కాభిప్రాయమునే యిట్లు వివరించె ననుచో నొకభేదము గల్గును. వి.వి. వీనిని శబ్దపల్లవము లన్నది. ఈతఁడు వీనిని శబ్దపల్లవము లని వ్యవహరింపలేదు. ఇట్టియన్వయవైలక్షణ్యమును బేర్కొనుటయే విశేషము. ఇంక నీయది ప్రత్యేకముగా సూత్రింపవలె నని యీవ్యాఖ్య భావించి యిట్లు సూత్రించినది. ప్రథమాద్వితీయాన్యతర విభక్త్యంతంబు లగునామపదంబులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగునీయవి శబ్దపల్లవంబులు నాఁబడు. (ము.ల.కౌ. 57) క్రియయం దీసూత్ర మేల రచింపఁబడినచో తెలియదు. ఇవి శబ్దపల్లవము లగుట పూర్వసిద్ధము గాదా. వి.వి. చెప్పుట స్పష్టమే. ప్రథమాయా ద్వితీయాయా స్సంబంధ స్తత్ర సమ్మతః (వి.వి.) ఇంక సూరి చెప్పలేదు గావున నిట్లు చెప్పఁ బడినదా? అట్లును నవసరము గాదు. బాలవ్యాకరణమున 'ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి' యనుసూత్రమునం దాదిశబ్దముచే ధాతుభిన్నమును బోధింపఁబడును. ఆఁకొను, తలఁపోయు, విజయంచేయు ఇత్యాదులలో బాల. పూర్వావయవము ప్రథమాంతమో, ద్వితీయాంతమో మాత్రమే యైయుండు నని చెప్పుట కీసూత్ర మారంభింపఁబడినది. అనఁగా నీయది బాల.చే సిద్ధించుచున్నను వివరింపఁబడినది. వ్యాఖ్యానప్రాయము. శబ్దపల్లవములలోఁ బూర్వావయవము ద్వితీయాంత మవుట సూరిలక్ష్యములందు స్పష్టము గామి విశేషముగాఁ జెప్పఁ బడినదా? (వ్యా.సం.స.1687) ఈవిషయమును గూర్చి గ్రంథాంతరమునఁ బరామర్శింపఁబడు.

ఇంతకును నిట నస లీసూత్రమునకుఁ బ్రసక్తియేమి? ఘం. ఈసూత్రమును జూడు మన్నది కనుక (334) కాని, తరువాతిసూత్రముప్రసక్తి గలది. శబ్దపల్లవ పూర్వాయవంబు ప్రథమాంతం బగుచోఁ గ్రియార్థ మాధారభూతం బగుకర్తయం దుపచరితం బగు' (ము.ల.కౌ.క్రియ.58) క్రియాయా ఉపచార స్స్యాత్ ప్రథమా పదసంగతౌ' (వ్యా.సం.స.1687) అనుకారికార్థ మీసూత్రము. ప్రథమాంత మగుచో ననఁగాఁ బ్రథమావిభక్త్యంత మగుచో నని యర్థము. ద్వితీయార్థమునందుఁ బ్రథమ

రాఁగా దానిపై ధాతు వనుప్రయుక్త మైనచో నీసూత్రమునకు లక్ష్య మగునా, కాదా? అసలు శబ్దపల్లవములలోఁ బూర్వావయవము ద్వితీయాంత మగుటయే కానరాదు గదా. తేఁకువసెడియె నీపాఱుఁ డనునది యిట లక్ష్యముగాఁ జూపఁ బడినది. ము.ల.కౌ. తేఁకువ ఆధేయము. పాఱుడు ఆధారము. 'చెడు' అనునది పాఱుఁ డనునాధారమం దుపచరిత మైన దని యర్థము. తేఁకువను చెడు – తేఁ కువసెడు అనురీతిగా ద్వితీయకుఁ బ్రథమ యైన దని గుర్తించుచో, పాఱుఁడు తేఁ కువసెడెను అనురీతిగా నాధారాధేయభేదముతోడిసమర్థన మవసరమే కా దనియు గుర్తింపవలసియున్నది. ఇట వి.వి.,బాల.మార్గములు భిన్నములు. వి.వి. 'శబ్దశక్త్యా పరిప్రాప్త స్సర్వ త్రార్థో హి గృహ్యతే' యని చెప్పుటచే నర్థవైలక్షణ్యము శబ్దపల్లవము లందు వి.వి. మతమున లేదు. కావుననే 'క్రియాయా ఉపచారః స్యాత్' అని చెప్పుకొనవలసివచ్చిన దేమో. బాల. 'విలక్షణార్థాభిధాయకంబు లగు' ననుటచే 'క్రియాయా ఉపచారః' అనులక్షణమును జెప్పుకొనవలసినయవసరము లేదు. ఇంక ము.ల.కౌ. విలక్షణార్థాభిధాయకము లగుట యను బాల.మార్గము ననుసరించియు మఱల 'శబ్దశక్త్యా' యనుటచే నుపచారమును బేర్కొన్న వి.వి. అభిప్రాయమును 58 సూత్రముచే ననువదించెడు. అట్లు చెప్పుట యనవసరము.

తేఁకువసెడు అనునది శబ్దపల్లవము. తేఁకువ (యే) చెడుట యస లర్థము. కాని శబ్దపల్లవము విలక్షణార్థాభిధాయక మగు నని బాల.వలె ము.ల.కౌ. చెప్పినది. తేఁకువ చెడు అనుదానికి ధైర్యము గోల్పోవు అనురీతి నర్థము చెప్పుదము. పాఱుఁ డు తేఁకువసెడియె ననఁగాఁ బాఱుఁడు ధైర్యమును గోల్పోయె నని యర్థము సుసమన్విత మగుచునే యున్నది. విలక్షణార్థాభిధాయకత్వము ననుసరించి తేఁ కువ యనునది కర్త కావలయు నని లేదు గదా. కాఁగా నీయుపచారవిధానము వ్యర్థము. ఇట్ల చెలువేదు – కాంతిని గోల్పోవు. చందురుఁడు కాంతిని కోల్పోయె ననురీతిగా విలక్షణార్థాభిధాయకత్వముచే నాధేయమే కర్త యనురీతిగా భావింప నక్కఱ లేకుంట స్పష్టము. కావున నావిధానము వ్యర్థము.

ప్రౌఢవ్యాకర్తయు శబ్దపల్లవములవిషయమున బాల.తో విభేదింపలేదు. అట్టియెడలఁ బ్రౌఢ. మాత్ర మి ట్లేల చెప్పె నన్నది ప్రశ్నము.

ఇట్లు చెప్పుట వ్యర్థ మని ఘం. స్పష్టము చేయలేదు. వీనిలో తేఁకువసెడు చెలువేదు, సొబగుమాలు, బడలికలువాయు అనునవి శబ్దపల్లవములు. (252)

అనఁగా తలవడంకు అనునది శబ్దపల్లవము కాదు గదా. దానికయి యీసూత్ర ముచితమ యని చెప్పవలసియున్నది. తేఁకువసెడు ఇత్యాదులను శబ్దపల్లవములుగా సూత్రకర్త భావింపలేదు. అట్టియపు డీలక్ష్యప్రదర్శన మాతనిమతమున నుచితమే. శబ్దపల్లవములను బ్రత్యేకముగా ధాతువులుగాఁ జూపుట గానవచ్చుచున్నది. సూరి క్రియా. 118సూత్రము కడఁ జూపినశబ్దపల్లవము లన్నింటిని వరుసగా శ.ర.లోఁ జూపెను. పెండ్లాడు, రూపఱు ఇత్యాదులును బ్రత్యేకముగా ధాతువులుగాఁ జూపెను. కానీ యిట నుదాహరించిన తేఁకువసెడు (దీనిని తేఁకువశబ్దమునొద్దనే భయ మనునర్థమునకుఁ జూపెను) చెలువేదు, సొబగుమాలు, బడలికలువాయు అనువానిని జూపలేదు. కావున నివ్వానిని శబ్దపల్లవములు గా వనియే సూత్రకర్త యెంచె ననియు, నందువలననే (విలక్షణార్థాభిధాయకత్వము కుదురదు) యిట్లు సూత్రించె ననియు గ్రహింపఁదగును.

అయిన నీయవి శబ్దపల్లవములు గా వనుట యుక్తమా? పరిశీలింతము.

సూ.ని. కూడ చెలువారు, బడలువడు ఇత్యాదులను జూపినది. కాని యిట సూత్రకర్త చూపినవానిని, మూలరూపము లగు తేఁకువసెడు అనురీతివానిని బ్రత్యేకముగా ధాతువులుగాఁ జూపలేదు. మిగిలినవానివలె శబ్దపల్లవము లయినఁ జూపవలసియున్నది. ఇవి శబ్దపల్లవము లనవలసినయవసరమును లేదు. తేఁ కువ యనుదానిపైఁ జెడు అనుప్రయుక్త మైన దననేల? పాఱుఁడు చెడియెం దేఁ కువ యని ప్రయోగింపవచ్చునే కదా. ఇట్ల బడలిక లిటఁ బాసి చనుము అనరాదా? కావున తేఁకువ, చెడియె నను వేర్వేఱుపదములే యిటఁ బ్రయుక్తము లైన వనుటలో నిబ్బంది లేదు. తేఁకువ గలిగె నిత్యాదిగా నన్నింటిని శబ్దపల్లవము లనఁజాలము. శబ్దపల్లవములయెడ వాఁడు సేసె విజయము, పోయెను గొని, యనురీతివ్యవహార ముండదు కదా.

సొబగుమాలు, చెలువేదు అనువాని కిట్టిస్థితి గానరాదు. వాఁ డేదెను జెలువు ఇత్యాది వ్యవహార ముండదు. ఇంత మాత్రమున వీనిని శబ్దపల్లవములే యని నిర్ణయింపవలయునా? మాలు, ఏదు ధాతువులు నశించు ఇత్యాద్యర్థములందు నిఘంటవులు చూపినవి. కాని యాయవి సొబగు, చెలువు అనురీతిగా నీశబ్దముల పైనే కాదు, తఱుచుగాఁ బ్రథమాంతముపైనే తత్కర్త యగునట్టిది ప్రయుక్త మయి కానవచ్చును. ప్రాభవంబులు మాలి, బహుశక్తులు దూరి, మెడకు మాలగ నేసి,

మిన్నుముట్టి మొ. సూ.ని. ఉపాయ మేది యొకనిచేఁ బట్టువడియె ( సూ.ని) మొ. ఇట్టివానింబట్టి ఏదు ప్రభృతిధాతువులు తఱుచుగా శబ్దపల్లవాంత్యావయవములే యై కన్పించు ననుటకంటె వాక్యములం దాయాపదములక్రమప్రయోగాపేక్షను గుర్తించుట యుక్తము. కావున వీనిని శబ్దపల్లవము లనకుంటయే యుచిత మని నిర్ణయింపఁదగును.

ఇట్టియెడలఁ బ్రస్తుతవిధాన ముచితమే యగును. ఘం. కూడ నీయంశమును జెప్పవలసినదే. కాని యిట్లు గా దనియు, నయ్యది శబ్దపల్లవలక్షణముగాఁ బేర్కొనఁ దగు ననియు భావించిన దనుట స్పష్టము.

సూత్రరచనయందు లోపములు గలవు. కావున సూత్ర మిట్లే గ్రాహ్య మనలేము. కాని యిద్దానిని శబ్దపల్లవలక్ష్యముగాఁ జెప్ప నక్కఱ లే దనియు విలక్షణార్థాభిధాయక శక్తిచే శబ్దపల్లవములం దీవిధి వ్యర్థము గానఁ దదితరములందే చెప్పు టుచిత మనియు నభిప్రాయము. ఇది కేవలము శబ్దపల్లవలక్షణముగాఁ జెప్పినను దలవడంకు అనుదాని నీవ్యాఖ్యయు శబ్దపల్లవముగాఁ బేర్కొనలేదు. కావున దానికై మఱల నీవిధాన మవసరము. లేక తలవడంకు అనునదియు శబ్దపల్లవ మనవలె. ఇట్టివిశేషము గల వెల్ల శబ్దపల్లవము లనియు, శబ్దపల్లవములం దాలక్షణము గల దనియుఁ జెప్పుటకంటె శబ్దపల్లవము లనకయే చెప్పవచ్చును.

ఇట సూత్రరచనలోనిలోపమును గూర్చి తత్త్వ. 'అవయవావయవిభావ మనఁ గా నంగాంగిభావము. మొదట లక్ష్యమునఁ దప్పలేదు కావున నవయావావయవి భావ మనఁగా గుణగుణిభావము లేదా సమవాయసంబంధముచే నాధేయాధార భావ మని కాని తలంపవలె' (406) నన్నది. కాఁగా నవయవావయవిభావ మనుట కంటె నాధేయాధారభావ మను టుచితము గావున సూత్ర మట్లు చెప్పుటయే యొప్పు ననవచ్చును. కానీ ఘం. ఇట్టిసవరణము నపేక్షింపకయే 'అవయవము అవయవి అనునవి ధర్మము, ధర్మి అనువాని కుపలక్షణ (251) మన్నది. అట్టియెడల నాధేయము ఆధారము అనువాని కుపలక్షణ మని చెప్పికొన్నచో ము.ల.కౌ.58 సూత్రమును జెప్ప నక్కఱ యేమి?

వీనియం దవయవికర్తృకత్వము చెప్పుట సంప్రదాయము కాదు. (ఘం.252) అనుటలో శబ్దపల్లవములు కాఁబట్టి కా దని యావ్యాఖ్యయభిప్రాయ మనవచ్చును. వి.వి. ఇట్లు చెప్పలేదు గావున సంప్రదాయవిరుద్ధ మని తాత్పర్యము గావచ్చును.

ఆసంప్రదాయమును బాలవ్యాకర్తయే శబ్దపల్లవములయెడ మార్చి క్రొత్త సంప్రదాయము విలక్షణార్థాభిధాయకత్వమును బేర్కొనినాఁడు. అది య ట్లుండ బైవి శబ్దపల్లవములే కాదు గావున నీవిచారమే లేదు. మఱి యుపలక్షణ మార్గావలంబన మేల? ఆధేయకర్తృక మగుటను స్పష్టముగానే చెప్పవచ్చును గదా యనిపించుట సహజము.

సుగమ. తేఁకువ అవయవము. పాఱుఁడు అవయవి అనురీతిగా (258) నిట నెల్లయెడల నవయువావయువివ్యవహారము చేసినది. అనఁగా ధర్మము నవయవయముగాను ధర్మి నవయవిగాను బేర్కొన్నది. కు.పం., సుబో. వ్యాఖ్యలును నిదే యభిప్రాయముతో నున్న వని తోఁచుచున్నది. ఈయభిప్రాయము సరి గా దని యితరవ్యాఖ్యల ననుసరించి స్పష్టము.

## కర్తృభూతక్రియ

**27. కర్తృభూతకక్రియతోడం దత్కర్త కన్వయం బగు.**

ఒకక్రియకుఁ గర్త యగు వే ఱొకక్రియతో నాక్రియయొక్క కర్త యన్వయించును. వలయ్వాదులకుం గర్త యగుభావంబునందు నుజి యగు (బాల.క్రి.122) నను సూత్ర మిట్టిదానికి నుజిని జెప్పినది. 'వలయ్వాదులకుఁ గర్త యైనక్రియకు భావార్థమునం దట నుజి యైనది'. (వ్యా.సం.స.1442) నీవు రావలయును. అనుచో వలయును అనుక్రియయే వచ్చుట అనుక్రియకుఁ గర్త. దానికి భావార్థము నందు నుజి రాఁగా, 'రాన్' అని యగును. వలయును అనుక్రియకుఁ గర్త యైన క్రియ 'రాన్' అనునది. కర్త యగు నీవు అనునది రాన్ అనునుజ్యంతముతో నన్వయించును.

'వలయు'తో నన్వయించునా, లేక రాన్ అనుదానితో నన్వయించునా యని యనుమానము రాఁగా నిట్లు సూత్రింపఁబడిన దని కు.పం. (145) భావించినది. దీనినే సుబో. (260) వివరించినది.

ఈలక్షణము స్పష్టార్థ మని తత్త్వ.(367) వివరణప్రాయ మని ఘం.(224) వ్యాఖ్యలు పేర్కొన్నవి.

ఈసూత్ర మనావశ్యక మని సర్వ. (506) పేర్కొన్నది. ఎట్లో స్పష్టము చేయలేదు.

సూత్ర మనవసరమే. కర్తకుఁ గర్తృభూతక్రియతో నన్వయము చెప్పుట విశేషము గాదు. సూరి భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు (కార.32) నని సూత్రించి రాముఁడు వచ్చుట, రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె మొ. ఉదాహరించెను. వచ్చుట యనుభావార్థకరూపముతో యోగ మనఁగా నన్వయము కలిమిచేతనే రామశబ్దమునకుఁ బ్రథమ యైనది. నీవు రావచ్చును. అనుచో రాన్ అనుభావార్థకనుజ్యంతముతో యోగము కలిమివలననే ప్రథమ యైన దన్నమాట. ప్రస్తుతసూత్రోదాహృతస్థల మిట్టిదే. నీవు రా వలయు ననుదానిలోఁ బ్రధాన మైన క్రియ వచ్చుట. దీనికిఁ గర్త నీవు. వచ్చు అనుక్రియకు వలయు ననుదానితో యోగము కలుగఁగా, భావార్థకమునందు నుజీ యై, 'రాన్ వలయును' అని యగును. వచ్చుట యనుక్రియకుఁ గర్త యగుటచే 'నీవు' దానితోనే యన్వయించును. వలయుతో యోగము 'వచ్చు' ధాతువునకుఁ గావున 'రాన్' అనునదే 'వలయును' అనుదానితో నన్వయించును. కావుననే వచ్చుట కర్తృభూత మవుచున్నది. కాఁగా నిటఁ గర్త రాన్ అనుదానితో నన్వయించునా, లేక వలయు ననుదానితో నన్వయించునా యనునసుమానమున కవకాశము లేదు. అందుచేత దానికై యీ విధానమును జేయవలసినయవసరమును లేదు.

ఇట రాన్, పోన్ అనుకర్తృభూతక్రియతో నన్వయము చెప్పుటవలన భావార్థ కాదియోగంబున ననుదానిచేఁ బ్రథమ యవు నని తలఁచెనా?

ఏది యే మైనను నీవిధానము ప్రయోజనవంతము గాదు. ఇట నీవు రావచ్చును అనుచో 'వచ్చును' అనుదానితో నన్వయింపక 'రాన్' అనుదానితోనే యన్వయించు నని సుగమ. (230) పేర్కొన్నది. సూత్రకర్త యభిప్రాయము నిదియే యైన నయ్యది యసంగతము. వలయ్యాదులతో యోగ మిటఁ గర్తృభూతక్రియ యనఁబడుచున్న దానికే. వాక్యమునఁ బ్రధానక్రియ వచ్చుట యైయుండఁగా వలయ్యాదులతో నన్వయమును శంకించుటకు వీలు లేదు.

## భావిని భూతము

**7. కొన్నియెడలఁ ద్వరితార్థసూచకం బయి భావిని భూతంబు చూపట్టెడి.**

త్వరితార్థమునందు భవిష్యదర్థస్థలమునను గ్రియ భూతకాలికముగాఁ బ్రయుక్త మవుట కనఁబడుచున్న దని యర్థము. 'తా వచ్చె' ననుచో త్వరలో రాఁగలఁ డను

భవిష్యదర్థమున (లృట్టునకు) భూతము (లిట్టు) వచ్చి 'వచ్చె' నని ప్రయోగింపఁ బడినది.

బాల. చేదర్థయోగమున లృట్టునకు లిట్టు చెప్పినది. క్రియా 119. ఆకార్యము (లృట్టునకు లి ట్టగుట) త్వరితార్థమున నీసూత్రము చెప్పుచున్నది. సార్వత్రికము గామింజేసి యటఁ జేదాద్యర్థములం దని చెప్పుటకు వీలు లేదు. కావున నిట్లు ప్రత్యేకముగాఁ బేర్కొనఁదగును.

కాఁగా సర్వ. బాల.క్రి.119 సూత్రమునకుఁ బిదప దీనిం జూపియున్న బాగుండెడిది. ప్రౌఢ. క్రియ.21, బాల. క్రియ.48 సూత్రములకు నడుమఁ జూపుటలో సందర్భము కానరాదు. (బా.సూ.)

## వ్యతిరేకక్రియ

**8. వ్యతిరేకక్రియ యర్థత్రయబోధకం బగు.**

వ్యతిరేకార్థక మగుక్రియ భూతభవిష్యద్వర్తమానార్థములు మూఁడింటిని బోధించు నని భావము. పలుకదు – పలుకుచున్నదికాదు (వర్తమానము). కానము – కనినవారము కాము (భూతము), రాఁడు – రాఁగలవాఁడు కాఁడు (భావి) అనురీతిగా సూత్రకర్త లక్ష్యములను వివరించెను.

ఇ ట్లర్థభేదమును సూచించుటకు వ్యతిరేకక్రియలు రూపభేదము నంద వని సూత్రతాత్పర్యముగా కు.పం. (137) పేర్కొన్నది. రూపభేదప్రసంగ మనవసరము.

'నలున కాని నలినదళనేత్ర వరియింప దట్టె' యనుచోట వరింపదు అనుదానికి వరించునది కాదు అని సూత్రకర్త యర్థము చేసెను. దీనిని విమర్శించుచు ఘం. వరింపఁగలది కాదు అనురీతిగా భవిష్యదర్థమును జెప్పుట యుక్త మన్నది. (209) ఇట్లే తత్త్వ. (345) సర్వ. (352) పేర్కొన్నవి. సూత్రకర్త యర్థత్రయబోధక మని సూత్రించి యర్థత్రయ మన వర్తమాన భూత భవిష్యదర్థము లని వివరించెను. ఇంతకు ముందువఱకు నాయర్థత్రయమునే నిరూపించెను. ఇట మాత్రము వరియించునది అనుతద్ధర్మార్థకవిశేషణ మేల ప్రయోగించెను? భవిష్యదర్థమే భావించి యున్నచో నింతకు ముందువలెనె వరియింపఁగలది కా దనురీతిగా భావిశత్రర్థక ధాతుజవిశేషణరూపమునే చూపెడువాఁడు గదా యని యాలోచింపవలసియున్నది.

వర్తమాన భూత భవిష్యదర్థములకు భిన్న మైనయర్థ ముండవచ్చునా? అనఁగా నీయది లజ్యంత మగుక్రియ కదా. లజిని సూరి వ్యతిరేకవిశిష్టక్రియావృత్తి యగు ధాతువునకుఁ జెప్పెను. అనఁగా నిట ధాత్వర్థవ్యతిరేకత మాత్రమే యుండును గాని వర్తమానాదికాలవిశిష్టత లే దన్నమాట. కావున వ్యతిరేకక్రియ ధాత్వర్థవ్యతిరేకార్థము నందు నెట్లు నుండు ననుటకే సూత్రకర్త వరియించునది యనురీతిగాఁ దద్ధర్మార్థక విశేషణము నుపయోగించె ననుట సమంజసము. నిజమునకు వరియింపఁగలది కా దనునర్థముకంటె వరియించునది కా దనురీతిగాఁ దద్ధర్మార్థకవిశేషణముతో నర్థము చెప్పుటయే సమంజసము. ఇంతవఱకు వరింపనిమాట నిజమే. ఇఁక ముందును వరింపనిమాట నిజమే. నలునే కాని యితరులను వరింపకుండుట యన్నది దమయంతినిశ్చయము. అనఁగా వరింపఁబోకుండుటయే కాదు. వ్యతిరేకి కావున ధాత్వర్థమును వ్యతిరేకార్థవిశిష్టముగా గుర్తించుట యుక్తము. అట్టిది ధాతుధర్మవాచక మగు తద్ధర్మరూపముతోనే సాధ్య మగును. కావుననె సూత్రకర్త సముచితముగా దద్ధర్మార్థకవిశేషణము నుపయోగించె ననఁదగును. ఇంకను దచ్ఛీలార్థక మనుటయు మేలు.

'అర్థత్రయబోధకం బగు' నన్నమాత్రమున నీవ్యతిరేకక్రియయందలివ్యతిరేకార్థ మెల్లప్పుడు భూతభవిష్యద్వర్తమానములలో నెదో యొకదానితో విశిష్ట మయియే యుండవలె ననరాదు గదా. దానికి సహజముగా నున్న వ్యతిరేకవిశిష్ట క్రియా ధర్మమును దెలుపుట కెట్టివిరోధమును లేదు.

'అర్థత్రయబోధకంబు నగు' నని సముచ్చయార్థమును జేర్చిన బావుండెడి దేమో. కాని చేర్పనిమాత్రమున సూత్రకర్త కీయభిప్రాయము లే దనరాదు. ఏల యనఁ 'దద్ధర్మార్థకవిశేషణం బసహాయతం ద్రికాలవాచి యగు' ననుస్థలమున నిట్లే నుశబ్దమును జేర్పలేదు. అంతమాత్రమునఁ దద్ధర్మార్థకవిశేషణ మెప్పుడును దద్ధర్మార్థము నీయ దని సూత్రకర్త తలంచె ననుట యుక్త మవునా?

వాఁడు చదువును, వీఁడు చదువఁడు అనురీతిస్థలములందు వ్యతిరేకక్రియ యర్థ మెట్టిది? చదివినవాఁడు కాదు, చదువఁగలవాఁడు గాదు, చదువుచున్నవాఁడు గా దనురీతిగా వ్యతిరేకార్థ మాయైకాలములలో నేదో యొకదానితోఁ గూడి యుండక తప్పదా? ఏదో యొకకాలమునఁ గాక యేకాలమును జదువుట యను ధర్మమే లేదు. చదువుట యనునది స్వభావముగాఁ గలవాఁడు కా దనురీతిగా

నర్థము చెప్పవలెను. అనఁగాఁ జదువు ననుచోఁ దద్ధర్మక్రియ ధాతువుధర్మమును దెల్పుచుండగా చదువఁ డనునది ధాతుధర్మవ్యతిరేకతను మాత్రమే తెలుపుచున్నది. (తత్త్వ.344) వరియింప దనుక్రియ కర్థ మిట్టిది. నలేతరులను వరించుటలో వ్యతిరేకతయే యిటఁ దాత్పర్యము ఆవ్యతిరేకత కేవలము భవిష్యత్కాలమునకు (లేదా యేదో యొకకాలమునకు) మాత్రమే సంబంధించినది కాదు.

వరియించునది కా దనునది యిట భవిష్యదర్థకముగా నుదాహరించుట తాత్పర్యము గాదు. ఇట నర్థత్రయబోధకం బగు నన్నట్లుగనే యింతకు ముందు 'తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం ద్రికాలవాచి యగు' ననెను. దానికి నిది యుదాహరణము కాదు గదా? యనిపించుచున్నది.

వరియించున దనునది యిట వర్తమానభూతభవిష్యదర్థములకు భిన్న మైన దాని తద్వ్యతిరేకధర్మము నుదాహరించుట లక్ష్యముగాఁ గలది. (వరియింపఁ గలది కా దనురీతిగా జూపకుండుటనుబట్టియే స్పష్టము.) అట్టియెడఁ దద్ధర్మార్థక విశేషణ మేల చూపె? తద్ధర్మార్థకవిశేషణము త్రికాలవాచి కదా. మఱల నిది భూతభవిష్యద్వర్తమానములలో నేదే నొకయర్థ మిచ్చుచోఁ బైయుదాహృతులలో దేనిలోనో యొకదానియందు జేరును. అట్లు కారాదు. కాఁగాఁ దద్ధర్మార్థకవిశేషణము సయితము త్రికాలవాచి యగుట విశేషము. కాఁగాఁ దద్ధర్మార్థమును సైత మిచ్చు ననుట కిది యుదాహరింపఁబడె ననవచ్చును.

ఏది యే మైన నిట వరియించునది యనుతద్ధర్మార్థకవిశేషణము భూతభవిష్య ద్వర్తమానములో నేకాలము బోధించునది కా దనియుఁ, దద్ధర్మార్థకమే యనియు, నాయర్థమే ప్రయోగమున సుసమన్విత మగుచున్న దనియు, గ్రహింపవలె.

ఇంకఁ దత్త్వ.(345) సర్వ.(353) వ్యాఖ్యలు వ్యతిరేకక్రియ కాలమును బోధింపక వ్యతిరేకార్థమును మాత్రమే యిచ్చు ననియు సందర్భమే కాలమును నిర్ణయించు ననియుఁ గావున నీసూత్ర మనవసర మనియు భావించినవి.

కానీ యీసూత్రము చెప్పుటలో నిం కొకయభిప్రాయమును గల దని తోఁచు చున్నది. తెలుఁగువ్యాకరణకర్త 'క్రియాకాంక్షాసమాపకములు (సమాపకక్రియలు) వ్యతిరేకక్రియయందు తద్ధర్మకాలికము ఒకటే యున్నది'. (తె.వ్యా.క్రియ.246.సూ) అని చెప్పెను. దీనివలన వ్యతిరేకక్రియ తద్ధర్మవ్యతిరేకార్థమును మాత్రమే యిచ్చుచున్న దని చెప్పవలెను. అక్కడ 255 సూత్రము నిదే యర్థమును వ్యక్తము చేయుచున్నది.

భావక్రియ భూతవర్తమానార్థములం దుండఁగా (తె.వ్యా.క్రియా. 246) వ్యతిరేకక్రియ తద్ధర్మార్థమునందు మాత్రమే యుండు ననుటచే దానికిఁ బైరీతిని వర్తమానాదికాల విశిష్టార్థమును జెప్పుటకు వీలు లే దని స్పష్ట మవుచున్నది. ఆయర్థమును దిరస్కరించుటకే ప్రస్తుతప్రౌఢ.లక్షణము ప్రసక్త మయియుండవచ్చును.

సూరియును 'భూతంబున లజికి లిడంతం బగునగుధాతు వనుప్రయుక్తం బగు' (బాల.క్రియా. 114) అని చెప్పెను. దీని యర్థ మేమి యన పేటికావ్యాఖ్య భూతకాలబోధకం బగు లజి (బా.సా.పే. 477) లిడంత మగునగుధాతువు చేరిన దన్నది. అనఁగా లజ్యంతమే, వ్యతిరేకక్రియయే భూతార్థవిశిష్ట మైయున్న దనియు లిడంత మగునగుధాతువు స్వార్థముననే యనుప్రయుక్త మైన దనియు భావము. అది యట్లే యైన వ్యతిరేకక్రియ భూతార్థక మగుట బాల.సిద్ధ మన్నమాట. భూతార్థమువలెనే వర్తమానాద్యర్థములు నుండుటలో నిబ్బంది లేదు. కాఁగా బాల.చేతనే యర్థత్రయబోధకత్వము సిద్ధించును గావున నిట విధించుట యనవసర మని నిర్ణయింపవచ్చును.

కాని యీపేటికాభిప్రాయము సముచితమా? భూతంబున లజి యనఁగా భూతార్థమునం దున్న లజి కని యర్థము చేయవచ్చునా? గు. ప్ర. 'లజికిన్ = వ్యతిరేకార్థకప్రత్యయాంతధాతువునకు, భూతంబున = భూతార్థమందు లిడంతం బగునగుధాతువు అనుప్రయుక్త మగు నని యర్థము చేసి, భూతకాలమందలి వ్యతిరేకార్థమును బోధించుచో భూతార్థక మైనయగుధాతువు సాహాయ్యము లజిప్రత్యయాంతమున కుండవలయు నని నిష్కృష్టార్థ' (404) మన్నది. అనఁగా లజ్యంతక్రియ భూతకాలవిశిష్ట మగునర్థము బోధింపఁజాలదు. భూతార్థము రావలె నన్న లిడంత మగునగుధాతువు చేర్పవలసినదే యని తేలినది. అనఁగా నిట ననుప్రయుక్త మైనలిడంత మగునగుధాతువువలన భూతార్థము కలుగుచున్నది కాని వ్యతిరేకక్రియయం దాయర్థము లేదు. అనఁగా లజ్యంతమునందు భూతార్థము లేదు. వర్తమానాద్యర్థములు నట్లే లేవు. కావున 'నర్థత్రయబోధకం బగు' నను నీవిధానము సార్థకమే.

సందర్భమునుబట్టియె వ్యతిరేకక్రియ భూతార్థము నిచ్చును గావున నిది చెప్ప నక్కఱ లే దన్నసర్వ. వ్యాఖ్యయే బాల.క్రియా. 114 సూత్రమునొద్ద 'దీనికి (వ్యతిరేక క్రియకు) భూతకాలమందు నిశ్చిత మైనప్రయోగము కలుగుటకు లిడంత మైన

యగుధాతువు ననుప్రయుక్తము గావింపవలయు' (482) నని పేర్కొన్నది. ఇంక నిట వ్యతిరేకక్రియ భూతార్థమునం దున్న దని సర్వ. పేర్కొనియు నుండలేదు. కావున నర్థత్రయబోధకత్వవిధాన మవసర మగుట స్పష్టమే.

అట్లు గాక వ్యతిరేకక్రియ యట భూతార్థమునం దున్న దని చెప్పినను నీవిధానము వ్యర్థము కాఁజాలదు. ఎ ట్లన నట్టివ్యతిరేకక్రియకు సూరి లిడంత మగునగుధాతువుననుప్రయోగము నిత్యముగనె విధించెను గదా. అట్టియెడల నాయనుప్రయోగము లేకుండ భూతార్థమునం దుంట యెట్లు? అనుప్రయుక్త మయిన నుజ్యంత మగునగుధాతువునకు నీప్రౌఢవ్యాకర్త లోపము చెప్పుట నిట స్మరింపఁ దగును. (ప్రౌఢ.క్రియా. 22)

తత్త్వ. వ్యతిరేకక్రియ (తద్ధర్మక్రియవలెనె) కాలమును బోధింప దనియు, కాలము సందర్భమునుబట్టియె బోధింపఁబడు ననియు (345) పేర్కొన్నది. దీనికిఁ దద్ధర్మ క్రియతోడిపోలిక యిట గమనింపఁదగును. తద్ధర్మార్థకవిశేషణములకు నిట్లె సందర్భమునుబట్టి కాలబోధకత గల్గుట నీవ్యాఖ్య పేర్కొన్నది. (తత్త్వ. 337) అనఁ గా వ్యతిరేకక్రియవలెనె తద్ధర్మార్థకక్రియ సయితము సందర్భమునుబట్టి వర్తమానాది కాలములను బోధించు నన్నమాట. దీని ననుసరించిన నీసూత్ర మావశ్యకము.

తద్ధర్మాదులందు లా ట్టగు నన్నసూరి యాదిశబ్దముచే వర్తమానభావ్యాద్యర్థములు గ్రాహ్యము లనెను. ఏల? వర్తమానభవిష్యదాద్యర్థములు సందర్భమునుబట్టియే తద్ధర్మక్రియచే సిద్ధించునపుడు వానిపునర్గ్రహణము వ్యర్థము కాదా? తద్ధర్మార్థము నందువలె వర్తమానాద్యార్థములందును నాసూత్రముచేతనే లా ట్టవును. కావున లాడంత మగునాక్రియ తద్ధర్మార్థమునందును, వర్తమానాద్యర్థములందు నొకే రూపముతో నుండును. అంతమాత్రమునఁ దద్ధర్మక్రియ వర్తమానాద్యర్థములను (సందర్భమునుబట్టి) యిచ్చు నని తలంపరాదు. కాఁగా నట లాట్టును దద్ధర్మము తోపాటు వర్తమానాద్యర్థము లం దగు నని సూరి చెప్పెను. ఇట వ్యతిరేకక్రియావృత్తి యని మాత్రమే నిర్దేశించెను. కాని యావ్యతిరేకార్థము భూతాదికాలవిశిష్ట మగుటను బేర్కొనెనా? వర్తమానార్థవిశిష్టతద్ధర్మార్థ ముండదు. కాని యిట వ్యతిరేకక్రియ వ్యతిరేకార్థమునందే యుండును. ఆవ్యతిరేకార్థము భూతాదివిశిష్ట మగుట వివరించెనా? అట్లు చెప్ప కుండుటనుబట్టి ప్రౌఢవ్యాకరణము పేర్కొనుట యుచితమే యవును.

'భూతంబున లజికి' ననుచో సైతము లిడంత మగునగుధాతువు భూతార్థమునం దనుప్రయుక్త మని చెప్పుటనుబట్టియు వ్యతిరేకక్రియ స్వతంత్రముగా భూతాద్యర్థ విశిష్ట మగుట సాధింపఁబడుట లేదు. అనుప్రయుక్తము లగునవి కేవలము నిరర్థకము లని నిర్ణయించుటకు వీలు లేదు. 'అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది యనుప్రయుక్తం బగు' ననుమొద లగురీతిగా నర్థవిశేషములం దనుప్రయుక్తములుగా చెప్పినవి నిరర్థకములు గావు. (బా.సూ.)

కాఁగా నర్థత్రయబోధక మవుటను జెప్పుప్రస్తుతవిధాన మావశ్యకమే.

ఈసూత్రమున నర్థత్రయ మనుట యుచితము గా దని సర్వ. అభిప్రాయ పడినది. కాల మనునది సమాపకక్రియాసందర్భమునఁ బ్రయోగింపవలయు ననియు నితరములయెడ 'అర్థము' అని చెప్పఁదగు ననియుఁ గావున నిట సమాపక క్రియాసందర్భమున నర్థత్రయబోధక మని యర్థశబ్దము వాడుటయు 'తద్ధర్మార్థక విశేషణం బసహాయతం త్రికాలవాచి యగు' ననుచో సమాపకక్రియ గామి కాలశబ్దమును వాడుటయు సరి గా వనియు నీరెంటికిని భేదము పాటించుట యవసరమే యనియు (సర్వ. 237, 351) పేర్కొన్నది. అవసర మన్నది గాని భేదము పాటింపవలసినయాయవసరముం గూర్చి యీవ్యాఖ్య వివరింపలేదు. ఆయవసరము స్పష్టము గాదు. సమాపకక్రియల నెల్ల కాల మనుదానిచేతనే వ్యవహరింపవలె నన్నఁ దద్ధర్మాదులలో భేదము గల్గును. తద్ధర్మకాల మాశీరాదికాల మనుటకు వీలు లేదు గదా. వర్తమానభూతభవిష్యదర్థములను వ్యతిరేకక్రియ బోధించు ననుటలో నసంగతి కానరాదు. ఇట్లే త్రికాలవాచి (ఇది పరిశీలింపవలసియున్నది) ఈసూత్ర మును బాల.క్రియా. 114సూత్రముపిదపఁ జూపిన బాగుండెడి దని తోఁచుచున్నది.

## తద్ధర్మార్థకవిశేషణములు

### 1. తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం త్రికాలవాచి యగు.

త్రికాలవాచి యనఁగా భూతభవిష్యద్వర్తమానకాలములను బోధించున దగు నని యర్థము.

నానేర్చువిధంబున ననుచో 'నేర్చు' అనువిశేషణము 'నేర్చిన' యనురీతిగా భూతార్థక మైనది.

'జనమేజయుచేయు సర్పయాగమున' ననుచోఁ 'జేయు' అనునది 'చేయఁగల' యనురీతిగా భవిష్యదర్థ మైనది.

'వారి యనువయించు సితతంతు' అనుచో 'అనువయించు' అనునది 'అనువయించుచున్న' అని వర్తమానకాలవాచియై యున్నది.

ఈసూత్రమున 'నసహాయత' యనునది మిక్కిలి వివాదాస్పద మైనది. కు.పం. ఇట నసహాయత యనఁగాఁ దత్తత్కాలబోధకప్రత్యయము లేవియు లేకుండుట (134) అని చెప్పెను. సుబో. దీనినే యనువదించినది (239). సుగమ. కాలవాచకమును బోధించుశబ్దసహాయము లేక (209) అన్నది. ఇట వాచకమును బోధించుశబ్ద మనుట విశేషము.

ఇటఁ గాలబోధకప్రత్యయ మన నేమో యీవ్యాఖ్యలు వివరింపలేదు. ఆయా కాలములను బోధించుటకుఁ బ్రత్యయములు గలవా? లడాదిలకారముల కాదేశించిన డుజాదు లని యుద్దేశించి యుండవలె. అదియే యుద్దేశ మయిన బొరపాటు. కాలబోధకము లయినలడాదులతోఁ గూడియున్నచో నవి తద్ధర్మార్థకము లగుట యెట్లు? విశేషణము లగుటయుఁ గేవల మసంభవము.

సహాయత యనఁగాఁ గాలబోధకప్రత్యయసహిత మని యర్థము చేసినచోఁ దద్ధర్మార్థకవిశేషణ మనుదళ మనర్థకముగాఁ బరిణమించును.

సర్వ. 'ఇతరపదములయొక్క సహాయము లేని' అని యర్థము చేసి దానినే వివరించుచు తద్ధర్మార్థకవిశేషణము మూఁడుకాలములను బోధించును. తద్ధర్మార్థకమునకు కాలబోధకచిహ్న మేమియుఁ జేరదు. ఇతరదపదములనుబట్టి కాలమును నిర్ణయించుకొనవలయును (336) అన్నది. దీనినిబట్టి వాక్యము మొత్తమునుబట్టియే యసహాయతను నిర్ణయింపవలసియుండును.

ఇందలియిబ్బందిని బేర్కొనుచు దత్త్వ. అట్టికాలబోధకశబ్దము లున్నను లేకున్నను సందర్భమునుబట్టి యేదో యొకయర్థము కల్గు ననియు, సహాయతయందును గాలత్రయబోధకు బాధ లేదు గావునను, నట్టిప్రత్యుదాహరణము సూత్రకర్త చూపియుండకపోవుటచేతను నిట్లు భావింపరా దనెను (336). ఇది యుక్తము. ఇతరపదములసహాయము లేకుండ ననుచో సూత్రకర్త చూపిన లక్ష్యములే సరిపడవు. అట ఇతరపదములసహాయము లేకపోలేదు. అయినను నాయాచోట్ల నాయైయర్థము

నిచ్చుచుఁ ద్రికాలవాచి యవుచున్నది. కావున నితరదపములసహాయ మనురీతిగా నర్థము చేయఁదగదు. వాక్యము మొత్తము ననుసరించి నిర్ణయింపవలయు నన్నపుడే యితరపదసహాయము కలిమి స్పష్ట మవుచున్నది.

ఘం. కాలమును సూచించుశబ్దములసహాయము లేకుండ (205) అని యర్థము చేసెను. వ్యా.సం.స. (1486) ఇట్లే చెప్పినది. కాలసూచకశబ్ద మన నేమి? ఈధాతుజ విశేషణములపైఁ గాలసూచకశబ్దములు చేరుటయు నుండునా? ఇట వివరణ మింకను వివరణ మపేక్షించుచున్నది. ఆవ్యాఖ్య యింక నేమియుఁ జెప్పలేదు. తత్త్వ. అన్నట్లు కాలబోధకశబ్దము చేరి యిది త్రికాలవాచి కానందులకు నుదాహరణ మేది? ధాతుజవిశేషణములపయి విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దము చేరును గాని కాలబోధకశబ్దములు చేరవు. తత్త్వ. దీని నిట్లు సమన్వయించినది. అసహాయత చేత అనగా కాలబోధకచిహ్నము లేవియు లేకుండుటచేత కాలత్రయమును బోధించుచుండును. (336) అనఁగాఁ దద్ధర్మార్థకవిశేషణముయొక్క స్వరూపమును వర్ణించునదే కాని యిందు విశేష మేమియు లే దని తాత్పర్యము. అట్లు వివరించుట యనవసర మనియుఁ గావున నాదళమును దొలఁగించి సూత్రమును 'తద్ధర్మార్థక విశేషణము త్రికాలవాచి యగు' ననియే విధింపఁదగు నని తత్త్వ. స్పష్టము చేసినది (337).

సూత్రకర్త కీయభిప్రాయము గల దని నిశ్చయింపరాదు. అట్టియెడలఁ దద్ధర్మార్థక విశేషణశబ్దమునకు విశేషణముగాఁ బ్రయోగించెడివాఁ డేమో.

ఇది సమన్వయించు నేమో పరిశీలింతము.

'అసహాయతన్' అనుటచే అసహాయతయందే త్రికాలవాచి కావలె. అనఁగా నసహాయత యనునది దీనిత్రికాలవాచిత్వమునకు నిమిత్త మగుచున్నది. కాఁగా సహాయతయందు నయ్యది తద్ధర్మార్థకవిశేషణమే కావలయును గాని త్రికాలవాచి కారాదు.

ఇట లక్ష్యములలో లక్షణకర్త అనువయించు, నేర్చు, పడు, చేయు అనురీతిగా నెడియెడు ప్రత్యయములు లోపించినరూపములనే చూపియున్నాఁడు.

'తృవర్ణకార్థంబునం దెడియెడు వన్నియ లగు' నని సూరి తృవర్ణకార్థమునం దెడియెడుప్రత్యయములను విధించెను. వీనినే సూరి తద్ధర్మార్థకము లనెను.

కాఁగాఁ దృవర్ణకార్థమునం దగు ఎడి, యెడు ప్రత్యయములు లోపించుటయే యసహాయత యని సూత్రకర్త తలంచెనా యని యనుమానింపఁదగును.

తృవర్ణార్థమునం దగు ఎడియెడు ప్రత్యయములు నిలిచియుండుట సహాయతయు, నయ్యవి లోపించుట యసహాయతయు నని యెంచవచ్చును. ప్రనత్యయము లోపించినను బ్రత్యయలక్షణన్యాయము ననుసరించి యది యున్నట్లే భావింపవలసియున్నను నయ్యవి ప్రత్యక్షముగాఁ గనిపించుట లేదు గదా. ప్రత్యయ లక్షణత ననుసరించియే యెడియెడులు లోపించినను నీయవి తద్ధర్మార్థకవిశేషణము లవుచున్నవి. ఇట లక్ష్యములలో నెడియెడు ప్రత్యయాంత మగుదాని నొక్కదానిని గూడఁ జూపకుండుట యిట్టియనుమానమున కవకాశ మిచ్చుచున్న దనవచ్చును.

కాఁగా సహాయతయందుఁ ద్రికాలవాచి కాదు. అనఁగా నెడియెడు ప్రత్యయాంత మయినపుడు తద్ధర్మార్థము మాత్రమే కల్గియుండు నన్నమాట. ఎడియెడు ప్రత్యయాంతములు తద్ధర్మార్థమును బోధించుట సాధారణముగఁ గానవచ్చును.

నీయట్టివాఁడు నిస్సీ పోయెడిదే, = పోవునా. తడబడఁ బడియెడురవమును అనుచో పడుచున్నరవము అనువర్తమానార్థముకంటె పడునప్పటిరవము అనురీతి గాఁ దద్ధర్మార్థము. ఇం దెంత కాల మున్నను మన కయ్యెడులాభ మేమి? ఇట కాఁ గల యనురీతిభవిష్యదర్థముకంటె, అవునట్టిలాభము (గతమునందును వర్తమానము నందు, భావియందును) అనురీతిని దద్ధర్మార్థము సమన్విత మవును. ద్రౌపది నిట్లు పఱిచెడిదె = పఱచుట యుక్తమా యనురీతిగాఁ దద్ధర్మార్థము సమన్విత మగుచున్నది.

ఇట్లు జనమేజయు చేయుసర్పయాగము ఇత్యాది ప్రస్తుతసూత్రలక్ష్యస్థములలోఁ దద్ధర్మార్థము సమన్వయింపఁబడదు గదా. కావున నసహాయత యనఁగా నెడి ఎడు ప్రత్యయములసహాయము లేనపు డని యర్థము చేయుట యుక్త మగును.

ఈయంశమును బ్రయోగములతో నింకను నిశితముగా బరిశీలించి, తుది నిర్ణయము చేయఁదగు నని ప్రస్తుత మెంచుదము.

లేదా యసహాయత యనుదానికి విభక్తిసహాయము లేనపు డని యర్థము చేయఁదగు నేమో. ధాతుజవిశేషణములకు విభక్తివివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మయి వచ్చెడువారు, వచ్చువాఁ డిత్యాదిగా నవును. కృదంతతచేఁ బ్రాతిపదికలు

గాఁగా నర్థద్యోతకముగా విభక్తి చేరును గదా. సమాసములం దావిభక్తి యుండదు. అట్టివి త్రికాలవాచు లవును.

అట్టియెడ సహాయతతో ననఁగా విభక్త్యంత మైయున్నపుడు మాత్రము తద్ధర్మార్థక విశేషణము తద్ధర్మార్థమును మాత్రమే యిచ్చు నని యర్థము. వచ్చువాఁడు, వచ్చెడువాఁడు, అనురీతివానికి వచ్చినవాఁడు, రాఁగలవాఁడు, వచ్చుచున్నవాఁడు అనురీతిగా భూతభవిష్యద్వర్తమానకాలబోధకత్వము లే దనియుఁ దద్ధర్మార్థము మాత్రమె కల దనియు నెంచనవును.

సూత్రకర్తయభిప్రాయ మేమో గ్రహించుటకుఁ బ్రత్యుదాహరణము చూపిన నింతటిశ్రమ యుండెడిది కాదు. సంగ్రహముగా వివరించినను స్పష్ట మయి యుండెడిది.

తద్ధర్మార్థకవిశేషణములను గూర్చి సర్వ. యిట్లు వివరించినది. ధాతువుయొక్క అర్థమును బోధించునది తద్ధర్మార్థకము. ఇది సమాపకక్రియ రూపము. ఇవి ధాతుజ విశేషణములలో నొకటిగా వ్యవహరించునపుడు తృవర్ణకార్థము అని పిలువఁ బడును చేయు, చేసెడు, చే సెడి మున్నగునవి యుదాహరణములు. ఇట్టివానినే తద్ధర్మార్థకవిశేషణము లని ప్రౌఢవ్యాకరణకారుఁడు వ్యవహరించుచున్నాఁడు (336).

ప్రౌఢవ్యాకర్త వ్యవహరించుచున్నాఁ డనుటచే బాలవ్యాకర్త వ్యవహరింపలే దని యర్థ మవుచున్నది. సూరి తృవర్ణకార్థము లనియే కాక 'ఉదంతం బగుతద్ధర్మార్థక విశేషణమునకు' అనురీతిగా సంధి. 33, 45 సూత్రవివరణములలో స్పష్టముగాఁ బేర్కొనియున్నాఁడు. తత్త్వ. చేయు, చేసెడు అనునవి తద్ధర్మార్థకవిశేషణము లని వ్యవహరించుటను బేర్కొనె (335). చేసెడి యనునదియు నట్టిదే యైన నాసూత్రమునఁ బ్రసక్తము గామిఁ బేర్కొనలేదు.

సర్వ. తద్ధర్మార్థకము సమాసకక్రియారూప మనియు నిదియే 'ధాతుజ విశేషణములలో వ్యవహరించునపుడు' అనుట యసంగతము. సమాపకక్రియ ధాతుజవిశేషణము గాదు. లాడంతము తద్ధర్మార్థకక్రియాపదము. అట ను-వర్ణకము. ఎడుగెడిక్కు లాగమములు (వండును, వండెదును, వండెడిని) ఇట ఎడు, ఎడి అనునవి కృత్ప్రత్యయము లవి క్రియాపదములు. ఈయవి కృదంతములు. ఇవి ప్రాతిపదిక లయి సుబంతము లగును. వండెడువాఁడు, వండెడివాఁడు, వండువాఁడు. కాఁగా నిట సర్వ. అభిప్రాయ ముచితము గాదు.

'త్రికాలవాచి యగు' ననుటను దత్త్వ. విమర్శించినది. అందు పెక్కు పొరపాట్లున్నవి.

వారియనువయించు ననుచో 'కర్మాదేః కర్తృత్వ' మ్మనుచింతామణిసూత్రముచేఁ గర్మతో నన్వయింపఁజేయ నక్కఱ లేదు. (337) తత్త్వ. కర్మాదులకుం బ్రాధాన్యవివక్షయం దనుసూత్రము ననుసరించి బాల. కర్మాదు లన్నిటితోను ధాతుజ విశేషణములకు సమాసమును బ్రాధాన్యవివక్షయందుఁ బేర్కొన్నది.

వీనికి యథార్థముగాఁ గాలబోధకత్వము లేదు. త్రికాలవాచిత్వము విశేషణమునకు లేదు. త్రికాలములకు సంబంధించినవిశేష్యములకు నీతద్ధర్మార్థక విశేషణము సంబంధింపవచ్చు నని మాత్రమే యేతత్సూత్రతాత్పర్యము (తత్త్వ. 337).

ఇందు విశేష్యము కాలబోధక మనుట సరి కాదు. విశేషణ మేకాలమును బోధించును? తద్ధర్మార్థకవిశేషణము త్రికాలవాచి యగు నని సూత్రమును జెప్పవలె నని యీవ్యాఖ్య యింతకు ముందే పేర్కొన్నది. చేయుసర్పయాగ మనుచోఁ జేయు అనునదే చేయఁగల యనుభవిష్యదర్థమును బోధించును గాని సర్పయాగ మను విశేష్యము గాదు.

సర్పయాగము అనునది యేకాలమునకు సంబంధించిన దైనను చేయు అను విశేషణము సర్పయాగము అనుకర్మతో నన్వయించు నని సారాంశము. (తత్త్వ. 337) కర్మాదులతో సమాసవిధానమువలన 'వసించుపర్ణగృహము' ఇత్యాదులు నుండవచ్చును. కర్మయే యన నక్కఱ లేదు. ఒకవేళ నీయర్థముతోనే సూత్రకర్త యీసూత్రము చెప్పిన నయ్యది యసంగత మగును.

'నానేర్చు విధ' మనుచో విధ మనునది యేకాలమునకు సంబంధించినది? చేసిన, చేయుచునున్న, చేయఁగల యని సందర్భమునుబట్టి యేదో యర్థ మూహించుకొనవలె నన్న దీవ్యాఖ్య. చేయుసర్పయాగ మనుచో చేయఁగల యనునర్థము సర్పయాగమునకుఁ జెప్పవచ్చునా? ఇట్లిట నింకను బెక్కులు పరస్పర విరుద్ధాభిప్రాయములు గానవచ్చుచున్నవి. విస్తరింప నవసరము లేదు.

సర్వ. ఇచ్చట త్రికాలవాచి యని కాలశబ్దమును వాడుట సరి కా దనియు వర్తమానార్థకము ఇత్యాదిగా సూరి అర్థకము అనియే వాడు ననియు కాలము అనుపదమును సమాపకక్రియకు మాత్రమే యుపయోగింపవలె ననియు (337)

పేర్కొన్నది. ఈయభిప్రాయము సరి కా దని సంజీవనినిబట్టి గుర్తింపవచ్చును. ణ్వుల్ తృచౌ– ధాతో రేతౌ స్తః. కర్త్రర్థే అనయో ర్వర్తమానకాలా దన్యత్ర న ప్రయోగ ఇతి భాష్యమ్. (బాలమ.వ్యా.సం.స.1486) కావున నిట వర్తమానకాలవాచి యనురీతిగా వ్యవహరించుట సంప్రదాయవిరుద్ధము గాదు.

ఇంక నీవిధానము వ్యర్థ మని సర్వ. తలంచినది సూరి తద్ధర్మాదులలో వర్తమానము, భావి మున్నగువాని నాదిపదముచే గ్రహించెను. దానిచేతనే తద్ధర్మార్థక విశేషణముయొక్క లక్షణము గూడ భూతభవిష్యద్వర్తమానములను బోధించును గావున నీసూత్ర మనవసర మని సర్వ.అభిప్రాయము. (337)

కానీ యిట భేదము గలదు. వర్తమానభావ్యర్థములు తద్ధర్మాదు లన్నప్పటి యాదిశబ్దముచేత గ్రహింపఁబడు నని యీవ్యాఖ్యయే చెప్పినది. అందు భూతమును సూరి స్పష్టముగాఁ బేర్కొనలేదు. ఇంక వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడు (క్రియా. 22) నని విశేషముగాఁ జెప్పెను. మఱి తద్ధర్మార్థక విశేషణము భూతార్థక మవుట యెట్లు? ఆదిశబ్దముచే లాడ్రూపములందుఁ బ్రత్యేకముగా నంగీకరింపవచ్చును. ఆదిపదగ్రాహ్యము లనుటచేతనే యాయవి తద్ధర్మభిన్నము లని సూరి స్పష్టము చేసెను. అందుకే తద్ధర్మాదులం దని లాడ్విధాన స్థలమున నాదిపదమును బ్రయోగించెను. అభిన్నము లగుచో నాదిపద మక్కఱ లేదు గదా. 'భూతాద్యవిషయౌ' అను వి.వి.లక్షణము నిట స్మరింపవచ్చును.

మఱి తద్ధర్మార్థకవిశేషణ మనుచో నాదిపద మేది? ప్రస్తుతప్రౌఢవ్యాకరణ లక్షణమునను దద్ధర్మార్థకవిశేషణ మనియుండుట గమనింపఁదగును.(సంధి.33. 45 సూత్రస్థలములందును) సూరి తద్ధర్మాద్యర్థకవిశేషణ మని పేర్కొనకుండుట గమనింపవలసియున్నది. అట్టియెడలఁ దద్ధర్మాదులం దనుచో నాదిపదముచే గ్రహింపఁబడినవర్తమానాదులు తద్ధర్మార్థకవిశేషణ మనుచో నాదిపదము లేకుండఁ గనే గ్రహింపబడుట యెట్లు? లాడ్విధానస్థలమునందువలె నిచ్చటఁ గూడ సూరి యాదిపదమును బ్రయోగించియున్నయెడలఁ (తద్ధర్మాద్యర్థకవిశేషణము) బ్రస్తుత ప్రౌఢ.లక్షణము వ్యర్థ మయియుండెడిది. అట్లు చెప్పలేదు గదా.

సూరి లాడర్థములలో ననఁగాఁ గ్రియాపదములయెడనే తద్ధర్మాదు లని వర్తమానాదులను బేర్కొని, విశేషణములయెడఁ దద్ధర్మార్థము నొక్కదానినే ప్రస్తావించుటచేతనే ప్రౌఢ. ఈలక్షణము చేయఁబూనియుండవచ్చును.

దీనివలనఁ బ్రస్తుతసూత్రారంభకారణము స్పష్ట మవుచున్నది. సూరి ఎడు ఎడి తల్లోపములు గలధాతుజవిశేషణములను దద్ధర్మార్థకము లనియే వ్యవహరించుటం జేసి తద్ధర్మేతర మగువర్తమానాద్యర్థములు సిద్ధించుట కవకాశము లేదు.

తద్ధర్మార్థకవిశేషణ మనియు సూరి వ్యవహరించినట్లు సర్వ. ఇటఁ బేర్కొనలేదు. ఏది యే మైనను సూరి తద్ధర్మార్థకవిశేషణము లనురీతిగనే వ్యవహరించుటచే భూతాద్యవిషయ మై, ధాతుధర్మమును మాత్రమే బోధింపవలసియున్నది. అనువయించు అనుచో అనువయించుచున్న యనురీతిగ వర్తమానార్థము మాత్రమె కలదు కాని తద్ధర్మార్థము లేదు. ఇట్లే యితరస్థలములలో భూతభవిష్యదర్థములును. కావున నీవిషయము ననఁగాఁ ద్రికాలవాచి యగుట యనుదానిని బేర్కొనవలసియే యున్నది. కావున నీప్రౌఢ.విధానము సార్థకమే.

ఇది భూతాద్యవిషయౌ యనువి.వి.అభిప్రాయమునకుఁ గొంత సవరణమా యనిపించును. విశేషణ మైనను దద్ధర్మార్థక మీయది భూతాదివిషయ మగుట చెప్పఁబడినది కదా.

ఇట సంజీవనియభిప్రాయమును గూడ గమనింపవలయును. సూరి ఎడి యెడు ప్రత్యయములను దద్ధర్మార్థమున విధింపలేదు. తృవర్ణకార్థమునఁ జెప్పెను. సంస్కృతమున ణ్వుల్తృచౌ యని యిది కర్త్రర్థమునందు విధింపఁబడినది. అట అనయో ర్వర్తమాన కాలా దన్యత్ర న ప్రయోగ ఇతి భాష్యమ్. త్రర్థములకుఁ దెలుఁగున నిట్టినియమ మున్నట్లు కానరాదు. మన కయ్యెడులాభ మేమి? ఆది. 7.29 (వ్యా.సం.స.1486) కాఁగాఁ దృవర్ణకార్థమున విధింపఁబడుటచే వర్తమానార్థము సంస్కృతానుగుణముగా సిద్ధించు నన్నను భూతభవిష్యదర్థములు తెలుఁగున విశేషములే గదా. కావున నీవిధానము సార్థకమే. అందులకే సంజీవని యీసూత్రము వ్యర్థ మని నిర్ణయింపలేదు. సంస్కృతమున నిట్టిత్రర్థకములు తద్ధర్మతచ్ఛీలాద్యర్థములు గల్గియుండుటను వఝలవారు నిరూపించిరి( వ్యా.సం.స.1486) సూరి తద్ధర్మార్థక విశేషణము లనుటలో నీయభిప్రాయము గల్గియుండవచ్చును. కానీ తద్ధర్మాద్యర్థకము లనలేదు. వి.వి. సయితము 'తద్ధర్మ ప్రథమే స్యాతాం డుడివర్ణౌ చ నాన్తకౌ డో స్తు భేదక తాపి స్యాత్' అన్నదే కాని తద్ధర్మేతరార్థములు పేర్కొనలేదు.

కావున నీత్రికాలవాచిత్వవిధానము సమంజసమే యనియు నవసర మనియు నిర్ణయింపఁదగును. సూరి తద్ధర్మాద్యర్థకవిశేషణము లన్న బాగుండెడి దనిపించెడి.

'త్రికాలవాచి యగు' ననఁగా భూతభవిష్యద్వర్తమానకాలములతోడియర్థమునే బోధించు ననవలె. కాని యిది తద్ధర్మార్థకవిశేషణము. తద్ధర్మార్థము గల్గియుండుట సహజమే.

గొంతి ముద్దుసేయుకొడుకు అనుచో చేయు అనునది తద్ధర్మార్థకమే. కావునఁ దద్ధర్మార్థము నంగీకరింపవలెను. అది యెట్లును సహజమే కదా యని సూత్రకర్త త్రికాలవాచి యగు నని చెప్పియుండును. కానీ దీనివలనఁ దద్ధర్మార్థకవిశేషణము నకుఁ దద్ధర్మార్థ ముండ దేమో యనుననుమానము గల్గవచ్చును. కావునఁ 'ద్రికాలవాచియు నగు' నని సముచ్చయార్థకమును జేర్చుట యుక్తము.

త్రర్థమున విధింపఁబడిన వగుటంజేసి యివి త్రికాలాదివాచు లగు ననఁగా నీధాతుజవిశేషణములందలిధాతువునర్థము వర్తమానాదికాలములను బోధించుచు విశేషణము గర్త్రర్థక మైయుండు నని యూహింపఁదగును. ప్రాధాన్యవివక్షలోఁ గర్మాదులతో నియ్యవి యితరధాతుజవిశేషణములవలెనే సమసించును.

సూత్రమునం 'దసహాయత' యనుదానికే విస్పష్ట మగునర్థము విచారింపవలసి యున్నది.

## ఆర్యాదులు – అర్థవిశేషము

**3. తద్ధర్మభూతక్రియ లార్యాద్యర్థకపరకంబు లయి ప్రశ్నార్థకంబు లగు.**

తద్ధర్మార్థకక్రియలు భూతార్థకక్రియలును ఆర్యాది (అయ్య మొద లగు)శబ్దములు పరముగా నుండి ప్రశ్నార్థము నిచ్చు నని యర్థము.

'చలుపుదయ్య' యనుచో మధ్యమపురుషైకవచనమును, వర్తింతురయ్య యనుచోఁ బ్రథమపురుషబహువచనము నైనతద్ధర్మక్రియలు ప్రశ్నార్థకము లైనవి. పంచితయ్య యనుమధ్యమపురుషైకవచనము భూతార్థమున కుదాహరణము.

తద్ధర్మక్రియ యనుసూత్రము ననుసరించి తద్ధర్మార్థకక్రియ యని వ్యాఖ్య లర్థము చేసినవి. అట్లు చేయక తప్పదు. కానీ యిట లక్ష్యములందలివి తద్ధర్మార్థకములు గావు. సన్మానితు లయి వర్తింతురయ్య యనుచో సన్మానితు లయి వర్తించుచున్నారా యని యిట వర్తమానార్థకము, సద్ధర్మమార్గంబు సలుపుదయ్యా యనఁగాఁ జలుపుచున్నావా యని యిదియు వర్తమానార్థకమే. ఇవి లాడ్రూపములే. 'తద్ధర్మాదు

లందు లా ట్టగు' నని చెప్పి సూరి యాదిశబ్దముచే వర్తమానమును గ్రహించెను. తద్ధర్మక్రియ యని మాత్రమే చెప్పుచో లాడంతములలోఁ దద్ధర్మార్థకమే గ్రహింపఁ బడును.

రాఁగలవటయ్య, వచ్చుచున్నావటమ్మ యనురీతిగా నితరములు నిట్లు ప్రశ్నార్థకము లగుట వ్యవహారమందుఁ గానవచ్చును.

'ప్రశ్నార్థకంబు లగు' ననఁగాఁ గ్రియార్థము ప్రశ్నార్థవిశిష్ట మవు నని తాత్పర్యము. క్రియాపదము మొత్తమును ననుప్రయుక్తము లగునార్యాద్యర్థకములతోఁ గేవలము ప్రశ్నార్థము నీయదు గదా. (తత్త్వ.340)

'ప్రశ్నార్థకంబు లగు' ననుచోఁ బ్రధానముగా విధింపఁబడుచున్నది ప్రశ్నార్థకత్వముగాఁ గాన్పించును. ఆర్యార్థకపరకత్వము నీసూత్రము విధించు చున్నదా, లేదా? అనుమానము. అయ్య మొద లగునవి పర మగునపుడే ప్రశ్నార్థము కలుగుచున్నది. వానిని జేర్పక 'వర్తింతురు' అనువిధముగా నుంచినచో నాయర్థము గలుగదు. కావునఁ బ్రశ్నార్థము పరముగా నున్నయార్యాద్యర్థకశబ్దములచేతనే యేర్పడుచున్నది.

ఆర్యాద్యర్థకములు ప్రశ్నార్థమునం దగుచున్న వన్నమాట. అట్టియెడ నీసూత్రము నిట్లు చెప్పుటకంటె 'భూతతద్ధర్మాద్యర్థకక్రియలకుం బ్రశ్నార్థమున నార్యాద్యర్థకంబు లనుప్రయుక్తంబు లగు' నని చెప్పుట యుక్తము. ఆర్యాద్యర్థకానుప్రయోగము విధింపబడుట శబ్దశాస్త్రపద్ధతి కనుగుణము.

సూరి సంప్రార్థనంబున ముజున కదాదులు చెప్పి యార్యాద్యర్థకముల నదాదులలోనే చూపెను. తద్భిన్నస్థలము లగునివ్వానిని గుర్తించుట యవసరమే.

అయినను నీలక్షణము నిట్లు చెప్పుట యనవసర మని పైని స్పష్ట మగును.

**4. ఒక్కొకచోఁ దద్ధర్మక్రియ యార్యాద్యర్థపరకం బయి వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకం బగు.**

తద్ధర్మక్రియపై నార్యాద్యర్థకములు చేరి వ్యతిరేకార్థమును వ్యక్తము చేయుచుఁ బ్రశ్నార్థకము లవును.

మెత్తురమ్మ యనుచో మెత్తురా యని ప్రశ్నార్థము. ఇది మెచ్చరు అనురీతిగా

వ్యతిరేకార్థమును వ్యక్తము చేయును. ఇట్లె చనునయ్య = చనునా? = చనదు. మొ.

పూర్వసూత్రము కేవలము ప్రశ్నార్థము నిచ్చుటను బేర్కొనుచుండఁగా నిట వ్యతిరేకార్థమును వ్యంగ్యముగాఁ దెలుపుట విశేష మని తాత్పర్యము. చనునయ్య= చనదు, మెత్తురమ్మ = మెచ్చరు. అని కు.పం. (136) పేర్కొన్నది. మధ్యలో చనునా, మెత్తురా యనుప్రశ్నార్థమును గ్రహింపఁదగును.

పైసూత్రముస్థలమునను పంచితయ్య = పంచితివా యనుప్రశ్న మైనపిదప పంచితివి గదా యని యీషద్భిన్న మగుప్రశ్నార్థము కలుగుచున్నది. ఇట్లే వర్తింతురా అనఁగా వర్తించుచున్నారా లేదా యని ప్రశ్న మాత్రమే కాదు, వర్తించుచున్నారు గదా యని స్వార్థము సైతము వ్యక్త మగుచున్నది.

ఇట సర్వ. ప్రశ్నమా ఇతరమా అనునర్థమును గూర్చినచర్చ వ్యాకరణవిషయము గా దనియు రూపసాధనమున సమానమే. కావున నీసూత్రము చెప్ప నక్కఱ లే దనియుఁ బేర్కొన్నది. (341) (తత్త్వ.340) అర్థముతో నసలు నిమిత్తము లే దనలేము గాని యిట్లు చెప్పవలయుట యవసరము గాదు.

ఇంక నాయాయర్థవిశేషములం దార్యాద్యర్థకములు చేరుట యన్నది మాత్రము శబ్దశాస్త్రము పేర్కొనవలసినయంశము. కావున 3,4 సూత్రములను గలిపి ప్రశ్నాద్యర్థ విశేషములం దారాద్యర్థకానుప్రయోగమును విధించుట యుక్తము. ఇట్టి దిం కొకటి పైని గలదు. అట నీరెంటిని గూర్చి తెలియుదము.

సర్వ. దీనితరువాతిసూత్రము గూడ నిట్టిదే అనఁగాఁ జెప్ప నక్కఱ లే దని భావించినది. (340) కాని అది సరి కాదు.

**5. ఆర్యాద్యర్థక మొక్కచో నటుశబ్దపూర్వకంబు నగు.**

ఆర్యాద్యర్థకశబ్ద మటుశబ్దపూర్వక మై వచ్చును. చెల్లును అనుతద్ధర్మక్రియపై అమ్మ యనునది యటుశబ్దపూర్వకముగాఁ జేరఁగాఁ జెల్లునటమ్మ యనురీతి నవును.

ఇందు అయ్యాదులకు ముందు అటుశబ్ద మవుటంగూర్చి పేర్కొనుటచే నీయది శబ్దశాస్త్రమునకు సంబంధించినది గా దనరాదు. చెల్లునమ్మ యనురూపముతోపాటు చెల్లునటమ్మ యనురీతివిశేషరూపమును సాధించుకొనుట కీలక్షణ మవసరము.

తత్త్వ. 3,4,5 సూత్రములు వ్యాకరణవిషయములు కాఁజాలవు. ఇవి యర్థమును

వివరించునవి మాత్రమె (341) యన్నది. అటు శబ్దపూర్వకత్వమును జెప్పుచున్న యీసూత్రము పూర్వసూత్రములవలె నర్థమును వివరించున దనుట సరి కాదు.

చెల్లునటమ్మ యనుచోఁ జెల్లునా=చెల్లదు అని యర్థము. వేతురటమ్మ= వేతురా= వేపరు అని యర్థము. అనగా నిట వేతు రనుతద్ధర్మక్రియ యంబార్థకపరక మయి వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థక మయినది. ఈయర్థమును బూర్వసూత్రము (4) చెప్పుచున్నది. మ ఱింక నీసూత్రమున విశేషముగాఁ జెప్పినయర్థ మే మున్నది.

ఇంక 3, 4 సూత్రములు గూడ నర్థమునే వివరించుచున్న వనుటయు సరి కాదు. 'ఆర్యాద్యర్థకపరం బయి' యనుటలో నార్యాద్యర్థకపరకత్వము ప్రస్తుతసూత్రము చేతనే విధింపఁబడినది. ఇంక నిట సూత్రకర్త యావిషయమును స్పష్టముగాఁ జెప్పలే దనవచ్చును. 'ఆరాద్యర్థపరకం బయి' యనఁగా నార్యాద్యర్థకములు చేయకుండ నాస్థితి యెట్లు? 5 సూత్రమున నటుశబ్దపూర్వకత్వమును విధించినట్లే పూర్వసూత్రములలో 'నార్యాద్యర్థకపరకత్వ మయిష యనఁగా 'నార్యాద్యర్థకములు పరముగాఁ జేరి' యర్థవిశేషముల నిచ్చు నని చెప్పుట సూత్రాభిప్రాయముగా నెన్నఁదగును.

ఇట్టియెడల సూత్రములందలిలోప మే మనఁ దిరుగవేసి చెప్పుట. 'ఒక్కొకచోఁ దద్ధర్మక్రియపై వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థంబున నార్యాద్యర్థకంబు లనుప్రయుక్తంబు లగు' ననురీతిగాఁ జెప్పఁదగును.

పై సూత్రము 3, 4 పదములసమ్మేళనమువలన నేర్పడినయర్థవిశేషములను జెప్పుచున్నది (340) అని తత్త్వ. పేర్కొన్నది. ఇటఁ బర మయినయార్యాద్యర్థకములు పదములే. ప్రశ్నాద్యర్థవిశేషములు మాత్రమే వీని కుండును. కాని యార్యాద్యర్థము లుండవు.

ఇంక నిట నర్థవిశేషములను వివరింపఁదలఁచి రేని నింక ననేకవిషయములు చెప్పవలసియుండును. లేదా యామూఁడుసూత్రములను వాక్యప్రకరణమునఁ జేర్చుట యుచిత (341) మన్న దీవ్యాఖ్య.

ఏప్రకరణమందయినను వీనిని జెప్పుటకంటెఁ బ్రశ్నాద్యర్థవిశేషములందు నార్యాద్యర్థకములు చేరు నని చెప్పుటయే యుక్తము. తద్ధర్మక్రియలే యన నేల? వ్యతిరేకక్రియలును నార్యాదర్థపరకము లై వ్యతిరేకవిశిష్టక్రియ వ్యతిరేకము ననఁ

గా స్వార్థమును బోధించును. శరస్తంబజన్ముఁడు కాఁడె ధర్మవిదుఁడు, విప్రువలనఁ బుట్ట రైరె, బ్రాహ్మణుండనె (వ్యా.సం.స. 1384) యని సంజీవని స్పష్టము చేసినది. కావున నీవిధానము సమగ్రమును గాదు.

**శబ్ద.115. నామపదంబు లార్యాద్యర్థపరకంబు లయి వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకంబు లగు.**

శబ్దపరిచ్ఛేదమునఁ జెప్పినయీలక్షణము పూర్వసూత్రమువంటిదే. అది క్రియలకు సంబంధించిన దని క్రియాపరిచ్ఛేదమునను, నిది నామపదములకు సంబంధించిన దని శబ్దపరిచ్ఛేదమునను సూత్రకర్త చెప్పియుండవచ్చును. కాని యట్లు వేర్వేఱుగాఁ జెప్పవలసినయవసరము లేదు. ఆర్యాద్యర్థకపరకంబు లగుట, వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థక మగుట యనుప్రధానలక్షణ మీరెండింటికిని సమానమే. కావున నీరెండు సూత్రములను గలిపి 'నామపదంబులును దద్ధర్మక్రియలును నార్యార్థక పరకంబు లయివ్యతిరేకవ్యంజకప్రశ్నార్థకంబు' లగు నని సూత్రించుటలో లాఘవము కలదు. అట్లు చేసియుండవలసినది.

'అర్హము' అనునది ఆర్యార్థకపరక మయి 'యర్హమయ్య' యని కాఁగా 'నర్హమా' యని ప్రశ్నార్థము సిద్ధించును. 'అర్హము కాదు' అనురీతిగా వ్యతిరేకార్థము నిది వ్యక్తము చేయును. ఇట్లే పాడియయ్య మొ.

పూర్వసూత్రమువలెనె యిదియు సరిగా లేదు.

'నామపదంబులు' సహజముగాఁ బ్రశ్నార్థముతోఁ గూడినవి కావు. ఆర్యాద్యర్థక పరక మయినపుడు ప్రశ్నార్థకము లవు నని మాత్రమే చెప్పుచున్నది. కానీ యార్యాదులు నిరర్థకముగాఁ జేరిన వనియు నవి చేరఁగా నామపదమే ప్రశ్నార్థక (ప్రశ్నార్థవిశిష్ట మని యర్థము. లేనిచో నసలు పదార్థము పోయి, ప్రశ్నార్థము మాత్రమే మిగులును) మగు ననునర్థ మేర్పడునవకాశము గల్గుచున్నది. ఇంతకు ముందు సూత్రమునందు నిట్లే. అర్హ మనుచోఁ బ్రశ్నార్థము లేదు. 'అయ్య' చేరిన పిదపఁ గల్గుచున్నది. అనఁగా నార్యాద్యర్థకములు ప్రశ్నార్థమునందుఁ జేరుచున్న వన్నమాట. కావున నిటఁ గూడ 'వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థమునం దార్యాద్యర్థకము లనుప్రయుక్తము లగు' లేదా 'యయ్యాదు లనుప్రయుక్తంబు లగు' ననుట యుచితము.

'ధర్మువె ధర్మనందనా' యనుచో నెత్వ మిట్టిదే. సర్వ.(387) వ్యాఖ్య యార్యాద్యర్థకము లన నిట నదాదు లని యూహించినది. 'పాడియా' యనుచో ఆకారము గూడ నిట్టిదే. సూత్రకర్త యిటను క్రియా. 3,4 సూత్రములందును నార్యాద్యర్థకము లనెను. క్రియా 9 మొద లగుసూత్రములలో నన్నాదు లనెను. ఇట్టిభేదమువలన నార్యాద్యర్థకగణము వేఱు, అన్నాదులు వేఱు. అన్నాదు లన నెదాదు లనియు, నార్యాద్యర్థకము లన నదాదు లనియుఁ జెప్పఁదగునా?

ఇట్లు చెప్పినచోఁ గ్రియా. 3,4సూత్రములందును నదాదులను గ్రహింపవలెను.

నాల్గవసూత్రమున తమ్ముఁ డనంజనునా, నీచేతకు మెత్తురా యని యున్న నాకారమును వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థక మవుచునే యున్నది. మూఁడవసూత్రమున బ్రశ్నార్థక మగుట మాత్రమే చెప్పఁబడినది. పంచితివా, చలుపుదువా యనురీతిగా నాకార మున్నను బ్రశ్నార్థము సిద్ధించును. కావున నీసూత్రకర్త యభిప్రాయమును బాల. అనుగుణముగా గుర్తింపఁదలఁచిన నార్యాద్యర్థకము లన నదాదు లనియు నన్నాదుల నెదాదు లనియు గ్రహింపవచ్చును. కావుననే వాని నెల్లెడల నన్నాదు లని కానీ, యార్యాద్యర్థకము లని గానీ చెప్పక భిన్నములుగాఁ జెప్పుట యొప్పు చున్నది.

కానీ ఇది యుచితమా? అన్నాదు లనుటచే ఎ ఏ ఒ ఓ అనురీతిగా స్వరములను జేర్చుకొనుటలో నిబ్బంది లేదు. ఇట నీస్వరమును సూత్రకర్త యుదాహరించియున్నాఁడు కూడ. ఇంక నార్యాద్యర్థకము లనుచో అ, ఆ (ఇ ఈ లిటఁ గానరావు) ఎ, ఏ యనురీతిగా నాయైస్వరములను గ్రహించుట కార్యాదులలో వీని నేవిగా గ్రహించి తదర్థకములుగాఁ బరిగణింపవలెను? ఇటనే కాక క్రియ. 3,4 సూత్రములయెడఁ గూడ సూత్రకర్త స్వరముల నార్యాద్యర్థకములలోఁ జూపలేదు. అన్నాదులును ఆర్యాద్యర్థకములును భిన్నము లని తలఁచె ననుట కాలక్ష్యప్రదర్శనవిధాన మాధారములు గాకున్నవి. అట్టియెడ మెత్తురా యిత్యాదులం దిట లక్షణమున కవ్యాప్తి యేర్పడుచున్న దని చెప్పవలసివచ్చును.

ఇంక మూఁడవసూత్రముకడ లక్ష్యములును భిన్నములు. పంచితయ్య= పంచితివా? యనునవి సమానార్థకములు గావు. పంచితివా యనునది కేవలము ప్రశ్నార్థమును మాత్రమే కాక, పంచితివి కదా యనురీతిగా స్వార్థమును నంగీకార సూచకముగాఁ దెల్పుచున్నది. పంచితివా యనునదియును పంచితివి గదా

యనునదియును నొకటి గావు గదా. 'ఆర్యాద్యర్థక మొక్కచో నటుశబ్ద పూర్వకం బగు' ననెను. అ ఆ (ఇఈ)లు అటు శబ్దపూర్వకము లగుట కానరాదు. అట్టియెడల నదాదు లని చెప్పునవునా? ఎదాదు లనుటయే లక్ష్యానుగుణ మనిపించును.

ఆర్యాద్యర్థసందర్భమున సూత్రకర్త స్వరము లుద్దేశింపలే దేమో.

కావున ఆర్యాద్యర్థకము లనక యదాదు లనురీతిగాఁ జెప్పుకొనుటయే యుక్త మనక తప్పదు.

ఆర్యాద్యర్థకపరకము లగునీయవి వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థకములే యని నిర్ణయించుటకును వీలు లేదు. పాడియే = పాడియయ్య యిత్యాదులలోఁ గేవలము ప్రశ్నార్థము మాత్రమే స్ఫురింపవచ్చు నని (387) సర్వ. స్పష్టము చేసినది. కాని యయ్యాదులు చేరుచోఁ గేవలము ప్రశ్నార్థమే యనుటకు వీలు లేదు. శ.ర. వ్యతిరేకార్థము నిచ్చు ననియుఁ బేర్కొన్నది.

ఇట సూరి ముజునకు మాత్రమే యదాదులయనుప్రయోగమును జెప్పఁగా ప్రౌఢవ్యాకర్త (శబ్ద. 44) యితరక్రియలమీఁద కూడ అమ్మాదు లగు నని తెలిపె (387) నన్నది. అట నాసూత్రముచేతనే యమ్మ యనుప్రయుక్త మైన దని యావ్యాఖ్య పేర్కొన్నది. అది సరి కాదు. ఉభయప్రార్థనార్థక మగు 'వత్తము' అనుదానిపై అమ్మ అట స్వార్థముననే యైనది. అదియు నాసూత్రముచేఁ గాదు. ఆసూత్ర మనుప్రయోగ మవుటను బేర్కొనునది కాదు.

ఇట నీసూత్రము నామపదంబులమీఁద ననుటచేఁ గ్రియాపదములపై నిట్టి స్థితి లే దని యర్థ మవుచున్నది. కానీ యీసూత్రకర్తయే తద్ధర్మక్రియలపై నిట్టిస్థితి నంగీకరించియున్నాఁడు. క్రియా. 4 సంజీవనీవ్యాఖ్య యితరములపైఁ గూడఁ జూపినది.

'నృపులు లేరో, వేట రారో, మదక్రూరాభీలమృగావళిం దునుమరో' యనుచో లేరో, రారో, తునుమరో మొదలగున వట్టివే. లేరు అనువ్యతిరేకార్థకక్రియపై నోకారము చేరి, వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థక మైనది. లేరో = లేరా = ఉన్నారు, రారో = రాలేదా = వచ్చిరి, తునుమరో = తునుమలేదా = తునిమిరి యిత్యాదిగా నీయార్యాద్యర్థకములు వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థకము లగుట నామపదములపయినే కాక క్రియాపదముల మీఁదను (తద్ధర్మేతరములును) గానవచ్చుచున్న దని స్పష్టము. రాగలఁడటయ్య = రాగలఁడా = రాలేఁడు. ఇత్యాదు లిట్టివే.

కాఁగాఁ గ్రియాపదములపైఁ గూడ నుండుటచే, లక్షణమున నామపదము లనుట యొప్పదు. అదాదులు సంగ్రహింప వీలు లేదు. అదాదుల నార్యాద్యర్థకము లనుట గుదురదు. కేవలప్రశ్నార్థకములు నైయుండుటచేత వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకము లనుట సరి కాదు. ప్రార్థనాద్యర్థములందు నవుట సంగ్రహింపమి సముచితము గాదు. మొత్తముమీఁద నీలక్షణము సమగ్రము కాదు.

ఇట్టియర్థవిశేషములను బ్రత్యేకముగా నిరూపింపవలసినయక్కఱ లే దనుమొద లగుహేతువులచే నీసూత్ర మనవసర మని తత్త్వ. (189) పేర్కొన్నది. సమగ్రముగా నిరూపించుట సాధ్యము కా దని యభిప్రాయము గావచ్చును.

కాఁగా దీనిని, క్రియ 3,4 సూత్రము లన్నియుఁ గలిపి యర్థవిశేషములం దదాదులు పదంబుల కనుప్రయుక్తంబు లగు' ననురీతిగా శబ్దశాస్త్రోచితముగా ననుప్రయుక్త మవుటను విధించుటయే సమంజస మని నిర్ణయింపఁదగును. కా. చూ. (9.64.65) ఇట్లే పేర్కొన్నది. అం దార్యాద్యర్థకములు చేర్పవలయును.

**31. కాదె కదార్థకం బగు.**

కాదె యనుదానికిఁ గదా యని యర్థము. ఇట్లు శబ్దమున కర్థమును జెప్పుట నిఘంటువులు చేయవలసినపని. వ్యాకరణమునం దిట్టిలక్షణ మనవసరము. కావున నీసూత్రము చెప్పుట యనవసరము. (తత్త్వ. 369)

శౌరికృప గాదె యనుచోఁ గృప గదా యని యర్థము. మహోపకారు లరయంగ దైవముల్ గాదె (ఆశ్రమ. 1.19) అనునిం కొకప్రయోగమును గూడఁ జూపి ఘం. ఈలక్షణ ముచిత మని సూచించినది.

అర్థమునుబట్టి చూచినను నీసూత్రము వ్యర్థమె యనక తప్పదు. కాదె యనుచోఁ గాదు అనువ్యతిరేకక్రియపై నెకార మనుప్రయుక్తమైనది. (దీనిని వ్యాకర్త విధింపలేదు) (కాదు+ఎ) దీని కర్థము 'కాదా?' యని ప్రశ్నము. ఇది తద్వ్యతిరేకార్థమును వ్యంగ్యముగాఁ జెప్పును. అనఁగా అవును అని యర్థము. కాఁగా 'మనకు నక్షయ బలంబు శౌరికృప యవును' అని యర్థము.

చనునయ్య అనుచో చనునా = చనదు అనురీతిగా వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థము. 'ధర్మువె ధర్మనందనా' యనుచో ఎత్వ మిట్టిది కాదా? అవును గదా. ఇట్లు చూడ

కాదె అనునదే యేమి? శౌరికృప కాదా మనకు నక్షయబలం బని ప్రయోగించినను నీయర్థము సిద్ధింపదా? కాదా (కాదు+ఆ) దీనియొక్క మ ఔకరూపము 'కద' కదా? (శ.ర) అని వ్యాకర్తయే చెప్పియున్నాఁడు. ఇట్లే 'దైవముల్ మహోపకారులు గాదా' అనఁగా 'అవును' అనురీతిగా నీయది నిశ్చయార్థము నిచ్చుట దానిపైఁ జేరిన ఎత్వమువలననే. అందువలననే 'కాదో, కాదే' యనురీతిగా నున్నను నర్థ మిట్లే నిశ్చయమును దెలుపును.

కారే రాజులు, రాజ్యములు గలుగవే యనుచో కారే, కలుగవే యిట్టివే గదా.

రాజులు కారా = అయిరి. రాజ్యములు గలుగవా = కల్గినవి. రాజ్యములు గల్గుట రాజు లగుట ప్రసిద్ధ మని యర్థము. అట్లే యీ కాదె, కాదో మున్నగునవి సయితము.

ఇంతకు ముందు సూత్రములలో నీవ్యాకర్త తద్ధర్మక్రియలు నామపదము లార్యాద్యర్థకపరకము లై, వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థకము లవుటను బేర్కొనె. కాదు అనునది నామపదము గాదు. తద్ధర్మక్రియయుఁ గాదు. కావున వానిచే సంగ్రహింపఁ బడకపోయినది. కారే, రారో మొద లగుచోట్ల నిట్టిది కలుగుట గుర్తించితిమి.

ఈసూత్రకర్తయె శ.ర.లో 'కాదె (కాదు+ఎ) కదా' యని చూపెను. కదా యనురీతియర్థ మెత్వమువలననే వచ్చిన దనుట స్పష్టము. అది భిన్న మనియే తలఁచినపుడు కాదు+ఆ = కాదా, కదా యని శ.ర.లోఁ జూపినయాతఁడు 'కాదె' యనునది మాత్రమె కదార్థక మని యేల చెప్పె. 'కాదా' యనునది యేల చెప్పలేదు.

ఈసూత్రము వ్యర్థము. ఇంకఁ బైని (నామపదంబులు) తద్ధర్మక్రియలు అనురీతిగా, 'కదా' భిన్నశబ్దములకు నిట్టియవకాశమును గల్పింపవలయు నని ప్రయోగములనుబట్టి నిశ్చయింపవచ్చును.

**9. ప్రార్థనంబునం దప్రత్యయాంతక్రియలమీఁదఁ గదకదవుపూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబు లగు.**

నుజ్యంతము లగుక్రియలమీఁదఁ బ్రార్థనార్థమునందు 'కద, కదవు' అనుశబ్దములు పూర్వమునం దున్న 'అన్న' (కదన్న, కదవన్న) మొద లగున వనుప్రయుక్తము లవును. ప్రోవఁగదమ్మ, ప్రోవఁగదవె ఇత్యాదులు. ఘం. (331) దీనికి భారతప్రయోగములను జూపినది.

తత్త్వ. నుజ్యంతమునకుఁ బ్రార్థనార్థము చెప్పలే దనియు అన్నంతక్రియ తుమర్థాదులనె కాక ప్రార్థనార్థముం గూడ బోధించు ననియు నట్టిచో కదకదవు పూర్వకాన్నాదు లనుప్రయుక్తము లగు ననియు నిందుఁ జెప్పఁబడె (346) నన్నది.

కానీ యిది సరి గాదు. నుజ్యంతము ప్రార్థనార్థక మని సూత్రము చెప్పుట లేదు. కద, కదవు, పూర్వకము లగునన్నాదులు చేరనికేవలనుజ్యంతక్రియలు ప్రార్థనార్థము నీయఁజాలవు. కదన్న, కదవన్న మున్నగునవి ప్రార్థనార్థమునందుఁ జేరును గాని ప్రార్థనార్థకము లైననుజ్యంతక్రియలపైఁ గదన్నప్రభృతులు చేరు నని సూత్రమునభిప్రాయముగాఁ జెప్పరాదు. లూదర్థముపయి నదాదు లనుప్రయుక్తము లయియుఁ గాకయుఁ గ్రియాపదము ప్రార్థనార్థక మవును. ప్రోవుము. ప్రార్థనార్థకము. కానీ 'ప్రోవన్' అనునది ప్రార్థనార్థకము కాదు. ఇంతకు ముందుచోట్ల నార్యాద్యర్థములు చేరనపుడు తద్ధర్మాదిక్రియ లెట్లు ప్రశ్నార్థకములు గావో, యట్లే యిటఁ గూడ, కదన్నప్రభృతులు చేరక నుజ్యంతము ప్రార్థనార్థకము గానేరదు. అన్ప్రత్యయాంతక్రియలమీఁదఁ గదకదవుపూర్వకంబు లన్నాదులు ప్రార్థనంబునం దనుప్రయుక్త మవు నని సూత్రాభిప్రాయము. కదకదవులవలననే ప్రార్థనార్థము సిద్ధించు, నందులకే ప్రార్థనమునం దనుప్రయుక్తము లవు నని చెప్పుట.

అన్ప్రత్యయాంత మనుట సముచితము కాదు. కు.పం. (138) తత్త్వ. (346) వ్యాఖ్యలు దీనిని సమర్థింపఁజూచుట సరి కాదు. నాకు నీఁ గదమ్మ యిత్యాది స్థములందు అన్ అనురూపముతో నుండదు. కావున నుజ్యంతము లనుట సమంజసము. చింతామణి ననుసరించి (వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్) చూచినను నత్వము ప్రత్యయభాగము గాదు.

క్రియ లనుట స్పష్టతకు మాత్రమే. దీనివలనఁ బ్రత్యేకప్రయోజన మేమియును లేదు. నుజ్యంతములమీఁద నన్నుంజాలును.

అన్నాదు లనఁగా నిట నెదాదులే. బాల. ఏదాదులుగాఁ బరిగణించినవానిని ప్రౌఢ వ్యాకరణము అన్నాదులు అని పరిగణించుచున్నది. (ఈపలుకులలో పరిగణించుట యనఁగాఁ బేర్కొనుట యని యుద్దేశము) సూత్రకర్త యుదాహరించిన ప్రోవఁగదె ప్రోవఁగదె అనుచో నున్నది యెత్వమె గదా. ఆఎదాదుల నిట నన్నాదు లనుట భ్రాంతిజనకము గావచ్చును (సర్వ. 359).

అన్నాదులు కద కదవు పూర్వకములుగాఁ జెప్పఁబడినవి. కద+అన్న అనుచో నత్వమునకు సంధి నిత్య మగుట విశేషము. లేనిచోఁ గదయన్న యనియుఁ గావలసివచ్చును. కదు కదవు పూర్వకము లనుట లాఘవము. సూరి ముజునకు వుజీ రుజీ విధించుటలో నిట్టియభిప్రాయమును గల దనవచ్చును. కద యనున దొకటి ప్రత్యేకముగాఁ గానవచ్చును. కాని కదవు అనునది లేదు గదా. కావున కద అనుప్రసిద్ధ మైనపదమే యిట నైన దని చెప్పవలసియవసరము లేదు.

సూ.ని. కదరమ్మ, కదరయ్య, కదరె యనునవియును జూపినది. దానిని బ్రస్తుత సూత్రము సాధింపఁజాలదు.

శ.ర. కదరె యనుదానిని కద+రె యని చూపినది. కదరమ్మ యిత్యాదుల నసలు చూపలేదు. వీనిని శ.ర. గుర్తించినచో కదరె యనుదానిని కద+రె యను రీతిగా విభాగించెడిది కా దేమో.

'నన్నుఁ గూర్చుఁ గదరయ్య'. (సారం. 2. 170) అనుచో నుజ్యంతముపై కదరు పూర్వకముగా అయ్య గల దనవలయును గదా.

'బడలెనో కదరమ్మ' యనునది యిట లక్ష్యము గాకున్న అమ్మ కదరు పూర్వక మైయుండుటను సూచించుచున్నది.

కదయ్య యనుచో నయ్యది బహుత్వార్థవిశిష్టము. కదవయ్య యిత్యాదిగా ఏకత్వార్థవిశిష్టములనే సూత్రకర్త చూపెను. దీనింబట్టి 'వు' ఏకత్వార్థమునను 'రు' బహుత్వార్థమునను గల వని యూహించుట కవకాశము గల్గుచున్నది. సూరి ముదుజులకుఁ జెప్పిన వుజీ, రుజీ యనువానికి నీవురులతోఁ బోలిక యేకత్వ బహుత్వసంబంధమున వ్యక్త మవుచున్నది. ఇంక భేద మవి ముజున కగునవి కాఁ గా, నివి కద (దు) శబ్దముపై నవుట.

వీనిం గూర్చి సూ.ని. ఇది వివిధార్థములలోఁ బ్రయోగింపఁబడుటను బేర్కొన్నది. ఇవి యితరస్థలములలోఁ బ్రశ్నాద్యర్థకము లయినను నుజ్యంతములపై మాత్రము ప్రార్థనార్థకమె యైయున్నది. కావున నీయంశము సముచిత మయినను, సమగ్రము కా దేమో.

దీనింబట్టి కదవు, కదరు పూర్వకము లగునన్నాదు లేకత్వబహుత్వార్థద్యోతకము

లగు నని గుర్తింపఁదగును. కదరు పూర్వకప్రయోగములు క్వాచిత్కములె యైనను వాని నంగీకరించుటయే యుక్త మనఁదగును.

కద యనునది 'కాదు'శబ్దనిష్పన్నమె. (కాదు+ఆ) కాదా, కదా, కద యనురీతిగా నిది యేర్పడె ననుట యర్థానుగుణమె. కదుశబ్దముపై నర్థవిశేషములం దన్నాదుల ననుప్రయుక్తము చేసి, దానిపై కదు శబ్దమును, వుజీ, రుజీ యేకత్వబహుత్వము లందు వికల్పముగాఁ జేసి, కదన్న, కదవన్న యనురీతిరూపములను సాధింపఁ దగును. వీనిని బ్రార్థనార్థమునం దన్ప్రత్యయాంతక్రియలమీఁదను నితరముపైఁ బ్రశ్నాద్యర్థవిశేషములందును ననుప్రయుక్తము చేయఁదగును.

'క దేత్యర్థవిశేషదః' అని వి.వి. చెప్పినది. కావునఁ దదనుగుణముగఁ గద యనునదే గ్రహించి యత్త్వసంధిసూత్రమందలిబహుళపదమునే సంధి నిత్య మని చెప్పఁదగు. దీనిపై వురులు వికల్పముగా నవు నని గుర్తింపఁదగు.

ఇట సర్వ. 'ఏదాదులుగా పరిగణింపఁబడిన ఎ, ఏ మున్నగునవి పర మగునపు డీకార్యము జరుగు' (359) నన్నది. ఈసూత్రమున నీయవి యనుప్రయుక్త మౌటయే విధింపఁబడినకార్యము. ఇవి పర మగునపు డీకార్య మగుట కాకార్య మేమి? అన్ప్రత్యయాంతమునకుఁ బ్రార్థనార్థము కలుగు నని యభిప్రాయ మేమో. అదియు సరి గాదు. ప్రార్థనార్థమునందే యనుప్రయోగము చెప్పఁబడుచుండఁగా నింక విశేషకార్య మే మున్నది.

అంతే కాక సర్వ. కద, కదవు రానియెడల మధ్యమముదుజులతోడిరూపములకే అన్నాదులు చేరఁగా ప్రోవుమన్న, ప్రోవవన్న అనువిధముగా రూపము లేర్పడు (359) నన్నది. ఈవాక్యములంబట్టి పై నీకార్య మవు ననఁగా కద కదవు లవు నని భావించిన ట్లర్థ మవుచున్నది. అది సంగతము గాదు. కదకదవు పూర్వకంబు లన్నాదులే యనుప్రయుక్తము లవుట విధింపఁబడినది. కాని యన్నాదులను ప్రయుక్తము లవునప్పుడు ముందు కద, కదవు లగు నని చెప్పుట లేదు. ఆవాక్యమున అన్నాదు లగుటకే ప్రాధాన్యము. 'కదకదవు పూర్వకము లగు'ట యన్నది విశేషణము.

అది య ట్లుండఁగా కదకదవులు రానపుడు ముజుపైనే యేదాదులు చేరు ననుటయు సరి కాదు. అన్ప్రత్యయాంతములపై నీకార్యము విధించుచుండఁగా రానపుడు ముజుపై నవుట యేమి? వికల్పముగా నగు నన్నాఁడా రాకపోవుటకు? ప్రార్థనార్థము వివక్షించినపుడు కదకదవుపూర్వకము లన్నాదులు చేరక తప్పదు.

వివక్ష లేనిచో నుజ్యంత మిది తుమాద్యర్థములం దుండును. కావున కదకదవులు రానిచో ననురీతి వివరణము సరి కాదు.

ఇంక ముఱున కెదాదులు చేరుచోఁ బ్రోవుమన్న యని యవు నని చూపుట విశేషము. అట్టిప్రయోగములు లేకపోలేదు. కానీ యది బాల.సిద్ధము కాని, ప్రౌఢ.లక్షణముచేఁ బక్షాంతరమున నగునది కాదు.

ఈలక్షణము విశేషమె యైనను విధానమునందుఁ గొంత సవరణ మవసరము.

**29. తఱుచుగం గ్రియలమీఁదికదకదవుల కన్నాదులు పర్యాయంబున నను ప్రయుక్తంబు లగు.**

క్రియలమీఁదికదకదవులకుఁ బర్యాయమున నన్న మొద లగునవి యను ప్రయుక్తము లవు నని యర్థము. అలసితివిగదన్న, వీయపురాల వైతిగదవే యిత్యాదు లిట లక్ష్యములు.

క్రియలమీఁది అని చెప్పినను 'తఱచు' అనుపదముచే లేఁతగదమ్మ, రాశివి గదమ్మ యనుచోఁ గ్రియేతరములపైఁ గూడ ననుప్రయుక్త మవుట గల దని సూత్రకర్తయే వివరించెను.

ఇంక నీలక్షణమునౌచిత్యము పరిశీలింపవలసియున్నది. ఇందుఁ బ్రధాన మైన విధానము క్రియలమీఁదికదకదవుల కన్నాదులు చేరు ననునది. క్రియలమీఁది కదకదవు లనుటచేతఁ గ్రియాపదములమీఁదఁ గదకదవుల నీసూత్రము విధించుట లేదు. అవి యంతకు ముందే సిద్ధించియున్నట్లుగాఁ బేర్కొనఁబడినది. అవి యెట్లు వచ్చినవి? ఈవ్యాకర్త యెచ్చటను విధించియుండలేదు. బాలవ్యాకరణమును జెప్పలేదు. వి.వి. 'ప్రార్థనార్థే భవే న్నాంతా త్క దేత్యర్థవిశేషదః, అన్యత శ్చాపి స భవే' త్తనులక్షణము ననువదించి సూత్రకర్త యిట్లు చెప్పె ననుకొనుటకు వీలు లేదు. వి.వి. అట విధించినది కద యనునదే. కదవు చెప్పలేదు. ఇంకఁ బైఁగా కదవె యనురీతిరూపములను వి.వి. నిషేధించిన ట్లహోబలపతి పేర్కొన్నాఁడు. కావునఁ గదవు అనునది దానిచేత సిద్ధించుటకు వీలు లేదు. (వ్యా.సం.స. 1425) మఱి కదకదవులు విధింపకుండగనే వానిపై నన్నాదులు చెప్పుట యెట్లు? పైఁ గాఁ దఱచుగా ననుటచే సుబంతములపైఁ గూడ నన్నాదులు చేరవలె. తఱచు శబ్దసిద్ధములు గాన నిట్టివి విరళము లనవలె. లేనిచోఁ గ్రియలపై నన నేల?

'పదముమీఁది' యని క్రియాభక్త్యంతములతోపాటు నామవిభక్త్యంతములను గూడ సంగ్రహింపవచ్చునే కదా. క్రియలపైనివలెనె సుబంతములమీఁదఁ గూడఁ గద కదవు లంతకు ముందే సిద్ధించియుండవలెను. వీనిపై నన్నాదులు చేరుట మాత్రము విరళము. అనఁగా నన్నాదులు రానియెడల నట నె ట్లుండువలెను? దయాంబు రాశివి గద, వీయపురాలవైతివిగదవు అని యుండవలె. కదవు అనున దెచ్చట నే నుండునా? క్రియలపై నన్నాదులయనుప్రయోగము నిత్యమా? కదకదవులు చేరుచో నిత్య మందము. కదకదవులు నిత్యమా? వికల్పమా? దానికి విధానమే లేమి నెట్లు నిర్ణయింతము? 'ఐతి గదవే' యనియే యుండవలెను గాని 'ఐతి' అని యుండరాదా? అర్థవిశేషములం దనువిషయ మిట సూత్రమున నుక్తము గాలేదు గదా. 'ఐతి గదవే' అని యెప్పుడు గావచ్చును? ఆయర్థమున 'ఐతి' అని యుండునా? 'ఐతి' అనునర్థమున విశేషము లేకయే 'ఐతి గదవే' అని యుండవచ్చునా?

విధింపకయే కద, కదవు వచ్చి చేరు టెట్లు? 'కద' యనుదానిని బ్రసిద్ధిని దెలుపునదిగా శ.ర. చెప్పినది. కదవు శబ్ద మొకటి ప్రత్యేకముగా శ.ర. చూపలేదు. సూ.ని. కూడ కదవయ్య కదరయ్య ఇత్యాదులను జూపినది గాని కదవు, కదరు అనువానిని బ్రత్యేకశబ్దములుగాఁ జూపలేదు.

ఒకవేళ నుండుఁ గాక. ప్రసిద్ధ్యాద్యర్థములందు శబ్దములపైఁ జేరుటను బేర్కొన కుండు టెట్లు?

కావునఁ గ్రియలమీఁది కదకదవుల కనుట సరి కాదు. ఇంకఁ గ్రియల మీఁద 'కదకదవుపూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబు లగు' నని 9సూత్రము నందువలెఁ జెప్పుట కొంత నయము.

రుక్మి యుబ్బుఁ గదరే యత్యంత సంతుష్టుఁ డై (రుక్మి. 2.73) సూ.ని. అనుచో కదరు అనుదానిపై నెత్వము కలదు. కద+రె అని శ.ర. విభాగించుట కానవచ్చును. సంజీవనీవ్యాఖ్య కద+రె అనువిభాగము సరి గా దనియు, కద+ర+ఎ అని విభాగింపఁదగు ననియుఁ దలఁచినది. (వ్యా.సం.స. 1425) కానీ యీవ్యాఖ్యయె యుద్ద్యోతములో కదా, కద మున్నగువానిపైని వె, రె అనునవి నిల్చుటయుఁ గల (375) దన్నది. ఇది యసమంజసము. (బా.సూ.) అహోబలుఁడు పేర్కొన్నట్లు కదవె, కదరె యనుచో నెదాదులకు ముందు కదశబ్దముపై వురులు ప్రయుక్తము లయినట్లు దీనిని గుర్తించుట యుక్తము. ఎంత బడలెనో కదరమ్మ (రసిక. 4.44)

(సూ.ని. వ్యా.సం.స. 1425) యనుచో అమ్మయును జేరుట గలదు. ముజునకు వురు లవుట కనుగుణముగా నిటఁ గూడ వురు లనుతీరున సమన్వయ ముచితము. కాఁగా కదరె అనుదానిని గూడ గదరు+ఎ అనియే విభాగించుట యుక్తము కద+రు+అమ్మ=కదరమ్మ ఇట్టివి క్వాచిత్కములె యైనను 'కదవె' యనునది యేకత్వార్థమునను 'గదరె' యనునది బహుత్వార్థమునను నుండుట గుర్తింపఁదగును. కావునఁ దద్భేదమును స్పష్ట మవునట్లుగాఁ జెప్పుకొనుట యుచితము గదా. వురు వర్ణకంబు లేకత్వబహుత్వంబులం గ్రమముగ నవును (సూ.ని). కదవు కదరు పూర్వకము లవునవి యేకత్వబహుత్వములందు నగు. కద యభయార్థమునందు నవు, నని గుర్తింపఁదగును.

'పర్యాయంబున నను(ప్రయుక్తము లవు' నని చెప్పుచున్న దీసూత్రము. పర్యాయముగా నొకటి రానపు డింకొకటి చొప్పున క్రమముగా నని యర్థము (261). అని సుబో. పేర్కొన్నది (సుగమ. 231). ఈయర్థము ననుసరించి యొకటి రానపు డిం కొకటి రావలసియుండుటచే నేదో యొకటి నియతముగా వచ్చు నని యర్థ మగుచున్నది. సర్వ. 'పర్యాయంబున అనుటచే నేదో యొకటి తప్పక రావలయు నన్నభ్రాంతి కల్గును గావున నిట్లు చెప్పరా' దన్నది. (364)

తత్త్వ. పర్యాయ మనఁగా నొక్కొకటి యొక్కొకసారి వచ్చుట (368) యన్నది. బహుశః సూత్రకర్త యభిప్రాయ మిదే కావచ్చు. అయిన నీయది వ్యర్థ మనవచ్చును.

ఈయన్నాదులు కదకదవులకుఁ గాదా చేరవలసినది. కద యనుదానిపయి నన్న యనుప్రయుక్తము చేసిన గదన్న అని యవును దానిని పై అయ్య చేరుటకు వీ లున్నదా లేదు. కదకు అన్న అనుదానితో వ్యవధాన ముండుటవలనఁ గదన్న యనుదానిపయి అయ్య చేరనేరదు. ఇట్లే అన్న యనునదియు మఱల రాదు. ఇవి కద (కదవుల)కుఁ గదా చేరవలసినది. అనఁగా కదకదవుల కన్నాదులలో నొకటి యనుప్రయుక్త మయినపుడు దానితో వ్యవధానము గల్గుటవలన దానిపై నిం కొకటి చేరి, కదయ్యమ్మ యనురీతిగా నేర్పడుటకు వీలు లేదు. అనఁగా ఒక్కొక్కటి యొక్కొక్కసారి చేరు ననుటకయి 'పర్యాయంబున' నని చెప్ప నక్కఱ లేదు. అట్లు చెప్పనంతమాత్రాన నొకటే రెండుసార్లు వచ్చుట గాని, లేదా నొకదానిపై వే ఱొకటి వచ్చుట గాని సంభవింపదు. ఇంకఁ బూర్వసూత్రములలోఁ 'బర్యాయంబున'

ననకున్నను ని ట్లొక్కటియ యనుప్రయుక్త మవుటకు గారణ మిదే కదా. లేనిచో ప్రోవఁగదన్న, కదవమ్మ యనురీతిగా నుండునా?

సూరి ముజున కదాదు లనుప్రయుక్తము చేయుట యిట్టిదే. 'మువర్ణకంబున కుం బుంపు లగు, 'తదుపరి పున ర్మబూ ప్రాచామ్' మొద లగువిధానము లిట్టివిగా స్మరింపఁదగును. కావున నీసూత్రమందలి 'పర్యాయంబున' ననుదళము వ్యర్థము.

ఇంకఁ 'బర్యాయంబున' ననుటచే నొకటి రానపు డిం కొకటి రావలె. అనఁగా నేదియో యొకటి రాకతప్పదు. అట్టియెడల 'వచ్చితివి గద' యనురీతిగాఁ బ్రయోగించుట యీసూత్రమునకు విరుద్ధ మగును. అట్టియెడల 'పాలుపడెఁ గదా, రాడు గదా' (సూ.ని.) అనురీతివి విరుద్ధములే యవునా? ఇట నాకార మన్నాదుల లోని దనరాదు. అట్టియెడలఁ బ్రోవఁగదవా, రాఁడుగదవా అనురీతిగా కదవుపై గూడ నుండవలయును.

సూత్రమునందుఁ 'దఱచుగ' ననుపదముచే నన్నాద్యనుప్రయోగము లేకుండుట యుఁ గల దని చెప్పవలె నందమా? కదవు అనుదానిపై నెదాద్యనుప్రయోగము నియతము. 'ప్రోచితిగదవు' అనురీతిరూపము లుండవు. ఇది గూడ తఱచు శబ్దముచేతనే సిద్ధించునర్థ మనవలె.

అది య ట్లుండఁగాఁ దఱచుశబ్దమునకుఁ గ్రియలమీఁది 'కద'కు నన్నాద్యను ప్రయోగము లేకుండుటయుఁ గల దని సూత్రకర్త వివరింపలేదు సరి గదా, తఱచుగా ననుటచేఁ గ్రియేతరముపైఁ గల దని నిరూపించెను. (ఘం.225) తఱచుశబ్దప్రయోజన మనువిధముగా సూత్రకర్త నిర్ణయించుచుండఁ బైరీతి ననుప్రయోగాభావమును సాధించుట యుక్తమా? 'ఇది గద మందరము' నేఁడు గదా, ఉన్నయది గదా' (సూ.ని.68) అనుచో నివ్వానిపైని గూడ నన్నాద్యను ప్రయోగము కదశబ్దముపైఁ గానరాదు.

కావునఁ 'బర్యాయంబున' ననకుండు టుచితము.

ఈదళము వ్యర్థ మని సర్వ. స్పష్టము చేసినది. కాని యంతమాత్రము చెప్పినఁ జాలదు. పర్యాయంబున ననుదళము వ్యర్థము గదా యని దానిని తొలఁగింతము?, అపుడు 'తఱచుగం గ్రియలమీఁదికదకదవుల కన్నాదు లనుప్రయుక్తంబు లగు' నని చెప్పవలె. అపుడు మాత్ర మివి నిత్యముగాఁ గావా? తఱచుశబ్దప్రయోజనము

వేఋ గదా. ఇ ట్లని వికల్పముగాఁ జెప్పుదమా? కదకదవు లీసూత్రముచే విధింపఁ బడునవి కాదు. కావున నవి యుండవలెఁ గాని యన్నాదులు పాక్షికముగా రాకపోవచ్చును. 'వచ్చితివి గద' యనుదానితోపాటు 'వచ్చితివిగదవు' అనియు నుండవలసివచ్చును.

కావున నీసూత్రరచనము సమర్థముగా లే దని నిర్ణయింపవలసియున్నది. ఇందలిలోపములు- 1. క్రియమీఁద కదకదవు లన్నదే కాని కదకదవులు విధింపలేదు. 2. పర్యాయంబున ననుట వ్యర్థ మగుట. అంతే కాక యివి యర్థవిశేషములం దవుటను గూడ గుర్తింపవలె. అలసితివి, అలసితివిగదన్న యనునవి సమానార్థకములు గావు. ప్రసిద్ధ్యాద్యర్థవిశేషములు కద కదవులే యిచ్చుచుండఁగా ననుప్రయుక్తములుగాఁ జెప్పుచున్నయన్నాదుల కర్థవిశేషమును జెప్పవలసినయవసరము లే దని సూత్రకర్త భావించియుండవలె. అట్టియెడలఁ గదవు అనుశబ్ద మెట్లు వచ్చును? క్రియలపైనివలెనె సుబంతములపైఁ గూడ నీయది కానవచ్చుట సూత్రకర్త గుర్తించియే యుండెను. అయ్యవి మిక్కిలి యరు దని భావింప నవసరమును లేదు. కావునఁ గ్రియలమీఁద నని మాత్రమే చెప్ప నవసరము లేదు. కదరమ్మ ఇత్యాదులకును గుర్తింపు అవసరము.

కాఁగా నీవిధానము నిట్లు చేయఁదగదు. సూ.ని. వివరణ ముచితము. ఈయవి 'కాదు' క్రియాజన్యములే.

అర్థవిశేషములందుఁ బదముల కదాద్యనుప్రయోగము చెప్పఁదగియున్నది. ప్రసిద్ధ్యాద్యర్థవిశేషములం దదాదులకు ముందు కద శబ్ద మవుటయు, కద కెదాది పరకత్వమున నేకత్వబహుత్వసూచకముగా వురులును విధింపఁదగును.

'నేఁడు'శబ్దముపై ని ట్లదాద్యద్యనుప్రయోగము. ముందు కద. నేఁడు కదా. ఎదాదు లవుచో, నేఁడు గదవె, నేఁడు గదరె అనురీతి వీనిప్రక్రియను మార్గాంతరమున సాధించుకొన్న బాగుండెడిది. 'ఏదాదిపరకం బగుకదశబ్దము ప్రార్థనంబునందు నుజ్యంతముల కనుప్రయుక్తం బగు' నని ప్రోవఁగదె యిత్యాదు లను సాధింపఁ దగును. ఇచ్చట కద కదవు అనునవి సందేహమును గాక నిశ్చయమునే ద్యోతనము చేయుచున్నది (సర్వ. 364) సందేహ మని యెవ రన్నారో తెలియరాలేదు.

**శబ్ద.44. సంబోధ్యవాచకంబు బహువచనాంతం బయ్యుఁ గ్రియలమీఁది యమ్మాదు లేకవచనాంతంబుల యగు.**

'చూచి వత్తమమ్మ సుదతులార' యనుచో సుదతులార యనుసంబోధ్యవాచకము బహుత్వార్థమునం దున్నది. కాని వత్తము అనుక్రియాపదముపై నున్న 'అమ్మ' అనునది మాత్ర మేకవచనాంతమె యై యున్నది. అనగాఁ 'జూచివత్త మమ్మలార సుదతులార' యనురీతిగాఁ గ్రియలమీఁదియమ్మాదులు సంబోధ్యవాచకమునుబట్టి బహువచనాంతములు గా నక్కఱ లే దని తాత్పర్యము.

అమ్మాదులు అన్నప్పటి యాదిశబ్దముచేత అయ్య అన్నాదులు గ్రాహ్యము (54) లన్నది. కు.పం.

'చూచివత్తమమ్మ' యనుచో అమ్మ ప్రశ్నార్థమం దైన దని కు.పం. పేర్కొనుట సరి గా దనియుఁ బ్రార్థనార్థమునం దైన దనియు సుబో. (84) పేర్కొనుట యుక్తమె.

ఇట 'అమ్మ అనుశబ్దముసందర్భమునుగూర్చి సర్వ. 'సంప్రార్థనంబున ముఱున కదాదులు (బాల.క్రియా.33) అనుసూత్రముప్రసక్తి తెచ్చుటయు నీసూత్రముచేతనే సిద్ధించుచున్న దనుటయు (321) సంగతములు గావు. వత్తము అనునది ప్రార్థనార్థక మయ్యును నిట మువర్ణము ముఱుసంబంధి కాదు. అది యుత్తమపురుషబహు వచనము. కావున తత్త్వ. పైయభిప్రాయమును (112) దిరస్కరించుట యుక్తమే. కానీ తత్త్వ. ఇటఁ బొరవడినట్లు తోఁచుచున్నది. 'వత్తము అనునది లూడంతము కాదు. ఇయ్యది లాడంత' (112) మనుట సరి కాదు. ఇయ్యది లూడంతమె. అయ్యు అత్త్వవిధానసామర్థ్యముచే (బాల.క్రియ.30) దుగాగమ మైనది. దుగాగమ మయినది గాఁబట్టి లాడంత మని యూహింపరాదు.

లాట్టున కనేకార్థములు గలవు గావునఁ బ్రశ్నము కాని సంప్రార్థనము కాని యిచ్చుట నర్థమున వచ్చునా? (తత్త్వ.112) యని యిది లాడంతముగాఁ బేర్కొనుట సరి కాదు. లాట్టు చేసినచో వందుదువు, వందుదురు అనునవి ప్రార్థనార్థకము లగుటయుఁ గల దనవలసి వచ్చును. ప్రార్థనార్థమున 'వందుదు' వనురీతిరూపములు లేవు.

ప్రార్థనమున మాత్రమే దుగాగమమున కత్వము విధించుట యుచితముగాఁ గానరాదు. మనము రేపు వత్తము ఇత్యాదిభావ్యర్థములందును మనము రేపు

వత్తమా యనుప్రశ్నార్థమునందును అత్వము గలదు. (తత్త్వ. 112) ఇదియు నుచితము గాదు. ఇట వత్త మనునది ప్రార్థనార్థక మయ్యు బ్రశ్నార్థాదికలిత మైయున్న దని గ్రహింపవలెను. రేపు వత్తము అనునది కేవలము భావ్యర్థ మగు టెట్లు? ఇచటి 'చూచివత్తము' అనుదానివలెనే 'రేపు వత్తము' అనునదియుఁ బ్రార్థనార్థవిశిష్ట మగుట గుర్తింపఁదగును.

ఎదాదులయనుప్రయోగము గూడ సంప్రార్థముననే కాక సంప్రశ్నాద్యర్థము నను గానవచ్చుచున్నది. ఉందునా, పోదునా? అనుచోటి ఆకార మ(ఎ)దాదుల లోనిదే కదా. కావున నప్రయుక్తము లగునమ్మాదులకు సంప్రార్థనసంప్రశ్నాద్యర్థము లుండవచ్చు ననియే తోఁచుచున్నది. (తత్త్వ. 112) ఈయభిప్రాయమును సరి కాదు. ఎకార మెదాదులలోని దని బాల. పక్షమున ననరాదు. సూరి అదాదులను అ ఆ ఇ ఈ ఎ ఏ ఇత్యాదిగాఁ బేర్కొని, అందలి ఎ మొద లగునవి యెదాదు లనెను. అందువలననే చూడుమా యనుచో మువర్ణమునకు వుజీ రాలేదు. ఎదాదులలోని దైనచోఁ జూడవె అన్నట్లు 'చూడుమా' యనునర్థమునఁ 'జూడవా' యని కావలె. కావున ఆకార మెదాదులలోని దనుట సరికాదు. అదాదులు సంప్రార్థనమున ననుప్రయుక్త మవు నను సూరిసూత్రమున ఆసంప్రార్థన మదాదులకుఁ జెందినది గాదు. ఆశీశ్శాపసంప్రార్థనములలో సంప్రార్థనార్థమునం దున్న ముజునకు అదాదులు స్వార్థముననే యనుప్రయుక్త మగును. అనఁగా చూడుము ఇత్యాదులు సంప్రార్థనార్థమునం దుండఁగా నదాదు లాయర్థముననే వచ్చును గాని క్రియా పదమున లేని సంప్రార్థనార్థము నదాదు లీయవు.

ఉందునా, పోదునా యనుచో ఉందును అనుక్రియ సంప్రశ్నార్థము నీఁజాలదు. అకార మనుప్రయుక్త మైననె ప్రశ్నార్థము సిద్ధించును. అనఁగా నదాదులు విశేషార్థమునం దనుప్రయుక్త మైన వన్నమాట. అర్థవిశేషములం దదాదు లను ప్రయుక్తము లవుటను సూరి పేర్కొనలేదు.

శబ్ద. 115 సూత్రముచే సుబంతములపై నిట్టియనుప్రయోగమును బ్రౌఢ వ్యాకర్త పేర్కొనెను. క్రియాపదములపైని కదకదవుల కన్నాదులయనుప్రయోగమును (క్రియా. 29) జెప్పెను గాని కదకదవులు లేక యిట్టియనుప్రయోగము నితఁడును జెప్పలేదు. ఏది యే మైన దీనిని విధింపవలసియున్నది. (చూ.క్రియ. 3. మొ.)

పైతత్త్వ.ప్రసంగములను దృష్టియం దుంచికొని సుగమ. 'ఇట్లు క్రియపై

ననుప్రయుక్త మయి సంప్రార్థనము, ప్రశ్నాద్యర్థములు కలుగవచ్చు నని తెలియుచున్న (65) దన్నది. ఎ ట్టనుప్రయుక్తము లవునో స్పష్టము గాలేదు. క్రియలపై మాత్రమే యేమి సుబంతములపై ప్రౌఢవ్యాకర్తయె స్పష్టము చేసెను (శబ్ద. 115).

కాని పైవివరణమువలన నర్థవిశేషములం దనుప్రయుక్తము లయిన అదాదు లాయర్థవిశేషమునం దుండు టెట్లును సిద్ధమె. ఈసూత్ర మవసరమో యనవసరమా యను నిర్ణయమున కీచర్చ యుపయోగింపదు.

అనుప్రయుక్త మగుశబ్దము కావున సంబోధ్యవాచకమునకు విశేషణము కాదు. అందువలన దాని కనుగుణముగ వచనము నందవలసినయవసరము లే (సర్వ. 321) దన్నది. సంబోధ్యవాచకమునకు విశేషణము అన నేమో వ్యాఖ్య వివరించిన బాగుండెడిది.

ఏది యే మైనను నిట నున్న యమ్మ యనుప్రయుక్త మగునదే కాని సంబోధ్యవాచకము మాత్రము కాదు. కావున 'సుదతులార' యనుసంబోధ్యవాచకము బహువచనాంత మగుటకు ననుప్రయుక్త మగుశబ్దముతో నెట్టిసంబంధమును లే దనక తప్పదు. 'ప్రోవరయ్య దేవతలారా' యనురీతి వెల్ల నిట్టివే గదా. (ఉ. 110)

ఇది యనుప్రయుక్త మవున దగుటచేతనే లక్షణమును నట్లె స్వీకరించిన నయ్యది యసమగ్ర మవుచున్నది.

క్రియాపదములపై నమ్మాదు లేకవచనాంతము లగు' నన్న సుబంతములపై నున్న యమ్మాదులు బహువచనాంతము లవునా. 'జనులార మీ రెవ్వరయ్య' యనుచో అయ్య యనునది ఎవ్వరు అనుసుబంతముపై నున్నది. జనులార సంబోధ్యవాచకము బహువచనముతో నున్నది. అయ్య క్రియాపదముపైని లేదు గావున నీసూత్రముచే నేకవచనాంతము గా వీలు లేదు. 'జనులార మీ రెవ్వరయ్యలార, సుదతులార మీ రెవ్వ రమ్మలార' యనియే ప్రయోగింపవలయునా?

ఇట నమ్మాదులు స్వంతము లగుపదము లనుప్రయుక్తము లవుచున్నవి. కావున ననుప్రయుక్తాంతములపై నాయావిభక్తులవివక్షకే యవకాశము లేదు.

సూత్రకర్త యీవిధానము చేయుటనుబట్టి యీయమ్మ యనుప్రయుక్త మైనది కా దని తలఁచె నేమో. కాని క్రియలమీఁదియమ్మాదు లనుటచే ననుప్రయుక్తము లైన వని తలఁచె ననుటకును వీలు లేకపోలేదు. అనుప్రయుక్త మైనదే యని తలఁచిన విధానము వ్యర్థము. అనుప్రయుక్తము కాని దనియే తలఁచిన నది పొరపాటు.

'చూచి వత్తమమ్మ సుదతులార' యనుచో 'సుదతులార అమ్మ చూచివత్తము' అని ప్రయోగింపవచ్చునా? ఇటఁ బదప్రయోగమునఁ గ్రమాపేక్ష కల దనవలెనా? నిజమునకు చూచివత్తమమ్మలార (సుదతులార) అని యున్నచో అమ్మలార యనునది సైత మనుప్రయుక్త మవుశబ్దము కాక (సుదతులార యనుదానివలెఁ బ్రత్యేకముగా) సంబోధ్యవాచక మగుపదమె యనవలసియుండును.

కాఁగాఁ బ్రస్తుతలక్షణము చెప్పఁదగ దనియె నిర్ణయింపఁదగును.

## కదా - కదే

**28. ఒ ఓ లకు సందేహార్థకంబులకు వలయుచోఁ గొన్నియెడలఁ గదా కదే లనుప్రయుక్తంబు లగు. ఉద్దేశ్యంబు ద్వ్యవయవం బేని విధానం బం దొక్కటి కడదాని కగు.**

సందేహార్థకము లయిన ఒ ఓలపై నవసర మనుకొన్నచో కదా కదే యనుశబ్దములు చేరును. కృతార్థులమో కదా, శాంతంబు కాదో కదె. ఉద్దేశ్యము రెండవయవములు గల దైనచోఁ జివరి దాని కొక్కటి అగును. అవునో కాదో కదా.

ఈలక్షణమును సముచితముగా లేదు. కొన్నింటిని వ్యాఖ్యలు నిరూపించినవి ఈసూత్రమునందలిదళములను గ్రమముగా బరిశీలింతము.

ఒ ఓ లకు కదా కదెలు చెప్పఁబడినవి. అనఁగా నితరస్వరములపై రా వీలు లేదు. కృతార్థు లౌదురె కదా (సమీ. 5. 101) పదంబును నొందెనే కదా (భాగ. 3. 97) చూచితిరే కదా (ఉ.రా. 8. 109) నీనిమిత్తమె కదె, నీకొఱకే కదే. కైకొంటకే కదే (ఉ.రా. 8. 103) వలయు వస్తువు లన్నియు నిత్తురే కదా. (ఉ.రా. 8. 34) నైజము మానరే కదా. (అని. 3. 28) అనురీతిగా ఎ ఏ లపైఁ గూడ కదా కదే యనునవి చేరుచున్నవి.

కావున ఒ ఓల కనుట సముచితముగా లేదు.

'సందేహార్థకంబు' లను టుచితమా. 'ఎంత కృతార్థులమో' యనుటలో 'నెంతయు గృతార్థుల' మనునిశ్చయమే గదా యున్నది. శ.ర.లో ఓ - ఊహలను తెలుపును. మేలు దొరకొనువిధ మెట్లో (129) అని చూపెను. ఇట 'మేలు దొరకొనువిధ మెట్లో కదా' అని యుండుచోఁ బూర్వశబ్దము సందేహార్థకముగా మాఱునా? 'ఎట్లో కదా' అని యిట ననఁగూడదా?

'చింతం బాపరాదో గదె. యని యొక్కవేళఁ బ్రయోగించిన నట సందేహార్థము గల దనవచ్చునా?

ఇట సూ.ని. ఓ – పరిమాణాతిశయమును గాని సంఖ్యాబాహుళ్యము గాని తెలుపును. (ఈయర్థమున ఎంత, ఎన్ని అనుసర్వనామములతోఁ గూడియే యుండును నిన్నుఁ గని యెన్నాళ్ళో కదా (విజ. 2. 126) అని పేర్కొన్నది. శ.ర.కర్త చూపిన 'ఎంత కృతార్థులమో' యన్న దిట్టిదే యనవచ్చును.

'వలయుచో' ననుదళము సూత్రమున వ్యర్థ మనఁదగియున్నది. వలయుచోఁ గొన్నియెడల ననుటచే విధానం బసార్వత్రిక మని కు.పం.(145) పేర్కొన్నది. ఈ యర్థమును సర్వ. 'కొన్నియెడల' ననుదళముచేతనే సాధించినది. (362) సర్వ. అభిప్రాయము యుక్తము. వలయుచో ననుపదము లేనందువలన నెట్టియనర్థమును గల్గనేరదు. సుగమ. ఈప్రయోజనమును 'వలయుచో' అనుదళముచే సాధించినది. (231) అ ట్లయినఁ 'గొన్నియెడల' ననుదళము వ్యర్థ మగును.

'కదా కదె లనుప్రయుక్తంబు లగు' ననుటచే నయ్యవి రెండే రావలసియున్నది. దీర్ఘాంతనిర్దేశమువలన నియ్యవి హ్రస్వాంతములుగా నుండుట కూడ సూత్రసమ్మత మనుట కవకాశము చాలదు. 'శాపం బిచ్చెదరో కద నాలుక వెచ్చన. (శృం.శా. 2. 35) అధివసింపఁగలవొ కదె (సమీ. 2. 82) యనురీతిగా నీయవి హ్రస్వాంతము లయియుఁ గానవచ్చుచున్నవి.

బడలెనొ కదరమ్మ, ఎంత బడలెనొ కదరె (సూ.ని) అనుచో కదరమ్మ కదరె అనునవి సయితము గానవచ్చును వృషభకేతుఁడవొ హరివో కదయ్య (భోజ. 7. 144) అనురీతి నితరములు గాన్పించును. కదా కదే యనునిర్దేశమువలన నిట్టివానికి సాధుత్వము సంభవింపదు.

ఇట్టినిర్దేశమువలనఁ దిజంతములు మాత్రము ఒ ఓలపైనే వచ్చు నని నియమింపరా దని పైప్రయోగములు స్పష్టము చేయుచున్నవి. నేఁడు గదా, మెచ్చురే కదా, రాఁడు గదా (68) పంపెఁ గదె, మేకొనఁడు గదె అని సూ.ని. ప్రయోగములు చూపినది.

సూత్రమునఁ దరువాతిభాగము 'ఉద్దేశ్యము ద్వ్యవయవం బయ్యె నేని విధానం బం దొక్కటి కడదాని కగు' నన్నది. కదా కదే యనువానిలో నొక్కటియే యగు

ననియు రెండవయవయవమునకే యవు ననియు దీనియర్థమును వ్యాఖ్యలు స్పష్టము చేసినవి. ఇందు 'విధానం బం దొక్కటి' యనుదళము వ్యర్థము. ఈదళము లేక పోయిన నే మగును? కదా కదేలు రెండును రావలసివచ్చునా? ఇవి రెండును ఒ, ఓలకే కదా యనుప్రయుక్తములు గావలసినది. ఒకటి యనుప్రయుక్తము చేసిన ఒకారమునకు దానితో వ్యవధానము గల్గుటంజేసి రెండవది రాదు. కాదో యనుదానిపై 'కదా' చేరిన 'కాదో కదా' యని యగును. కదా యనుదానిపై కదే చేరరాదు గదా. కదా వచ్చుటచే ఒకారముతో కదా వలన వ్యవధానము గల్గుటచే కదే రాదు. అట్లే 'కదే' వచ్చిన 'కదా' రాదు.

కాని యుద్దేశ్యము ద్వ్యయవ మైనచో నొక్కటే వచ్చు నని చెప్పుటవలనఁ బైయర్థము బాధిత మై, యుద్దేశ్యము ద్వ్యవయవము కానపుడు కదా, కదే యనువిధానములు రెండును నవు ననునర్థము కల్గును. దానివలన కృతార్థులమో యనుచో కదా, కదే లు రెండు ననుప్రయుక్తము లయి, కృతార్థులమో కదా కదే, కాదొ కదే కదా యనియుఁ గావలసివచ్చును. 'వలయుచో' ననుదళముచే వారించు కొనవచ్చును. కాని యిట్టి యనర్థము కల్పింప నేల? వారింప నేల? దీనికి మూలము 'విధానం బం దొక్కటి' యనుదళము. కావున నయ్యది సూత్రమున నుంచరాదు.

ఇటఁ బ్రస్తుతసూత్రమునఁ గదా కదే లనుప్రయుక్తములుగా విధించెను. ఇంతకుఁ బైని 'గ్రియలమీఁదికదకదవుల' కని చెప్పెను. అటఁ గ్రియలమీఁది కద కదవులు పూర్వసిద్ధము లవుటయు, నిట విధింపవలసివచ్చుటయు ననుభేద మేల కల్పింపఁబడెనో యర్థము గాదు.

ఇ ట్లీసూత్రము సముచితముగా రచింపఁబడలే దని నిశ్చయింపవచ్చును.

ఇయ్యది చెప్ప నక్కఱ లేనియంశము కాదు. ఏల యన, నింతకు ముందు కదా, కదె, కదవె, కదరె ప్రభృతు లర్థవిశేషమునందుఁ జేరుట గమనించితిమి. అదాదు లర్థవిశేషములందుఁ జేరుచుండఁగా నట్టివానిపై మఱల కదా ప్రభృతులు చేరుట విశేషమే కదా.

కృతార్థులము అనుదానిపై నదాదులలోని దగు'ఓ'కార మర్థవిశేషమునఁ జేరినది. దానిపై మఱలఁ గదాప్రభృతు లవుట విశేషమె. కావున 'విశేషార్థమునం దవునట్టి 'ఎ ఏ ఒ ఓ'లపై అదాదిపరకం బగు కదశబ్ద మర్థవిశేషంబులం జూపట్టెడి' నని

గుర్తించుట యుక్త మనిపించుచున్నది. 'రాఁడు గదా' ప్రభృతులం గూర్చి పూర్వ సూత్రమునఁ జూచితిమి.

కాఁగా శబ్ద. 115 క్రియా. 3,4,5,9,28,29 సూత్రములను సవరించి ప్రత్యేక మగుప్రణాళికతో సమగ్రముగా రెండు మూఁడు సూత్రములుగా శబ్దశాస్త్రాను గుణముగా విధింపఁదగును.

## కొనుటకు – కోలు

### 13. భావంబునం దనుప్రయుక్తం బగు కొనుటకుం గోలు విభాష నగు.

ఆత్మనేపదాద్యర్థములందు ధాతువున కనుప్రయుక్త మగు 'కొను' ధాతువు భావార్థకరూప మగు 'కొనుట' యనుదానికి 'కోలు' అనునది విభాషగా నాదేశముగా నగు నని సూత్రకర్తయుద్దేశ్యము. తెచ్చికొనుట = తెచ్చికోలు.

సూత్రమునందు 'భావంబునం' దనుట యవసరము గా దని తోఁచుచున్నది. 'కొనుట' యనుచో టవర్ణకము భావార్థమునందే కదా యయినది. భావంబునం దనుటవలన నొకయిబ్బందియును గలుగుచున్నది. 'భావంబునం దనుప్రయుక్తం బగుకొనుట' యనుటవలన 'కొనుట' యనునదె యనుప్రయుక్త మవు నేమో యని సందేహము గలుగవచ్చును. ఇట ననుప్రయుక్త మవునది 'కొను' ధాతువు మాత్రమే కదా. కొనుధాతువుపై భావార్థమున టవర్ణకము వచ్చి కొనుట యని యగును.

పైఁగా ధాతువునకు భావంబునందు కొనుట యనుప్రయుక్త మవు నని యనుమానించుటకు నిట నవకాశము లేకపోలేదు.

భావంబునం దనుదళము సూత్రమునం దుచితముగా లే దనవచ్చును.

ఘం. పండుకొనుట, చదువుకొనుట మున్నగుచోట్ల కొనుటకు కోలు కా దని విభాషకు వ్యవస్థ కల్పింపవలె (212) నన్నది. సూత్రాభిప్రాయవివరణముగా నీయంశ ముచితము. పండుకొను ఇత్యాదులలో స్వార్థమునం దనుప్రయుక్త మగుస్థలముల యందును నీకార్యము గానరాకున్నది.

'అనుప్రయుక్తం బగు' అనుటచే ననుప్రయుక్తము కాని కొనుధాతువునకు ట వర్ణకాంతమున కీ 'కోలు' లేదు (ఘం. 212) తెచ్చికో ల్నెయ్యము ఇత్యాదులలో నియ్యది విశేష మగుట తత్త్వ. (349) ఘం. (331) వివరించినవి.

వేఁడికో లుచితంబు (ఆది. 5. 218) లచ్చిం బుచ్చికోలున్ (ఉద్యో. 1. 232) తెచ్చికోలేద్పులు (కాళ. 4. 30) ప్రాణంబు రక్షించికోలు (హరి. ఉ. 7. 165) ఇయ్య కోలు (సర్వ. 8. 133) పిల్చికో లుఱదె (సభా. 2. 187) వీడుకో లిచ్చి (ఉద్యో. 1. 257) మొ.

## టలోపము

**14. కొఱకుకంటెపొంటెలు పరంబు లగునపుడు భావార్థకటవర్ణకంబునకు లోపంబు విభాష నగు.**

పాలించుకొఱకు ఇత్యాదిస్థలములలో కొఱకు, కంటె, పొంటెలు పరము లగుచో టవర్ణకము లోపించుటను సూత్రకర్త నిరూపించెను.

దాన నొకంగము దాచుచేతనో (ఆము. 2. 33) అనుచో చేతప్రత్యయ పరకత్వమునను నిట్టికార్య మగుపించుచున్నది.

కు. పం. ప్రభృతివ్యాఖ్యలు సూత్రము నిద్దానిని సముచిత మని యంగీకరించినవి. ఘం. మాత్రము వఝులవారియభిప్రాయము ననుసరించి యీవిధానము నంగీకరింప లేదు. వఝులవా రిట టవర్ణకములోపము సరి కా దని రెండుకార్యములు చెప్పిరి. 1. 'విభక్తిమాత్రం సర్వత్ర మహితం స్యా ట్టవర్ణకా' త్తని వి. వి. టవర్ణకముపైనె విభక్తులు నిలుచు నన్నది. కావున విభక్తిపరకతలో టవర్ణకము లోపించు ననరాదు. 2. కంటె వర్ణకంబు పరం బగునపు డమహత్తచ్ఛబ్దలోపము నంగీకరించెను. కావున (ప్రౌఢ. క్రియా. 21) తుల్యన్యాయమున నిట నంగీకరింపకుంటలో యుక్తి లేదు.

వి. వి. చెప్పినది కావున టలోప మంగీకరింపరా దనునది మాత్రము సరి యైనకారణము కాదు. అంతే కాదు. వి. వి. అట 'విభక్తిమాత్రం మహితం స్యా' త్తనుటతోపాటు 'పూర్వస్య న వికారో నోః' అనియుఁ జెప్పెను. అంట, కంట ఇత్యాదు లసాధువు లని యహోబలుఁ డనెను. కాని సూరి వీనిని సాధించియే యుండెను. కావునఁ బ్రయోగానుసారముగా టవర్ణలోపము కన్పించుచో వి. వి. విరోధించు నేమో యని విధింప మాన నక్కఱ లేదు. 'అంట' వంటిప్రయోగములు నన్నయ చేయలేదు గాని ప్రస్తుతసూత్రస్థలము లనఁదగిన ప్రయోగములు చేసియే యుండెను. హితముసేయుపొంటె (ఆది. 7. 274) రక్షించుకంటె (అది. 8. 290) వధియించుపొంటె (అర. 1. 150) అన్వేషించుపొంటె (అర. 1. 121) అఘములు

వాయుపొంటె (అది. 7.274) అనురీతివి నన్నయప్రయోగములు. అయిన నిట టవర్ణలోపమే యన నేల? తచ్ఛబ్దమే లోపించిన దనవచ్చుఁ గదా యని యనుమానము. ధనము వడయుదానికంటె (విరా. 3.234) అనురీతిగాఁ గంటె పరకత్వమునఁ దిక్కన యమహత్తచ్ఛబ్దమును బ్రయోగించుటను మాత్రమే యనుసరించియు నిటఁ దచ్ఛబ్దము లోపించిన దనరాదు. ఇట నమహత్తచ్ఛబ్ద ముండుటయు విరుద్ధము గాదు. 'పడయుటకంటె' యనురీతిగా టప్రత్యయ ప్రయోగమును విరుద్ధము గాదు. ఇంకను 'పడయుదానికంటె' ననురీతివి వెదకి గుర్తింపవలసినవి. కాని టప్రత్యయముతోడివి ప్రచురములు. బహుశః అందులకే నవర్ణకాంతముపైఁ దచ్ఛబ్దలోపమును జెప్పినయీతఁ డిట మాత్రము టలోపమును జెప్పెను. సూరియు కొఱకు కంటె పొంటెలు రా టవర్ణకంబునకు లోపము చెప్పుట యీయుద్దేశముతోడనే యనఁదగును.

కాని వఝులవారు చెప్పిన పైరెండు హేతువులు కేవలము తిరస్కరింపఁదగినవి కాదు. రక్షించినకంటె ననుచోఁ దచ్ఛబ్దలోపమును, రక్షించుకంటె ననుచో టలోపమును జెప్ప నేల? రెండింటఁ దచ్ఛబ్దమే లోపింపఁజేయవచ్చును గదా. కావున నిట్టితౌల్యము నంగీకరింపఁదగియే యున్నది. టవర్ణకము లోపించె ననుట కిట నవకాశము గలదు. అట లేదు. ఆకారణముచేత మాత్రమే వేఱుచేయవలసియుండును. రక్షించు అనునది తద్ధర్మార్థకవిశేషణ మగుటచే రక్షించుటకంటె ననురీతిగా నున్నచోట భావార్థకటవర్ణము లోపించిన దనుటలో నర్థము సరిపడుచునే యుండును. రక్షించినకంటె ననుచో భూతార్థకవిశేషణ మగుటచే భావార్థకమును టవర్ణము లోపముచే సమన్వయించుటకు నవకాశము లేదు. కావున వేఱుచేయుటలో దోషము లేదు.

కానీ రెండింటి నేకము చేసి తచ్ఛబ్దలోపముగా సమన్వయించుటలో లాఘవము గలదు. తద్ధర్మార్థకవిశేషణ మవుటచే టలోపముతో సాధించినయర్థమునకు భంగ ముండనేరదు గదా. కావున టలోప మన్నను దచ్ఛబ్దలోప మన్నను నిబ్బంది లేని సందర్భమునందు నవర్ణకాంతముపై నెట్లును దచ్ఛబ్దలోపవిధాన మనవసర మగుటం బట్టి యిటఁ గూడఁ దచ్ఛబ్దలోపవిధాన మవసరమగుటంబట్టి యిటఁ గూడఁ దచ్ఛబ్దమే లోపించిన దని చెప్పుట సముచితముగనే యుండు ననవచ్చును.

కనినకంటె ననురీతిరూపములను సూరి గుర్తించెనో లేదో స్పష్టము గాదు. గుర్తించినఁ దచ్ఛబ్దమె లోపింపఁజేసియుండెడివాఁ డేమో.

ఇట్లు తచ్ఛబ్దలోపముగనే సమన్వయింపవలయుటకు నిం కొకయాధారమును గలదు. విశ్వామిత్రునివాఁ డయ్యెడుకొఱకు (హరి. 2. 42) వినెడికొఱకు (ఉ.రా. 6. 198) ఊర్వశిఁ గన నరిగెడుకొఱకై (భాగ. 9. 420) నింద దప్పెడుకొఱకై (భాగ. 10. ఉ. 70) ఇది చాఁగెడుకొఱకై (సింహ. 11. 145) ఎఱిఁగెడికొఱకు (భోజ. 1. 59) ఈఁగెడుకొఱకు (భోజ. 7. 31) భవార్తి యడఁచెడుకొఱకై (కాళ. 1. 87) అనురీతిగాఁ దద్ధర్మార్థకము లైన యెడియెడుప్రత్యయాంతము లగుధాతుజవిశేషణములపైని విభక్తులు గాననవుచున్నవి. అట్టియెడల నిట ఎడియెడులపై టవర్ణకలోప మనుట కవకాశము లేదు. కావున నవర్ణకాంతధాతుజవిశేషణములపైనివలె నిటఁ గూడ నమహత్తచ్ఛబ్దార్థకము లోపించిన దనియే చెప్పవలెను. నవర్ణకముపైని, ఎనియెడుల పైని గూడఁ దచ్ఛబ్దలోపమే సమన్వయింపవలసియుండుటచే 'రక్షించుకొఱకు' ననురీతిస్థలములందును నెడియెడులు లోపించినతద్ధర్మార్థకవిశేషణములపైఁ గూడఁ దచ్ఛబ్దమే లోపించిన దని సమన్వయించుట సముచితము గదా. పొదవుగఁ బెరుగుట లెల్లను బడుటకొఱకె కూడు టెట్లు బాయుటకొఱకే పుడమిం బొడము టెల్లను గడపట లయ మందుకొఱకెగా కపిముఖ్యా (సమీ 4. 119) అనురీతిస్థలములలో పడుటకొఱకె, పాయుటకొఱకె, యనుపూర్వప్రయోగముల ననుసరించి అందుకొఱకె యనుచోఁ గూడ అందుటకొఱకె యనురీతిగానే యన్వయింపఁదగి, టవర్ణకలోప మైన దనుటయ యొప్పును. అయినను నిటఁ దచ్ఛబ్దలోపముగా సమన్వయించినను 'అందు' అనునది తద్ధర్మార్థకవిశేషణముగా నర్థమునందు విరోధము లేమిని బైరీతి నితరాధారముల ననుసరించి యిటఁ గూడఁ దద్ధర్మార్థకధాతుజవిశేషణములపై నమహత్తచ్ఛబ్దము లోపించిన దని సమన్వయించుట తప్పు గా దని తోఁచుచున్నది. ఇంతకంటె బల మైనప్రమాణము లభించినచో టవర్ణకలోపమును నిశ్చయింప వచ్చును.

కాఁగా నీసూత్రమును దొలఁగించి క్రియ. 21. సూత్రముతోఁ గలిపి యొకే సూత్రముగాఁ జెప్పఁదగు ననుట యుక్తమే.

## అమహత్తచ్ఛబ్దలోపము

**21. కంటె వర్ణకంబు పరం బగునపుడు విశేషణనవర్ణకంబుమీఁదియమహత్త చ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు.**

నవర్ణకాంతము లగుధాతుజవిశేషణముమీఁద నున్నయమహత్తచ్ఛబ్దము కంటె ప్రత్యయము పర మగునపుడు లోపించు నని యర్థము. కనినదానికంటె – కనినకంటె మొ.

సర్వ. దీనిని వివరించుచు 'కనిన అనుధాతుజవిశేషణముపై బాల.సమా.9 సూత్రముచేఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మై, కనిన+అది+కంటె అని కాఁగా, ద్వితీయా విభక్తి పర మగునపుడు అది యనుదానికి దాని ఆదేశ మై, ప్రస్తుతసూత్రముచే లోపింప, కనినకంటె నని యవు (388) నన్నది. ఈప్రక్రియ సరి కాదు. అది శబ్దమునకు దాని యాదేశ మవుట యేమి? అట్టిదాని కేది ప్రమాణము? విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్ద మనుప్రయుక్త మగు ననఁగా నేవిభక్తి వివక్షించినను బ్రథమాంత మగుతచ్ఛబ్దము వచ్చిచేరునా? వచ్చిన+వాఁడు. ఇచటఁ బూర్వశబ్దము ధాతుజవిశేషణము. దీనిని బ్రథమావిభక్త్యంతము గావించుటకు 'వాఁడు' అనుతచ్ఛబ్ద మైనది. వచ్చినవాఁడు (సర్వ.185) అనుచో నీవ్యాఖ్య ప్రథమయందు వాఁడు చేసినది. దీనిపై బ్రథమావిభక్తి యవునా? అది యేమి? ప్రథమావిభక్తివివక్షలోఁ దచ్ఛబ్దము చేరఁగా నచ్చోఁ బిదపఁ జేసినప్రథమావిభక్తి లోపించినదా? ద్వితీయాదివిభక్తి వివక్షలో బ్రథమాంత మగుతచ్ఛబ్ద మనుప్రయుక్త మవుట యేమి? ప్రథమావివక్షలోఁ బ్రథమాంతతచ్ఛబ్దము చేరినపుడు ద్వితీయాదివివక్షలోఁ దచ్ఛబ్దము ద్వితీయాద్యంత మే యనుప్రయుక్తము చేయవచ్చును. ద్వితీయాదివివక్షలోఁ బ్రథమాంతము చేరుటయు నట్టిప్రథమాంతముపై ద్వితీయాదివిభక్తులు చేరుటయు సముచిత మగునా? 'అది' చేసి, 'దాని' యాదేశము చేయుట కేయాధారమును లేదు గదా.

విభక్తివివక్షలో ననుప్రయుక్త మగుతచ్ఛబ్దము 'ఆ'కారము ప్రాతిపదికయే. విభక్తి వివక్షలో ఆ+ప్రాతిపదిక యనుప్రయుక్తము గాఁగా, దానిపై నాయావిభక్తులు చేరును. 'ఆ'యనుసర్వనామము మహదమహదర్థములలోఁ బొందురూపము లట నిల్చును. అసలు ధాతుజవిశేషణముల కనుప్రయుక్తము చేయుటలోనిసూరి

యభిప్రాయ మనుప్రయుక్త మగుతచ్ఛబ్దమునకు విభక్తిపర మై, వాఁ డిత్యాదిగా విభక్త్యంతరూపము లేర్పడుటయే. కావున సర్వ. చూపినప్రక్రియ సరి కాదు.

తత్త్వ. సూత్రమందలిలోప మని యిట్లు చెప్పినది. ఇచ్చట నవర్ణకాంతము విశేషణము అనుట యుచితము కాదు. ఇట విశేష్యము లేదు గదా యని యది విశేషణమే కా దని యభిప్రాయము. (356). నవర్ణకాంతము విశేషణము గా దనుట సరి కాదు. సూరియే 'ఎడిప్రభృతివర్ణకాంతంబు లేడును ధాతుజవిశేషణంబు లని ప్రాచీనులు వ్యవహరింతు' (క్రియ. 47) రని వీనిని విశేషణము లని పేర్కొనెను. ఉదంత మగుతద్ధర్మార్థవిశేషణంబునకు నిత్యాదిగా ననుమొద లగుసూత్రములలో వీనిని విశేషణము లనియే పేర్కొనెను. విశేష్యము ప్రక్కను లేనిచో నీయది విశేషణమే కాకుండఁబోవునా?

ఇం కొకలోపము. 'మనుపకుండినదానికంటె వే ఱయినకల్మషము గలదా అని గదా అర్థము. ఇచట మనుపకుండినది యెవరు? అట్టిదేనికంటె వేఱుగ కల్మషము లేదు. కావున మనుపకుండుట అని యర్థము చెప్పుటయే యుచిత' (356) మన్నది.

దేనికంటె నని ప్రశ్నించుట వింతగా నున్నది. ఇంతకు ముందే యిటనే 'వచ్చిన వాఁడు, వచ్చినది మున్నగుచోట్ల ననుప్రయుక్త మగుతచ్ఛబ్దమున కర్థవిశేషము లే' దని వివరించియు నిట ఉండినదానికంటె ననఁగా దేనికంటె నని ప్రశ్నించుట యేమి? దీనివలనఁ దచ్ఛబ్దార్థమును బ్రధాన మగుట లేదా, (వచ్చిన యనుదానివలె) 'ఉండిన' అనుధాతుజవిశేషణార్థమే యిటఁ దచ్ఛబ్దము కలిగియుండు నని గదా చెప్పవలయును. తచ్ఛబ్దము స్వార్థమునం దుండదు గావున దేనికంటె ననురీతి ప్రశ్నించుటకే యవకాశము లేదు.

పైని దిక్కనప్రయోగమే యిటఁ బ్రమాణము. ధనము వదయుదానికంటెఁ దక్కువె చెపుమా యనుప్రయోగమే పైతత్త్వ.యభిప్రాయము సరి కా దని నిరూపించు చున్నది. ఇట మాత్ర మేది విశేష్యము? పడయుదానికంటె ననుచో దేనికంటె? కావున నీప్రయోగము తత్త్వ. ననుసరించి దుష్ట మనవలసియుండును గదా!

అది య ట్లుండఁగా లోపము విభాష నని చెప్పి, కనినదానికంటె నని చూపెను సూత్రకర్త. అది తప్పా?

మనుపకుండుటకంటె ననియే యర్థము చెప్పవలె నని భావించుటచే నీతత్త్వ. 'కంటె వర్ణకంబు పరం బగునపుడు నవర్ణకంబు భావార్థకం బగు' నని సూత్రింపఁ దగు' నని (357) భావించినది. అనఁగా దీనియర్థ మేమి? కనిన అనునది ధాతుజ విశేషణమే కదా. అట్టియెడల దానిపైఁ గంటె ప్రత్యయ మెట్లు చేరును. విభక్తి వివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తము కాలేదా? ఏల? అ ట్లయినను దచ్ఛబ్దమునకు లోపము చెప్పి క్త్వదర్థమునం దైన'న'వర్ణకము కంటె పర మగునపుడు భావార్థక మగు నని చెప్పవలయును గదా. ధాతుజవిశేషణము కాకుండ కనిన అనురూప మెట్లు సిద్ధించును. నవర్ణకమును భావార్థమునం దగు నని చెప్పుట లేదు. అట్లు చేయుటకు వీలు లేదు. కంటె పర మగునపు డని గదా యీవ్యాఖ్య పేర్కొనునది. నామవిభక్తి ధాతువుపైఁ జేరదు. (కంటె ప్రత్యయము) చేరిన దన్నను ధాతువున కిత్వ మెట్లు? ఇంతకు నీవ్యాఖ్య పైనట్లు పేర్కొనలేదు. కాన నిబ్బంది లేదు. కానీ క్త్వదర్థమున సూరి చెప్పిననవర్ణకాంతము ధాతుజవిశేషణము కాక తప్పదు. విభక్తివివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగము తప్పదు. ఇంక నట్టియెడల కంటె వర్ణకంబు పర మగునపుడు నవర్ణకాంతవిశేషణంబుపయి నమహత్తచ్ఛబ్దార్థమునకు లోపము చెప్పి, యాపిదప దానికి భావార్థము చెప్పవలె.

ఇంక భావార్థక మగు నని చెప్పవలెనా యన్నది పరిశీలింపవలె. సూరి క్త్వదర్థమునందుఁ జెప్పెను. కావున నిందు భూతార్థ ముండును. 'మును కనినకంటె' ననుచో మున్ను కనియుండినదానికంటె నను నర్థము సమన్వయించునట్లుగా మున్ను 'కనుటకంటె ననుభావార్థము సమన్వయించునా? ఇట్లే 'కుడిచినదానికంటె' ననునదియుఁ గుడుచుకంటె ననునదియు సమానార్థకము లగునా? భావార్థమున ధాత్వర్థమాత్ర ముండఁగా నిట భూతార్థ మెట్లు సిద్ధించును. కావున లక్ష్యములందు సమన్వయింపఁబడుచున్నభూతార్థము ననుసరించి యీయవి భావార్థకములుగా సమన్వయింపఁదగినవే కా వని స్పష్టము.

కావున నీసూత్రమునెడఁ దత్త్వ. చూపినదోషములు సముచితములు గా వని నిర్ణయింపవచ్చును.

ఈవిధానము నంగీకరించి క్రియా. 14 సూత్రము గూడ దీనితోఁ గలిపి చెప్పఁ దగు నని వఝలవారియభిప్రాయమున కనుగుణముగాఁ బేర్కొన్నది. అది యుక్తము.

'దాచుచేతనో' యనుచోఁ జేతపరకత్వమునను నిట్టిలోపము గలదు.

పన్నిదమాడినకోసము (వైజ. 3. 96) ఏలినకంటెను (విక్ర. 7. 22) అనురీతిగానే కాక, జనించినకోలెను (నిర్వ. 9. 22) పుట్టినకోలెను (నిర్వ. 9. 55) ననుజేరినకోలెను (హరి. పూ. 9. 85) పుట్టినకోలె (అర. 5. 410) అనురీతిగా (వ్యా. సం. స. 802) ఇతర స్థలములందును నీకార్యము కానవచ్చుచున్నది. కావున నిట్టివాని నెల్ల సంగ్రహించుచు నొకసూత్రము చెప్పఁదగును.

ఉన్న, కల, ని యనుప్రత్యయము లంతమం దున్నధాతుజవిశేషణములపై నిట్టికార్యము గానరాదు. తద్ధర్మక్తవదర్థకధాతుజవిశేషణములపై నవు నని గుర్తింప వచ్చును.

ఇంక నిట లోపించునది యనుప్రయుక్త మయినతచ్ఛబ్దమే యనుట స్పష్టము అట్టియెడలఁ దచ్ఛబ్దము ననుప్రయుక్తము చేయుటయు, దానిని మఱల లోపింపఁ జేయుటయు ననవసర మైనప్రక్రియాగౌరవము. అట్టియెడలఁ దచ్ఛబ్దలోపముకంటెఁ దచ్ఛబ్దము చేరకుండుటను బేర్కొనుటలో లాఘవము గలదు.

కావునఁ జతుర్థ్యాదులందుఁ దద్ధర్మక్తవదర్థవిశేషణముల కమహదర్థంబునం గొన్నియెడలఁ దచ్ఛబ్దంబు చూపట్ట' దనురీతిగా లక్షణము చేయుట యుచితముగా నుండును.

కొఱకు ప్రభృతులవివక్షలో నని పేర్కొని కంటె, పొంటె, కోసము, చేత, ఇత్యాదులు ప్రభృతిశబ్దగ్రాహ్యములుగా గుర్తించుటయు నుచితముగానే యుండును.

మొత్తముపై ధాతుజవిశేషణములపైఁ గొన్నియెడలఁ దచ్ఛబ్దానుప్రయోగము గానరా దని మాత్రము గుర్తింపవచ్చును.

## భావార్థకము - అనంతర్యార్థము

**12. కొన్నియెడల భావార్థకరూపము నుశబ్దపరకం బయి యానంతర్యార్థకం బయ్యెడి.**

భావార్థకటవర్ణకాంతము సముచ్చయాద్యర్థక మైననుశబ్దము పరమందుఁ గలిగిన దై, యానంతర్యార్థమును బోధించు నని యర్థము.

ఇందు 'యును' ఆనంతర్యార్థమున వచ్చు నని తెలుపుట విశేష మని సుబో. (247) పేర్కొనుట యుక్తము గాదు. సూత్రకర్త నుశబ్ద మనుచుండఁగా 'యును'

అన నేల? ను అనుశబ్దమే అనుదంతములపై యువర్ణపూర్వకముగ నవును. యును అనుదానిని బ్రత్యేకముగా గ్రహించు టెట్లు? అది య ట్లుండఁగా సూరి డువర్ణక మానంతర్యార్థమునఁ జెప్ప నిట 'యును' జెప్పె ననుటయు సముచితము గాదు. 'యును' అనునదే సూరి విధించినడువర్ణకమువలె నానంతర్యార్థక మయినచో డువర్ణకమువలెనే యియ్యదియు ధాతువుపైనే చేరవలసినప్రమాదము కలుగును. ఇంక టవర్ణకాంతముపైఁ జేరినపుడే యానంతర్యార్థము నిచ్చు నని యీసూత్రము చెప్పుచున్నది. చూచియును, జూడకయును ఇత్యాదిగా నితరస్థలములం దిది యానంతర్యార్థకము గాఁజాలదు గదా.

సర్వ. ఈలక్షణమం దొకలోపము పేర్కొన్నది. 'నుశబ్ద మని చెప్పుట సరి కా దనియు సముచ్చయార్థక మైననుశబ్దము అని వ్రాసినప్పుడు కాని యును మున్నగు వానిని జేర్చుకొనవలయు నన్నస్ఫురణము కలుగ దనియు (381) సర్వ. అభిప్రాయము. అం దిబ్బంది కానరాదు. నుశబ్ద మన సముచ్చయాద్యర్థక'ను'శబ్ద మని యేల గ్రహింపరాదు? కొన్నియెడల ప్రౌఢ.సమా.26.లో యువర్ణ వ్యవహితత్వము పేర్కొనఁబడినది. కానీ యట నీవ్యాఖ్య యీయిబ్బందిని బేర్కొనలేదు. 'పది+ఒక్కండ్రు శబ్దములకు నడుమ యువర్ణము చేరుచున్నది' (228) అని పేర్కొన్నది. ఆయువర్ణ మెట్టిది? 'పదియు నొక్కండ్రు' అనుచో నకార మె ట్లయినది? పదియుండ్రు అనుచో యు అనునదే వ్యవధాయకముగాఁ గానవచ్చును. కావున నట యువర్ణ మని చెప్పెను. అది యీచాద్యర్థకనుశబ్దసంబంధి యని గుర్తింపక తప్పునా? కావున నుశబ్దముచే సముచ్చయాద్యర్థక మగునుశబ్దము గ్రహింపఁబడుటలో నవరోధము లేదు. ఇది కాక నుశబ్ద మిం కొకటి చెప్పఁబడలేదు కదా. ప్రౌఢ.కార.7. సూత్రమునొద్ద నుశబ్దము సముచ్చయార్థక మని యీవ్యాఖ్యయే వివరణము చేసినది. (8) ఇట నట్లే గ్రహింపరాదా.

సముచ్చయార్థక మగునుశబ్ద మనవలయు ననుటయు నుచితము గాదు. ఇట నానంతర్యరూప మైనవిశేషార్థము గలదు గాని సముచ్చయము కాదు. ఇంక నుశబ్దము కేవలము సముచ్చయార్థకము మాత్రమే కా దనియు శబ్ద.116 సూత్రము నుండి గ్రహింపవచ్చును.

విధానమందలిలోపమును దత్త్వ. సర్వ.వ్యాఖ్యలు గుర్తించినవి. భావార్థక రూపము అనంతర్యార్థకం బయ్యెడి ననుటచే 'అనుటయు' అనుశబ్దమున కంతకును

దర్వాత అని మాత్రమే యర్థము కావలసివచ్చును. కావున నట్లు చెప్పరా దనియు నుశబ్దము నానంతర్యార్థమున విధింపఁదగు ననియు స్పష్టము చేసినవి. (తత్త్వ. 348) సర్వ. 'భావార్థకంబుమీఁదిసముచ్చయార్థకశబ్దంబు కొన్నియెడల నానంతర్యార్థకం బయ్యెడి' నన్నట్లు సూత్ర ముండవలె నన్నది. (382) సముచ్చయార్థకనుశబ్ద మని నిర్దేశించుచు నానంతర్యార్థ మనుట విశేషము. బాల. నుశబ్దమును సముచ్చయార్థక మని వ్యవహరించుట కలదు. కాని ప్రౌఢ. అద్దానిని సముచ్చయార్థవిశేషపాదపూరణములందుఁ బేర్కొన్నది. కావున నుశబ్దము సముచ్చయార్థక మనియే భావింప నక్కఱ లేదు. దాని కింకను నర్థవిశేషములు గలవు. కావున సూత్రకర్తవలెనే నుశబ్ద మన్నం జాలును. ఇంక సముచ్చయార్థమునే యిచ్చు 'కూడ' మున్నగుశబ్దములు చేరినపు డానంతర్యార్థ మెట్లు నుండదు గదా.

ఘం. అనఁగా భావార్థకముమీఁదినుశబ్ద మానంతర్యార్థమును దెలుపు నని భావ (252) మన్నది. సూత్రకర్తయభిప్రాయ మది కావచ్చును. కానీ యీసూత్ర మాయర్థమును జెప్పఁజాలదు. నుశబ్దపరకం బయి భావార్థకరూపం బానంతర్యార్థకం బగు ననుసూత్రమున నిర్దేశము భావార్థకరూపమే కాని నుశబ్దము కాదు గదా.

అస లీసూత్రము స్పష్టతకే యనియుఁ బునరుక్త మైన దనియు గ్రహింపఁ దగియున్నది. ప్రౌఢవ్యాకర్త యీనుశబ్దమును సముచ్చయార్థవిశేషపాదపూరణముల యం దగు నని శబ్ద.116 సూత్రమున విధించెను. అట సముచ్చయేతర మగు నర్థవిశేషమున కుదాహరణముగా 'అనుటయుఁ బిన్ననవ్వు నగి' యనునది చూపెను. ఇట నుశబ్దమునర్థవిశేష మానంతర్యార్థమె యనుట స్పష్టము. తత్త్వ. (194) ఘం.(116) మొద లగువ్యాఖ్యలు దీనిని స్పష్టము చేసినవి. కాఁగా శబ్ద.116 సూత్రము ననుసరించియే యర్థవిశేషమున ననఁగా నానంతర్యరూప మగు విశేషార్థమున నుశబ్దము వచ్చిన దని చెప్పిన ట్లయినది. అట్టియెడ నిట మఱలఁ జెప్ప నేల? తత్త్వ. శబ్ద.116 సూత్రమునొద్దనే ప్రస్తుతసూత్రమును స్మరించియు నిట నావిధానమును గూర్చి ప్రస్తావింపలేదు.

శబ్ద.116 సూత్రముచే నర్థవిశేషమునందు నుశబ్దము వచ్చు నని చెప్పి యిట నుశబ్దము చేరుటచే గల్గునర్థవిశేషమును బేర్కొనుటచే దాని కిది వివరణప్రాయ మగు నని గుర్తింపవచ్చును. కానీ యీసూత్ర మపూర్వవిషయమును జెప్పునది కాని, ప్రత్యేకముగాఁ బ్రయోజనవంత మని కానీ చెప్పుటకు వీలు లే దన్నమాట.

ఆసూత్రమునొద్ద సూత్రకర్త యీనుశబ్దమును సముచ్చయేతర మగునర్థ విశేషమునం దగుటను బేర్కొనుటనుబట్టియు, సముచ్చయార్థకనుశబ్ద మని యిటఁ బేర్కొనఁదగదు.

## ఇప్రత్యయము – హేత్వర్థము

**15. ఒక్కొకచో భూతార్థకాసమాపకక్రియ హేత్వర్థకంబు నగు.**

భతార్థకాసమాపకక్రియ యనఁగా క్త్వార్థక మగు'ఇ'ప్రత్యయ మంతమందుఁ గలిగినక్రియ యని యర్థము. అయ్యది హేత్వర్థమును గలిగినది సైత మగు నని సూత్రమునర్థము.

'రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడియె' ననుచోఁ దెగి యనుదానికి దెగుటచేత – తెగుట కారణముగా నని యర్థ మని సూత్రకర్తయభిప్రాయము.

ఇట కు.పం. 'భూతంబునం దిగాగమం బగు' ననుసూత్రముచే నైనయిగాగ మంతమందుఁ గలవి హేత్వర్థకములు నవు నని యీసూత్రము చెప్పుచున్నట్లు (140) పేర్కొన్నది. అది యసంగతము. సూత్రకర్త భూతార్థకాసమాపకక్రియ యని 'ఇప్రత్యయాంతావ్యయము' నింతకు ముందు సంధి.2 సూత్రము నొద్ద వివరించెను. ఇది క్త్వార్థకరూప మనుట స్పష్టము. భూతంబునం దనుసూత్రముచే ఇగాగ మైన నయ్యది శబ్దాంతమున నెపుడు నుండదు. వచ్చిరి మొద లగుసమాపక క్రియల యందును వచ్చిన మొద లగుధాతుజవిశేషణాదులందు నుండును. కురిసినన్ అనురీతి నసమాపకక్రియలును భూతార్థమును గలవే. కానీ యట వృత్తం బగు భావలక్షణ మర్థవిశేషము. ఇట్లే చేదాదులును. కావున నిచ్చోట భూతకాలికాసమాపక క్రియ యనుదానిచే నిప్రత్యయాంతము మాత్రమే గ్రహింపవలెను.

తత్త్వ. 'హేత్వర్థమునను గొన్నిక్రియలకు ఇవర్ణము వచ్చు నని యీసూత్రము చెప్పుచున్నది. అనఁగా ఇకారము భూతార్థముననే కాక, కొన్నియెడల హేత్వర్థము నను వచ్చు నని భావ' (350) మన్నది. భూతార్థకాసమాపకక్రియ హేత్వర్థకము నగు నని సూత్రము చెప్పుచుండఁగా భూతార్థముననే కాక హేత్వర్థమునందు నగు నని యర్థము చేయు టెట్లు పొసగును? క్త్వార్థమునం దిప్రత్యయ మై, తెగి, కదిరి మొద లగురీతిగా నయినశబ్దమే హేత్వర్థము నిచ్చు నని కదా యర్థము చేయఁ దగును? భూతముననే కాక హేత్వర్థమునందును ఇ ప్రత్యయము వచ్చు ననుట

సరి కాదు. తెగి యనుదానికి తెగియుండుటచేత ననురీతిగా నీహేత్వర్థము భూతార్థవిశిష్టము నైయున్నది. తత్త్వ. ఇట తెగి క్త్వార్థకక్రియ. దీని కిచట తెగుటచేత నని యర్థము (350) అన్నది. హేత్వర్థమునం దిప్రత్యయము నీసూత్రము విధించుచున్న దని భావించునపుడు తెగి హేత్వర్థకక్రియ. తెగుటచేత నని యర్థ మని చెప్పవలెను. క్త్వార్థకక్రియ యను టెట్లు? దీనివలన క్త్వార్థమునందే యిప్రత్యయ మయి, తెగి అనుక్త్వార్థకరూప మేర్పడఁగా నయ్యది యిట హేత్వర్థము నిచ్చుచున్న దని కదా చెప్పవలయును. సూత్రకర్తయొక్కయు, సూత్రముయొక్కయు నభిప్రాయ మిదియే యైనను నీవ్యాఖ్య యి ట్లర్థము చేసియుండలేదు.

బాల.చే నిట నిప్రత్యయము రా దని తత్త్వ. పేర్కొన్నది. ఘం. రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడియె మున్నగుప్రయోగములలో సమానాశ్రయత్వము లేదు. ఇట తెగుటకుఁ గర్త కంఠము. పడుటకు గర్త దేహము. కావున ఇవర్ణకము ప్రాప్తింపదు. కాఁగా హేత్వర్థమునందును బూర్వకాలిక మగుక్రియను దెలుపు ధాతువునకు ఇవర్ణక మగు ననునర్థమున నీప్రౌఢవ్యాకరణసూత్రము పర్యవసించుచున్న (214) దన్నది. హేత్వర్థమున విధింపఁబడె నని తత్త్వ. చెప్పఁగా, హేత్వర్థమందు పూర్వకాలికక్రియ కగుట పర్యవసాన మని ఘం. పేర్కొన్నది.

తెగుటకుఁ గర్త కంఠము. పడుటకుఁ గర్త దేహము. కావున నిప్రత్యయము రా దన నర్థమేమి? ఇట సమానకర్తృకత్వము లేదు గావునఁ బూర్వకాలిక మైనను తెగున కిప్రత్యయము రా దని. కాని సూరి సమానకర్తృకంబు లనక సమానాశ్రయంబు లనుటలోఁ బ్రయోజనము గల దని వివరించెను. (క్రియ. 38) కావున నిప్రత్యయము వచ్చుటకు సమానకర్తృకములే కావలయు ననునియమము తెలుఁగున లేదు. తత్త్వ.(351) (ఘం. 214) ఇట సమానాశ్రయత్వమును లే దని పేర్కొన్నది. సమానాశ్రయము లన నేమి? సమానాశ్రయములు ఏకాశ్రయములు, ఏకవ్యక్తి నాశ్రయించిన వని తాత్పర్యము. (ఘం. బాల. 291) అయిన నిట తెగుట పడుట యనునవి యేకవ్యక్తి నాశ్రయించినవి కాదా? తెగినకంఠమును, పడినదేహమును రాహువున కొక్కనికి సంబంధించినవే కదా. కాఁబట్టి కంఠము తెగుట, దేహము పడుట యనురెండును రాహువు అనునొక్కవ్యక్తి నాశ్రయించియున్నవి కావున నేకాశ్రయము లవుటచేఁ బూర్వకాలిక మగుదానికి ఇవర్ణక మవుటకు బాల వ్యాకరణమున విరోధ మేమున్నది.

సూరి యటఁ జూపినలక్ష్యమం దిట్లు సమన్వయింపవలె. 'చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె' ననుచో కొట్టుట యనుదానికిఁ గర్త చైత్రుఁడును, మడియుటకుఁ గర్త మైత్రుఁడును గదా. అట నెట్లు ఇ ప్రత్యయ మైనదో, యిట నట్లే యవును.

ఈవ్యాఖ్యలు పైరీతిని వ్రాయుటకు వఝలవారియభిప్రాయము మూల మనవచ్చు. (వ్యా.సం.స.1452) అది సరి కాదు. (చూ.బా.సూ).

సూత్రకర్త యిది హేత్వర్థక మనెను. ఇట్లు క్రియ హేతు వయినపుడు పట్టివర్ణకము రావలసియున్నది. నీవు వచ్చుటంబట్టి యనురీతిగా రాహుకంఠము తెగింబట్టి యని యిటఁ బట్టివర్ణకము రాదు. అయినను క్త్వార్థకప్రత్యయాంత మియ్యది యవ్యయ మగుటచే దీనిపైని విభక్తులు నిలువ వని గ్రహింపఁదగును. అట్లు గాక సంజీవన్యాదివ్యాఖ్యలవలె నిట హేత్వర్థమునందు విశేషముగా నిప్రత్యయము విహిత మైన దన్న నిద్దానియవ్యయత్వ మింకను విశేషముగా గుర్తింపవలసియుండును.

ఇట వ్యాఖ్య లన్నియు నిది హేత్వర్థక మగుటను స్పష్టము చేసియున్నవి. అస లిట క్త్వార్థకక్రియ హేత్వర్థమునం దున్నదా యన్నది యనుమానము.

'అమరారిమర్దనుఁడు చక్రము గ్రక్కున నేయ రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడియె' అని గదా లక్ష్యము. ఇట రాహుకంఠము తెగినకారణముగా దేహము పడిన దని యర్థ మనుట యొప్పునా? కంఠము తెగుట, దేహము పడుట యనురెంటికిని జక్రము వేయుట కారణము. ఇట విధేయాంశము దేహము పడుట యొక్కటే కాదు. చక్రము వేయుటవలన ముందుగాఁ గంఠము తెగి, పిదప దేహము పడిన దనురీతిగా కంఠము తెగుట, దేహము పడుట యన్నవి రెండును విధేయాంశములే. దేహము పడుటకుఁ గంఠము తెగుట హేతువు కావచ్చు. కాని యది హేతువుగాఁ జెప్పుట యిట లక్ష్యము కాదు. చక్రము ప్రయోగించుట వలన కంఠము తెగుట (ముందుగను అందుకే యిప్రత్యయము) దేహము పడుటయును జరిగిన వని యర్థము.

వఝలవా రిట ముగ్ధబోధవ్యాఖ్య ననుసరించి తెగి యున్నదేహము ధరణిఁ బడియె ననురీతిని ఉన్నశబ్దాధ్యాహారముచే సమర్థిత మగుచున్నది. ( వ్యా.సం.స. 1452) అనిరి. అది యుక్తము గాదు.

అట్టియధ్యాహారావసరము లేకుండఁగా సూరి సమానాశ్రయంబు లనఁగా దానిని దిరస్కరించి యధ్యాహారము చేయ నేల? (బా.సూ.)

అధ్యాహారము చేయుచో నర్థమే భగ్న మగుప్రమాదము గలదు. చక్రము ప్రయోగింపఁగాఁ గంతము తెగి యున్నదేహము ధరణిఁ బడె నన్న నర్థ మేమి? విష్ణుఁడు చక్రము ప్రయోగింపక మునుపే రాహువు కంతము తెగియుండఁగా చక్రప్రయోగమువలన దేహము నేలఁ బడిన దన్నమాట. ఇది విపరీతము. ఉన్న యనుదాని కర్థమే లేదా? అది నిరర్థకముగాఁ జేరిన దని భావించుచో నన్వయము నం దెట్టిబాధయు లేదు. అట్టియెడల నధ్యాహారము చేయ నేల?

తెగి యున్నదేహ మని స్పష్టతకై చూపియుందురు. ఏల యన ఉన్నదేహము అన్నచో నయ్యది సమాసము. సమాసమునం దుండవలసిన 'ఉన్న' ప్రయుక్తము గాకుండుట యెట్లు సమన్వయింపవలెను. ఇంక తెగి యుండఁగా దేహము ధరణిఁ బడియె ననురీతిగాఁ జూపుట కొంత యుక్తము. అపు డైనను నిప్రత్యయము వచ్చుట కధ్యాహారము చేయవలసినదే. కాని సమన్వయించుటకుఁ గాదు. ఇప్రత్యయము వచ్చుటకును సూరి యట్టియవసరము లేకుండగనే లక్షణము నేర్పఱచెను. ఇంక నధ్యాహార మేల? మొత్తముమీఁద దేహము పడుటకు తల దెగుట కారణముగాఁ జెప్పుట తత్కర్తయభిప్రాయము కా దని గుర్తింపఁదగును.

అస లిట్టిస్థితి సూరిలక్ష్యమందు మాత్రము లేదా? చైత్యునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె' ననుచో మడిసె ననుదానికి కొట్టంబడి యనునది హేతు వనియుఁ జెప్పవచ్చునే. కొట్టఁబడకున్నఁ జావఁడు గదా! కొట్టంబడి యనుచో నయ్యదియు హేత్వర్థమునందే యున్నదా? కొట్టఁబడుటచేత మడిసె ననురీతిగా నయిన సూరి దాని నట నేల యుదాహరించెను.

తెగి యనుచోట ఇ ప్రత్యయము హేత్వర్థమున వచ్చె ననియు, సూరిసూత్ర మిట్టిలక్ష్యములం దవ్యాప్త మగుటచేతనే ప్రౌఢవ్యాకర్త యిట్లు సూత్రించె ననియు (వ్యా.సం.స. 1452) వఝులవారును బేర్కొనిరే. కొట్టంబడి మడిసె ననుచోఁ గూడ నిట్టి హేత్వర్థము లేదా? అయిన నిప్రత్యయ మయిన దని సూరి యట నె ట్లుదాహరించెను. సూరిసూత్ర మవ్యాప్త మగుట యెట్లు?

ఇట కొట్టంబడి మడిసె ననుచోఁ గాని యట్లే కంతము తెగి దేహము పడియె ననుచోటను బూర్వకాలికత్వమును దెలుపుటయే యభిప్రాయము గాని హేత్వర్థమును జెప్పుట కాదు.

బిట్టడలు మనంబునం గదిసి హా యనువారి. హా యనుటకు నడలు గదరుట

హేతు వని సూత్రకర్తయభిప్రాయము. కాని యడలు గదరుట పూర్వకాలికమును హో యనుట తరువాతిది యనియును నభిప్రాయము. ఇ ట్లితరలక్ష్యములలో గుర్తింపఁదగును.

ఇట్టియెడల హేత్వర్థమును జెప్పి యాయంశము నప్రధానముగాఁ జేయుట సరి కా దనియు, రెండును బ్రధానము లైనవిధేయాంశములే యనియు గుర్తింపఁ దగును.

కావున హేత్వర్థమునందు 'ఇ' ప్రత్యయ మవు నని చెప్పుట సరి కాదు. అంతే కాక ఇప్రత్యయాంతము లిట్టివి హేత్వర్థమునందే ప్రయుక్తము లయిన వనుటయు నుచితము గాదు.

ఘం. హేత్వర్థమె కాక యితరార్థములు గల వనె (214). వఝలవా రీ విషయమును (వ్యా.సం.స.1452) బేర్కొనిరి. అట్టియెడ నుండుధాతు రూపాధ్యాహారము తప్పుట లేదు. అది యట గమనింపఁదగు. అట్టిప్రయోగముల నింకను జాగ్రత్తగాఁ బరిశీలించి నిర్ణయింపవలెను.

మొత్తముమీఁద నీహేత్వర్థవిధాన మవసరము గాదు.

## ముత్పరకత – పత్వాభావము

**16. కవిత్రయేతరప్రయోగంబులం గొన్నియెడల నిప్రత్యయాదులు పరంబు లగునపుడు పకారం బించుక్చకారంబున కేని కానంబడదు.**

ని ప్రత్యయము మొద లగునవి పర మగునపుడు కవిత్రయేతరప్రయోగములలో ఇంచుక్చకారమునకు సైతము పత్వము గానరా దని సూత్రము చెప్పుచున్నది. ఉదా. పోరించని.

కు.పం.లో 'నిన్ ప్రత్యయాదు లనురీతిగా సూత్రమున నకార మధికముగాఁ గానవచ్చుచున్నది. అట్టిప్రత్యయము లేదు. కావున నయ్యది యచ్చుపొరపా టన వచ్చును. 'పోరించని' అని సూత్రకర్త చూపినలక్ష్యమం దున్నది నిప్రత్యయమే.

అపి శబ్దార్థకమునకు సూత్రకర్తయే 'తీర్చుము' అనుచో పత్వము రాకుండుట ప్రయోజనముగా స్పష్టము చేసెను. అట్టియెడ కు.పం. 'ఇంచుక్చకారంబున కేని' అనుట నించుక్చకారమునకుం బత్వమును సూరిగారు నిత్యముగా విధించియుంటచే

పత్వశాస్త్రమున కవ్యాప్తింప జూపుట ఈసూత్రోద్దేశము' (140) అనుట యుచితము గాదు. ఆగమాన్యచకారంబుల కనుసూత్రముచే విహిత మగుపత్వము గూడ నిత్యమే. ఇంచుక్చకారమునకే నిత్య మని సూరి చెప్పలేదు.

నిప్రత్యయాదు లనఁగా ము త్తనియే భావ (448) మని సర్వ. స్పష్టము చేసినది. సూత్రకర్త ప్రస్తుతస్థలమున జీత్తులతోపాటు ముజును గూడఁ జూపియే యున్నాఁడు. కావున ము త్తని చెప్పుటలో దొసఁగులేదు. అయిన దంచుదురు అనురీతి స్థలములలో ముద్భిన్నము పర మైనను పత్వము వచ్చుచున్నను సూరి యట విభాష యనెను. దంతురు, దంపుదురు. అనువానితోపాటు దంచుదురు అనురూపమును గూడ సాధింపవలె నని యీసూత్రకర్త యభిప్రాయపడెనా? ఆ యభిప్రాయ మున్నచో నిట్టి దుదాహరించును గదా. బాలవ్యాకరణముననే విభాషాపదము నాశ్రయించి దంచుదురు అనురీతిప్రయోగములను గుర్తించుట కవకాశము లేకపోలేదు.

ఏది యే మైనను సూత్రకర్త చూపినలక్ష్యముల ననుసరించి నిప్రత్యయాదు లన ము త్తని యర్థము చేయుట దోషము గాదు. ముదితరస్థలములు గ్రహించుట కవకాశము లేకపోలేదు. ము త్తన్న దుక్కు (దంచుదురు) గ్రహింపఁబడనేరదు గాని నిప్రత్యయాదు లనుచో నాదిశబ్దముచే దుక్కును గ్రహించుటలో విరోధము కల్గనేరదు. అట్టియెడ ముద్దుక్కులు అనియో ముదాదు లనియో చెప్పుట లాఘవ మగును. అంతే కాక స్పపష్టతయును గల్గు. నిప్రత్యయాదు లన నేవి? బాల. ననుసరించి నిప్రత్యయము మొద లగునవి యనురీతిగా నర్థము చేసిన ఆనిజికి ముందే చెప్పిన కజి, నుజి, మిజి మున్నగునవి గ్రహింపఁబడుట యెట్లు? చింతామణిలో నిట్టిపత్వమునకు నిమిత్తము లగు ననుబంధాదులలో (అనుబంధ ప్రార్థనయో ర్ణా వ్యతిరేకాదికే చ చోః ప స్స్యాత్ అనుచో ప్రతిషేధవాచినాం నిః అని చెప్పఁబడినది. దాని ననుసరించి ప్రౌఢవ్యాకర్త నిప్రత్యయాదు లనియుండును.

ఇంచుక్చకారంబున కేని గానంబడదు అనుటయు సముచిత మని నిర్ణయింప రాకున్నది. ఏని అనుటవలన ఇంచుగాగమచకారమునకు వచ్చుట లేదు చుగాగమమున కెట్లును రాదు. అన్నస్ఫురణ మున్న' (449) దని సర్వ. పేర్కొన్నది. ఇంచుగితరములకు రాకపోవుట ప్రసిద్ధమే. కాని తప్పక రావలసిన ఇంచుక్

చకారమునకును రా దనురీతి యర్థ మవును. కు.పం. ఈయభిప్రాయముతోనే వ్యాఖ్యానించుట గమనింపవచ్చును. (140)

ఆచ్ఛికక్రియలప్రకియను బ్రధానముగా నిరూపింపనికారణమునఁ జింతామణి యందు 'అనుబంధప్రార్థనయోః' అనుమొద లగుసూత్ర మించుక్చకారమునకే పత్వము చెప్పిన దనుట స్పష్టము. ఇంచుక్చకారమునకు పత్వ మగుట యన్న చింతామణి చెప్పినస్థలమునందు సయితము పత్వము లే దనియు, సూరి చెప్పినయితరస్థలము లందు లేకపోవు టేమి వింత యనియుఁ జెప్పుట వ్యాకర్తయుద్దేశ మేమో.

కాని సూరిప్రణాళిక చింతామణికంటెను సమగ్ర మైయుండుటచేతను, 'ముత్తియేతరశబ్దంబులందు' ననురీతివిధానము కేవలము సూరిలక్షణమునే దృష్టియం దుంచుకొని చేయఁబడియుండుటచేతను, దదనుగుణముగా నిట సూరి లక్షణమును దృష్టియం దిడుకొని సూత్రించుటయే యుక్త మని తోఁచుచున్నది.

చిన్నయసూరి కఙి, నుఙి ఇత్యాదిగా పేర్కొన్నవానిని ప్రౌఢవ్యాకర్త అకప్రత్యయము, అన్‌ప్రత్యయము అని పేర్కొనెను. వి.వి. 'క్త్వార్థే తు వ్యతిరేకార్థే' అని వ్యతిరేకక్త్వార్థకప్రత్యయమును 'క' అనియే చెప్పినది. 'వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్' అనుచోటియాదిశబ్దముచేత తుమర్థభావలక్షణములలో అత్వము వచ్చు నని యహోబలుఁడు చెప్పెను. (ఆ'అ'కారమే ప్రత్యయ మని వఝలవా రనిరి.) కాఁగా 'అన్'ప్రత్యయము, 'అక' ప్రత్యయము అనుపద్ధతిలో నిట 'అని' ప్రత్యయ మని సూత్రకర్త పేర్కొనలే దెందుకో స్పష్టము గాదు. ఒకపద్ధతి ననుసరించినజాడ కానరాదు.

'కవిత్రయేతరప్రయోగంబులం గొన్నియెడల' ననుటచేతఁ గవిత్రయమువా రీయాదేశమును నిత్యముగనే చేసి రనియు నితరులు గొన్నియెడల మాత్రమే మాని రనియు సముచితముగాఁ జెప్పఁబడినది.

కానీ యీవిషయము సూత్రమునందే చెప్పవలెనా? లక్షణము చేయుటలోఁ గవిత్రయప్రయోగములు, నితరములు ననురీతిగా రెండు విభాగములను జూపుట యీలక్షణగ్రంథమున సార్వత్రికముగాఁ గానరాదు. రాపొం డనురూపము క్వాచిత్కముగ నైనను గవిత్రయప్రయోగములం దున్నదా? అయినను నాలక్షణము 'గవిత్రయేతరప్రయోగంబుల' ననలేదే.

ఇతఁ డిటఁ గవిత్రయేతరప్రయోగంబుల ననుదళము లేకుండఁ జెప్పినలక్షణము

లెల్లను గవిత్రయప్రయోగములందుఁ గల వని నిర్ణయింపరాదు గదా. అట్టియెడలఁ నిటఁ గవిత్రయప్రయోగములం దన నేల? చింతామణిలక్షణముపై గౌరవము వ్యక్తీకరించుటకా? ఈయంశమును వివరణమునందుఁ దెల్పుట యుచితముగా నుండును.

'కవిత్రయేతరప్రయోగంబులన్' అనుట యనవసరము. నిప్రత్యయాదు లనుచోఁ గూడ ము త్తనియో లేక దంచుదు రనురీతివానిని గూడ సంగ్రహించునట్లుగా ముదాదు లనియో చెప్పుట సముచితముగాను, స్పష్టముగాను నుండును. అట్లే 'యించుక్చకారంబున కేని' యనుటయు ననవసరమె.

చకారమున కని సామాన్యముగాఁ జెప్పుట యుక్తము. ఇంచుగాగమచకారము నకే కాదు, ధాతువున సహజముగా నున్నచకారమునకు సయిత మీపత్వాభావము గలదు. తోఁచినచోఁ జిలువకట్టు,...దోఁచ దసాధ్యంబు, విశుద్ధతర మైనవంశంబు దలఁచ నైతి (పాం.3.36) (బాలక.124). కావున నాగమచకారమునకే కాక ఖండబిందువుమీఁదిసిద్ధచకారమునకును పత్వాభావము కలదు. కాఁగా పకారంబు ముదాదిపరకత్వంబునం గొన్నియెడలఁ గానరా దనురీతిగాఁ జెప్పుట యుక్త మనవచ్చును? చకారభిన్నమున కిట్టియెడలఁ బాదేశమునకుఁ బ్రాప్తియు లేదు. ఇంక సూత్రమునందుఁ జెప్పినవిషయము వ్యాఖ్యానప్రాయముగా వివరణమునఁ దెల్పవచ్చును.

## శత్రర్థపరత్వము – పాదేశము

**17. పకారంబు కొన్నియెడల శత్రర్థపరకచువర్ణంబునకుం గానంబడియెడి .**

శత్రర్థక మైనచువర్ణము పర మగునపుడు సయితము చకారమునకు పకారము వచ్చు నని సూత్రకర్తయభిప్రాయము.

'చేరుపుచును' అనుచో చుగాగమునందును, 'గుర్తింపుచును' అనుచో నించుగాగమమునందును చకారమునకు పకార మైనందుల కిట లక్ష్యములు చూపఁబడినవి.

కు.పం. 'పకారంబు కొన్నియెడల శత్రర్థకచువర్ణకంబునకుం గానంబడియెడి' నని యీసూత్రమును జూపెను. దీనివలన శ్రతర్థకచువర్ణమునందే పత్వ మయి

'గర్జించుపు' ననురీతిగాఁ గావలసివచ్చును. అందుకే వ్యాఖ్యలో సూత్రమున శ్రతర్థకచువర్ణకంబునకు షష్ఠ్యంతమునకు శత్రర్థకచువర్ణము పర మైనపు దనునిమిత్తము నర్థముగాఁ గొనవలె' (145) నని పేర్కొనెను. 'శత్రర్థపరకచువర్ణంబునకు' ననునదియే సరి యైనపాఠము.

ఈసూత్రారంభమును గూర్చి పేర్కొనుచు కు.పం. 'బాలవ్యాకరణమున నాగమాన్యచకారంబులకు ముత్పరకంబులకే పవలు వచ్చు నని సూత్రిత మనెను. సుబో. దీని ననుసరించినది. (250) ప్రేరణేంచుక్పరకత్వమునను, దుగాగమ పరకత్వమునను నితరస్థలములందును పత్వము బాల.విధించుటను దత్త్వ. స్పష్టము చేసినది (353). మొత్తముమీఁద శత్రర్థచువర్ణపరకతయందు మాత్రము విధింప లేదు గనుక (ప్రాసగతములు నైనప్రయోగప్రమాణాధిక్యము ననుసరించి) నీవిధానము సార్థకమే.

చువర్ణకంబునకు పకారము జెప్పుట యుచితముగా లేదు. (సర్వ. 453) తత్త్వ. సూత్రమున చువర్ణమునకే విధింపఁబడినను జువర్ణమునందలిచకారమునకే యని యర్థము సరిచేసికొనవలయు నన్నది. (353) గర్జించవ్చు అనురీతిగా నుకారమునకు మాత్రమే పత్వ మయ్యెడుప్రమాద మీవిధానమువలనఁ గలుగు చున్నది. సర్వ. పువర్ణంబు చువర్ణంబునకు అని కాని, పకారంబు చకారంబున కని కాని, యనుట యోగ్యముగా నుండు (453) నన్నది. చువర్ణమునకు పువర్ణము విధించుటకంటె చకారమునకు పకారము విధించుటయే సముచితము.

'శత్రర్థపరకచువర్ణకంబునకు' నని సూత్రమున సామాన్యముగాఁ జెప్పఁబడినది. అయినను బాల. ననుసరించి ముదాదిపరకత్వమున నేచకారమునకు పకార మైనదో యాచకారముచే యిట గ్రహించి దానికి శత్రర్థకపరకతయందు పత్వము గల దని గుర్తింపఁదగును. పిలుచుచున్ – పిలుపుచున్ ఇత్యాదిగా నన్యచకారమునకు నీకార్యము లేదు గదా. తలఁపుచున్ అనురీతిగా ఖండబిందువుమీఁదిచకారమున కుండ నవు.

ఆగమచకారమునకుఁ గొన్నిచోట్ల పకార మగు నని ఘం.(215) ఇ ట్లీవ్యాఖ్యాన మాగమచకారమునకే పత్వ మగుటను బేర్కొనుట సరి గాదు. తలఁపుచున్ అనురీతిగా ఖండబిందువుమీఁదిసిద్ధచకారమునకును పత్వము రావచ్చును. 'కానంబడియెడి' ననుటచేఁ బ్రయోగానుసారముగా గ్రహింపవలెఁ గావున దానిచే నీయర్థము

సిద్ధించునవకాశము లేకపోలేదు. ఇఁక నట్లు 'చువర్ణంబునకుం గానంబడియెడి' ననుచో బిందుస్థానీయ మైన'ను'వర్ణము సముచ్చయార్థకముగా గుర్తించినచో బాలవ్యాకరణమునఁ జెప్పినట్లు ముదాదిపరకతయందే కాక చువర్ణకపరకతయందు సైతము గల దని యర్థ మవును గావున బాల. 4 చే పత్వ మెచ్చటి చకారమునకుఁ గలదో యద్దానికే యిటఁ గూడఁ గానవచ్చుచున్న దని యర్థ మవును. కావున నట్లు సమన్వయింపఁదగును.

పత్వము శత్రర్థచువర్ణపరకతయందె విధింపఁబడినది. కాని యితరస్థలము లందును నీయది కానవచ్చుచున్నది. నుతింపుచున్నాఁడు ఇత్యాదిగా వర్తమాన క్రియారూపములం దహోబలుఁడు పత్వమును జూపెను. వఝలవారు నిద్దానిని గ్రహించిరి. ఉగ్గడింపుచో (వ్యా.సం.స. 1612) (ఉ.రా. 6.138) అనుచో తద్ధర్మార్థక ధాతుజవిశేషణమునందును పత్వము గాననవుచున్నది. చరింపుట నీతియో (వరాహ. 3.125) తలంపుట భావ్యంబె (వరాహ. 10.35) ఒనర్పుదురు మహిమ (పాండు. 5.292) (ము.ల.కౌ.క్రియా. 37.38) (ఒనర్పుదురు అనుచో నెఱసున్న లేదు గదా) అనురీతిగా నితరస్థలములందును నీపత్వము గానవచ్చుచున్నది గనుక 'చువర్ణకాదులు పరంబు లగునపు' డనురీతిగాఁ బేర్కొనుట సమంజసము. ప్రయోగ ప్రసిద్ధి ననుసరించి శత్రర్థకచువర్ణము నుచ్చరించుట యుచితముగా నుండును.

## తివ్వన్ – తివన్

**20. తిగుచు ధాతువునన్నంతరూపములు తివ్వఁ దివ ననియు.**

తిగుచుధాతువుపైఁ దుమర్థభావలక్షణములందు నుఙి రాఁగా, నీయన్యచకార మునకు వకార మై, (బాల.క్రియా. 88.) 'తిగువ' నని యవును. తిరుగుచునట్లు దిగువన్ (మార్క. 3.32) అట్లే తిగువ ననురూపమే కాక తివ్వన్, తివన్ అనురూపములు సైతము గల వని ప్రస్తుతసూత్రము చెప్పుచున్నది. తిగువన్–తివువన్–తివ్వన్–తివన్ అనురీతిగా నీయవి యేర్పడియుండవచ్చును. అయినను తివువన్, తివ్వఁడు అనురీతిగాఁ గన్పటకుండుటంబట్టి ప్రౌఢ. ఇట్లు సూత్రించి యుండును.

'తివ్వన్' అనురూపమును మాత్రము పేర్కొన్నచో నక్కటాదిత్వముచే జడ్డ లోపించి

'తివన్' అనురూప మవును. కాని యట్టిప్రక్రియ నపేక్షింపకుండ లాఘవమునకై 'తివన్' అనుదానిఁ గూడ సూత్రకర్త సాధించె నని తత్త్వ. పేర్కొన్నది. (355).

'అనియు' ననుచోటిసముచ్చయార్థకముచే 'తిగువన్' అనురూపము ప్రసిద్ధ మవుట సంగ్రహింపఁబడినది. (సర్వ. 378)

అన్నంత మనుట సూత్రకర్త కలవాటు. కానీ యది పొరపాటు.

ఈసూత్రమే యనవసర మని ఘం. ప్రతిపాదించినది.

తివ్వు అనుధాతువే ప్రత్యేకముగాఁ గలదు. కాన నీవిధి యనావశ్యకము (217). దృగ్జాలంబుల్ గలయంగ విచ్చి విటమత్స్యవ్రాతముం దివ్వుచున్ (ఘం. 331)

తివ్వు అనుధాతువును శ.ర. చూపలేదు. కాని సూ.ని. చూపినది. తివుచు అనునర్థమునందు తివ్వు ధాతువు గల దని పైకుమారసంభవప్రయోగముచేఁ జూపినది. ఇతరప్రయోగము లున్నను నవి యెల్ల నుఙ్యంతములే యవుట నిర్ధారకములు గాఁజాలవు. కాఁగా నిట నిర్ణయమునకు కు.సం. ప్రయోగము మొకటే యాధారము. ఇటఁ దిగుచు ధాతువునర్థమే గ్రహింపవలె. దృగ్జాలములతో మత్స్యవ్రాతమును లాగికొనిపోవుట యనియే యర్థము. కావున తిగుచు ధాతువు నర్థము గలతివ్వుధాతువునుండియే యిది యేర్పడె నని చెప్పవచ్చును.

కానీ యీయొక్కప్రయోగమునుబట్టి నిర్ణయింపఁదగునా? వ్యస్తతలో ఆలు శబ్దమును స్త్రీమాత్రార్థములోఁ బ్రయోగించుట మొదలుగా నిందు విలక్షణత యెక్కువగా గనవచ్చును. తివుచు అనుధాతు వర్థాంతరమునఁ బ్రసిద్ధ మయ్యు నాకర్షించు అనువిధముగాఁ దిగుచుధాతువునర్థమునఁ గానరాదు. తివ్వుచున్నాఁడు, తివ్వఁడు అనురీతిప్రయోగములు లేవు. అందులకే యన్నంతతయందే తివ్వ అనురూపము నీసూత్రము పేర్కొనుచున్నది. కొప్పువట్టి తివ్వం బోవ నిత్యాదులలో ద్రిప్పఁబోవ ననురీతిగా నర్థము కుదురుపడును.

కానీ మోపెట్టను దివ్వను అనురీతిస్థలమునఁ ద్రిప్పు అనువిధ మైనయర్థము సమన్వితము గాదు. (నన్నయ మోపెట్ట దివియ (భార. ఆది. 7. 232) అని తివియు ధాతువునే ప్రయోగించెను.) తిగుచు ధాతువునకు నన్నయప్రయోగము మృగ్యము. కావున తివియు ధాతువునుండియే తివ్వ, దివ ననురూపములు నిరూపింపఁదగు నేమో.)

కావున నీనన్వయప్రయోగమునందలి 'తివ్వ' అనునది యప్రసిద్ధమును, నస లీయర్థమున నున్న దనుటయే యనుమానాస్పదము నైన తివ్వు ధాతువునుండి యేర్పడిన దని తలచుటకంటె 'తిగియు' లేదా 'తిగుచు' ధాతుసిద్ధముగా నూహించుట యుక్తము.

లాఘవాపేక్షతోనే తివ్వ, తివ ననురీతిగా సూత్రకర్త రూపములను నిర్దేశించి యుండును. కాని యంతకంటె వానికిఁ బ్రక్రియ చెప్పుట యుచిత మేమో. 'నుజి పరం బగుచోఁ దిగుచుధాతువు గువర్ణంబున కంతకు వకారం బేని, లోపం బేని కొన్నియెడల గానంబడియెడి' నని చెప్పుట యుచితముగా నుండును గదా.

## పాఱుధాత్వనుప్రయోగము - అర్థవిశేషము

**19. వ్యాపారోనుఖత్వంబున నన్నంతక్రియలకుఁ బాఱుధాతు వనుప్రయుక్తం బగు.**

ధాత్వర్థ మగువ్యాపారముయొక్క ఉన్ముఖత్వమునందు నుజ్యంత మగునద్దానిపై పాఱుధాతు వనుప్రయుక్త మగును. పండఁబాఱు = పండుటకు ఉన్ముఖ మగు (ఘం. 216).

ఇట కు.పం. ఒకవిశేష మిట్లు చెప్పినది. ఆయర్థము(వ్యాపారోన్ముఖత్వము)న నితరధాతువులు కొన్నియు ననుప్రయుక్తము లగు. ఉదా. చెప్పఁబోవు మొ. తవులఁ బోవు, పిరివీకుగ నున్నది మొద లగుతావుల 'అగు'. రానున్నది మొద లగుతావుల ఉండు (141).

చెప్పఁబోవువాఁ డాగిపోయె ననురీతిస్థలములలోఁ బోవుధాతువున కీరీతి యర్థ మున్న దనుట కవకాశము లేకపోలేదు. కాని పిరువీకుగ నున్నది యనుచో నగుధాతువు వ్యాపారోన్ముఖతార్థము నిచ్చుచున్న దనుట యుక్తమా? సూత్రకర్త చెప్పిన పాఱుధాతువే కాక యితరధాతువులు నీయర్థమునం దగుట కల దని యీవ్యాఖ్య చెప్పఁదలచినది. అట్టియెడల సూత్రకర్త పాఱుధాతు వెద్దాని కను ప్రయుక్తముగాఁ జెప్పెనో దానికే యితరధాతువులును జేసి యాయర్థము గలుగుట నిరూపింపవలెను. అనఁగా సూత్రము ననుసరించి యన్నంతక్రియపైనే పాఱుభిన్న ధాతువును జేయవలయును. పిరువీకుగా ననుచో నగుధాతువు? చేరిన 'పిరువీకు' అనునది నుజ్యంతము కాదు. పైఁగా వ్యాపారోన్ముఖత్వార్థమును లేదు. పిరువీకు

'గా నున్నది' యనుచోఁ గాఁబోవుచున్నది యని యర్థము. అట్టియెడల నగుధాతువు చేరి ఎండఁబాఱు అనురీతిగా వ్యాపారోన్ముఖత్వార్థము సిద్ధించుచున్నదా? అగు ధాతువు నుజ్యంతరూప మగు 'కాన్' అనుదానికి ఉండుధాతువు చేరఁగా 'కానున్నది' అగుట కున్ముఖ మైయున్నది. అనురీతిగాఁ గొంతవఱ కేని సమర్థింపవచ్చును. 'రానున్నది' అనుచోటువంటిదే 'కానున్నది'. ఈవ్యాకర్త యట నున్న 'ఉన్న' యనునది భావ్యర్థక మని తలఁచెను.

పండఁబాఱు, ఎండఁబాఱు అనుచో నే మర్థము. శ.ర.లో నీసూత్రకర్తయే 'పాఱు – ఇది కొన్ని క్రియలకు స్వార్థమందును, కొన్నిటి కించుక్ స్థానమునందును మఱి కొన్నిటి కారంభార్థమునందును అనుప్రయుక్త మగుచున్నది. విరియఁబాఱు, తెల్లవాఱు, పండఁబాఱు' అని చెప్పెను. ఆరంభార్థ మనుటచే పండుట కారంభ మైనది గాని యింకను బండలే దనియు, ఎండఁబాఱు అనఁగా నెండుట కారంభ మైనది గాని యింకను నెండలే దనియు నర్థ మగును. ఇటఁ జెప్పిన వ్యాపారోన్ముఖత్వార్థముకంటె నది కొంత విశేషముగాఁ గానవచ్చును. విరియఁ బాఱు (తెల్లవాఱు) అనుచోట పాఱుధాత్వర్థవిశేషమును సూత్రకర్త పేర్కొనలేదు. అటఁ గూడ నన్నంతములపైనే చేరినది. ఇట వ్యాపారోన్ముఖత్వముననే చెప్పెను. ఇందుఁ గొంత విరోధమును గానవచ్చుచున్నది.

కానీ తెలుఁగున నీనుజ్యంతములప్రయోగ మెంతయు విశేషముగాఁ గానవచ్చును. 'రాఁబోవుచున్నాఁడు' అనుచో వచ్చుటకు సిద్ధముగా నుండె నని యర్థము. రానున్నాఁడు, రాఁగలఁడు అనురీతిస్థలములలో భావ్యర్థముతోపాటు వ్యాపారోన్ముఖత్వమును గానవచ్చుట యథార్థమే. కావున కు.పం. అభిప్రాయము కేవలము తిరస్కరింపఁదగినది కాదు. 'రాలేఁడు' అనుచో వచ్చుట కశక్తుఁడు. ఇట్లే 'చదువలేక' మొద లగుస్థలములు. ఈరీతిగా నుజ్యంతములపయి నాయాధాతువులు చేరి యర్థవిశేష మిచ్చుట ప్రచురముగాఁ గానవచ్చుచున్నది. ఇట్టివానిని బాలవ్యాకర్త శబ్దపల్లవము లని యొకవర్గముగా నేర్పఱచెను. అందులోనే యీనుజ్యంతములపై ధాతువు లనుప్రయుక్తము లయి, విలక్షణర్థాభిధాయకము లగుట సంగ్రహింపవచ్చు నేమో. ఇట్టిదానిని సూరి శబ్దపల్లవములలో నుదాహరింపలే దని మాత్రము గమనింపవలయును. అయినను నిశితముగాఁ బరిశీలించి నిర్ణయింపఁదగును.

మొత్తముమీఁద నర్థవిశేషములం దెన్నో ధాతువులు నుజ్యంతములపైఁ జేరుట మాత్ర మంగీకరింపవలెను. నుజ్యంతముపై లడంత మగు'కలుగు'ధాతువు చేరిక వలననే భావ్యర్థము సిద్ధించుచున్నది. కావున వ్యాపారోన్ముఖతార్థము పాఱుధాత్వనుప్రయోగము అనునీయంశము సమగ్రముగా లేదు. అర్థవిశేషము లందు నుజ్యంతముపై నాయయిధాతువులయనుప్రయోగము గుర్తింపఁదగియున్నది.

## చేయుయోగము - ప్రేరణార్థము

**18. అన్నంతక్రియ చేయుయోగంబునం బ్రేరణార్థకం బగు.**

నుజ్యంత మైనక్రియ చేయుధాతువుతో యోగము కలిగియున్నపుడు ప్రేరణార్థమును దెలుపు నని యర్థము.

చొక్కు ధాతువు అన్నంతము కాఁగా, చొక్కన్. దీనిపై చేయుధాతువు చేరి, చొక్కఁజేయు. అనఁగాఁ జొక్కునట్లు చేయు=చొక్కించు అని యర్థము. 'చేయు యోగంబులన్' అని కు.పం. వ్యాఖ్యలో సూత్రమందలిలడాగమ మచ్చుపొరపాటు.

చేయుయోగంబున నని వర్ణించుటకంటెఁ జేయుయోగము విధించుటయే యుక్త మనిపించును. 'ణ్యర్థంబునఁ దుమర్థంబుతోఁ జేయుక్రియ వాడంబడు' నని సూరి చెప్పెను. తె.వ్యా.క్రియా.313లక్షణ మింకను నుచితము. కానఁ దదనుగుణముగాఁ బ్రేరణార్థమునఁ జేయుధాత్వనుప్రయోగమును ధాతువునకు నుజియును వచ్చుటను బేర్కొన్న నుచితముగా నుండెడిది. కొన్నియెడల ధాతువులకుం బ్రేరణార్థంబున చేయుధాతు వనుప్రయుక్తం బగు, నగుచో నుజి యగు' నని సూత్రింపఁదగును. అట్టిప్రక్రియయే యుచితము.

అట్లు చెప్పమిచేతనే 'వహింపఁజేసెనో' అనుచో అన్నంతక్రియమీఁద 'చేసెనో' యనునది పరము కాఁగా, వహింపఁజేసెనో అనుప్రేరణార్థక మయినది (సుగమ. 222) అని వ్యాఖ్యలు భావించుట కవకాశ మేర్పడినది. ఇటఁ జేయుధాతువే ప్రేరణార్థమునందుఁ జేరిన దని చెప్పుట యుక్తము.

## కాను ప్రయోగాదిశేషము

**30. అన్ప్రత్యయాంత మగునగుధాతువు కొన్నియెడలఁ బెక్కుచోట్ల కొక్కటియు నగు.**

అన్ప్రత్యయాంత మగునగుధాతువు అనఁగా 'కాను' అనునది విశేషములు పెక్కగుచో నొక్కదానికి మాత్రమే చేరుట కల దని యభిప్రాయము. 'నుజ్యంతం బగు నగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు, నుజికి విభాష నగు' నని బాల. దీనిని పేర్కొన్నది. చింతామణ్యాదు లీవిషయమును బేర్కొనియుండమింజేసి బాల.ను దృష్టియం దుంచుకొనియే యీలక్షణము చెప్పఁబడిన దని గుర్తింపవచ్చును.

'ధర్మజుఁడు తూర్పు, భీముఁడు దక్షిణంబు, నర్జునుండు పడమరఁ గవ లర్థి నుత్తరంబుగా' ననుచో 'కాను' అనునది చివరిదాని కొక్కదానికే యనుప్రయుక్త మయినది. 'ఒక్కటియును' అనుచోట సూత్రమందలిసముచ్చయార్థముచేఁ బక్షాంతరము గలదు. కావున నపుడు తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము అనువాని కన్నింటికిని 'కాను' అనుప్రయుక్తము గావచ్చును. నీకు నప్రియముగాఁ గౌరవరాజునకుం బ్రియంబునుం గా (కర్ణ. 2. 105) (వ్యా.సం.స. 1678)

ఇంక సూత్రమున నన్ప్రత్యయాంత మగునగుధాతు వనుట సరి కాదు. (ఘం. 226) కాన్ అనుదానితో అన్ ప్రత్యయ మేది? నుజ్యంతం బగునగు ధాతు వనుట లెస్స. కాఁగా నుజ్యంతము లయినధాతువులను బ్రౌఢ. అన్నంతక్రియలుగాఁ బేర్కొనెను. చేయన్ మున్నగునుజ్యంతములకు 'అన్' అనునదే ధాతువునకు చివర నుండుటచే అదియు సమంజసముగానే తోఁచు (సర్వ. 485) ననుట సరి కాదు. (ఘం. 219) చేయన్ అనుచో నున్న దని సమర్థించినను 'కాను' అనుదానిలోఁ జివర 'అన్' అనునది లేదే. ఇట సమంజస మనుట యసలే సరి కాదు. చేయన్ అనువానిని సైతము నుజ్యంతములుగానే వ్యవహరింపఁదగును.

అయి కా నవ్యయంబులు (32) అకాన్ (33) అనురీతిస్థలములందువలెనే యిట కాన్ అనియో కాను అనియో నిర్దేశించినను నిబ్బంది లేదు. పెక్కుచోట్ల కనఁ గాఁ గ్రియావిశేషణములు పె క్కగుచో నని యర్థము.

'ఒక్కటియు నగు' ననుట సరి కా దని కు.పం. 'పెక్కుచోట్ల కొక్కటి గలుగునపు డెల్లఁ గడపటనే గల్గుచుండు' (146) నని సూచించినది. సర్వ. (485) స్పష్టము చేసినది.

'కొన్నియెడల' అనుటచే నన్నిచోట్ల కాన్ అనునది ప్రయోగించుటయుఁ గలదు. (389) అని తత్త్వ. పేర్కొన్నది.

అన్నిచోట్ల నగుట యన్నది 'కొన్నియెడల' ననుదళముచేతనే సాధ్య మగునపుడు 'ఒక్కటియును' అనుచోటినుశబ్దమునకుఁ బ్రయోజన మేమి?

కావున నీస్థలమున నన్నిచోట్ల 'కాను' ప్రయుక్త మవుటను సాధించుటకుఁ 'గొన్నియెడల' ననుపద ముపయోగింపరాదు. ఇంక నుశబ్దముచేతనే యద్దాని సంగ్రహింపఁదగును.

'కొన్నియెడల' ననుటకుఁ బ్రయోజనాంతరము గుర్తింపఁదగును. పెక్కుచోట్ల కొక్కటి చాలుట యన్నది క్వాచిత్కము. అనఁగాఁ బెక్కు విశేషణము లున్న నన్నింటికిని 'కాను' వచ్చుటయే ప్రాయికము. కొన్నియెడల నొక్కచోటనె వచ్చుట కలదు. పెక్కుచోట్ల కొక్కచోటనే కన్పించుస్థలమునఁ గూడఁ గల్గుట నియతము గా దనియుఁ బ్రస్తుతలక్ష్యస్థలములవంటిచోటఁ గూడ నన్ని విశేషణములకు కాను ప్రయోగించుట యుక్తమే యనియుఁ జెప్పుటకే చార్థకనుశబ్దము ప్రయుక్త మైన దన్నమాట. కొన్నియెడల ననుదళ మక్కార్యము క్వాచిత్కతను సాధించునది కాఁగా నాక్వాచిత్క స్థలములందును ద్వైవిధ్యము గలుగుటను సాధించుటకు నుశబ్దము ప్రయుక్త మయినది.

'పెక్కుచోట్ల కొక్కటి' చాలు నని చెప్పిన విధు లీగ్రంథమునఁ బెక్కులు గలవు. అట్టియెడల నొక్కొక్కదాని కొక్కొక్కవిధానము చేయుటకంటె వాని నెల్ల సంగ్రహించి యొకేసూత్రముగాఁ జెప్పిన బావుండెడి దని తోఁచు. చేసి, పోలె ప్రభృతు లిట్టివి గలవు. కావునఁ జేసిప్రభృతులు పెక్కుచోట్లకు మాఱుగాఁ జివరిదాని కొక్కదానికిఁ జేరుట క్వాచిత్కముగాఁ గల దనునర్థమును సూత్రించి యిట్టివాని నెల్లఁ జేసి ప్రభృతులతోఁ జేర్చినచో లాఘవము గల్గుటయే కాక స్పష్టతకును లోప ముండదు. సూత్రకర్త యట నటఁ జెప్పినవే కాక వినఁగానఁబడును. అనురీతిగా బదుజ్యాదులు నిట్టిప్రయోగవిశేషము నందుట గానవచ్చును. (బా.సూ)

## కాను - హ్రస్వము

**23. ఒకానొకచో నన్నంత మగునగుధాతువుదీర్ఘంబునకు భావ్యర్థంబున నున్న పరం బగునపుడు హ్రస్వమును గానంబడియెడి.**

అన్నంత మగుధాతు వన 'కాను' అని యభిప్రాయము. దీనికి భవిష్యదర్థమునం 'దున్న' పర మైనపు డొకానొకచో హ్రస్వము గనఁబడుచున్న దని ప్రస్తుతలక్షణము భావము.

పిరువీకు గానున్నది. అనుచో 'కానున్నది' అనుదానికి కాఁగల దని భవిష్యదర్థము. 'కాను' అనుదానికి ఉన్న పర మైనది. కావున దీర్ఘమునకు హ్రస్వము రాఁగా 'క నున్నది'. అని యైనది. కావున నీయది ప్రస్తుతసూత్రమునకు లక్ష్యము.

కాను విశేషణముపై నను ప్రయుక్త మైన దైనచో 'దానికి హ్రస్వంబు విభాష నగు' ననులక్షణముచే బాల. ననుసరించియే హ్రస్వ మగును గావున నీవిధానమునకుఁ బ్రయోజనము లేదు. అందుకే సూత్రకర్త 'పిరువీకు కర్త' యని వివరించెను. క్రియావిశేషణము గాకపోవుటచే నిక్కడి 'కాను' అనునది యనుప్రయుక్త మయినది గామి (బాల.క్రియ.116) సూత్రముచే హ్రస్వము రాదు. కావున నిట్లు విధింపవలసినదే యని తాత్పర్యము. (ఘం.359)

ఇట సర్వ. ప్రస్తుతలక్షణమునుబట్టి నుజ్యంతమునకు ఉన్నశబ్ద మనుప్రయుక్త మై భావ్యర్థబోధక మగు నన్నవిషయము తేలుచున్నది. అగు+నుజి=కాన్+ఉన్న = కానున్న. ఇట్లే రాఁగల, చేయఁగల (489) అనురీతిగాఁ బేర్కొన్నది. ఇట ఉన్న శబ్ద మనుప్రయుక్త మైన దనునభిప్రాయము సరి కాదు. చేయనున్న, కానున్న అనునది సుబంతమా లేక తిజంతమా? కాన్ అనుదాని కనుప్రయుక్తము చేసినందువలనఁ దిజంతము గాదు. నుజ్యంతమా? అవ్యయము. దాని కనుప్రయుక్తము చేసిన ఉన్నపై విభక్తులు నిలువవు. రానున్నవాఁడు, కానున్నయది యని యగునా?

'పిరువీకు గానున్నది' యనఁగా నయ్యది యమహదర్థక మగువర్తమానకాలిక క్రియాపద మనవలెను. (అనుప్రయుక్త మైన 'ఉన్న+ది' కానున్న అనుదానిపైఁ దిజ్విభక్తులు చేరుటకు నయ్యది ధాతు వె ట్లయినది? ఉన్న యనునది ధాతువు కాదు. కాన్ అనునది కాదు. ఇట్లు కాక, కానున్న + అది=కానున్నది. అని

సమన్వయించుట నీయది ధాతుజవిశేషణము కావలె. పైఁగా రానున్నాఁడు, రానున్నాను అనియుఁ గ్రియాపదము లుండును గదా.

ఉన్న యనుప్రయుక్త మయిన దనుట యసంగతము. భవిష్యదర్థమున సూరి కలజీ వర్ణకమును, ఉన్న వర్ణకమును వర్తమానార్థమునందును విధించుచుండుటచే భవిష్యదర్థమున 'ఉన్న' యవుటను నీవ్యాఖ్య యిటఁ బేర్కొన్నది. కలజీ యనుబంధమే కాని వర్ణకము కాదు. వర్తమానార్థమున 'ఉన్న' అనుబంధమే. 'ఉన్న' వర్ణక మొకటి గలదు. తదంతము ధాతుజవిశేషణము. వ్యాఖ్య యద్దాని నుద్దేశించినట్లు గానరాదు.

అస లింతకును సూత్రకర్త 'ఉన్న పరం బగునపు' డన్నాఁడు. కాని యది యనుప్రయుక్త మయిన దని చెప్పలేదు. ఎ ట్లయిన నేర్పడ నిమ్ము. ఉన్న యనునది పరముగా నుండుట భావ్యర్థ ముండుట యనునది సంభవించుచో నీకార్యము 'కాన్'లో ప్రవర్తించు ననియే సూత్రతాత్పర్యము. ఇది ఉన్నను విధించునది కాదు.

రానున్నాఁడు, రానున్నది యిత్యాదిక్రియాపదముల ననుసరించియు, రానున్న వాఁడు, రానున్నయది యనురీతి విశేషణరూపముల ననుసరించియు, నిట నుండు ధాతువునే యనుప్రయుక్తము చేయుట సమంజసము. అయిన నుజ్యంతముపై ననుప్రయుక్తము చేయుటకంటె ధాతువునకే యనుప్రయుక్తము చేసి, యది పర మగునపుడు ముందటిధాతువునకు నుజీ యగు నని చెప్పుకొనుట యుచితము.

రానున్నాఁ డనుచో రాఁగలఁ డనుభవిష్యదర్థమునకంటెఁ గూడ వచ్చుటకు సిద్ధముగా నున్నాఁ డనునర్థమే ముందుగా స్ఫురించుచున్నది. కావుననే యర్థ విశేషములం దాయాధాతువుల ననుప్రయుక్తము చేయఁదగును.

మొత్తముపైఁ 'గానున్నది' యనురూప మె ట్లేర్పడినను ఉన్న పర మగుట, భావ్యర్థక మగుట, సంభవించినది. కావున కానునను హ్రస్వ మై, 'క నున్న' యని యైన దనుట స్పష్టము.

భావ్యర్థముననే కాక యితరస్థలములందును నిట్టిది కల దని సంజీవనీవ్యాఖ్య పేర్కొన్నది. (వ్యా.సం.స.1682) అది సరి కాదు. ము.ల.కౌ. క్రియ.56 వీనినే చూపినది. (చూ.బా.సూ).

## కాను లోపము

**22. క్రియావిధేయవిశేషణములమీఁదియగుధాతువున కన్నంతమునకు లోపంబు విభాష నగు.**

క్రియావిశేషణములకును విధేయవిశేషణములకును బై నున్ననుజ్యంత మగు నగుధాతువునకు లోపము విభాషగా వచ్చు నని సూత్రమునర్థము.

'పెల్లు దొరఁగు నెత్తురు' అనుచోఁ గ్రియావిశేషణముపైని, కప్ప మడుగుము అనుచో విధేయవిశేషణముపైని 'కాను' లోపించినది. విభాష యనుటచే లోపము రానిపక్షమున – 'పెల్లుగాఁ దొరఁగు నెత్తురు, కప్పముగా నడుగుము' అనురీతిగా నుండును.

ఇటఁ దత్త్వ. అగుధాతువునన్నంతరూపములు కన్, కాన్ అనునవి. ఇయ్యవి క్రియావిశేషణములమీఁదను విధేయవిశేషణములమీఁదను అనుప్రయుక్తము లగుచుండు (358) నన్నది. ఇందు కన్ అనుదానిని మొదటఁ జూపుట విశేషము. కు.పం. కాను, కాన్, కను, కన్, అనునది నుజ్యంతం బగునగుధాతువురూపము (143) లన్నది. సుబో. (254) సుగమ. (224) వ్యాఖ్యలు నిట్లే పేర్కొన్నవి. ఇది పొరపాటు. కాను అనునది నుజ్యంతం బగునగుధాతువురూపం బని సూరి యట స్పష్టముగాఁ బేర్కొనియుండఁగా 'కన్' అనుదానిని జేర్చు టెట్లు? దీనికి హ్రస్వ మెపుడు వచ్చును. క్రియా.116 కాను అనుప్రయుక్తము గాఁగాఁ బిదప హ్రస్వ మైనది. అంతే కాని హ్రస్వముతోడిరూపమే యనుప్రయుక్తము గాలేదు.

అనుప్రయుక్తము గాకున్న హ్రస్వము లేదు. కన్ అనునది కాన్ అనుదాని రూపాంతరముగా వేఱుగాఁ బ్రసిద్ధ మయియున్నపుడు 'దానికి హ్రస్వంబు విభాష నగు' అనురీతిగా హ్రస్వమును విధింప నేల? కాన్, కన్ అనునవి రెండును నుజ్యంత మగునగుధాతువురూపములే. కావున కాన్ అనునది యనుప్రయుక్త మైన లెస్సగా ననియు, కన్ అనునదే యనుప్రయుక్త మగుటను విధించిన బాల.క్రియా.115 సూత్రముచేతనే సిద్ధించుచున్నది గదా. హ్రస్వమును జెప్పు 116 సూత్రము బాల.లోనే వ్యర్థ మగుచుండఁగా 'పిరువీకు గనున్నది' యనుచో హ్రస్వము చెప్పిన ప్రౌఢ. లక్షణమును వ్యర్థమే కదా. ఈవ్యాఖ్య లేవియును నాసూత్రము (ప్రౌఢ.క్రియా.23) వ్యర్థ మని పేర్కొనలేదు. కాఁగా కన్, కాన్ లు పర్యాయములుగా పృథక్ప్రసిద్ధములు

గావు. అవి రెండును బాల.క్రియా.115 సూత్రముచే ననుప్రయుక్త మవు ననుట పొరపాటు.

కాఁగాఁ బ్రస్తుతసూత్రము కాన్, కన్ అనురెంటికి లోపము చెప్పుచున్న దనుటయు సరి కాదు. ఘం. కానుశబ్దమునకును దీనిరూపాంతర మగు కనుశబ్దమునకు (బా.క్రియా.115.116) లోపము విభాష నగు (218) నన్నది. కానుకు లోపము చెప్పినఁ జాలదా? కనునకుఁ గూడ లోపము చెప్ప నేల? సూత్రకర్త యదియు నుద్దేశించె ననుట కాధారమును లేదు. కాఁగా నగుధాతువు నన్నంతరూప మన 'కాను'. దాని కీసూత్రము విభాషను లోపము చెప్పుచున్నది. పెల్లు+కాను, అని కాఁగా దానికి హ్రస్వము చేసి, పెల్లు+కను అని చేసి, యాపిదపఁ బ్రస్తుతసూత్రముచే లోపింపఁజేయుటలోఁ బ్రయోజనము లేదు. ప్రక్రియాగౌరవ మేల? పెల్లుగఁ దొరఁగు, కప్పుముగ నడుగు మనురీతిని సూత్రకర్త హ్రస్వాంతరూపములను జూపుటచే నద్దానికిని లోపము వచ్చు నని యీవ్యాఖ్యలు భావించె నేమో. అది యనవసరము. సూత్రకర్త పెల్లుగా ననురీతిగా దీర్ఘాంతమునే చూపిన ననుమానము రాకుండెడి దేమో. (అయినను హ్రస్వముతోఁ జూపుట దోషము గాదు.)

సర్వ. కాను అనుదానికే లోప మవుటను బేర్కొనెను. (486) కాని ప్రక్రియను జూపునపుడు పెల్లు అనుదానిపై కాను అనుప్రయుక్తము చేసి పరుషము సరళము కాఁగా పెల్లుగాను అని యగును. ప్రస్తుతసూత్రముచేత కాను లోపింపఁగా పెల్లు అనియే యుండు నని (486) పేర్కొన్నది. ముందు సరళము చేసి, పిదప కాను లోపించు నన నేల? పెల్లు+కాను అని కాఁగా 'కాను' లోపించి పెల్లు అని యవును విభాష గావున లోపము రానిచో కానులో కకారమునకు గకారాదేశ మయి, పెల్లుగా నని యుండు నని ప్రక్రియ చూపుట యుక్తము. ఇట గాదేశము బాల.క్రియ.115 సూత్రముచేత కాక గసడదవాదేశమువల్లఁ గలిగిన దని గుర్తింపఁ దగును.

సూత్రమునఁ గ్రియావిశేషణములతోపాటు విధేయవిశేషణములమీఁద 'కాను'కు లోపము చెప్పఁబడినది. విధేయవిశేషణములపైని 'కాను' ఎక్కడిది యని యనుమానము.

దీనిం గూర్చి కు.పం. 'విధేయవిశేషణంబులకును నయ్యది యనుప్రయుక్త మగు నని బాల.లోఁ జెప్పకున్నను అగు' (143) ననెను. ఇందుకుఁ బ్రమాణము

చూపలేదు. ఎట్లు గ్రహింపవచ్చును? తత్త్వ. 'ఇయ్యవి (కన్, కాన్) క్రియా విశేషణములమీఁదను విధేయవిశేషణములమీఁదను అనుప్రయుక్తము లగుచుండు' (357) నన్నది. కాని దానికిని బ్రమాణము చూపలేదు. ఇంక నాపైని బాలవ్యాకరణ మునఁ గ్రియావిశేషణములమీఁద మాత్రమే విధింపఁబడినను విధేయవిశేషణ ములును గ్రియలోనికే యన్వయించును గావున నవియుఁ గ్రియావిశేషణములే యగుటంజేసి వానికిని కాన్ వచ్చు నని (358) పేర్కొన్నది. విధేయవిశేషణములును గ్రియావిశేషణములే యయి, 'కాను'ను బొందుచున్నప్పటికిని నీసూత్రమున విధేయ విశేషణములపృథక్పరిగణనము వ్యర్థమే యగును. కానీ యీవ్యాఖ్యయే విధేయ విశేషణములు క్రియలోనికి గర్తలుగనో కర్మలుగనో యన్వయించునపు డట్లు అన్వయింపఁజేయుక్రియ యగుధాతువే యవుట తఱచు. అట్టి 'కాను'కే ఈసూత్రము లోపము చెప్పుచున్నది. బాలవ్యాకరణముచే విహిత మగుచున్న దని తలంపరా (359) దని పేర్కొన్నది. ఇది పూర్వాభిప్రాయమునకు విరుద్ధము. బాల.చే ననుప్రయుక్త మగు నని యొకసారి, యట్లు భావింపఁదగ దని యొకసారి, పేర్కొనుటలో నిశ్చితాభిప్రాయము గానరాదు. కాని చివరిసారిగాఁ జెప్పిన దనుప్రయుక్తము గా దని. కావున నిదియే యావ్యాఖ్యసిద్ధాంత మనుకొందము.

అట్టియెడల 'కప్పము' అనుదానికి 'అడుగుము' అనుక్రియలోనికి 'కాన్' అనుపదము ద్వారాన నన్వయము కలుగుచున్నది. అనఁగా నీయది వాక్యమందలి యితరపదములవలె స్వతంత్ర మగుప్రత్యేకపదమే కాని యనుప్రయుక్త మవునది కాదు. అట్టియెడల నద్దానికి లోపము చెప్పుట యేల యనునంశము నీవ్యాఖ్య పరామర్శింపలేదు. ఇది ప్రత్యేక మగుపద మయియున్నపుడు ప్రయోగింపఁబడని సమయమున నధ్యాహార్య మని చెప్పవలె. అధ్యాహారము చేయకున్నను నర్థమునకు భంగము లే దని భావించినపుడస లద్దానిం గూర్చి ప్రస్తావింపవలసినయవసరమే లేదు. ఇ ట్లిది యనుప్రయుక్తము గా దన్నను లోపము చెప్పుట యనవసరమే యవుచున్నది.

విధేయవిశేషణమును గ్రియలోని కన్వయింపఁజేయుటకు 'కాన్' తఱచుగ ప్రయోగింపఁబడు నని యిటఁ దత్త్వ. పేర్కొన్నది.(359) ఇంతకు ముందు (358) నిత్య మగుటచే కాను రానిస్థలములు సాధించుటకు సూత్ర మవసర మైన దన్నది. తఱచుగాఁ గల దనుటచే నరుదుగా లేకుండుట కలదు. అయ్యది వాక్య

ప్రయోగమందలివిశేషమే. అట్టియెడల లోపమును జెప్ప నేల? స్వతంత్ర మగుపద మైనచో నిత్యముగాఁ బ్రయోగింపవలె ననుశాస్త్రము లేమి లోపవిధాన మనవసరము.

ఈవ్యాఖ్య విధేయవిశేషణములపై లోపము సమర్థింపఁజూచినను సరిగా సమన్వయింపఁబడ లే దని గుర్తింపవచ్చు.

సర్వ. 'నుజికి విభాష నగు' అని విభాషను దెలుపుటచేత నుజ్యంతములకే కాక యితరములకును గొన్నింటికి కావచ్చు నన్న స్ఫురణము కలుగుచున్న (488) దన్నది. స్పష్టముగాఁ జెప్పకున్నను నితరము లనఁగా విధేయవిశేషణములమీఁ దను వచ్చు కానునకు విభాషగా లోప మగు నని సూత్రార్థ (486) మని విధేయ విశేషణములపై వచ్చుటను బేర్కొనియుండవచ్చును. తత్త్వ.వలె నిది క్రియతో నన్వయించుటచే క్రియావిశేషణ మనియు నీవ్యాఖ్య పేర్కొన్నది.

కాని విభాషాపదముచే బాల.వలననే యితరములకు వచ్చు ననుటయు సరి గాదు. విభాషను వ్యవస్థీకరించినసందర్భములలో నన్యకార్యము సంస్కృత వ్యాకరణమునందును గానవచ్చుట లేదు. ఒకవేళ నితరములకు వచ్చు నన్నను నట నిత్యము గాదు. ఆయితరములు విధేయవిశేషణములే యైనయెడల వానికి నిత్యము గాదు గావున లోపము చెప్ప నక్కఱ లేదు.

ఘం. బాలవ్యాకరణమున 'కాను' క్రియావిశేషణములకు నిత్యముగా విధింపఁ బడినది. దాని కిట లోపము విభాషగ విధింపఁబడిన (219) దని చెప్పియు నంతకు ముందు విధేయవిశేషణములపైని గూడ 'కాను' చూపినది. అది యె ట్లయినదో వివరింపలేదు. అదియుఁ గ్రియావిశేషణమే యై, కాను పొందిన దని తలఁచినదా?

విధేయవిశేషణము క్రియలోని కన్వయించినమాత్రముననఁ గ్రియావిశేషణ మనుట యుక్తము గాదు. లెస్సగాఁ బలికె ననుచోఁ బలుకుట యనుక్రియయందలి విశేషణము లెస్సదనము. క్రియయందలివిశేషమును దెల్పుటచే నయ్యది క్రియా విశేషణ మయినది. కప్పముగా నడుగు మనుచో కప్పము అనునది యడుగుట యనుక్రియయందలివిశేషమును దెల్పుట లేదు. ఇది 'లవణము'నకు విశేషణము కాని యడుగుటకుఁ గాదు. దీనిని గ్రియావిశేషణ మనుట యెట్లు? కావున విధేయ విశేషణములను గ్రియావిశేషణములుగా సమన్వయించుట సరి కాదు. అందులకే

కావచ్చును తత్త్వ. క్రియతో నన్వయించుటంబట్టి క్రియావిశేషణ మని చెప్పియును బిదప నట్టిసమన్వయము నుపసంహరించుకొన్నది.

సర్వ. (ఘం.ను) విధేయవిశేషణములను గ్రియావిశేషణములు చేసి, కాను అనుప్రయుక్తముగాఁ జేసియు విధేయవిశేషణములపై లోపమును బ్రత్యేకముగా జెప్పుట యనవసర మని నిర్ణయింపలేదు. కాను చేరుటకుఁ గ్రియావిశేషణము లైనయీవిధేయవిశేషణములు 'కాను' లోపించుసందర్భమునఁ గ్రియావిశేషణములు కాకపోవు గదా. అట్టియెడఁ గ్రియావిశేషణములపైని మాత్రమే లోపము చెప్పినను విధేయవిశేషణములపయి సిద్ధించుచుండఁగా, మఱల విధేయవిశేషణములను బ్రత్యేకముగా సూత్రమునఁ బేర్కొన నేల?

విధేయవిశేషణములు క్రియావిశేషణములలోనే యంతర్భూత మగు నని సూరి తలంచినట్లు (వ్యా.సం.స.1679) సంజీవనీవ్యాఖ్య యూహించినది. అట్టియెడ విధేయవిశేషణదళ మీసూత్రమున వ్యర్థ మని యావ్యాఖ్యయుఁ దలంపలేదు. కాని బా.ఉ.లోఁ గ్రియావిశేషణములతోపాటు విధేయవిశేషణములమీఁదఁ గూడఁ బ్రత్యేకముగా 'కాను'ను వఝలవారు పేర్కొనిరి (బా.ఉ.క్రియా.116). అయినను వ్యా.సం.స.లోవలె నుద్ద్యోతముునను గ్రియావిశేషణములపైని విధేయవిశేషణముల పైని 'కాను' వాక్యమున నన్వితమె యగు నని పేర్కొనిరి. (427) విధేయవిశేషణ ములపైని కాన్ అన్వయింపఁబడు ననియు, నది యనుప్రయుక్తము గా దనియుఁ దలఁచునపుడు సూరి విధేయవిశేషణములను గూడ క్రియావిశేషణముగాఁ దలఁచి యనుప్రయుక్తము చేసె నని యూహింప నేలకో యర్థము గాదు. (బా.సూ)

అసలు సూత్రకర్తయభిప్రాయ మేమి? విధేయవిశేషణములపైని ననుప్రయుక్త మగు నని తలఁచెనా, లేక వాక్యమునందలియితరపదములవలె స్వతంత్రముగా నన్వయించుప్రత్యేకపద మని తలఁచెనా? అనఁగా నీతఁ డనుప్రయుక్త మనియే తలఁచె నని తోఁచుచున్నది. ఏల యన లోపము లేనిపక్షమునందలిరూపములను బేర్కొనుచు 'పెల్లుగఁ దొరఁగుకప్పముగ నడుగు' మని చూపెను. పెల్లుగ ననుదాని కనుగుణముగాఁ గప్పముగ ననుచోటిది సయితము ననుప్రయుక్త మయిన దనియే తలఁచె ననవలయును. లేనిచో నిట హ్రస్వము వచ్చుట యెట్లు? అనుప్రయుక్తము కాని 'కాన్' అనుదానికి భావ్యర్థమున నున్న పర మగునపుడు గదా యీతడు హ్రస్వము విధించెను. కప్పముగ నడుగుము అనుచో నట్టిస్థితిలేమింజేసి హ్రస్వము

రాదు. అనుప్రయుక్త మయినను, గాకున్నను కానునకు హ్రస్వము వచ్చు నని యెంచినచో భావ్యర్థమున నున్న పర మగునపుడు హ్రస్వము విధించుట వ్యర్థమే. కాఁగా పెల్లుగ ననుచోట నెట్లు హ్రస్వ మయినదో కప్పముగ ననుచోఁ గూడ నట్లే హ్రస్వ మయిన దని యెంచియుండవలె. అనఁగా విధేయవిశేషణముపైని గూడ కాను అనుప్రయుక్త మయిన దనియే సూత్రకర్త తలఁచినాఁ డనవలె. ఇంక నిది యె ట్లయిన దన్నది ప్రశ్నము. క్రియావిశేషణంబుల కను బాల.లక్షణముచేతనే యనుప్రయుక్త మయిన దని తలచినచో అనఁగా నిట విధేయవిశేషణము గూడ గ్రియావిశేషణమె యైన దని తలచినచో సూత్రమున విధేయవిశేషణములకు పృథగ్గ్రహణము వ్యర్థము.

కాఁగా విధేయవిశేషణములకు బాల.చే కాను అనుప్రయుక్తము గానపుడు లోప మెట్లు? అట్టియెడల నీవిధానసామర్థ్యముచేతనే క్రియావిశేషణములపైనివలె, విధేయవిశేషణములపైని కూడ కాను అనుప్రయుక్త మగు ననియు, దానికి లోపము విభాషగా వచ్చు ననియు సూచించుట సూత్రకర్తయభిప్రాయ మేమో యని యను మానింపవచ్చును. అట్టియెడల విధేయవిశేషణములపైని విభాషగా విధించుటయే యుక్త మనుట పొరపాటు కాదు. కానీ విధేయవిశేషణములకు విభాషగా విధించుటయు, దానికి మఱల హ్రస్వము చేయుటయుఁ, గ్రియావిశేషణములపైని లోపము చెప్పుటయు నేల గౌరవ మని యిట్టిమార్గమును సూత్రకర్త యనుసరించి యుండవచ్చును.

ఇట కాను అనునది యర్థవంత మయి, విధేయవిశేషణమును గ్రియలోని కన్వయింపఁజేయుప్రత్యేకపద మనియే యెంచిన నీతఁ డిట్లు చెప్పెడివాఁడు కాదు. అట్టిప్రత్యేకపదమే యై క్రియాన్వయమును గల్గించున దైనచో నయ్యది లేనపుడు క్రియతో నన్వయించుటలో బాధ యుండవలెను. కప్ప మడుగు మిత్యాదులలో నట్టియన్వయబాధ యున్నదా. ఉన్న నధ్యాహార్య మనఁదగును. కప్ప మగునట్లుగా నడుగు మనరీతిగా కానునకు నర్థమును స్వీకరించుటయందే కొంత యసహజత్వము స్పష్టము. మంత్రులఁగా నొరించితె యనుచో కాను అనునది ప్రత్యేకముగా నన్వయించుట యెట్లు? మంత్రులను అగునట్లుగా అన్న నర్థము సరిపడునా? మంత్రు లగునట్లుగా నని కదా యన్వయింపఁబడునది. అపుడు భావార్థకాదియోగమునఁ బ్రథమ గదా రావలసినది. 'మంత్రులను జేసితి' ననునది (కర్మగా) యన్వయించునట్లు

'మంత్రులను గాను జేసితి' నని ణిజ్యంతక్రియార్థము గూర్చిన నన్వయింపదు. అట్టియెడల నిటఁ జేరిన 'కాను' 'మంత్రులను' అనుదానిపై దానియర్థమునందే యనఁగా ణిజ్యంతం బగునగుధాతువునర్థము లేకుండఁగానే చేరిన దనవలె. అందులకే యిది యనుప్రయుక్త మని చెప్పవలెను.

కాఁగా నేతద్విధానసామర్థ్యముచేతనే విధేయవిశేషణములపైని గూడ కాను అనుప్రయుక్త మగు ననుట లెస్స.

క్రియావిశేషణములపైని సూరి నిత్యముగా కాను అనుప్రయోగమును జెప్పఁగా నీతఁడు లోపము విభాషగాఁ జెప్పెను.

ణిజ్యంతములకు సూరియే విభాషగాఁ జెప్పుటచే నట లోపప్రసంగ మనవసరము. కాఁగా ణిజ్యంతము లగుక్రియావిశేషణములపై నీసూత్రము లోపము చెప్పునదిగాఁ దలఁప నక్కఱ లేదు. అట్టిణిజ్యంతముల నిట నుదాహరింప కుండుటనుబట్టి మాత్రమే య ట్లర్థము చేసికొనఁదగును. సూత్రమం దాధారము లే దని భావము.

క్రియావిశేషణములపైఁ గూడ నీవిధాన మనవసర మని సర్వ. తలఁచినది అనుప్రయుక్త మగుచుండు ననిన కానిచోట్లు కూడఁ గొలఁదిగా నుండు ననియు స్పష్ట మగుచున్నది. (487) అగు అను సూరి ప్రయోగించుపదమున కీవ్యాఖ్య విశేషార్థము నూహించుటచే దీని కీయర్థము లభించినది. కాని సూరిమతమున నగు నన్న నిత్యమే. కావున లోపవిధానము సార్థకము గాఁగా నీలక్షణము బాల.కు. సవరణపూరణాత్మక మైనదిగా గుర్తింపఁదగును.

బాల.సిద్ధార్థమును జెప్పుటచే నీయది బాల.కు. వివరణ మని సర్వ. భావించినది. అది సరి కాదు. పోనీ. 'అగు' ననుదానిచే సాధారణముగ నగు ననియుఁ గొన్నియెడలఁ గా దనియుఁ జెప్పినను సూత్రకర్త కొన్నియెడల లోప మనుట లేదు గదా. లోపము 'విభాష నగు' నని చెప్పుచున్నాఁడు. సూరి ణిజికి విభాషగాఁ జెప్పఁగా ణిజ్యంతేతరములకును విభాష యనుచున్న యీలక్షణ మద్దానికి వివరణ మగుట యెట్లు?

కానీ సూత్రకర్త విభాష యనుట సమంజసముగా లేదు. లెస్సగా నున్నది లెస్స యున్నది. అనురీతిగా నెల్లయెడల ద్వైరూప్య ముండఁగా చల్లగా వీచెను అనుచో

గాలి చల్ల వీచెను అనురీతి వ్యవహార మున్నదా? విభాషాపదమునకు వ్యవస్థ చేసికొని, కొన్నియెడల వికల్ప మని యర్థము చేసికొనుట కవకాశము లేకపోలేదు. కానీ 'లోపంబు చూపట్టెడి' నన్నచో స్పష్టముగ నుండెడిది గద. ప్రయోగానుసారముగా గ్రహింపవలసినయవసరమును స్పష్ట మయ్యెడిది.

అసలు లోపము చెప్పుటయే యనవసర మని తోఁచుచున్నది. ముందుగా నివ్వానికి 'కాను' ననుప్రయుక్తము చేయుటయు, దానికి లోపమును జేయుటయు ననవసర మైనప్రక్రియయే. దానికంటె 'కాను' అనుప్రయోగము గాకుండుటను పేర్కొనుటయే లాఘవము.

అగు ధాతువు నన్నంత మనుటకంటె నుజ్యంత మగునగుధాతు వనుట లెస్స గావున 'నుజ్యంతం బగునగుధాతువు క్రియావిధేయవిశేషణంబులపయిం గొండొకచో గానంబడు' నని చెప్పుట సముచితముగా నుండు ననిపించుచున్నది. దీనివలన నుజ్యంతములపైఁ గూడ లోప మగు నేమో యనుసందేహమున కవకాశ ముండదు. విధేయవిశేషణములపై జ్ఞాపకసిద్ధముగా 'కాను' చేరుటయు లోపించుటయు నుండదు. ఇంకఁ గానఁబడ దనువిధాసామర్థ్యము ననుసరించి కానంబడుట సాధింపఁబడును. క్రియావిశేషణసాహచర్యముచే విధేయవిశేషణములపైని గూడ హ్రస్వము సాధించికొనవలసియున్నది. క్రియావిశేషణములపైని గూడఁ జేసి లోపింపఁజేయవలసినయనవసరప్రక్రియాగౌరవ ముండదు. కావున లోపమును గాక, కానరాకుండుటను జెప్పుటయే యుత్తమము.

## శబ్దపల్లవములు - పూర్వాయవలోపము

**24. శబ్దపల్లవక్రియలు కొన్ని ద్విరుక్తంబు లగుచో నుత్తరపదంబు పూర్వావయవంబునకు లోపంబు విభాష నగు.**

శబ్దపల్లవములు ద్విరుక్తము లయినపుడు రెండవదానియందలిమొదటి యవయవమునకు లోపము విభాషగా వచ్చును. ధాత్వాదులకు ధాతువు లను ప్రయుక్తము లయినవి శబ్దపల్లవములు. కావున శబ్దపల్లవములలో ధాత్వాదులు ధాతువులు ననువిధముగా రెండవయవము లుండును. అందుఁ బూర్వావయవము విభాషను లోపించును.

తూcటాడి+తూcటాది = తూcటాడియాడి మొద లగునవి లక్ష్యములు.

'శబ్దపల్లవక్రియలు కొన్ని' యనుటచే నీవిధి సార్వత్రికము గాదు. కూరుచుండి యుండి, నిలుచుండియుండి యనురీతివి లేవు గదా.

ఈయంశము విశేష మయి గ్రాహ్య మైయున్నది.

కానీ సూత్రరచనము సమర్థముగా లేదు.

ఉత్తరపద ననుదానికి సూ.ని. తర్వాతిమాట, సమాసమందుc గడపటియవ యవ మగుపద మని యర్థములు చూపినది. కాని శాస్త్రమునందు మాత్ర ముత్తర పద మనునది సమాసచరమావయవ మనునర్థమందే రూఢ మయియున్నది. 'యుష్మదాస్మదాత్మర్థకంబుల కుత్తరపదంబు పరం బగునపుడు' మున్నగులక్షణము లిట్టివే కద. అందులకే ఘం. ఉత్తరపద మనునది యిటc బారిభాషికపదముగా నుద్దిష్టము కా (220) దని సమర్థించినది. ఇట్టిదాని కవకాశము లేకుండుట యుక్తము.

సూత్రమందు దైర్ఘ్యమును ననవసరముగా నేర్పడిన దని తోcచుచున్నది.

'ఆమ్రేడితం బగుశబ్దపల్లవంబు పూర్వావయవంబునకుం గొన్నియెడల లోపంబు విభాష నగు' ననుట యుక్త మనిపించుచున్నది.

ఇట లక్ష్యములం దెల్ల క్త్వార్థకములే యుండుట గమనింపcదగును. ఆమ్రేడితం బగు క్త్వార్థకాంత శబ్దపల్లవంబు పూర్వావయవము లోపము చెప్పcదగునా? ఇతరస్థలములం దీకార్యము మృగ్యము. ఇంకను బరిశీలింపcదగును.

**25. శబ్దపల్లవక్రియలును ద్వ్యవయవక్రియలును సమాప్తంబు లయి పునర్ గృహీతంబు లగుచోc దత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు.**

శబ్దపల్లవములు ప్రసిద్ధములే. ద్వ్యవయవక్రియ లనcగా కు.పం. 'ధాతువులు రెండు స్వార్థత్యాగపూర్వకముగ నేకక్రియగc గూడు నేని యట్టిక్రియ ద్వ్యవయవ క్రియ' (144) యన్నది. ఈయర్థమునే యితరవ్యాఖ్యలు గ్రహించినవి. (తత్త్వ. 361) (సుబో. 257) (సర్వ. 494)

చనుదెమ్ము. తే ననువుగూడనిపక్షమునందు.

చననిచ్చు ఇచ్చి యే నని వెస నార్చు. అని సూత్రకర్త రెండే లక్ష్యములు

ప్రదర్శించెను. లక్షణము ననుసరించి క్రమముగా 'చనుదెంచు' అనునది శబ్దపల్లవమునకును, 'చననిచ్చు' అనునది ద్వ్యవయవక్రియకును లక్ష్యము లగుచున్నవి.

సర్వ. ఇవి రెండును ద్వ్యవయవక్రియలే యన్నది. (494) ఘుం. కూడ చనుదెంచు శబ్దపల్లవము గా దన్నది. (222) చనుదెంచు అనునది శబ్దపల్లవము కా దనుటకు నావ్యాఖ్య చూపినకారణ మొక్కటే. బాలవ్యాకర్త దీనిని శబ్దపల్లవములలోఁ జూపక వేఱుగా సాధించుటయే. ఇట నీవ్యాఖ్య వి.వి. ఘటకక్రియలు, శబ్దపల్లవములు ననురీతి విభాగించుటను బేర్కొని యాయంశము సూరిప్రభృతులు గ్రహింపలే దన్నది. (బహుశః వ్యా.సం.స. చిన్నయకుఁ ముందు రచింపఁబడకుండుట కారణము గావచ్చును.) అది సరి గాదు. వానిని జక్కగా గ్రహించియే ద్రుతోపజీవులవలె ఘటకక్రియలను సూరి పరిహరించెను. (చూ.బా.సూ) చనుదెమ్ము శబ్దపల్లవము కా దనుటకు దానిని వేఱుగా సాధించుట యన్నది కారణము గాఁ జాలదు. శబ్దపల్లవమునకు సూరి 'ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తము లగుట, విలక్షణార్థభిధాయకత్వము ననురెండులక్షణములు చెప్పెను. చనుదెంచు అనుచో నీరెండులక్షణములును గలవు. అట్టియెడల నియ్యది శబ్దపల్లవ మేల గాదు. ఆసూత్రముకడ నుదాహరించినవి తప్ప నింక నెచ్చటఁ జూపినను నయ్యవి శబ్దపల్లవములు గానేర వని నియమ మేమి? శబ్దపల్లవములలో ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తము లగుట ప్రధానలక్షణము. కాని యట ననుప్రయుక్త మగుధాతువులు వీనివీనింట నివి యని నియమింప రాక, పెక్కుభేదములతో నుండుటంజేసి వానియందలివికారాదులకు లక్షణము చేయక పోవచ్చును. కాని తెంచు ధాత్వనుప్రయోగసందర్భమున నాలక్షణము కొన్నింటిలో సమానముగాఁ గానవచ్చుటంజేసి లక్షణముచే స్పష్టము చేయుట కవకాశము గలదు గావున వానిని స్పష్టము చేసియుండును. శబ్దపల్లవములలో వర్ణవికారము లేవియు నిరూపింపలేదు గదా యని నిరూపించిన 'భయపడు' ఇత్యాదులును శబ్దపల్లవములు గా వనవచ్చునా? కావున 'చనుదెంచు' శబ్దపల్లవమే. ప్రౌఢవ్యాకర్త బాల. కనుగుణముగనే దీనిని శబ్దపల్లవ మని భావించెను. అధర్వణవిభాగమును విడిచి శబ్దపల్లవములను సూరి కనుగుణముగా గ్రహించినప్రౌఢవ్యాకర్తయభిప్రాయము సముచితముగా నున్నది. ఇది శబ్దపల్లవము గా దని తలఁచిన సర్వ. ఎందుకుఁ గాదో వివరింపలేదు.

చనుదెమ్ము అని శబ్దపల్లవక్రియ సమాప్త మయి, పిదపఁ దిరిగి గ్రహింపఁ బడుసందర్భమునఁ బూర్వావయవ మగు 'చను' లోపించి, తెంచు మాత్రమే స్వీకరింపఁబడినది. తేన్ అనగాఁ జనుదేన్ అని యర్థము.

చననిచ్చు అనునది ద్వ్యవయవక్రియ. సూరి గాని యితరులు గాని ద్వ్యవయవక్రియ యనుదానిని బేర్కొనలేదు. ఇతఁడును జెప్పలేదు. ఘం. అగు, ఇచ్చు, పోవు లో నగుధాతువులు చేరి, యేర్పడుజంటరూపములు ద్వ్యవయక్రియ లనఁబడు (221) నన్నది. ఈలక్షణమున కాధార మేదియో తెలియదు.

'భూగమిక్రియయో రన్తే ఘటకాఖ్యా నిరుచ్యతే' ఘటకక్రియలను బ్రౌఢవ్యాకర్త ద్వ్యవయవక్రియ లనెను (331) అను ఘం. అభిప్రాయము నిరాధారము. వి.వి. అభిప్రాయమును సూరియే సంస్కరించెను. దానినే ప్రౌఢవ్యాకర్త స్వీకరించె నని చనుదెంచు అనుపూర్వలక్షణమే స్పష్టము చేయుచున్నది. వి.వి.మతమునఁ బూర్వావయవము ధాతు వగుచో ఘటకక్రియ యనుచున్నారు. అట్టియెడలఁ జనుదెంచు ఘటకక్రియ, ద్వ్యవయవక్రియయే కావలెను గాని శబ్దపల్లవ మెట్లయినది? అగు పోవు లని వి.వి. కర్త స్పష్టముగాఁ జెప్పెను. చననిచ్చు అనుదీనితో ఇచ్చు ధాతు వున్నది. 'అన్యా శ్చాపి' యనుదానిచే దీనిని గ్రహించుట కవకాశము లేకపోలేదు. అట్టియెడల చనుదెంచు అనుచో తెంచు మాత్ర మన్యశబ్దముచే నేల గ్రహింపరాదు. శబ్దపల్లవమునకు లక్ష్యము లేకుండఁబోవు ననియా. కానీ వివాదాస్పద మైనస్థలమున నిర్ణయించుటకు నయ్యది ప్రమాణ మగు నని మాత్రము చెప్ప వీలు లేదు. అగుపోవులలో నొకటి చూపినను, బూర్తిగా నదియే యని చెప్పుటకును వీలు లేదు. వి.వి. ఘటకక్రియ లనఁగాఁ బ్రౌఢ. ద్వ్యవయవక్రియ లనుచున్నది. ప్రత్యేకసంజ్ఞతోఁ బేర్కొనుటనుబట్టియు వి.వి. అభిప్రాయమే యీతనికిఁ గల దనుటకు వీలు లేకున్నది.

ఇంక నీఘం. ననుసరించి చెప్పఁదలచిన నీప్రౌఢ.అభిప్రాయము సంకర మగుచున్నది. శబ్దపల్లవములలోఁ బూర్వావయవము ధాతు వయినను సూరిమతమున శబ్దపల్లవమే. చనుదెంచు అట్టిదే. కాఁగాఁ బ్రౌఢ.మతమునఁ బూర్వావయవము ధాతు వైనను శబ్దపల్లవమే. అగు, పోవు ప్రభృతు లుత్తరావయవము లైనచో మాత్రము ఘటకక్రియ లన్నమాట. ఇట ని ట్లని నిర్ణయించుట కాధార మేది?

కాఁగా ఘటకక్రియలనే ద్వ్యవయవక్రియ లని ప్రౌఢ. తలఁచె ననుట నిరాధారము.

సర్వ. నుజ్యంతములు క్త్వార్థకములు మున్నగువానిపైని ధాతువులు చేరి స్వార్థమునే యొసఁగునెడల నవి ద్వ్యవక్రియ (494) లన్నది. ఇట్లు నిర్వచించిన యీవ్యాఖ్య చననిచ్చు అనుదానిని ద్వ్యవయవక్రియ యన్న దనఁగా నీయది స్వార్థమునే యొసఁగుచున్న దని తాత్పర్యము. చనన్ ఇచ్చు అనుక్రియారూపము లిట స్వార్థమునం దున్న వని నిశ్చయముగాఁ జెప్పలేము. చననిచ్చు ననఁగా జనునట్లుగాఁ జేయు నని యర్థము. ఇచ్చు ధాతువునర్థ మిటఁ గలదా?

వలయ్వాదులకుఁ గర్త యగుభావమునందు ధాతువునకు బాల. నుజి చెప్పుచున్నది. ఇట్టివానిని ద్వ్యవయవక్రియలుగా సూత్రకర్త భావించె నేమో, కానీ యివ్వానిని సయితము శబ్దపల్లవములుగానే యెంచఁదగు నని తోఁచుచున్నది. వలయ్వాదిక్రియలకుఁ గర్త యగుభావంబున ననురీతిగా నిట్టివానిని సూరి ప్రత్యేకముగా సాధించుట ననుసరించి యీయవి శబ్దపల్లవములు గా వని నిర్ణయింపవలసినయవసరము లేదు. ఈశబ్దపల్లవములలో జరుగుమార్పు నిరూపింప నవకాశము గలిగి యొకే లక్షణము గలిగియుండుటనుబట్టి నిరూపింపఁ బడిన దని గ్రహింపవలెను. చనుదెంచు అనురీతివానిని సూరి యిట్లే నిరూపించుటయు వానిని శబ్దపల్లవములుగాఁ బ్రౌఢ. గ్రహించుటయు జరిగినది. కానీ ప్రౌఢవ్యాకర్తయే వీనిని శబ్దపల్లవములకు భిన్నముగా ద్వ్యవయవక్రియ లని పేర్కొనుటనుబట్టి చననిచ్చు అనురీతివానిని శబ్దపల్లవము లని నిర్ణయించుటకు ననుమానము గల్గుచున్నమాట వాస్తవమే. చను ధాతువున కిచ్చు ధాతు వనుప్రయుక్తము గాఁగా, వలయ్వాదిసూత్రము ననుసరించి నుజి యై, చననిచ్చు అనురీతిగా నేర్పడిన దని గుర్తించి, శబ్దపల్లవము లనుట యుక్తము. ఇచ్చు ధాతువునర్థము ఇట లేకుండుటంబట్టియు నిది శబ్దపల్లవ మనుట యుక్తము.

కానీ యిట్లు స్పష్టముగా నిర్ణయించుట కాధారములు పుష్కలముగా లభింప కుండుటంజేసి సూత్రమున ద్వ్యవయవక్రియ లనుట నిరర్థక మని నిర్ణయింప రాకున్నది.

ఇట్టివి ప్రయోగానుసారముగా గుర్తింపఁదగును.

## అకాన్ - ఇత్యర్థము

**32. అకా నిత్యర్థకం బగు.**

అకాన్ అనునది ఇతి యనుశబ్దముయొక్క యర్థము గల దని యర్థము. 'అపజయమ కాలక్షించి' అనులక్ష్యమునుబట్టియుఁ, గ్రియాపరిచ్ఛేదమునందుఁ జెప్పబడుటనుబట్టియు ఆకాన్ అనుదానిలో కాన్ అనునది నుఙ్యంత మగు నగుధాతువురూప మనియు ముందటియకార మవధారణార్థ మనియుఁ దెలియవచ్చును. అగుధాతువుయొక్క నుఙ్యంతరూపం బగు 'కాను' అనునది అవరణార్థకావ్యయం బగు 'అ' మీఁదఁ బ్రయుక్త మైనప్పుడు 'అని' అనునర్థ మిచ్చును (కు.పం.147)

'అపజయమ కాన్' అనఁగా 'అపజయ మని' అని యర్థ మని సూత్రకర్త యభిప్రాయము.

సర్వ. అపజయముగాన్ అని యున్నపుడును ఇట్టియర్థము గలదు. కావున ఆకాన్ అని చెప్పఁదగ దనియు తప్పుగాఁ దలఁచునో యనఁగా త ప్పని తలఁ చునో యనియే యర్థ మనియుఁ (366) బేర్కొన్నది. తప్పుగాఁ దలఁచు అను విధేయవిశేషణము పైని కాను చేరిన దని పూర్వసూత్రము ననుసరించి ప్రౌఢవ్యాకర్త యిది యనుప్రయుక్త మనియే తలఁచుట గుర్తించితిమి. కాఁగాఁ గప్పముగ నడుగు మనురీతిగా నిట తప్పుగఁ దలఁచునో యనియు నుండవచ్చును గావున నిది ప్రత్యుదాహరణము గానేరదు.

తత్త్వ. అపజయమకా లక్షించి= అపజయమే యగుట నూహించి- అనుతీరుగా నర్థము గుదురుటచే సరళము గానిమార్గములో 'అకాన్' ఇత్యర్థక మనుట సరి కా దనియు నిది భావార్థక మనుట యుక్త మనియుఁ బేర్కొన్నది (370). కాను అనునది భావార్థకప్రత్యయాంత మనుటలో నుఙిని భావార్థమున విధింపఁదగు నని తత్త్వ.అభిప్రాయము గావచ్చును.

ఘం. అపజయము+అ+కాను = అపజయమే యగు నని, లక్షించి యన్నమాట (ఘం.227) అని పేర్కొన్నది. అపజయమే యనుచో నర్థమునం దేకారము నవధారణారణార్థకమును జూపుట గమనింపఁదగును. అనఁగా అపజయమ కాన్ అనుచోటియవధారణార్థక మగునకారము స్వార్థమునందే యున్న దనుట స్పష్టము.

కావున నవధారణార్థకముతోడ, దానిపై నున్న కాన్ ఇత్యర్థక మనుట సరి గాదు. ఇట యథార్థము నింతియ. కావున అకాన్ అని యకారమును జూపుట సరి గా దని నిర్ణయింపఁదగును.

శ.ర. ననుసరించి చూడ 'చేయున కా దలఁచి' యనుచో నిశ్చయముగాఁ జేయును అని తలఁచి యనురీతిగా నవధారణార్థకము స్వార్థబోధక మైయుండఁ గా, 'కాన్' అనునదే ఇత్యర్థక మగుచున్న దనుట స్పష్టము. సూ.ని. ఈప్రౌఢ.అభిప్రాయమునే పేర్కొన్నది. మడిసెన కాఁ దలఁచి యనుచోఁ గూడ నిట్లే అకారము నిశ్చయార్థమును దెల్పుటను సూ.ని. అర్థమునఁ జూపియు, అకాన్ ఇత్యర్థక మనుట యుక్తము గాదు.

ఇట్టిచోట్ల మడిసెనే యగుట తలఁచి, చేయునే యగుట తెలిసి యనురీతిగా భావార్థము సమన్వయింపఁబడదు. కావున నుజిని భావార్థమున విధించినచో నిట్టిప్రయోగములు సంగ్రహింపఁబడవు. కావునఁ దత్త్వ. అభిప్రాయము నిట నంగీకరించుట కవకాశము చాలదు.

కానీ యిందలివిశేషార్థమును మాత్రము గుర్తింపవలసియున్నది. తప్పుగాఁ దలఁచి, అపజయముగా లక్షించి యనువానికి వీని కర్థసందర్భమున సామ్యము లేదు. అపజయమ కాన్ అనుచో అపజయమే యని అని యర్థము. అపజయముగాఁ దలఁచి యనుచో నట్టియర్థము లేదు గదా. కావున నిట నిత్యర్థకత్వము నంగీకరింపక తప్పదు. కానీ దానికి ముం దవధారణార్థక మగుఅకారమును జూపుటయే యుక్తమా యని యనుమానము. అపజయముగా లక్షించి, అపజయముగ లక్షించి, అని యైనట్లు అపజయమకా లక్షించి = అపజయమక లక్షించి యనురీతి హ్రస్వముతోడి రూప ముండునా?

కావున కాన్ ఇత్యర్థక మగుట అవధారణార్థకముపై నున్నపుడే జరుగుచున్నది. అపజయముగా లక్షించి యనుచో నయ్యది యిత్యర్థకమే యని చెప్పవలసిన యవసరము లేదు.

కాన అపజయమె కా లక్షించి యనురీతిగా 'ఎ' అనునవధారణార్థకముపై నున్నను నయ్యది యిత్యర్థక మవుచున్నది.

కావున నవధారణార్థకముతో గాన్ ఇత్యర్థక మనుట సరి కాదు. అవధారణార్థకము మీఁది కాన్ ఇత్యర్థక మనుట యొప్పును. సూత్రకర్త యభిప్రాయ మదియే యని నిశ్చయించుటకు నవకాశము లేకపోలేదు. శ.ర.లో 'కాను– ఇది యవధారణార్థకము మీఁద వచ్చినపుడు ఇత్యర్థక మగును' (శ.ర.) అని పేర్కొనెను. కాఁగా నవధారణార్థకముతో పైనున్న కాన్, అకాన్ మొత్తము ఇత్యర్థక మగు నని యర్థము చేయుటకంటె నవధారణార్థకము పైనున్న కాన్ ఇత్యర్థక మగు నని చెప్పుట యొప్పును. కావున అకాన్ అనుచోట 'అ' అనునది యవధారణార్థకమునకు సూచక మనియు నవధారణార్థకముమీఁదఁ బ్రయోగింపఁబడు నట్టి 'కాన్' అనునది మాత్రమే యిత్యర్థక మనియు, అకాన్ మొత్తము ఇత్యర్థకము గా దనియు గ్రహించుట సముచితము.

అట్టిభ్రాంతి కవకాశము లేకుండఁగా 'నవధారణార్థకము మీఁది కా నిత్యర్థకం బగు' నని చెప్పిన బాగుండెడి దనఁదగును. అపజయముగాఁ దలఁచి అనుచోట్ల నిత్యర్థక మని చెప్పకున్నను నిబ్బంది లేదు.

## అయి, కాన్ స్వయమర్థము

**32. అయి కా నవ్యయంబులు స్వయమర్థకంబు లగు.**

అయి, కాన్ అనునవ్యయములు స్వయము అనునర్థము గలిగిన వగు నని సూత్రమున కర్థము.

వాఁ డయి వచ్చెను లేదా వాఁడుగా వచ్చెను అనుచోట్ల వాఁడు స్వయముగా వచ్చె నని యర్థము. నీ వై పరికింపవు అనుచో సూత్రకర్త చెప్పినట్లు స్వయమర్థము లే దని తత్త్వ. భావించినది. నీ వెన్నడును పరికింప వనురీతిగా నసంభవార్థమును దెల్పుచున్న దనెను. కానీ యితరులప్రేరణ లేక, నీయంతట నీవుగా, స్వయముగా పరికింప వనురీతి నిచ్చట స్వయమర్థము గలదు. ఇట్లే నీవై రావు అనుచో నీ వెప్పుడును రా వనునర్థ మప్రసిద్ధము. రమ్మననిదే రావు, స్వయముగా రావు అనుతీరుగా స్వయమర్థమే యున్నది.

అయి యనునది స్వయమర్థక మనుట ప్రసిద్ధము. కాని కాన్ అనునది స్వయమర్థక మనుటకు వ్యవహారమే ప్రమాణ మని తోఁచుచున్నది.

'నారదుఁడుగా రాఁ జూచి' యనునది సరి యైనపాఠము గా దని ఘం.

పేర్కొన్నది. ముద్రితప్రతులం దుండుట యనుకారణము ననుసరించి నారదుఁడు రాఁగాఁ జూచి యనుపాఠము గ్రాహ్య మనుట సమంజసమే యనదగును. కానీ నారదుఁడు దా రాఁ జూచి అనునది సాధుపాఠ మనఁదగు ననుట సరి కాదు (227) ముద్రితప్రతులందుఁ గాననయినను గ్రహింపరా దని యెంచుచోఁ దా రాఁ జూచి యనుపాఠమును గ్రహింప నేల? ఇట్టిప్రయోగములను మార్చుపద్ధతి సమంజసము కాదు. ప్రౌఢవ్యాకర్త చూచినప్రతియం దట్టిపాఠ ముండుటనుబట్టి యట్లు గ్రహించె ననియే నూహించుట యుక్తము గాని యాపాఠమును గా దని సాధుపాఠమునుచు వే ఱొకపాఠమును గల్పించు టుచితము గాదు.

నారదుఁడుగా రాఁ జూచి యనుపాఠము స్వయమర్థముతో సమన్వయించినచో నిబ్బందియును లేదు. కానీ రాన్ నారదుఁడుగాఁ జూచి యనురీతిగా మార్గాంతరమున నన్వయింపవచ్చును. కానీ యింతకంటె నారదుఁడు స్వయముగా రాఁగా అనుసూత్రకర్త చూపినయర్థ ముచితమే. కానీ యాతఁడు చూచినపాఠ మే ప్రతియందలిదో. మొత్తము మీఁద దీనిని దిరస్కరించు టుచితము కాదు గానీ ప్రబల మైనప్రమాణముగా మాత్రము గుర్తించుట కవకాశము లే దని గుర్తింప వచ్చును. అయి స్వయమర్థకముగాఁ జెప్పుట యుచితమే. కానీ కాన్ స్వయమర్థక మనుటకుఁ బ్రబల మైనప్రమాణము దొరికినపుడే సమర్థింపవలయును.

'స్వయమర్థకంబు లగు' ననురీతిగా నిత్య మగునట్లుగాఁ జెప్పుట యుక్తము గాదు. (కు.పం.) ఆద్యుఁ డయి, పిరువీకుగ ఇత్యాదులలో నీయర్థము లేకుండుటను స్పష్టము చేసినది. (కు.పం.147) సర్వ. 'కొన్నియెడల' ననుదళమును సూత్రమునఁ జేర్పవలె నన్నది. సుబో. 'స్వయమర్థకంబులు నగు' అనురీతిగా సముచ్చయార్థకము తో సవరించినది. అందు లాఘవమును గలదు.

శబ్దములయర్థములం గూర్చి లక్షణము నేర్పఱచుట శబ్దశాస్త్రమున ననవసర మని తత్త్వబోధిన్యాదివ్యాఖ్యలు పేర్కొన్నవి.

## పొమ్ము – నిశ్చయార్థము

**వాక్య.22. పొమ్ము నిశ్చయార్థంబునం దగు.**

'ఎట్లుం బోవఁ బొమ్ము' అనుచో పొమ్ము అనునది పోవుధాతువుయొక్క ప్రార్థనాద్యర్థము నీయక, కేవలము నిశ్చయమునే బోధించుచున్నది. నిశ్చయముగా

బోవను అనియే దీని కర్థము. ఇట్లు పొమ్ము అనునది నిశ్చయ మనునర్థమునం దుండు నని సూత్రమునర్థము. నేను బోవను, నీవు పొమ్ము అనురీతిగాఁ బైనర్థము చేయరాదు గదా.

కు.పం. పో అనునది దీనికి రూపాంతరముగాఁ బేర్కొని 'పట్టెఁ బో' అనుచో పో అనునదియు నిశ్చయార్థమునం దుండుట శ.ర.కనుగుణముగా నిరూపించెను. (164)

ఘం. పొమ్ము అనునది పో అనుదానికి నుపలక్షణము. దీనికిఁ బ్రత్యయం బిదియ పో (నై.4.43) అంతే పో (ఉద్యో.1.321) (334) అన్నది. అనఁగాఁ బో అనుదానిని బ్రత్యేకముగా గ్రహింపవలె నని యీవ్యాఖ్య యభిప్రాయపడిన ట్లూహింపఁ దగును. శ.ర.లో నీసూత్రకర్త పో – పొమ్ముయొక్క రూపాంతర మని స్పష్టము చేసెను. కావున హలవసానపరకత్వమున ములోపము రాఁగాఁ గృతహ్రస్వమునకు దీర్ఘ మై, పో అనునది పొమ్ము అనుదానినుండి యేర్పడిన దనుట యుక్తము. (సర్వ.59) కావునఁ బొమ్ము నిశ్చయార్థమునం దుండఁగా ములోపముచే నదియే పో అనురూపాంతరము నందిన దనఁదగును. కావున పో అనుదానిని బ్రత్యేకించి పేర్కొన నక్కఱ లే దనఁదగును. అందుకే సూత్రకర్త పో అనుదానికి శ.ర.లో నిశ్చయాద్యర్థము చెప్పియున్నాఁడు. స్వరపరకతలో విశేషముగా గుర్తింపవలసి యున్నది.

అనాదరార్థవిశేషమును శ.ర. పేర్కొన్నది. సూ.ని. ఇతరము లింకను బేర్కొన్నది. కాఁగా నీయది యర్థవిశేషములు పెక్కింట నుంట స్పష్టము. కాఁగా వ్యాఖ్యలు అర్థిక మగునీయంశమును సూత్రింప నక్కఱ లే దనుట యుక్తమే.

లేమ్ము (లే) అనునది సైత మిట్లే నిశ్చయార్థమునఁ గలదు. శ.ర. లెమ్ము అనుదాని నిట్లు చూపలేదు. 'లే' చూపినను నది యవ్యయ మన్నది. అడంచెద లెమ్మని. సూ.ని. అవ్యయ మన్నది. 'పో' కూడ అవ్యయ మనియె సూ.ని. పేర్కొనె. కాని ములోపముచే పొమ్ము అనుమధ్యమపురుషక్రియాపదమునుండి యేర్పడినట్లు గుర్తించినచో దీని నవ్యయ మనుట గుదురదు.

**ఇది క్రియాపరిచ్ఛేదము.**

# ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యానుశీలనము

# కృదంతపరిచ్ఛేదము

కృ త్తనుదానికి 'ధాతువునకు విహితం బగుదుఙ్భిన్నప్రత్యయంబు కృత్తు నాఁ బడు' నని యితఃపూర్వము నిర్వచనము చెప్పఁబడియుండుటంజేసి మఱియుఁ జెప్పవలసినయవసరము లేమిఁ దద్ధితమునువలె గృత్తును వివరింపక ప్రౌఢ. కృత్ప్రత్యయములను బేర్కొనెను.

తద్ధితములును గృత్తులును సమగ్రముగా నిరూపించుట సులభసాధ్యము కాదు. అయినను బ్రయోగపరిశీలనముచేఁ గాంచినవిశేషములను నిరూపించుటకుఁ బ్రౌఢవ్యాకర్త పరిచ్ఛేదము నారంభించెను.

## ఇవర్ణకము

**1. డయ్యు దయ్యు నొచ్చు పుచ్చుల కివర్ణకం బగు, అగుచో వానికడహల్లులు పకారంబు లగు.**

ఈధాతువులకు 'ఇ' అనుకృత్ప్రత్యయము వచ్చును. అది పరముగా నుండఁ గా వానిచివరిహల్లులు పకారము లై, డప్పి, దప్పి యిత్యాదిగా రూపము లవును.

సూరి కృత్ప్రత్యయములను గొన్నింటిని దెల్పి చివర వడిప్రభృతులలో 'ఇ' ప్రత్యయమును బేర్కొని, చేయి, వ్రాయి అని యుదాహరించెను. ఆ'ఇ'ప్రత్యయమే దయ్యు ప్రభృతుల కగు నన్నను నిట పకారములు విశేషముగా విధింపవలసి యుండుటచేత ఇప్రత్యయమును మాత్ర మనువదించుట యే లని ప్రత్యేకముగా బ్రౌఢ. విధించియుండును.

ఇంక నీసూత్రములో 'డయ్యు దయ్యు' అని చెప్పుటను గూర్చి ఘం. 'డయ్యునకు దయ్యు రూపాంతర మగుటచే (బా.ప్రకీ.14) దీనిని వేఱుగాఁ జెప్పుట స్పష్ట

ప్రతిపత్తి కనఁదగు' (228) నన్నది. తత్త్వ. 'డకారము (కొన్నియెడల) దకారముగా మాఱు నని బాలవ్యాకరణంబునఁ జెప్పఁబడినందున – – దయ్యు ధాతువును సూత్రమున విడువవచ్చు' (372) నన్నది. ఈవివరణమున దడలు తారుమా అయినవి. బాల. 'దక్కు లోనగువానిదాకు డకారంబు విభాష నగు' నని దకారమునకే డకారము చెప్పెను. కావున దయ్యు ధాతువునుండి డత్వముతో డయ్యు ఏర్పడుచున్నది. దయ్యు నుండి దప్పి యేర్పడఁగా దప్పిలోనిదకారమునకు డకార మయి డప్పి యగును. దయ్యుకు రూపాంతరముగా డయ్యును, దప్పికి రూపాంతరముగా డప్పియును సిద్ధించును. కాఁగా సూత్రమున డయ్యు అనునదే యనవసరము. 'దయ్యు' అనునది యున్నఁజాలును.

పుచ్చును గూర్చి కు.పం. 'నొచ్చునకు నో వనియు ప్రుచ్చునకుం బ్రు వ్వనియుఁ గృదంతరూపంబులు. 'పువర్ణకంబు మన్వాదుల కగు' నను 17వ సూ.క్రింద సూరిగా రొసంగియున్నారు. ప్రుచ్చుయొక్క రూపాంతరము పుచ్చు. కాని యీయిదాగమ పాదేశయుతరూపములు బాల.లో సాధింపఁబడనివి. (149) అని పేర్కొన్నది. ఇట ఇదాగమ మనుట పొరపాటు. సూత్రమున ఇవర్ణక మనుచుండఁగా ఇదాగమ మనుట యెట్లు? నొచ్చు ప్రుచ్చులు సూరి యుదాహరించినను వానికి ఇప్రత్యయ మగుటను బేర్కొనలేదు. చెప్పియున్న పత్వమును జెప్పెడివాఁడే కదా. కావున కు.పం. ఈసూత్రమునవసరమును బేర్కొనుట యుచితమే.

ఇట నున్న పుచ్చు అనునది ప్రుచ్చుధాతువురూపాంతరమే. తత్త్వ. 'ఇందలి పుచ్చుధాతువు పురుగుపట్టు అనునర్థము గలది. గ్రహణాద్యర్థక మగు పుచ్చుధాతువు నిట గ్రహింపదరా' (373) దన్నది. ప్రుచ్చుధాతువునే సూత్రమున గ్రహించినచో నిట్టియర్థభేదముప్రసక్తి యుండెడిది గాదు.

శ.ర.లో నీసూత్రకర్తయే 'ప్రుచ్చు – పుచ్చునకు మొదటిరూపము. ప్రుప్పి – పుప్పికి మొదటిరూప' మనెను. కావున సూత్రమునందు పుచ్చు అని కాక ప్రుచ్చు అని యున్న సముచిత మయ్యెడిది. ప్రుచ్చు అనునదే మొదటిరూపము గావున దాని కీకార్యము విధించిన ప్రుచ్చునుండి పుచ్చు ఏర్పడునట్లుగా ప్రుప్పి నుండి పుప్పి అనునది యేర్పడఁగలదు. పుచ్చు అనునదే మొదటిరూప మవుట యీగ్రంథకర్త యుద్దేశము గాదు. సూరి ప్రుచ్చు చూపుటయు నిట గమనింపఁదగును.

పుచ్చు అనునదే గ్రహింపఁబడినచో దానికి స్వీకరించు, పెఱుగు (శ.ర.) అనురీతిగా వే ఱర్థములును గలవు. కావున అప్పుడును ఈప్రత్యయము వచ్చు నవకాశము గలదు. అందుకే తత్త్వ. అది గ్రహింపరా దని పేర్కొన్నది. కానీ యాయర్థము సూత్రముచే సిద్ధించు టెట్లు? ప్రుచ్చుధాతువునే సూత్రమునఁ జెప్పి యున్నచో దానికి 'పుప్పిపట్టు' అనునర్థ మొకటే కలదు గావున నీయతివ్యాప్తి కవకాశము లేదు.

వీనినిం బరిశీలింపఁగా శ.ర. అభిప్రాయమున కనుగుణముగా సూత్రమునందు బ్రుచ్చుధాతువునే సూత్రకర్త పఠించె నేమో యని యనుమానింప నవకాశము గల్గుచున్నది. అట్లు గానిచో పుచ్చుధాతువును జేర్చుటవలన నిబ్బందులు గలవు గావున నయ్యది యనుచిత మనియే పేర్కొనవలసియుండును.

కాఁగా 'దయ్యు, నొచ్చు, ప్రుచ్చుల కివర్ణకం బగు' నని చెప్పఁదగును.

'అగుచో వానికడహల్లులు పకారంబు లగు' ననుదానికి వ్యాఖ్యలు భిన్నమార్గములో వివరణ మిచ్చినవి. 'డయ్యు+ఇ అని యుండఁగా యకారమునకు పకారము కలిగి, నొచ్చు ధాతువునకు – చ్చు స్థానమున పు నిల్చును (524) అని సర్వ. పేర్కొన్నది. యకారమునకు పకారము కలిగి యనఁగా రెండుయకారములును పకారము లవు నని యుక్తముగా నర్థము చేసికొనవచ్చును. 'చ్చు' స్థానమున 'పు' నిల్చు ననుటలో నిట్టియర్థము కుదురదు. రెండుచకారములకును రెండు పకారము లవు ననఁదగును. 'ప్పు' నిల్చు నని చెప్పుట యభిప్రాయము గాఁగా నిట నచ్చు తప్పు గావచ్చును.

ఘం. డయ్యు+ఇ, డ య్ప్+ఉ+ఇ యకారపకారసంయోగము విజాతీయ మగుటచే యకారము పకారముగా మాఱును. ఉప్+ప్+ఉ+ఇ. ఇట్లే నొప్పి అనుచోఁ గూడ (228) సమన్వయించినది. ఇది విపరీతముగా నున్న దనక తప్పదు. కడహల్లులు పకారంబు లగు అనుచోఁ గడహల్లు లనఁగా ధాతువులోఁ జివరి హల్లు లని సామూహికముగా నన్వయించుటనే నీయనర్థము కల్గినది. కాని యటఁ గడహల్లు లనుదానికిఁ బ్రతిధాతువునందును నన్వయించిన ధాతువునందు ద్విరుక్తము లయియున్న హల్లులు రెండింటికిని పకారము లగుట సంభవించును.

దయ్‌య్+ఉ+ఇ = దప్‌ప్+ఉ+ఇ = దప్పి యనురీతిగా నవు నని సమన్వయించుట సముచితము.

నిజమునకు 'ఇవర్ణకం బగు, అగుచో వానికడహల్లు పకారం బగు' నని యేకవచనాంతముగాఁ జెప్పినను బైధాతువు లన్నింటియందును ద్విరుక్తము లగుహల్లులు రెంటికి పకారములు రావా? కావున నన్నింట నవు ననుటకై బహువచనమును బ్రయోగింప నవసరము లేదు. కావున రెండు యకారములకును, రెండు చకారములకును రెండు పకారము లవు ననుట యుచితము.

ఇంకను వానికడహల్లు లని చెప్పవలసినయవసరమును లేదు. 'యచలకు బకారం బగు' అని చెప్పిన లాఘవమును గల్గెడిది.

సుగమ. 'దయ్యు+ఇ = దయ్యి (235) అని యిప్రత్యయముతో సంధి చేసి యాపిదప పకారము చేసి, చూపినది. కానీ 'ఇవర్ణకం బగు, అగుచో' అనుదాని ననుసరించి ఇవర్ణకము చేసినవెంట పకారమును జేసి, దప్పు+ఇ = దప్పి యని యవు నని చెప్పుట యుక్తము. ఇవర్ణకము, పకారము అనురెండుకార్యము లొకే సూత్రమున విధింపఁబడుచుండఁగా నవర్ణకమును జేసి, నడుమ సంధి చేసి, యాపిదప పకారమును జేయుటవల నే మేని విశేషప్రయోజన మున్నదా? (ముయ్యేదు లనుచోఁ బ్రయోజనవిశేషము గమనింపఁదగును.)

కాగా 'నొచ్చు ప్రుచ్చు దయ్యుల కివర్ణకం బగు, నగునపుడు పకారంబు చయల కగు' ననియుఁ జెప్పఁదగును.

'కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగా గ్రాహ్యంబు' లని మాత్రమే బాలవ్యాకర్త వివరించె నని, దానిని బ్రౌఢవ్యాకర్త సూత్రరూపమున సాధించినాఁ (42) డను లఘువ్యాఖ్య సరి కాదు. ఈసూత్రమును గృత్ప్రత్యయమునే చెప్పినది కాని తదర్థమును జెప్పుట లేదు. యథావ్యవహారముగా గ్రాహ్య మనుసూరిమతమే ప్రౌఢ.మతమును. పైఁగా నిది కృత్తునర్థము చెప్పుసూత్ర మై సూరి యట్లు చెప్పలే దన్నచో సూరి కృదంతపరిచ్ఛేదములోనిసూత్రము లెట్టివి?

## ఇడి వర్ణకము

**2. రాయున కిడివర్ణకంబు నగు.**

అని సూత్రించి ప్రౌఢ. 'రాయిడి రాపు' అని యుదాహరించెను కానీ సుబో. 'రాచు అని ముద్రితపాఠము. అది సరి కాదు. రాచునకు ఇడి వచ్చిన రాచిడి కావలసివచ్చును. కు.పం.న రాచు గ్రహింపఁబడిన' (266) దని పేర్కొన్నది. ఈ యభిప్రాయమును దత్త్వ. (373) ఆమోదించినది. మిగిలినవ్యాఖ్యలు రాయు పాఠమునే స్వీకరించినవి. ఏది గ్రహింపవలె?

సుబో. వ్రాఁత ననుసరించి ముద్రితప్రతులలో రాచు అనుధాతువే గల దని స్పష్టము. ఇంక రాచు+ఇడి అని యైనచో రాచిడి అని కావలయును గావున రాయు అనుపాఠమును స్వీకరింపవలె ననుట యుచితమా? అస లిట సూత్రకర్త యభిప్రాయ మేమి? అన్నది పరిశీలనార్హము. సూ.ని. రాయిడి రాయుధాతువు నుండి, రాపు, రాపిడి యనువానిని రాచుధాతువునుండి చూపినది.

స్పష్టముగా నిది ధాతు వని నిర్ణయించుటకు శ.ర.లో నాధారము గానరాదు.

రాపు అని యుదాహరించుటనుబట్టియు ధాతువు నూహించుటకు వీలు చాలదు.

ఈరూపాంతరము సముచ్చయార్థకముచే సిద్ధ మైనది. సర్వ. 'సముచ్చయార్థకము చేత చేయ్యాదులలోని దైన పువర్ణమును గూడ పొందవచ్చును. అపుడు రాపు అని యగు' (526) నన్నది. చేయ్యాదులలోని దను టచ్చుపొరపాటు గావచ్చును. చేయ్యాదులలోని దైనచో తజ్జ్వర్ణకము గదా రావలసినది. మాయ్యాదు లని యుండఁ దగును. పువర్ణకము చెప్పిన మాయ్యాదిసూత్రమునకుఁ బిదపనే సర్వ. ప్రస్తుతసూత్రమును జూపినది. ప్రస్తుతసూత్రమునందలిసముచ్చయార్థకము పువర్ణకమును గ్రహించునది. పువర్ణమును మాయ్యాదిసూత్రమే విధించుచున్నది. కాని మాయ్యాదులలో సూరి రాయుధాతువును గాని లేదా రాచుధాతువును గాని చూపలేదు. కావున నే దైనను మాయ్యాదులలోఁ గ్రొత్తగాఁ జేర్చుకొనవలసినదే. అట్టియెడల నిట రాయు అనునదే యని కాని, రాచు అనునదే యని కాని నిర్ణయించు టెట్లు? ఇంకను నట సూరి యువర్ణాంతములు రెండే చూపెను. చువర్ణాంతములు

పెక్కు చూపి యిత్యాదు లనెను. దాని ననుసరించిన రాచు ధాతువే యటఁ జేరఁ దగు ననునూహకు నవకాశము లేకపోలేదు.

రాచు ధాతువు నాఱ్ఱాదులలోఁ జేర్చి రాపుడు అనురూపము సూరి యుదాహరించెను. కావున నాఱ్ఱాదులలో నుంటచే మాయ్యాదులలో నుండరా దని నిర్ణయింపరాదు. అనఁగా రాయు అనునదే మాయ్యాదులలో నున్న దనియు కావున రాపు అనురూపాంతరమునుబట్టి యిట సూత్రమునందును ధాతువు రాయు అనునదే యనియు నిర్ణయించుట కాధారము లేదు. సూరి అమ్ముధాతువును మాఱ్ఱాదులలోఁ జేర్చి 'అమ్మకము' అనియు, ఆఱ్ఱాదులలో జేర్చి అమ్ముడు అనియు సాధించెను. ఇట్టి వింకను నట గమనింపఁదగును. కాఁగా రాచు ఆఱ్ఱాదులలో నున్నను మాయ్యాదులలోఁ గూడ నుండుట కెట్టియభ్యంతరమును లేదు. అపుడు రాచు ధాతువునుండియు రాపు అనురూప మేర్పడును. కావున రాపు అను రూపాంతరమునుబట్టి ధాతువు రాయు అనియే నిర్ణయింప వలనుపడదు.

ఇ ట్లని ముద్రితప్రతులయం దున్న రాచు ధాతువుచే గ్రహించిన సుబో. కారుఁ డన్నట్లు రాచిడి యనియే యవును గాని రాపిడి యగుట యెట్లు?

ఇటఁ దత్త్వ. 'రాచున కిడి వర్ణకంబు నగు' అనుపాఠము రాచు+ఇడి అని యుండ పూర్వసూత్రోత్తరఖండము ననువర్తింపఁజేయఁగా రాపిడి అని యగును. రాచుతోపాటు రాయును నిచట గ్రాహ్య మయినచో నీపక్షమున రాపిడి అనియే యగు' (373) నన్నది. కావున నుద్దిష్ట మగు 'రాయిడి' అనురూపము సిద్ధింపవలె నన్నను సుబో. పేర్కొన్నట్లుగా రాయుధాతువునే గ్రహింపవలె నని సిద్ధాంత మన్నమాట.

ఈప్రసంగ మనుచితము. పూర్వసూత్రోత్తరఖండము ననువర్తింపఁజేయుట కుదురునా?

'ఇవర్ణకం బగు, అగుచో వానికడహల్లుల పకారంబు లగు' నను నప్పుడు అగుచో అనగా ఇవర్ణక మగుచో ననియే యర్థము. ఇ ట్లనువృత్తము చేయు టెట్లు.

రాచుతోపాటు రాయును గ్రాహ్య మైనచో ననుటయు సరి కాదు. సూత్రము నందు నిర్దేశింపఁబడి యొకదానికిఁ గార్యము చెప్పుచుండఁగాఁ దద్భిన్నమును గ్రహించుట కవకాశ మెట్లు?

సంజీవనీవ్యాఖ్య రాచున కిడివర్ణకం బగు ననుపాఠమునే స్వీకరించి 'రాచు+ఇడి అని యుండ బాల.కృ. 2. సూత్రముచే జులోప మవుచునన్నది. ఇమిపరకత్వమున జెప్పిన లోపము ఇడి పరకత్వమున నె ట్లగు ననఁగా ఇడి, ఇమి – అనురెండును ఇవర్ణాదులె యగుటంజేసియు వచ్చు నని ప్రౌఢవ్యాకర్త తలంచియుండవలె ననె' (వ్యా.సం.స. 1746) నన్నది. ఇది సంగతము గాదు. ఇవర్ణాదితనుబట్టి యవు ననునభిప్రాయము సూరికి నున్నచో కగతపవ అని యితరములు ప్రత్యయాది వర్ణములు మాత్రమే పేర్కొన్నవాఁడు ఇమి అనుప్రత్యయమును మొత్తము వచింప నేల? (వ్యా.సం.స. 1741) ఇకారమాత్రమును బేర్కొన్నఁ జాలును. ఇమి యనురీతిగాఁ బ్రత్యయము మొత్తమును బఠించుటవలన ఇవర్ణాదు లగునితర ప్రత్యయములు పర మైనపు డీకార్యము లే దని సూరి నిరూపించుచున్నాఁడు. అందుచేతనే అరయు+ఇక అరయిక, అలయిక ఇత్యాదులు చూపెను. ఇట యు లోపించె నన్న మాత్ర మిబ్బంది యేమి? యనరాదు. యులోప మయిన అర+ఇక అని యుండును. ఇపు డపదాదిస్వరము పర మయినది గావున సంధి నిత్యముగా రావలయును గదా. అపుడు అర+ఇక = అరిక, అల+ఇక = అలిక యనురీతిగా నపరూపము లేర్పడవలదా? ఈప్రత్యయములు పరము లవుచుండఁగా సంధి రాకుండుట కేది యాధారము.

అట్లే యిటఁ బ్రౌఢవ్యాకర్త వఝులవారు పేర్కొన్నయుద్దేశ్యమునందే యున్న యెడల రాచు+ఇడి = రా+ఇడి అని కాఁగా సంధి వచ్చి, 'రెడి' యని గదా కావలయును. 'అపదాదిస్వరంబు పరం బగునపు డచ్చున' కనుసామాన్య నిర్దేశమువలన నచ్చుల కన్నింటికి సంధి రావలసియే యున్నది.

ఈయుద్దేశము ప్రౌఢ.కుఁ గల దనుటకు వఝులవా రొకయాధారము చూపిరి. ప్రౌఢ.కృ. 6. సూత్రమునొద్ద కాచు+పురము కాపురము మున్నగుస్థలములందు బా.కృ. 2 సూత్రమును త్రిలింగలక్షణశేషకర్తయే ఉపయోగించుకొనుటయె పై విషయమునకు నిదర్శనము. (వ్యా.సం.స. 1746) ఉలియు+వు = ఉలివు, కాచు+వలి = కావలి ఇత్యాదిగాఁ బ్రౌఢ. బాల.కృ. 2 సూత్రము నుపయోగించు కొన్నమాట వాస్తవమే. కాని యిట కాచు+పురము అనుచో కృత్పకారము పరము. ఆపైవానిలో వకారము. వీనియెడల నాసూరిసూత్రము పవలు పర మైనపుడే లోపము వచ్చు

నని చెప్పినది. అట నాసూత్రము నుపయోగించుట సక్రమమే. కానీ యిట నట్లు గాదే.

వఝులవారు ప్రౌఢ. కున్న దని యూహించినయభిప్రాయము ప్రౌఢవ్యాకర్తకు లే దనుటయే యుచితము. (డయ్యు దయ్యు సూత్రమున పకారవిధానముచే లోపింపదు) కావున నిది యిట నుదాహార్యము గాలేదు. ఇకారాదిప్రత్యయ మిం కొకటి యితఁడు చెప్పలేదు.) ఇట సుగమ. 'పువర్ణకంబు మాయ్యాదుల కగు' నను బాల.సూత్రముచే రాయునకు 'పు' ప్రత్యయ మాదేశ మై 'రాపు' అగు (235) నన్నది. ఇది యసంగతము. ప్రత్యయము (పు) నాదేశము చేయుట విరుద్ధము (చేయవలసిన ననేకాల్లు గావున సర్వాదేశ మై మాయు అనునది మొత్తము పోయి, 'పు' అని మాత్రమె మిగులును) ప్రత్యయము పరముగా నగును. పువర్ణకమును ధాతువునకుఁ బరముగాఁ జేసి బాల.కృ.2 సూత్రముచే యువర్ణమును లోపింపఁ జేయవలెను.

కానీ రాయు అనుపాఠము సుబో. సంస్కరించిన దవుటచేతను అంతకు పూర్వము ప్రతులలో రాచుధాతువే యుండఁగా కు.పం. సంజీవనీవ్యాఖ్యలు రాచు ధాతువునే చూపుటనుబట్టియు రాచుధాతువు నీసూత్రకర్త యుద్దేశించె నేమో యనక తప్పదు. అపు డది సూత్రరచనమునందు లోప మని యంగీకరింపక తప్పదు.

లేదా వ్రాఁతప్రతులం దచ్చుత ప్పని భావింపవలెను.

మొత్తము పైని 'రాయున కిడి వర్ణకంబు నగు' అని యుండఁదగు. రాయిడి మాయ్యాదిత్వముచే – రాపు. (రాచుధాతువునుండి రాపుడు.)

వఝులవారు 'సూరియుఁ బ్రౌఢవ్యాకర్తయుఁ జెప్పలేదు గాని రాపిడి అను రూపమును గలదు. ఇట ఇడి ప్రత్యయపరకత్వమున రాచుధాతుచకారము పకార మగు నని సూత్రించుకొనవలసియుండు' (వ్యా.సం.స.1746) ననిరి. సూరి యీవిషయము చెప్పలేదు గాని ప్రౌఢ. రాపిడి యనుదానిని సాధింపకపోలేదు.

రాచు ధాతువునుండి కృదంతముగా నేర్పడిన దని రాపు శబ్దము దీనిపై 'తెలివి విరివి వినికి లేమి రాపులకు స్వార్థంబునం దిడి వర్ణకం బగు' (ప్రౌఢ.తద్ధి.8) అని ఇడి స్వార్థిక మగుతద్ధితప్రత్యయముగాఁ జెప్పెను. కావునఁ జెప్పలే దనుట సరి

గాదు గానీ యీచెప్పినమార్గము సరిగా లే దని మాత్రము చెప్పవచ్చును.

రాయుధాతువుపై పు వర్ణకము కృత్తుగాను, మఱల దానిపై ఇడి తద్ధితముగాను జేయుట యనవసరము. రాపు, రాపిడి యనునవి సమానార్థకములే. రాయు ధాతువునకు ఇడి ప్రత్యయమును, చకారమునకు పకారమును చెప్పుట యుక్తము. రాపిడి, రాయిడి అనురెండింట ఇడి కృత్తుగా నుండుట యుక్తము. వఝులవారును దీనిని గృదంతముగనే భావించుట గమనింపఁదగును. కావునఁ బ్రస్తుతసూత్రమున రాయు, రాచుల కిడి వర్ణకంబు నగు, అగునపుడు పకారంబు చకారంబున కగు నని సూత్రించిన రాయుధాతువునుండి రాయిడి, రాపు, రాచుధాతువునుండి రాపిడి, రాపుడు అనురీతిగాఁ గృదంతములు సిద్ధము లవును. త్రోపు, త్రోపుడు అనురెంటిని గృదంతములుగనే సూరి సాధించినట్లుగా రాపు, రాపిడి యనురెంటిని గృదంతములుగాఁ జెప్పుట విరుద్ధమును గాదు.

నిజమునకు రాచుధాతువును జేర్పక 'రాయున కిడివర్ణకంబు నగు, అగుచో పకారంబు యకారంబునకు విభాష నగు' – అని చెప్పిన రాయుధాతువు నుండియే రెండు రూపములును సిద్ధింపఁగలవు.

కాగా తద్ధి. 8 సూత్రమున రాపు పేర్కొన నక్కఱ లే దని స్పష్ట మవుచున్నది. ఆ సూత్ర మట నుచితముగా లే దని యటనే స్పష్టము.

## ఎనవర్ణకము

**3. ఈర్చుబ్బుకందు దువ్వు వడ్డించుట కెనవర్ణకంబగు అగుచో ఈర్చుబ్బుల చకార బకారంబులు పకారంబులగు వడ్డించు నించులుప్తంబగు (3)**

దీనిచే ఈర్పెన ఉప్పెన అనురీతిగాఁ గృదంతములు సాధింపఁబడినవి.

ఇందలి ఈరుచు, ఈరు (పేనుగ్రుడ్డు) అనునామమునుండి యేర్పడినట్లు సూ.ని. పేర్కొన్నది. కానీ దీని కర్థము చేయునపుడు ఈడ్చు=దువ్వివైచు అని (శ.ర. కనుగుణముగా) చూపినది. కాని ఈరు అనుధాతువు లేదు. ఈరు అనునామముపైని ధాతుత్వవివక్షలో చువర్ణ మైన దనవలయును. చిగురుచు అనురీతిగా. కానీ యిట్లు కల్పింపవలసినయవసర మున్నదా? ఈడు అనుధాతువునకు తెగు, జాఱు అనియుఁ

ప్రేరణార్థమున ఈడుచు అని యై, తెగుచు, లాగు (సూ.ని.,శ.ర.) అనునర్థములు గలవు. కానీ ఈర్చు అనుధాతువునకు గల దువ్వివైచు పేల నీర్చు అనురీతి యర్థములు ఈడుధాతువునుండి లభించుట లే దనవచ్చును. ఈరు అనునామమే (చిగురుచువలె) ఈరుచు అని ధాతు వైన దని గ్రహింపవలసియుండును. దానిపైనే యెన ప్రత్యయమై 'ఈర్పెన' యని యైనది.

కానీ శ.ర. సూ.ని. రెండును ఈరుపెన అనురూపము నంగీకరించినవి. ఈర్చుధాతువునకు ఎన చెప్పుటవలన 'ఈర్పెన' అని యవును. కానీ ఈర్పెన అనుదానినుండి ఈరుపెన అనురూపము సిద్ధించుట యెట్లు? ఈరుపెన అనునది సాధించినచో నుత్వలోపముచే 'ఈర్పెన' కాఁగలదు. కావున (ఈర్చుబ్బు అని కాక) ఈరుచుబ్బు అనురీతిగా నుత్వలోపము చేయకయే ధాతువును నిర్దేశించు టుచితము.

కు.పం. ఈర్పుడు అనునది రూపాంతరముగాఁ బేర్కొన్నది. (149) ఈర్పుడు అనురూపమును శ.ర. కాని, సూ.ని. కాని చూపలేదు. కానీ దీనియర్థము ఈర్చుట. అనఁగా నీయది భావార్థకము. కానీ ఈర్పెన యనఁగా ఈర్చునది అని యర్థము అనఁగా 'ఎన' కర్త్రర్థకము. కావున నీయవి పర్యాయములు గావు.

ఉబ్బు ధాతువునకు సంతోషించు మొద లగునితరార్థములయందు ఎన ప్రత్యయము గానరాదు. కావున నర్థవిశేషము సూచించిన బా గుండెడిది.

ఇట సుబో. కొంత కు.పం. ప్రభావముతో 'ఉబ్బు కందులు ఎట్టిప్రత్యయములు చేరకయు విశేష్యము లగును. ఉబ్బు-సంతోషము. కందు-నలుపు' (266) అన్నది. ఏప్రత్యయములు చేరకయు విశేష్యము లగు ననుట యుక్తము గాదు. ఉబ్బు కందు అనునవి సుబంతము లైన వన్నమాట. ధాతువుపై సుబ్విభక్తులు చేరుట సంప్రదాయవిరుద్ధము. కావున 'ఉవర్ణకం బదుక్వాదుల కగు' ననుసూత్రము ననుసరించి 'ఉ' ప్రత్యయ మైన దని గ్రహింపవలెను.(తత్త్వ. 374)

కు.పం. పేర్కొన్నట్లు కందు-కందెన, ఉబ్బు-ఉప్పెన యనునవియుఁ బర్యాయములు గావు. ఉబ్బు, కందు అనునవి భావార్థకములు. ఉప్పెన, కందెన యనుచో (నర్థవిశేషముతోపాటు) ఎనప్రత్యయము భావార్థకము గాదు. ఉప్పెన-అధికరణము, కందెన-కరణము. (వ్యా.సం.స. 1746) కావున నీయవి పర్యాయములుగా భావింపరాదు. తత్త్వ. (374) కూడ పొరపడిన ట్లున్నది.

ఉప్పెన యనుచో బకారమునకు పకార మగు ననఁగా ఉబ్బు ధాతువునందలి రెండు బకారములకును రెండు పకారము లవును. ఘం. 'ఉబ్ ప్+ఎన' యనురీతిగా నొకబకారమునకే పకారము చేయుట సరి కాదు. 'వడ్డెన' యనుచో వడ్డించు ధాతువుపై ఎన ప్రత్యయము చేర్చి, ఇంచు లుప్త మవు నని సూత్రకర్త పేర్కొనెను.

దీనిం గూర్చి తత్త్వ. వడ్డించులో ఇంచునకు మొత్తమునకుఁ గాక, బిందుపూర్వక చువర్ణకమునకు మాత్రమే లోపము చెప్పినను నపదాదిస్వరసంధి చేసినను నీరూప మగుచున్నను లాఘవమునకయి యించులోపము చెప్పినట్లు పేర్కొనెను. (374) ఇందుఁ దత్త్వ. చువర్ణ'క'ము అని 'క' ప్రత్యయ ముండుట యచ్చుపొరపాటు గావచ్చును. ఇంచు ఆగమమే కాని వర్ణకము గాదు. సూత్రకర్త వడ్డెన అనియే సాధించెను. కాని శ.ర.లో దీనికి వడ్డన యనురూపాంతర మున్న దని పేర్కొనెను.

సర్వ. 'దీనికి వడ్డన అనురూపాంతరము కూడ కలదు. బాలవ్యాకరణము నందలి అప్పాదులలో వడ్డ అనునది చేరినయెడల వడ్డన అనుకృదంత మేర్పడు' (528) నని పేర్కొన్నది. బహుశః ఈఉద్దేశ్యముతోనే వ్యాకర్త వడ్డన యనురూపమును బ్రత్యేకముగా నిటఁ బేర్కొనలేదు.

వడ్డన – వడ్డెన రెండును సమానార్థకములు గదా. వడ్డన యనుచో నజీ వడ్డ అనుదానిపై వచ్చు టేమి? ఎనప్రత్యము వడ్డించు అనునించుగంతముపై వచ్చు టేమి? దీనిని గూర్చి సర్వ. ప్రస్తావింపలేదు.

వడ్డ అనుదానిపై నించుక్కు చేయక కృత్ప్రత్యయము చేయు టె ట్లని సూత్రకర్త యనుమానించె నేమో. 'అప్పాదులకు నజీ యగు' అని సూరి యించుక్కు చేయకయే నజీ చేసియున్నాఁడు. ఇంచుక్కు చేయనిచో నీయవి ధాతువులు కావు. ధాతువు కానిచో కృత్తు చేరుట కుదురదు. అని యనుమానింపవలసినయవసరమును లేదు. 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' ననుసూత్రమున సూరి యంగలాదులకు విధించినయించుక్కు స్వార్థమునం దవునదే. అంగలాదు లాచ్ఛికము లగుధాతువులే. కావున వానికి కృత్ప్రత్యయములు చేరుట విపరీతము గానేరదు. సూరి యప్పాదులకు నజీ విధించుటలోనియభిప్రాయము నిదియే. (అప్పగించులో)ఇంచుగ్లోపమును, గుగాగమ లోపమును బేర్కొనని దందువలననే. వీవన అనుచో ముత్కార్య మగుటకే

గదా, సూరి జిత్తుగా జెప్పెను. కాఁగా (వీచు ప్రత్యేకముగా ధాతు వగుట ప్రసిద్ధమే) అప్పాదులు ధాతువు లవుట సిద్ధము.

కావున నంగలాదులలోని దగు వడ్డ యనునది సైతము ధాతువే యవును గావున గృత్ప్రత్యయము చేరుటలో నిబ్బంది లేదు. అప్పగింత యనురీతిగా నివి యించుగంతము లయినపుడే యవుచో నితరసందర్భములందు 'ఆవులాదు' లనక "ఆవులించు లోనగువానికి" ననురీతిగా విశేషమును జెప్పుచునే యుండును.

కాగా వడ్డ యనుదానికి ఇంచుక్కు చేసినపిదపనే కృత్ప్రత్యయము చేయవలె నని భావింప నక్కఱ లేదు. కావున అప్పాదులకు నజీవలె వడ్డకు ఎన ప్రత్యయ మవు నని చెప్పుట యుక్తము.

కాగా 'వడ్డించునించు లుప్తం బగు' నని చెప్పవలసినయవసరము లేదు. వడ్డించు అని ఇంచుగంతముగా నిర్దేశింపవలసినయవసరము లేదు.

అది య ట్లుండఁగా నెనప్రత్యయాంత మైన 'వడ్డెన' యనుదానిని శ.ర. మాత్రమే కాక సూ.ని. కూడఁ జూపలేదు. వడ్డన అనుటయే ప్రచురము. వడ్డన అనునది అప్పాదిసూత్రముచే సిద్ధ మవుచునే యున్నది. అందుకే తత్త్వ. ప్రయోగములు దొరకినపు డంగీకార్య మని తలఁచినది.

కాఁగా 'ఈరుచుబ్బుకందుదువ్వవడ్డల కెనవర్ణకం బగు నగుచో ఈర్చుబ్బుల చబలకు పకారం బగు' నని చెప్పవచ్చును. ఎనప్రత్యయము వచ్చునీధాతువులలో ఈరుచు, ఉబ్బు అనుధాతువులు రెండింటిలో మాత్రమే చకారబకారములు గలవు. ఈర్చుబ్బులచకారబకారంబులకు ననుటవలన నింక దేనియందో పకారము రాకుండుట యనుప్రయోజన మిట లేదు. కావున 'అగుచో చకారబకారంబులు పకారం బగు' ననియో 'పకారంబు చబల కగు' ననియో చెప్పుటవలన లాఘవము గల్గును.

ఇట వ్యాఖ్య 'ఈర్పెన. తత్స.37 చే ఈర్పెన–ము తత్స. 57 ఈర్పెన. అనురీతిగా నీరూపముల కన్నింటికి ముందుగా ముపర్ణకము చేసి లోపింపఁజేసినది. కానీ యిది సరి కాదు. ముందు ముపర్ణక మె ట్లయినది? అమహత్త్వమునుబట్టి యైన దనవలె. ఆచ్ఛికశబ్దముల కమహత్త్వము ననుసరించి ముపర్ణకము రాదు. ముందు

మువర్ణక మయి పిదప ము లోపించుటకు స్త్రీసమత్వాతిదేశము కారణ మనవలెను. స్త్రీసమత్వాద్యతిదేశము ప్రాతిపదికలకే కదా. అట్టియెడల ఈర్పెన యనునది స్త్రీసమ మయినపుడు ముందు మువర్ణక మెట్లు వచ్చును? క్లీబసమత్వాతిదేశముచే మువర్ణకం బగు నన్నసూరివచనములనుబట్టి యాచ్ఛికములకుఁ గ్లీబసమత్వాతిదేశము లేనిదే మువర్ణకము (అమహత్త్వమునుబట్టి) రాదు. కాఁగా ఈర్పెన+సు అనురీతిగా సువిభక్తి చేసి, కృదంతము లివి ప్రాతిపదికము లై స్త్రీసమము లవుటంజేసి సులోపముచే ఈర్పెన యిత్యాదిగా నవు ననునది సరి యైనప్రక్రియ. (బా.సూ.)

## పురవర్ణకము

**4. పువర్ణకంబు కాచు దాచు దాయ్యాదుల కగు.**

కాచు దాచు దాయు మొద లగుధాతువులకు 'పుర' అనుప్రత్యయ మీ లక్షణమునుబట్టి యయి, 'కాపురము' మొద లగురూపము లగును.

వ్యాఖ్య లెల్లయవియు నీయర్థము నిట్లు నిరూపించినవి. సంజీవని మాత్రము విశేషము పేర్కొన్నది. కాపురము అనుదీనికి రక్షించు అనునర్థము గల కాచుధాతువు మూలము గాదు. అందు బిందువు లేదు. బిందువు గల కాచుధాతువునకుఁ గాఁగఁజేయు అని యర్థము. ఇది కాఁగుధాతువు ప్రేరణరూపము. దీనినుండి యేర్పడిన దన్నచోఁ గాపురము అనుదాని కర్థము కుదురదు. సూ.ని. కాపు అనువిశేష్యము నుండి కాపురము అనురూప మేర్పడినట్లు పేర్కొన్నది. అపు డది తద్ధితాంత మవునే కాని కృదంతము గాదు అని సంజీవనీయభిప్రాయసారము. (వ్యా.సం.స.1747) ప్రౌఢ. కాచుధాతువునకు పురప్రత్యయము చేసి కాపురము అనుదానిని సాధించుట సరి గా దని స్పష్టముగాఁ బేర్కొనకున్నను వఝులవారి యభిప్రాయ మదియే యనఁదగును. ఈయభిప్రాయ ముచితముగానే యున్నది. కావున సూత్రమునఁ గాచు ధాతువు తొలఁగింపఁదగియున్న దని గ్రహింపవచ్చును.

కాపు అనుదానికి కాపురము అని యర్థము. శ.ర., సూ.ని. కావున కాపు శబ్దముపై స్వార్థమునందు రవర్ణము తద్ధితముగా నైన దని యూహింపఁదగును. నివాసము అనునర్థమునందే యిట స్వార్థికము. (కాపు శబ్దమునకు గృహస్థు అనియు

నర్థము గలదు. దొడ్డి బెట్టిన వేలుపుగిడ్డి కాపు. (శ.ర.) గృహస్థుయొక్క ధర్మము గార్హస్థ్యము. అనఁగా సంసార మనవచ్చును. అట్టియెడల నీయర్థము (గృహస్థ) భావార్థమునందు రప్రత్యయ మయిన దనఁదగును.)

కాఁగు ధాతువు ప్రేకరణరూప మై కాఁచు ధాతువునకుఁ బైని పువర్ణకము (బాల.కృత్.11) రాఁగా కాఁపు అని యగును. దానికిని గాఁచుట యనియే యర్థము కాఁపురము అనుదానికి తపనము, కాఁచుట అనురీతియర్థములు లేవు. కావున దీనికి కాఁగు, కాఁచు అనుధాతువుతో నెట్టిసంబంధమును లే దనక తప్పదు.

దాగు ధాతువుయొక్క ప్రేరణరూప మయిన దాచునకు దువర్ణకంబు (బాల.కృత్. 20) రాఁగా దాపుడు అని యవును. పురప్రత్యయము విశేషము గావున విధింపఁ దగినది. దాపురము అనుదీనికి దాచుట యని యర్థము. పువర్ణక మిట భావార్థమునం దయినది (వ్యా.సం.స.1746) దాపురము = దాచినసొమ్ము. 'ఈ పెట్టియ నాదుదాపురముగా' (శ.ర.,సూ.ని.) అనుచో పువర్ణక మిట దాచుధాతువుపైని గర్త్రర్థమునందు నవుట గమనింపఁదగును.

ఈయర్థముననే దాపన అనురూపమును శ.ర. లో నీసూత్రకర్తయే చూపెను. కానీ దానిని సాధింపలేదు.

ఈధాతువు నప్పాదులలోఁ జేర్చుకొన్నచో దాచు+న అని యుండఁగా నజీ జీత్తు గావున ము త్తగుటచేఁ దత్పరకత్వమున ఖండబిందువుమీఁదియాచకారము పకార మయి, యత్వముతో 'దాపన' యని యేర్పడును. వడ్డన అనుదానివలెనె దాపన యనుదానిని గూడ నీయుద్దేశ్యముతోనే సూత్రకర్త యిట సాధింపలే దేమో.

కానీ సూరి యప్పాదిసూత్రసందర్భమున నిత్యాదు లనలేదు. ఇట్టివి నియత గణము లని ఘం. భావించిన దందుకే. బ.సీ. ఉలియ్యాదులకు 'పు' చెప్పె నని యావ్యాఖ్య పేర్కొన్నది. అట్టియెడల దాచు, వడ్డలను అప్పాదులలోఁ జేర్పకున్న దాపన, వడ్డన యనురీతిరూపములు గానేరవు. దీనిని బ్రత్యేకముగా నీతఁడు సాధింపలేదు. సూరిసూత్రములచే నివి సిద్ధించు నన్నచో ఉలియ్యాదులకు వు విధానము వ్యర్థము కాఁగలదు.

ఈయర్థమున దాపటికము అనురూపము సయితము గలదు. దీనిని శ.ర.

దాపన+టిక అని చూపినది. (386) టిక ప్రత్యయము పర మైనపుడు నలోప మెట్లు? ఈరూపము నీలక్షణముచే సిద్ధించుట లేదు. దాపన+టిక అని విభాగించుటకంటె దాపు+ టికము అని విడఁదీయుట యుక్త మని తోఁచుచున్నది. దాచు ధాతువు కృదంతరూపముగా దాపు అనుదానిని శ.ర. చూపలేదు. ప్రేరణార్థ ధాతువుగానే పేర్కొన్నది. అందుకే దాపన+టికము అని విభాగించియుండవచ్చును. కాని సూ.ని. దాచుట యనుభావార్థమున దాపు అనుకృదంతరూపమును జూపినది. దాపు దాచు దాచుట దాపరము. ఇంక దా పేల? (సూ.ని.) కావున దాపు+టికము అని కాఁగా 'నుత్వంబున కత్వంబు టికంబు పరం బగునపు డగు' ననుదానిచే నత్వ మయి దాపటికము అనురూప మగును. దాపన+టికము అని తలఁచినను దాపు+టికము అని తలఁచినను నీయది తద్ధితాంతమే. టిక ప్రత్యయమును సూరి భావార్థకముగనే చెప్పెను. ఇట నీయది స్వార్థమునం దవుచున్నది. దాపన - దాచుట శ.ర. విభాగము పక్షమునను నిది స్వార్థమునందే యైన దనక తప్పదు.

అట్టియెడల దాచునకు టికజి అనునది కృత్తుగా జెప్పుకొనవచ్చు. ఏ మైనను దీనికి శ.ర. గాని సూ.ని. కాని ప్రయోగములు చూపలేదు. సూ.ని.,శ.ర. వాక్యమే ప్రమాణముగాఁ జూపి దాపన+టిక మని యావిభాగమే చూపినది. వ్యవహారమునం దిది ప్రచురము. టికజి విధానమే యుచిత మేమో.

దాయు ధాతువుపయి పువర్ణకము రాఁగా, దాపురము అని యగును. ధాతువు ననుసరించి ఇట బిందు వుండదు.

వీనిపై ఘం. తత్స. 39 చే ముప్రత్యయ మవు నన్నది. కృదంతము లివి ప్రాతిపదికము లయినవెంటనే ముువర్ణకము నందవు. ఇంక ఆచ్ఛి 1. సూత్రముచేఁ గ్లీబసమత్వము కలిగినపిదపనే ముువర్ణక మవును. కు.పం.వ్యాఖ్య యిది గుర్తించినట్లు గానవచ్చును. 'పురవర్ణకాంతము క్లీబసమంబు గాన మ్వాగమ' మని (150) పేర్కొన్నది. ఇటు ముువర్ణ మాగమ మనుట యుక్తము గాదు. ఇది ప్రథమైకవచనమున నిది (ము)వర్ణకము.

సర్వ. ఇ వన్నియు నపుంసకతుల్యము (528) లన్నది. అదియు యుక్తమే.

సూత్రకర్త కాచు దాచు దాయ్వాదు లనెను. కాని ఆదిశబ్దముచే గ్రహింపఁ

బడు దానిని నిఁక నొక్కటి చూపలేదు. అది య ట్లుండఁగా నెట్లును నాదిశబ్దము ప్రయుక్త మవుచుండఁగా ధాతువులను మూఁడింటిని నిర్దేశింప నేల? పురవర్ణకంబు కాచు ప్రభృతుల కగు ననఁదగును. మిగిలినవి లక్ష్యములనుబట్టి స్పష్టము లవును. కాచునకు పురవర్ణకము చెప్పుట సరి కాదు. కావున దాచుప్రభృతుల కనియో లేక 'పురవర్ణకంబు దాయ్యాదుల కగు' ననియో చెప్పి దాపురము, కాపురము మొ. అని వివరించినను దప్పు లేదు. పురవర్ణక మగునవి యింక నే మేని గల వేమో వెదువలసియున్నది. లేనిచో పురవర్ణకంబు దాచుదాయుల కగు నన్నఁజాలును.

పురవర్ణకాదిపకారము పరము గాఁగా బాల.కృత్.2 సూత్రముచే చయలు లోపించును. సుగమ. చకారము యకారము అనుట 'చు,యు' అనువానిలోపము నుద్దేశించి యనవలెను. వ్యంజనమాత్రలోపము నుద్దేశించిన లక్ష్యలక్షణవిరుద్ధ మవును.

## మతివర్ణకము

**5. ఎక్కుదిగులకుం బ్రేరణార్థంబున మతివర్ణకం బగు. అగుచో నెగు ఎక్కున కాదేశం బగు.**

కు.పం. ప్రేషణార్థము అనుపాఠమును జూపి పైకి పంపుట, క్రిందికి పంపుట యని యర్థమును జూపెను. (150) మిగిలినవ్యాఖ్య లెల్లను బ్రేరణార్థ మనుపాఠమునే చూపినవి. ఎక్కు దిగు అనుధాతువులకుఁ బ్రేషణార్థమును వివక్షించుట సంభవము కాదు. ధాతువులయస లర్థ మే మగును? శ.ర.లో నీ గ్రంథకర్త ఓడకు సరకు లెక్కించుట, దించుట యనురీతిగా నర్థమును జూపెను. ఎక్కించుట, దించుట యనునర్థముల ననుసరించి ఎక్కుదిగులపైఁ బ్రేరణార్థమునే సూత్రకర్త యుద్దేశించుట స్పష్టము. ప్రేషణార్థ మన్న కు.పం. పంపుట యని యర్థము చేయుట ఈ.శ.ర.కును ననుగుణముగా లేదు. కావునఁ బ్రేరణార్థముం గూర్చి సర్వ. 'బాలవ్యాకరణము మొదటిసూత్రమువృత్తియందు భావకర్తృకర్మాద్యర్థములు కృత్తులకు కల వని తెలుపఁబడినది. ఆదిశబ్దముచేత ప్రేరణార్థకమును సైతము స్వీకరింపవచ్చును. ప్రస్తుతలక్ష్యములు ప్రేరణార్థమును దెలుపు' (530) నన్నది.

కానీ యిటఁ గేవలము ప్రేరణార్థమును జెప్పుట యసమంజసము. అట్టి యెడల ఎగుమతి అనుదానికి ఎక్కించు అనియు, దిగుమతి అనుదానికి దించు అనియు మాత్రమే యర్థ మవును. ప్రేరణార్థమున బాల. ఇంచుగాద్యాగమములు చెప్పినది. తదంతములపై లడాదు లవును. అట్లే యిటఁ బ్రేరణార్థమును మాత్రమే చెప్పుకొన్నచో ఎగుమతిచున్నాదు. ఎగుమతిట ఇత్యాదిగా దీనిపై లడాదులు కావలసి యుండును. ఎగుమతి యనునది కేవలము ప్రేరణార్థకము కాదు. ఎక్కించుట యనురీతిగాఁ బ్రేరణార్థముతోఁ గూడిన భావార్థము నిచ్చుచున్నది. సంజీవని వీనిని భావార్థకములుగాఁ బేర్కొనుట (వ్యా.సం.స. 1747) గమనింపఁదగును.

ఈతత్త్వ. ప్రేరణార్థకము లని చెప్పి ఎక్కించుట యనురీతిగాఁ బ్రేరణార్థము తోపాటు భావార్థమును గూడఁ జూపుట విరుద్ధము. (374) ఇట్లే సుగమ. (237)

ఇట లోపము సూత్రమునందలిదే యనక తప్పదు. సూరి త్రోపు, త్రోపుడు ఇత్యాదిస్థలములలో తోచు మున్నగురీతిగాఁ బ్రేరణార్థకము లయినధాతువులనే చూపి దానిపైనే భావాద్యర్థకములుగాఁ గృత్తులను జెప్పెను.

ఇటఁ గృదంతప్రకరణమునఁ జెప్పుటచేఁ గృత్తుగా గ్రహింపవలె. ప్రేరణార్థము మాత్రమే కల దనుట విరుద్ధము.

నిజమున కిట ఎక్కుదిగులపై మతి ప్రేరణార్థమునం దవు నని చెప్పరాదు. ఇంక మతివర్ణకము భావార్థకమే. కానీ యటఁ బ్రేరణార్థమును గలదు గదా. అది యెట్లు? అనఁగా ఎక్కించు, దించు అనురీతిగా ధాతువులను బ్రేరణరూపముతోనే నిర్దేశించి, ఎక్కించు దించులకు మతివర్ణకం బగు, నగుచో వాని కెగుదిగు లాదేశంబు లగు' నని చెప్పుట యుచితము. లేదా ప్రేరణార్థము సయితము మతికే చెప్పఁ దలఁచికొన్నఁ ప్రేరణార్థవిశిష్టభావార్థమునందు వచ్చు నని చెప్పుకొనవలసి యుండును. కాని ధాతువునే ప్రేరణార్థకముగాఁ జూపి మతిని (భావార్థమున) విధించుకొనుట సూరిమార్గము. కృత్ప్రత్యయముల కర్థము నిర్దేశింపఁబడుట బాల.లో వలెనె ప్రౌఢ.లోను లేదు. కావున నీయది భావార్థక మని చెప్పలే దనియు, నయ్యది యథాప్రయోగముగనే యితరస్థలములందువలె గ్రాహ్య మనియు నిటఁ బ్రేరణార్థము విశిష్ట మగుటచేతనే సూత్రకర్త పేర్కొనె ననియుఁ దలఁపవలె. కాని యట్టియెడలఁ

ప్రేరణార్థంబున మతివర్ణకం బని చెప్పినచో మతివర్ణకమునర్థము ప్రేరణార్థము మాత్రమే యని తెలియవచ్చును. అందువలననే కదా సర్వ. కర్త్రాద్యర్థములవలెనే ప్రేరణార్థమును గృదర్థముగా భావించినది. అది పొరపాటు.

సూత్రకర్త 'ఇట్ల – ఎగువ' యన్నాఁడు.

దీనిం గూర్చి కు.పం. 'వీనికే మతివర్ణకమే కాక 'వ' వర్ణకమును అర్థాంతరమునం గూడును. ఎగువ, దిగువ (215) యనెను. (వ్యా.సం.స.1747) పైవివరణముచే వీనికే వ ప్రత్యయము చెప్పుట కు.పం. తాత్పర్య మనవలెను. వీనికే యని యీవ్యాఖ్య పేర్కొనఁగా సర్వ. నడవ అని యిం కొకటి చూపినది. వ ప్రత్యయ మవుటయే సూత్రకర్త యుద్దేశించినచో ఎగువతోపాటు దిగువ కూడఁ జూపవలయును గదా. ఎగువ మాత్రమే చూపుటచే దాని కొక్కదానికే వవర్ణక మవు నని యర్థ మవును. కాఁగా ఇట్ల యనుటలో సూత్రకర్తయభిప్రాయము వవర్ణకము పర మగునపుడు సయితము ఎగు ఎక్కున కాదేశ మగు ననియే గ్రహింపవలయును. మతి ప్రేరణార్థమునఁ గాఁగా 'వ' అర్థాంతరమునం దవును. కు.పం. ఇది గుర్తించియే యున్నది. కావున వ ప్రత్యయము పర మైనపుడును ఎగు ఎక్కున కాదేశ మగు ననియే (ఘం.229) సూత్రకర్తయుద్దేశ్యము. ఎగుడు (సర్వ.534) దిగుధాతువు విషయమున నట్టివిశేష మచ్చుటఁ జెప్పను లేదు. దిగువ అనుచో లేదు గూడ. కావుననే దిగువ ఉదాహరింపలేదు. వప్రత్యయ మవునవి యేవో చెప్పుట సూత్రకర్తయభిప్రాయము కాదు. కావున నడవ ఇత్యాదులలో నుంట సూత్రకర్త సమ్మతము గా దని తలఁచుటకును వీలు లేదు. తెగువ, చొరవ మొ. నారా.415.

'ఎక్కు ప్రభృతులకు వవర్ణకం బగు' నన్నయంశమును సూత్రించిన బా గుండెడిది.

ఇట సుగమ. ఎక్కుధాతువునకు ఎగు ఆదేశ మై వ ప్రత్యయము చేరి, ఎగువ అగు' (237) ననుట సక్రమము గాదు. వ ప్రత్యయమును ముందు చేసి, యాపిదప ఎగు ఆదేశము చేయుట సక్రమము. వ ప్రత్యయ మిది కర్త్రర్థకము.

ఎగువ ప్రాతిపదికము. బా.తత్సమ.39 ఎగువ+ము. తత్సమ. 57 చే ఎగువ (ఘం.229) అనుప్రక్రియ సరి కాదు.

ఎగువ ప్రాతిపదిక. ఆచ్ఛి. 1 సూ.చే స్త్రీసమత్వము. తత్స.57చేఁ బ్రథమైకవచన (సు)లోపము. అని ప్రక్రియను గ్రహింపఁదగును.

## వువర్ణకము

**6. వువర్ణకం బులియ్యాదుల కగు.**

ఉలియు మొద లగుధాతువులకు వు అనుప్రత్యయము వచ్చును. ఉలియు+వు అని కాఁగా బాల.కృ.2 సూ.చే యువర్ణము లోపించి 'ఉలివు' అని రూప మవును.

'సూత్ర మియ్యది వువర్ణం బులియ్యాదుల కగు నని పూర్వముద్రణములం దచ్చుత ప్పనియు వువర్ణక మని యుండవలె' ననియు కు.పం. పేర్కొన్నది. (150) వువర్ణక మనుపాఠమునే మిగిలినవ్యాఖ్య లెల్ల స్వీకరించినవి. ప్రత్యయమె యైనను వువర్ణ మనుట దోషము గాదు. (నువర్ణంబు ద్వితీయ మొ.) కాని యిట నెల్లెడల వ్యాకర్త వర్ణక మనుచునే పేర్కొనెను గావున నిటఁ గూడ వర్ణక మనియే చెప్పి యుండు నని యూహించుట సక్రమమే.

ఉలియ్యాదు లని యాదిశబ్దమును జేర్చెనే కాని వే ఱొక్క దాని నిట సూత్రకర్త యుదాహరింపలేదు. కానీ శ.ర.లో 'తనివు. కొన్ని వ్రాఁతపుస్తకములయందును అచ్చుపుస్తకములయందును ఈపాఠము కనఁబడుచున్నది. దీనిని సాధువుగానే గ్రహింపవచ్చును. అప్పుడు ఇది ఉలివు లోనగువానివంటి దని తెలియవలె' ననెను. మఱి యిట నేల చూపలేదు? అటఁ గూడ ఉలివు లోనగున వన నవి యేవియో. సూ.ని. తెలువు, తెల్వు, తెలివి. తెలియు క్రాల్గన్నుల తెలివును, ఆననము తెల్వు అని చూపినది. దీనిని శ.ర. చూపలేదు.

'వువర్ణకంబు మన్వాదుల కగు' అనుబాలవ్యాకరణలక్షణముచేతనే యీవువర్ణకము సిద్ధించును గావునఁ బ్రస్తుతసూత్ర మనవసర మని కు.పం.(150) సుబో.(267) సర్వ. (532) వ్యాఖ్యలు పేర్కొన్నవి.

తత్త్వ. అంత్యవర్ణలోప మవుధాతువులు మన్వాదులలోఁ జేర వని యందలి యుదాహరణములనుబట్టి తోఁచుటచే నీసూత్ర మారంభింపఁబడిన దని భావించుటను, కాచు ప్రభృతులలో సూరి యుదాహరించుటను బేర్కొని, ఘం. తిరస్కరించినది. రెండవముద్రణమున నాయభిప్రాయమును వదలి తత్త్వ. ఈ సూత్ర మనవసర మన్నది. (375)

కానీ ఘం. ఈసూత్రము సార్థకమే యని భావించినది. 'వువర్ణకము మన్వాదులకు

విధింపఁబడినను ఉలియుధాతు వందుఁ జూపఁబడలేదు గావున నందుఁ జేరు ననుట కీసూత్రము రచింపఁబడిన దని (230) ఘం. అభిప్రాయము. బా.కృదంత. 17వ సూత్ర మాకృతిగణముగఁ బేర్కొనలేదు గాన నిట ఉలియు ధాతువునకు విధింపఁబడెను. (332). ఇట నులియ్యాదుల కనఁగా నులియున కొక్కదానికే గాదు. మొద లగునవి యింకను గలవు. వానికిని వువర్ణకము విధింపఁబడినది. ఉలియు అనునొక్కదానిని జేర్చుకొ మ్మని చెప్పిన మొద లగువానిలో మిగిలినవి యే మగును? కాఁగా ఉలియు అనునది మన్వాదులలోఁ జేర్పఁదగిన దనునభిప్రాయము సూత్రకర్తకు లే దనవచ్చును. ఉన్నయెడల సూరి చూపినమన్వాదులను స్ఫురింపఁ జేయుచు 'వువర్ణకం బులియ్యాదులకు నగు' నని సముచ్చయార్థక'ను'శబ్దమును బ్రయోగించియుండెడివాఁడే యనవచ్చును.

ఇంక సూరి ఇత్యాదు లని చెప్పక పోవుటంబట్టి యయ్యవి నియతగణము లనుచో నట విధింపఁబడినప్రత్యయములనే తిరిగి విధింపవలసివచ్చును.

అడుక్వాదులను సూరి ఇత్యాదు లనలేదు. ఆకృతిగణము. చదువు, అడలు, ఒడ్డు, కలుపు, పట్టు మున్నగు వానిని వ్యా.సం.స. చూసినది. (1743) ఇట్టి వె న్నే గలవు. (కందు, ఉబ్బు మొ.)

మన్వాదులలో తొడరువు (1737) అత్తుగడ – (శ్రీరం.మా.8.28, నారా. కృత్ 407) ఇంక అప్పాదులలో వడ్డ, దాచు చేరవలె. గీర్వాదులు – చేద, కట్ట, చుట్ట మొ. (నారా. 424) ఇవర్ణము కూయి. (నారా. 426) టువర్ణకము– గీటు గీచు, మాటు – మాఱు (నారా.417) ఇట్టియెడ వానిని నియతగణము లని భావించుట యుక్తమా? ఇత్యాదులు అననట్లే ఇవి మన్వాదులు, ఇవి అడుక్వాదులు, అనురీతిగా నియతముగను బేర్కొనలేదు. ఇవి ఇఁకాదులు, ఇవి యాల్వాదులు అన్నట్లుగా నిచ్చట నేల చెప్పలేదు?

కావున నీసూత్రము స్పష్టతకే యనఁదగును. ప్రస్తుతలక్షణమును సార్థకము చేయుద మని సూరి యిత్యాదు లననిచోట్లు నియతగణము లనుచో నిట్టిసూత్రములు పెక్కులు చెప్పవలసివచ్చును.

## వలివర్ణకము

**7. కాచువీచులకు వలివర్ణకం బగు.**

కాచు+వలి, వీచు+వలి, అని కాఁగా బాల.కృత్.2 సూత్రముచే చులోప మై కావలి, వీవలి యని యగును.

ఇట కు. పం.వ్యాఖ్య వీవలి = గాలి (వీచునతఁడు) కావలి = రక్షణము (రక్షకుం డని కాదు) అనునీషదర్థభేదము గల (150) దని పేర్కొనెను.

కానీ తత్త్వ. "ఈప్రత్యయము కర్త్రర్థమునందు వచ్చె ననుట యుచితము. కావలి యనఁగా గాచువాఁ డనియు, వీవలి యనఁగా వీచువాఁ డనియు నర్థము" (375) లన్నది.

ప్రస్తుతసూత్రకర్త శ.ర.లో కావలి అనఁగా రక్షణము అని భావార్థమును, వీవలి యనఁగా వాయువు, గాలి అని కర్త్రర్థమును జూపెను. ఈ శ.ర. ననుసరించియే కు.పం.వ్యాఖ్య కాచునకు భావార్థమునందును, వీచునకుఁ గర్త్రర్థమునందును వచ్చు నని నిర్ణయించియుండును.

కానీ సూ.ని. కావలి విశేష్య మైన రక్షణము అనియు, విశేషణ మైనచో రక్షకుఁ డనియుఁ బేర్కొన్నది. కావలి నే నుండఁగ, అనుటచేఁ గావలిలో వలి కర్త్రర్థమునందు నవుట దెలియవచ్చును. కాఁగాఁ గావలి యనుచో కు.పం. (శ.ర. కనుగుణముగా) చెప్పినట్లు కేవలము భావార్థ మని కానీ, తత్త్వ. పేర్కొన్నట్లు కేవలము కర్త్రర్థ మని కానీ నిర్ణయింపక కర్తృభావార్థములు రెంట నవు నని గుర్తింపఁదగును. కాపువలెఁ గావలియు నుభయార్థకము (కర్తృభావములు).

ఇంక వీవలి యనుచో వీచుట యనుభావార్థము లేమింజేసి వీచునకు వలి కర్త్రర్థమునందు మాత్రమే యవును.

ఒకే సూత్రమున విధింపఁబడిన ప్రత్యయ మొక్కయర్థమునందే యవు ననురీతి నియమము లేదు.

'కవర్ణకం బలుగ్వాదుల కగు' నను (బాల.కృత్.3 సూ.చే నవుప్రత్యయము మునుక యనుచో భావార్థకము, మాక యనుచోఁ గర్త్రర్థకము, ఎఱుక యనుచో

తెలియుట యనునర్థమున భావార్థకము, జ్ఞానము ఇత్యాద్యర్థములందుఁ గరణార్థకము (వ్యా.సం.స. 1713) ఇట్లే పైకృత్ప్రత్యయములయర్థవిశేషములను వఝలవారు చక్కగా నిరూపించిరి.

కృత్ప్రత్యయములయర్థవిశేషములు నిర్ణయించుట మిక్కిలి గౌరవహేతువును పఠితలకుఁ గ్లేశకారియు నవుటచేతనే యర్థమును నిర్ణయింపక ప్రత్యయము మాత్రమే చెప్పుట జరిగినది. అర్థము మహాజనవ్యవహారానుసారముగా గ్రహింపవలె ననియే లాక్షణికులయభిప్రాయము.

కృత్ప్రత్యయముల నివి మాత్రమే ప్రౌఢ. పేర్కొనెను. ఇంకఁ దద్ధిత పరిచ్ఛేదాంతమున 'ఇతరంబులు ప్రయోగదృష్టంబులు గ్రాహ్యంబులు' అన్నట్లుగా నిట నట్టిసూచన యేమియుఁ జేయలేదు. అట్లు చెప్పిన నుచితముగా నుండెడిది.

'ఇత్యాదులు మహాజనవ్యవహారంబున నెఱుంగునది' యనుబాలవ్యాకరణమున కివి పూరణములు (ఘం. 230)గా నుద్దేశించినచో న ట్లెఱుంగఁదగినవి యివి మాత్రమే యగునా? కృత్ప్రత్యయము లింక లేవా? వీనితో సమగ్రముగాఁ జెప్పఁ బడినట్లా? సమగ్ర మని ప్రౌఢవ్యాకర్తయుఁ దలఁచియుండఁడు. కావునఁ జివరఁ దద్ధితపరిచ్ఛేదాంతమునందువలె నితరముల యెఱుకకు సూచన చేసిన నింతటితోఁ గృదంతనిరూపణము పూర్తి కాలే దనునంశము స్పష్ట మయియుండెడిది.

**ఇది కృదంతపరిచ్ఛేదము.**

# ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యానుశీలనము

## వాక్యపరిచ్ఛేదము

చింతామణ్యాదు లగుతెలుఁగువ్యాకరణములయందు వాక్యమును గూర్చి విశేషములను దెలుపుట కొకపరిచ్ఛేదము ప్రసక్తము గాలేదు. ఇంకఁ బ్రత్యేక పరిచ్ఛేదము లేకున్నను వాక్యవిషయములను వివరించుటయు నావ్యాకరణము లందు విశేషముగాఁ గానరాదు.

బాల.కు ముందే (1856) రచింపఁబడిన లఘువ్యాకరణమునందుఁ (పీఠిక. 6.పుట) గ్రియాపరిచ్ఛేదమున వాక్యవిషయములు గొన్ని ప్రస్తావింపఁబడినవి. లఘువ్యాకరణము తరువాత కొంత మార్పఁబడినట్లు గ్రంథకర్త ప్రస్తావనమువలన స్పష్ట మవును. మొదటిప్రతి లభ్యము గాకున్నను మొదట నీవాక్యవిషయము లం దుండియుండవచ్చును. (ల.వ్యా.పీఠి.8) అయినను వాక్యవిషయములను నిరూపించుటకుఁగా నొకప్రత్యేకపరిచ్ఛేద మారంభింపఁబడుట ప్రౌఢవ్యాకరణమునం దొకవిశేషముగా గుర్తింపవచ్చును.

అందు మొదట వాక్యలక్షణ మిట్లు పేర్కొనఁబడినది.

### వాక్యము

**1. వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగునర్థము గలయాసత్తియుక్త పదసముదాయంబు.**

'వాక్యం స్యా ద్యోగ్యతాకాంక్షాసత్తియుక్తః పదోచ్చయః' అనుసాహిత్యదర్పణ లక్షణమున కిది యనుసరణ మగుట ప్రసిద్ధము.

యోగ్యత, యాకాంక్ష కలిగినయర్థములు గలవియు నాసత్తి గలవియు నైన పదములసముదాయము వాక్య మనఁబడును.

**యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పరసంబంధమునందు బాధ లేకుండుట.**

'యోగ్యతా నామ పదార్థానాం పరస్పరసంబంధే భాధాభావః' అన్నది మూలము. అనఁగాఁ బదములయొక్క యర్థములు పరస్పర మన్వయించుటలో బాధ యున్నచో నయ్యది వాక్యము గానేరదు.

**'నిప్పుచేఁ దడుపుచున్నాఁడు'**

అనుచో నిట్టి బాధ గలదు. కావున యోగ్యత లేమి నీయది వాక్యము గాదు. 'పదోచ్చయ స్యైత దభావే ఽపి వాక్యత్వే, వహ్నినా సించతి ఇత్యా ద్యపి వాక్యం స్యా' త్తని మూలము. నిప్పుచేఁ గాల్చుచున్నాఁడు. నిప్పుచే ననునది (కరణముగా) అన్వయించుటలో బాధ లేదు గావున నయ్యది వాక్య మగును.

**ఆకాంక్ష యనఁగా నిలుపుదల లేక పయిపయిం బోయెడిపదార్థములమీఁది యాదరము. అది వినువారికిఁ దెలిసికొనవలయు ననెడియపేక్షారూప మయినది.**

అని సూత్రకర్తవివరణము. "ఆకాంక్షా నామ ప్రతీతిపర్యవసాననిరీక్షణః. స చ శ్రోతుః జిజ్ఞాసారూపః" అని మూలము (ఘం. 232) కాఁగా నిట్టి యపేక్షలేనిచో (నాకాంక్ష లేదు గావున) నయ్యది వాక్యము గానేరదు. **గోవు గుఱ్ఱము.**

నిరంకాంక్షస్య వాక్యత్వే గౌ రశ్వః పురుషో హ స్తీత్యాదీనా మపి వాక్యత్వం స్యా' త్తని మూలము. (తత్త్వ. 377)

యోగ్యత, యాకాంక్ష యనునవి పదములయర్థమునకు సంబంధించినవిగా 'యోగ్యతాకాంక్షా సహితం బగునర్థము గల' యనుసూత్రభాగము స్పష్టము చేయుచున్నది.

ఇంక ఆసత్తి యనునది పదములకు (శబ్దములకు) మాత్రము చెందిన లక్షణముగాఁ బ్రౌఢ. పేర్కొనెను. 'ఆసత్తియుక్తపదసముదాయం' బని సూత్రమునను

**ఆసత్తి యనగాఁ బదములచేరిక.**

అనువివరణమును దీని కర్థముతో సంబంధము లేకుండుటను సూత్రకర్త పేర్కొనెను.

'ఆసత్తి ర్బుద్ధ్యవిచ్ఛేదః' అని మూలము. ఇట మూలమునఁ బదములయర్థము

యొక్క యవగతియందు (విచ్ఛేదము) వ్యవధానము లేకుండుట యనునర్థములో నాసత్తి యనఁగా నవ్యవహిత మైనయర్థావగతి యని యర్థము. కానీ ప్రౌఢ. యోగ్యతాకాంక్ష లర్థసంబంధులుగా నిరూపించి, యాసత్తిని మాత్రము వేఱు చేసె. 'వాక్యత్వే ఇదానీ ముచ్చరితస్య దేవదత్తశబ్దస్య దినాంతరోచ్చారితేన గచ్ఛతి పదేన సంగతిః స్యాత్' అని పేర్కొనబడినది.

**'దేవదత్తుం డని యీరోజునను వెళ్లుచున్నాఁడని మఱి యొకనాఁడును జెప్పిన నాపదార్థములందు బుద్ధికి విచ్ఛేద మైపోవుటచే నయ్యది వాక్యము గా దని యభిప్రాయము.**

ఇటఁ బ్రౌఢ. 'బుద్ధిమఱపు లేక నేఁడు దేవదత్తుఁ డని చెప్పి మఱియొకనాఁడు పోవుచున్నాఁ డని చెప్పుటచేతను బదసముదాయము వాక్యముగా నేర్పడినను, నది వాక్య మని చెప్పఁదగినది కా దని తాత్పర్యము' పేర్కొనెను. 'బుద్ధిమఱపు లేక' యనుట యిందలివిశేషము. అనఁగా బుద్ధివిచ్ఛేదము లేకున్నప్పటికిని బదములచేరిక లేనిచో నయ్యది వాక్యము గానేర దని ప్రౌఢ. విశేషముగాఁ జెప్పుచున్నది. నిజమున కట్టివ్యవధానముతోఁ బ్రయోగించునపుడు బుద్ధిమఱపు లేకుండుట వక్తకు సంభవ మని యూహించినను శ్రోతకు సంభవ మగుట యనుమానము. ఒకవేళ న ట్లున్నప్పటికిని నది వాక్యము గా దనుటకు సూత్రకర్త యిట్లు పేర్కొనె నని గ్రహింపవచ్చును. అందుకే యర్థము వివరించునపుడు సయితము 'బుద్ధి విచ్ఛిన్నము గాకుండుట' యని పదార్థమునకు సంబంధించినట్లుగాఁ జెప్పక పదములే యాసన్నము లైయుండవలె ననెను.

కాఁగాఁ బదములయర్థమునందు యోగ్యతయు, నాకాంక్షయు నుండి శబ్దముల నాసత్తియును గల్గుచో నాపదసముదాయము వాక్య మగు నని వాక్యలక్షణము.

## వాక్యభేదములు

ఇంక నావాక్యములందలివిశేషముల నిట్లు వివరించుచున్నాఁడు.

**వాక్యము లందుఁ గొన్ని క్రియాన్వయము గలవి. కొన్ని తదితరాన్వయము గలవి.**

ల.వ్యా. "ఏకక్రియాన్వితపదసముదాయవాక్యంబును కేవలపదసముదాయ

వాక్యంబును నని వాక్యంబు ద్వివిధంబు. ఏకక్రియాన్వితపదసముదాయవాక్యము. రాజు శత్రువులను సంహరించెను. కేవలపదసముదాయవాక్యము. వచ్చెడువాఁడు రాముఁడు. (క్రియా. 66) అని వివరించినది. ఈప్రౌఢ. వివరణము తదనుగుణముగా నున్న దనవచ్చును.

సుగమ. తదిరాన్వయము గలవాక్యమునకు రామునియొక్క గుఱ్ఱ మనునది (239) చూపుట సరి కాదు.

క్రియాన్వయము గలవి యని క్రియాపదము ప్రస్తావింపఁబడుటచేఁ గ్రియ లన నేమో వివరించుచున్నాఁడు సూత్రకర్త.

**క్రియ అనగా వర్తమానాద్యర్థకము లయినసమాపకక్రియలు.**
**క్త్వాతద్వ్యతి రేకశతృతుమున్చేదానంతర్యార్థకము లసమాపకక్రియలు.**

దీనిం గూర్చి కు. పం. 'సమాపకములు అసమాపకములు అనుద్వైవిధ్యము క్రియలకును (151) అని పేర్కొన్నది. సుగమ. (23) సర్వ. (567) సుబో. (270) వ్యాఖ్యలు నిట్లే క్రియలు సమాపకము లనియు నసమాపకము లనియు రెండు విధములుగాఁ బేర్కొన్నవి. కానీ తత్త్వ. లట్ లిట్ లృట్ లజి లూట్ అనుప్రత్యయము లంతమునఁ గలసమాపకక్రియలు మాత్రమే క్రియ లని తెలియవలయు నని భావ (378) మన్నది. ఇట్లే (232) సమాపకక్రియలే క్రియ లనియు నసమాపకములు క్రియలు గా వనియు నభిప్రాయపడినది. సూత్రకర్త చేసిన పైవివరణము ననుసరించి సమాపకక్రియలే యగు ననుభావము కల్గుచున్నమాట యథార్థమే. అసమాపక క్రియలను గ్రియ లనియే వ్యాకర్త భావించినచో 'క్త్వాతద్వ్యతిరేకశతృతుమానంతర్య చేదానంతర్యార్థకము లయినయసమాపకక్రియలును' అనియే పేర్కొనియుండెడివాఁ డేమో యనిపించును. దీనివలన క్త్వాద్యర్థకములును నసమాపకక్రియ లనియే పేర్కొనవలయును గాని క్రియ లని వ్యవహరింపరా దని తెలియవలెను. కానీ ప్రౌఢవ్యాకర్త తద్ధర్మక్రియ, వ్యతిరేకక్రియ యనురీతిగా వ్యవహరించుటతోపాటు అప్రత్యయాంతక్రియ, అన్నంతక్రియ యనురీతిగాఁ గూడ వ్యవహరించుట తఱచుగానే కానవచ్చుచున్నది. అవి క్రియ లనరా దన్నపుడు అన్నంతక్రియ ఇత్యాది వ్యవహార మెట్లు? క్రియ లని వ్యవహరించినచోట్ల సమాపక్రియలు మాత్రమే గ్రహింప వలయు నని సూత్రకర్త తలంచెనా.

సమాపకక్రియ, యసమాపకక్రియ యనుచోట క్రియ అనునది విశేష్యము. సమాపకము, అసమాపకము అనునవి విశేషణములే. అట్టివిశేషణమును జేర్చుకున్నపుడు క్రియ యనునది సమాపకాసమాపకములను రెంటిని బోధింప వలెను. క్రియ యనుదానికి ధాత్వర్థ మని యర్థము. ధాత్వర్థము సమాప్తి చెందినచో సమాపకక్రియ యనియు, సమాప్తము గానిచో నసమాపకక్రియ యనియుఁ జెప్పవచ్చును. అట్టియెడలఁ గ్రియ యనుదానికి సమాపకక్రియ లనియు నర్థము చేయ నక్కఱ లేదు. సూత్రకర్త వివరణములో నిర్ణయించుట కాధారము గానరాదు.

వాక్యము తదితరాన్వయము గలది యనఁగాఁ గ్రియేతరాన్వయము గలది. అందు మొదటిది సమాపకక్రియయే యైన నసమాపకక్రియతో నన్వయము గలది తదితరాన్వయము గలవాక్య మగును. కానీ తదితరాన్వయము గలవాక్య మిది యని సూత్రకృన్మతమును గుర్తించుట కాతఁడు వాక్యముల నుదాహరింపక

**వాని కుదాహరణములు మీఁద స్పష్టములు గాఁగలవు.**

అనెను. ఇటఁ దత్త్వ. "వీని కుదాహరణములు ఏడవసూత్రపువివరణమునం గలవు. క్రియతో నన్వయము గలవాక్యము లనఁగా సంపూర్ణవాక్యము లనియు క్రియేతరాన్వయము గలవాక్యము లనఁగా నసంపుర్ణవాక్యము లనియు దెలియ నగు (378) నన్నది. 7.సూత్రమునందు 'దాని విడిచి పోవఁగా నోపక అనుక్రియా. 2. భిన్నకర్తృక మైనయసమాపకక్రియతోడివాక్యము గూడ అసంపూర్ణవాక్యము లనఁ బడు నని (389) స్పష్టము చేసినది తత్త్వ. కానీ యట సూత్రకర్త క్రియావిభిన్న కర్తృకంబు లగునసమాపకక్రియలతోడివాక్యమే యసంపూర్ణవాక్య మని వివరించెను. ఇంక విడిచి, ఓపక, అఱచుచు నిత్యాదిక్రియాభిన్నకర్తృకంబు లగునసమాపకక్రియలు గల 'ఉండెన్ వెలువడియెన్, చెప్పెన్' ఇత్యాది సమాపకక్రియలతోడివాక్యము సంపూర్ణవాక్య మనియు సూతకర్త యటఁ బేర్కొనె.

తత్త్వ. అభిప్రాయమే సూత్రకర్త కున్నయెడల ఉండెన్ మొద లగుసమాపక క్రియలతోడివాక్యములు సంపూర్ణవాక్యము లనియు, విడిచి, ఓపక, తలఁపఁగ మొద లగునసమాపకక్రియలతోడివాక్యము లసంపూర్ణవాక్యము లనియుఁ బేర్కొని యుండెడివాఁడే యనుటలో విరోధము లేదు. క్రియాభిన్నములా? క్రియా విభిన్నములా యనుకర్తృత్వమును గూర్చినవివక్ష యేల జనించినది.

పైఁగా సూత్రకర్త చేసినవివరణము ననుసరించి క్రియాభిన్నకర్తృకాసమాపక క్రియతోడివాక్యము సమాపకక్రియతోఁ గూడి సంపూర్ణవాక్యమే యవు నని చెప్పవలసి యున్నది. క్రియావిభిన్నకర్తృకము లైనయసమాపక్రియలు గలిగి వెలువడియెన్ చెప్పెన్ అనుసమాపకక్రియలతోడివాక్యమును సంపూర్ణవాక్య మనియే సూత్రకర్త చెప్పెను. అట్టియెడల నసంపూర్ణవాక్యమును బేర్కొనుస్థలమునఁ గ్రియాభిన్న కర్తృకాసమాపకక్రియలు గలదానిం గూర్చి యేల ప్రస్తావింపలేదు? ముందటి వివరణవాక్యమునందును విడిచి, ఓపక అనుక్రియాభిన్నకర్తృకాసమాపక్రియలనే పేర్కొనెను. కాని క్రియావిభిన్నకర్తృకము లగు తలఁగగ నిత్యాద్యసమాపకక్రియల నేల పేర్కొనలేదు? వెలువడియెన్ మున్నగుసమాపకక్రియలు గల్గిన వని పేర్కొన్న చోట వాక్యములందు తలఁగఁగన్ ఇత్యాదులు కలవే కద.

కాఁగాఁ గ్రియావిభిన్నకర్తృకము లగునసమాసకక్రియలతోడివాక్యమే యసంపూర్ణ మని సూత్రకర్త చెప్పఁదలఁచినట్లు నిశ్చయింపఁదగును. అట్టియెడలఁ గ్రియేతరాన్వయము గలది యనుప్రస్తుత (1) స్థలమున నసంపూర్ణవాక్య మనియు ననఁగా నసమాపకక్రియలు గలది యసంపూర్ణవాక్య మనియుఁ జెప్పుట కవకాశము లే దన్నమాటయే కదా. సూత్రకర్త అసమాపకక్రియలు గలవాక్యమే సంపూర్ణ మని చెప్పుట(7.సూ)ను గూర్చి యచ్చుట స్పష్టము గాఁగలదు.

అస లాసూత్రము సంపూర్ణము, నసంపూర్ణము ననువాక్యమునందలియిం కొకభేదమును గూర్చి ప్రస్తావించుచుండఁగా నిచ్చోటివాక్యభేదముల కది లక్ష్యస్థాన మనుటయే యుచితము గాదు.

ఇంక నీసూత్రకర్త వాక్యము నీసూత్రముచేతనే కాక 'విషయబోధకము వాక్యము ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయం' బని స్థలాంతరమునందు సూత్రించి యుదాహరించి యున్నాఁడు. అవియు వాక్యలక్షణమును గూర్చి వివరించినవే యవుటంజేసి యచ్చోటఁ గలయుదాహరణములలో నిద్దానికి లక్ష్యములు గ్రహింపఁదగు నని సూత్రకర్త యభిప్రాయపడె ననుటలో సందర్భము గుదురువడుచున్నది.

హయంబులు పఱచున్. ఇందు హయము ఉద్దేశ్యము. పఱచున్ క్రియ విధేయము. ఉద్దేశ్య విధేయములతోఁ గూడినది కావున నీయది వాక్యము. ఇందుఁ గ్రియతో నన్వయము గలదు గావున నీయది క్రియాన్వయము గలవాక్యమునకు

లక్ష్య మగుచున్నది. ఇట్లే 'అవివేకి చెడున్. కొందఱు పఱచిరి' మొద లగువాక్యములు క్రియాన్వయము గలవి.

వాగ్భూషణమే సుభూషణము. ఇట వాగ్భూషణము ఉద్దేశ్యము. సుభూషణము విధేయము. ఉద్దేశ్యవిధేయములతోఁ గూడినది గావున వాక్యమునకే యది లక్ష్య మగుచున్నది. ఇందుఁ గ్రియ లేదు. కావున నీయది క్రియాన్వయము గలది కాదు. కాని వాక్యము. అనఁగాఁ దదితరాన్వయము (క్రియేతరాన్వయము) గలదానికి లక్ష్య మయినది. ఇట్లే 'వీరభోజ్యము సుమ్ము రాజ్యము, వచ్చినవాఁడు ఫల్గునుఁడు, మూఁడవ వాఁ డెవ్వండు' మున్నగువాక్యములు తదితరాన్వయము గలవి.

ఇట్లు స్థలాంతరమున వాక్యముల నుదాహరింపఁబోవుచుండుటచేతనే మఱలఁ బ్రత్యేకముగా నిట నుదాహరింప నక్కఱ లే దని సూత్రకర్త తలఁచె నన్నమాట. క్రియాన్వయము, తదితరాన్వయము తెలియట సులభమే. ఉద్దేశ్యవిధేయములను దెలియుట కొంత క్లిష్టము. కావున నట నీవాక్యములను వివరించియుండును.

కాఁగాఁ గ్రియేతరాన్వయము గలవి యసంపూర్ణవాక్యము లను తత్త్వ. అభిప్రాయ ముచితము గాదు. తత్త్వ.వలె ఘం. స్పష్టముగాఁ జెప్పలేదు గాని తదితరాన్వయము గలవి యనఁగా 'నసమాపకక్రియలతో నన్వయము గలవి' యనురీతిగా నర్థము చెప్పుటవలన తత్త్వ.నే యనుసరించినట్లు తెలియవచ్చు. అదియు సరి కాదు.

తదితరము లనఁగాఁ గ్రియేతరములు. సమాపకక్రియేతరములు అసమాపక క్రియ లనురీతిగానే యర్థము చేసిన 'వాగ్భూషణమే సుభూషణము' మున్నగు వాక్యములు (పైసూత్రకర్త వాక్యములుగా నుదాహరించినవే.) ప్రస్తుతసూత్రము ననుసరించి లక్ష్యములు గాకుండఁబోవును. అట సమాపక్రియ లేదు గదా. లేక యిట్టిచోట్ల నెల్లఁ గ్రియ నధ్యాహారము చేసికొని క్రియాన్వయము గలవిగా సాధించుకొనవలెనా? క్రియ లేకయే దానియందు వాక్యలక్షణము సరిపడుచుండఁ గాఁ గ్రియాన్వయముతో వాక్యత్వమును సాధించుట కధ్యాహార మేల? అన్వయించుటలో బాధయే లేదు గదా.

క్రియేతరము లన్న (నసమాపకక్రియలు) మాత్రమే కాకున్నను నవియు నవును. వానితో నన్వయము గలవి యే మగును? అవి మాత్రము వాక్యములు గాక తప్పునా? అని యనుమానింపవచ్చును. దానికి సమాధానమే 6సూత్రమునకుఁ

(ఇటనే కదా క్రియాన్వయ, తదితరాన్వయము గలవాక్యములకు లక్ష్యము లీఁ బడినది) దరువాతిసూత్రము సమాధానము. అనఁగా నసమాపకక్రియలును గ్రియేతరములే కావునఁ దదన్వయము గలవి వాక్యములే కదా యను ననుమానమునకు సమాధానముగా 7సూత్రము గ్రహింపఁదగు నన్నమాట.

కావున దీనింబట్టి యసమాపకక్రియలతో నన్వయము గలవి యసంపూర్ణ వాక్యము లనునిర్ణయము ననుసరించి, యసమాపకక్రియలు క్రియలు కా వని (క్రియాన్వయము గలవి సంపూర్ణవాక్యము లగును గావున) నిర్ణయించుటకు వీలు లే దని స్పష్ట మగుచున్నది.

ఇంతకును నసమాపకక్రియలు క్రియ లనఁబడునా లేదా యన్నయనుమాన మట్లు యున్నది.

9సూత్రమునొద్ద ఉద్దేశ్యము లగువిశేష్యాదికములో విశేష్యవిశేషణ సర్వనామములు పేర్కొని యుదాహరించెను. క్రియ విశేష్యాదులు విధేయము లనియుఁ జెప్పుచు విశేష్యాదు లుద్దేశ్యవిధేయములు రెండును నగు, క్రియ లుద్దేశ్యములు కానేర వని స్పష్టము చేసియున్నాఁడు. ఇంక వాక్యములను వివరించుచు విశేష్యవిశేషణసర్వనామములను గ్రమముగా నుదాహరించి 'మృగాకులోగ్ర వనంబుల కరుగ నేల? ఏలా వాలాయము సేయ. ఇందు అరుగన్ చేయన్ ఇవి యన్నంతక్రియలు ఉద్దేశ్యములు' అని సూత్రకర్త వివరించెను. అన్నంతక్రియ యియ్యది. క్రియయే యవుచో నుద్దేశ్య మగుట యెట్లు? క్రియ లుద్దేశ్యములు కానేర వని చెప్పెను గదా. ఇంక విశేష్యాదికము, క్రియాదికము ననునాసూత్ర వివరణమందలి 'ఆది' పదద్వయముచే నన్నంతక్రియలును నేలాద్యవ్యయములును గ్రాహ్య మని సూత్రకర్తయే వివరించెను. ఆదిపదముచే గ్రహింపఁబడు నన్న యన్నంతక్రియ యుద్దేశ్య మవుట కీపైలక్ష్యములు సూత్రకర్త ప్రదర్శించెను. అన్నంతక్రియ యుద్దేశ్య మవుట గల దని చెప్పుచునే క్రియ లుద్దేశ్యములు గానేర వనుచున్నాఁ డనగా నన్నంతక్రియ 'క్రియా'పదముచే గ్రహింపఁబడ దన్నమాటయే కదా. అనఁగా నసమాపకక్రియలకుఁ గ్రియ లనురీతివ్యవహారము కుదుర దనియే సూత్రకర్త నిశ్చయించినట్లు చెప్పఁదగియున్నది. ఇటఁ గ్రియలను వివరించిన వాక్యము సైత మిట్టియభిప్రాయమునే వ్యక్తము చేయుట గమనించితిమి.

అట్టియెడఁ బ్రౌఢవ్యాకర్త యన్నంతక్రియ మున్నగురీతిగా వ్యవహరించు టుచితముగా లే దని చెప్పవచ్చును. లేక క్రియ యనునట్టిచోట్ల 'క్రియా ధాతుః' అనుచింతామణిలక్షణము ననుసరించి ధాతు వనునర్థముననే ప్రయోగించి యుండవలెను. నుజ్యంతం బగునగుధాతువు, లిడంతం బగునగుధాతువు' అని సూరి వ్యవహరించినట్లుగా, 'అన్నంత మగునగుధాతువు' (క్రియ. 23) అని ప్రౌఢవ్యాకర్త తానును వ్యవహరించినట్లుగా, అన్నంతక్రియ యనుచో నుజ్యంతం బగుధాతువు అనునర్థముననే ప్రయోగించెనా? ఇ ట్లయినను ధాతువు, క్రియ యనునవి పర్యాయములుగాఁ దలంచుట యుక్తము గా దనియే చెప్పవలెను. క్రియ యనుదానికి ధాత్వర్థ మని కదా యర్థము. 'ధాతువు' అని ప్రయోగించుటయే సముచిత మైయుండఁగా, నన్నంతక్రియ యనుట యొప్పదు. ఇట్లు క్రియ లనుట యుక్తము గాకుండఁగా, సూత్రకర్తయే యట్లు తలంచె నని గుర్తించియు, తత్త్వ. 'అనక, చదువక మున్నగునవి భూతకాలికములు నసమాపకములు వ్యతిరేకార్థములు నగుక్రియాపదము' (414) లనుట వింతగ నున్నది.

కాఁగాఁ గ్రియ లనఁగా లడాదిలకారాంతములే యని సూత్రకృన్మతమును క్రియ లనఁగా వర్తమానాద్యర్థకము లైనసమాపకక్రియ లనువివరణమునుబట్టి గ్రహింపఁదగును. ప్రసంగవశమున 'క్త్వా తద్వ్యతిరేక శతృ తుమున్ చే దానంతర్యార్థకము లసమాపకక్రియ లని చెప్పియుండును. అనఁగా వివరణమును బట్టి క్త్వార్థకాద్యంతము లీయసమాపకక్రియలే కాని క్రియలు గా వని యర్థము చెప్పునవకాశము నేర్పడుచున్నది. ఆనంతర్యార్థక మని ముగించుటచే నితరార్థముల కవకాశము లేదు. నుజీ తుమర్థమందే కాక భావలక్షణార్థమందు నవును. కానీ సూత్రకర్త యాయర్థము నిటఁ బేర్కొన లేదు. తుమ్ అనునదే భావలక్షణార్థమున కుపలక్షణ మని గ్రహింపఁదగును. అట్లే చేదర్థమును బేర్కొనెనే కాని వృత్తం బగు భావలక్షణార్థమును గూడఁ జేర్పలేదు. కాఁగా చేత్ అనుశబ్దము వృత్తం బగు భావలక్షణమున కుపలక్షక మని గ్రహింపఁదగును.

కాగా ఇ, కజి, నుజి, చున్, నన్, డున్ ప్రత్యయాంతము లాఱే తెనుఁగు క్త్వార్థకాదులు (అసమాపకక్రియలు).

ఇంక వీనియందలివిశేషము నిట్లు పేర్కొనుచున్నాఁడు.

**ఇందు మొదటివి మూఁడు క్రియాభిన్నకర్తృకంబులు. వెనుకటివి మూఁడు క్రియావిభిన్నకర్తృకంబులు.**

పైయాఱింటిలోను దొలుతటి మూఁడు ఇ, కజి, నుజి ప్రత్యయాంతములు క్రియాభిన్నకర్తృకములు. అనఁగా నవ్వాక్యమందలిక్రియ కేయది కర్త యగుచో వీనికిని గర్త యదియే యవు నని తాత్పర్యము.

వీనికి నిట లక్ష్యములు చూపలేదు. 7 సూత్రమునఁ గనవచ్చును. 'దాని విడిచి పోవఁగా నోపక అఱచుచు నంతరిక్షమున హంసలు పిండుగట్టి తిరుగుచుండె' ఇందు ఉండెన్ అనుక్రియాపదమునకుఁ గర్త హంసలు. విడచి అను ఇప్రత్య యాంతమునకును, ఓపక అనుకజ్యంతమునకును, అఱచుచున్, తిరుగుచున్ అను చుప్రత్యయాంతములకును, హంసలు అనునదే కర్త యైనది. నలుఁడు పట్టినహంసను మిగిలిన హంసలు విడిచి (పోవఁగా) ఓపక అఱచుచుఁ దిరుగుచు ఉన్నవి. అనఁ గాఁ బైని బేర్కొన్నవానిలోఁ దొలుతటిమూఁడు క్రియాభిన్నకర్తృకము లగు ననుటకు నీప్రయోగము లక్ష్య మవుచున్న దన్నమాట.

కాని యిందు క్త్వాతద్వ్యతిరేకాకర్థములు క్రియాభిన్నకర్తృకములే యనుట సరి కా దని తత్త్వ. (319) ఘం. (233–333) పేర్కొన్నవి. అది యుక్తమే. సూరి ఇవర్ణకమును సమానాశ్రయంబులం బూర్వకాలికమున కని సూత్రించి (సంస్కృతమునవలె) సమానకర్తృకము లనకుండుటకుఁ బ్రయోజనమును వివరించెను. 'చైత్రునిచేత మైత్రుఁడు కొట్టంబడి మడిసె' ననుచో మడిసె నను క్రియకుఁ గర్త మైత్రుఁడు కాఁగా, కొట్టుట యనుక్రియకుఁ గర్త చైత్రుఁడు. కావున నిట నీక్త్వార్థకము క్రియావిభిన్నకర్తృక మయినది కదా. ఇట్టికర్మార్థకవాక్యములందు క్త్వార్థకము క్రియావిభిన్నకర్తృకమే యగును. దీని ననుసరించియే వ్యతిరేకక్త్వార్థకము సైతము క్రియావిభిన్నకర్తృక మగును. 'పంటలు పండక కఱవు వచ్చెను' అనుదానిని విభిన్నకర్తృక మగుటకు ఘం. ఉదాహరించినది (333).

కాఁగా శత్రర్థకమే యీమూఁడింటిలో నియతముగాఁ గ్రియాభిన్నకర్తృక మగు చున్నది. 'క్రియాన్వయంబున' శత్రర్థంబునం దగు ననుసూరిలక్షణ మిట స్మరింపఁ దగును.

ఇంక మిగిలినమూఁడును, అనఁగా నుజి, నన్, డున్ ప్రత్యయాంతములు

మూఁడును గ్రియావిభిన్నకర్తృకము లని సూత్రకర్త వివరించెను. దీనిలక్ష్యమును నేడవసూత్రమునొద్దఁ జూపఁబడినది.

'నలుఁడు ధరణీరాజ్యము తలఁగగ, సర్వంబు నపహృతం బైన, ... వెలువడియె' ఇట వెలువడియె నను క్రియాపదమునకుఁ గర్త నలుఁడు. తలఁగఁగన్ (నుజ్యంతము), ఐనన్ (నన్నంతము), అనువానికిఁ గర్త రాజ్యము. ఇట తొలఁగినదియు, నపహృత మైనదియు రాజ్యము. క్రియాపదమునకు భిన్న మైనకర్తను గలిగియుండుటచే నివి క్రియావిభిన్నకర్తృకము లగుచున్నవి.

ఇచ్చటినుజ్యంతలక్ష్యమందలి 'నుజి' భావలక్షణార్థమం దయినది. ఇనన్ అనుచో ననుప్రత్యయము వృత్తం బగుభావలక్షణార్థమం దయినది. అసమాపకక్రియలను నిరూపించినప్రస్తుతస్థలమునందు వ్యాకర్త క్త్వాతద్వ్యతిరేకాదులలో నీభావ లక్షణార్థమును, వృత్తం బగుభావలక్షణార్థమును, బేర్కొనలేదు. అయినను లక్ష్యములందుఁ బ్రదర్శించియుండుటచే తుమ్ అనునది భావలక్షణమునకును, చేత్ అనునది వృత్తం బగుభావలక్షణమునకును నుపలక్షకము లని గ్రహింపవలెను.

'నన్ను నారాజునకు నెఱిఁగించి, కరుణ నాయందుఁ గావింపు మాఱఁగ ననుడున్ – ఆహంస వీరసేనజునకుఁ జెప్పె' అనునీవాక్యమునఁ జెప్పె నను క్రియాపదమునకుఁ గర్త హంస. అనుడున్ అనుదానికిఁ గర్త దమయంతి. ఇట్లు డున్నంతము క్రియా విభిన్నకర్తృక మైనది.

ఇట వివరించినయీయసమాపకక్రియలకు లక్ష్యములను 7 సూత్రమున నిట్లు క్రమముగా గుర్తింపఁదగును.

ఈ మూడు క్రియావిభిన్న కర్తృకము లని చెప్పుటయు సరి గా దని వ్యాఖ్యలు గుర్తించినవి. (సర్వ. 568, ఘం. 233)

కాఁగాఁ దుమర్థక మగునుజ్యంతము ఎప్పుడును గ్రియావిభిన్నకర్తృక మవుట లేదు. భావలక్షణార్థకనుజి క్రియావిభిన్నకర్తృకమే యవుచున్నది. కావున నీ వివరణమున సూత్రకర్త భావలక్షణార్థమును జూపి క్రియావిభిన్నకర్తృక మనుట యుక్తము. పైఁగాఁ దుమర్థకము క్రియాభిన్నకర్తృక మగుటచే దానిని గ్రియాభిన్న కర్తృకముగానే చూపవలసియున్నది.

సర్వ. ఘం. వ్యాఖ్యలు తుమర్థమునే క్రియాభిన్నకర్తృకముగాఁ బేర్కొనఁగా

తత్త్వ. ఈమూఁడును క్రియాసమానకర్తృకములు నగు. రాముఁడు చదువం బోయెను. ఇట చదువుటకును, బోవుటకును రాముఁడే కర్త. బాలుఁడు చదివిన నుత్తీర్ణతం బొందును. ఇట చదువుటకును బొందుటకును బాలుఁడే కర్త. ఆనంతర్యార్థకస్థలమున మాత్రము నొకే కర్త యుండుట ప్రసిద్ధము గాదు. కావున నీమూఁడును క్రియా విభిన్నకర్తృకములు. తఱచుగా నగు నని మాత్రమే గ్రంథకర్త వాక్యమున కర్థముగా గ్రహింపవలయు' (379) నన్నది.

డున్నంతము క్రియావిభిన్నకర్తృకముగాఁ బ్రసిద్ధము గా దనుచునే యీ మూఁడును గ్రియాసమానకర్తృకము లనుట సరిగా లేదు. అప్రసిద్ధ మనఁదగినను డున్నంతము క్రియాసమానకర్తృక మవుటకు లక్ష్య మస లున్నదా?

'వాఁడు చదివిన నుత్తీర్ణత నందు. ననుచోఁ జేదర్థము క్రియాసమానకర్తృకము నగు నని నిరూపించుట విశేషము. గ్రాహ్యము. కాఁగా ఘం. 'భావలక్షణార్థమున నుజీ, వృత్తం బగుభావలక్షణమున నగు'న'వర్ణకము ననువానిని గ్రియావిభక్తు లగునసమాపకక్రియ లనవలె' (233) ననుటలో నవర్ణకాంతములందుఁ జేదర్థకము క్రియావిభిన్నకర్తృకమా, కాదా? 'వానలు గురిసినం బంటలు పండు' ననుచో నయ్యది క్రియావిభిన్నకర్తృకము నగును గదా. కావున భావలక్షణార్థకమును గ్రియా విభిన్నకర్తృకముగాఁ బేర్కొన్నఁ, జేదర్థకము క్రియాభిన్నకర్తృక మగు నని చెప్పుట కవకాశ మేర్పడును.

వివరణము తాత్పర్యము తఱచుగా నని సూత్రకర్తయభిప్రాయముగా తత్త్వ. తలఁచినది. కానీ యట్లు చెప్పుట కిం దాధారము లేదు. కావున సూత్రకర్త తఱచుగా నగు నని వివరించిన బాగుండెడిది.

పిదప నీవాక్యముయొక్క లక్షణమునే మార్గాంతరమున నిట్లు పేర్కొనెను.

**5. విషయబోధకము వాక్యము.**

విషయమును బోధించునది వాక్య మని యర్థము.

**విషయ మనఁగాఁ దెలియఁదగినయంశము**

అని సూత్రకర్తయే వివరించెను.

సుబో. 'తెలియఁదగినయంశమును బోధించునట్టిపదసమూహము వాక్య మగు' (275) నని వివరించినది. పదసమూహ మనవలసినయవసరము గానరాదు. తెలియఁదగినయంశము విషయ మనియు దానిని బోధించునది వాక్య మనియుఁ జెప్పుటచే ఏకపదమే యొక్కవేళ విషయబోధక మైనచో నాపదమే వాక్య మనఁ దగును గదా. 'అక్కడ నెవఁ డున్నాఁడు? రాముఁడు. ఉన్నాఁడు క్రియ అధ్యాహార్యము' (వాక్య. 14) ఇట ఉన్నాఁడు అనుక్రియాపదము ప్రయుక్తము గాలేదు. అయినను 'రాముఁడు' అనుపదమే వాక్య మగును. వాక్యమునందే కదా యధ్యాహార్య మవుట. కాఁగాఁ దెలియఁదగినయంశమును దెలుపునది పదమో, పదసముదాయమో వాక్య మని సూత్రమునర్థము స్పష్టము.

'క్రియతోఁ గూడినకారకములే యొకవిషయమును బూర్ణముగా బోధింపఁ గలవు. క్రియ లేనిచో రెండు మూఁడు పదములు ఆసత్తియోగ్యతాకాంక్ష లున్నను పూర్ణవిషయమును బోధింపఁజాలవు. అట్టివానిని వాక్య మని చెప్పఁదగదు. రాముని యొక్క బంటు అనురెండుపదములవలన నొకవిషయము బోధింపఁబడదు. రామునియొక్క బంటు వచ్చెను అని క్రియ చేరినచో విషయబోధక మగును. అట్టిదియే వాక్య మనబడును. ఇట్టివిశేషమును దెల్పుటకే లక్షణాంతరమును జెప్పె నని తలంపవలయును' (386) అనుటలోఁ గొంత సామంజస్యము కలదు. కానీ క్రియాపదముతోఁ గూడినపుడే వాక్య మగు ననుట యుక్తముగాఁ గానరాదు. వాగ్భూషణమే సుభూషణము ఇత్యాదిగాఁ గ్రియాపదవిరహితములును నుద్దేశ్య విధేయములతోఁ గూడి విషయబోధకము లై వాక్యము లవు నని సూత్రకర్త తరువాతి సూత్రమున స్పష్టము చేయుచున్నాఁడు. అయిన రామునియొక్క బంటు అనునది వాక్య మగునా? అనఁగా హనుమానుఁ డెవ్వఁడు? రామునియొక్క బంటు అనుచో నయ్యదియు వాక్యమే కాఁగలదు. కానీ యట్టిప్రశ్నాదులు లేక రామునియొక్క బంటు అని మాత్రమే యున్న నయ్యది యుద్దేశ్యమాత్ర మగుటచే విధేయాంశము లేమి వాక్యము గానిమాటయు నిజమే.

మొదటిసూత్రము ననుసరించి యిది వాక్య మగునా? అనఁగా యోగ్యత ఆకాంక్ష ఆసత్తి యన్నవి మూఁడును గలవు. కావున వాక్యమే యనవలసియుండును. కావునఁ బ్రథమసూత్రప్రతిపాదిత మైనయర్థ మీసూత్రముచే సమగ్రము చేయఁ

బడిన దని తలంచుచో నీవిధానము సార్థకమే యవును. కావున మఱల వాక్యలక్షణమే పునరుక్తముగాఁ జెప్పె నన నక్కఱ లేదు.

కానీ ప్రథమసూత్రమునొద్దనే యాకాంక్ష సమాప్తి చెందవలె ననియుఁ బేర్కొన్నచో నీలక్షణము చెప్ప నక్కఱ లేకపోయెడిది. రామునియొక్క బంటు అనుచో నాకాంక్ష యున్నను నది సమాప్తము కాలేదు. కావున నయ్యది వాక్యము గా దని తెలియ వచ్చును. నిలుపుదల లేక పయి పయిం బోయెడియాదర మని చెప్పఁబడినది. నిలుపుదల లేక యనుదానిచేఁ బదార్థములమీఁదియాదరము పరిసమాప్త మగువఱకు నని యర్థము చేయ నవకాశము గలదు. 'ప్రతీతిపర్యవసానవిరహః అని గదా మూలము. ఆయర్థ మిట సూత్రమున స్పష్ట మగుచున్న దనవచ్చు.

విషయబోధక మని ప్రారంభించుటచే విషయ మన నేమో పిదప స్పష్టము చేయుచున్నాఁడు.

## విషయము

**6. ఉద్దేశ్య విధేయభిన్నంబు విషయంబు.**

భిన్నము కూడినది (శ.ర.)

**విషయ ముద్దేశ్యవిధేయములతోఁ గూడినది.**

అని సూత్రకర్తయే వివరించెను.

**ఉద్దేశించి చెప్పఁదగినది యుద్దేశ్యము. మీఁదఁ దెలియఁదగినది విధేయము.**

అనఁగా దేనిం గూర్చి చెప్పఁబడునో యది యుద్దేశ్యము. దానిం గూర్చి విధించునది యనఁగాఁ జెప్పున దేదో యది విధేయము. వాగ్భూషణమే సుభూషణము. ఇందు వాగ్భూషణము అనుదానిం గూర్చి చెప్పఁబడుటచే నయ్యది యుద్దేశ్య మగుచున్నది. దానిం గూర్చి యేమి చెప్పఁబడునో యది విధేయము. వాగ్భూషణమును గూర్చి యేమి చెప్పఁబడుచున్నది? అది సుభూషణ మని. కావున సుభూషణ మనునది విధేయ మగును.

ఉద్దేశ్యవిధేయములతోఁ గూడినది విషయము. దానిని బోధించునది వాక్యము. కాఁగా వాగ్భూషణ మనుఉద్దేశ్యమును, సుభూషణ మనువిధేయమును గూడి (బోధించువిషయము) యిది వాక్య మగుచున్న దని సూత్రమునభిప్రాయము.

**విశేష్యాదిక ముద్దేశ్యము. విశేష్యాదికము-విశేష్యము, విశేషణము, సర్వనామము.**

విశేష్యము, విశేషణము, సర్వనామము అనునవి యుద్దేశ్యములు, విధేయములు నగుచుండును.

'ఈహయములు పఱచున్' అనుచో హయములు అనువిశేష్య ముద్దేశ్యము గాఁగా పఱచున్ అనుక్రియాపదము విధేయ మైయున్నది. వచ్చినవాఁడు ఫల్గునుఁ డనుచో ఫల్గునుఁడు అనువిశేష్యము విధేయ మైనది. ఇట్లు విశేష్యము లుద్దేశ్య విధేయములు రెండు నవు నన్నమాట.

ఈరెండవవాక్యమున వచ్చినవాఁ డనువిశేషణ ముద్దేశ్య మైయున్నది.

'ఇది మర్త్యుల కవిషయము' అనుచో 'అవిషయము' అనునది విశేషణము. అదియే యిట విధేయ మయినది. అవిషయ మన్నయంశమె కదా యిట విధింపఁ బడుచున్నది. ఇట్లు విశేషణములు ఉద్దేశ్యవిధేయములు రెండును నగును.

ఇందు 'ఇది' అనుసర్వనామ ముద్దేశ్య మైయున్నది. వీ రెవ్వరయ్య యనుచో ఎవ్వరు అనుసర్వనామము విధేయము. ఇట్లు సర్వనామము లుద్దేశ్యవిధేయములు రెండును నవును. ఈవాక్యమున 'వీరు' అనుసర్వనామమే యుద్దేశ్య మయియున్నది.

**క్రియ లుద్దేశ్యములు కానేరవు.**

అని సూత్రకర్తవివరణము. వర్తమానాద్యర్థకము లైనక్రియాపదములు విధేయములే యవును గాని యుద్దేశ్యములు గా వని స్పష్టము చేయుచున్నది. 'హయములు పఱచున్' అనుచో 'పఱచున్' అనుక్రియ విధేయ మగుట స్పష్టము.

**ఆదిపదద్వయముచే అన్నంతక్రియలును, నేలాద్యవ్యయములును గ్రాహ్యములు.**

'వనంబుల కరుగ నేల' యనుచో 'అరుగన్' అనునుజ్యంత ముద్దేశ్యము. 'ఏల' యనునవ్యయము విధేయము.

**ఉద్దేశ్యము వక్తృశ్రోతల కుభయులకుఁ దెలియును. విధేయము వక్తకు మాత్రమే తెలియును.**

ఇం దుద్దేశ్యము వక్తకు శ్రోతకు నిద్దఱకుఁ దెలియఁగా విధేయము ముందుగా వక్తకు మాత్రము తెలియును.

## వాక్యద్వైవిధ్యము

**7. సంపూర్ణ మసంపూర్ణమని వాక్యంబు ద్వివిధంబు.**

వాక్యము నీసూత్రము రెండుతెఱఁగులుగా విభాగించుచున్నది. సంపూర్ణవాక్య మనియును, అసంపూర్ణవాక్య మనియును.

**సమాపకక్రియలు గలవాక్యము సంపూర్ణవాక్యము.**

వర్తమానాద్యర్థక్రియాపదము లనఁగా లడాదిలకారము లంతమునందుఁ గలవాక్యము సంపూర్ణవాక్యము.

**అసమాపకక్రియలు గలవాక్యము అసంపూర్ణవాక్యము.**

క్త్వార్థకాదు లగునవియు (ఇ–కజి–చున్–నుజి, నన్–దుప్రత్యయాంతములు) ఇవి కలవాక్యము అసంపూర్ణవాక్యము.

లడాద్యంతములను సమాపకక్రియ లనియును క్త్వార్థకాదుల నసమాపకక్రియ లనియుఁ బ్రౌఢవ్యాకర్త వ్యవహరించుచున్నాఁడు. ఇట్టివ్యవహారము దెలుఁగునందు విశేషముగాఁ దోఁచుచున్నది. ఇది సంస్కృతమునఁ గానరాదు.

క్రియ యనఁగా ధాత్వర్థము. అనఁగా వ్యాపారము. ఆవ్యాపారము(పని)యొక్క సమాప్తిని బోధించుశబ్దము సమాపకక్రియ యని భావము. అట్లే వ్యాపారముయొక్క యసమాప్తిని బోధించుశబ్దములే యసమాపకక్రియ లనఁదగును.

**దాని విడిచి పోవఁగా నోప కఱచుచు నంతరిక్షమునను హంస లెల్లఁ బిండుగట్టి తిరుగుచుండె.**

ఇది సంపూర్ణవాక్య మె ట్లయినదో సూత్రకర్తయే యిట్లు వివరించెను.

**'ఇందు విడిచి, ఓపక, అఱచుచున్ ఇత్యాది క్రియాభిన్నకర్తృకంబు లగునసమాపకక్రియలు గల ఉండెన్, వెలువడియెన్, చెప్పెన్ ఇత్యాది సమాపక క్రియలతోడివాక్యము సంపూర్ణ వాక్యము.**

అనఁగాఁ గ్రియాపద మంతమందుఁ గలిగినయీభాగము మొత్తమును సంపూర్ణవాక్య మగును.

నలుఁడును ధరణీరాజ్యము తలఁగఁగ సర్వంబు నపహృతం బయినఁ గడుం

దలరి దమయంతి దోడ్కొని వెలువడియె'– ననుచో వెలువడియె ననుక్రియాపదము చివర గలదానివఱకు నయ్యది సంపూర్ణవాక్య మగును ఇంక నసంపూర్ణవాక్య మేది?

**తలఁగఁగన్, అయినన్ (అనుడున్) ఇత్యాది క్రియావిభిన్నకర్తృకంబు లగు నసమాపకక్రియలతోడివాక్య మసంపూర్ణవాక్యము నని యెఱుంగవలయు.**

అని సూత్రకర్తయే స్పష్టము చేసెను.

ఇట నొకభేదము గనవచ్చుచున్నది. మొదటివాక్యమున విడిచిపోవక, కఱచుచు, ననురీతి క్రియాభిన్నకర్తృకము లగునసమాపకక్రియలు గలవు. అంతవఱ కున్నదాని నసంపూర్ణవాక్యముగా సూత్రకర్త తెలుపుట లేదు. అసంపూర్ణవాక్యమును వివరించు నప్పుడు క్రియావిభిన్నకర్తృకములను మాత్రమే చూపెను. అనఁగాఁ గ్రియా అభిన్నకర్తృకాసమాపకక్రియాంతము లగు 'దాని విడిచిపోవఁగా నోప కఱచుచు' నునంతవఱ కున్నభాగము నసంపూర్ణవాక్య మనుటకు వీలు లే దని సూత్రకర్త యభిప్రాయముగా గుర్తింపవచ్చును. ఇది భ్రమ యనుట (సర్వ. 574) సరి కాదు.

క్రియావిభిన్నకర్తృకాసమాపకక్రియలు గలవాక్యమందు సయితము క్రియా భిన్నకర్తృకాసమాపకక్రియలు గలవు. కాని వానిని సూత్రకర్త యసంపూర్ణవాక్య వివరణసందర్భమున గ్రహింపలేదు. అనఁగా నలుఁడు తలరి (వెలువడియె) ఆహంస యలిగి (చెప్పె) అనువాని నసంపూర్ణవాక్యము లనుటకు వీలు లేదు.

కానీ సూత్రకర్త పైని సూత్రార్థవివరణసందర్భమున నసమాపకక్రియలు గలవాక్య మసంపూర్ణ మని సామాన్యముగనే చెప్పెను. దానివలనఁ గ్రియాభిన్నకర్తృ కాసమాపకక్రియలు గలదానిని సయిత మసంపూర్ణవాక్య మనియే చెప్పవలసి యున్నది. కాని లక్ష్యవివరణసందర్భమున మాత్రము క్రియాభిన్నకర్తృకములతోడి దానిని సంపూర్ణవాక్య మని పేర్కొనలేదు.

నిజమునకుఁ గ్రియాభిన్నకర్తృకాసమాపకక్రియతోడిదాని నసంపూర్ణవాక్య మనకుండుటయే యుక్తము.

సంపూర్ణ మైనను, నసంపూర్ణ మైనను వాక్యము గావలయు నన్న విషయ బోధకము గావలెను. 'హంస లెల్ల దాని విడిచిపోవఁగా నోప కఱచుచు పిండుగట్టి తిరుగుచుండె' ననుచోటి 'హంస లెల్ల దాని విడచి' యన్నంతవఱ కది వాక్య మగునా? క్రియాసమానకర్తృకము లగునిట్టిసందర్భములందు క్త్వార్థకాదులచే

నాకాంక్ష పరిసమాప్తము గాదు. 'హంస లెల్ల విడిచి' యనుచో విడుచుటతో హంసకర్తృక మైనవ్యాపారము పరిసమాప్తము గాలేదు. ఇట్లె చున్నంతములవఱకును ఏకకర్తృకములే యవుటచేఁ గ్రియాపదము ప్రయుక్త మవునంతవఱకును నాకాంక్ష పరిసమాప్త మవుట లేదు. కావున నంతవఱకు వాక్య మనుటకు నం దవకాశము లేకపోయినది.

'రాజ్యము తలఁగఁగ – సర్వంబు నపహృతం బైన' ననుచో రాజ్యము తలఁగెను. రాజ్యము సర్వము నపహృత మైనది. అనురీతిగా రాజ్యకర్తృక మైనవ్యాపార మసమాపకక్రియతో సమాప్త మవుచునే యున్నది. అయినను వాక్యమునఁ బ్రధాన మగుకర్త నలుఁడు, తత్కర్తృక మైనవ్యాపార మప్పటికిఁ బరిసమాప్తము గాకుండుటచే వాక్యము సంపూర్ణము గాలేదు. కావునఁ గ్రియావిభిన్నకర్తృకము లైనపుడు తత్కర్తృక మైనవ్యాపారము పరిసమాప్త మవుటచే, నుద్దేశ్యవిధేయములు కలిమి వాక్య మనఁ దగియుండుటచేతను, బ్రధాన మగునర్థము సరిగా సంపూర్ణము గాకుండుటచేతను గ్రియావిభిన్నకర్తృకసమాపకక్రియతోడిభాగము నసంపూర్ణవాక్యముగాఁ జెప్పుట యుచితముగా నుండును.

ఈయభిప్రాయమునే సూత్రకర్త కలిగియున్నచోఁ గ్రియావిభిన్నకర్తృకాసమాపక క్రియతోడిదే యసంపూర్ణ వాక్య మని స్పష్టముగా వివరించియుండవలసినది.

పైఁగా ముందుగా సమాపకక్రియతోడివాక్య మసంపూర్ణ మని సామాన్యముగా నిర్దేశించుటచేతఁ గ్రియాభిన్నకర్తృకము లగునసమాపక్రియలవఱకుఁ గలభాగమును సైత మసంపూర్ణవాక్యమే యగు నని చెప్పుటకు నవకాశ మేర్పడు చున్నది. అది సూత్రకర్తయభిప్రాయముగా లక్ష్యవివరణభాగము నిరూపించుట లేదు.

## మహావాక్యము

**8. వాక్యసముదాయము మహావాక్యము. అయ్యది రామాయణాదికము.**

ఇంతకు ముందు వివరింపఁబడిన (సంపూర్ణ) వాక్యములసమూహమునకు మహావాక్య మని పేరు. రామాయణాదులు మహావాక్యము లని సూత్రము నభిప్రాయము.

'ఇత్థం వాక్యం ద్విధా మతమ్. ఇత్థ మితి వాక్యత్వేన, మహావాక్యత్వేన చ. ఉక్తం

చ స్వార్థబోధే సమాప్తానా మంగాగిత్వవ్యపేక్షయా వాక్యానా మేకవాక్యత్వం. పునః సంహృత్య జాయతే ఇతి. తత్ర వాక్యం యథా... శూన్యం వాసగృహ మిత్యాది(సా.ద) 'శూన్యం వాసగృహం విలోక్య' అనుశ్లోక మమరుకశతకములోనిది. కావున నీ పద్యము పద్యాంతరనిరపేక్ష మగుటచే నిందలివాక్యములసమూహము మహావాక్యము కా' (ఘం. 336) దని ఘం. స్పష్టము చేసినది.

వాక్యసముదాయ మని సూత్రించియు నయ్యది రామాయణాదిక మని పేర్కొనుటలో సూత్రకర్తకుఁ బైయభిప్రాయమే కలుగుట స్పష్టము.

లేనిచో వాక్యసముదాయము మహావాక్య మనుమహావాక్యలక్షణమునకు నయ్యది రామాయణాదిక మనునది లక్ష్యప్రాయమే యగును. ఆభాగమును గూడ సూత్రమునందే చేర్చి చెప్పుటవలన రామాయణాదికము మాత్రమే మహావాక్య మగును గాని వాక్యసముదాయ మెల్ల మహావాక్య మనఁబడ దని గుర్తింపఁదగును.

అనఁగా వాక్యసముదాయ మనులక్షణపూర్వభాగము ననుసరించి పరస్పర సంబంధము లేనిముక్తకాదులయందలివాక్యసముదాయము సయితము మహావాక్యమే కావలసియున్నది. కావున నాలక్షణ మతివ్యాప్త మగుచుండ నయ్యది రామాయణాదిక మనునుత్తరభాగము రామాయణమువంటివానినే మహావాక్యము లనఁదగు నని పూర్వభాగమునభిప్రాయమును నియమించుచున్నది.

కాఁగా స్వార్థబోధతో వాక్యములు పరిసమాప్తము లైనను నావాక్యముల సముదాయము మఱలఁ బరస్పర మంగాంగిభావసంబంధముచే వ్యపేక్షాసామర్థ్యము ననుసరించి యవి యెల్లఁ గలిసి యొకేవాక్యముగాఁ బరిగణింపఁదగియుండుటచే నద్దానిని మహావాక్య మనఁదగు నని భావము.

అయినను నిట్టియర్థము సూత్రమునంద స్పష్ట మగునట్లుగా నిం కొకతీరుగా సమగ్రముగాఁ జెప్పిన బాగుండెడిది.

అసంపూర్ణవాక్యము, సంపూర్ణవాక్యము, మహావాక్యము ననురీతిగా నున్న యీవాక్యము లొకదానికంటె నిం కొకటి విస్తృతము లయినవిగా గుర్తింపఁదగును.

రామాయణాదిక మనుటలో సంస్కృతకావ్యమును సూత్రకర్త యుద్దేశించె నేమో. తెలుఁగుకావ్య మనునవకాశము లేకపోలేదు. భారతాదిక మన్న బాగుండెడి దేమో?

## క్రియాన్వయవాక్యములు - వ్యంగ్యార్థములు

**9. క్రియాన్వయవాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబు లగు.**

క్రియతో నన్వయము గలవాక్యములు కొన్ని వ్యంగ్యార్థమును వ్యక్తము చేయుట గల దని సూత్రమునర్థము.

క్రియాన్వయవాక్య మనఁగా సమాపకక్రియతో నన్వయించువాక్య మని తత్త్వ. (390) ఘుం. (241) వ్యాఖ్యలు పేర్కొన్నవి.

ఈసూత్రమునకు సూత్రకర్తయే చేసినవివరణము పైయభిప్రాయమునే సూచించుచున్నది. ఆవివరణ మీయది.

1. భావక్రియలు గలవాక్యము వ్యతిరేకక్రియలు గలవాక్యమునకు వ్యంజక మగును.

వాఁడు వచ్చిన నేను వత్తును. భావక్రియావాక్యము. వాఁడు రాకున్న నేను రాను అనురీతిగా వ్యతిరేకక్రియలు గలవాక్యమును వ్యంగ్యము చేయుచున్నది.

2. వ్యతిరేకక్రియలు గలవాక్యము భావక్రియలు గలవాక్యమునకు వ్యంజక మగును.

నీ వియ్య వేని నే నీయను. వ్యతిరేకక్రియలు గలవాక్యము. ఇది నీ విచ్చిన నే నిత్తును. అనురీతిగా భావక్రియలు గలవాక్యమును వ్యంగ్యము చేయుచున్నది.

3. భావక్రియయు వ్యతిరేకక్రియయుఁ గలవాక్యము.

వాఁడు వచ్చిన వీఁడు రాఁడు. ఇది వ్యతిరేకక్రియయు, భావక్రియయుఁ గలవాక్యము. వాఁడు రాకున్న వీఁడు వచ్చును అనురీతిగా వ్యతిరేకక్రియ, భావక్రియ యుభయము గలవాక్యమును వ్యంగ్యము చేయుచున్నది.

4. అట్లే వ్యతిరేకక్రియయు, భావక్రియయు గలవాక్యము.

నీ వియ్య వేని నే నిత్తును. భావక్రియయు (ఇత్తువు) వ్యతిరేకక్రియయు (ఇయ్యను) గలయీవాక్యము – నీ విత్తు వేని నే నియ్యను అనురీతిగా భావక్రియ, వ్యతిరేకక్రియ గలవాక్యమును వ్యంగ్యము చేయుచున్నది.

ఇట్టిసందర్భమునందలిభావక్రియలు 'ఏన్యంతతద్ధర్మార్థకములుగాను (వాఁడు

వచ్చు నేని) (వీఁడు వచ్చును) లేక యినన్నంతములు గాను (వాఁడు వచ్చిన వీఁడు వచ్చును) అని పూర్వార్థమునం దుండును. ఉత్తరార్థమునందు మాత్రము క్రియాపదము తద్ధర్మార్థకమే యై యుండును. వీఁడు వచ్చును.

ఇట్లే వ్యతిరేకక్రియావాక్యమునం బూర్వార్థమునందు వ్యతిరేకక్రియ యేన్యంతము గాఁగా (నీ వియ్య వేని) నుత్తరార్థమునందు వ్యతిరేకక్రియ మాత్ర ముండును (నే నియ్యను).

భావక్రియలవాక్యమునఁ బూర్వార్థమున ఏన్యంతతద్ధర్మక్రియ గాని, లేక యినన్నంతము గాని యయియుండు నని సూత్రకర్త వివరించుచుండఁగా తత్త్వ. 'ఇనన్' అనుప్రత్యయ మంతమునఁ గలతద్ధర్మార్థకములుగాను (390) అని పేర్కొన్నది. ఇనన్ప్రత్యయాంతము తద్ధర్మార్థక మగుట యెట్లో తెలియకున్నది. తద్ధర్మార్థమునం దినన్ ప్రత్యయము చెప్పినవా రెవరును గానరారు. 'ఇనన్ వృత్తం బగు భావలక్ష ణార్థమం దైనది'. (తత్త్వ. 407) కావున దీనిని దద్ధర్మార్థక మనుట పొసఁగదు. సూత్రకర్త యేన్యంతతద్ధర్మార్థకము గాని లేక యినన్నంతము గాని యని స్పష్టముగా నినన్నంతము తద్ధర్మార్థకము కాకుండుటనే చెప్పెను.

దీని నింక ననేకప్రకారములుగాఁ జెప్పవచ్చు నని సూత్రకర్త వివరించెను. నీవు వచ్చుచో, నీవు వచ్చునెడల – నేను రాఁగలను ఇత్యాదిగాఁ గూడఁ బ్రయోగింప వచ్చును.

అట్లే సూత్రకర్త యాదిపదంబుచే నితరంబు లూహ్యంబు లనియు వివరించెను. కానీ యీయాదిశబ్ద మిట లక్షణవివరణములం దెచ్చుటను గానరాకున్నది.

కానీ క్రియాన్వయవాక్యములే కాక యితరములును నిట్లు విరుద్ధార్థమును వ్యక్తము చేయుట ప్రసిద్ధమే.

అయినను శబ్దములు వ్యంజకము లవుట, వివిధవ్యంగ్యార్థములు నన్నవి ప్రత్యేక శాస్త్రవిషయములు. రసాలంకారాదులను గూర్చి ప్రస్తావింపవలసిన యవసర మీశాస్త్రమునకుఁ గానరాకున్నది.

కాఁగా నీలక్షణమును జెప్పవలసినయవసరము శబ్దశాస్త్రమునఁ గానరాదు. స్పష్టతకై కొంత వివరించె నని యూహింపఁదగును.

## కాక, కాని - అర్థవిశేషములు

**18. వాక్యసంగ్రహంబునం దినన్నంతక్రియాపూర్వకంబు లగు కాక కాన్యవ్యయంబు లనుక్తవాక్యపదగ్రాహకంబు లగు.**

వాక్యమును సంగ్రహించునప్పుడు ఇనన్ ప్రత్యయాంతము పూర్వమునందుఁ గలిగిన కాక, కాని యనునవ్యయములు సంగ్రహవాక్యమునం దనుక్తము లైన వాక్యపదములకు గ్రాహకము లగు నని యర్థము.

'నీవు నలునకుఁ బేర్మితో దేవి వైనఁ గాక నీసముజ్జ్వలరూపకాంతివిభవనిత్య సౌభాగ్యభాగ్యాభిజాత్యభద్రలక్షణావళు లవి సఫలంబు లగునె' అనునది సంగ్రహ వాక్యము. ఇందు (ఇ)నన్ ప్రత్యయాంతముపై నున్న 'కాక' అనునవ్యయమువలన 'సఫలంబు లగును, కాకున్న --- సఫలంబులు గావు' అనునర్థవిశేషము లభించు చున్నది. అనఁగా నీవ్యాసవాక్యముయొక్క యర్థమున ఇనన్‌పైఁ జేరిన 'కాక' యవ్యయమువలన సంగ్రహవాక్యమువలననే సిద్ధించుచున్న దన్నమాట.

అనుక్తవాక్యపదగ్రాహక మనుట కర్థ మేమి యన్నది వివాదాస్పద మైనది. తత్త్వ. 'సంగ్రహవాక్యమునందు అనుక్తము లయినపదములను కాక అవ్యయము స్ఫురింపఁజేయు నని భావ' (407) మని వివరించి, అయినన్ - అగును, కానిచో కావు అనుపదములకు గ్రాహక మయినట్లు స్పష్టము చేసినది.

అనుక్తము లైనపదములకు గ్రాహక మగు ననియే సూత్రకర్త తలంచియున్న యెడల 'అనుక్తపదగ్రాహకంబు లగు' నన్నఁ జాలును గదా? 'వాక్యపదగ్రాహకంబు లగు' నని వాక్యము నేల ప్రస్తావించెను.

ఘం. యథాసంఖ్యాన్వయము నాశ్రయించినట్లు తోఁచుచున్నది. దానివలన కాక శబ్ద మనుక్తవాక్యము గ్రహించుటకు, కాని శబ్ద మనుక్తపదమును గ్రహించుటకు (253) నని యీవ్యాఖ్య యర్థము చేసినది.

ఇట్టియథాసంఖ్యాన్వయదృష్టి సూత్రకర్త కున్నట్లు గానరాదు. సూత్రకర్త కాక శబ్దము స్థలమునవలెనే కాని శబ్దముస్థలమునను వ్యాసవాక్యము నదే పద్ధతిలో నిట్లు వివరించెను.

'నలున కాని నళినదళనేత్ర వరియింప దట్టె' - 'నలునే వరియించును కాని

వేఱొకని నలినదళనేత్ర వరియింప దట్టె' అని వ్యాసవాక్యమును జూపెను. ఈవ్యాస వాక్యమునందు 'కాని'ని ప్రయోగించుట విశేషము. 'నళినదళనేత్ర నలునే వరియించును వే ఱొకనిని వరింపదు' అనురీతిగాఁ జూపిన మాత్రమే చాలును.

కావున 'కాని' అనునది పదమాత్రగ్రాహక మనియు 'కాక' వాక్యమాత్రగ్రాహక మనియుఁ జెప్పుటకు సూత్రకర్తృవివరణమునం దాధారము గానరాదు. పైఁగా 'దేని నైనఁ గాక' అనుస్థలమున 'దేని నైనఁ గాని' యనురీతిగా కాని ప్రయోగము చేసినఁ బైయర్థము సిద్ధింపదా? అట్టియెడ నది యనుక్తవాక్యగ్రాహక మగునే కదా.

కావున యథాసంఖ్య మైనయన్వయ మిటఁ జేయరా దనుటయే యుక్తము.

కు.పం. అనుక్తవాక్యములకు పదములకును గ్రాహకము లగు నని చెప్పినది సుబో. 'అనుక్తము లగువాక్యమునకు గాని పదమునకు గాని గ్రాహకము లగు నని యర్థము' (290) చెప్పియు నలున కాని అనుచో ననుక్తపదగ్రాహక మని (291) వివరించినది. (సర్వ. 589)

కాక, కాని యనునవి రెండు వాక్యపదములు రెండింటికి గ్రాహకము లని సూత్రకర్త తలంచె నేమో. కానీ రెండుచోట్ల నావాక్యము గ్రాహక మైనందులకే వివరణము చేయఁబడినది. నలునే వరియించును అనునదియు వాక్యమే కదా.

ఇంక నీలక్షణము సమగ్రము గా దని కు.పం. గుర్తించినది. 'నలున కాని' అనుచో సూత్రమునందు నవధారణార్థకము పైని గలదు గాని యినన్నంతముపై లేదు. అయినను విశేషార్థము నిచ్చుచునేయున్నది. (కు.పం. 163మొ.)

ఇట్లు నలుని గాని వరింయింప దఁట యని యవధారణార్థకము లేకున్నను నిష్టార్థము సిద్ధింపఁగలదు.

అది య ట్లుండఁగా 'దేవి వైనఁ గాక సఫలంబు లగును' అని యున్నచో నావాక్య మీయర్థము నీయఁజాలదు. అసలు వాక్యము న ట్లుండదు. 'అగునే' యనురీతిగాఁ గ్రియాపదము ప్రశ్నార్థకైకారపరకము గావలెను. ఇది వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థము. కావున 'అగునె – కావు' అని యర్థము. 'దేవి వైనఁ గాక సఫలంబులు గావు' అనుచో 'దేవి వైన సఫలంబు లవును' అనువాక్యమునకు గ్రాహక మగును. అట్లె 'నలుని కాని వరియింపదు' అనుచోఁ గూడ గ్రియాపదము వ్యతిరేకార్థకమే యైయుండుట నియత మని తోఁచుచున్నది. 'నలుని గాని వరియించును' అనురీతిగా

భావక్రియతో వాక్య ముండుట గాని, యట్టివి నలుని మాత్రమే వరించు నని యర్థ మిచ్చుట గాని జరుగదు.

దేవి వైనఁ గాక సఫలంబులు గావు అనురీతిగా నట సయితము వ్యతిరేకక్రియయే యుండఁదగును. కాని అగునే అనునది కావు అనువ్యతిరేకార్థము నీఁ జాలియుండుటచేతనే అగునే అనుప్రయోగము కుదిరిన దని గ్రహింపవచ్చును.

కాఁగా కాక, కాని యనువానిప్రయోగముసందర్భమున వాక్యమందలి క్రియాపదము వ్యతిరేకార్థకమే యైయుండుట గమనింపఁదగియున్నది. దేవి వైనఁ గాక సఫలంబులు గావు (అగునె), నలుని గాని వరియింపదు. అనుచో దేవి వైన సఫలము లగును, నలునే వరియించును అనురీతిగా కాక, కాన్యవ్యయముల ప్రయోగసందర్భమున వ్యతిరేకార్థకక్రియ తద్వ్యతిరేకార్థము (స్వార్థము) నిచ్చుచున్న దని గ్రహింపఁదగును. అనుక్తవాక్యపదగ్రాహక మని యస్పష్టముగాఁ జెప్ప నక్కఱ లే దని తాత్పర్యము.

నీవు గాక ఎవరు? (నీవె) నీవు వచ్చినఁ గాని నేను రాను (నీవు వచ్చిన వత్తును) అనురీతి నితరస్థలములందును (సూత్రకర్త యుదాహరించినవానికి భిన్నములు. 'ఇనన్' పై 'కాని' సూత్రకర్త చెప్పుట గలదు గదా.) నిట్లే వ్యతిరేక క్రియ తద్వ్యతిరేకార్థము నిచ్చుట ప్రసిద్ధమే.

నీవు రాక నేను బోవను (నీవు వచ్చినఁ బోదును) నేను జదువక నీవు చదువవు (నేను జదివిననే నీవు చదువుదువు) ఇత్యాదిగా నితరస్థలములందు నీరీతియర్థస్ఫూర్తి ప్రసిద్ధమే యైయున్నది.

వ్యతిరేకక్రియాపదముతోడివాక్యము భావక్రియతోడివాక్యమును వ్యంగ్యము చేయుట (వాక్య. 9) సూత్రమున నింతకు ముందే పేర్కొనెను. దీనిని గూడ నందే సంగ్రహించి యీయీషద్భేదమును వివరణమునఁ గూర్పఁదగు నని తోఁచుచున్నది.

ఇది యి ట్లుండఁగా శ.ర.లోఁ గాక – తక్కన్ అనునర్థము తెలుపును. 'దేవి వైనఁ గాక' (శ.ర.) అని యర్థము వ్రాసి దీనినే యుదాహరించెను. కాక అను నవ్యయమునకుఁ దక్క ననునర్థ మంగీకృత మయినపుడు ప్రస్తుతలక్షణమే యనవసర మనవచ్చును. దేవి వైనఁ దక్కన్ సఫలంబులు కావు, దేవి వైననే సఫలంబు లగును. కాకున్నఁ గా వనుట 9 సూ.చే సిద్ధించును. కాక అనునది 'తక్కన్' అనునర్థమునం

దుండుటచేతనే తరువాతిక్రియాపదము వ్యతిరేకార్థమునందే యుండుట సంభవించు చున్నది.

'కాని' అనుదానికిఁ గూడఁ దక్కన్ అనునర్థమును శ.ర. పేర్కొనుచున్నది. కోపానల మేఁచియున్న నిబిడాటవిపైఁ బ్రసరించుతీవ్రదావానలుఁ బోలి శాత్రవు పయిం గవియించి నిల్చినం గాని (శ.ర.). శ.ర.లో ఇనన్నంతముపైఁ జూపుటయు, నిట వ్యాకరణమున నినన్నంతముపై నని చెప్పుటయు గమనింపఁదగును.

కాఁగా 'నిల్చినం గాని' యనుచోటవలెనే నలున కాని యనుచోఁ గూడ నలునే తక్క ననురీతిగా నర్థము గ్రహింపఁగా నింక నీసూత్రము చెప్పవలసినయవసర మేమి? ఇటఁ గూడఁ గ్రియాపదము వ్యతిరేకార్థమునం దుండుట కాని శబ్దముయొక్క తక్కన్ అనునర్థము ననుసరించియే యని గ్రహింపఁదగును.

ఈయంశమును 9వ సూత్రస్థలముననే సంగ్రహించుకొనఁదగును. కావున నటనే వివరింపఁదగును. ఇట్లు ప్రత్యేకముగా సూత్రింప నక్కఱ లేదు. ఈ సూత్రమును సమగ్రముగా, నిర్దుష్టముగా లేదు.

## కాని – విరుద్ధార్థము

**19. కొన్నియెడలం గాని క్రియాపూర్వకంబు పూర్వవిరుద్ధోత్తరార్థకం బగు.**

సూత్రార్థమును సూత్రకర్తయే యిట్లు వివరించెను. వాక్యంబులందు పూర్వార్థమునఁ గ్రియమీఁద వచ్చిన కాని యవ్యయ ముత్తరార్థముయొక్క యర్థము పూర్వార్థవాక్యముయొక్క యర్థమునకు విరుద్ధముగా నుండు ననుటను దెలుపుచున్న దని యర్థము.

'వాఁడు వచ్చును, కాని ...' కాని యనుటచేతనే తరువాతివాక్యము పూర్వ వాక్యమునకు విరుద్ధముగా నుండు ననుసూచనము 'కాని' శబ్దముచేతఁ గల్గుచున్నది. '...కార్యవ్యాసంగముచేత రాఁ డాయెను' అనుచు రాఁడు అనునుత్తరార్థమునందలి క్రియాపదము వ్యతిరేకార్థక మైయున్నది. వాఁడు రాఁడు (ఇటఁ బూర్వ మున్నక్రియ వ్యతిరేకార్థక మయినది) కాని నీనిర్బంధముచేత వచ్చివాఁడు' అనునది విశేషణ మయినను బూర్వార్థమునందలివ్యతిరేకక్రియకు విరుద్ధార్థకమే యవుటచే నిట్లు ప్రయోగించియుండవచ్చును. వచ్చెను అని క్రియాపదమునే ప్రయోగించిన నింకను స్పష్టముగ నుండెడి దీలక్ష్యము. లేక మొదటియుదాహరణమునఁ గ్రియాపదము

చూపఁబడినది గావున నిట విశేషముగా విశేషణరూపములు ప్రత్యేకదృష్టితోనే సూత్రకర్త ప్రయోగించియు నుండవచ్చును. ఏ మైనను బూర్వార్థమునకు విరుద్ధ మగునర్థము నిచ్చుచు నీయది ప్రస్తుతసూత్రమునకు లక్ష్య మగుట నిర్వివాదము.

ఇట కు.పం. 'ఈలక్ష్యములంబట్టి పూర్వాపదార్థములందలిక్రియ లేకకర్తృకము లైయున్నపుడే ఈసూత్రము వర్తించు నని భ్రమయరాదు. వాఁడు వచ్చుం గాని వీఁడు రాఁడు. ఇత్యాదిగను ఉండవచ్చు' (163) నని చెప్పినవిశేష ముచితముగ నున్నది.

'క్రియాపూర్వకం' బనుటచేఁ గ్రియాపదపూర్వకము గానపు డీవిరోధ ముండదు. వాఁడు గాని వీఁడు గాని రాఁడు. మొ.

## సంగ్రహవాక్యము

**20. కొన్నియెడల వ్యాసవాక్యమునకు ముందు సంగ్రహవాక్యంబు నొం దగు.**

వ్యాస మనఁగా విస్తృతము. విస్తృతవాక్యమునకు ముందుగా సంగ్రహవాక్యము ప్రయోగించుటయుఁ గల దని యర్థము. అనఁగా విస్తృతవాక్యార్థమునకు సార మనఁదగునభిప్రాయమును సంగ్రహవాక్యముగా ముందు పేర్కొని, యాపిదప వ్యాసవాక్యమును బ్రయోగించుట కల దని తాత్పర్యము.

'అయ్యా! యేను నీకు బ్రియంబు సేసెద'. ఇది సంగ్రహవాక్యము. ఇందు 'ప్రియము' అనుదానికి వివరణముగాఁ దరువాతివ్యాసవాక్యము గానవచ్చును. అనఁగా 'నీహృదయేశ్వరిపాలికిం బోయి, నీగుణంబులు దానికి వర్ణించి చెప్పి, యక్కన్య యన్యుల నపేక్షింపక, నీయంద బద్ధానురాగ యగునట్లు చేసెద' నను వ్యాసవాక్యమునందలియభిప్రాయమును సంగ్రహించి చెప్పుటకె ముందుగా సంగ్రహవాక్యము ప్రయుక్త మయినది. ఇ ట్లుండుట కొన్నియెడలఁ గల దని సూత్రమునభిప్రాయము.

'ఏను నీకుఁ బ్రియంబు సేసెద' ననుసంగ్రహవాక్యము లేకున్న నర్థమునం దెట్టిలోపమును గానరాదు.

ఇట తత్త్వ. 'కొన్నియెడల నొకే విషయమునే సంగ్రహముగాను విస్తరము గాను వేఱు వేఱు విధములుగాఁ జెప్పుచుందురు (అట్టితతి పునరుక్తిదోషము లేదు)

అట్టిస్థలమున సంగ్రహవాక్యము పూర్వమునను వ్యాసవాక్య మనంతరమునను బ్రయోగింపఁబడు నని భావ' (409) మన్నది. ఇం దొక్కవిషయము రెండు వాక్యములును జెప్పుచున్న వనుట యుచితముగాఁ గానరాదు. అట్లే చెప్పునెడల నయ్యది పునరుక్తము కాకుండుట మాత్ర మెట్లు? ప్రియము సేసెద నను సంగ్రహవాక్యము వ్యాసవాక్యమునర్థము నంతటిని జెప్పలేదు గదా. ప్రియంబు అనుదానిని వివరణమే తరువాతివాక్యము. వ్యాసవాక్యాభిప్రాయమును సంక్షేపముగా బేర్కొనుచున్న దన్న (ఘం. 225) యుక్తము. కాని ఒకే విషయము రెండుసార్లు చెప్పఁబడిన దనుట యుచితముగాఁ గానరాదు.

వాక్యప్రయోగమునందలి వైచిత్రినిగా నీయది గుర్తింపవచ్చును. ప్రయోగ స్వరూపము నభివర్ణించునీలక్షణము చెప్పఁదగినదే.

## వాక్యము - వాక్యాంతరగర్భము

**21. కొన్నియెడల వాక్యంబు వాక్యాంతరగర్భంబు నగు.**

కొన్నియెడల నొకవాక్యము మధ్యమునం దిం కొకవాక్య ముండుటయును గల దని సూత్రమునర్థము.

ఇందుల కెంత కాలం బయ్యె రాని కారణం బేమి?. అనునది లక్ష్యము. 'ఇందులకు రాని కారణం బేమి' యనునది వాక్యము. ఈవాక్యము మధ్యలో 'ఎంతకాలం బయ్యె' అనునిం కొకవాక్యము గలదు. 'ధర్మపరిపాలనపరు లై వీరులై రణనిహతు లైనరాజు లక్షయలోకసుఖంబు లనుభవింప నతిథు లై యిందులకు రాని కారణం బేమి' యనునది యిట వాక్యము. 'ఎంతకాలం బయ్యె' నన్నది మధ్యలోఁ జేరినది. కావునఁ బైవాక్యము వాక్యాంతరగర్భ మైన దని తాత్పర్యము.

ఇది సరి యైనలక్ష్య మగునా? ఇందులకు రాని కారణం బేమి? యని వాక్యము నన్వయించి యాపిదప నెంతకాలం బయ్యె ననువాక్యమున కర్థము చేయవలెను. కానీ దానియర్థ మేమి? ఇందులకు రాక యెంత కాల మయ్యె నని. అనఁగా నిట 'రాక' అనుదాని నధ్యాహారము చేయక తప్పదు. అట్టియెడల 'ఇందులకు రాక ఎంత కాలం బయ్యె' ననునదియే వాక్య మనియు రానికారణం బేమియనునది తరువాతివాక్య మనియుఁ జెప్పినచో వాక్యాంతరగర్భ మైనవాక్యముగాఁ జెప్ప నక్కఱ లేదు.

ఇందులకు రానికారణ మేమి? రాక యెంతో కాల మయ్యెను గదా! యను రీతిగాఁ జెప్పుటకంటె – రాక యెంతకాల మైనది. ఇంతకాలము రాకుండుటకు గారణ మేమి? యనురీతిగాఁ జెప్పుట సందర్భోచితముగా నుండును.

కాఁగా 'ఇందులకు రాక యెంత కాలం బయ్యె, రాని కారణం బేమి' యని యన్వయింపఁదగు ననియు, రాక యనునది యధ్యాహార మెట్లును గావలసియున్న దనియు గ్రహించుట యుక్తముగా దోఁచుచున్నది. అట్టియెడల నీయది యిట లక్ష్యము గాదు.

ఘం. 'ఆయుధిష్ఠిరుఁడు దమ్ములకుఁ దగునమాత్యులకు నిష్టభృత్యులకును, మీరు ప్రీతియు భక్తియు నాంబికేయునిదెస నతిశయిల్ల నారాజు పంచినయట్ల చేసి చరింపుఁడు అని యనుదినంబుఁ జెప్పు మనుజనాథ' (ఆశ్రమ. 1.10) (334) అని యిం కొకలక్ష్యమును జూపినది. కాని యిదియు వాక్యాంతరగర్భవాక్యముగాఁ జెప్పవలసినయవసరము గానరాదు. ఈప్రయోగమున మీరు మొద లగునది యనుకరణమున నిల్పఁబడియున్నది. అనుకరణముతోఁ గూర్పఁబడినయిది వాక్యాంతర మనఁదగునా? వాఁడు దాసో ఽహ మ్మనె ననుచో దాసో ఽహ మనునది యనుకృత మైనది. ఇదియు వాక్యాంతరగర్భవాక్య మనవలయునా? ఇ ట్లేని ననుకరణకలితస్థలములు పెక్కులు వాక్యాంతరగర్భవాక్యములుగాఁ జెప్పవలసి యుండును. అనుకృత మైనభాగ మెల్లఁ బ్రధానవాక్యావయవముగానే గ్రహింపఁ దగును. కావున వీనిని వాక్యాంతరగర్భవాక్యముల ననవలసినయవసరము లే దని తోఁచుచున్నది.

ప్రౌఢవ్యాకర్తయుఁ బూర్వసూత్రమునొద్ద 'శక్రుం డిది యేమి? ఎందులకుం బోయెద వని యడిగిన' ననులక్ష్యమున ఎందులకుఁ బోయెదవు' అనువ్యాస వాక్యమునకు ముందు 'ఇది యేమి' యనుసంగ్రహవాక్యము ప్రయుక్త మైన ట్లుదాహరించియున్నాఁడు. 'శక్రుండు ... అని యడిగిన' అనునది యసలు వాక్య మనియు నావాక్యముగర్భమున 'ఇది యేమి, ఎందులకుం బోయెదవు?' అనుసంగ్రహ వాక్యములు రెండు ప్రయుక్తము లైన వనియుఁ జెప్పవలసియున్నది. అదియును బ్రస్తుతసూత్రమునకు లక్ష్య మగునా? సూత్రకర్త ప్రస్తుతసూత్రమునొద్ద చూ. క్రింది అని సూచించెను. దీనికిఁ (దరువాతిసూత్రమునొద్ద ప్రస్తుతసూత్రసంబంధియంశ

మేమియు లేవు) బూర్వసూత్రమునందుఁ జూడు మని యర్థము. క్రిందటి నాఁ డిత్యాదులందువలె వెనుకటిసూత్రముస్థలమును గ్రహింపఁదగు నని యర్థ మొప్పును.

కానీ కు.పం. (160) తత్త్వ. (410) ఘం. (255) వ్యాఖ్యలు 'ఇందుల కెంత కాలం బయ్యె మున్నగుప్రస్తుతలక్ష్యముయొక్క పూర్తిపాఠమును బూర్వసూత్రమునొద్ద జూడవలసినదిగా వివరించినది. 'శక్రుం డిది యేమి' అనుతరువాతిలక్ష్యమును ప్రస్తుతసూత్రమునకు లక్ష్య మగు నని వివరింపలేదు. ఘం. విశేషముగా నిం కొకప్రయోగము చూపినది. కాని 'ఇది యేమి' మున్నగు వ్యాకర్త చూపినపూర్వసూత్ర స్థలమందలిలక్ష్యము నిట్టిదే. అదియుఁ జూపఁదగియున్నది.

కాని సుబో. మాత్రము 'ఇట్లు వాక్యాంతరముతోఁ గూడియుండుట సంగ్రహ వాక్యముతోఁ గూడినవ్యాసవాక్యములపట్లను కానవచ్చును. దీనియుదాహరణము ఇంక సూత్రోదాహరణములోనిచివరిది. ఈవిషయమే చూ. క్రిందు అనుదానిచే తెలుపఁబడుచున్నది (293) (సుగమ. 202) అని పేర్కొన్నది. (చూ. మీఁదు అనుచోఁ దరువాతిసూత్రమును జూడు మని కదా యర్థము. అట్టియెడల 'క్రిందు' అనఁగా మీఁదిసూత్ర మె ట్లగును?) వ్యాసవాక్యమునకు ముందు సంగ్రహవాక్యము ప్రయోగింపఁబడుటకును వాక్యము వాక్యాంతరగర్భ మనుటకును సంబంధము లేదు. కాని యటఁ జూపినలక్ష్యములలోఁ బ్రస్తుతసూత్రలక్ష్యములకుఁ బ్రసక్తి కాననగుచున్నది. కావున నట్లు సుబో. వివరించియుండనవు.

కాఁగా సుబో., సుగమ.ల ననుసరించి యొకే ప్రయోగము రెండుసూత్రములకు లక్ష్య మైనది. ఇట్టియెడల రెండుసూత్రములయొద్దను నాప్రయోగమును జూపుట ప్రౌఢవ్యాకర్తపద్ధతిగాఁ గానవచ్చుచున్నది. తా వచ్చె సుదర్శనాయుధుఁడు మున్నగు స్థలముల నిది కానవచ్చును. కానీ యిట నీలక్షణములు వెంట వెంటఁ జెప్పిన వగుటచేఁ బూర్వసూత్రలక్ష్యస్థలమునుండి గ్రహించుట సులువు గావున నిట సూత్రమును సూత్రకర్త ప్రత్యేకముగాఁ జెప్పలే దని తలంపవలయునా? అట్టియపు డిందుల కెంత కాలం బయ్యె ననులక్ష్యమును బూర్వసూత్రమునొద్దఁ జూపఁబడినదే. కావున నిట మఱలఁ జూపుట స్పష్టతకొఱ కనవలయునా? సూత్రకర్తయభిప్రాయ మస్పష్ట మయియున్నది.

'శక్రుం డిది యేమి? ఎందులకుం బోయెద వని యడిగిన' ననుచో ఎందులకుం

బోయెద వనునది వ్యాసవాక్య మనియు 'ఇది యేమి' యనునది సంగ్రహవాక్య మనియుఁ జెప్పుటచే నయ్యవి ప్రత్యేకవాక్యము లగుట స్పష్టము. కావున నీయది వాక్యాంతగర్భవాక్యమే యని సూత్రకర్త తలంచిన ట్లనుమానింపఁదగునా?

వాక్యము వాక్యాంతరగర్భ మైనపుడు గర్భమునం దున్నవాక్యాంతరము బృథగ్వాక్యముగాఁ జూపఁగా మిగిలినది సాధారణవాక్యము గావలసియుండు. 'ఇందుల కెంతకాలం బయ్యె, రానికారణం బేమి?' యనుచో గర్భమునందలి 'ఎంతకాలం బయ్యె' ననుదానిని బృథక్కరించుచు చూపఁగా 'ఇందులకు రాని కారణం బేమి? యనుమిగిలినభాగము వాక్యమే యగుచున్నది.

పైరీతియనుకరణస్థలములం దిట్టిది కుదురునా? 'శక్రుం డిది యేమి యెందులకుం బోయెద వని యడిగిన' ననుచో గర్భమందలి 'ఇది యేమి? ఎందులకుం బోయెద' వనువానిని వేఱుగాఁ జూపిన 'శక్రుం డని యడిగిన' మున్నగునది వాక్య మగునా? అన్వయము సరిపడునా? వాఁ డనె దాసో ౭హమ్ (ఇట్లే ఘం. చూపిన విశేషలక్ష్యమును) అనురీతిగా ననుకరణస్థలములందలివీనిని వాక్యాంతరగర్భ వాక్యములుగా సమన్వయించుట కవకాశము చాలదు.

రాముఁడు 'మీరు పొండు. నేను వత్తును. వాలిం జంపుదును. నీకు రాజ్య మిత్తు' ననెను. అనుచో 'రాముఁ డనెను' అనునది యనేకవాక్యములను గర్భమందుఁ గలిగినవాక్య మని చెప్పవలయును. అది యుచిత మగునా?

కావున 'శక్రుం డిది యేమి' మున్నగుపూర్వసూత్రలక్ష్యము దీనికి లక్ష్యము గా దని చెప్పుటయే యుచితము. చూ. మీఁదు. చూ. ఆసూత్రము మున్నగురీతిగా నిర్దేశించినయితరస్థలములందువలె లక్ష్యముపూర్తిపాఠము నాయయిచోట్ల గమనింపఁదగు ననునదే సూత్రకర్తయభిప్రాయము. అట్లె యిచటఁ గూడ 'ఇందులకు' మున్నగులక్ష్యముయొక్క పూర్తిపాఠమును బూర్వసూత్రస్థలమునుండి గ్రహింపఁ దగు నని చెప్పుట మాత్రమే సూత్రకర్తయభిప్రాయ మని గ్రహింపఁదగును.

ఏది యే మైనను ననుకరణస్థలము లిట్టివానిని బహుధా పరిశీలించినం గాని యాయవి వాక్యాంతరగర్భవాక్యము లగు నని కాని, కా వని గాని సిద్ధాంతీకరించు టకు వీలు లే దనుట ప్రస్తుతమునకు యుక్తము.

## భూతార్థకాసమాపకక్రియ – వాక్యాంతరజని

**16. భూతార్థకాసమాపకక్రియ వలయుచో వాక్యాంతరజనిస్థానం బగు. అగుచోఁ గర్త తత్కర్తలందలిదియ యెద్ది యే నొం డగు.**

సూత్రమునర్థమును సూత్రకర్తయే వివరించెను. 'వలసినప్పుడు కొన్నియెడల భూతార్థకాసమాపకక్రియనుండి వాక్యాంతరము పొడమును. అప్పుడు దానికిఁ గర్త యాయసమాపకక్రియాకర్తృసముదాయంబునం దుండునదియే యే దైన నొక్కటి యగు నని యర్థము.

ధవళాక్షుల్ చని కాంచిరి. కని కద్రువ వినతం జూచి. ఇచట కని యనుక్త్వార్థకము నుండి వాక్యాంతర మారంభ మైనది. 'కద్రువ వినతం జూచి' మొద లగునది వాక్యము.

ధవళాక్షుల్ కాంచిరి. అనుటచేఁ గద్రువయు వినతయు నిద్దఱును జూచిరి. కావున 'కని' అనుదానికి కద్రువయు వినతయు నిద్దరును గర్తలే. ఇట నుండి ప్రారంభ మైనవాక్యమున నీక్త్వార్థకమునకుఁ గర్త లైనవానిలో నేదో యొకటే కర్త యగుట గల దని యర్థము. 'కద్రువ వినతం జూచి' యను మొద లగుతరువాతి వాక్యమునఁ 'గద్రువ' యొక్కటియే కర్త. అనఁగా 'కని' యనుదానికర్త లగు 'కద్రూవినతలు' రెంటిలో వాక్యాంతరమునఁ గద్రువ యొక్కటియే కర్త యైన దన్న మాట.

ఇటఁ దత్త్వ. 'ధవళాక్షుల్ చని కాంచిరి. అనువెనుకటివాక్యము సమాప్త మయ్యెను. 'కని' అనుక్రియలోనికి కర్తగా ధవళాక్షు లనుపదము నధ్యాహరించుకొనుటకంటె సమాప్తమున నున్న 'కద్రువ' యనుపదమె కర్తృవాచక మనుట సమంజసము. కద్రువ అశ్వోత్తముని, వినతను జూచి యని యర్థము. కావున నిది యుదాహరణము కాఁజాల '(403) దని పేర్కొన్నది. ఇది యుక్త మగుసమన్వయము. అంగీకార్యము. కావున నిది లక్ష్యము గా దనుటయే లెస్స. ఇందు సందర్భమున ననౌచిత్య మేమియో ఘం. స్పష్టము చేయకయే సందర్భోచితము గా దనుట విచార్యము. (ఘం. 321)

క్త్వార్థకరూపము వాక్యాంతరజనిస్థాన మగు ననుటచే నంతకుఁ బూర్వము వాక్యము ముగియవలసియున్నది. కానీ 'దేవలోకంబున కరుగువా రెదుర ద్వాపరంబులో వచ్చుకలిం గని, శక్రుం డిది యేమి? ఎందులకుం బోయెద వని

యడిగిన' అనుచో 'కని' యనుక్త్వార్థకరూపమునకు ముందు వాక్యము ముగియలేదు. సూత్రకర్త 'కని, కనిరి అందు' అనురీతిగా నర్థము చేసెను. ఏది యే మైనను 'గని' యనుదానికి నింద్రాదులు కర్తలు గాఁగా, 'శక్రుం డిది యేమి' యనుతరువాతి వాక్యభాగమున కింద్రుఁ డొక్కఁ డే కర్త యగుచున్నాఁడు. కాని కర్త యగుశక్రుఁడు ప్రత్యేకముగాఁ బేర్కొనఁబడుట గమనింపఁదగును.

ఈలక్ష్యముంగూర్చి తత్త్వ. 'ఇట కలిం గనన్ అనియే సాధుపాఠ మయి యుండు ననియు, కని యనియుండట లేఖకాదిదోష మనియు, భావలక్షణార్థము గాఁగా, సమానకర్తృకత్వ మక్కఱ లే దనియు భావించినది (403). ఉన్నపాఠమును సవరింపఁ బూనుట యుచితము గానేరదు(ఘం. 321). ఒక్కొక్కసిద్ధాంతము ననుసరించి యొక్కొక్కరీతిగా లక్ష్యములు మాఱుపాటు చెందుచున్న నసలురూపము లభ్యము గాకుండఁబోవును.

ఇది య ట్లుండఁగా నేఁటిముద్రితప్రతులందు నియ్యది ప్రౌఢవ్యాకర్త చూపిన తీరుగాఁ గానరాకున్నది. 'దేవలోకంబున కరుగువా రెదుర ద్వాపరంబుతో వచ్చు కలిం గని యెందులకుం బోయెద వని యడిగిన నింద్రాదులకుఁ గలి యి ట్లనియె' (అర. 2. 57) నని కన్పించుచున్నది.

వ్యాకర్త చూపినపాఠమున నింద్రుఁడే యడిగినట్లును నింద్రునకే కలి సమాధానము చెప్పినట్లు నుండఁగా, ముద్రితప్రతులం దింద్రాదు లందఱు నడుగ నింద్రాదు లందఱకుఁ గలి సమాధానము చెప్పినట్లును నున్నది. దీని కిటఁ బాఠాంతరము గూడఁ జూపఁబడకుండుట విశేషమే. (వావిళ్ల. 55పుట)

దీనింబట్టి వ్యాసవాక్యమునకు ముందు సంగ్రహవాక్యము గల దనుటకు నీయది లక్ష్యము గాకుండఁబోయినది. (వాక్య. 20) ఇందుఁ గవిప్రయుక్తము సరి గా దని భ్రాంతిచే నీపాఠము కల్పింపఁబడియుండు నని ఘం. ఊహించినది. పాఠాంతరము లిట్లె యేర్పడు నేమో.

ప్రౌఢవ్యాకర్త యెచ్చోట నుండి యాపాఠమును గ్రహించెనో. కేవలము తిరస్కరింప రాకున్నను నీయది ప్రబలప్రమాణ మగుటకు మాత్ర మవకాశము లే దని గుర్తింపఁదగును.

అరణ్య. 55. 1. లోకపాలాః దదృశు రాయాన్తం ద్వాపరం కలినా సహ, 55. 2.

శక్రః సంప్రేక్ష్య కలౌ బ్రూహి, 3. అబ్రవీత్ కలి శ్శక్రమ్. అనుమూలము వ్యాకర్తపాఠమును బ్రమాణీకరించుచున్నది.

శుంభనిశుంభు లుగ్రకోపను లయి డాసి, ....ఉగ్రకోపను లయి రా శుంభనిశుంభు లతిభైరవ' అని యున్నపాఠాంతరమే యుచిత మని సుబో. (283) తత్త్వ. (404) పేర్కొన్నవి. 'శుంభుఁడు గవిసె' ననుదానికంటె వ్యాకర్త చూపినపాఠమునన్వయములో సౌలభ్యము గలదు. కానీ ముద్రితప్రతులలో నీపాఠమే గానవచ్చు. నిశుంభుఁడు దాఁకఁగా నాపిదప 192 పద్యమున 'స్ఫూర్తిమైఁ దాఁకె శుంభుం డని' శుంభుఁడు దాఁకుట చెప్పఁబడె "ఇ ట్లన్నయు న్దమ్ముఁడు నిశ్చలమేఘద్వంద్వలీల శరసముదయవృష్టితోఁ గప్పుట" వర్ణితము. వ్యాకర్త పాఠమున మొదట శుంభుఁడు దాఁకుట చెప్పఁబడుటచేఁ దరువాతిపద్యము(192)నను శుంభుని దాఁకుటయే చెప్పఁబడుచో అన్నయు న్దమ్ముఁడు దాఁకుట సమర్థించుకొను టెట్లో? వ్యాకర్త చూచినప్రతిలో తరువాతిపద్య (198) మె ట్లున్నదో. కాని యిట మూలమున 'చకార కోప మతులం రక్తబీజే నిపాతితే శుమ్భాసురో నిశుమ్భ శ్చ హన్యమానం తథా సైన్యం విలో క్యామర్ష ముద్వహన్, అభ్యధావ న్నిశుంభో ముఖ్య యాసుర సేనయా, త స్యాగ్రత స్తథా పృష్ఠే పార్శ్వయో శ్చ మహాసురాః, సన్దష్టోష్ఠపుటాః క్రుద్ధా హన్తుం దేవీ ముపాయయుః. 'ఆజగామ మహావీర్య శ్శుమ్భో కపి (మార్కం. 84.2-5 శ్లో) అని నిశుంభుఁడు ముందును శుంభుఁడు పిదపను గవిసినట్లు గలదు. అనువాదమున 198-190-192 పద్యములను గమనించినచో నిట దాదాపుగా యథాతథానువాదమే యని తెలియవచ్చును. కాన, నిశుంభుఁ డను ముద్రితపాఠమే యథామూల మై సమంజస మని నిర్ణయింపఁదగియున్నది. కావున వ్యాకర్త చూపినపాఠ మంగీకార యోగ్యముగా లేమి నిట నది లక్ష్యముగా దనవచ్చును.

ఇ ట్లీసూత్రమునకుఁ బ్రబల మైనయాధారము లేకుండఁబోయినది. వఝలవారు 'అయ్యిద్దఱుఁ జేర నరిగి ప్రణామంబు లాచరించి కృష్ణుండు ప్రాంజలి యై యతని కి ట్లనియె' (హరి.ఉత్త.1.34) (ఘం.321) ఇట ఇది బల మైనప్రయోగమే. 'ప్రణామంబు నాచరించియుండఁగా నందు కృష్ణుండు' అనురీతిగా నర్థము చేయ వలయును.

ఇటఁ దత్త్వ. సమానకర్తృకస్థలములందే క్త్వార్థక మగు నిప్రత్యయము రావలసి

యుండఁగా నిటఁ గర్తృభేద మున్నను ఇప్రత్యయాంతక్రియ ప్రయోగింపవచ్చు నని (దీనికంటె ఇప్రత్యయము వచ్చు నని చెప్పుట యుచితముగా నుండు నని తోఁచుచున్నది) యనుమతింపఁబడుచున్న (403) దని పేర్కొన్నది.

ఇటఁ గర్తృభేదము మాత్రమే కాక పూర్వకాలికత్వమును లే దని గుర్తింపవలసి యున్నది.

'కని కద్రువ వినతం జూచి' యనుచోఁ గద్రూవినతలు ఇద్దఱు కర్త లైనచో వినత చేసినది ఉచ్చైశ్శ్రవమును గనుట యొక్కటే. వినతం జూచినది కద్రువ మాత్రమే కదా. వినతకర్తృత్వపక్షమునఁ బూర్వకాలికత్వ మేది?

కావునఁ బ్రత్యయము సమానాశ్రయములందే కాక యితరస్థలములందును బూర్వకాలికమున కగుట గల దని గుర్తింపవచ్చును. కానీ ప్రస్తుతసూత్రము ఇప్రత్యయమును గూర్చి ప్రస్తావించునదిగాఁ దలఁప వీలు లేదు. వాక్యవిషయకము కావునఁ గర్తృత్వాదులను గూర్చి చెప్పుటయేసూత్రకర్తయుద్దేశ్యముగా గ్రహింపఁ దగును.

ప్రస్తుతవిధానమునకు బలమును జేకూర్చులక్ష్యము లింకను వెదుకఁదగియున్న వనవచ్చును. లేదా వఝులవారు చూపినప్రయోగము నాశ్రయించి సార్థక్యము నెన్నవలయును. కాని వాక్యాంతరజనిస్థాన మనుట సమర్థింపఁబడవలె నన్న 'ప్రణామం బాచరించిరి, అందు కృష్ణుండు' అని యర్థము చేయవలెను. అయ్యది వింతగాఁ గానవచ్చుట మాత్రము నిర్వివాదము.

ఈలక్షణమునకు సయితము లొంగనివిశేషప్రయోగములు గల వని సూత్రకర్త వివరించెను. అందు 'నలుఁడు దమయంతీద్వితీయుండై యుండి' యను మున్నగునది సూత్రకృదభిప్రాయమున కనుగుణముగా లే దని సుబో. (288) ఘం. (250) స్పష్టము చేసినవి.

## పదము

**2. పద మనఁగాఁ బ్రయోగార్హంబు ననన్వితంబు నేకంబు నర్థబోధకంబు నైనవర్ణము లేక వర్ణసముదాయము.**

'వర్ణాః పదం ప్రయోగార్హానన్వితైకార్థబోధకాః' అని మూలము.

ప్రయోగించుట కర్హ మైనది ప్రయోగార్హము. న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి ప్రత్యయః. (ఘుం. 335) అనుటంజేసి కేవలము ప్రాతిపదికలు, ధాతువులు మున్నగుప్రకృతులు ప్రయోగార్హములు గావు. అట్లె ప్రత్యయములు మొద లగు నపదములును బ్రయోగార్హములు గావు. అట్లు గానివి సుబంతములును దిఙంతములు నైనపదములే. ప్రయోగార్హము లవుటచే నట్టివే పదము లనఁ దగును. (పద మగుటచేఁ బ్రయోగార్హత యని కాక, ప్రయోగార్హతచేఁ బదత్వ మని విశేషసమన్వయము.

'ప్రయోగార్హము' అనుటచేత ఖ, ఘట అను మొద లగుప్రాతిపదికలు పదములు గానేర వని వ్యాకర్త ప్రత్యుదాహరణములను బ్రదర్శించెను. 'ప్రయోగా ర్హేతి ప్రాతిపదికస్య వ్యవచ్ఛేదః' అని మూలము. సూత్రకర్త తదనుసారముగనే యిటఁ బ్రాతిపదికములను జూపినట్లు గ్రహింపవచ్చును. ఇట్లే ధాత్వాదు లయిన ప్రకృతులును బ్రయోగార్హములు గావు.

అట్లె యయ్యది యనన్వితమును గావలె ననఁగాఁ బరస్పర మొకదానితో నొకటి కన్వయము గలదానిమొత్తమును బదముగా గ్రహింపరాదు. 'ఖంబు ఘటంబునం దోఁచెడి' ననుచో నీశబ్దము లన్వితము లైయుండుటంజేసి దీనిమొత్తమును బద మనరా దని వ్యాకర్త వాక్యమును బ్రత్యుదాహరణముగాఁ జూపెను.

'అనన్వి తేతి వాక్యమహావాక్యయోః' అని మూలము. అనఁగా వాక్యమహా వాక్యములు పదము గా దనుటకై, వానికిఁ బదత్వమును వారించుటకయి యనన్విత మనుదళము కూర్పఁబడిన దన్నమాట. సూత్రకర్త వాక్యము నిటఁ బ్రత్యుదాహరణ ముగాఁ జూపుట మూలానుసారముగనే యని గ్రహింపవచ్చును.

'ఏక' మైయుండవలె నన్నది ప్రయోగార్హ మయ్యు, ననన్వితమే యైనను ననేక మయినది పదము గాదు. 'ఖంబును ఘటంబును' అని దీనికి సూత్రకర్త ప్రత్యుదాహృతిని జూపెను. ఇట నీరెండుశబ్దములు పరస్పర మన్వయించునవి కావు. ప్రయోగార్హములు నైనవి. కావున నిది మొత్త మొకేపద మనుటకు వీలు లేదు.

'ఏక తేతి సాకాంక్షానేకపదవాక్యానామ్' అని మూలము. 'అనేకాకాంక్షాణా మన్వయబోధజనకానా మనేకానాం పదానాం వాక్యానాం చ సముదాయస్య

వ్యవచ్ఛేదః ఇత్యర్థః. తథా చాయోగ్యానా మనాంకాంక్షాణా మనాసన్నానాం చ సముదాయస్య అనన్వితార్థబోధకత్వే ౭పి న పదత్వ మితి భావః' అనువివరణమున కీప్రత్యుదాహరణము చాలవఱకు ననుగుణ మైయున్నది.

అర్థబోధక మనఁగా శబ్ద మది యర్థమును బోధించున దై యనఁగా నర్థవంత మయియుండవలయును. 'కచటతప' మొద లగువర్ణములు ప్రయోగార్హములు. అనన్వితములు, ఏకములు నైనను నర్థవంతములు గామి నయ్యవి పదము లనఁ బడ వని సూత్రకర్త ప్రత్యుదాహృతిని బ్రదర్శించెను.

'అర్థబోధకా ఇతి – కచటపేత్యాదినామ్' అనుమూలము ననుసరించియే కచటతప లనర్థబోధకములు గానఁ బదములు గా వని సూత్రకర్త వివరించినట్లు స్పష్ట మగుచున్నది.

పైలక్షణములు గలిగిన వర్ణము, లేదా వర్ణసముదాయము పద మగు నని తాత్పర్యము.

ఘటంబు. ఇది కేవలము ప్రకృతి గానీ, లేదా ప్రత్యయము గానీ, యయి యుండమింజేసి ప్రయోగార్హ మయినది. వే ఱొకదానితో నన్వయము గలిగి యుండమిచేత ననన్విత మయినది. ఇది యేకము నైయున్నది. 'కూడ' అనురీతిగా నర్థమును బోధించుచున్నది. కావున నర్థబోధకము నైనది. కాఁగాఁ బ్రయోగార్హత. అనన్వితత్వము, ఏకత్వము, అర్థబోధకత్వము అనునాలుగులక్షణములు గలిగినది గావున నీవర్ణసముదాయము పద మగుచున్నది.

ఈసూత్రము లక్ష్యములను సూత్రకర్త ఖంబు, ఘటంబు అనురెండింటిని జూపెను. వర్ణము లేక వర్ణసముదాయ మనువానికిని గ్రమముగా నుదాహరణము లని చెప్పవలసియున్నది. అట్టియెడల ఘటంబు వర్ణసముదాయపదమునకు లక్ష్యము. కాఁగా 'ఖంబు' అనునది వర్ణంబు పద మైనందుల కుదాహరణ మని సూత్రకర్త యభిప్రాయ మనవలెను.

కానీ 'ఖంబు' అనునది యొకేవర్ణ మనుట మాత్ర మసంగత మనక తీఱదు. దీనిం గూర్చి తత్త్వ. 'వర్ణ మనఁగా నేకాక్షరప్రాతిపదికము గల దని భావము. కానిచో ఖంబు అనునది రెండక్షరములు గలపద మగుటచే నుదాహరణము కాకపోవు' (381) నన్నది. ఏకవర్ణము పద మని సూత్రము చెప్పుచుండఁగా

నేకాక్షరము ప్రాతిపదికముగాఁ గలది యనురీతిగా నర్థము చెప్పు టెట్లు పొసఁగును. ఈసూత్రము ప్రాతిపదికమును గూర్చి కాదు గదా చెప్పుచున్నది.

ఇట మూలమున వర్ణాః అని బహువచనమే కలదు. అయినను 'వర్ణా ఇతి బహువచన మవివక్షితమ్' అని చెప్పఁబడినది. తద్వ్యాఖ్యానములో 'న న్వేకవర్ణ ద్వివర్ణ పదయో రవ్యాప్తి ర్వర్ణబహుత్వాభావాత్. అత ఏవ వర్ణాః ఇతి' అని చెప్పఁబడినది. కావున నీసూత్రకర్త సూత్రముననే 'వర్ణము లేక వర్ణసముదాయము' అని పేర్కొనియుండవచ్చును.

కానీ తెలుఁగు నేకవర్ణ మే లని ద్వివర్ణయుత మగుచో వర్ణంబులు అను బహువచనముచేతనే సంగ్రహింపఁబడును. సంస్కృతమునవలెఁ దెలుఁగున ద్వివచనము లేదు గదా. ఇట తత్త్వ. 'వర్ణముగా నచ్చు గాని యచ్చుతోఁ గూడిన హల్లులు గానీ యగును. ఖ అనుప్రాతిపదికమునందు ఖకారము అకారము అనురెండువర్ణములు గలవు. కావున నిది యేకవర్ణపదము కాదు. 'వర్ణసముదాయ మనఁగా రెండువర్ణములు గాని (ఇటఁ గూడ నక్షర మనియే గ్రహింపవలె నని యీవ్యాఖ్యయభిప్రాయము గుర్తింపనగును. కేవలవర్ణ మయినచో రెండు వర్ణములు గలది 'ఖ' అనుదానిస్థలముననే సంగ్రహింపఁబడఁగలదు) అంతకు మించిన సంఖ్య గలవర్ణములు గాని గ్రహింపఁబడును. ఘట అనునది రెండక్షరములు గల ప్రాతిపదిక (381) మన్నది. ఏకవర్ణము పదము (వర్ణసముదాయము పదము) అనుచోటఁ బ్రాతిపదికయే యేకవర్ణముగా నుండు నని సూత్రమునకు నసహజముగా నర్థము చేసినప్పటికిని వర్ణ మనునది యిట సరిగా నన్వయించుట లే దని దీనివలన స్పష్ట మగుచున్నది. 'ఖ' అనుప్రాతిపదికనే స్వీకరించినను, నిందు ఖకారాకారములు రెండువర్ణములు గలవు. ఏకవర్ణ మగుట యెట్లు? అందుకై వర్ణ మనఁగా నచ్చు గాని యచ్చుతోఁ గూడినహల్లు(లు) గాని యగు నని వివరించుకొనవలసివచ్చినది. అచ్చులు వర్ణము లగును. నీయచ్చుతోఁ గూడినహల్లు వర్ణ మగుట యెట్లు? అచ్సహిత మైనహల్లు వర్ణ మనుచో నజ్రహిత మైన హల్లును వర్ణ మనరాదా? ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియై దనుచోటఁ గేవలము హల్లు వర్ణముగాఁ బరిగణింపఁబడియే యున్నది.

'నువర్ణంబు ద్వితీయ, నవర్ణంబు పరం బగునపు' డిత్యాదిస్థలములందు స్వర సహిత మగువర్ణమును నిర్దేశించి వర్ణ మనుచో నట మాత్ర మచ్సహితముగా

హల్లు గ్రహింపఁబడుట గలదు. మికారము అనురీతిగా ప్రౌఢ. స్వరసహిత వ్యంజనముపైఁ గారప్రత్యయము చేసి ప్రయోగించుట విశేషము.

అట్టియెడల స్వరముతోఁ గూడియున్నను గూడకున్నను హల్లు(లు) వర్ణము లనవలసియుండును. ఇట్టివ్యవహారము గానవచ్చుట లేదు.

ఏకవర్ణ మనుదానికి ఖంబు అనునది యుదాహృతి కానేరదు. ఇంక ఔ (ను) ఈ (ఇమ్ము) అనురీతివి లక్ష్యములు గాఁగలవు. ఓ, ఏ (ప్రశ్నాద్యర్థక మైన యవ్యయము) మున్నగునవి సయిత మిట నుదాహరించుకొనవచ్చును.

తత్త్వ. వర్ణ మనఁగా నచ్చు కాని, లేక అచ్చుతో గూడిన హల్లులు అనురీతిగా జేసినవివరణము 'అక్షరము' అనుదానికి సరిపడును. సూత్రకర్తకు నిదే యభిప్రాయము గల దనుచో (అ ట్లయినను ఖంబు ఏకాక్షరపదము గానేరదు) వర్ణము లేక వర్ణసముదాయ మని కాక, అక్షరము లేక యక్షరసముదాయ మని సూత్రించుట యుక్తము. అపుడు పైని బేర్కొన్న ఓ, ఏ, ఔ – మున్నగునవియే కాక క్ష్మా, మా, ధీ మున్నగునవి సయితము ఏకాక్షరము లయినపదములకు లక్ష్యములుగా నిలువ వచ్చును. క్ష్మా యనునది వర్ణసముదాయపద మని సూత్రము ననుసరించి చెప్పవలె. అట్లు చెప్పుటవలన నష్ట మేమియు లేకున్నను అక్షరము లేక యక్షరసముదాయ మనుటవలన నేకాక్షరపదములకు లక్ష్యములు గొంతవఱకే నధికముగా సిద్ధించెడివి. కావున నట్లు చెప్పిన బా గుండెడి దేమో యని తోఁచుచున్నది.

ఇంక సూత్రమునందలిమిగిలినదళములసార్థక్యమును గూర్చి పరామర్శింతము.

ప్రయోగార్హ మనుటం గూర్చి సర్వ. 'కేవలప్రాతిపదికమును గాని కేవల ప్రత్యయమును గాని ప్రయోగింపరాదు (569) అని పేర్కొన్నది. ఇది కొంతవఱ కుచితమే. కానీ 'అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదిక' మ్మని ప్రాతిపదికలక్షణము ననుసరించి ధాతువు ప్రాతిపదికము గాదు. ప్రత్యయమును గాదు. కానీ యిదియుఁ బ్రయోగార్హము గాదు గదా. ఇట మూలమున 'ప్రాతిపదికస్య వ్యవచ్ఛేదః అని చెప్పఁగాఁ దద్వ్యాఖ్యాత ' ఏత దుపలక్షణం ధాతో రి త్యపి బోధ్యమ్' అని పేర్కొనెను. ఇట సుగమ. 'ప్రత్యయము చేరనిప్రకృతి గాని, లేదా ప్రత్యయము గాని ప్రయోగింపఁ దగ దనుట యుక్తమే. కాని ప్రత్యయముతోఁ గూడినప్రకృతియే పద మనఁబడును (241) అనుట యంత సముచితముగాఁ గానరాదు. కృత్తద్ధితములు ప్రత్యయము

లనుట యంత సముచితముగాఁ గానరాదు. కృత్తద్ధితములు ప్రత్యయములే యైనను నవి చేరినకృదంతములు 'కృత్తద్ధితసమాసా శ్చ' యని మఱలఁ బ్రకృతులే యవును. కావునఁ బ్రకృతి గాని, ప్రత్యయము గాని ప్రయోగార్హము గా దని చెప్పుటయే యుక్తముగా నుండును. ప్రత్యయము చేరనిమూలరూపము ప్రకృతియే యవును. ధాతువులును బ్రయోగార్హములు కాకుండుట సిద్ధించును. (పత్యయము లాగమాదుల కుపలక్షణ మనవలె?)

కాఁగాఁ బదముయొక్క ప్రధానలక్షణ మగుటచే నీదళ మవసరమే యని నిర్ణయింపఁదగును.

'అనన్వితంబు' అనులక్షణమునుగూర్చి సర్వ. 'ఖంబు ఘటంబునం దోఁచెడి' అనుచోట పరస్పరాన్వయము గల పదములసముదాయము గలదు. కావున వానిని సంబంధసూచకము లున్నంతవఱకు పదము లనరా' (569) దన్నది. ఇట వ్యాఖ్యానమున సంబంధసూచకము లన నేమో వివరించిన స్పష్ట మయియుండెడిది. తత్త్వ. 'ఏకము అనువిశేషణముచేత యీవిశేషణము(అనన్వితము)వలనఁ గల్గు లాభము సిద్ధించును. పదాంతరములతో నన్వయించిన పదము (వానితోఁ గూడి) ఏక(పద)ము కాదు గదా. ఖంబును ఘటంబును అనునవి (రెండును కలిసి) ఎట్లు ఏకపదము కాఁజాలవో, అట్లే 'ఖంబు ఘటంబునం గల' దనువాక్యమును పదము కాఁజాలదు. అందుచే లక్షణమున ననన్వితంబు అనుదళ మనావశ్యక (381) మనుట యుచితముగానే యున్నది.

మూలమున 'అనన్వి తేతి వాక్యమహావాక్యానామ్, ఏకతా సాకాంక్షానేక పదవాక్యానా' మ్మని రెండుసందర్భములు వాక్యమున పరిహరింపఁబడుట స్మరింపఁ దగును.

నిజమునకు 'నిప్పుచేఁ దడుపుచున్నాఁడు అనుచో యోగ్యత లేదు గావున నయ్యది వాక్యము గాదు. అనఁగాఁ బదార్థ మన్వితమగుట లేదు. అనన్విత మాయెను గదా యని నిప్పుచేఁ దడుపుచున్నాఁడు అనునది మొత్తము పదమునఁ జెల్లునా?

ఆకాంక్షారహిత మగు గోవు, గుఱ్ఱము (ఇట సూత్రకర్త యుదాహరించిన ఖంబును ఘటంబును అనునవి సైత మిట్టివే యనవచ్చును.) (ఆసత్తి లేకున్న పదసమూహము) మున్నగునవి సయితము మొత్త మొకేపదము లనఁజెల్లునా?

అందుచే నిట మూలమున 'తథా చ అయోగ్యానా మనాకాంక్షాణా మనాసన్నానాం చ సముదాయస్య అనన్వితార్థబోధకత్వే కపి న పదత్వ మితి భావః అని వివరింపఁ బడుట గ్రహింపఁదగును. అది యెట్లు? 'ఏక' శబ్దప్రయోజనమే అనఁగా నిట్టిచోట్ల యేక మయియుండుటచే నాపదసముదాయ మెల్ల నొకేపదము గా దన్నమాట.

అనన్వితస్థలములందు సయితము యోగ్యతాకాంక్షాదిరహితములయందు మొత్తమునకుఁ బదత్వ మనేకశబ్దమే వారించుచున్నది. ఇంక ననన్వితము లగు స్థలములందు వారింపదా? అన్వితము గావచ్చు. అయినను నీయది యేకము గాదు గదా. అనేక మయియుండుటచేతనే యన్వితస్థలములందును బదసముదాయము మొత్త మేకపదముగా గ్రహించుట కవకాశము లేకుండ, ఏకశబ్దము ప్రయోజనవంతమే యగుచున్నది. కావున ననన్విత మనుదళ మనవసర మని చెప్పుట యుచితముగానే గుర్తింపఁదగును.

ఇట మూలవ్యాఖ్యనములం గొన్నింట 'విశిష్టవాక్యార్థస్య విశేషణవిశేష్య అతిరిక్తత్వేన ఏకత్వ మి త్యభిప్రాయేణ ఇదం లక్షణమ్. అనన్వితైకార్థబోధకాః ఇత్యనే నైన వాక్యవారణే అనన్విత ఇ త్యుపాదానం వ్యర్థం స్యా' త్తని యున్నది.

కానీ యసలు ఏకము అనుదళము మాత్ర మవసరమా యని యనుమానము. యోగ్యతాకాంక్షసత్తు లున్నను నయ్యది పదసముదాయము(వాక్యము)గనే లక్షణము చెప్పఁబడినది. ఈవ్యాకరణమందు సయితము యోగ్యతాకాంక్షాసహితం బగునాసత్తి యుక్తపదసముదాయము వాక్య మనుచో యోగ్యాతాకాంక్షాసత్తులు లేకున్న నయ్యది వాక్యము గాదు, గాని పదసముదాయ మగుట కభ్యంతరము లేదు గదా. ఇ ట్లీ యవి పదసముదాయము లని పేర్కొనుటచేతనే పదములయొక్క సమూహ మని స్పష్ట మగుచుండఁగా నయ్యవి మొత్తము నొకేపదము గా దని చెప్ప నేల? పదసముదాయము వాక్య మనుటచేతనే వాక్య మొక్కపదము గా దని స్పష్ట మగుట లేదా? పదసముదాయము పదము గా దని చెప్పుట వ్యర్థము.

ఏకము అని చెప్పనిచో నష్ట మేమి? రెండుపదములు గలిసి యొకేపదము కావలసివచ్చునా? అనఁగా 'ఖంబును ఘటంబును' అనునవి మొత్త మొకే పదము గావలయు నన్నమాట. వీనియందుఁ బ్రయోగార్హత, అర్థబోధకత్వము (అనన్వితత్వము) కలిగిన వర్ణసముదాయ మైనను, నేకము గామిఁ బదము గానేర

దని యభిప్రాయము. కానీ ప్రయోగార్హత యనులక్షణము ననుసరించియే 'ఖంబును ఘటంబును' అనునవి రెండును వేర్వేఱుగాఁ బ్రయోగార్హతను సంపాదించుకొన్నవి. ఇంక 'సుప్తిఙన్తం పదమ్' అనులక్షణము ననుసరించి సుబంతము లైనయీయవి (ను శబ్దము చార్థకము) వేర్వేఱుగాఁ బదములుగా నేర్పడియున్నవి. ఇవి రెండును గలిసి యేకపదముగాఁ జెప్పఁబడుట కవకాశమే లేదు. 'సమర్థంబు లగుపదంబు లేకపదం బగుట సమాసం' బనుచో సమాస మేకపద మగుట చెప్పఁబడినది. 'ఖంబును ఘటంబును' అన్నది సమాసము గాని యేకపదము గాదు గదా.

'ఖంబును ఘటంబును' అనునది యనేక మయినందువలననే పద మగుట లే దని సూత్రకర్త స్పష్టము చేయుచున్నాఁడు.

అస లేక మన నేమి? అనఁగా కు.పం. ఇట్లు పేర్కొన్నది. ఏకత్వ మనఁగా నవిభాజ్యత. పదమును విభజించినం బ్రాతిపదికమును ప్రత్యయమును వెవ్వేఱై పదత్వమే నశించును. 'ఖంబును ఘటంబును' అనునక్షరసముదాయమున విభాజ్యత లేదు. ఖంబును ఘటంబును వేఱుచేయఁదగినవి. వేఱు చేయకుండుటే పదలక్షణము గావున వేఱుచేయఁదగియుండుట అపదలక్షణ మగును (152). దీనింబట్టి 'ఖంబును ఘటంబును' అనునది యపద మన్నమాట. పదము గా దనియే వ్యాఖ్యాతాత్పర్యము. ప్రత్యయాదు లపదములుగా వ్యవహరింపఁబడుచున్నవి. ఇట ఖంబును, ఘటంబును అనుమొత్త మొకపదము గాని 'ఖంబును' అనున దొకపదమును 'ఘటంబును' అనున దొకపదము నయియుండుటచే నీయది పదసముదాయ మనఁదగును.

ఇట ఏకము అనుచో నవిభాజ్యము అనియే యర్థము చేయనగునా? ఖంబును అనుదానిని సయితము ప్రకృతిప్రత్యయములుగా విభజింపఁదగు నని యావ్యాఖ్యయు గుర్తించినది గాదా. అట్టియపు డది యవిభాజ్య మను టెట్లు పొసఁగును. ఇంక నట్లు విభజించినఁ బదత్వమే నశించును. కావున నయ్యది విభాజ్య మని తలంప రా దనుటయు సరి కాదు. లక్షణము నిర్దుష్టముగాఁ జెప్పిన నిట్టిసమర్థింపులకు నవసర ముండదు.

పైఁగా 'ఖంబును ఘటంబును' అనునది విభాజ్యము గావునఁ బదము గా దన్నది. అట్లు విభాగించిన దీనియందుఁ బదత్వము నశించును. కావున విభాగింప రా దని చెప్పుచో నీయదియు నవిభాజ్యమే యవును గదా. ఇంక నది పదము కాకుండుటను సాధించుటకు నీయది (అవిభాజ్య మగుట) లక్షణము గానేరదు.

ఇంక నట్లు విభాగించినపుడు గూడ విభక్త మైనశబ్దము పద మైయున్నపుడే 'యేక' మనులక్షణము చెల్లు ననవలయును. అనఁగా ఏక మనఁగా నొక్కపద మని తాత్పర్యము. ఒక్కటి గాకున్నది (పదము) మాత్రమే పదము గాని, యనేక (పద)ములుగా నున్నది యొక్కపదము గా దని చెప్పవలసినయవసర మేమో తెలియరాకున్నది. కాఁగా 'రెండు (అనేక మని తాత్పర్యము) పదములమొత్త మొక దానితో నొకటి యన్వితము గాకున్నను పద మని చెప్పఁబడదు. (తత్త్వ.381) అనుట కయి 'ఏకంబు' అనుదళమును గూర్చుట వ్యర్థము.

ఇంక 'అర్థబోధకము' అనునిం కొకలక్షణము చెప్పఁబడినది. దీనివలన నర్థవంతములు గాని కచటతపేత్యాదులు పదములు గాకుండుట ప్రయోజన మన్న మాట. కానీ కచటతపేత్యాదు లర్థరహితము లనుటయు నొప్పునా? క – 'క' అనువర్ణ మనునర్థమును దెల్పును. అందువలననే 'కాకు గావచ్చు' నిత్యాదిగా నయ్యది విభక్త్యంత మగుట సిద్ధించుచున్నది.

అర్థబోధక మయియుండవలె ననులక్షణము సయితము 'ప్రయోగార్హత' యనుదానిచేతనే సిద్ధించుచున్నది. 'అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్' అనుచోఁ బ్రాతిపదికమున కర్థవత్త్వ మొకలక్షణ మైయున్నది. ధాతువులు తత్తదర్థములతో నిర్దేశింపఁబడుట ప్రసిద్ధమే. వానిపైని విభక్తులు తత్తదర్థములను ద్యోతకము చేయుచుండును. కాఁగాఁ బ్రయోగార్హత యనుదానిచేతనే యర్థబోధకత్వ మను లక్షణము సిద్ధించుచుండఁగా నాదళము నిందుఁ జేర్చుటవలనఁ బ్రత్యేకప్రయోజన మేమియు లేదు. కాఁగాఁ బ్రయోగార్హత యన్న దొకటే సరి యైనలక్షణ మైనది.

ప్రయోగార్హత యనుదానికి లక్షణ మేమో ప్రౌఢవ్యాకర్త నిరూపింపలేదు. దీనిని సంస్కృతమునుండియే గ్రహింపవలసియున్నది. అట్టియెడలఁ బ్రయోగార్హత యేమి? 'పద'శబ్దమునే సంస్కృతానుసారముగా గ్రహింపఁదగును గదా! 'అపదం న ప్రయుఞ్జీత' యనుట ననుసరించి పదము గానిదానిని బ్రయోగింపరాదు. పద మన నేది? అనఁగా 'సుప్తిఙన్తం పద' మ్మని చెప్పఁబడినది. కావున సుబంతమును దిఙంతమును బద మగుచున్నది. ఇట్టిపదలక్షణము సంస్కృతానుసారముగనే గ్రహింప నవకాశము గలదు. అనియే సూరి దానిని వివరింపలే దనవచ్చును.

అట్టిదానిని జెప్పఁబూనినయాతఁడు 'విభక్త్యంతము పదము' అనురీతిగా సూత్రించినఁ జక్కగా నుండెడిది గదా యనిపించును. (డుమువులు మొద లగు

ప్రాతిపదికలపైఁ జేరువిభక్తులు) ప్రథమాదివిభక్తులును గ్రియావిభక్తులును నంత మందుఁ గలవి పదములు. అనురీతిగా నుద్దిష్ట మైనయర్థము సిద్ధించియే యుండెడిది. రాముఁడు, వచ్చుచున్నాఁడు మున్నగునవి యిట్లు పదము లగును.

కావున వాక్యపరిచ్ఛేదమునం దీవిధానము చేసినను నింతటిదీర్ఘలక్షణము చెప్ప నక్కఱ లేదు. సంజ్ఞాపరిచ్ఛేదమునందే పదమును విభక్త్యంతముగా నిర్వచించుట యింకను నుచితము.

## పదత్రైవిధ్యము

**3. పదము లవి నామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబులు.**

నామములు, క్రియలు, అవ్యయములు, అని పదములు ముప్విధము లని సూత్రమునర్థము.

'నామము లనఁగా వస్తువాచకశబ్దము' లని సూత్రకర్తయే వివరించెను. వస్తువును తెలుపున వని యర్థము. (సూ.ని.)

దీనిం గూర్చి తత్త్వ. 'నామము లనఁగా విభక్తిప్రత్యయము చేరినప్రాతిపదికము లని భావము. (383) అని పేర్కొన్నది. ఇది సంప్రదాయానుగుణముగాఁ గానరాదు. 'ప్రాతిపదికం హి నామ' అని చింతామణి చెప్పఁగా జిన్నయయును 'నామం బనఁ గాఁ బ్రాతిపదిక' మని చెప్పెను. ఇట్లు తెలుఁగున నామ మనునది ప్రాతిపదిక మనునర్థమునఁ బ్రసిద్ధ మైయున్నది. 'నామ – న నమతి ఆఖ్యాతార్థం ప్రతి విశేషణీభవ తీతి వ్యుత్పత్త్యా స్వాదివిభక్త్యర్హే శబ్దే. యథా ఉణాద్యన్తం కృదన్త ఞ్చ తద్ధితాన్తం సమాసకమ్. శబ్దానుకరణం చైవ నామ పఞ్చవిధం స్మృతమ్' (శబ్దార్థచిం.) అనుచొప్పునఁ గృత్తద్ధితసమాసములే కాక యనుకరణశబ్దము సైతము నామ మనఁ గాఁ బ్రాతిపదిక మనిపించుకొనును. (వ్యా.సం.స. 482) అని వఝులవారు నామము ప్రాతిపదిక మగుటను వివరించిరి.

అట్టియెడలఁ బ్రథమాదివిభక్తులు చేరుట కర్హ మైనశబ్దమే నామ మని గ్రహింప వలయును. కాని ప్రత్యయములు చేరినది నామ మనుట యెట్లు? ఇట్లు నామము లనఁగాఁ బ్రాతిపదికము లగుచుండఁగా నామములు పదములలో నొకభేదముగా వ్యాకర్త చెప్పుట యెట్లు పొసఁగును?

సూత్రకర్తయే యాపిదప 'క్రియ లనఁగా వ్యాపారావబోధకములు' కర్మము గలది సకర్మకము. కర్మము లేనిది యకర్మక మనియు వివరించెను. ఈవివరణము ననుసరించి యిటఁ గ్రియ యనఁగా ధాతు వని యర్థ మగును. 'లకారాదులు సకర్మంబునకున్' అనురీతి సూరిప్రభృతులవచనము లిట స్మరింపఁదగును. శ.ర. మొ. సకర్మకక్రియ, అకర్మకక్రియ యనురీతి వ్యవహారము గాననగుచున్నది. 'క్రియా ధాతుః' అని చింతామణి క్రియాశబ్దమును ధాతువునకుఁ బర్యాయముగనే పేర్కొన్నది. ఈక్రియాశబ్దమునకు ధాతువునర్థ మని శ.ర. కూడ నర్థము చేసియున్నది. 'క్రియా ధాతో రర్థే. (శబ్దస్తో.) సూరి ధాతువు అనునర్థమునం దెచ్చుటను గ్రియ యను శబ్దమును బ్రయోగించుట బాల.లోఁ గానరాదు.

అయిన శబ్దశాస్త్రమునందుఁ జెప్పఁబడినకార్యము లవుటంజేసి యిట నర్థమును గాక శబ్దమును గ్రహింపవలె ననవచ్చును. అనఁగాఁ గ్రియ యనుదానికి ధాత్వర్థ మనియే యర్థ మైనను, నీశబ్దశాస్త్రమునఁ దద్వాచక మయినశబ్దమునే గ్రహింపవలె నన్నమాట. (అట్టియెడలఁ గ్రియ యనఁగా ధాత్వర్థమును జెప్పుశబ్ద మగుధాతువే) ధాతువుయొక్క యర్థము గలిగినశబ్ద మగునాధాతు వనురీతిచుట్టుమార్గముకంటెఁ గ్రియ యనక ధాతు వనుట యెంతయు సముచితమును లాఘవము నైనపద్ధతి.

ఆపిదపఁ బ్రౌఢవ్యాకర్త 'క్రియచేఁ గర్త చెప్పఁబడు నేని కర్తరిప్రయోగము, కర్మ చెప్పఁబడు నేని కర్మణిప్రయోగ' మని చెప్పెను. ఇటఁ గ్రియ యన ధాతు వనునర్థము సమన్వయింపదు. రాముఁడు రావణుని చంపెను. చంపు – ధాతువునకు చంపుట అని గదా యర్థము. ఈధాత్వర్థముచేఁ గర్త గానీ కర్మ గానీ చెప్పఁబడదు. చంపెను, చంపఁబడె ననురీతిగా నయ్యది తత్తదర్థకప్రత్యయసహిత మైనపుడే కర్తృకర్మలను బోధించును. సూరి యిట్టిదానిని గ్రియాపదము, ఆఖ్యాతము అని వ్యవహరించెను. ఆఖ్యాత మనఁగాఁ దిఙ్ప్రత్యయము లేదా తిఙంతశబ్దము ననవచ్చును. అభిధానం చ ప్రాయేణ తిఙ్కృత్తద్ధితసమాసైః. (సి.కౌ.కార. 537 సూ.వివ) (వ్యా.సం.స.955) అనఁగా నిటఁ గ్రియాశబ్దము లడాద్యంతము వర్తమానార్థకాదిక్రియాపద మనునర్థమునఁ బ్రయోగించె నన్నమాట. 'క్రియాపదంబులం దిత్తునకు, మధ్యమ పురుషక్రియలయం దిత్తునకు' నని సూరియుఁ గ్రియాశబ్దమును దిఙంత మనునర్థమునఁ బ్రయోగించెను. కాని ప్రౌఢ.లోఁ బూర్వవిరుద్ధముగా నుండుటవలన వివాద మేర్పడినది.

జాతి వ్యక్తి లింగ సంఖ్యా కారకము లైదును బ్రాతిపదికార్థములె యన్న ట్లిచట సైతము క్రియాత్వము, క్రియ (వ్యాపారము) వచనము, కాలము, అన్వయము అనునైదిటికిని ధాతువులె వాచకము లనియు లడాదిప్రత్యయములు ద్యోతకము లనియు (వ్యా.సం.స. 1322) నభిప్రాయముతో ధాతువే కర్తృకర్మల నభిహితము చేయు నని సూత్రకర్త తలంచెనా?

కానీ యింతకు ముందు (వాక్య. 1)చే క్రియ లనఁగా వర్తమానాద్యర్థము లయిన సమాపకక్రియ లని చెప్పెను గదా! కావునఁ గ్రియ యనుదానికిఁ దిఙ్భిన్న మను రీతిగా నింతకు ముం దర్థము చేసిన ట్లయినది. కాఁగా నిటఁ గూడఁ గ్రియచేఁ గర్త చెప్పఁబడిన అనుస్థలమునఁ దిజంతముచేఁ గర్త చెప్పఁబడిన అనురీతిగానే చెప్పఁదగు నని సూత్రకర్త తలంచియుండు ననవచ్చును. (కానీ యసమాపకక్రియ లే మవును? అన్యపదము లగునా?

అ ట్లయినను గ్రియ లనఁగా వ్యాపారవబోధకము లయినవి. 'కర్మము గలది సకర్మకము. కర్మ లేనిది యకర్మక' మనుచోట ధాతు వనియే యర్థము చేయవలెను. వండెను, పోయెను క్రియాపదములే. వర్తమానాద్యర్థక (సమాపక) క్రియలను నర్థముననే సూత్రకర్త ప్రయోగించె ననియుఁ జెప్ప నొప్పునా? ధాతువు సకర్మక మైనపుడు గదా కర్మార్థవివక్షయుఁ బడుజ్యనుబంధమును నవుట? అట్టియెడలఁ గ్రియాపదమునే సకర్మక మనియు, నకర్మక మనియుఁ బేర్కొను టెట్లు? రాముఁడు సాకేతంబున కరిగెను, రామునిచేత సాకేతంబున కరుగఁబడెను' అనియు నుండనగునా? అరుగు ధాతువు కర్మాకాక్షానుత్థాపక మగుటచే నకర్మక మనియుఁ గావున నందు కర్మార్థవివక్షయే కుదురదు గావున అరుగఁబడె ననురీతిగా నుండనేర దనియుఁ దెలియవలసియున్నది. వ్యాఖ్య లీసందర్భమున ధాతువుగనే వ్యవహరించుట గానవచ్చును. (తత్త్వ. 383) అనఁగాఁ గ్రియ యన ధాతు వని యర్థము చేసిన ట్లయినది.

ఇవి గూడఁ బదములే యగునా? నామములు (ప్రాతిపదికలు) క్రియలు (ధాతువులు) పదభేదములుగాఁ జెప్పుట యెట్లు పొసఁగును? 'పదము లవి' అను నీసూత్రమున 'అవి' అనుపద మూఁతపదముగాఁ జేరినట్లు గానవచ్చుచున్నది. కానీ యం దే దేని విశేషప్రయోజనమును సూత్రకర్త యుద్దేశించె నేమో వివరింపలేదు. ఇంకఁ బూర్వసూత్రము ననుసరించి ప్రయోగర్హాత మున్నగులక్షణములు గల్గి పద

మనఁబడున వేవో యవి నామములు, క్రియలు, నవ్యయము లని త్రివిధము లని తాత్పర్యము.

ప్రాతిపదికము లేదా ధాతువు ప్రకృతిమాత్రము లగుటచేఁ బ్రయోగార్హములే కావు. కావున వానికిఁ బదత్వమే లేదు. కాఁగాఁ దత్తద్విభక్త్యంత మై ప్రయోగార్హత నందినపిదపనే నామములు, క్రియలు పదములలోనిభేదములుగాఁ బరిగణింపఁ బడు నని సూత్రకర్త యూహించెనా?

అయినను వీనికి వేఱుసంజ్ఞలను గల్పించుకొనుటయే యుక్తము గాని యన్యార్థమునఁ బ్రసిద్ధము లయిన నామము, క్రియ యనువానిని వివాదములకు హేతువుగాఁ బదములుగా వ్యవహరించుట యుచితముగా లే దనవచ్చును. క్రియాపదము (తిఙంతము) నామపదము (సుబంతము) అనురీతి వ్యవహారము గలదు. (ఘం. 335)

అవ్యయము లనువాని నిం కొకభేదముగా సూత్రకర్త ప్రత్యేకముగాఁ బేర్కొనెను. అనఁగా నీయవి పూర్వోక్తము లయిననామములు, క్రియ లనువానికంటె భిన్నము లనవలెను.

'సుప్తిఙన్తం పదమ్' అనుసంస్కృతలక్షణము సుబంతములను దిఙంతములను బదములుగాఁ బేర్కొన్నది. దీనినిబట్టి పద మన నయ్యది సుబంతమో, తిఙంతమొ కాక తప్పదు. అవ్యయ మనుదానిని బ్రౌఢ. వానికి భిన్నముగాఁ బ్రత్యేకముగాఁ జూపుచున్నాఁడు. 'న పదా న్యవ్యయసుప్తిఙ్ క్త్వాతుమునా' మ్మనుచింతామణిలక్షణ ప్రభావము కొంత దీనిపైఁ గల దని యనుమానింపవచ్చును. చింతామణి సుప్తిఙు లనువానిని బ్రత్యేకముగాఁ బేర్కొనుచునే యవ్యయములను గూడ సూత్రమునందుఁ బ్రత్యేకముగా నిర్దేశించుచున్నది. అనఁగా 'సుప్తిఙన్తం పద' మ్మనుదానిచే (సుప్ తిఙంతములును బోధింపఁబడుటచే 'పదాని' అనుచున్నసూత్రమున మఱల సుప్తిఙ్ అనుటయు నవసరము కాదు.) నవ్యయములు సంగ్రహింపఁబడవా? 'వాగను శాసనుసులు యదాతదా యని గ్రహించుట ప్రపంచార్థ మని పేర్కొన్నసూరి వచనములు స్మరింపఁదగును.) క్త్వాతుమునా మ్మనువానిపునర్గ్రహణము ప్రత్యేక ప్రయోజనాపేక్షతో జరిగినట్లు వ్యాఖ్యలవలన స్పష్టము. కాఁగాఁ జింతామణి 'సుప్తిఙ్' అనుదళములతోపా టవ్యయదళమును బ్రత్యేకముగా నిర్దేశించుటచేత నవ్యయ

పదములు సుప్తిజంత మనుదానిచేత సంగ్రహింపఁబడనేర వనవలెను. దాని ననుసరించి ప్రౌఢ. నామక్రియలకంటె భిన్నముగా నవ్యయములను బ్రత్యేకముగా జూపియుండవచ్చును.

అట్లు పేర్కొనుటలోనియుద్దేశము గూడ సూత్రకర్తవివరణమునుండి గ్రహించుట కవకాశము గలదు. అవ్యయములు తిఙంతము లవుట యసంభవము. ఇంక సుబ్విభక్తు లయి లోపించినచో, అమ్మ, అయ్య యిత్యాదులవలె సుబంతములపై పదత్వము నందఁగలవు. కానీ ప్రౌఢ. 'అవ్యయము లనఁగా (లింగ)విభక్తి(వచన) శూన్యము లని పేర్కొనెను. అనఁగా వీనిపై విభక్తియే లే దన్నమాట. అనఁగా సుబ్విభక్తి కాని లేదా తిఙ్విభక్తి కానీ చేరని వని చెప్పవలెను. కాఁగా సుప్తిఙంతముల కంటె భిన్నములు గావున నవ్యయములు ప్రత్యేకముగాఁ బేర్కొనవలసివచ్చె నన వలయును. అయిన నిట నొకయనుమానము. 'సుప్తిఙన్తం పదమ్' అని చెప్పఁ బడినసంస్కృతలక్షణము ననుసరించి యవ్యయములు సంస్కృతమునఁ బదములే కావలయునా? అయిన 'అపదం న ప్రయుఞ్జీత' యనుదాని ననుసరించి దానికిఁ బ్రయోగార్హత యెట్లు కుదురును. కావున నవ్యయముపై నాయయివిభక్త్యర్థములం దాయయిసుబ్విభక్తులు చేరి 'అవ్యయా దా ప్సుప' యని లోపింపఁగా నయ్యవి సుబంతము లయినపదము లై ప్రయోగార్హత నందుచున్నవే కదా.

అట్టియెడ నవ్యయములను బ్రత్యేకముగా నిర్దేశించుట యనవసర మనవలె. ఇటఁ దత్త్వ. 'తెనుఁగున (బాలప్రౌఢవ్యాకర్తలు) సుప్తిఙంతములే పదము లని చెప్పనందున (చింతామణిప్రభృతులును ఇట్లు చెప్పుట గానరాదు) నవ్యయములకు సుప్రత్యయములు చేరకున్నను ప్రయోగార్హము లగుపదములే యగు నని భావింప వచ్చును. అ ట్లయినచో విభక్తివచనప్రత్యయములు చేరని వవ్యయము లనియు లక్షణము సరిపడు' (384) నని పైని వివరించినట్లు పేర్కొన్నది. కానీ యసలు విభక్తులే చేర వన్న నయ్యవి 'నామ'మాత్రము లగును. అట్టియెడలఁ బూర్వసూత్రము ననుసరించి ప్రయోగార్హత గూడ ఉన్నపుడు గదా పద మగుట. ప్రయోగార్హతను నీవ్యాకర్త వివరింపలేదు. కావున సంస్కృతమునుండియే గ్రహింపవలెను. అట్టియెడల 'న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి ప్రత్యయః' అనుదాని ననుసరించి యీప్రకృతి ప్రయోగార్హము కాదు. కావునఁ బదము గాదు. మఱి 'పదము లనునవి నామంబు లవ్యయంబు' లనురీతిగాఁ జెప్పుట యెట్లు పొసగును.

కావున నిట విభక్తి చేసి లోపింపఁజేయుటయే యుక్త మగుమార్గము. అట్టి యెడల విభక్తిశూన్య మనుసూత్రకృద్వివరణమునకు విభక్తి నిలువనిది యనురీతిగా నర్థము చేయుట యుక్తము. కాఁగా విభక్తి యసలు చేరని దని చెప్పుట యుచితము గాదు. (అయిన స్త్రీసమములవలె) అవ్యయములను బేర్కొన నక్కఱయే లేదు.

కాఁగా 'సదృశం త్రిషు లిఙ్గేషు, సర్వాసు చ విభక్తిషు, వచనే చ సర్వేషు య న్న వ్యేతి త దవ్యయమ్' (అధర్వణశ్రుతి) స్త్రీంపుంనపుంసకత్వాని, సత్త్వగుణాః, ఏకత్వద్వి బహుత్వాని చ, ఏతా నర్థాన్ యే న వియంతి త దవ్యయ మితి లింగకారకసంఖ్యాః అనాదృత్య య న్న వ్యేతి వికారం ప్రాప్నోతి కిం తు సదృశమ్, ఏకప్రకార మేవ భవతి త దవ్యయ మి త్యుదాహృతశ్రుతే రర్థః (బాలమనో.) (ఘం. 336) అనులక్షణమునే వివరించిచెప్పుట సముచిత మైయుండు నని నిర్ణయింపఁదగును. పురుషు లెల్ల, ధేనువుల నెల్ల, జనమున కెల్ల మొ. పరిశీలింపఁగా 'సుప్తిఙన్తం పద' మ్మనుసంస్కృతలక్షణములసంబంధము లేకుండ శబ్దశాస్త్రమునకుఁ గొంత విలక్షణ మగుమార్గములోఁ బదమును, బదభేదములను నిర్ణయించినట్లు తోఁచుచున్నది. శబ్దస్వరూపమునుబట్టి పదమును శబ్దశాస్త్రము (సుప్తిఙంత మని) నిరూపించినది. వాక్యపరిచ్ఛేదమునం దీసూత్రకర్త పదమునర్థము ననుసరించి యిట్లు త్రివిధముగా నిరూపించె నని తోఁచుచున్నది.

వస్తువులను బోధించునవి నామములు. వ్యాపారమును బోధించునవి క్రియలు కాఁగాఁ దద్భిన్నము లవ్యయము లనవలయును. అక్కట అయ్యో మున్నగునవి వస్తువును గాని, వ్యాపారమును గాని బోధించునవి కావు. కావున నామములు, క్రియలు అనువానికంటె భిన్నముగా నవ్యయములను జూపుట కొంతవఱకు యుక్తమే యగును. ఇయ్యది శబ్దానుసారి యగువిభాగ మని కాక యర్థానుసారి యగువిభాగ మని తలంచినచోఁ ద్రైవిధ్యనిరూపణమునఁ గొంత సార్థక్యము తోఁపఁగలదు.

కానీ సూత్రకర్త యవ్యయములను నిర్వచించునపుడు విభక్తిశూన్యము లని మఱల శబ్దశాస్త్రసంబంధి యగుమార్గము నవలంబించుట సరిగా లేదు. దీని ననుసరించిన విభక్తులు గలవి, విభక్తిశూన్యములు నని రెండురకములుగా మాత్రమే పదవిభాగము సరిపోవు నని చెప్పవలసియుండును. తద్భిన్నము లవ్యయము లనక విభక్తిశూన్యము లని సూత్రకర్త యేల చెప్పెను? అనఁగా నవ్యయము లన్నియు వస్తువు లేదా వ్యాపారమును బోధించునవి కావు. కావున నట్లు చెప్పుటకు వీలు

లేదు. 'అక ప్రత్యయాంతావ్యయంబు' అనుచో 'వండక' మున్నగున దవ్యయ మగుట స్పష్టము. ఈయది యసమాపక మయ్యును వ్యాపారబోధమే యగుట నిర్వివాదము. కాఁగా ఇ, కజి, చున్, నుజి, నన్, డున్ ప్రత్యయాంతము లగునవ్యయములు వ్యాపారబోధకములే యయియున్నవి.

అందు, ఇందు, ఎందు అనువాని నవ్యయములుగనే శ.ర.లో ఈవ్యాకర్త పేర్కొనినాఁడు. అచ్చోట, ఇచ్చోట, ఎచ్చోట, అని యర్థములు. అట్టిచో అచ్చోట అనుదానివలె 'అందు' అనునది వస్తువాచక మైనట్లే గదా! ఇట్లె ఇందు, ఎందు మున్నగునవి. కావున నవ్యయములు కొన్ని వస్తువాచకములు నగుచున్నవి. అందులకే సూత్రకర్త యవ్యయములను వివరించుసమయమున వస్తుబోధకములు వ్యాపార బోధకములు కానివి అని చెప్పక విభక్తిశూన్యము లని భిన్నమార్గము ననుసరించెను.

కాఁగా నవ్యయములు వస్తువాచకములు గావచ్చు. వ్యాపారబోధకములు గావచ్చును. రెండును గాకపోవచ్చును. అట్టియెడల వస్తువాచకములు నామములే యగు నని కాని, వ్యాపారబోధకములు క్రియలే యగు నని కాని నిర్ణయించుటకు వీలు లే దన్నమాట.

అంతే కాక వచ్చుట, బ్రదిమి మున్నగునవి నామపదములా లేక క్రియా పదములా? అనురీతి ననుమానమునకును నవకాశ మేర్పడుచున్నది. కాఁగా నీవిభాగమువలనఁ బ్రయోజన మేమి?

కాఁగా నర్థానుసారముగాఁ బదములవిభాగము భిన్నమార్గములోఁ జేయఁ దలఁచినను నావిభాగము నిర్దుష్ట మైయుండలేదు. కావున నీవిధానము ప్రయోజన వంత మగుట లేదు.

శబ్దపరిచ్ఛేదము నీవ్యాకర్త నామప్రకరణము సర్వనామప్రకరణము నని రెండు ప్రకరణములుగా విభాగించెను. ప్రస్తుతసూత్రమునఁ బదములు, నామములు క్రియ లవ్యయము లని మూఁడువిధములుగనే విభాగించుటచే సర్వనామములు క్రియలలోఁ గాని, యవ్యయములలోఁ గాని చేరవు. కావున నామములలోఁ జేరక తప్పదు. ఇంక నట నామప్రకరణము సర్వనామప్రకరణములను వేఱు చేసి చెప్పుట యేల? నామములలో నవాంతరభేదముగా గ్రహింపవలెనా?

ఇంక నీనామములు, క్రియలు, అవ్యయములు అనువానికి సంబంధించిన విశేషాంశముల నిట్లు వివరించెను.

నామములను విశేష్యములు, విశేషణము లని రెండువిధములుగా శబ్దపరిచ్ఛే దారంభమున విభాగించియున్నాఁడు. కావున దానిం గూర్చి యిటఁ బ్రస్తావింపలేదు. నామములు సందర్భవశమునఁ కర్తలును, కర్మలును నగు నని చెప్పెను. కర్త, కర్మ (మొద లగుకొన్నింటిని) యనువానిని బాల. కూడ వివరించినది.

'కఱ్ఱ విఱిగెను' అనుచో కఱ్ఱ అనునది కర్త. కఱ్ఱను విఱిచెను. అనుచో నయ్యదియే కర్మ యైనది. ఇట్లె కఱ్ఱతోఁ గొట్టెను అనుచో గరణము నైనది. ఇ ట్లితరములును నవును.

కావున 'సందర్భవశమునఁ గొన్ని కర్త లనియుఁ గర్మ లనియుఁ జెప్పఁబడు' ననుట విచార్యము. సందర్భవశమునఁ గరణాదులు నగును గదా.

ధాతువులను సకర్మము, లకర్మకము లని వింగడించెను. కర్మము గలది సకర్మము కర్మము లేని దకర్మ మనురీతి వివరించెను. ల.వ్యా. క్రియా.68. ఇట్ల పేర్కొన్నది. కర్మాకాంక్షోత్థాపకము, కర్మాకాంక్షానుత్థాపకము నని బాల. ఇంతకు మున్ను వివరించియే యున్నది.

ఇట విశేషముగాఁ జెప్పఁబడినయంశము 'కర్మకర్మక్రియలు గూడఁ బ్రయోగ మనఁబడు' ననునది. అనఁగా కర్త కర్మ క్రియ యనునవి మూఁడు నున్నపుడే ప్రయోగ మగును. దీనిం గూర్చి కు.పం. 'అకర్మకకర్తరిప్రయోగమునం గర్మ ముండదు గదా? ఇక కర్తృకర్మక్రియలు గూడఁ బ్రయోగ మనంబడు ననులక్షణమును సామగ్ర్య మెట్లో' (153) యని యీవివరణ మసమగ్ర మగుటను బ్రస్తావించినది. (సుబో.274, తత్త్వ.389, సుగమ.243) కాఁగా సూత్రకర్తృవివరణము సకర్మక ధాతుస్థలముననే సరిపడును. కావున నిది సమగ్రము గా దనుట యుచితమే.

క్రియాపదముచేఁ గర్త చెప్పఁబడు నేని యది కర్తరిప్రయోగ మనియుఁ గర్మము చెప్పఁబడు నేని కర్మణిప్రయోగ మనియుఁ బ్రయోగమును రెండు విధములుగా సూత్రకర్త విభాగించెను.

'కర్త్రర్థము, కర్మార్థకము నని ప్రయోగము ద్వివిధంబు. కర్తను ప్రధానముగా

గలది కర్త్రర్థకము. కర్మను ప్రధానముగా గలది కర్మార్థకము. అని ల.వ్యా. (క్రియా. 67) ప్రౌఢ.కుఁ బూర్వము పేర్కొన్నది.

కర్తరిప్రయోగము, కర్మణిప్రయోగము ననువ్యవహారము సముచితము గా దని వ్యాఖ్యలు నిరూపించినవి.

కు.పం. 'సంస్కృతమునఁ గర్తరి ప్రయోగః, కర్మణి ప్రయోగః అనునవి వ్యస్తములు. అలుక్సమాసములు గావు. వానిని సమాసములుగ నేకైకప్రాతిపదికలుగ గాని ముప్రత్యయముం గూర్చి కర్తరి ప్రయోగము, కర్మణి ప్రయోగము అనురూపము లేర్పఱచుటకు మహాజనులవ్యవహారమే యాధారము. భాషాప్రయోగము, శుచిర్భూతుడు మొ. (153) అన్నది. మహాజనులవ్యవహార మాధారముగ దీని నంగీకరింపఁదగు నని కు.పం.అభిప్రాయముగాఁ దోఁచుచున్నది. కానీ బాల. కర్త్రర్థము, కర్మార్థకము ననురీతిగా వ్యవహరించినదే కాని కర్తరిప్రయోగ మిత్యాదిగాఁ గాదు. అట్టివ్యవహారమును సూరి యంగీకరింపలే దనఁదగును. ల.వ్యా. సైతము కర్త్రర్థకము, కర్మార్థక మనురీతిగా వ్యవహరించుట గమనింపఁదగును. అట్టియెడల వ్యవహారమం దున్నది గదా యని ప్రమాణీకరించుటకంటె కర్మార్థక మిత్యాదిగా వ్యవహరించుట శాస్త్రీయము గదా. (సర్వ. 571)

తత్త్వ. 'కర్తృప్రయోగము, కర్మప్రయోగము' అనుట యుచిత (383) మన్నది. అనఁగా నీవానిని సమాసములుగాఁ జూపిన దన్నమాట. షష్ఠీతత్పురుషము కర్తయొక్క ప్రయోగము, కర్మయొక్క ప్రయోగము అని భ్రాంతిపడుట కిం దవకాశము గల దని తోఁచుచున్నది. సంస్కృతముననే యిట్టివ్యవహార మున్నట్లు గానరాదు. కర్త్రర్థకము, కర్మార్థక మనునవే యద్దిష్టార్థము నీయఁగలిగియుండుటయే కాక లాక్షణీకాంగీకృతము లయ్యు నుండుటచే నయ్యవియే గ్రాహ్యము లనుట యెంతయు నుచితము. ఆవ్యవహారమును మార్పవలసినయవసర మేమి వచ్చినది.

కర్త్రర్థకమునందును గర్మార్థకమునందును స్వార్థ, ప్రేరణార్థ, ఆత్మనేపదార్థములతో నాయయిభేదములను సూరి సకర్మకాకర్మకధాతువుల ననుసరించి నిరూపించెను. (బాల.క్రియ. 122,124సూ.) కావున వానిని ప్రౌఢ. ప్రస్తావించియుండకపోవచ్చును.

ఆతరువాతి వగునవ్యయములను ప్రౌఢ. రెండు విధములుగా విభాగించినది.

**ప్రతిపదోక్తములు :** ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తములు. ప్రకృతిసిద్ధము లనఁ

గా లక్షణముచే సాధింపఁబడినవి కాక సహజముగనే యవ్యయము లైనశబ్దము లని యర్థము. ఎల్లన్, అక్కట మున్నగున విట్టివి.

**లాక్షణికములు :** లక్షణసిద్ధములు లాక్షణికములు. అనఁగా వ్యాకరణముచే సాధింపఁబడినట్టియవ్యయశబ్దములు లాక్షణికము లనఁబడును.

ఇంతకు ముం దసమాపకక్రియలుగా నిరూపించిన క్త్వార్థకాదు లాఋను లాక్షణికము లగునవ్యయములు. వచ్చి, రాక, వచ్చుచున్, రాన్, వచ్చినన్, వచ్చుడున్, అనురీతివి.

పదముల నీరీతిగా విభాగించుటవలనఁ బ్రత్యేకముగా శబ్దశాస్త్రమునకుఁ గలుగుప్రయోజనము కనుగొనవలెను.

చింతామణియందు 'సిద్ధ స్సాధ్య శ్చ' యనురీతిగా బిందువును విభాగించి చెప్పినట్లుగా నిట్టివింగడింపునకును వివరణమునకును స్పష్టత మాత్రమే ప్రయోజనముగా నూహింపఁదగును.

## అన్వయము

**4. పదములకుఁ బరస్పరము గలసంబంధ మన్వయ మనంబడు.**

పదములకుఁ బరస్పర మొకదాని కిం కొకదానితోఁ గలసంబంధ మన్వయ మనఁబడు నని యర్థము. (సూ.ని.)

పదానాం పరస్పరాక్షాంక్షాయోగ్యతా చ – ఇతి దుర్గాదాసః. పరస్పరసంబంధః ఇతి రామతర్కవాగీశః. శబ్దక. (ఘం.336)

పదములకు ఒకదానికి నిం కొకదానితో గలకర్తృక్రియాభావాదిసంబంధమే యన్వయ మనంబడును. రాముఁడు వచ్చెను. అనుచోట రాముఁడు అనుపదము 'వచ్చెను' అనుక్రియలోనికిఁ గర్తగను, వచ్చెను అనుపదము రాముఁడు అనుపదముతో చేయఁబడినపనిగను అన్వయించుచున్నది. ఇట్టిరీతియే యన్వయ మనఁబడెను. (తత్త్వ.385)

అన్వయ మనుశబ్దమున కర్థము చెప్పుట మాత్రమే యిందలిప్రయోజనము. కోశములవలన నైనను నీప్రయోజనము సిద్ధింపఁగల దని తాత్పర్యము.

పదసముదాయము వాక్య మగునపుడు నందలిపదముల కర్థమున యోగ్యత యుండవలెను. యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పరసంబంధమునందు బాధ లేకుండుట. అనఁగా నర్థమునందు బాధ లేకుండుట యనుయోగ్యత వాక్యమునం దుండవలె నట్టియర్థమునందు యోగ్యత గలపదములు పరస్పర మొకదానితో నొకటి సంబంధము కలిగియేయుండును. అనఁగా నన్వయించుచునే యుండును. కావున నిది యన్వయము(సంజ్ఞ)ను విధించునది కాదు. అన్వయ శబ్దమున కర్థము చెప్పునది మాత్రమే. ఇట్టియన్వయమునకు సంబంధించిన యంశములును గొన్ని యిందుఁ బ్రతిపాదింపఁబడుచున్నవి గదా యని యీసూత్రము చెప్పియుండును.

## కులకము

**23. పద్యములకుం గులకం బగు.**

సూత్రమునఁ బూర్ణబిందువుస్థానమునఁ దత్త్వ (410) సర్వ. (594) వ్యాఖ్యలు ఖండబిందువును జూపినవి. అది యసాధువు గాకున్నను మాఱుపాటు పొరపా టనఁదగును.

సూత్రమునర్థమును సూత్రకర్తయే వివరించెను. కులకం బనఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము. ఒకపద్యము తరువాతిపద్యముతోఁ గూడ నన్వయము కలిగియున్న నయ్యది కులక మగును. తెలుఁగునఁ బదములం దట్టిస్థితి గల దని యర్థము.

అనఁగాఁ దరువాతిపద్యముతో నన్వయించినఁ గాని పూర్వపద్యమునందు వాక్యార్థము ముగియనిచో నట్టిపద్యమునకుఁ బద్యాంతరముతోడియన్వయమే కులక మగును. మహావాక్యములలోఁ బూర్వపద్యమున వాక్యార్థము ముగియుచునే యయ్యది తరువాతివాక్యముతో నన్వయము కలిగియుండవచ్చును. కానీ యది కులక మనఁబడదు.

తా నొకపండు చెచ్చెరన్ – అనుదానితోఁ బద్యము ముగిసినది. కానీ వాక్యము ముగియదు. ఆకాంక్ష సంపూర్ణము గాలేదు. 'కొని ద్రచ్చుడున్' అనుతరువాతి పద్యముతో నన్వయించినఁ గాని యిటఁ బూర్వపద్యమువాక్యార్థము పూర్ణము గాదు.

అనఁగా స్థూలముగాఁ బద్యమునంతమునందు వాక్యము ముగియక తరువాతి పద్యములోనికిఁ బ్రవేశించినచో నయ్యది కులక మగు నని తాత్పర్యము.

ఈలక్ష్యముసమన్వయమునఁ గు.పం. పొరవడినది. 'లక్ష్యమున వ్రచ్చుడున్ అనునది యానంతర్యార్థకాంతాసమాపకక్రియ. ఈపద్యంపుముగియికతో వాక్యమునకు ముగియిక కల్గలేదు' (165) అని పేర్కొన్నది. అనఁగా వ్రచ్చుడున్ అనునంతవఱ కొకే పద్య మని కు.పం.అభిప్రాయపడిన ట్లున్నది. వ్యాకర్త శ.ర.లోవలె నీవ్యాకరణమున సయితము కవిప్రయోగమును జూపునపుడు గ్రంథనామముతో నాశ్వాససంఖ్యను మాత్రమే చూపెను గానీ పద్యసంఖ్య నీలేదు. అట్లే యిచటఁ గూడ భార. అది 2–ఆ అని యిచ్చి యుండుటంబట్టి (164) యిది యెల్ల నొక్కపద్యమే యని కు.పం. పొరవడినది.

సుబో. మిగుల శ్రమించి యీకవిప్రయోగములను నాయాయాశ్వాసములందలి పద్యముసంఖ్యను గూడ గుర్తించి మన కెంతయు సౌలభ్యము గలిగించినది. కాఁగా సుబో.2వ ఆశ్వాసమున 198–199 పద్యములుగా స్పష్టము చేసినది. 'చెచ్చెరన్' అనువానితోఁ బూర్వపద్యము ముగియఁగా, 'కొని వ్రచ్చుదు' అనుదానితోఁ దరువాతి పద్య మారంభ మైనది. సూత్రకర్త పద్యాంతరముతో నన్వయము స్పష్ట మగునట్లుగా (నహోబలు ననుసరించి) పూర్వపద్యము నంతిమభాగమును దరువాతిపద్యము మొదలును సముచితముగాఁ జూపెను. కాఁగా ముగింపు చెందకుండుటను నిరూపింపవలసినది 'చెచ్చెరన్' అనుస్థలమునఁ గాని 'వ్రచ్చుదు' ననుచోటఁ గాదు.

'పద్యంబులకుం గులకం బగు' ననుసూత్రస్థలమునను బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయ మనువివరణస్థలమందును బద్య మనునది గద్యమునకును నుపలక్షక మని యూహింపఁదగును. వచనమునకు వచనాంతరముతో నన్వయము (కులకము) అసంభవము. కానీ పద్యమునకు బద్యముతోనే కాక పద్యమునకు గద్యముతోను, గద్యమునకుఁ బద్యముతోను గూడ నిట్టియన్వయస్థితి ప్రయోగప్రసిద్ధ మైయున్నది. (చూ.బా.సూ)

ఇంకఁ గులకమును గూర్చి వ్యాఖ్యలు కొంత పరామర్శించినవి. సుబో. సంస్కృతమునందు నాలుగుపద్యముల కెక్కువవాని కేకాన్వయ మున్నపుడే కులక మగు ననియు, రెండింటి కైన యుగ్మ మగు ననియు, నిచట నానియమము గమనింపఁబడలే దనియుఁ బేర్కొన్నది (293) సర్వ. ఈయభిప్రాయముతోనే

దీనికిఁ గులక మనుపేరు ప్రౌఢవ్యాకరణకారుఁడు పెట్టినదిగాఁ బేర్కొన్నది (595) తత్త్వ. లోకమునందలిశబ్దములకు వ్యాకర్తలు వేఱువిధముగా సంజ్ఞ చేయుట కొన్నియెడలఁ గానవచ్చుచున్నది. రెండుసారులును మూఁడుసారులును గూడ పునరుక్త మగుశబ్దమునకు ఆమ్రేడిత మని (సంజ్ఞ) వ్యవహారమున నుండఁగా (ఆమ్రేడితం ద్వి స్త్రిరుక్తమ్. అమరము.) పాణిని ద్విరుక్తమునకు మాత్రమె యామ్రేడితసంజ్ఞను నియమించెను. అట్లే యితఁడును 'కులక' శబ్దార్థమును వేఱువిధముగా నిర్ణయించె నని తెలియవలయు' (411) నన్నది. ఈవ్యాఖ్య లన్నియు సంస్కృతమున రెండు పద్యముల కిట్టియన్వయ మున్నపుడు కులక మనుపేరు లే దని యది తెలుఁగుననే కల దని నిర్ణయించినవి.

కానీ 'ఛన్దోబద్ధం పదం పద్యమ్, తేన ముక్తేన ముక్తకమ్, ద్వాభ్యాం తు యుగ్మకమ్, సుదానితకమ్ త్రిభి రిష్యతే, కలాపకం చతుర్భి శ్చ, తదూర్ధ్వం కులకం మతమ్ (సా.ద) అని మూలమును బ్రదర్శించి 'సంస్కృతకోశములలో బద్యసంఖ్యా నియమము కనఁబడదు. 'కులకం తు పటోలే స్యాత్ సంబద్ధశ్లోకసంహతౌ' (మేదిని) అని మున్నగుప్రమాణములు చూపినది. (ఘం. 336) శ్లోకసంహిత, శ్లోకబృందము అనురీతిస్థలములలో సంఖ్యానియమము లేనిమాట వాస్తవమే. కాని విస్పష్టముగఁ జెప్పినయాలంకారికులు మాత్ర మ ట్లంగీకరించినందు కాధారములు లేవు గదా? కాఁగా సంస్కృతమునఁ గలయుగ్మకాదిభేదము తెలుఁగున నుపేక్షిత మైన దనుటయే యుక్తము.

పద్యాంతరముతో నన్వయ మని సూత్రకర్త సామాన్యముగఁ జెప్పుటచేఁ బెక్కు పద్యముల కిట్టియన్వయ మున్నను కులక మగును. భార. అది. 1-1- మొదలు 9 పద్యమువఱకుఁ గులకమె. అట్లె అది 3-8 వచనము మొదలు 11 పద్యము వఱకుఁ గలవు. ఇట్టివి పెక్కులు గలవు. అని వఝులవారు (వ్యా.సం.స. 1102) పేర్కొనిరి.

ఈసందర్భమున వఝులవా రహోబలునియభిప్రాయమును దిరస్కరించినపద్ధతి యుచితముగాఁ గానరాదు. అహోబలపతి 'భాగవతే నృపకుమారులఁ జదివింప నేర్పు గలుగు ఇతి పద్యం సమాప్య గురుజనంబులు విను మూఁడుకోట్లమీఁద ఇతి విశేష్యాదిత్వేన పద్యోపక్రమః ప్రామాదిక ఇ త్యవధేయ మ్మని (వ్యా.సం.స. 1110) చెప్పఁగా వఝులవా రది సరి కా దనిరి.

'సంస్కృతమున నర్ధర్చాంతమునందును శ్లోకాంతమునందును సమాన పదమును, సమాసమును దెగిపోవలయును గాని తెలుఁగున నట్టినియమము లేదు. పొందు నృపాలుపాలురా–జన్యవరుండు – – లోకసా– మాన్యవిధివిధిం దగంగ. భద్రాయితమూర్తి – విష్ణురూ–పాయ – – వైదిక–ధ్యాయిత మనోహరద్యోతక – – ప్రసారా – తిరస (వ్యా.సం.స.1110) అని యుదాహృతులు చూపిరి. పద్యమధ్య మనిన సమాస మొకపాదమునుండి యిం కొకపాదములోనికిఁ బ్రవేశించుట ప్రసిద్ధమే. కానీ వఝలవారు చూపినలక్ష్యములం దొక్కదానఁ గూడఁ బద్యాంతమునందు సమాసము మధ్యలో నాఁగి, తరువాతిపద్యములోఁ బ్రవేశించినది గానరాదు. సమాస మేకపద మయియుండఁగాఁ బద్యాంతమునందుఁ బదమే ముగియక తరువాతిపద్యములోఁ బ్రవేశించుట యుచిత మనరాకున్నది. అయినను నిం కొకప్రయోగము గలదా యిట్టిది? అది యట్లే యైన రామునిచేత అనుపదము సైతము 'రాముని' అనుదానితోఁ బద్యము ముగిసి, చేత అనువిభక్తితోఁ దరువాతిపద్య మేల ప్రారంభము కారాదు. అనురీతిగా ననుమానము గల్గుట కవకాశము గలదు.

రా జన్యవరుండు – భ ద్రాయిత యనుచోట్లనుబట్టి పద్యాంతమునందు సయితము సమాసము ముగియ నక్కఱ లే దని ప్రతిపాదించుచో నవియే యాధారము చేసికొని రామునిచేత మున్నగునవి సయితము ముగియ నక్కఱ లే దని పైరీతిగాఁ జెప్పవలసియేయుండును గదా.

మాలికలయందు నాలుగుపాదములతోఁ బద్యము సమాప్త మగుట జరుగదు. కావున నాల్గవపాదాంతమునందలిపదము ముగియక తరువాతిపాదములోనికిఁ బ్రవేశింపవచ్చును. కానీ యితరస్థలములం దెట్లు?

కావున నహోబలుఁడు పైభాగవతప్రయోగస్థలమున సమాసమునందలి విశేషణముతోఁ బద్యము ముగిసి విశేష్యముతో నిం కొకపద్యము నారంభించుట ప్రమాద మని తెలుపుట యుచితమే.

## తదాద్యధ్యాహారము

**11. కొన్నియెడలఁ దదాదులు విశేషణంబు లధ్యాహార్యంబు లగు.**

అధ్యాహార మన నేమో వ్యాకర్త స్పష్టపఱుపలేదు. కాని యధ్యాహార్యములను

మాత్రము పేర్కొనుచున్నాఁడు. అధ్యాహార మనుదానియర్థము సంస్కృతము నాశ్రయించి యెఱుంగఁదగు నని యభిప్రాయము గావచ్చును. (వాక్యమును గూర్చి చెప్పెను గావున నిట గ్రహించి, యధ్యాహార మనుదానిని గూర్చి చెప్పలేదు కావున దానిని సంస్కృతమునుండి గ్రహింపవలెను.)

అధ్యాహారము. ఆకాంక్షాసమాపకపదానుసంధానమ్. (శబ్దక) (ఘం.336) అధ్యాహారము లేనిపదముల కొన్నిటిని తెచ్చుకొనుట (శ.ర.) ఆకాంక్షిత మైన పదములను దెచ్చుకొనుట (సూ.ని.)

వాక్యార్థసిద్ధికి నవసర మైనపద మావాక్యమునఁ బ్రయుక్తము గానియెడల నన్వయమునకయి యట్టిపదములను దెచ్చుకొనుట యధ్యాహార మగుచున్నది. అ ట్లధ్యాహారము చేసికొనవలసినపదము లధ్యాహార్యము లగును. ఇట్టి యధ్యాహార పద్ధతిని వి.వి. 'అధ్యాహారస్య సంయోగ స్త్వత్ర నైవ సుఖావహః' అని తెలుఁగున నంగీకరింపలేదు. కాని యది తెలుఁగునను నంగీకరింపక తప్ప దనియుఁ బెక్కుచోట్ల నధ్యాహారపద్ధతి గల దనియు స్పష్టము చేయుటకుఁ గావచ్చును, సూత్రకర్త యిది మొదలు నాలుగుసూత్రములలో నధ్యాహార్యములను వివరించెను.

కొన్నియెడల వాక్యమునందు విశేషణము లగుతదాదిశబ్దము లధ్యాహార్యము లగు నని సూత్రమునర్థము.

'కలకంఠకంఠి కన్నీ రొలికిన సిరి యింట నుండ నొల్లదు' ఇట నింట నుండ నొల్లదు అనఁగా నేయింట? అని యాకాంక్ష యేర్పడుచున్నది. ఏయింట కలకంఠకంఠికన్నీ రొలికినదో ఆయింటను మాత్రమే సిరి యుంట కొల్లదు. కావున ఆయింటన్ అనురీతిగా నర్థము చేయవలసియుండును. కానీ వాక్యమున ఇంటన్ అనునదియే ప్రయుక్త మైయున్నది. కానీ తదర్థక మగువిశేషణము ప్రయుక్తము గాలేదు. ఆకాంక్షాపరిపూర్తికయి 'ఆ' యనువిశేషణము నిటఁ దెచ్చుకొనవలసి యున్నది. ఇ ట్లధ్యాహారము చేయవలసివచ్చుటచే నాశబ్ద మధ్యాహార్య మైనది.

ఇట్లే 'పురుషుండు రెండు దెఱఁగులచేత' అనుచో చెప్పఁబోయెడు రెండు తెఱఁ గుల ననుసరించి యీరెండుతెఱఁగు లని యర్థము. అనఁగా నిట నేతదర్థక మగు 'ఈ' శబ్ద మధాహార్య మైనది. ఈశబ్దము నధ్యాహారము చేసికొనవలె నన్నమాట.

పై రెండుప్రయోగములందు వరుసగా ఆ, ఈ యనువిశేషణము లధ్యాహార్యము

లని సూత్రకర్తయభిప్రాయము. అధ్యాహార్యము లనఁగాఁ దప్పక తెచ్చుకొని యన్వయింపఁజేయవలసి వనునభిప్రాయము స్పష్టము. కానీ పైస్థలములందు ఆ, ఈ శబ్దములు లేకున్నను నిబ్బంది కానరాదు. వానిం దెచ్చుకొన్న స్పష్టత యధిక మగుమాట వాస్తవమే. కాని తెచ్చుకొన్నఁ దప్ప వాక్యార్థము సమగ్రము కాకుండుట యనుబాధ లేదు.

## సంబంధిపదాధ్యాహారము

**12. కొన్నియెడల సంబంధమునం బూర్వవాక్యంబునందలిపదం బధ్యాహార్యం బగు.**

సంబంధమునందుఁ బూర్వప్రయుక్త మైనపదమే వాక్యమునం దితరస్థలమునం దధ్యాహృత మగుట కొన్నియెడలఁ గల దని యర్థము.

'గొంతిసంకటపాటు కోడలిబన్నంబు' అనుచో కోడ లనఁగా నెవరికోడలు అన్నది యాకాంక్ష. దానిపరిసమాప్తికై పూర్వమునందుఁ బ్రయుక్త మయిన గొంతియొక్క (గొంతియొక్క సంకటపాటు)అనుపద మిట నధ్యాహారము చేసికొనవలెను. 'గొంతి(యొక్క)కోడలిబన్నంబు' అని యర్థము. ఇట్లే 'పంక్తిముఖుఁడును నాతనితమ్ముని'. తనయుని ననుచో 'ఆతనితనయుని' ననియు, 'దానవేశ్వరునకు దమ్ములకు' ననుచో 'దానవేశ్వరునియొక్క తమ్ములకు' ననియు షష్ఠ్యంత మగుపద మధ్యాహార్యము.

ఇటఁ దత్త్వ. 'పూర్వవాక్య మనఁగాఁ బూర్వమున నున్నవే యొకవాక్య మని యర్థము చేయరాదు. – – మూఁడుదాహరణములందును వాక్యములు వేఱు కావు. అందుచేఁ బూర్వవాక్యమునందలి అనుమాట లాక్షణిక మయి పూర్వమున నున్న అని మాత్రము అర్థమును బోధించు నని తెలిపికొనవలయును. (394) (సుగమ. 251) సర్వ. ఈయభిప్రాయముతో నేకీభవించి పూర్వప్రయుక్తం బగు పదంబు – అని యుండ నగు నని (579) పేర్కొన్నది. పూర్వమున నున్నపదము లేదా పూర్వప్రయుక్త మగుపద మనుచోఁ గొంతయిబ్బంది గలదు. 'పంక్తిముఖుని నాతనితమ్మునిఁ గుంభకర్ణునిం దనయుని మేఘనాథుని' ననుచోఁ బూర్వప్రయుక్త మైయున్నది కుంభకర్ణశబ్దము గావున కుంభకర్ణునితనయుని అని యర్థము చెప్పుట కవకాశము గలదు. 'సంబంధంబును' అనుటచే సంబంధిపదమే యధ్యాహృత

మగును గాని యితరము గా దని తలఁచుచో సంబంధిపద మధ్యాహార్య మగుటను స్పష్టముగాఁ జెప్పుట యుక్తము. (ఘం. 244)

దానవేశ్వరునకుఁ దమ్ములకును. దానవేశ్వరునకు ననునదే యధ్యాహార్యము గాదు. ఇంకను విభక్త్యంతము యొక్కాంతముగాఁ బరిణమించి దానవేశ్వరునియొక్క తమ్ములకు ననురీతిగా నన్వయింపవలెను. (ఘం. 244) అట్టియెడలఁ 'బూర్వ ప్రయుక్త మగు' అని మాత్రమే చెప్పుటకంటె సంబంధిపద మనియుఁ జెప్పుటవలన నయ్యది యొక్కాంత మై యధ్యాహృత మగుట కవకాశము స్పష్టము చేసిన ట్లగును.

ఇట ఘం. 'ఈసూత్రమున పూర్వవాక్యమునందలి యనుచో, వాక్యశబ్దము వాక్యసమన్వయమునకుఁ బ్రయోజకము లగుపదములవిషయమున వాడఁబడినది. వాక్యసమన్వయమునకుఁ బ్రయోజకము లగుపదములను వాక్యము లనుట యొక మర్యాద. (కావ్యప్ర) వాక్యవైశిష్ట్యము (333). అని సమర్థించినది. అది కొంతవఱ కుచిత మగుమార్గమే. కానీ వాక్యస్వరూపము రెండు సూత్రములచే వివరించిన ప్రౌఢవ్యాకర్త వాక్యమున కిట్టివిశేషార్థమును గూర్చి ప్రస్తావింపకపోవుట యొకలోప మనక తీఱదు. వాక్యశబ్దమును గూర్చి యస లేమియుఁ బేర్కొనకున్న సంస్కృతానుసారముగా నాయయియర్థములు గ్రహింప నవకాశము గలదు. అయినను నిట్టిక్లిష్టమార్గముకంటె స్పష్టముగాఁ జెప్పుట యుచితము గదా.

చూడం జూడ సంబంధిపద మధ్యాహార్య మనుటకంటెఁ గూడఁ బూర్వవాక్య మనురీతిప్రస్తావనయే లేకుండఁ దదర్థకం బధ్యాహార్య మనుటయే యుక్త మేమో.

దానవేశ్వరునకుఁ దమ్ములకు, – ఆతనితమ్ములకు. ఆతనితమ్ముని ...తనయుని– ఆతనితనయుని. గొంతిసంకటపాటు కోడలిబన్నంబు – ఆమెకోడలిబన్నంబు అని షష్ఠ్యంత మగుతచ్ఛబ్దము నధ్యాహారము చేసినను నర్థము సముచితముగా నన్వయించును. బాధకము లగునంశములు గల వేమో పరిశోధింపవలెను.

## కర్త్రాద్యధ్యాహారము

**14. కొన్నియెడలఁ గర్తృకర్మక్రియ లధ్యాహార్యంబు లగు.**

కొన్నియెడల వాక్యములందుఁ గర్తయును, గర్మయును, క్రియయు నధ్యాహార్యము లగు నని యర్థము.

నన్నుఁ జూచి నగరె. అనువాక్యమునఁ గర్తృపదము ప్రయుక్తము గామి నధ్యాహారము చేసికొనవలసియున్నది. జనులు అనుకర్తృపద మిట నధ్యాహార్య మని సూత్రకర్త స్పష్టముచేసెను.

'దనదహనం బుదగ్రతరుదాహము సేయుచు నున్నఁ జూచి' అనుచో దాహము చేయుటను (జూచి) అనుకర్మ మిట నధ్యాహార్య మని సూత్రకర్త చెప్పుచున్నాఁడు.

ఇటఁ దత్త్వ. 'ఉదగ్రతను దాహము చేయుచున్నఁ జూచి' అను (కు.పం) పాఠమును స్వీకరించి యిట్లు వివరించినది. ఇట దాహముచేయుట యను క్రియలోనికి వనము అధ్యాహార్యము. దవదహనము వనమును ఉదగ్రతతో దాహము చేయుచు నుండఁగాఁ జూచి – యని యన్వయము. ఉదగ్రతరుదాహము అనుపాఠము ప్రౌఢవ్యాకర్తృసమ్మతము గాదు. అ ట్లయినచో దాహమునకుఁ దరువులు కర్మ యగును. కావున నధ్యాహార మనావశ్యక మగుటచే నుదాహరణమే కాకపోవును (397). దీనిని ఘం. తిరస్కరించినది (333).

ఉదగ్రతరుదాహము అనుపాఠము ప్రౌఢవ్యాకర్తృసమ్మతము గా దనుటకు నాధారము లేదు. తత్త్వ. దాహమునకుఁ గర్మ నూహించుటచే వనము నధ్యాహారము చేయవలె నని తలఁచినది. సూత్రకర్త యిట నుదాహరించి యధ్యాహారము గల దనెను గావున దానిని అనుసరించియే తత్సమ్మతపాఠమును నిర్ణయింపఁదలఁచినపుడు సూత్రకర్త యేది యధ్యాహార్య మని స్పష్టము చేసెనో దానినే స్వీకరించి పాఠమును నిర్ణయింపఁదగును. సూత్రకర్త 'దాహము చేయుటను' అనునది (కర్మ) యధ్యాహార్య మని చెప్పుచుండఁగా వన మధ్యాహార్య మనుట సూత్రకృన్మతానుగుణ మగుట యెట్లు? ఇంకను దత్త్వ.వలె వనము లేదా తరువు అనుకర్మ యధ్యాహార్య మని వివరింపకుండుటచే దాహము చేయుట యనుచోఁ గర్మ నధ్యాహారము చేయ నవసరము లే దనియే ప్రౌఢవ్యాకర్త తలంచె నన్నమాట. అనఁగా ఉదగ్రతరుదాహము అనుపాఠమే చూపె నన్నమాట. కాఁగా వనము అధ్యాహార్య మని చెప్పకుండుటచేతనే ఉద్రగతరుదాహము అనురీతి సుబోధిన్యాదివ్యాఖ్యలు చూపినపాఠమే ప్రౌఢవ్యాకర్తృసమ్మత మని నిర్ణయింపవలసియున్నది. సూత్రకర్త యధ్యాహారము చేసినతీరే పొరపా టని నిర్ణయించినపు డేదో యొక యధ్యాహారము తప్ప దని సూత్రకర్తమతముగా నెంచ నేల? సూత్రకర్త యేది యధ్యాహార్య మనెనో

యది యనవసరము. కావున నీపద్య మిట లక్ష్యము గానేర దని నిర్ణయించుటయే యుక్త మగును గదా.

'చూచి అనుక్రియలోనికె 'దాహము చేయుటను' అనుకర్మ అధ్యాహార్య మన వలయు' (తత్త్వ. 398) నని సూత్రకర్తయభిప్రాయమును దత్త్వ. గుర్తించినది. కానీ యి ట్లధ్యాహార్యము చేయ ననవసర మని తత్త్వ. నిరూపించినతీ రెంతయు నుచితము.

దాహముచేయుచు నున్నఁ జూచి – దాహము చేయుచు నుండఁగాఁ జూచి యని (397) తత్త్వ. చూపినసమన్వయము ననుసరించి యిట 'దాహము చేయుటను' అనుకర్మను నధ్యాహారము చేయవలసినయక్కఱ లేదు.

కానీ తత్త్వ. ఆపిదప 'దాహము చేయుటను' అనునది గూడ నధ్యాహార్యముగాఁ దలంచుట సరిగా లేదు.

అంతకు ముందు 'దాహముచేయుటను' అనునది యధ్యాహార్య మనుచో దాని యంతరమునన్ అనునది యన్వయింప దనియు నాకారణముచే దవదహన మనునది యధ్యాహార్య మనియు వెంపరాలవారియభిప్రాయమును విమర్శించినతీరు సముచితముగనే యున్నది.

ఉదగ్రతరుదాహము సేయుచు నున్నఁ జూచి మానవపతి దానియంతరమునన్ వినియెన్ (అర. 2. 124) అని యిప్పద్యమున దాహము చేయుటను అనునది యధ్యాహార్య మన్నచో 'దానియంతరమునన్' అనుదానికి దాహముచేయుట యనుదానియంతరమున నని యర్థము చేయవలసివచ్చు ననియు, నది సముచితముగా లే దనియు వెంపరాలవారియభిప్రాయము. దీనిం గూర్చి తత్త్వ. అట్లే యర్థము చేయ నక్కఱ లే దనియు, 'తచ్ఛబ్దము పూర్వవాక్యమున వాచ్యముగా నున్నదావాగ్నిని గ్రహించుట మాని, యావాక్యముననే యధ్యాహార్య మగుదాహము చేయుటను గ్రహించుట యుచితము గాదు గదా (398) యన్నది. ఇట్టి 'బుద్ధిస్థమును పరామర్శించుతచ్ఛబ్దము దావాగ్నినే సంగ్రహించుచున్న దన్నను దప్పు లేదు. కాని యయ్యది వాచ్యముగా నున్నది గావున నదియే గ్రహింపఁబడవలె నను నియమము సముచితమా?

అయినను దవదహనము తరుదాహము చేయుచు నున్న – దవహనమును

జూచి అనురీతిగా దవదహనము నధ్యాహారము చేయవలసినయవసర మేమియు లేదు.

ఇట 'అవిరళవిస్ఫులింగనివహంబుల నభ్రపథంబు నందుచున్ ఉదగ్రతరు దాహము సేయుచు నున్నన్ (చేయుచుండఁగా) దవవహనంబు (జడంబు ద్వితీయకు బ్రథమ) చూచి యన్వయించుటకును నెట్టియవరోధము లేదు. అట్లు గాక దవదహనంబు అభ్రపథంబు నంటుచున్ దాహము చేయుచున్ ఉన్నన్ ఉండఁగా చూచి అని యన్వయించినపక్షమునను 'దాహము చేయుటను' అనునది యధ్యాహారము చేయ నక్కఱ లేదు. పైఁగా నిటఁ జూచునది దావాగ్ని ననుటయే యుక్తము గాని దాహము చేయుటను జూచి యనుటయు సముచితముగాఁ గానరాదు. ఏల యన 'దవదహనము అభ్రపథంబు నంటుచున్ దాహము సేయుచున్ ఉన్నన్' అనఁగా అభ్రపథము నంటుటయుఁ జూడఁబడినదే కదా. అభ్రపథము నంటుచు దాహము చేయుచుండుటను జూచె ననుటకంటె అభ్రపథ మంటుటను, దాహము చేయుటను జూచె ననుట యుక్తము. అట్టియెడల న ట్లున్నదావాగ్నిని జూచె ననుట మిగుల యుక్తము. అందుకే 'దవదదహనంబును' అనుకర్మ యధ్యాహార్య మనునభిప్రాయము నేర్పడినది. కాని య ట్లధ్యాహార్యము చేయుట స్పష్టత కనవచ్చును. లేకున్నను నిట నిబ్బంది లేదు.

స్పష్టత కైనను 'దాహము చేయుటను' అనుకర్మకంటె దవదహనంబు అనుపూర్వోక్తశబ్దమే కర్మగా నధ్యాహృత మవు ననుట యుక్తము. వాఁడు వచ్చుచుండఁ గాఁ జూచితిని అనురీతిస్థలములలోను వానిని జూచితి ననియే కదా యర్థము. వచ్చుట యనువ్యాపారమును దర్శించుటయే దాహము చేయుటవలె యుద్దిష్ట మైన నధ్యాహార్యము చేయవలసినపనియే లేదు.

ఇంకఁ బిదపఁ గ్రియ యధ్యాహార మగుస్థలమును సూత్రకర్త యిట్లు నిరూపించెను. అక్కడ నెవఁ డున్నాఁడు? రాముఁడు. ఉన్నాఁడు అనుక్రియ యధ్యాహార్యము.

సూత్రమునఁ గర్తృకర్మక్రియ లన నొక్కొకటే యధ్యాహృత మవు నని తలంప నక్కఱ లే దనవచ్చును. వ్యవహారము నాశ్రయించినచో నివి రెండు, మూఁడును నధ్యాహారము గావచ్చును.

రావణు నెవరు చంపిరి? రాముఁడు. ఇచట రావణుని, చంపెను అని కర్మయును, గ్రియయును నధ్యాహార్యము లనవలెను.

నీవు పుస్తకమును జదివితివా? ఆఁ. ఇచట 'నేను పుస్తకమును జదివితిని' అని కర్తృకర్మక్రియలు మూఁడును నధ్యాహార్యములే. కానీ యిట్టివి కావ్యవ్యవహారమునఁ గల వేమో వెదుకవలెను.

## న్యూనవచనాధ్యాహారము

**13. న్యూనవచోవాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు.**

న్యూనవచనములవాక్యమునం దాన్యూనవచనము లధ్యాహార్యము లగు నని సూత్రమునర్థము.

న్యూనవచనము లన నేమి? తత్త్వ. 'ఆవశ్యకము లగుపదములు ప్రయోగింపఁ బడక తక్కువగా నున్నవాక్యమునందు న్యూనము లగుపదములు గలవాక్యమునం దని యర్థము (396) అన్నది. కు.పం.159 ఘం.245 సుగమ. 262 వ్యాఖ్యలు నీయభిప్రాయమునే పేర్కొన్నవి.

కానీ యిది సముచితముగాఁ గానరాదు. అస లధ్యాహారము చేయవలసిన స్థితి యెప్పుడు గల్గును? ఆకాంక్షాసమాప్తికిఁ దగినపదము వాక్యమునందుఁ బ్రయుక్తము కానపుడు గదా. ఆపదము వాక్యమునందుఁ బ్రయుక్తమే యైయున్నెడల నింక నధ్యాహారము చేయవలసినయవసర మేమి? వ్యాకర్తయే శ.ర.లో అధ్యాహార మనఁగా 'లేనిపదములను గొన్నింటిని దెచ్చుకొనుట' యని పేర్కొనియున్నాఁడు. కాఁగా నధ్యాహార్యము లని చెప్పుటచేతనే యట్టిపదములు వాక్యమునందుఁ బ్రయుక్తములు గాక న్యూనము లగుట సిద్ధించుచున్నది. అట్టియెడల మఱల న్యూనవచోవాక్యము లన నేల?

ఇది 11 సూత్రమున జెప్పిన తదాదివిశేషణములును, 12సూత్రముచోటి సంబంధిపదములును, 14 సూత్రమునందలి కర్తృకర్మక్రియలును, వాక్యమునందుఁ బ్రయుక్తములు గాకుండుటచేతనే యధ్యాహార్యములుగాఁ జెప్పఁబడినవి. కాఁగా వాక్యమునందుఁ బ్రయుక్తము గామి, నవియును న్యూనవచోవాక్యము లగును. కావున నాసూత్రములయర్థ మెల్లఁ బ్రస్తుతసూత్రముచేతనే సిద్ధ మగుచుండుటచే

11-12-14 సూత్రములను దొలఁగించి యచ్చోటిలక్ష్యముల నెల్ల నీసూత్ర స్థలముననే చూపుట యుచితము.

ఘం. 'న్యూనవచోవాక్యము- తక్కువ యైనవచనములు గలవాక్యము. అనఁగా అవశ్యము ప్రయోగింపవలసిన ఐన, ఏని, ఏ, ఓ మున్నగుశబ్దము లేవాక్యమున న్యూనము లగునో, తక్కువపడునో, యావాక్యము న్యూనవచోవాక్య మనఁబడును. (245) అని పేర్కొన్నది.

తక్కువ యైనవచనములు ఐన, ఏని మున్నగునవే కావలె ననునియ మేమి? కర్త్రాదులును వాక్యమునఁ బ్రయోగింపకుండుట యనఁగా న్యూనము లగుట కలదు గదా. అట్టియపుడు కర్త్రాదులు లేనివాక్యములు మాత్ర మేల న్యూనవచోవాక్యములు గావు. ఇంక ఐన మొద లగునవి యవశ్యము ప్రయోగింపవలసిన వన్నది ఘం. అనఁగా ఐన ప్రభృతు లవశ్యము ప్రయోగింపవలసియుఁ, బ్రయోగింపమిఁ దద్వాక్యములు న్యూనవచోవాక్యము లనియుఁ జెప్పవలెను. కాఁగా నింతకు ముందు సూత్రములం దధ్యాహారము చేసినతదాదు లవశ్యము ప్రయోగింపవలసినవి కావా? అవశ్యము ప్రయోగింప నక్కఱ లే దనఁగా నవి లేకున్నను నెట్టిలోపమును లే దన వలెను. అట్టియెడల వాని నధ్యాహార్యములుగాఁ జెప్పుట మాత్ర మేల? కాఁగా నీసమన్వయముచొప్పున మిగిలినసూత్రము లిట్టివి మూఁడు కేవలము వ్యర్థము లనియే నిర్ణయింపవలసివచ్చును.

సుబో. ఐన, ఏని, ఏ, ఓ మున్నగునవి న్యూనవచనము లని చెప్పఁబడు (283) నన్నది. అనఁగా ఐన మొద లగువానికి న్యూనవచనములు అని పేరు అని తాత్పర్యము. ఈయభిప్రాయమును విమర్శించుటకే కాఁబోలును దత్త్వ. 'ఐనన్ ఏని మున్నగువానికి న్యూనవచనంబులు అన్నది సంజ్ఞ కా దని తెలియవలయు' (396) నన్నది. ఇది సంజ్ఞ కానపుడు మిగిలిన మూఁడు సూత్రములు వ్యర్థము లేల కావో నిరూపింపవలసియున్నది. అట్లు చేయమి సంజ్ఞ కా దనునభిప్రాయము నంగీకరించు టెట్లు?

సుబో. అభిప్రాయమునే సర్వ. స్వీకరించి 'ఐన, ఏని, ఏ, ఓ మున్నగునవి న్యూనవచనములు. వీనియర్థముతో కలిసియున్నవాక్యము న్యూనవచోవాక్యము. ఇట్టిన్యూనవచోవాక్యమునందు న్యూనవచనము లైన యైనప్రభృతులు అధ్యాహార్యము లగు నని సూత్రార్థ' (580) మన్నది.

సూత్రకర్తయే న్యూనవచనంబులు ఐన, ఏని, ఏ, ఓ మొ. అని వివరించెను. వాక్యమునందుఁ బ్రయోగింపబడకపోవుటవలన న్యూనము లైనవి యనునర్థమునే సూత్రకర్త యూహించునెడల నిట్లు వివరణము చేయుట యె ట్లొప్పును? మొదటిసారిగా నధ్యాహార్యములను చెప్పిన 11 సూత్రమునొద్దనే న్యూనవచన స్థలములం దధ్యాహార్య మగుట వివరింపవలసియుండును. పైఁగా న్యూనవచనము లనఁగాఁ దగ్గినమాట లనియే యర్థ మవుచో 'ఐన' ఇత్యాదులనే యేల చూపవలె? ఇంతకు ముందు చెప్పిన తదాదులు పైని జెప్పుచున్న కర్త్రాదులును వాక్యమునందు బ్రయోగింపఁబడమి న్యూనవచనములే కదా. కాఁగా వ్యాకర్త యిటఁ జూపిన యీవివరణము ననుసరించియే ఐన మున్నగువానికి న్యూనవచనము లనుపేరును గల్పించె నని చెప్పుట సముచిత మైయుండును.

వీనికి న్యూనవచనము లనుసంజ్ఞను జేయుటయు సముచితమే యని తోఁచు చున్నది. ఇ వన్నియు నర్థవంతములే యైనను నే దే నొకశబ్దముపై నుండియే కాన్పించుచున్నవి. కాని కేవలము స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడుట లేదు. ఐనన్ అనునది సయిత మేని యనునర్థమున స్వతంత్రముగాఁ బ్రయుక్త మగునది కాదు. కావున మిగిలినయవ్యయాదిపదములకు భిన్నములుగా నన్యాశ్రయత్వమున మాత్రమే ప్రయోగము గల్గియుండుట, స్వతంత్రముగాఁ బ్రయుక్తము గాకుండుట యనున్యూనత ననుసరించి న్యూనవచనము లనుసంజ్ఞ దగియే యున్నది. సంజ్ఞను జేయునపు డిట్లుగా నర్థవంత మగునట్లు చేయవలసినయవసరము లేదు. కాని యీసంజ్ఞ సార్థకముగానే కూర్పఁబడుట మాత్రమే గమనింపఁదగును.

ఇట్లు న్యూనవచనము లనుదానిని ఐనప్రభృతులకు సంజ్ఞగా గ్రహించినయెడల మిగిలిన (11-12-14) సూత్రములును సార్థక మవుట సిద్ధించును. న్యూనవచో వివరణము సముచితముగాఁ గుదురుపడును.

కాఁగా ఐనప్రభృతులు న్యూనవచనములు. అవి యుండువాక్యము న్యూనవచో వాక్యము. తద్వచనంబు లనఁగా న్యూనవచనంబు లగు ఐన ప్రభృతులు.

కాఁగా ఐన ప్రభృతి న్యూనవచనములు వాక్యమునందు బ్రయుక్తము గాక అధ్యాహార మగుట గల దని సూత్రతాత్పర్యము.

ఎత్తెఱఁగున ధర్మక్రియఁ జిత్తమునఁ జేర్పవలయు. ఎత్తెఱఁగున నైన నని ఇట

ఐన అనున్యూనవచన మధ్యాహార్యము. ఇ ట్లితరములును సూత్రకృద్వివరణము ననుసరించి స్పష్టములు.

శబ్ద. 116 సూత్రమున నుశబ్దము సముచ్చయార్థవిశేష పాదపూరణములం దగు నని యీవ్యాకర్త పేర్కొనెను. నన్నును, నిన్నును, తనచేతను ఇత్యాదులలోని నువర్ణ మ ట్లర్థవిశేషము నిచ్చుటకు నవకాశము గల్గునట్లుగా ద్రుతప్రకృతికములను గూడ సూత్రకర్త యటఁ జూపెను. ఎవ్వఁడును లేఁడు, జమదగ్నిసూనుఁడును బోలఁడు (శబ్ద.116) అనుస్థలములందును శబ్దము 'ఏని, ఐన' అనునర్థముల నిచ్చుచున్నది. ఆ 'ను' వర్ణము ద్రుతమే. కావున ద్రుతకార్యము లగుటలో విశేషము లేదు. 'ఎత్తెఱఁగునఁ జిత్తము' అనుప్రస్తుతలక్ష్యమునను ఖండబిందుస్థానిక మగునువర్ణము నన్నును, తనచేతను (శబ్ద.116) అనుచోట్లవలె విశేషార్థకముగా భావించినచో 'ఎవ్వఁడును' అనుచోటవలె 'ఎత్తఱఁగున నైన' ననురీతిగా నుశబ్దమే 'ఐన' అనునర్థము నీయఁగల్గియుండును. అట్టియెడల నిట 'ఐన' అధ్యాహార్య మని తలంపవలసినయవసరము లేదు.

(అయినను నట ద్రుతప్రకృతికములవిషయమునఁ గొంత వివాద మేర్పడి యున్నది) స్పష్టతకుఁగా దీనిని గూడ నిట నుదాహరించుట యుక్తమే కావచ్చును. 'కర్మములు మేలు నిచ్చును'. కర్మములే యనురీతిస్థలములం దెట్లును నీవిధానము సార్థక మగుచున్నది. అయినను స్పష్టతకయి 'ఎమ్మెయిన్ (ఐన) బట్టి వధింతు' మొద లగునవి యిట నుదాహరించుట దోషము గా దనఁదగును.

ఇట 'నన్నం బొండొక (యేని) లేదు' అనులక్ష్యమును గూర్చి తత్త్వ. 'ఇట 'అన్నం బొండిక' అనుపాఠము సుబోధినిలోఁ జూపఁబడెను. ఆపాఠమే యుక్తముగాఁ దోఁచుచున్నది. 'అన్నం బొండొక' అనుపాఠమున 'ఒక' అనునది ప్రత్యయ రహితముగాఁ గానవచ్చుచున్నది. ప్రత్యయరహితముగా నుండి కేవలము 'ఒక' అనుప్రాతిపదికముగాఁ బ్రయోగింపఁబడుట యుచితము గాదు గదా. కావున నొండొక అనుపాఠ మపపాఠము. అసాధువు (తత్త్వ.396) అని నిశ్చయించినది.

కానీ ఘం.పై తత్త్వ.అభిప్రాయమును విమర్శించుచు 'ఒండొక యనునది కొండొకవంటిశబ్దము. ఒండొక లేదు – ఇంచుక యైన లే దని యర్థము (333) అన్నది. కొండొకవలె నొండొకశబ్దమును సూ.ని. చూపినది. కానీ దాని కుదాహరణముగా నీప్రయోగమే చూపినది. ఒండొకయుపాయ మనునది

సమాసముగనే సమన్వయింపఁదగియున్నది. ఇంచుక యనియే యర్థము చేయ నవసరమును లేదు. (సూ.ని.) ఈవ్యాకర్త శ.ర.లో ఒండొక శబ్దము చూపియు నుండలేదు. ఒక అని భావించినను ఒక యనునది వృత్తియందు విభక్తి లోపించినదిగా మాత్రమే చెప్పియుండెను. (శ.ర.)

తత్త్వ. చెప్పినయర్థము ప్రకరణవిరుద్ధము. ఘం. అభిప్రాయ ముచితమే (333) తత్త్వ. 'అన్నం బొండిక లే దనఁగా అన్న మొక్క టేని లే దనియు నితరము లగు వస్త్రభూషణాదులప్రసక్తి యేల' యనియు నర్థము చెప్పినది. కానీ యట బుభుక్షితుఁ డైనవటువు చద్దియన్న మైనఁ దినుటకు సిద్ధపడి తినుచు నింకను దేతె మ్మనుచు నుండెను. అట్టియెడల నన్న మసలు లే దని చెప్పుట ప్రకరణానుగుణము. కాని వస్త్రాదులప్రసక్తి యెంత మాత్రమును లేదు.

కానీ యింతమాత్రమున 'ఒండొక' అనునదే సరి యైనపాఠ మని నిర్ణయింప రాదు. ముద్రితప్రతులం దెల్ల 'ఒండిక' యనుపాఠమే యగపడుచున్నది. పద్యము సంఖ్యలను బూరించిన సుబో. 'ఒండిక' యనుపాఠమును జూపియున్నది.

ఒండిక యనుదానితో నర్థము సముచితముగనే సమన్వయించును. 'ఇఁకన్ చల్దియది యన్నంబు ఒండు లేదు' అని యర్థము. వండిపెట్టుటకై కాలము జరుగు నని తొందరలో వటువు చద్దియన్న మైనఁ బెట్టు మనెను. కావున వేఁడియన్నమున కవకాశము లేదు. చద్దియన్న మైనను నిం కొకటి లేదు. అనఁగా నింతకు ముందే భర్తృపాథేయశేష మల్ప మైయుండఁగా గుండ యూడ్చి యొక్కచద్దియన్న మొసఁ గినది. ఆపిదప మఱలఁ దె మ్మనఁగా 'తొల్తటినాఁటియామినిన్ దన కని వండి డించికొని నాథుఁడు పల్లియ కేఁగునెంజలిన్ దగ భుజింప కున్కి భరితం బయి యట్టుక నట్టుకట్టి యొప్పు నభినవౌదనంబు' నొసఁగినది. అయినను వటు వింకను దె మ్మనె. ఎన్నియో విధముల యన్నము గల దనియుఁ దె మ్మన్న నొక్కటి కాకున్న నిం కొక్కటి దెచ్చు ననియుఁ దలంచు నేమో యని ఇఁకన్ – ఉన్నవి, లేక యింతకు ముందు వడ్డించియుండఁగా, ఒండన్నము=ఇం కొకతీరున మిగిలినయన్నము లేదు. అని సముచితముగానే యిది సమన్వయించుచున్నది. కావున 'ఒండిక' యనునది సాధుపాఠ మనుటలో నిబ్బంది యేమియును లేదు.

అయిన నిట సూత్రకర్త న్యూనవచన మధ్యాహృత మనుటకుఁ జూపెను గదా. అది లక్ష్య మగుట యెట్లు? వే ఱొకచల్దియన్నము లేదు. అనుచో ఏని ప్రభృతు

లధ్యాహారము చేయవలసియవసరము గానరాకున్నది. అన్నము అని కాక ఒక్కటి యనియే యర్థము చేయుచో, ఇంకన్ అన్నం బొం డేని లేదు – అన్న మొక్కటియు లేదు. ఇం కొక్కతీ రైనయన్నమును లే దని యర్థము చేసె నేమో. లేక 'ఇఁక నొం డన్న మైన లేదు. కానీ తె మ్మన్నన్ కజాయంబుల్ దెచ్చెద' ననురీతిగా నన్వయించుకొనెనో. అ ట్లయినఁ బద్యము నంతవఱ కీకుండునా?

ఒండొక యనుశబ్ద మిట్లు లేకుంటయు, నీవ్యాకర్తయే శ.ర.లో ఒండొక శబ్దమును జూపకుండుటయునుబట్టి ఒండొక యనుపాఠము గ్రాహ్యము గా దనవచ్చును. ఒండిక యనుపాఠముచొప్పున నధ్యాహారము తప్పనిసరి కాదు.

ఇంతవఱకు నధ్యాహార్యములను నిరూపించుటకయి ప్రౌఢవ్యాకర్త నాలుగు సూత్రములు చెప్పెను. కానీ కొన్నివ్యాఖ్యలు తలంచినట్లుగా న్యూనవచనంబులు అనువానికి నవసర మైనపదములు ప్రయోగింపఁబడక న్యూనము లగుస్థలము లం దాతగ్గినపదము లధ్యాహార్యము లగు ననురీతిగా నీయర్థమును సూత్రకర్తయే యుద్దేశించి యట్లు సూత్రింపఁదగును. దానివలన మిగిలిన (11-12-14) సూత్రములు చెప్ప నవసర ముండదు. అచ్చోటిలక్ష్యముల నిచ్చోటనే చూపవచ్చును. ఇట్లు వేఱుచేసి చెప్పుటలో స్పష్టతయే ప్రయోజన మనవలెను.

## ఇట్లనియె – అనిన

**10. ఇ ట్లనియె అనిన నని భావ్యర్థకథనప్రారంభ పరిసమాప్తులం గ్రమంబుగ నగు.**

సూత్రార్థమును సూత్రకర్తయే స్పష్టము చేసెను. 'భావ్యర్థకథనప్రారంభమునఁ బూర్వవాక్యాంతమునందు ఇట్లనియె అనియును, ప్రారబ్ధవాక్యపరిసమాప్తియందు అనిన అనియును బదంబులు క్రమంబుగఁ బ్రయుక్తంబు లగు నని యర్థము'. 'భావ్యర్థకథనప్రారంభమున, ప్రారబ్ధవాక్యపరిసమాప్తియందు' ననురీతి సూత్రకర్త సప్తమ్యంతపదవివరణమునుబట్టి సూత్రము సప్తమ్యర్థకద్వితీయతో 'ప్రారంభ పరిసమాప్తులం గ్రమంబుగ నగు' నని యుండుట సమంజస మని స్పష్ట మగుచున్నది. సుబో. సుగమ. వ్యాఖ్యలు 'ప్రారంభపరిసమాప్తులు క్రమంబుగ నగు' నని సూత్రమునఁ బ్రథమాంతములుగాఁ జూపుట సరి కాదు. కు.పం. 'పరిసమాప్తులన్' అని చూపుట గమనింపఁదగును.

భావ్యర్థమున ననఁగా (భవిష్యదర్థము) జరుగఁబోవునది యైనయంశమును గథనము చేయుటకు ముందు తత్పూర్వవాక్యాంతమున 'ఇట్లు అనియె' నని ప్రయుక్త మగును.

'అయ్యింద్రునకుఁ గలి యి ట్లనియె. అవనిలో దమయంతీస్వయంవరంబు విస్తరిల్లుట విని కడువేడ్కతోడ నేను దమయంతిచే వరియింపఁబడుదు నని తదర్థమై యరిగెద నాసఁ జేసి' ఇట దమయంతి స్వయంవరము జరుగఁబోవునది గాఁగాఁ దా నందు కరుగఁబోవుచున్నట్లు కలి పేర్కొనుచున్నాఁడు. దీనికి ముందు 'ఇట్లు అనియె' నని క్రియ భూతార్థమునందుఁ బ్రయోగింపఁబడినది.

'అనిన నందఱు నగి' యనుచో నాకథనము పరిసమాప్తియందు 'అనిన' ననునది ప్రయుక్త మయినది. ఇట్లు భావ్యర్థకథనపరిసమాప్తియందు 'అనిన' ననునది ప్రయుక్త మగుచుండు నని సూత్రమునభిప్రాయము.

భావ్యర్థకథన మనఁగా జరుగఁబోవుదానిం గూర్చి పేర్కొనుట యని యర్థము. ఈనియమమునుగూర్చి తత్త్వ. 'భావ్యర్థమున నని చెప్పఁబడెను గాని భూతార్థ వర్తమానార్థము లైనను ఈవిధి వర్తించుచునే యున్న' (392) దన్నది. సూత్రకర్త చూపినలక్ష్యమునందే 'దమయంతీ స్వయంవరము విని తదర్థమై యరిగెద' ననుచో అరుగుచున్నాను అనురీతిగా వర్తమానార్థము భాసించుచున్నది.

అతనికి మైత్రేయుం డి ట్లనియె. పాండవేయులకడ నుండి వచ్చితి గురూత్తమ నీసుతు నిన్నుఁ జూడఁగన్ (అర. 1–93,94) యుధిష్ఠిరున కి ట్లనియె. వివేకము గలవాఁడు బుద్ధివికలుం డగునే (అర. 1. 19,20) ఇట్లు తద్ధర్మాద్యర్థసందర్భము లందును బ్రారంభమున 'ఇ ట్లనియె' ననుట గలదు.

అందువలననే కాఁబోలును, కు.పం. 'భావి'ని అర్థముతో గాక కథనముతో నన్వయించుకోవలయు' (157) నన్నది. అనఁగాఁ జెప్పఁబోయెడుదానికి ముందు ఇ ట్లనియె నని యుండునే కాని ఆచెప్పఁబోయెడునది భావ్యర్థము (జరుగఁబోవునదే) కా నక్కఱ లే దని కు.పం. అభిప్రాయపడియుండవచ్చును. కానీ సూత్రకర్త సూత్రమునకుఁ దానే వివరణము వ్రాసియుండుటచే కు.పం. సమర్థనము సరి గాదు. అర్థశబ్దమును మఱి దేనితో నన్వయింపవలయునో కు.పం. స్పష్టము చేయలేదు.

తత్త్వ. లక్షణమం దిం కొకలోపము చూపినది. ఇ ట్లనియెన్ అనుటకు బదులు 'ఇట్లు వచియించెను, ఈరీతిం బల్కెను' మున్నగురీతి నుండవచ్చును 'అనిన' అనుదానికి బదులు 'అనఁగన్, అనుడున్' మున్నగుపదాంతరములప్రయోగమును దుష్టము గాదు. (392) (సుగమ. 250) ఈయభిప్రాయము యుక్తమే. 'ఇట్లు' అన్నది సయిత ముండవలె ననునియమము లేదు. 'శోకింపకు మనిన సురపతి కనియెన్. దేవా దీనాననంబు లయి' (అర. 1. 85,86) ఇట 'ననియెన్' అని మాత్రమే కలదు. 'ఇ ట్లనియె' అనియే యుండవలె నని నియమించు టెట్లు?

కావున నీవిధానము సమగ్రము గా దని నిర్ణయింపవచ్చును. అస లీలక్షణ మేల ప్రారంభింపఁబడినదో స్పష్ట మగుట లేదు. భావ్యర్థమును గథనము చేయునపు డయినను ముందుగా 'ఇ ట్లనియె' నని భూతార్థకక్రియ యుండుటలో విశేష మే మేని గలదా?

'అయ్యింద్రునకుఁ గలి యిట్లనియె' ననుచో 'కలి' యనుట యంతకు ముందే పూర్తి యగుట స్పష్టము. కావున 'అనియె' అని భూతార్థకక్రియయే యుండవలెను. 'ఇట్లు అనియె' ననుటలో నావిధానము పిదపఁ జెప్పఁబడుచున్న దనియు అనుట యంతకు మున్నే యైన దనియు వక్తయభిప్రాయము స్పష్టము.

'కలి వరింపుదు నని చెప్పెను' అనఁగూడదా? వరింపుదును అనునది కలివచనమును యథాతథముగా ననుకరించుట. కావునఁ దద్ధర్మార్థమునం దున్నది. అనఁగాఁ గలి తద్ధర్మార్థకముగాఁ జెప్పెను. కావున ననుకరణమునందుఁ గ్రియాపద మట్లే తద్ధర్మార్థక మయియున్నది. 'అని చెప్పెను' అనుచో మాత్రము క్రియాపదము భూతార్థమునం దున్నది. అనఁగాఁ జెప్పుట పూర్తియవుటచేఁ గ్రియాపదము భూతార్థముననే ప్రయుక్త మైనది. 'వరింపుదు నని చెప్పఁగలఁడు' అనురీతిగా నుండక పోవుటకుఁ గారణము చెప్పుట యనువ్యాపార మప్పటికి నయియుండుటయే యని స్పష్టము. కాఁగాఁ బాత్రవచనములు తత్తదదర్థోచితములుగా నుండవలసి యుండఁగాఁ గథకుఁడు చెప్పునది భూతార్థకమే యైయుండును. అంతే కాక 'నే ని ట్లంటిని' అనుచోఁ గూడ 'అనుట' యన్నది యంతకు ముందే యైయుండుటచేఁ గ్రియాపదము భూతార్థమునందె యుండవలెను.

సూరి (బాల. క్రియ. 22) లాడర్థములను వివరించుచు 'వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడు' నని చెప్పెను. వచ్యర్థము లని చెప్పుటచే

సూరిమతముననను పలుకు, చెప్పు ఇత్యాదులు గ్రహింపఁబడుచున్నవి. ఇంక నిట్టియెడల భూతార్థమే యుండవలె ననియు నిట్లు చేయవలసియుండఁగా భూతార్థమున లాట్టు గానఁబడుచున్న దనియు సూరి చెప్పుచున్నాఁడు. అనఁగా 'ఇ ట్లనియెన్' అని యుండవలసినచోట 'ఇ ట్లనున్' అనురీతిగా నుండుట గల దని సూరియభిప్రాయము. 'ఇ ట్లను' ననురీతిగా లాడ్రూపమే ప్రయుక్త మైనను భూతార్థమే. అందులకే 'భూతార్థమున లాట్టు' అని చెప్పెను. లిడంతమే ప్రయోగించుట సామాన్య మయియుండఁగాఁ దదర్థమున లాట్ప్రయోగము విశేషముగా సూరి చెప్పుచుండఁ గాఁ బ్రౌఢవ్యాకర్త 'అనియె' ననుదానినే (భూతార్థమునే) విశేషముగాఁ జెప్పు టెట్లు.

పై సూరివాక్యమునకుఁ గొన్నివ్యాఖ్యలు భిన్నముగా నర్థము చేసినవి. అవి తద్గ్రంథపరామర్శనమున పరిశీలింపఁబడును.

వఝులవారు 'ఈశానునితో మృదురీతి ని ట్లనుం గమలేశా' (ఆను. 5.284) (ఇ ట్లనున్ – ఇట్లు పలికెను) (యతిస్థలము) ఒకానొకచో నన నేల? ఇట్టిరీతినె తఱచుగాఁ బ్రయోగింపఁబడును. అనెన్ అనురూపము ప్రాచీనమహాకవిసమ్మతము కామింజేసి 'అన నతఁడి ట్లనున్' అనురీతినె ప్రయోగింపఁబడుచుండును. (వ్యా.సం.స. 1372) అని పైరీతినే సూరివాక్యమున కర్థము చేసిరి. అనెన్ అనునది ప్రాచీనమహాకవులకు సమ్మతమో కాదో నిరూపించుట యిట నప్రస్తుత మయినను 'అనున్' అనునదే తఱచుగా నుండె ననుట సరి కాదు. 'ఇ ట్లనియెన్' అనునదే తఱచుగా నుండుట గానవచ్చును.

అది యే మైనను నిట 'అనియెన్' అనురీతిగా భూతార్థక్రియయే యుండుట యర్థానుగుణము. అట్ల యుండవలె. కావున దానిని విశేషముగాఁ జెప్ప నక్కఱ లేదు. ఆ అనినమాట లేవో తరువాత చెప్పబడుచుండుటచేత 'ఇట్లు' అనునది ముందు చేర్చి ప్రయోగించుటయు విశేషముగాఁ జెప్పవలసినది కాదు.

అందువలననే చెప్పఁబోయెడు వర్తమానాదులలో నేయర్థమునకు సంబంధించిన దైనను ముందుగా 'అనియెన్' అని భూతార్థకక్రియ యుండును. సూత్రకర్త భావించినట్లు భావ్యర్థకథనప్రారంభమునందే కా దని స్పష్టము.

అట్లే కథనానంతరము 'అనిన' అనునది ప్రయోగింపఁబడు నని చెప్పుటయు విశేషము గానేరదు. ఆయన్నమాట లేవో యంతకు ముందే చెప్పఁబడియుండుటచే

ననఁగా ననునర్థమున 'అనిన' అని ప్రయోగింపవచ్చును గదా.

కావున నీసూత్రము విశేషముగాఁ జెప్పున దేమియుఁ గానరాకున్నది. ఇట్లనియె, అనిన ననునవి తఱచుగాఁ గావ్యములందుఁ గానవచ్చుటంజేసి విశేషము లేకున్నను వివరించె నేమో. సందర్భము ననుసరించి యట్లు ప్రయోగించుట యెట్లును విశేషము గాదు.

మొత్తముపై శబ్దశాస్త్రమునందు వాక్యవిషయనిరూపణమున కొకపరిచ్ఛేదము నారంభించుట విశేషము. చాల వఱకు నపూర్వము.

**ఇది వాక్యపరిచ్ఛేదము**

## త్రిలిఙ్గలక్షణశేషము అను ప్రౌఢవ్యాకరణము

# ఉదాహరణానుక్రమణిక

000000

# త్రిలిఙ్గలక్షణశేషము అను ప్రౌఢవ్యాకరణము

# ప్రయోగానుక్రమణిక

**అచ్చతెలుఁగురామాయణము (కూచిమంచి తిమ్మకవి)**

అయో. 88 ఏఁడీ నాబలుమానికంబులకొటారు శబ్ద. 87

**అధ్యాత్మరామాయణము**

బాల. 142 అమరు లెల్లను జల్లిరి సుమము లెంత శబ్ద. 116

**అనిరుద్ధచరిత్రము**

5. 63, 91. అందచందములు సంధి. 6. సమా. 29

**అశ్వమేధపర్వము (తిక్కన)**

2. 144. వీనఁ బుట్టు జరారుజములు శబ్ద. 62

**ఆదిపర్వము (నన్నయ)**

| | | |
|---|---|---|
| 1. 5 | ఎంతయుం దనరు | శబ్ద. 116 |
| 1. 20 | నానేర్చు విధంబున | క్రియ. 1 |
| 1. 24 | తన కిష్టుఁడున్ | శబ్ద. 78 |
| 1. 24 | నారాయణునట్లు | సమా. 38 |
| 1. 27 | మునినికాయ మెల్ల....అతని పూజించిరి | శబ్ద. 17, శబ్ద. 75 |
| 1. 47 | **విన నేడగుపర్వము** | శబ్ద. 103 |
| 1. 49 | **ఎనిమిది యగుపర్వం బిది** | శబ్ద. 103 |
| 1. 68 | రెన్నాళ్లు | సంధి. 15 |
| 1. 77 | ఎవ్వనియేని | కార. 16 |
| 1. 78 | ముయ్యేడుమాఱుల్ | సమా. 10 |
| 1. 80 | మువ్మడు గగుగణము | సమా. 10 |

